

శ్రీమతే రామానుజాయ నమః

# కృతజ్ఞతాంజలి

ఆదావంతే శ్రుతీనాం ప్రణవవదుదితం ద్రావిడామ్నాయవాచాం
యన్మంత్రం ఛాత్రభావం స్వయమిహ భగవాన్ యస్య రంగేశ ఐచ్ఛత్।
వ్యాఖ్యా లోకార్యసూక్తేః లసతి కవచవద్యస్య సౌమ్యోపయంతా
చిత్తే మే సన్నిధత్తాం స ముని రవిరతం భాష్యకారావతారః ॥

( తత్త్వరత్నావళి - తిరుమలై అనన్దాణ్పిళ్ళై శ్రీనివాసాచార్య స్వామివారు )

**"యతివరపునరవతార భూతులుగా, యతీంద్రప్రవణులుగా, విశదవాక్శిఖామణిగా, పొయ్యిలాద మణవాళమామునిీ"**గా కీర్తింపబడే శ్రీమద్వరవరమునీంద్రుల వైభవం నిస్సమాభ్యధికం, అప్రమేయం. సాక్షాత్తు శ్రీరంగనాథుడే వీరిని తనకు ఆచార్యులుగా వరించి, తనియన్ ఉపాయనంగా సమర్పించారు. తెన్కలై సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యపరంపరలో వీరు చివరివారు. సమకాలీనులైన అందఱిని తమ పాండిత్యప్రకర్షతోనే కాక, సద్గుణవైభవంతో కూడా ఆకర్షించి, వశం చేసికొన్న మహోన్నతులు వీరు. వీరి వైభవాన్ని కీర్తిస్తూ, వీరు జీవించి ఉండగానే వీరు శిష్యులైన ప్రతివాది భయంకరమ్ అణ్ణా, ఎఱుమ్బియప్పా అనే దేవరాజగురువు. కోయిల్ కందాడై అణ్ణన్ పలు స్తుతులను రచించారు. వీరు శ్రీవరవరమునుల మహిమను ఉగ్గడిస్తూ విరచించి, వారిపట్ల తమకు ఉండే భక్తి ప్రపత్తులను వ్యక్తం చేశారు.

ప్రతివాది భయంకరమ్ అణ్ణా కృతమైన శ్రీవరవరముని శతకం ఇతఃపూర్వమే 3 ఏండ్ల క్రితం ఆంధ్రవ్యాఖ్యాన సహితంగా మిత్రమణులు, ఉ.వే.శ్రీమాన్ కె.టి.జి.రామానుజాచార్యస్వామివారు (హైదరాబాద్) అందించిన ఆర్థికసహాయంతో ముద్రింపబడింది. ప్రస్తుతం ఎఱుమ్బియప్పా రచించిన శ్రీవరవరముని శతకఆంధ్ర వ్యాఖ్యతో, **అణ్ణావప్పఙ్గార్** అనే పేరుతో వ్యవహరింపబడే **శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారు** రచించిన సంస్కృతవ్యాఖ్యతో పాటు ముద్రింపబడుతున్నది. ఈ గ్రంథ ప్రకాశనం విద్వద్వరేణ్యులు, భాగవతామృతవర్షి, ఉ.వే.శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్య స్వామివారి శ్రీవేంకటాచార్య వైదిక సంస్థాన్ ద్వారా చేయబడుతున్నది.

ఈశతకానికి ఆంధ్రవివరణం విన్నపించే వాచిక కైంకర్యాన్ని చేసికోవాలనే ఆశ దాసునకు సుమారు 7 సంవత్సరముల క్రితమే కల్గింది. అది ఈ నాటికి ఫలించింది. ఆంధ్రవివరణాన్ని విన్నపించిన తరువాత,

ఒకనాడు శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారితో మాటల సందర్భంలో ఈవ్యాఖ్యాన ముద్రణ ప్రస్తావన వచ్చింది. శ్రీమాన్ స్వామివారు తమ వైదికసంస్థాన్ తరఫున ఈ గ్రంథాన్ని ముద్రిస్తామని, ఈ ఒక్క స్తోత్రమేకాక, శ్రీవరవరమునులకు సంబంధించిన, లభించే స్తోత్రాలను కూడా కలిపి, **"శ్రీవరవరముని స్తుతిసర్వస్వమ్"**గా ముద్రిస్తే బాగుంటుందని ఆదేశించారు. వారి ఈ ఆదేశంమేరకు ప్రస్తుతగ్రంథం రూపొందింది. శ్రీవరవరమునులకాలం నుండి ఈనాటితరం వరకు పలువురు మహనీయులు వారి వైభవాన్ని కీర్తిస్తూ రచించిన పలుస్తోత్రాలు ఈ గ్రంథంలో ముద్రింపబడుతున్నాయి. వీటిలో చాలా స్తోత్రాలకు తెలుగు తాత్పర్యం కూడా ముద్రింపబడుతున్నది. కొన్నిటికి మాత్రం, గ్రంథ విస్తృతిని దృష్టిలో పెట్టుకొని, మూలం మాత్రం ముద్రింపబడుతున్నది. శ్రీవరవరమునులు స్తుతించే పలు ముక్తకశ్లోకాలు, ద్రావిడపాశురాలు, వాழ்ித్తిరునామాలు ఈ గ్రంథంలో కూర్చబడ్డాయి. శ్రీవరవరమునుల స్తుతులు ఇంకా చాలా ఉన్నా, ప్రస్తుతం కొన్ని మాత్రమే ముద్రింపబడుతున్నాయి. శ్రీవరవరమునుల నిర్హేతుకృప వల్ల మిగిలిన ఈ స్తుతులు కూడా త్వరలో ఆంధ్రతాత్పర్యంతో పాటు ముద్రింపబడగలవని ఆశిస్తున్నాను.

నా ప్రార్థనను మన్నించి శ్రీవరవరముని శతకవ్యాఖ్యను, శ్రమ అనుకోకుండా, పూర్తిగా అవలోకించి, మంగళాశాసనాలను అనుగ్రహించిన **మహామహోపాధ్యాయ** ఉ.వే.శ్రీమాన్ శ్రీ న.చ.రఘునాథాచార్య స్వామివారి సన్నిధిలో, **శాస్త్రరత్నాకర, పండితరత్న, శాస్త్రవిద్వన్మణి** ఉ.వే.శ్రీమాన్ డా.ఎస్.వి.రంగరామానుజా చార్యస్వామి నా సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. ఈ సద్గ్రంథాన్ని తమ ఆచార్యులైన **కీర్తిమూర్తులు, ఉ.వే.శ్రీమాన్ సాతులూరు వేంకటాచార్యస్వామివారి** తిరునక్షత్రమహోత్సవ సందర్భంలో ప్రకాశింపజేస్తున్న సహృదయులు **ఉ.వే.శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారి** సన్నిధిలో ధన్యవాదసమర్పణను చేసికొంటున్నాను. ఈ గ్రంథాన్ని సంకలనం చేయడంలో, వివరించడంలో పదే పదే అమూల్యమైన సూచనలను ఇచ్చి అనుగ్రహించిన పితృపాదులు, న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంత భాస్కర, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారికివారి సన్నిధిలో భక్తిపూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. నా అభివృద్ధికి మూలకారణం పితామహపాదులు ఉభయవేదాంత మహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారు. వారి శ్రీచరణాలను ఈ సమయంలో భక్తి పూర్వకంగా స్మరిస్తున్నాను. మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి స్తోత్రాలను ఈ గ్రంథంలో సంకలనం చేసి ముద్రించడానికి ఉదారంగా అనుమతినిచ్చిన వారి పౌత్రులు ఉ.వే. శ్రీమాన్ ప్ర.భ. రాజహంసం స్వామివారికి అనేక కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని డి.టి.పిచేసి సహకరించిన శ్రీమతి **జయలక్ష్మిగారికి,** శ్రీచంద్రశేఖర్గారికి అనేక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. శ్రీవరవరమునీంద్ర భక్తుల సన్నిధిలో ఈ గ్రంథాన్ని సాదరంగా ప్రాభృతంగా సమర్పించుకొంటున్నాను.

గుణగ్రహణపారీణులైన సహృదయ పాఠకులు ఇందులోని గుణాలను గ్రహించి, దోషాలను మన్నిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి.

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

కౌతస్కుతకసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే రమ్యజామాతృమునీంద్రగురవే నమః ॥

( ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ )

శ్రీవరవరమునివరనుతిసర్వస్వ మిదం ప్రపన్నజనభోగ్యమ్ ।
జనయతు పరమానందం నిర్మత్సరవిబుధహృదయేషు ॥

శ్రీవేంకటగురోర్దివ్యజన్మర్క్షోత్సవ చిహ్నికా ।
కల్పతాం తన్మనః ప్రీత్యై తద్పదాబ్జసమర్పితా ॥

శ్రీశేషశింగరాచార్యవర్యాణాం మహతామియమ్ ।
పితామహానాం పదయోః భూయః ప్రహ్వాంజలి కృతా ॥

శ్రీమతాం రఘునాథార్యగురూణాం సవిధేఽర్ప్యతే ।
నతేన శిరసా భూయో ధన్యవాదః సభక్తికమ్ ॥

శ్రీమతాం రంగరామానుజార్యాణాం పదపద్మయోః ।
ప్రయుంజే పితృపాదానాం భక్త్యా ప్రణతిసంతతిః ॥

శ్రీమద్భ్యో రంగరామానుజార్యేభ్యో వినివేద్యతే ।
కృతజ్ఞతా సవినయం యైః ప్రీత్యాఽశాసితోస్మ్యహమ్ ॥

భాగవతామృతవర్షి శ్రీమద్గోపాలకృష్ణమార్యేభ్యః ।
కార్తజ్ఞ్యాంజలి రేభ్యో గ్రంథోఽయం యైః ప్రకాశ్యతాం నీతః ॥

అహోభాగ్య మహోభాగ్యం మమాప్యేతస్య ముద్రణే ।
అన్వయో గ్రంథరాజస్య లబ్ధ ఆచార్యవీక్షణాత్ ॥

భాగవతదాసుడు

ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీమతే నారాయణాయ నమః　　　శ్రీమతే రామానుజాయ నమః

## సత్సంప్రదాయ పరిరక్షణ సభ

16-4-523, శివనగర్, వరంగల్ - 506 002

అధ్యక్షులు :
"మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర"
**ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు**
ఫోన్ : 0870-2435999

కార్యదర్శి :
**శ్రీమాన్ న.చ. పట్టాభిరామాచార్యులు**
ఫోన్ : (0870) 2459172
సెల్ : 9440575881

తేది: 5-12-2014



# శుభాశంసనము

భగవద్రామానుజుల వలె శ్రీవైష్ణవసంప్రదాయమునకు ప్రశస్తిని కలిగించిన వారు శ్రీమణవాళ మహామునులు అనబడు వరవరమునీన్ద్రులు. కనుకనే శ్రీరంగనాథుని ఆజ్ఞచే ప్రతి శ్రీవైష్ణవ దేవాలయ మందును ఈ మహాచార్యులను ప్రస్తుతించు **"శ్రీశైలేశదయాపాత్రమ్"** అను శ్లోకం పఠించకుండా ఆరాధనము ఆరంభించబడదు. చిరకాలము శ్రీరంగక్షేత్రమున వేంచేసియుండి, ఆ రంగనాథునికి మంగళాశాసన పరంపరను ప్రసాదించిన ఆ స్వామివారి సన్నిధిలో శిష్యులుగా అష్టదిగ్గజములు అని ప్రశంసింపబడిన ఎనమండుగురు మహావిద్వాంసులు వారి సేవలో నిమగ్నులై యుండెడివారు. వారిలో నిద్దరు మహానుభావులు తమ ఆచార్యులైన శ్రీవరవరమునీన్ద్రులను గూర్చి **"వరవరముని శతకమ్"** అను పేరున విడివిడిగా రెండు స్తోత్రములను ప్రసాదించి, తమ శిష్యత్వమును, వాక్కును సార్థకము చేసుకొనిరి. ఆ రెండు శతకములలోను ఎన్నెన్నో సంప్రదాయ రహస్యములు ఆవిష్కరింపబడి యున్నవి. వాటిని మన పూర్వులు నిత్యానుసంధేయములుగా స్వీకరించియున్నారు. మహావిద్వాంసులైన శ్రీప్రతివాది భయంకరం. అణ్ణంగరాచార్యులవారు ఆ రెంటిని తమ స్తోత్రమాలలో ముద్రించియున్నారు.

ఇటీవలి కాలమున అనేక సంప్రదాయగ్రన్థ వ్యాఖ్యాతలుగా, విశిష్టాద్వైత సిద్ధాన్తప్రచారకులుగా ప్రసిద్ధి నొందిన **పండితరత్న శ్రీమాన్ ఈ.ఎ. శింగరాచార్యులుగారు** ఇతఃపూర్వం ప్రతివాది భయంకర

అణ్ణా అనబడు పెద్దలు ప్రసాదించిన వరవరముని శతకమునకు గూడ ఆన్ధ్ర భాషలో విపులవ్యాఖ్యను వ్రాసి ప్రకటించియున్నారు.

ఈ రెండవ వరవరముని శతకమునకు **200** సంవత్సరములకు పూర్వం తిరుమఴిశై క్షేత్రములలో వేంచేసి యుండిన, చతుశ్శాస్త్రవిద్వాంసులైన, వాధూల వీరరాఘవాచార్యులనబడు స్వామివారు సంస్కృత మున ఒక విపుల వ్యాఖ్యను ప్రసాదించియుండిరి. అది ముంబాయినగరమున శ్రీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్సు అనువారిచే ముద్రితమైనది. దానినాధారముగా గొని ఇపుడు మా ఆప్తమిత్రులైన శ్రీమాన్ ఈ.ఎ. శింగరాచార్యులవారు ఈ రెండవ వరవరముని శతకమునకున్నూ అనేక సంప్రదాయార్థములను వివరించుచూ, విపులముగా ఆన్ధ్రభాషలో వ్యాఖ్యను వ్రాసి శ్రీవైష్ణవలోకమునకు మహోపకారమును చేయుచున్నారు. నా పరిశీలనమునకు వచ్చిన ఈ రెండవ వరవరముని శతకవ్యాఖ్యానమును సావధానముగా పఠించితిని. సంస్కృతవ్యాఖ్యానములోని అన్ని విశేషములును, ఒక దానినిగూడ విడువకుండా వీరిందులో పొందుపరచియుండుటను గమనించితిని. అమితానందమునొందితిని. ఇట్టి మహాగ్రన్థములను ప్రకటించుచూ, సంప్రదాయసేవను చేయుచున్న మా ఆప్తమిత్రులైన శ్రీమాన్ ఈ.ఎ.శింగరాచార్యులవారికి **“శతమానం భవతు”** అని హృదయ పూర్వకముగా నా శుభాశంసనమును ప్రకటించుచున్నాను.

Jai Srimannarayana!

Srimannarayana Ramanuja Yathibhya Namaha

శ్రీమదుభయ వేదాంతాచార్యపీఠం

☎ 9441562863
9676825361

"Sastra ratnakara", "Sastravidvanmani"
President
Srimad Ubhaya Vedanthacharya Peetam

Dr. S.V.Rangaramanuja Charyulu
Director (Academic Council)
Jeeyar Integrated Vedic Academy

ఎడిటర్:- భక్తినివేదన, సీతానగరము







# జీయాద్వరవరోమునిః

1) శ్రీవైకుంఠనికేతనో హరిరసౌ నిత్యాత్మముక్తాత్మనాం
సేవ్యోఽపారకృపాంబుధిః భువి యదా సంసారిబద్ధాత్మనామ్ ।
ఉద్ధారాయ పరాంకుశాది మహితాన్ ఉద్భావ్య దివ్యాంశతః
తృప్తిం నైవముపాగమత్, నిఖిలభూరక్షార్థముద్యన్ తదా ॥

2) నిత్యం విష్ణుసుకింకరత్వరసికం శేషాఖ్యధామాత్మకం
యంచానన్తమచిన్త్యదివ్యవిభవం వైకుంఠసత్పార్షదమ్ ।
ప్రాహుః సూరిగణా హ్యగణ్యగుణయు గ్రామానుజం భూతలే
ప్రాదుర్భావయ దార్తలోకవశగో నారాయణః శ్రీపతిః ॥

3) ఆదావార్తజనోద్ధృతౌ కృతమతిః శేషోవతీర్ణః కలౌ
అబ్దానాం ద్విశతం నివస్తుమఖిలాన్ ఆశ్రావ్యవాచం స్వకామ్ ।
పూర్తిం నైవముపాగమత్ శతమథోవింశం స్థితోభూమిగః
పశ్చాత్ తత్పునరాగతో ధృతపునర్మూర్తిర్వరైః శాసనాత్ ॥

4) సాధారణాఖ్యకేత్వబ్దే శ్రీమత్యాశ్వయుజే శుభే ।
మాసే, మూలాతివిఖ్యాత శ్రీభే వరవరోమునిః ॥

5) రామానుజోహి సంభూతో రమ్యజామాతృతాంగతః ।
యతీంద్రప్రవణః శ్రీమాన్ శేషాంశో దేశికోత్తమః ॥

6) శ్రీరంగమంగలసుసంపదనన్యభూమౌ
సంసారదుఃఖిజన తాపవిధూతిరీతిః ।
దివ్యప్రబంధమహితార్థనితాన్తతృప్త
శ్రీరంగనాథనుతిభృత్, నను దేశికేంద్రః ॥

7) 'శ్రీశైలేశాది' యచ్ఛ్లోకమాసేతు హిమవన్నగమ్ ।
ఆదావన్తేఽనుసంధాయ మోదన్తే సంప్రదాయినః ॥

8) శ్రీవచోభూషణం తత్త్వత్రయమాచార్య హృద్గతిమ్ ।
రహస్యత్రయ మాటీక్య, నూత్తందాదిం మహార్థదమ్ ॥

9) మహార్థబంధనిచయైః అన్యైః ద్రావిడభాషయా ।
పూర్వార్యదివ్యసూరీణాం హృదయం విశదీకృతమ్ ॥

10) ఆర్తిప్రబంధ ముపదేశసురత్నమాలాం
జ్ఞానప్రమేయవిశదీకరణాఢ్యటీకే ।
శ్రీమద్యతీశగుణవర్ణనవింశతిం యః
ప్రీత్యాఽతనోత్ వరవరో ముని రీద్యకీర్తిః ॥

11) యత్పాదపుండరీకే హి సంశ్రిత్యాష్టగజాహ్వయాః ।
మహాభాగాః తథారత్ననవకం, మోదమాప్నుయుః ॥

12) శ్రీమద్వైష్ణవసంప్రదాయవరివస్యా నిష్ఠురాచారకా
స్స్వాచార్యాః సతతం యదీయ 'దినచర్యాం' బుద్ధిరూఢాం ముదా ।

కృత్వాత్యన్త సమాదరాత్ ధృతధియః శంసన్తి యద్వైభవం
శ్రీమాన్ సౌమ్యమునిర్జయేత్ బుధనుతస్త్వాచంద్రతారం గురుః ॥

13) శ్లోకానాం 'శతకం' నితాన్తవిశదప్రీత్యా విధాయాంజసా
జామాతౄన్ రుచిరాహ్వయాన్ అకలయత్ శ్రీదేవరాజోగురుః ।
యస్యాంధ్ర్యాం పరిటీకితం బుధవరైశ్రీసింగరార్యైర్ముదా
తత్ప్రాకాశ్య విధానతో విజయతే 'గోపాలకృష్ణో'ర్యధీః ॥

14) సదాచార్యనిష్ఠా ద్రఢిష్ఠా వరిష్ఠాః
యతీశానసత్సంప్రదాయాభివిష్టాః ।
యమాచక్షతే రమ్యజామాతృరూపం
సదావైష్ణవోద్దిష్టముద్బాహురీడే ॥

పెరియజీయర్‌గా శ్రీవైష్ణవలోకంలో ప్రసిద్ధులై, భగవద్రామానుజ అనంతర అవతారంగా సంభావింపబడే శ్రీమన్ మణవాళమహామునుల వైభవాన్ని బహుముఖీనంగా కీర్తించే మహనీయులెందరో ఉన్నారు. ప్రాచీనులైన మహానుభావులు అణ్ణావప్పంగార్, శ్రీ అప్పిళ్ళాన్, కోయిల్‌కందాడైఅణ్ణన్, ప్రతివాదిభయంకరం అణ్ణన్, శ్రీపిళ్ళలోకంజీయర్, కాంచీమహావిద్వాన్ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్యస్వామి ప్రభృతులు అనుగ్రహించిన వరవరమునివైభవప్రకాశకాలైన రచనలు ప్రపన్నలోకానికి జీవాతువులై అనుగ్రహిస్తున్నాయి.

మణవాళమామునుల పదసంశ్రయంచే ధన్యులైన మహానుభావుల్లో ఎఱుంబి అనే తిరువవతారస్థలం కలిగిన ఎఱుంబియలప్పా అనే ద్రావిడనామంతో ప్రసిద్ధులైన దివ్యజ్ఞానప్రదులు శ్రీదేవరాజగురువులు విశేష ఖ్యాపనీయులు. ఈ మహానుభావులకు చెందిన–

సౌమ్యజామాతృయోగీన్ద్రచరణామ్బుజ షట్పదమ్ ।
దేవరాజగురుం వన్దే దివ్యజ్ఞానప్రదం శుభమ్ ॥ అనే తనియన్ ప్రసిద్ధమై ఉంది. వీరనుగ్రహించిన వరవరముని విషయకాలైన పూర్వోత్తరదినచర్యలు శ్రీవైష్ణవలోకానికి పరమానుసంధేయాలు. వరవరమునిచరితం అనే పేరున ఒక గ్రంథం వీరనుగ్రహించినట్లు పెరియతిరుముడియడవు చెబుతుంది. అయితే ఈ గ్రంథం లభించడంలేదు. అలాగే ఒక చంపూ గ్రంథంకూడా వరవరముని విషయకంగా ఉందని ప్రసిద్ధి ఉంది.

ఇరామానుశ నూత్తందాదిలాగా శ్రీమణవాళమామునిగళ్ నూత్తందాది అనే ప్రబంధాన్ని శ్రీసేనాపతి ముని అనుగ్రహించారు. మధురకవుల కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలా కోయిల్‌కందాడైఅణ్ణన్ వరవరముని విషయకంగా కణ్ణినుణ్ శిఱుత్తాంబు అనుగ్రహించారు. తిరుప్పాణాళ్వార్లు శ్రీరంగనాథ విషయకంగా అమలనాదిపిరాన్ అనుగ్రహించినట్లు శ్రీపతివాదిభయంకరం అణ్ణన్ వరవరముని విషయకంగా

అమలనాదిపిరాన్ అనుగ్రహించారు. దేవరాజగురువుల పూర్వోత్తరదినచర్యలకు సంస్కృతవ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన శ్రీవాధూల వీరరాఘవాచార్యులు. (వీరికే అణ్ణావప్పంగార్ అని నామాంతరం) వరవరముని సుచరితచషకాన్ని అనుగ్రహించారు. అభిరామవరాచార్యులవారు వరవరముని ప్రపత్తిని, ఈ ప్రతివాదిభయంకరం అణ్ణన్ సుప్రభాతమంగళాశాసనాలను అలాగే, వరవరమునిశతకాన్ని శ్రీపరవాదికేసరి శ్రీశైలవైభవాన్ని, శ్రీనివాససూరి మణవాళమామునుల నక్షత్రమాలాస్తవాన్ని అనుగ్రహించారు. ఇంచుమించుగా ఈ గ్రంథాలన్నీ ఉ.వే.శ్రీమాన్ సింగరాచార్యస్వామివారు తెలుగు పాఠకలోకానికి అందించారు. కవిశాబ్దికకేసరులు, శాస్త్రరత్నాకరులు శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య స్వామివారు మంచి ధారాశుద్ధికల సంస్కృతశ్లోకపంచాశత్తును వరవరముని విషయకంగా కటాక్షించారు. తమ కృతిని గురించి శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు

కృతిమిమాం వరయోగిగుణావళి స్తుతిపరామనిశం హృదిభావయన్ ।
కృతమహాదురితోపి రమాపతేః మురరిపోః ప్రియతాముపయాస్యతి ॥

అన్నమాట వరవరముని విషయకంగా ఆవిర్భవించిన రచనలన్నింటికి ఏకరసంగా అన్వయిస్తుంది.

ద్రావిడసారస్వతాన్ని తెలుగువారికి మూలవ్యాఖ్యానరక్షణపురస్సరంగా అందించే మహాభాగ్యాన్ని పొందిన ఉ.వే. శ్రీమాన్ సింగరాచార్యస్వామివారు దాదాపు **20** రచనలను వరవరముని విషయకంగా ఒకచోట చేర్చి, యథోచితంగా వాటికి తాత్పర్యవివరణాలను అనుగ్రహిస్తూ శ్రీవరవరముని స్తుతి సర్వస్వంగా తెలుగువారికి అందింపబోవడం ఒకమహాకృత్యం. దీన్ని ఫలేగ్రాహి చేసి, సూర్యాలోకనవైభవాన్ని సంతరింపచేస్తున్న మధురవాక్ శిఖామణులు, భాగవతప్రవచన ధురంధరులు అయిన ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్య స్వామివారు సర్వథా కృతజ్ఞతాబుద్ధితో అభివందనీయులు. స్వతంత్రంగా రాసపంచాధ్యాయి లాంటి మహార్ఘ రచనల్లోని రహస్యాలను లోకానికి అందించిన ఈ మహనీయులు, వరవరమునులవైభవాన్ని మరొక్కసారి ఏకత్రితంగా ప్రకాశింపజేసి ఆచార్యరుణాన్ని తీర్చుకునే ప్రయత్నంచేస్తున్నారు.

శ్రీవైష్ణవసత్సంప్రదాయప్రీతి కలవారు ఎవరైనా ఎలాంటి సామర్థ్యాలు ఉన్నా, లేకపోయినా ఇలాంటి కైంకర్యాన్ని చేయడంలో వెనుకాడవలసిన అవసరంలేదు. ఆర్తిగల జిజ్ఞాసులోకం స్వామివారిని ఈ విషయంలో ఆదర్శంగా తీసుకుంటుంది. మరొక్కసారి ఉ.వే.శ్రీమాన్ సింగరాచార్యస్వామివారికి, ఉ.వే.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామివారికి ప్రహ్వాభావంతో ప్రణతులు సమర్పిస్తూ సెలవు దీసుకొను భాగవతవిధేయుడు.

రంగరామానుజాచార్యులు

( సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు )
అధ్యక్షుడు – ఉభయవేదాంతాచార్యపీఠం, ట్రస్ట్
సంపాదకులు – భక్తినివేదన

జీవా, శ్రీరామనగరం

# విషయసూచిక

శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ అనుగ్రహించిన

# వరవరమునిసుప్రభాతమ్

తనియన్

వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధం
సౌమ్యోపయంతృయమినః కరుణైకపాత్రమ్ ।
వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతమ్
భక్త్యా భజామి పరవాదిభయంకరార్యమ్ ॥

వేదాంతదేశికుల కటాక్షంవల్ల మిక్కిలి వృద్ధి అయిన జ్ఞానాన్ని కలవారు, శ్రీవరవర మునుల కరుణకు పాత్రమైనవారు, శ్రీవత్సగోత్రంలో జన్మించినవారు, సద్గుణాలను కలవారు అయిన ప్రతివాదిభయంకరం అణ్ణన్‌ను భక్తితో సేవిస్తున్నాను.

---

(ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ విరచితమైన ఈ సుప్రభాతంలోని మొదటిశ్లోకం, అయిదవశ్లోకం యతీంద్రప్రవణప్రభావంలో ఉట్టంకింపబడ్డాయి. ఈస్తుతి ప్రాచీనస్తోత్ర కోశాలలో ముద్రితమైనది.)

1. రవి రుదిత స్తథాపి న వినశ్యతి మే తిమిరం
వికసతి పంకజం హృదయపంకజ మేవ న మే ।
వరవరయోగివర్య! వరణీయ! దయైకనిధే !
జయ! జయ! దేవ! జాగృహి జనేషు నిధేహి ధియమ్ ॥

శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ తమ ఆచార్యులైన శ్రీవరవరమునులను సుప్రభాతాన్ని పాడే వాచికకైంకర్యాన్ని ఈశ్లోకంనుండి ప్రారంభిస్తున్నారు.

అందటిచేత అభిలషించదగినవారుగా, దయకు ముఖ్యమైన నిధివంటివారుగా వేంచేసి ఉండే వరవరమునులనబడే ఓ యోగివర్యా! తమరు నిత్యశ్రీతో వర్ధిల్లాలి. మీరు నిద్రలేవండి. సూర్యుడు ఉదయించినా నా అజ్ఞానాంధకారం పోలేదు. పద్మాలు వికసించినా నాహృదయ పద్మం వికసించలేదు. నాతోపాటు అందరు ఉజ్జీవించేటట్లుగా మీరు మనస్సులో సంకల్పించండి.

ఆదిశేషులే వరవరమునులుగా అవతరించారు కనుక **"దేవ"** అని అణ్ణన్ సంబోధిస్తూ వరవరమును లకు సుప్రభాతం పాడుతున్నారు. నిద్ర లేవాలంటే సూర్యో దయం కావాలి కదా! అని అంటే, **"కదిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దెడున్దాన్"** (సూర్యుడు ఉదయాద్రిశిఖరాలపైకి వచ్చాడు) అని అంటున్నారు. ఉదయాద్రిపై సూర్యుడు ఉద యించినందువల్ల **"కన ఇరుళ్ అకన్దదు"** (నిబిడమైన తిమిరం తొలగింది). ఇది బాహ్యాంధకారం. **"తమోబాహ్యం వినశ్యే త్తు పావకాదిత్యసన్నిధౌ"**. కాని, నా ఆంతర తమస్సు తొలగనే లేదు. సూర్యుడు ఉదయించగానే సరోవరాలలోని కమలాలు వికసించడం ప్రారంభించాయి.

కాని, హృదయకమలంమాత్రం వికసించలేదు. అందువల్ల దేవరవారు ప్రబోధాన్ని పొంది, దాసుని ఆంతరతమస్సును తటిమి కొట్టి, మనస్సు అనే కమలానికి జ్ఞానవికాసాన్ని కల్గించాలి. దాసుని ఒక్కనికి మాత్రమే ఈ అనుగ్రహాన్ని కల్గిస్తే చాలదు. **"జనేషు నిధేహి ధియమ్"**- ఈలోకంలో జన్మను పొందిన సకల చేతనుల పట్ల కృపతో కూడిన, శుభంకరమైన, సంకల్పాన్ని చేసి అనుగ్రహించాలి. కవియొక్క ఈ ఔదార్యం **"కడల్ శూళ్న్ద మణ్ణులకమ్ వాళ"** అని అనడంవంటిది. నమ్మాళ్వార్లను **"తస్మై నమో వకుళభూషణభాస్కరాయ"** అని, తిరుమఙ్గైమన్నన్‌ను- **"కవిం లోకదివాకరమ్"** అని, భగవద్రామానుజులను **"శ్రీమాన్ ఆవిరభూద్భూమౌ రామానుజదివాకరః"** అని స్తుతించిన రీతిలోనే అణ్ణన్ తమ ఆచార్యులైన వరవరమును లను అలౌకికసూర్యునిగా స్తుతించిన శ్లోకరత్నం ఇది. ఈసామ్యం శబ్దతః కాకుండా అర్థతః సిద్ధించడం విశేషం.

2. **స్వపన మిదం తవ స్వమహిమానుభవైకరసం**
   **తదపి తథావిధం తదితి జాతు న వేత్తి జనః ।**
   **వరవరయోగివర్య! తదిదం విజహాతు భవాన్**
   **అపరిమితం హితం త్రిజగతా మనుచింతయితుమ్ ॥**

ఓ వరవరమునీ! తమ ఈ నిద్ర లోకంలోనివారి నిద్రవలె తామసమైనది కాదు. ఇది **"ఉఱఙ్గువాన్‌పోల్ యోగుశెయ్ద పెరుమాన్"** అని అన్నట్లు **"నిద్రాపి జాగర్యయా"** అని అన్నట్లు భగవానుడు ఏకాగ్రతతో తన వైభవాన్నిగూర్చి చింతిస్తూ పొందే యోగనిద్రవంటిదే ఇది. అయినా, ఈ లోకంలోని జనిధర్మాన్నికల చేతనులు తమ జ్ఞానసంకోచంకారణంగా మీ యోగనిద్రను యథాతథంగా తెలియలేకపోతున్నారు. అందువల్ల మానవసజాతీయులై నిద్రించే ధర్మాన్ని విడచి, ముల్లోకాలకు అంతు లేని హితాన్ని చింతించడంకోసం మీరు ప్రబోధాన్ని పొందాలి సుమా!

3. **అవతరణం తదేవ జగతా మవివేకభృతాం**
   **వివిధహితావబోధన కృతే హి కృతం భవతా ।**
   **తత ఇత ఏహి యోగశమనాన్మమ నాథ! జనాన్**
   **అమృతమయై రపాంగవలయై రభిషేచయితుమ్ ॥**

దాసునకు స్వామి అయిన ఓ వరవరమునీ ! తమరు ఈ అవతారాన్ని అంగీకరించడం అవివేకులైన జనులకు నానావిధహితాలనుగూర్చి వారికి తెలిపి, వాటిని వారికి అనుగ్రహించడంకోసమేకదా! అందువల్ల మీరు యోగసాధననుండి లేచి ఇక్కడకు వేంచేయండి. ఎందుకోసం ? అని అంటే, అమృతవర్షి అయిన తమ కరుణావీక్షణాలతో చేతనులను అనుగ్రహించడంకోసం. మీరు ప్రబోధాన్ని పొంది లేచి లోకులు ఉజ్జీవించేటట్లు కటాక్షించాలి.

4. **శరదరవిందబృందసుషమాపరిపోషభుజా**
   **తవ యనేన కేచన పరిచరణేన తథా!**

**మధురగభీరధీరచతురై రుదితై రితరే**

**వరద! ధురం ధరంతి భవసింధు మముం తరితుమ్ ॥**

ఇందులో అణ్ణన్ - వరవరమునులు నిద్రనుండి, లోకాన్ని రక్షించే రీతిని బహువిధాలుగా తెలుపుతున్నారు.

వరదా! లోకంలోనివారు ఎవరు దేనిని కోరుతున్నారో, వారికి దానిని అనుగ్ర హించడంవల్లకదా మీకు ఈ వరదనామం కల్గింది. కొందరు, శరత్కాలంలోని కమలసమూహంయొక్క కాంతిపౌష్కల్యాన్ని కల తమ వీక్షణంతో ఈ సంసార సముద్రనిస్తరణభారాన్ని ధరిస్తున్నారు. (మామునుల చూపుతోనే కొందరు ముక్తిని పొందుతున్నారు- అని భావం) కమలంవంటి తమ పాదాల సంబంధంతోనే మఱి కొందరు మోక్షాన్ని పొందుతున్నారు. బుద్ధిమంతులైన మఱికొందఱు మధుర గంభీరాలైన, చాతుర్యంతో కూడినవైన- అంటే- గొప్ప అర్థాలతో కూడినవై, సులభంగా అర్థం తెలిపే రీతిలో అందంగా ప్రకాశిస్తూ ఉండే - శ్రీసూక్తులతో సంసారసముద్రం దరిని చేరడానికి తగిన ఉపాయనిష్ఠను పొందుతున్నారు.

**"యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా, స్థావరాణ్యపి ముచ్యంతే కింపునః బాంధవా జనాః"** అనే సూక్తిభావం ప్రకృతంలో గ్రాహ్యం. శ్రీవరవరమునులు **"విశదవాక్శిఖామణి"** కనుక పలువురు మహాత్ములను తమ శ్రీసూక్తిచాతుర్యంతో చరమపర్వనిష్ఠను కలవారినిగా చేసి ఉజ్జీవింపజేస్తున్నారు. దానికి అధికారం లేనివారినికూడా కరుణతో కటాక్షించడం ద్వారా, శ్రీపాదస్పర్శ ద్వారా ముక్తి పొందేటట్లు చేస్తున్నారని తాత్పర్యం.

5. **పరమనభోనివాస! ఫణిపుంగవ ! రంగపతేః**

**భవన మిదం హితాయ జగతో భవతాఽధిగతమ్ ।**

**తదపి సదైవ దేవ నృగతిం ప్రకటీకురుషే**

**తదిహ మహత్త్వమేవ కురు వైభవ ముద్భిదురమ్ ॥**

పరమపదంలో శ్రీభూమినీళానాయకుడైన భగవానునకు సింహాసనంగా వేంచేసి ఉండే ఆదిశేషస్వరూపా! వరవరమునీ! తమచే జగత్తు హితంకోసం శ్రీరంగనాథుని శ్రీరంగం నిత్యనివాసంగా స్వీకరింపబడింది. ఆ విధంగా ఉన్నా మీరు ఎల్లప్పుడూ మావలె మనుష్యవృత్తిని కలవారుగానే దర్శనమిస్తున్నారు. తమ ఈ మహామహిమను లోకం అంతా తెలిసికొని, ఉజ్జీవించడంకోసం దానిని ప్రకటించాలి - అని అణ్ణన్ ప్రార్థిస్తున్నారు. వరవరమునులు ఆదిశేషుల అవతారవిశేషమని, యతివరపు నరవతార భూతులని ప్రసిద్ధి. ఈ విషయం బ్రహ్మాండపురాణంలో శ్రీబదరికాశ్రమ మాహాత్మ్యంలో గల నరనారాయణ సంవాదంలో తెలుపబడింది. శ్రీనారాయణుడు నరుని ఉద్దేశించి- **"మన్నియోగా ద్భూత పుర్యా మహీనా మీశ్వరః కలౌ, శ్రీరామానుజరూపేణ జనిష్యతి సతాం ముదే, విశిష్టాద్వైత సిద్ధాంతప్రతిపాదనతత్పరః, తదాశ్రయా స్సదాచారాః సాత్త్వికా స్తత్త్వదర్శినః, వేదాంతద్వయతత్త్వజ్ఞాః భవిష్యంతి గురూత్తమాః, సదా సద్విషయైః స్సర్వైః దేశికై రాదృతో మహాన్, ప్రపన్నగాయత్రీవక్తా రంగామృతమహామతిః, అష్టోత్తరశతాఖ్యాం చ గాథాం దివ్యాం కరిష్యతి, ఆవిర్భూతశఠారాతిప్రముఖైః దివ్యసూరిభిః, నిర్మితానాం ప్రబంధానాం చూడారత్నం**

భవిష్యతి, పున రప్యాదిశేష స్తు మన్నియోగా న్మహీతలే, భవిష్యతి శ్రీనగర్యాం యతీంద్రప్రవణాత్మకః, యత్పద్యం ద్రావిడామ్నాయస్యారంభే౽ంతే భవిష్యతి, స ఏవ సౌమ్యజామాతా యతిశ్రేష్ఠో భవిష్యతి" అని పల్కిన శ్లోకాలు అనుసంధేయాలు. (నా ఆజ్ఞవల్ల భూతపురిలో కలియుగంలో ఆదిశేషుడు సత్పురుషుల ఆనందంకోసం శ్రీరామానుజులరూపంలో అవతరిస్తాడు. ఆ రామానుజులను ఆశ్రయించినవారు విశిష్టాద్వైతసిద్ధాంతప్రతిపాదనలో శ్రద్ధాసక్తులు కలవారు, సదా చారులు, సాత్త్వికులు, తత్త్వాన్ని దర్శించేవారు, ఉభయవేదాంతాల తత్త్వాన్ని గ్రహించిన వారు, గురూత్తములు కాగలరు. ఆ రామానుజుల భక్తులు', ఆచార్యులు అందఱిచే గౌరవింపబడే మహాత్ములు అయిన శ్రీరంగామృతకవి నూట ఎనిమిది గాథలను కల దివ్యమైన ప్రపన్న గాయత్రిని రచించగలరు. ఈ ప్రబంధం నమ్మాழ்వార్లు మొదలైన దివ్యసూరులు అనుగ్రహించిన ప్రబంధాలలో చూడామణి కాగలదు. మఱల ఆదిశేషుడు నా ఆజ్ఞానుసారం భూమిలో శ్రీనగరిలో యతీంద్రప్రవణులరూపంలో అవతరిస్తాడు. ఎవరి స్తుతిపద్యం ద్రావిడవేదాధ్యయనప్రారంభంలో, చివరలో అనుసంధింపబడు తున్నదో అయనే సౌమ్యజామాతృముని అనే పేరుగల యతిశ్రేష్ఠులు కాగలరు.)

6. త్వదభిమతప్రియ స్త్వదనువర్తనధన్యతమాత్
అల మతిరిక్త ఇత్యఖిలలోకసుబోధ మిదమ్ ।
అవనితలం త్వదీప్సిత మిదం చ హి తత్ర వసన్
అయ మఖిల స్తదైవ నిరుపాయ ముపైతి పదమ్ ॥

వరవరమునీ! మీ విషయంలో చాలా అభినివేశాన్ని పొంది కైంకర్యాన్ని చేసే దాసుల కంటే తమ దాసుల అభిరూపంలో ఒదిగి ఉండేవారు తమకు చాలా ప్రియులు- అనే విషయం లోకప్రసిద్ధం. మీరు అభిమానించి కోరి వర్తించే ఈ భూతలంలో నివసించే ఈ చేతనులుకూడా మీ పరమప్రీతికి పాత్రభూతులైన ఆ దాసులు నివసించే చోటునే పొందుతున్నారు.



ఆచార్యపౌత్రులైన అభిరామవరాచార్యులవారు అనుగ్రహించిన

# శ్రీవరవరమునిప్రపత్తి

## తనియన్

శ్రీసౌమ్యజామాతృమునేః సుపౌత్రం
శ్రీభాష్యకారాంఘ్రిసరోజభక్తమ్ ।
తన్మంగళం స్తోత్ర ముదాహర ద్యః
తం సౌమ్యజామాతృగురుం ప్రపద్యే॥

సౌమ్యోపయంతృమునివర్యపదారవిందే
సమ్యక్ ప్రపత్తి మథ మంగళ మాతనోద్యః ।
తత్త్స్తోత్ర మార్య మభిరామవరం ప్రపద్యే
సత్త్వోత్తరం సకలజీవదయాంబురాశిమ్ ॥

---

శ్రీమణవాళమహామునుల పౌత్రులైన జీయర్‌నాయనార్‌చేత రచింపబడ్డ ఈ ప్రపత్తి ప్రాచీన స్తోత్రకోశాలలో చాలాకాలం క్రితం ముద్రింపబడింది. జీయర్ నాయనార్ శఠకోపసూరి విషయంలో నక్షత్రమాలికా అనే స్తుతిని, శ్రీరామానుజుల విషయంలో దినచర్యా స్తుతిని కూడా రచించారు.

1. **శ్రీమద్యతీంద్రచరణప్రవణామలాత్మన్!**
**ధీభక్తిశాంతికరుణాదిగుణామృతాబ్ధే ।**
**సౌమ్యోపయంతృమునివర్య ! సతాం జనానాం**
**నాథౌ ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

శ్రీరామానుజుల శ్రీచరణాలలో ప్రావణ్యాన్ని కల అమలాత్మా! జ్ఞాన భక్తివైరాగ్యకరుణాదికల్యాణ గుణాలకు అమృతసముద్రమా! సౌమ్యోపయంతృముని వర్యా! సత్పురుషులకు నాథాలైన మీ పాదాలు రెండింటిలో ప్రపత్తిని చేస్తున్నాను.

2. **శ్రీమన్ ! పరాంకుశవచోమృతపూరపాన-**
**సంసిద్ధశౌరిచరణానుభవప్రవాహ ।**
**సౌమ్యోపయంతృమునివర్య! జగద్ధితౌ యౌ**
**భవ్యౌ ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥**

భగవత్కైంకర్యలక్ష్మిని కలవాడా! నమ్మాళ్వార్ల శ్రీసూక్తులనే అమృతరసప్రవాహ పానాన్ని చేయడానికి సంసిద్ధుడైన భగవానుని శ్రీచరణాల అనుభవప్రవాహాన్ని కలవాడా! వరవరమునీ ! లోకానికి హితమైనవి, శుభకరమైనవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

3. పద్మాలయారమణభవ్యపదాబ్జయుగ్మ-
ప్రేమామృతాబ్ధపరివాహనిమగ్నచేతాః ।
సౌమ్యోపయంతృమునివర్య! సమస్తలోక-
సేవ్యౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రియఃపతియొక్క శుభకరమైన పదాబ్జయుగ్మంలోని భక్తి అనే అమృతసముద్ర ప్రవాహంలో మునిగిన మనస్సును కలవాడా! వరవరమునీ! సకలలోకాలచే సేవింపతగినవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

4. ముక్తిప్రదౌ మురరిపో రివ పాదపద్మౌ
భక్త్యాద్యుపాయరహితస్య పరం ముముక్షోః ।
సౌమ్యోపయంతృమునివర్య! సతాం జనానాం
నాథౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

'భక్తి మొదలైన ఉపాయాలు ఏమీ లేని' మోక్షాన్ని పొందగోరేవారికి మురారి పాదపద్మాలవలె ముక్తి ప్రదాలు, సత్పురుషులను పాలించేవి అయన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ శరణు పొందుతున్నాను.

5. రామానుజార్యవరదర్శనధూర్వహేంద్ర !
కామాదిదూరగణదూరగ దేశికేంద్ర ।
సౌమ్యోపయంతృమునివర్య! సమస్తలోక -
బంధౌ! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీరామానుజ దర్శనమనే గొప్ప సిద్ధాంతాన్ని ప్రచారం చేసే భారాన్ని నిర్వహించడంలో గొప్పవాడా! కామం మొదలైన హేయగుణాలకు ప్రతిభటమైనవాడా! దేశికేంద్రా! సౌమ్యోపయంతృమునివర్యా! అన్ని లోకాలకు బంధువులైన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

6. వానాద్రియోగివరమానసరాజహంస!
వాధూలనాథవరదార్యవరాభివంద్య ।
సౌమ్యోపయంతృమునివర్య! సరోజశంఖ-
చిహ్నౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

వానమామలైజీయర్ మనస్సు అనే సరస్సులో విహరించే రాజహంసవంటివాడా! వాధూల వరదులనే కోయిలణ్ణన్‌కు పూజనీయుడా! వరవరమునీ! మహాపురుషత్వాన్ని సూచించే పద్మశంఖచిహ్నాలను కల మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

7. శ్రీభట్టనాథమునివర్యవరేష్టదేవౌ
శ్రీదేవరాజగురుపుంగవపారిజాతౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽ౽ంతరంగ -
శిష్టౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీభట్టనాథమునివర్యులకు (పట్టర్ పిరాన్ జీయర్) ఇష్టదైవం, శ్రీదేవరాజులనే (ఎఱుమ్బియప్పా) గొప్ప గురువులకు పారిజాతంవంటివి, అంతరంగభక్తులకు శ్లిష్టమైనవి అయిన మీ శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

8. రామానుజార్యవరవేంకటయోగివర్య-
శ్రీమన్నతార్తిహరసూరిభి రీడ్యమానౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽస్మదీయ -
భాగ్యౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

రామానుజార్యులు, వేంకటయోగివర్యులు, శ్రీనతార్తిహరసూరి అనే శిష్యులచేత స్తుతింపబడేవి, మాకు సంపద అయినవి అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! శరణు పొందుతున్నాను.

9. అమ్లానకోమలసరోజసుగంధిరమ్యౌ
సర్వై రనన్యశరణై రనుభావ్యమానౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! సదాఽశరణ్య -
నాథౌ త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

వాడని, సుకుమారం అయిన పద్మంవలె సువాసనను కల్గి మనోహరంగా ఉన్నవి, అనన్య శరణులందఱిచేత అనుభవింపదగినవి, అశరణ్యాశరణ్యాలు అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! ఎల్లప్పుడు శరణు పొందుతున్నాను.

10. మంజుప్రవాళసదృశా వతిపాపినోఽపి
సంసారసాగరసముద్ధరణప్రవీణౌ ।
సౌమ్యోపయంతృమునివర్య! విభో! సుభోగ్యౌ
స్వామిన్! త్వదీయచరణౌ శరణం ప్రపద్యే ॥

మంజులమైన పగడంవంటివి, గొప్ప పాపులను సైతం సంసారసాగరం నుండి ఉద్ధరించడంలో సమర్థమైనవి, చాలా భోగ్యమైనవి అయిన మీ శ్రీచరణాలను ఓ వరవరమునీ! ప్రభూ! స్వామీ! శరణు పొందుతున్నాను.

11. అస్మత్కులాధిపగురూత్తమ! యోగివర్య!
భోగీంద్ర! భీకరగురోః మహితార్యవర్య!
సౌమ్యోపయంతృమునివర్య! భవత్కృపాయాః
పాత్రం కురుష్వ భగవన్! శరణాగతం మామ్ ॥

మా ప్రపన్నకులానికి గొప్ప గురువైనవాడా! యోగివర్యా! ఆదిశేషస్వరూపా! ప్రతివాదిభయంకర అణ్ణన్‌కు గొప్ప ఆచార్యుడవైనవాడా! వరవరమునీ! భగవన్! మిమ్ములను శరణు పొందిన నన్ను మీ కృపకు పాత్రుణ్ణి చేయాలి.



ప్రతివాదిభయంకరం అణ్ణన్ అనుగ్రహించిన

# శ్రీరమ్యజామాతృమునిమంగళమ్

## మున్నుడి

ఈ మంగళాశాసనం అనుష్టుప్ ఛందస్సులో రచింపబడ్డ సుమధురకృతి. ఇదే రీతిలో అణ్ణన్ వరవరమునులను ఉద్దేశించి ఇంకొక మంగళాశాసన స్తోత్రాన్ని కూడా రచించారు. శ్రీ పిళ్ళైలోకమ్‌జీయర్ **"లక్ష్మీనాథసమారంభామ్"** అనే పొదుత్తనియన్ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ **"ఆచార్యాణా మసౌ వసౌ విత్యాభగవత్తః స చాచార్య వంశో జ్ఞేయః"** అనే ఆగమసూక్తికి ఉదాహరణంగా అణ్ణన్ అనుగ్రహించిన ఈ మంగళాశాసన స్తుతిని ఉదాహరిస్తూ ఈ క్రిందివిధంగా అన్నారు. **"వేదాన్తాచార్యరాన అణ్ణావుమ్ - "పత్యుః శ్రియః పదాబ్జాభ్యాం ప్రయుంజానాయ మంగళమ్" ఎన్ఱు తుడఙ్గి, "యతీంద్ర ప్రవణాయ" ఎన్ఱు నడువాకవుమ్, "పూర్వాచార్యేషు సర్వేషు పూర్ణప్రేమాను బధ్నతే...." ఎన్ఱు శ్రియః పతియై తుడఙ్గి శ్రీమద్రామానుజాచార్యర్ నడువాకవుమ్, శ్రీశైలేశదయా పాత్రరాన పెరియజీయర్ అళవాక శేఖరిక్కైయలే ఇదువే శుద్ధసంప్రదాయమ్".** ఈవిధంగా పూర్వాచార్య పరంపరను సేవించే వరవరమునులను తాము సేవిస్తున్నట్లుగా అణ్ణన్ వచించడానికి తిరువరంగత్తముదనార్ ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో పలువురు దివ్యసూరులను, నాథమునిని, యామునాచార్యుల వారిని సేవించే భగవద్రామానుజను తాము ఆరాధిస్తున్నట్లుగా పల్కడం దోహందంచేసి ఉంటుంది అనడంలో ఆశ్చర్యంలేదు. ఇటువంటి విలక్షణమైన ఈ సత్కృతి పలువురి దృష్టికి రాకపోవడం, ప్రచారంలోకి రాకపోవడం ఆశ్చర్యకరమే! ప్రస్తుతం క్లుప్తంగా తాత్పర్యంతో పాటుగా ఈ కృతి ముద్రింపబడుతున్నది.

## తనియన్

**1.** యశ్చక్రే మంగళాశాస్తిం మనోజ్ఞవరయోగినః ।
ప్రణమామి దయాళుం తం ప్రతివాదిభయంకరమ్ ॥

శ్రీవరవరమునుల మంగళాశాసనాన్ని రచించినవారు, దయాళువు అయిన శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్‌కు నమస్కరిస్తున్నాను.

**2.** మంగళాశాసనం కర్తుం మనోజ్ఞవరయోగినః ।
మనః ప్రసీద భద్రం తే త్వన్మూలం క్షేమ మాత్మనామ్ ॥

ఓ మనసా! వరవరమునుల మంగళాశాసనం చేయడంకోసం నీవు నాకు ప్రసన్నం కావాలి!నీకు మంగళం. నీవల్లనే జీవులకు క్షేమం కల్గుతుంది.

**3.** పత్యుః శ్రియః పదాబ్జాభ్యాం ప్రయుంజానాయ మంగళమ్ ।
శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ॥

శ్రియఃపతి పాదపద్మాలకు మంగళాశాసనాన్ని చేసే శ్రీవరవరమునులకు మంగళం కలగాలి.

**4.** శ్రియఃకృపామయాపాంగసుధాస్రోతో౽వగాహినే ।
అస్తు మంగళ మార్యాయ రమ్యజామాతృయోగినే ॥

లక్ష్మీదేవి కరుణతో నిండిన చూపులు అనే అమృతప్రవాహంలో మునిగే వరవరమునులకు మంగళం కలగాలి.

**5.** విహితానతయే నిత్యం విష్వక్సేనపదాబ్జయోః ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ మహౌజసే ॥

విష్వక్సేనుల శ్రీపాదపద్మాలకు నిత్యం నమస్కరించే, గొప్ప తేజస్సును కల వరవరమునులకు మంగళం కలగాలి.

**6.** ప్రపన్నజనకూటస్థం ప్రపన్నాయ పరాంకుశమ్ ।
ఆశాసే రమ్యజామాతృమునిరాజాయ మంగళమ్ ॥

జనకూటస్థులైన నమ్మాళ్వార్ల విషయంలో ప్రపత్తి చేసిన వరవరమునులనే యోగివర్యులకు మంగళాన్ని ఆశాసిస్తున్నాను.

**7.** నాథాయ నాథమునయే నమోవాకం వితన్వతే ।
మంగళం మమ నాథాయ మనోజ్ఞవరయోగినే ॥

ప్రపన్నకులానికి నాథులు అయిన నాథమునులకు నమోవాకాన్ని విస్తరింపజేసే వారు, నాకు నాథులైనవారైన వరవరమునులకు మంగళం.

**8.** పుండరీకాక్షపాదాబ్జే పుష్కలప్రేమ పుష్ణతే ।
రమ్యజామాతృమునయే మాననీయాయ మంగళమ్ ॥

పుండరీకాక్షులనబడే ఉయ్యక్కొణ్డార్ శ్రీపాదపద్మాలలో పూర్ణమైన భక్తిని కల, మాననీయులైన రమ్యజామాతృమునికి మంగళం.

**9.** శ్రీరామమిశ్రచరణా వంతఃస్వాంతం వితన్వతే ।
సౌమ్యజామాతృమునయే సర్వజ్ఞాయాస్తు మంగళమ్ ॥

శ్రీరామమిశ్రులనే మణక్కాల్ నమ్బి శ్రీచరణాలలో తమ మనస్సును విస్తరింపజేసేవారు, సర్వజ్ఞులు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం కలగాలి.

**10.** పాదయోః యామునేయస్య భక్తి ముద్వహతే పరామ్ ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ మనస్వినే ॥

శ్రీయామునుల శ్రీపాదాలలో గొప్ప భక్తిని కల, మనస్వి అయిన వరవర మునులకు మంగళం.

**11.** శ్రీపరాంకుశదాసార్యపాదపద్మానుమోదినే ।
మంగళం మమ దేవాయ మనోజ్ఞవరయోగినే ॥
శ్రీపరాంకుశదాసులనే పెరియనంబి శ్రీపాదపద్మాలలో భక్తిని కలవారు, నాకు దేవులు అయిన వరవరమునులకు మంగళం.

**12.** యతీంద్రప్రవణాయాస్మద్గురవే గుణశాలినే ।
ప్రయుంజే మంగళం రమ్యజామాతృవరయోగినే ॥
శ్రీరామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని కలవారు, మాకు ఆచార్యులు, గుణా లతో శోభిల్లేవారు అయిన వరవరమునులకు మంగళం.

**13.** పూర్వాచార్యేషు సర్వేషు పూర్ణప్రేమానుబధ్నతే ।
మంగళం రమ్యజామాతృమునీంద్రాయ దయాళవే ॥
పూర్వాచార్యులందరిపట్ల పూర్ణమైన భక్తిని కల, దయాళువు అయిన వరవర మునీంద్రులకు మంగళం.

**14.** భవ్యశ్రీశైలనాథార్యపరిపూర్ణకృపాజుషే ।
రమ్యజామాతృమునయే మహాభాగాయ మంగళమ్ ॥
మంగళకరం అయిన, తిరువాయ్మొழிప్పిళ్ళైయొక్క, పరిపూర్ణం అయిన కరుణను పొందే మహానుభావులు వరవరమునులకు మంగళం.

**15.** జ్ఞానభక్తివిరక్త్యాదికల్యాణగుణరాశయే ।
సౌమ్యజామాతృమునయే సద్భిః సేవ్యాయ మంగళమ్ ॥
జ్ఞానం, భక్తి, లౌకికవిషయాలలో విరక్తి మొదలైన కల్యాణగుణాల రాశివంటివారు, సత్పురుషులచే సేవింపదగినవారైన సౌమ్యజామాతృమునికి మంగళం.

**16.** సాక్షా న్నారాయణాయాస్మదనుగ్రహవిధిత్సయా ।
మంగళం మర్త్యరూపాయ మనోజ్ఞవరయోగినే ॥
మనలను అనుగ్రహించడంకోసం మానవరూపాన్ని పొందిన సాక్షాన్నా రాయణుడైన వరవరమునులకు మంగళం.

**17.** వానాద్రియోగివరవేంకటయోగివర్య శ్రీభట్టనాథమునివాదిభయంకరార్యాః ।
రామానుజార్యవరదార్యనతార్తిహారి- శ్రీదేవరాజగురవోఽష్ట దిశా గజా స్తే ॥



ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# వరవరమునిమంగళమ్

సుమారు 20 సం॥కు పూర్వం కాంచీపురంలో ముద్రింపబడ్డ "శ్రీవాది భీకరార్యసూక్తిమాలా" ద్వితీయభాగం నుండి ఈ స్తుతి గ్రహింపబడింది.

1. శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయా న్నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

కైంకర్యలక్ష్మీశోభితులు, మహాత్ములు, శ్రీరంగంలో నిత్యవాసం చేసేవారు అయిన రమ్యజా మాతృ మునులకు నిత్యశ్రీః, నిత్యమంగళం కలగాలి.

2. శ్రీరంగాదిస్థలేశానం మంగళాశాసనం శుభమ్ ।
కుర్వతే సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

శ్రీరంగం మొదలైన దివ్యస్థలాలలోని అర్చామూర్తులకు మంగళాశాసనాన్ని చేసే సౌమ్యజా మాతృమునులకు మంగళం.

3. శ్రీరామానుజయోగీంద్రదర్శనాబ్ధిసుధాంశవే ।
సౌమ్యజామాతృమునయే సర్వజ్ఞాయాస్తు మంగళమ్ ॥

శ్రీరామానుజదర్శనం అనే అమృతసముద్రాన్ని ఉప్పొంగేటట్లు చేసే చంద్రుని వంటివారు, సర్వజ్ఞులు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

4. శ్రీపతే శ్చరణాంభోజప్రేమామృతమహాబ్ధయే ।
సౌమ్యజామాతృమునయే సత్త్వోద్రిక్తాయ మంగళమ్ ॥

శ్రియఃపతి శ్రీచరణాంభోజాలపట్ల భక్తికి అమృతమహాసముద్రంవంటివారు, సత్త్వగుణోద్రేకాన్ని కలవారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

5. శ్రీరామానుజభాష్యార్థవ్యాఖ్యానాసక్తచేతసే ।
సౌమ్యజామాతృమునయే సదా భోగ్యాయ మంగళమ్ ॥

శ్రీరామానుజుల శ్రీభాష్యంయొక్క వ్యాఖ్యానంలో ఆసక్తిని కల మనస్సును కలవారు, భక్తులకు ఎల్లప్పుడూ భోగ్యులు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

6. శ్రీమచ్ఛఠారిసూక్తీనాం వ్యాఖ్యావైదగ్ధ్యశాలినే ।
సౌమ్యజామాతృమునయే సదాశ్లిష్టాయ మంగళమ్ ॥

నమ్మాళ్వార్ల శ్రీసూక్తులను వ్యాఖ్యానించడంలో గొప్ప చాతుర్యాన్ని కలవారు, సత్పురుషులచే సేవింపబడేవారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

7. శ్రీరామానుజపాదాబ్జప్రాప్యప్రాపకభావతామ్ ।
ప్రాప్తాయ సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

శ్రీరామానుజుల పాదపద్మాలే ప్రాప్యప్రాపకాలనే భావాన్ని పొందిన సౌమ్యజామాతృమునికి నిత్య మంగళం.

8. అష్టాక్షరబ్రహ్మవిద్యానిష్ఠాయాఽమితతేజసే ।
సౌమ్యజామాతృమునయే శౌరిహృద్యాయ మంగళమ్ ॥

అష్టాక్షర బ్రహ్మవిద్యానిష్ఠులు, గొప్ప తేజస్సును కలవారు, శౌరి అనబడే భగవానునకు మనో హరులైన సౌమ్యజామాతృమునికి మంగళం.

9. సదా ద్వయానుసంధానసాక్షాత్కృతమధుద్విషే ।
సౌమ్యజామాతృమునయే శాంతిభూషాయ మంగళమ్ ॥

ఎల్లప్పుడూ ద్వయానుసంధానంద్వారా భగవానుని తమ చిత్తంలో సాక్షాత్కరింప జేసికొన్నవారు, శాంతి అనే గుణానికి అలంకారంవంటివారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

10. ప్రపన్నజనసందోహమందారాయ మహాత్మనే ।
సౌమ్యజామాతృమునయే సాత్త్వికేంద్రాయ మంగళమ్ ॥

ప్రపన్నజనసమూహానికి కల్పవృక్షంవంటివారు, మహాత్ములు, సాత్త్వికులలో గొప్పవారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.

11. తులామాసేఽవతీర్ణాయ భోగిరాజాంశత శ్శుభే ।
మూలర్క్షే సౌమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ॥

ఆదిశేషుని అంశతో తులామాసంలో మంగళకరం అయిన మూలనక్షత్రంలో అవతరించిన సౌమ్యజా మాతృమునికి మంగళం.

12. శ్రీశైలేశగురో ర్దివ్యశ్రీపాదాంబురుహాలయే ।
సౌమ్యజామాతృమునయే సర్వదా నిత్యమంగళమ్ ॥

తిరువాయ్‌మొళిప్పిళ్ళై అనబడే శ్రీశైలేశుల దివ్య శ్రీపాదాలనే పద్మాలలో తుమ్మెదవంటివారు అయిన సౌమ్యజామాతృమునికి మంగళం.



# శ్రీమణవాళమహామునుల తిరునక్షత్రతనియన్

తులాయా మతులే మూలే పాండ్యే కుంతీపురీవరే ।
శ్రీశేషాంశోద్భవం వందే రమ్యజామాతరమ్ మునిమ్ ॥

తులాయామ్ = తులామాసంలో, అతులే = సాటి లేని, మూలే = మూల అనే నక్షత్రంలో, పాండ్యే = పాండ్యదేశంలోని, కుంతీపురీవరే = కుంతీపురమనబడే ఆழ்వార్ తిరునగరిలో, శ్రీశేషా+ అంశ+ఉద్భవం = ఆదిశేషుల అంశతో ఉద్భవించిన, రమ్యజా మాతరమ్ మునిమ్ = శ్రీవరవరమునులను, వందే = నమస్కరించి, స్తుతిస్తున్నాను.

**(అతులే మూలే)** - శ్రీమణవాళమహామునులు అవతరించిన మూలనక్షత్ర వైభవాన్ని ప్రతివాది భయంకరం అణ్ణన్ వరవరమునిశతకప్రారంభంలో **"యదవతరణ మూలం ముక్తిమూలం ప్రజానాం శఠరిపుమునిదృష్టామ్నాయ-సామ్రాజ్యమూలమ్, కలికలుషసమూలోన్మూలనే మూల మింధే స భవతు వరయోగీ నః సమస్తార్థమూలమ్"** (ఏ మణవాళమహామునుల అవతారహేతువు అయిన మూల అనే నక్షత్రం లోకంలోని చేతనుల మోక్షానికి మూలకారణంగా ఉన్నదో, శ్రీశఠకోపులు దర్శించిన ద్రావిడవేదాన్ని ప్రమాణసామ్రాజ్యంలో అభిషిక్తం చేయడానికి (పట్టాభిషేకం చేయడానికి) కారణమైనదో, కలిదోషాన్ని సమూలంగా పెళ్ళగించి వేయడానికి కారణమై వెల్గుతున్నదో- అటువంటి మూల అనే నక్షత్రంలో అవతరించిన మణవాళమహా మునులు దాసభూతులమైన మన సకలపురుషార్థాలకు హేతుభూతులు) అని కీర్తించారుకదా! అందువల్ల మూల నక్షత్రం అతులం అనడం అన్వర్థం. మణవాళమహామునుల తిరునాళ్‌పాట్టులోని భావంకూడా ప్రకృతంలో భావ్యం.

**(శ్రీశేషాంశోద్భవమ్)**- సంసారిచేతనోద్ధరణ కోసం భగవానుని ఆదేశం మేరకు భూలోకంలో భగవద్రామానుజులుగా అవతరించిన ఆదిశేషులు ఆ అవతారంలో 120 సంవత్సరములు మాత్రమే వేంచేసి ఉన్నందున, మిగిలిన 80 సంవత్సరాల కాలం భూమండలంపై వేంచేసి ఉండడం కోసం తిరిగి వరవరమునులై అంతరించారని వారి వైభవాన్ని తెలిపే సంప్రదాయచరిత్రగ్రంథాలు పేర్కొంటున్నాయి. **"సంప్రదాయచంద్రికై"** అనే తమప్రబంధంలో అప్పిళ్ళాన్ అనే వరవరముని శిష్యులు ఈ విషయాన్ని ప్రస్తావించారు. **"దుగ్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్"** అని అంటూ వీరి అవతార మహిమను తెలిసిన అణ్ణన్ వరవరముని శతకంలో పలికారు. తమ ఆదిశేషరూపాన్ని వరవరమునులు పలు సందర్భాలలో ప్రదర్శించిన వైనం వీరి చరిత్రలో గమనించవచ్చు.

(రమ్యజామాతరమ్ మునిమ్)- "అழ్రకియమణవాళన్" (అందమైన పెళ్ళికొడుకు) అనే పేరు శ్రీరంగనాథుని నామం. దీనిని వరవరమునుల తల్లి తండ్రులు వీరికి నామకరణమహోత్సవ సమయంలో పెట్టారు. ఈనామానికి సంస్కృతీకృతరూపమే రమ్యజామాతృనామం. వీరు సన్న్యాసాశ్రమస్వీకారాన్ని చేసినపుడు శ్రీరంగనాథుడు వీరి పూర్వపు పేరు అయిన అழ్రకియమణవాళనామంతోనే వ్యవహరింప బడాలని "నీర్ నమ్ముడైయ నామమాన మున్ తిరునామత్తైయే ముఱ్ఱ నడత్తుమ్" అని అంటూ ఆజ్ఞాపించినందున "రమ్యజామాతృముని"గా వీరు ప్రసిద్ధి చెందారు. అటువంటి వరవరమునులను "వందే" - "శిన్దైయాల్ శొల్లాల్ శెయ్కైయినాల్" అని అన్నట్లు మనసా, వాచా, కర్మణా సేవిస్తున్నాను -అని భావం. ఈ శ్లోకంలోని ఇంతకంటే విశేషాలు ఆచార్యసన్నిధిలో ఉపదేశపూర్వకంగా గ్రహించడం ఉచితం. కనుక విస్తరించడంలేదు.

## నిత్యతనియన్

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।

యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

ఈశ్లోకవ్యాఖ్యను గ్రంథప్రారంభంలోనే గమనించవచ్చు.

## వాழ్రిత్తిరునామమ్

1. ఇప్పువియిల్ అరఙ్గేశర్క్కీడళిత్తాన్ వాழ్రియే

ఎழ్రిల్ తిరువాయ్మొழ్రిప్పిళ్ళై యిణైయడియోన్ వాழ్రియే

ఐప్పిశియిల్ తిరుమూలత్తవరిత్తాన్ వాழ్రియే

అరవరశప్పెరుఞ్జోది యనన్దనెన్నుమ్ వాழ్రియే

ఎప్పొழుదుమ్ శ్రీశైల మేత్తవన్దోన్ వాழ్రియే

ఏరారు మెతిరాశ రెన వుదిత్తాన్ వాழ్రియే

ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ తరిత్తాన్ వాழ్రియే

మూదరియ మణవాళమామునివన్ వాழ్రియే

ఇప్పువియిల్ = ఈభూమిలో, అరఙ్గేశర్క్కు = శ్రీరంగనాథునకు, ఈడు = తిరువాయ్ మొழ్రి ప్రబంధానికి నమ్బిళ్ళై కృపజేసిన ఈడు అనే వ్యాఖ్యను, అళిత్తాన్= అనుగ్ర హించిన వరవరమునులు, వాழ్రియే = వర్ధిల్లాలి, ఎழ్రిల్ = ప్రకాశించే, తిరువాయ్ మొழ్రిప్పిళ్ళై = తిరువాయ్మొழ్రిప్పిళ్ళై అనే ఆచార్యుల, ఇణై అడియోన్ = శ్రీపాదద్వంద్వాన్ని కలవారు, వాழ్రియే = వర్ధిల్లాలి, ఐప్పిశియిల్ = అల్పిశిమాసంలోని, తిరు మూలత్తిల్ = మూల అనే నక్షత్రంలో, అవతరిత్తాన్ = అవతరించినవారు, వాழ్రియే = వర్ధిల్లాలి, అరవు అరశ ప్పెరుమ్ శోది = సర్పాలకు ప్రభువు అయిన గొప్ప జ్యోతిస్స్వరూపుడు,

అనన్దన్ = అనంతుడు అయిన వరవరమునులు, ఎన్నుమ్ = ఎల్లప్పుడు, వాழ்ియే = వర్ధిల్లాలి, ఎప్పొழுదుమ్ = ఎల్లప్పుడూ, శ్రీశైలమ్ = శ్రీశైలమనబడే వేంకటాచలాన్ని, ఏత్త వన్దోన్ = స్తుతించడంకోసం వచ్చిన వరవరమునులు, వాழ்ియే = వర్ధిల్లాలి, ఏర్ ఆరుమ్ = సౌందర్యం నిండిన, ఎతిరాశర్= యతిరాజులే, ఎన = అని భావించేటట్లు, ఉదిత్తాన్ = అవతరించిన వరవరమునులు, వాழ்ియే = వర్ధిల్లాలి, ముప్పురి నూల్ = యజ్ఞోపవీతాన్ని, మణి వడముమ్ = తులసి, తామరపూసల మాలెలను, ముక్కోల్ = త్రిదండాన్ని, తరిత్తాన్ = ధరించిన వరవరమునులు, వాழ்ియే = వర్ధిల్లాలి, మూదు అరియ = సనాతనులైన, గొప్పవారైన, మణవాళమామునివన్ = మణవాళమహామునులు, వాழ்ియే = వర్ధిల్లాలి.

2. మున్నై మఱై త్తమిழ் విరిక్కుమ్ ముత్తిరై క్కై వాழ்ియే

మున్నూలుమ్ తిరుమార్బుమ్ ముక్కోలుమ్ వాழ்ియే

ఉన్దియు మొత్త తిరువరైయు ముడైయழகుమ్ వాழ்ియే

ఒరునాళుమ్ మఱక్కవొణ్ణా వొళిముఱువల్ వాழ்ియే

శిన్దై తిరైక్కొణ్డరుళుమ్ తిరుమేని వాழ்ియే

శెழுఙ్కరుణై కుడియిరుక్కుమ్ తిరునయనమ్ వాழ்ియే

వన్దరుళి యెన్నై ఎడుత్త మలర్త్తాళ్గళ్ వాழ்ియే

మణవాళమామునివన్ వాయ్క్కిన్బన్ వాழ்ియే

మున్నై మఱై = ప్రాచీనమైన సంస్కృతవేదాన్ని, తమిழ் = ద్రావిడవేదాన్ని, విరిక్కుమ్ = వ్యాఖ్యానించే, ముత్తిరై క్కై = వ్యాఖ్యానముద్రను కల వరవరమునుల శ్రీహస్తం, వాழ்ియే= వర్ధిల్లాలి, మున్నూలుమ్ = (వరవరమునుల)యజ్ఞోపవీతం, తిరు మార్బుమ్= అందమైన వక్షఃస్థలం, ముక్కోలుమ్ = త్రిదండం, వాழ்ియే = వర్ధిల్లాలి, ఉన్దియుమ్= నాభి, ఒత్త = దానికి తగిన, తిరు వరైయుమ్ = అందమైన నడుము, ఉడై = కాషాయంయొక్క, అழகుమ్ = అందం, వాழ்ియే = వర్ధిల్లాలి, ఒరు నాళుమ్ = ఏనాడూ, మఱక్క ఒణ్ణా = మఱువలేని, ముఱువల్ = చిఱునవ్వు, వాழ்ియే = వర్ధిల్లాలి, శిన్దై = మనస్సుయొక్క, తిరై కొణ్డు = తెరను తీసి, అరుళుమ్= అనుగ్రహించే, తిరుమేని = దివ్యమంగళరూపం, వాழ்ియే = వర్ధిల్లాలి, శెழுమ్ = నిబిడమైన, కరుణై = కరుణ, కుడి ఇరుక్కుమ్ = నివాసం ఉండే, తిరు నయనమ్ = తిరునేత్రాలు, వాழ்ియే = వర్ధిల్లాలి, వన్దరుళి = నాదగ్గరకు వచ్చి, ఎన్నై = నన్ను, ఎడుత్త = ఉద్ధరించిన, మలర్ త్తాళ్గళ్ = తామరపూలవంటి శ్రీపాదాలు, వాழ்ియే = వర్ధిల్లాలి, వాయ్క్కు ఇన్బన్ = వాక్కుకు ఆనందాన్ని కల్గించే, మణవాళమామునివన్ = వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి.

3. తినైప్పొழுదుమ్ తన్నై మఱవా చ్చిన్దైతన్దాన్ వాழ்ియే

శీర్ తిరువాయ్మొழிప్పిళ్ళై తిరువడియోన్ వాழ்ియే

నినైప్పోర్కళ్ పిఱవినై నీక్కుమవన్ వాళియే

నీళ్పువియిల్ తన్ పుకళై నిఱుత్తినాన్ వాళియే

అనైత్తాళ్వార్కలైప్పొరుళై ఆయ్న్దురైప్పోన్ వాళియే

అళకారు మెతిరాశర్కన్బుడైయోన్ వాళియే

ఎనైప్పోలుమ్ పావియర్కట్కిరఙ్గుమవన్ వాళియే

ఎన్నప్పన్ మణవాళమామునివన్ వాళియే

తినై ప్పొళుదుమ్ = క్షణకాలం కూడా, తనై = తనను, మఱవా = మఱువని, శిన్దై = మనస్సును, తన్దాన్ = అనుగ్రహించిన వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి, శీర్ = కల్యాణగుణాలను కల, తిరువాయ్మొళిప్పిళ్ళై= తిరువాయ్మొళిప్పిళ్ళైయొక్క, తిరు అడియోన్ = శ్రీపాదాలను ఆశ్రయించిన వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి, నినైప్పోర్కళ్ = తమను ధ్యానించే వారి, పిఱవితనై = జన్మను, నీక్కుమవన్ = లేకుండాచేసే వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి, నీళ్ పువియిల్ = విశాలమైన భూమండలంలో, తన్ పుకళై = తన కీర్తిని, నిఱుత్తినాన్ = స్థిరంగా నిలిపిన వరవరమునులు, వాళియే= వర్ధిల్లాలి, అనైత్తు ఆళ్వార్కళ్ = అందఱు ఆళ్వార్ల, కలై ప్పొరుళై = శాస్త్రాల (దివ్యప్రబంధాల) పొరుళై = అర్థాన్ని, ఆయ్న్దు = విచారించి, ఉరైప్పోన్ = వ్యాఖ్యానించే వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి, అళకు ఆరుమ్ = సౌందర్యం నిండిన, ఎతిరాశర్కు = యతిరాజుల విషయంలో, అన్బు ఉడైయోన్ = భక్తిని కల వరవరమునులు, వాళియే = వర్ధిల్లాలి, ఎనైప్పోలుమ్ = నావంటి, పావియర్ కట్కు = పాపులకు, ఇరఙ్గుమవన్ = దయచూపే వరవరమునులు, వాళియే= వర్ధిల్లాలి, ఎన్ అప్పన్ = నాతండ్రి అయిన, మణవాళమామునివన్ = మణవాళమహా మునులు, వాళియే = వర్ధిల్లాలి.

## తిరునాళ్పాట్టు

శెన్దమిళ్ వేదియర్ శిన్దై తెళిన్దు శిఱన్దు మకిళ్న్దిడునాళ్

శీరులకారియర్ శెయ్దరుళ్ నఱ్కలై తేశు పొలిన్దిడునాళ్

మన్దమది ప్పువి మానిడర్తఙ్గళై వానిలుయర్త్తిడునాళ్

మాశఱు ఞానియర్శే రెతిశాశర్తమ్ వాళ్వు ముళైత్తిడునాళ్

కన్దమలర్ పొళిల్ శూళ్ కురుకాదిపన్ కలైకళ్ విళఙ్గిడునాళ్

కారమర్మేని యరఙ్గర్కు ఇడైకణ్కళ్ కళిత్తిడునాళ్

అన్దమిల్ శీర్ మణవాళముని ప్పరనవతారమ్ శెయ్దిడునాళ్

అళకు తికళ్న్దిడుమైప్పిశియిల్ తిరుమూలమదనైనాళే

శెమ్ తమిళ్ వేదియర్ = ఋజువైన, అందమైన ద్రావిడవేదాన్ని తెలిసిన పండితుల, శిన్దై= మనస్సు, తెళిన్దు = తేటపడి, శిఱన్దు= గొప్పతనాన్ని పొంది, మకిళ్న్దిడునాళ్ = ఆనందించే సుదినం,

శీర్ ఉలకారియర్ = కల్యాణగుణగరిష్ఠులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, అరుళ్ శెయ్‌ద = అనుగ్రహించిన, నల్ కలై = గొప్ప శాస్త్రం అయిన శ్రీవచనభూషణంయొక్క, తేశు = తేజస్సు, పొలిన్దిడునాళ్ = వర్ధిల్లే సుదినం, మన్ద మది = మందమతులైన, పువి= భూమిలోని, మానిడర్‌తజ్గళై = మానవులను, వానిల్ = పరమపదంలోనికి, ఉయర్‌త్తిడునాళ్= ఉద్ధరించే సుదినం, మాశు అఱు = దోషం లేని, ఞానియర్= జ్ఞానులు, శేర్ = ఆశ్రయించే, ఎతిరాశర్‌తమ్ = యతిరాజుల, వాழ்వు = ఉజ్జీవనం, ముళైత్తిడునాళ్ = అంకురించే సుదినం, కన్ద మలర్ = సుగంధాన్ని కలిగిన పూలను కల, పొழிల్ = తోటలు, శూழ் = చుట్టి ఉండే, కురుకు = కురుకాపురికి (ఆழ்వార్‌తిరునగరికి), అదిపన్ = ప్రభువు అయిన నమ్మాழ்వార్ల, కలైకళ్ = శాస్త్రాలు (ప్రబంధాలు), విళజ్గిడునాళ్ = వెలిగే సుదినం, కార్ అమర్ మేని =మేఘంవంటి మేనిని కల, అరజ్గక్కోనై = శ్రీరంగనాథుని, కణ్‌గళ్= తిరునేత్రాలు, కళిత్తిడునాళ్ = సంతోషించే సుదినం, అన్దమ్ ఇల్ = అంతులేని, శీర్= మహిమను, (కల్యాణగుణాలను) కల, పరన్ = సర్వోత్కృష్టులైన, మణవాళముని= మణవాళమహాముని, అవతారమ్ శెయ్‌దిడునాళ్ = అవతరించిన సుదినం, ఏది? అని అంటే, అழகు = అందం, శోభ, తికழ்న్దిడుమ్ = ప్రకాశించే, ఐప్పిశియిల్ = అల్పిశి మాసంలోని, తిరుమూలమ్ అదనైనాళే = అందమైన మూల అనే నక్షత్రమే.

**వాழ் తిరువాయ్‌మొழிప్పిళ్ళై మాతకవాల్**
**వాழுమ్ మణవాళమామునివన్- వాழிయవన్**
**మాఱన్ తిరువాయ్‌మొழி ప్పొరుళై మానిలత్తోర్**
**తేఱుమ్బడి యురైక్కుమ్ శీర్**

తిరువాయ్‌మొழிప్పిళ్ళై గొప్ప దయవల్ల ఉజ్జీవించే మణవాళమామునులకు మంగళం. తిరువాయ్‌మొழி ప్రబంధం దివ్యార్థాన్ని ఈలోకంలోనివారంతా స్పష్టంగా తెలిసేటట్లు వివరించే వారి గొప్పతనానికి మంగళం.

**అడియార్‌కళ్ వాழ యరజ్గనకర్ వాழ**
**శడకోపన్‌తణ్డమిழ்నూల్ వాழ - కడల్‌శూழ்న్ద**
**మణ్ణులకమ్ వాழ మణవాళమామునియే**
**ఇన్నుమొరు నూற்ఱాణ్డిరుమ్**

దాసులు ఉజ్జీవించేటట్లు, శ్రీరంగనగరం ఉజ్జీవించేటట్లు, శఠకోపులు అనుగ్రహించిన చల్లని ద్రావిడవేదం ఉజ్జీవించేటట్లు, సముద్రపరివేష్ఠితం అయిన భూలోకం అంతా ఉజ్జీవించేటట్లు ఓ మణవాళమహామునీ! ఇంకా ఒక నూఱేండ్లు వేంచేసి ఉండండి.



# విజ్ఞాపనం కించిత్

శఠరిపురేక ఏవ కమలాపతిదివ్యకవిః
మధురకవిర్యథా చ శఠజిన్మునిముఖ్యకవిః ।
యతికులపుంగవస్య భువి రంగసుధాకవిరాట్
వరవరయోగినో వరదరాజకవి శ్చ తథా ॥

శ్రీవరవరముని శతకమనే చరమపర్వనిష్ఠాప్రతిపాదకమైన ఈస్తుతిని దేవరాజగురువు అని, ఎఱుమ్బియప్పా అని శ్రీవైష్ణవసంప్రదాయంలో ప్రసిద్ధులైన ఆచార్యవర్యులు రచించారు. వీరు, శ్రీవరవరమునుల శిష్యులలో అష్టదిగ్గజాలనే పేరుతో ప్రసిద్ధి చెందిన ఎనిమిదిమంది శిష్యులలో ఒకరు. వీరి అభిజనం చోళసింహపురక్షేత్రానికి (షోళింగర్) సమీపంలోని ఎఱుమ్బి అనే అగ్రహారం. సర్వశాస్త్రాలలో సాటిలేని పాండిత్యాన్ని కల వీరు, ఒక పర్యాయం శ్రీరంగానికి రంంగనాథుని సేవకోసం వచ్చినపుడు, వీరిని తమ మఠంలో భుజించమని శ్రీవరవరమునులు ఆహ్వానించారు. యత్యన్నాన్ని భుజించరాదనే సామాన్యశాస్త్రవిధిని దృష్టిలో పెట్టుకొని, దేవరాజగురువు అందుకు అంగీకరించకుండా తమ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు. సాక్షాత్తు లక్ష్మణుల అపరావతారమైన వరవరమునుల విషయంలో దేవరాజగురువు ఈ విధంగా అపచారపడినందున, వారిపట్ల వారి అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రుడు చాలా కోపించాడు. ఎఱుమ్బియప్పా తిరువారాధనకోసం ఆరాధన గృహకవాటాలను తెరవాలని ఎంత యత్నించినా అవి తెరుచుకోలేదు. కారణం తెలియక మనస్సులో మథనపడే దేవరాజగురువుకు శ్రీరాముడు కలలో కన్పించి, వరవరమునులపట్ల వారు చేసిన అపచారానికి బదులుగా శ్రీరంగానికి వెళ్ళి, వరవరమునులను క్షమను అర్థించి, వారి సంబంధాన్ని పొందివస్తేగాని, తాను వారి ఆరాధనను స్వీకరించనని అన్నాడు. దేవరాజగురువు తమ తప్పిదానికి చాలా వగచి, వెంటనే శ్రీరంగానికి వెళ్ళారు. అక్కడ, అప్పటికే వరవరమునులకు ప్రియశిష్యులైన కోయిల్కన్దాడై అణ్ణన్ పురుషకారంతో శ్రీవరవరమునుల సన్నిధిని చేరి, క్షమను అర్థించి, వారికి శిష్యులయ్యారు. ఆనాటినుండి దేవరాజగురువు శ్రీవరవరమునులకు ప్రియశిష్యులై, వారిపట్ల అత్యంతభక్తి ప్రపత్తులతో వర్తించారు. శ్రీవరవరమునుల అవతారసమాప్తిని విన్న దేవరాజగురువు శోకిస్తూ పల్కిన ఈక్రింది శ్లోకాలు వారి ఆచార్యభక్త్యతిశయాన్ని తెలుపుతున్నాయి. "వరవరమునిరేవ పతిర్మే తత్పదయుగమేవ శరణ మనురూపం, తస్యైవ చరణయుగళీ పరిచరణం ప్రాప్యమితి నను ప్రాప్తమ్", "వపురపి సపది మదీయం వరవరమునివర్య మోచనీయమిదమ్, పరిచరతి న హి భగవంతం భగవన్న హి భగవదభిమతానపి వా", "ఇతి పునరేషవిదన్నపి దురితరతిః దూరనిమ్నపదరూఢః, వరవరమునివరకరుణాం నిఘ్నన్ బత నృపశు రశ్నుతే నియమాన్", "జగతా మయ ముదయం విలయమపి భజన్ భానుః, మయి పునరిదం నృంశసో వరవరమునివర్య వర్ధయత్యేవ", "తదితః పరమనురూపం న విళంబితు మితి చింతయన్ దయయా, మలభాజనాదితో మాం వరవరమునివర్య మోచయ త్వరితమ్" అనేవి ఆ శ్లోకాలు.

ఎఱుమ్బియప్పా శ్రీవరవరమునుల విషయంగా శ్రీవరవరముని శతకం, వరవరముని దినచర్యా, వరవరముని కావ్యం, వరవరముని చంపూ, వరవరముని మంగళాశాసనమ్, వరవరముని ఆర్తిప్రబంధం, వరవరమున్యష్టకమ్ - ఇత్యాది పలుగ్రంథాలను రచించి తమ ఆచార్యభక్తిని వ్యక్తం చేశారు. ఇంతేకాక, భాష్యకార మంగళాశాసనమ్, రామానుజాష్టకమ్, ప్రార్థనాపంచకమ్, లోకార్యవింశతి, బుద్ధిస్తవం, సన్మార్గదర్పణం, విలక్షణమోక్షాధికార నిర్ణయమ్, లక్ష్మీపరిణయనాటకమ్, వరదరాజమంగళాశాసనమ్, చరమగురునిర్ణయమ్ - ఇత్యాదిగా ఎన్నో కృతులను రచించారు. వీరికి **"అழகియమణవాళదాసర్"** అని కూడా పేరున్నట్లు యతీంద్రప్రవణ ప్రభావ మనే గ్రంథంవల్ల తెలుస్తున్నది.

ఈ వరవరమునిశతకం మొదట, చివరగల కొన్ని శ్లోకాలు తప్ప మిగిలిన శ్లోకాలన్నీ మందాక్రాంతా వృత్తంలో రంచిబద్ధాయి. మందాక్రాంత వృత్తం మనస్సులోని ఆర్తిని వ్యక్తీకరించడానికి అనువైనది. కాళిదాసు మేఘసందేశ కావ్యాన్ని ఈవృత్తంలోనే రచించడం ఇందుకు ఒక ఉదాహరణం. ఈ స్తుతిలోని రచన చాలా సరళంగా, చిన్న చిన్న పదాల పొందికతో, గంభీరమైన అర్థస్ఫురణతో పాఠకుల హృదయాలను సద్యః రంజింపచేస్తుంది. ఈ శతకంలో ఎఱుమ్బియప్పా తనకు సంబంధించిన, శ్రీవరవరమునులు తమను అనుగ్రహించిన ఐతిహ్యాలను కూడా కొన్ని శ్లోకాలలో ప్రస్తావించారు. దీనికి **24, 25** శ్లోకాలు ఉదాహరణాలు. వ్యాఖ్యాత కూడా **"ఇదం చ సంప్రదాయతోఽవగంతవ్యమ్"** అని సూచించారు. సాంప్రదాయిక విషయాలను కూడా కవి ఇందులో ప్రస్తావించడం విశేషం. శ్రీరంగంలో రంగనాథస్వామి ఆలయాలనికి చూట్టూ ఉండే కోవెలల సేవాక్రమాన్ని **"దేవీ గోదా"** ఇత్యాది **50**వ శ్లోకం తెల్పుతున్నది. నిత్యం అనుష్ఠానంలో ఆచార్య శ్రీచరణముద్రాంకిత వస్త్రాన్ని (తిరువడివస్త్రాన్ని) ధరించే క్రమం **51**వ శ్లోకంలో ప్రస్తావింపబడింది. ఈవిధంగా ఈస్తుతిలో ఎన్నో అపూర్వమైన అంశాలు గోచరిస్తాయి.

ఈ శతకంలోని పలు శ్లోకాలు శ్రీరామాయణంలోని రహస్యార్థాలను, దివ్యప్రబంధపాశురాల పోకడలను, శ్రీవచనభూషణ, రహస్యత్రయాది గ్రంథాలలోని మధురార్థాలను వ్యక్తం చేస్తున్నవి. దీనికి ఆరంభంలోని **"గుణమణినిధయే"** అనే **(2)** శ్లోకం ఉదాహరణం. **"అయం చ మూలమంత్రార్థ చ్ఛాయాను కారిశ్లోకః"** అని వీరరాఘవాచార్యస్వామివారు ఈ విశేషాన్ని వ్యాఖ్యారంభంలోనే తెలిపారు. తిరువాయ్ మొழிలో ప్రథమపర్వాత్మకంగా పలుదశకాలలో అనుసంధింపబడిన అర్థవిశేషాలు శ్రీవరవరమునిపరంగా అనుసంధింపబడిన క్రమం ఆయా శ్లోకవ్యాఖ్యాన సందర్భంలో సూచింపబడ్డాయి. విస్తరభీతివల్ల ఇక్కడ మళ్ళీ ప్రస్తావించడంలేదు. అదే విధంగా, శ్రీరామాయణార్థాలు కూడా పదేపదే ఈస్తుతిలో గోచరిస్తాయి. ముఖ్యంగా ఒక్క విషయం మాత్రం ప్రస్తావించబడుతున్నది.

దేవరాజగురువు ఈ వరవరముని శతకాన్ని రచించడంలో ఒక విలక్షణమైన ఉద్దేశ్యం ఉన్నదని సాంప్రదాయిక వివరణం. ప్రథమపర్వాత్మకమైన తిరువాయ్మొழி ప్రబంధంలోని సారమైన అర్థం భాగవతశేషత్వ, పారతంత్ర్య ప్రతిపాదకాలైన **"పయిలుమ్ శుడరొళి" (3-7), "నెడుమాఱ్కడిమై" (8-10)** అనే దశకాలలో నిక్షిప్తమైనదని, అందువల్లనే చరమపర్వనిష్ఠులకు సైతం తిరువాయ్మొழி ప్రబంధం ఉపాదేయమైనదని పెద్దల సూక్తి. ఈ ఉద్దేశ్యంతోనే శ్రీవరవరమునులు తిరువాయ్మొழி

ప్రబంధ ప్రమేయాన్ని ప్రపన్నజనకూటస్థులు, పరమభాగవతులైన నమ్మాళ్వార్ల పరంగా అన్వయిస్తూ, తిరువాయ్‌మొళ్ళి నూత్తన్దాదిని రచించారని కూడా పెద్దలు వచిస్తారు.

తిరువాయ్‌మొళ్ళి శ్రీరామాయణ రహస్యార్థ ప్రతిపాదకమనే సంగతిని మనపూర్వాచార్యులు తిరువాయ్‌మొళ్ళి ప్రబంధపాశురాలను వ్యాఖ్యానించేటపుడు ప్రచురంగా పదే పదే శ్రీరామాయణ శ్లోకాలను ప్రమాణీకరించడం ద్వారా నిరూపించారు. తిరువాయ్‌మొళ్ళి ప్రబంధాన్ని చరమపర్వాత్మకంగా అన్వయించి పల్కినట్లే, ఎఱుమియప్పా కూడా శ్రీరామాయణంలో ఇమిడి ఉండే చరమపర్వనిష్ఠా ప్రతిపాదకాలైన విశేషార్థాలను ఈ శతకంలో లక్ష్మణుల వేఱొక అవతారమైన శ్రీవరవరమునుల పరంగా అన్వయించి పల్కి, తద్వారా చరమపర్వనిష్ఠులకు సైతం శ్రీరామాయణం పరమోపాదేయం, పరమప్రమాణమనే సంగతిని నిరూపించారు. అందువల్లనే దేవరాజగురువు ఈ శతకంలో 82 శ్లోకంనుండి 97వ శ్లోకం వరకు వరుసగా 10 శ్లోకాలలో లక్ష్మణుని వైభవాన్ని శ్రీవరవరమునులకు సమన్వయించి పలికారు. తిరువాయ్‌మొళ్ళి ప్రబంధంలో రెండు భాగవతవైభవ ప్రతిపాదక దశకాలున్నట్లే, ఇక్కడ కూడా శ్రీవరవరమునులను సౌమిత్రి పర్యాయరూపులుగా నిరూపించే దశకం గ్రథితమైనది. ఈ సాంప్రదాయిక రహస్యాన్ని శ్రీవాధూలవీరరాఘవాచార్య స్వామివారు 92వ శ్లోక వ్యాఖ్యలో విశదం చేశారు కూడా.

శ్రీరామాయణం **"రఘువరచరితమ్", "సీతాయా శ్చరితమ్ మహత్"** అనే రీతిలో భగవద్వైభవాన్ని, పురుషకారవైభవాన్ని తెలియజేస్తున్నదనే విషయం ప్రసిద్ధం. శ్రీరామాయణం **"శిఱైయిరున్దవళ్ ఏత్తమ్ శొల్లుకిఱదు"** అనేది శ్రీవచనభూషణ దివ్యసూక్తి. ఇదే విధంగా శ్రీరామాయణం **"సౌమిత్రిర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ"** అనే రీతిలో సౌమిత్రిరూపులైన శ్రీవరవరమునుల వైభవ ప్రతిపాదకం కూడా. ఈ విషయాన్ని వాల్మీకి భగవానులే ద్వయంగా శ్రీరామాయణంలోని అనుక్రమణికాసర్గలో **"రామలక్ష్మణసీతాభిః"** అని ముగ్గురి నామాలను కలిపి పల్కడం ద్వారా తెలిపారని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్య. లేకపోతే, వరవరమునివైభవప్రతిపాదకమైన ఈశతకంలో శ్రీరామాయణంలోని లక్ష్మణుని వైభవాన్ని ప్రస్తావించడంలో విషయసంగతి లేదుకదా! - అనికూడా వారి వివరణం.

**"ఏవం - భుంక్తే నైవ - ఇత్యారభ్య పూర్వశ్లోకపర్యంతేన సందర్భేణ రామాయణే సప్తానా మపి శ్లోకానా మర్థాః క్రమేణ అనుసంహితాః. చరమప్రధానేఽస్మిన్ శతకే తదనుసంధానం చరమపర్వనిష్ఠైః శ్రీరామాయణస్యోపాదేయతానిబంధనమ్. చరమశేషిరూప వరవరమునివరాభిన్నసౌమిత్రి ప్రతిపాదకత్వమితి వ్యంజనార్థమ్. అన్యథా చరమపర్వప్రవణస్య కర్తుః తదనుసంధానాసంగతేః. అత ఏవ కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" ఇత్యుక్తరీత్యా శ్రీరామాయణప్రధాన ప్రతిపిపాదయిషితా యా అపి సీతాయాః పూర్వం రామలక్ష్మణసీతాభిః ఇత్యానుక్రమణికాసర్గే సౌమిత్రి నిర్దేశకృత ఇతి ధ్యేయమ్"** అనే సూక్తి స్మరణీయం.

ఇక్కడ ఇంకో విషయంకూడా ధ్యేయం. మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ కాంచీ అణ్ణంగరాచార్య స్వామివారు **"సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా"** ఇత్యాది శ్రుతిని తిరువాయ్‌మొళ్ళి

ప్రబంధపరంగా వ్యాఖ్యానిస్తూ **"సహస్రపరమా"** శబ్దం సహస్రగాథాత్మకమైన తిరువాయ్‌మొழிని, **"శతమూలా"** శబ్దం, ఆప్రబంధానికి సంగ్రహరూపమైన తిరువిరుత్తప్రబంధాన్ని, **"శతాంకురా"** అనే పదం, ఆప్రబంధసారమైన ఇరామానుశనూ**ఱ్ఱ**న్దాది ప్రబంధాన్ని సూచిస్తున్నదని తెలిపారు. అందువల్ల భగవద్విషయ ప్రతిపాదకమైన తిరువాయ్‌మొழி ప్రబంధంలోని అంతిమతాత్పర్యం ఆచార్యవైభవ ప్రతిపాదకమని తెలుస్తున్నది. ఆవిధంగానే, భగవద్వైభవ ప్రతిపాదకమైన శ్రీరామాయణంలో కూడా తాత్పర్యార్థం శ్రీవరవరమునుల పూర్వరూపమైన లక్ష్మణులనే ఆచార్యుల ప్రభావాన్ని ప్రతిపాదించడమేనని తెలుస్తున్నది కదా!

ఈ శతకాన్ని మహీసారపురాభిజనులు శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామివారనే ప్రసిద్ధ విద్వాంసులు సంస్కృతంలో అత్యంత మధురంగా వ్యాఖ్యానించారు. భగవద్రామానుజుల భాగినేయులు, వారి అంతరంగ శిష్యులలో ఒకరు, వాధూల గోత్రీయులు అయిన దాశరథి (ముదలియాణ్డాన్) అనే మహనీయుల వంశానికి చెందిన ఈ వాధూల వీరరాఘవాచార్య స్వామివారు కంచికి సమీపంలో నున్న తిరుమోశై అనే దివ్యక్షేత్రంలో క్రీ.శ. 1766వ సం. వ్యయవర్షం ఆణిమాసం కృష్ణచతుర్దశి ధనిష్ఠానక్షత్రంలో అవతరించారు. వీరు పితృపాదులు నరసింహాచార్యులవారు. వీరిది కోయిల్ కందాడైవంశం. యజుశ్శాఖ. ఆపస్తంబ సూత్రం 15సం॥లు నిండే సరికే సామాన్య శాస్త్రాలలో ఆరితేరారు. సంగీతంలోకూడా గొప్ప ప్రావీణ్యాన్ని సంపాదించారు. తండ్రిగారి వద్ద సంప్రదాయగ్రంథాధ్యయనాన్ని, సంస్కృతవేదాంతాన్ని వాధూలవరదాచార్యులవారు, శ్రీరంగాచార్యుల వారి సన్నిధిలో అధికరించారు. 51 సం॥లు ఈ విభూతిలో ఉన్న వీరు ముప్పయికి మించిన కృతులను వెలయించారు. వీరి శ్రీవచనభూషణ అరుబదం శ్రీవైష్ణవసంప్రదాయవిజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చు. వీరిచే రచింపబడిన కొన్ని కృతులు ఇంకా వెలుగు చూడవలసి ఉన్నవి. శ్రీరామానుజులవారిని స్తుతిస్తూ విరచించిన శ్రీరామానుజాతిమానుష స్తవం ఇందుకు ఒక ఉదాహరణం.

శ్రీవీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్యానం పరమహృద్యం. సహృదయ హృదయాలకు అపర్యాప్తామృతం. ఎన్నో సాంప్రదాయిక విశేషాలు ఈ స్తోత్రంలో ఇమిడి ఉండే రీతిని వ్యాఖ్యాత తమ వ్యాఖ్యలో అందంగా వివరించారు. దానికి పూర్వోక్తదిశలో రెండవశ్లోక వ్యాఖ్యామే చక్కని ఉదాహరణ. ఆ శ్లోకరచన మూలమంత్రార్థాన్ని అనుసరిస్తూ ఏవిధంగా రచింపబడిందో వివరించిన తీరు చాలా అందమైనది. అదేవిధంగా 78వ శ్లోకంలో కవి **"కేశవన్ తమర్‌కీழ் మేల్ ఎమరేలெழுపిఱప్పుమ్"** అని నమ్మాழ்வార్లు ఆశపడిన సప్తపర్వాత్మక శేషత్వాన్ని మించి, **"యస్సప్తపర్వవ్యవధానతుంగామ్"** అని దేశికోక్తరీతిలో భగవద్దివ్యపాదుకాభి లషితమైన అష్టపర్వాత్మక శేషత్వాన్ని మించి సదపర్వాత్మక శేషత్వాన్ని అభిలషించిన క్రమాన్ని వివరించారు. భగవద్విషయ వ్యాఖ్యానాలలో ప్రస్తావింపబడిన విశేషాలను కూడా వీరు తమ వ్యాఖ్యానంతో పొందుపరచడం విశేషం. భగవద్విషయం ఈడువ్యాఖ్యలో నమ్బిళ్ళై ప్రస్తావించిన భట్టర్‌కు సంబంధించిన ఐతిహ్యాన్ని వీరు 92వ శ్లోకంలోని **"జజ్ఞే భూయ స్త్వదను జగదానందనో నందసూనుః"** అనే సూక్తిని వివరిస్తూ **"రఘుపతిః దౌత్యకృష్ణావతారాంగీకృత - ఇతి కలిమథనసూక్తిప్రమాణక**

భట్టపరాశరశ్రీసూక్తిప్రదర్శక ద్రమిడోపనిషద్భాష్యా దవగంతవ్యమ్" అనేది ఒక ఉదాహరణ. ఆచార్యహృదయ శ్రీవచనభూషణ గ్రంథాదులలోని సూక్తులను కూడా వీరు ప్రమాణీకరిస్తూ వ్యాఖ్యానించడం కూడా గమనించవచ్చు. 63వ శ్లోక వ్యాఖ్యలో **"తదుక్తమ్ వివేకాన్యశేషత్వస్వాతంత్ర్యనివృత్తి పారతంత్ర్యాణి - ఇత్యాచార్యహృదయే"** అని ఆచార్యహృదయ సూక్తిని ప్రమాణంగా పలికారు. ఇటువంటి విశేషాలు ఎన్నో కన్పిస్తాయి. విస్తరభీత్యా విరమ్యతే.

చివరిగా శిఖరాయమాణమైన ఒక విషయాన్ని మాత్రం ప్రస్తావిస్తాను. ఈ స్తుతి చరమపర్వ నిష్ఠారూపమైన ఆచార్యాభిమాన వైభవ ప్రతిపాదకం అనేది స్పష్టం. సామాన్యంగా గ్రంథాలలో ప్రధాన ప్రమేయాన్ని ప్రారంభంలో, ప్రస్తావించి దానిని తరువాత వివరించి దానిని చివరలో అనుసంధించడం శాస్త్రప్రక్రియ. దేవరాజగురువు ప్రకృతస్తోత్రారంభాన్ని తమ ఆచార్యులైన శ్రీవరవరమునుల విషయంగా చేసే మంగళాశాసనంతో **"శ్రీమద్రంగం జయతు..... వరవరమునిః కల్పయన్ మంగళాని"** అనే 7వ శ్లోకంతో ఆరంభించారు. మళ్ళీ చివరలో కూడా 102వ శ్లోకంలో స్తోత్రనిగమనాన్ని చేస్తూ **"జయతు యశసా తుంగం వరవరమునిః శ్రీమాన్ రామానుజో జయతు క్షితౌ"** అని వరవరముని మంగళాశాసనంతో చేశారు. ఈ రెండు శ్లోకాలలో ప్రయోగింపబడిన శబ్దాలలోని అర్థైక్యాన్ని వీరరాఘవాచార్యస్వామివారు తమ వ్యాఖ్యలో సుస్పష్టం చేశారు. **"శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానమ్" ఇత్యాది స్తోత్రోపక్రమానుసారేణ, యతిపరతత్త్వవిదే నమో నమస్తే" ఇతి స్తోత్రోపోద్ఘాత క్రమానుసారేణ చ స్తోత్రం నిగమయతి"** అనే 102వ శ్లోకవ్యాఖ్యానావతారికలో వారు పల్కడం కూడా గమనించవచ్చు. 96వ శ్లోక వ్యాఖ్యానంలో కవికి వరవరమునులపట్ల కల్గిన పరభక్తి భావనను శ్రీరామాయణంలోని సీతాదేవికి కల్గిన స్థితితో పోలుస్తూ వివరించిన వైఖరి అత్యంత మధురం. ఇటువంటి ఎన్నో రస్యమైన వివరణలు ఇందులో అడుగడుగునా గోచరిస్తాయి. ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని ఆర్థికమైన అంతాదిక్రమాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై మొదలైన వ్యాఖ్యాతలు వివరించారు. ఆవిధంగానే ఈ శతకంలోని ఆర్థికమైన అంతాది క్రమాన్ని వ్యాఖ్యాత వివరించడం కూడా ఇంకొక అవధేయాంశం.

ఈ వ్యాఖ్యానం దేవనాగరిలిపిలో ఇప్పటికి సుమారు 109 సంవత్సరాలకు ముందు బొంబాయి నగరంలో శ్రీదేవరాజరామానుజదాసు ప్రోత్సాహంతో శ్రీకృష్ణదాసకుమారుడైన క్షేమరాజశ్రేష్ఠిద్వారా శ్రీవేంకటేశ్వర స్టీమ్ యంత్రాలయంలో ముద్రింపబడింది. తెనుగులిపిలో ఇంతవరకు ముద్రింపబడలేదు. పూర్వం ముద్రింపబడిన ఆ ప్రతులు కూడా దుర్లభాలు. మళ్ళీ ఇపుడు తెలుగులిపిలో, శ్రీవరవరమునుల దివ్యానుగ్రహంవల్ల, భాగవతామృతవర్షి, సహృదయశిరోమణులు, ఉ.వే.శ్రీమాన్ సాతులూరు **గోపాలకృష్ణమాచార్యస్వామివారి** ఆదేశ, ఆర్థిక సాహ్యాలవల్ల ముద్రింపబడడం ప్రపన్నజన సౌభాగ్యం. అని భావిస్తూ, దీనిని ప్రపన్నలోకం స్వీకరించి, ఆనందిస్తారని నమ్ముతున్నాను.

భాగవతవిధేయుడు

ఈ.ఏ. శింగరాచార్యులు

# విజ్ఞప్తి

1. శ్రీమాన్ వరవరమునిరాట్ సదా విశదవాక్శిఖామణి స్సోఽయమ్
ప్రథితం యన్మహిమానం చక్రే రంగనాయకః సాక్షాత్ ।

2. గంభీరార్థం శతక మతులం దేవరాజో మహాత్మా
రస్త్యైః పద్యైః వరవరమునేః స్తోత్రరూపం ప్రణిన్యే ।
తద్వ్యాచక్రే విబుధతిలకో రాఘవో వీరపూర్వః
వాధూలాగ్ర్యః సురుచిరగిరా దర్శయన్ తద్రహస్యమ్ ॥

3. క్వేయం దివ్యా వరవరమునేః సంస్తుతిః తత్త్వపూర్ణా
హంత! క్వేమాః మమ మితగిరః స్వల్పశక్తే స్తథాపి ।
సాద్గుణ్యం శ్రీవరవరమునేః ప్రేరయత్యద్భుతం మాం
సంతః! క్షామ్యం పరమకృపయా సాహసం మే భవద్భిః ॥

4. దేవరాజగురో ర్వాచాం గాంభీర్యం విదుషామపి ।
వాచామగోచరం తస్మాద్యత్నోఽసౌ సహసా కృతః ॥

5. అథాప్యాశ్రిత్య వాధూలవీరరాఘవసూరిణః ।
విశదాం వివృతిం రమ్యాం వివృణోమ్యాంధ్రభాషయా ॥

6. భాగవతామృతవర్షి శ్రీమద్గోపాలకృష్ణమార్యేభ్యః ।
కార్తజ్ఞ్యాంజలి రేభ్యో గ్రంథోఽయం యైః ప్రకాశ్యతాం నీతః ॥



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



శ్రీదేవరాజగురు (ఎఱుమ్బియప్పా) ప్రణీతమైన

# శ్రీవరవరమునిశతకం

## దేవరాజగురు తనియన్ శ్లోకం

సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజషట్పదమ్ ।
దేవరాజగురుం వందే దివ్యజ్ఞానప్రదం శుభమ్ ॥

శ్రీవరవరమునుల శ్రీచరణకమలాలలో సదా ఆసక్తమై ఉండే తుమ్మెద వంటివారు, చాలా గొప్ప జ్ఞానాన్ని ప్రసాదించేవారు, దోషాలను పోగొట్టేవారైన దేవరాజ గురువులను నమస్కరిస్తున్నాను.

**"సౌమ్యజామాతృయోగీంద్ర"** అనే ప్రయోగం ప్రకృత ప్రబంధ ప్రమేయసూచకం. ప్రథమపర్వంలో **"యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా"** అనే రీతిలో భగవానునితో నిత్యయోగాన్ని కల్గినవారు యోగులు. **"యతీంద్ర చరణద్వంద్వప్రవణేనైవ చేతసా"** అనే రీతిలో చరమపర్వంలో భగవద్రామానుజుల శ్రీచరణాలనే చిత్తంలో అనుసంధించేవారు యోగీంద్రులు - అనే అర్థస్వారస్యం సంభావ్యం. **"చరణాంబుజ"** అనే ప్రయోగం ద్వారా శ్రీవరవరమునుల శ్రీచరణాల ఎఱ్ఱదనం, సౌకుమార్యసౌగంధ్యాది గుణాలు, తద్ద్వారా భోగ్యత స్ఫురిస్తాయి. దేవరాజగురువులను షట్పదంగా రూపించడం చాలా యుక్తం. సదాచార్యుని షట్పదపదప్రయోగంతో తుమ్మెదగా నిర్దేశించడం వారు ద్వయమంత్రార్థనిష్ఠులై ఉండడాన్ని స్ఫురింప జేస్తుంది. ద్వయమంత్రం షట్పదమే కదా! ఆచార్యుని షట్పదంగా పల్కడంలో గల సామంజస్యం ఆచార్య హృదయ సద్గ్రంథ వ్యాఖ్యలో గమనించవచ్చు. ద్వయమంత్రార్థ పర్యవసానం చరమపర్వనిష్ఠయే కనుక, ప్రకృతంలో **"శ్రీమాన్ రామానుజార్యః పదకమలయుగం భాతి రమ్యం తదీయమ్"** అనే సూక్తి ప్రకారం శ్రీమన్నారాయణచరణస్థానీయులైన శ్రీరామానుజుల అపరావతారులైన శ్రీవరవరమునుల పాదపద్మ యుగంలో షట్పదమై ఉండడమంటే ద్వయమంత్రార్థ యాథాత్మ్యజ్ఞాననిష్ఠులై ఉండడమే. అందువల్ల ఇచటి షట్పదత్వం చరమపర్వాత్మకం. ఎఱుమ్బియప్పా దివ్యజ్ఞానాన్ని ప్రసాదించేవారు- అని అంటే- సకల వేదార్థసారమైన చరమపర్వనిష్ఠను తమ కృతులద్వారా అనుష్ఠానం ద్వారా ఉపదేశించేవారని తాత్పర్యం. ఎఱుమ్బియప్పా చరమపర్వనిష్ఠను ఆచరించడం శ్లోకంలోని పూర్వార్ధంలోను, దానిని ఇతరులకు ఉపదేశించడం ఉత్తరార్ధంలోను వ్యక్తమవుతున్నందున **"ఞానమనుట్టానమివై నన్ఱాకవే యుడైయనాన కురువై"** అనేరీతిలో వారి జ్ఞానానుష్ఠానపూర్ణత, ఆచార్యత్వపూర్తి సూచింపబడింది. **"ఆచారే స్థాపయత్యపి, స్వయమాచరతే"** - అని కదా ఆచార్యశబ్దనిరుక్తి. అదేవిధంగా పూర్వార్ధంలో శిష్యలక్షణపూర్తి, ఉత్తరార్ధంలో

ఆచార్యలక్షణపూర్తి తెలుపబడింది కూడా చెప్పవచ్చు. అందువల్ల వారి **"శ్రుతమతగురుచ్ఛాత్ర శీలైకధామ"**త్వం సూచితం. **"దివ్యజ్ఞానప్రదమ్"** అని అన్నందువల్ల ఇష్టప్రాప్తిని కల్గించేవారని, **"శుభమ్"** అని అన్నందువల్ల అనిష్టనివృత్తిని చేసేవారనే విశేషం వ్యంగ్యమర్యాదలో భాసిస్తున్నది. జ్ఞానమంటే - భగవానుడే ఉపాయమని, ఉపేయమనే ప్రథమ పర్వాత్మకమైన నిష్ఠను కల్గి ఉండడం. దివ్యజ్ఞానమంటే - ఈ నిష్ఠ ఆచార్యపరంగా చరమపర్వాత్మకంగా ఉండడం **"ఆచార్యాదిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే"** అనే రీతిలో పరదైవం ఆచార్యుడే అయినపుడు, ఆచార్యవిషయక మహావిశ్వాసం దివ్యజ్ఞానమే కదా! **"యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ"** అని అంటూ శ్వేతాశ్వతరీయ శ్రుతి చరమపర్వాత్మక జ్ఞానం దివ్యమని పల్కింది. **"శోభతే ఇతి శుభమ్, శు-పూజితం భాతి ఇతి శుభమ్"** అనే రెండు శుభశబ్దవ్యుత్పత్తులు ఇచట సార్థకాలు. మొదటి వ్యుత్పత్తిని పూర్వార్ధంలో, రెండవ వ్యుత్పత్తిని ఉత్తరార్ధంలో యథాయోగంగా అన్వయించుకోవచ్చు. ఇటువంటి ఆచార్యలక్షణపూర్తిని కల దేవరాజగురువులకు నమస్కరిస్తున్నానని తాత్పర్యం. **"తపః స్వాధ్యాయనిరతం తపస్వీ"** ఇత్యాది శ్లోకాలలో ఆచార్య, శిష్యలక్షణ నిరుక్తి తెలుపబడినా, అక్కడ ఆచార్యుడు, శిష్యుడు భిన్న భిన్న వ్యక్తులు. కాని, ప్రకృతశ్లోకంలో ఒకే వ్యక్తిని ఉద్దేశించి ఆచార్య లక్షణ నిరుక్తి నిర్దేశింపబడడం విశేషం.

## అవతారిక

శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడే తత్త్వహిత పురుషార్థరూపుడని భావించి, ఆ స్వామివిషయంలో స్థిరమైన విశ్వాసాన్ని కల్గినవారు ప్రథమపర్వనిష్ఠులు. ప్రథమపర్వం అంటే - తత్త్వహిత పురుషార్థాలనే మనం తెలియదగిన అంశాలు మూడు సర్వేశ్వరుడే- అనే ప్రతిపత్తిని కల్గి ఉండడం. ఆ సర్వేశ్వరుడే స్వయంగా **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** (జ్ఞాని అయితే నా ఆత్మయే - అని నా అభిప్రాయం) అని కదా గీతలో ఉపదేశించాడు. అదేవిధంగా **"మమ ప్రాణా హి పాండవాః"** (పాండవులు అయిదుగురు నా పంచప్రాణాలు కదా) అనికూడా భగవంతుడు అన్నాడు. **"అటివార్ ఉయిరానాయ్"** అని **"మయర్వఱ మదినలమ్"** కల్గిన ఆళ్వార్లు వచించారు. ఈవిధంగా జ్ఞానులు తనకు ఆత్మస్థానీయులని, ప్రాణస్థానీయులని భగవానుడే స్వయంగా పల్కడం వల్ల, దివ్యజ్ఞాన సంపన్నులైన దివ్యసూరులు నిశ్చయించి పల్కడం వల్ల జ్ఞానులైన భాగవతులే తత్త్వహితపురుషార్థరూపులని భావించి, వారి విషయంలో అటువంటి విశ్వాసాన్ని కల్గి ఉండడం మధ్యమ పర్వం. అందువల్ల మధ్యమపర్వం అంటే - తత్త్వహిత పురుషార్థాలు మూడు భాగవతులే - అనే విశ్వాసాన్ని పొంది ఉండడం.

**"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్ర పాణినా"** అనేరీతిలో, **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** అనేక్రమంలో శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు తన సర్వేశ్వరత్వాన్ని సైతం ఒక విషయంగా లెక్కించకుండా, ఆచార్యత్వాన్ని అభిలషించి, గ్రహించి తిరుమంత్రాన్ని, ద్వయాన్ని, శ్రీకృష్ణచరమశ్లోకాన్ని, శ్రీవరాహచరమశ్లోక, శ్రీరామచరమశ్లోకాలను ఉపదేశించినందువల్ల, ఆ సర్వేశ్వరుని ప్రీతికి విషయభూతులై, మహనీయులైన భాగవతులు తాము ఆచార్యభక్తులై, తమను ఆశ్రయించినవారిని తీసికొనిపోయి చేర్చడం స్వాచార్యసన్నిధిలోనే కావడంచేత,

ఇటువంటి భాగవతుల ప్రేమకు లక్ష్యభూతులైన ఆచార్యులే తత్త్వహిత పురుషార్థాలని భావించి, వారిపట్ల ఆ విశ్వాసాన్ని కల్గి ఉండడం చరమపర్వనిష్ఠ. కనుక, చరమపర్వం అంటే- తత్త్వహితపురుషార్థాలు మూడు ఆచార్యుడేననే నమ్మికను కల్గి ఉండడం.

ఇటువంటి చరమపర్వనిష్ఠను కల్గినవారిలో అగ్రేసరులైన దేవరాజగురువులనబడే ఎఱుమ్బియప్పా **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా"** (నారాయణుడనే పరమాత్మ స్వయంగా మానవరూపాన్ని పరిగ్రహించి, సంసారసముద్రంలో మునిగిన జీవులను కరుణతో శాస్త్రం అనే చేతిని అందించి ఉద్ధరిస్తున్నాడు) (జయాఖ్యసంహిత) అనే రీతిలో ఆచార్యుడు భగవానుని సాక్షాదవతారమే. ఈ ఆచార్యుడు - పరతంత్రశేషి - అంటే పరమాత్మాధీనమైన శేషిత్వాన్ని కలవాడు, విలక్షణజీవుని అధిష్ఠానంగా కలవాడైనా, ఏవిధమైన లోటు లేని ఉపాయమే కాక, **"సితాక్షీరన్యాయేన సంగమితాంగకమ్"** అనే రీతిలో ఖండశర్కరా క్షీరన్యాయంలో సహజంగా పాలు, చక్కెర మధురమైనవి అయినా, అవి కలిసినపుడు వాటి భోగ్యత బహుగుణీకృతం విలక్షణం అయేరీతిలో, పరతంత్రశేషిత్వ - విలక్షణజీవాధిష్ఠితత్వాలనే రెండిటి కలయిక వల్ల నృసింహరూపంవలె భోగ్యతాప్రకర్షతను, సౌలభ్యాతిశయంచేత పరమోపాదేయత్వాన్ని ఆచార్యరూపం కల్గి ఉన్నది. అటువంటి ఆచార్యుడే ఉపాయమని, ఉపేయమని నిశ్చయించుకొని, అటువంటి ఆచార్యత్వం **"తస్మిన్ రామానుజార్యే గురురితి చ పదం భాతి, నాన్యత్ర"** (ఆ రామానుజా చార్యులవారిలోనే గురువు అనే పదం ప్రకాశిస్తున్నది, వేఱొకరిలో ప్రకాశించడం లేదు.) అనే రీతిలో భగవద్రామానుజుల విషయంలో పూర్ణంగా ఉన్నదని అందఱిచేత అంగీకరింపబడ్డ విషయం కనుక, ఆ ఆచార్యులనే **"వేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱు అళిత్తఱ్కు ఆఱొన్ఱుమిల్లై మఱ్ఱచ్చరణన్ఱి"** అనే రీతిలో చరమోపాయంగా, చరమోపేయంగా నమ్మి, నిశ్చయించుకొని, **"యతీంద్రప్రవణులు"** అని పిలువబడడం వల్ల ఆ భగవద్రామానుజుల పట్ల ఊనికను నిండుగా కల్గి ఉండడంవల్ల కాని, వారితో ఉండే అవతార ప్రయుక్తమైన ఐక్యంవల్లకాని జ్ఞానశక్త్యాదులతో పూర్ణులైనవారు మణవాళ మహామునులు. వారిలో, శేషిత్వ-శరణ్యత్వ-ప్రాప్యత్వాలనే అష్టాక్షరీ మంత్రంలోని మూడు పదాల ద్వారా తెలియబడే మూడు ఆకారాలు ఉన్నాయని మనసార నమ్మి, ఆ భావనవల్ల వారి విషయంలో కల్గిన పూర్ణప్రతిపత్తి, పరమభక్తుల ప్రేరణ కారణంగాను, మనవంటి సంసారిజనుల క్లేశాలను తుడిచి వేయాలని సంకల్పించినందువల్లను ఈ **"శ్రీవరవరముని శతకమ్"** అనే సద్గ్రంథాన్ని రచించాలని దేవరాజగురువు ఆశపడ్డారు. మంత్రరాజమనబడే అష్టాక్షరిలోని మూడు పదాలు భగవద్విషయంలోని శేషిత్వ-శరణ్యత్వ-ప్రాప్యత్వాలు తెలుపుతున్నాయి. వీటి పర్యవసానభూమి **"నిన్‌తిరువెట్టెழுత్తుమ్ కఱ్ఱు నాన్ ఉఱ్ఱదు ఉన్ అడియార్క్కడిమై"** అనే రీతిలో చరమపర్వమే కనుక, ఆ మూడు ఇందులో చరమపర్వాత్మకంగా అనుసంధింపబడినందున, ఈస్తుతి అష్టాక్షరీ మంత్రార్థ పర్యవసాన ప్రతిపాదకం.

---

**1.** అవ :- స్తుతిలో, మొట్టమొదటగా కఱుమియప్పా శ్రీవరవరమునులను తాము ఆశ్రయించడంలో సహకరించడం వల్ల ఉపకారకాచార్యులైన కోయిల్‌కన్దాడై అణ్ణన్‌ను నమస్కరిస్తున్నారు. ఈ మొదటి శ్లోకంలో. **"భగవద్వందనం స్వాద్యం గురువందన పూర్వకమ్, క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి**

విశేషతః" (పాలు చక్కెరతో కలసినప్పుడు మిక్కిలి మధురంగా ఉండేటట్లే, భగవద్వందనం ఆచార్య వందన పురస్సరంగా ఉంటే అది మిక్కిలి మధురం అవుతుంది) అనే న్యాయం చరమపర్వాత్మంగా అనుసంధింపబడడం గమనార్హం. దేవరాజగురువులకు పరదైవం శ్రీవరవరమునులే అయినపుడు, వారి సన్నిధికి తమను చేర్చి పురుషకారం చేసినవారు వరదనారాయణ గురువులైనపుడు, పూర్వోక్తన్యాయం అన్వయించడంలో అడ్డులేదు కదా!

**వరవరమునివర్యపాదురత్నం**
**వరదగురుం గురు మాశ్రయే గురూణామ్ ।**
**ఉపనిషదుపగీత మర్థతత్త్వం**
**తదిహ యదీయవశంవదం సమింధే ॥**

ఉపనిషత్+ఉపగీతమ్ = ఉపనిషత్తులలో (కీర్తింపబడినది) ఉపదేశింపబడినది, తత్ = వైదిక లోకంలో ప్రసిద్ధమైనది అయిన, అర్థతత్త్వం = అర్థాలలో సత్యమైన, చరమపర్వాత్మకమైన అర్థం, ఇహ= ఈ లోకంలో, యదీయవశంవదం = ఏ కోయిల్ అణ్ణన్‌యొక్క శిష్యులకు వశమై, సమింధే = చక్కగా ప్రకాశిస్తున్నదో, వరవరమునివర్య పాదురత్నం = శ్రీవరవరమునులనే పేరును (అழகియమణవాళర్ - అనే పేరును) కల్గిన మునివర్యుల గొప్పదైన పాదుకల స్థానీయులు (పాదుకలవంటివారు), గురూణాం గురుమ్ = పలువురు ఆచార్యులకు (ఉపకారకత్వేన) ఆచార్యులు అయిన, తం వరదగురుం = ఆ వరదనారాయణ గురువులనే కోయిల్కన్దాడై అణ్ణన్‌ను, ఆశ్రయే = ఆశ్రయిస్తున్నాను.

చరమపర్వమైన ఆచార్యుడే శేషి, శరణం, ప్రాప్యం - అనే వేదతాత్పర్యం కోయిలణ్ణన్ శిష్యులచేత తెలియబడి, అనుష్ఠాన పర్యంతంగా ప్రకాశిస్తున్నదని శ్లోకసారం. శ్రీమణవాళ మహామునుల పాదుకా స్థానీయులన్నది కోయిలణ్ణన్‌యొక్క ప్రధానమైన, ప్రసిద్ధమైన నామం. వరదనారాయణులనే తిరునామం ఇక్కడ **"నామగ్రహణే నామైకదేశగ్రహణమ్"** (పేరును నిర్దేశించేటపుడు పేరులో కొంతభాగాన్ని గ్రహించడం) అనే న్యాయంతో వరదులని సంగ్రహింపబడింది. ఈ శ్లోకంతో - వరవరముని శతకమనే తమ కృతి ఏవిధమైన విఘ్నాలు లేకుండా పూర్తికావడంకోసం తమకు ఉపకారకాచార్యులైన కోయిలణ్ణన్‌ను ఎఱుమ్బియప్పా నమస్కరించి మంగళాచరణాన్ని చేశారు. **"మంగళాదీని మంగళమధ్యాని మంగళాం తానిచ శాస్త్రాణి ప్రథంతే"** అని కదా శాస్త్రవచనం.

**(వరవరమునివర్యపాదురత్నమ్) - "మననాత్ మునిః"** అని ముని అంటే మననం చేసేవాడు -అని అర్థం. "మననం చేహ విషయస్వాభావాత్ చరమస్వరూపోపాయోపేయవిషయకం జ్ఞేయమ్" అని సంస్కృతవ్యాఖ్య. అందువల్ల మునిశబ్దం ప్రకృత స్తుతి విషయానుగుణంగా చరమస్వరూప-ఉపాయ-ఉపేయపరంగా వ్యాఖ్యానింపబడింది. అటువంటి మునులలో గొప్పవారు శ్రీవరవరమునులు. వరదనారాయణులకు ఉన్న పలు నామాలలో వరవరమునివర్య పాదురత్నమనేది అత్యంతం స్వరూపాను గుణం కనుక, అది మొదటి నామంగా స్వీకరింపబడిందని తెలుపడంకోసం ఈ విశేషణం ముందుగా

ప్రస్తావింపబడింది. లేక, ఎఱుమ్బియప్పా శ్రీవరవరమునులను ఆశ్రయించడంలో పురుషకారాన్ని చేసినవారు అణ్ణన్ కనుక, ఆ ఉపకారస్మృతితో ముందుగా ఈ విశేషణం ప్రస్తావింపబడిందని అనవచ్చు. "రత్న"-శబ్దప్రయోగం చేత భగవద్రామానుజుల పాదుకాస్థానీయులైన దాశరథి అనబడే ఆచార్యుల కంటే వ్యావృత్తి సూచించబడడం ద్వారా శ్రీరామానుజుల పాదుకలకంటే తదీయపాదుకల యొక్క అభ్యర్హితత్వం (పూజనీయత్వం) కూడా సూచింపబడింది. "పాదు" అనే హ్రస్వాంతరూపం **"ఇకో హ్రస్వోஉ జ్యో గాలవస్య"** అనే సూత్రం ద్వారా సాధువు.

**(గురూణాం గురుమ్)** - సకలజగత్తుకు ఖ్యాతిలాభపూజాపేక్షలేకుండా కేవలం దయతో హితాన్ని ఉపదేశించేవారు గురువులు. **"గుశబ్ద స్త్వంధకార స్స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే"** అనే గురుశబ్ద నిర్వచనం ప్రసిద్ధం. "గృణాతి ధర్మాది, గిరత్యజ్ఞానమ్ వా" అనే గురుశబ్దవ్యుత్పత్తులు రెండిటినిబట్టి, "గృ-శబ్దే, గృ-నిగరణే" అనే రెండు ధాతువులవల్ల ఈ శబ్దం ఉత్పన్నమైనదని తెలుస్తున్నది. అంటే - అజ్ఞాననివర్తకుడు, తత్త్వజ్ఞానోపదేష్ట - గురువని వీటి తాత్పర్యం. **"నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి, సంభావయతి చాన్నేన స విప్రో గురు రుచ్యతే"** - నిషేకం - అంటే గర్భాధానం - మొదలైన సంస్కారాలను చేసి, అన్నం పెట్టి పోషించేవాడు గురువు అనబడతాడు. వీటిని చేసేవాడు తండ్రేకదా! తాత్త్వికంగా ఆలోచిస్తే, పంచసంస్కారాలను ప్రసాదించి, ఆత్మకు సత్తను కల్గించి, **"ఓవాత్తొழిల్ శార్ఙ్గన్ తొల్ శీరై నన్నెఞ్జే ఓవాద ఊణాక ఉణ్"** అనే నమ్మాழ్వార్ల సూక్తి క్రమంలో భగవద్గుణానుభవమనే అన్నాన్ని ప్రసాదించేవాడు ఆచార్యుడు. అతడే నిజమైన జన్మనిచ్చిన తండ్రి - అని చెప్పవలసి ఉన్నది. **"శరీరమేవ మాతాపితరౌ జనయతః", "స హి విద్యాత స్తం జనయతి తచ్ఛ్రేష్ఠం జన్మ"** ఇత్యాది వైదిక సూక్తులీపరమార్థాన్ని ప్రబోధిస్తున్నవి. ఈవిధంగా తత్త్వోపదేష్టలైన గురువులందఱిలో గొప్పవారని ప్రకృతతాత్పర్యం. లేక, **"గురూణామ్"** అనే పదానికి **"సకలజగద్ధితోప దేష్టౄణాం వరవరమునివర్యాణామ్"** అనే అర్థాన్ని చెప్పాలి. ఇక్కడ గురుశబ్దంపై వచ్చిన బహువచనం పూజార్థకం. ఆ వరవరమునులకు కూడా **"గురుమ్" - ఆచార్యవర్యమ్ - "మద్గురుం సంశ్రయ" - ఇతి వరవరమునివర్యేణ స్వేనైవోక్తేః. అయ మర్థ స్సంప్రదాయతోஉ వగంతవ్యః"** అనే అర్థవిశేషం శ్రీవాధూల వీరరాఘవాచార్య ప్రణీతమైన సంస్కృత వ్యాఖ్యానంలోని టిప్పణిలో సూచింపబడింది. దీనినిబట్టి గురుశబ్దవాచ్యులైన శ్రీవరవరమునులకుసైతం గురువులనే - గౌరవనీయులనే విశేషార్థం ఈ సూక్తి ద్వారా సూచింపబడింది. కోయిలణ్ణన్ స్తుతించే **"ఎక్కుణత్తోర్"** అనేక తనియన్ పాశురాన్ని, **"సకల వేదాంత"** ఇత్యాది తనియన్ శ్లోకాన్ని శ్రీవరవరమునులు అనుగ్రహించడం ప్రకృతంలో భావ్యం. అందువల్ల ఇక్కడ గురుశబ్దానికి గౌరవనీయులని తాత్పర్యం. **"గురూణామ్"** - అనే పదం శ్రీవరవరమునులకు సుచిస్తున్నదని భావించినపుడు బహువచనం గౌరవార్థకం. ఎఱుమ్బియప్పా, అణ్ణన్ మొదలైనవారిని సూచిస్తున్నదని భావిస్తే, బహుత్వ సూచకం. ఎఱుమ్బియప్పా, అణ్ణన్ మొదలైన పలువురు కోయిలణ్ణన్‌ను పురుషకారంగా చేసికొని వరవరమునులను ఆశ్రయించిన విషయం యతీంద్ర ప్రవణ ప్రభావాదులలో ప్రసిద్ధం. అపుడు రెండవ గురుశబ్దానికి ఉపకారకాచార్యులని అర్థం.

**(వరదగురుమ్)** - ఇక్కడి గురుశబ్దం తమకంటే గొప్పవారనే అభిప్రాయంతో ప్రయోగింపబడింది. **"అత్రత్యగురుశబ్దః స్వాపేక్షయా గురుత్వాభిప్రాయకః"** అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. **"సకలవేదాంత సారార్థ"** ఇత్యాది కోయిలణ్ణన్ తనియన్‌ను మణవాళమహామునులు అనుగ్రహించారని, అందులో **"మద్గురుమ్"** అనే విశేషణసాభిప్రాయకమని కొందఱి పెద్దల సూక్తి.

**(తత్)** - ప్రసిద్ధమైన - దుర్లభమైన - నిస్సమాభ్యధికమైన - అని భావం.

**(ఉపనిషదుపగీతమర్థమ్)** - ఛాందోగ్యోపనిషత్తు మొదలైన ఉపనిషత్తులు, భగవద్గీతాదులు ఇక్కడ ఉపనిషత్, గీతశబ్దాలచేత సూచింపబడ్డాయి. లేక, ద్రవిడోపనిషత్‌గా ప్రసిద్ధమైన తిరువాయ్‌మొ*ழ్ి* దివ్యప్రబంధం **"పయిలుమ్ శుడరొ*ழ్ి*", నెడుమాఱ్కడిమై"** ఇత్యాది దశకాలలో, తదంగస్థానీయమైన పెరియతిరుమొ*ழ్ి*లోని **"నణ్ణాద"** ఇత్యాది దశకాలలో, ఉపబృంహణరూపాలైన మిగిలిన ప్రబంధాలలోని **"తేట్టరుమ్", "మాఱాయ తానవనై"** ఇత్యాది దివ్యసూరి సూక్తులలో, భగవద్గీతలోని **"స మహాత్మా సుదుర్లభః"** ఇత్యాదులలో - అని భావం.

**(అర్థతత్త్వమ్)** - అర్థయాథాత్మ్యం - అని భావం. ఇది చరమపర్వాత్మకమే. తిరువాయ్‌మొ*ழ్ి* అర్థతత్త్వాన్ని శ్రీవరవరమునులు నమ్మా*ழ్*్వార్ల విషయంగా తిరువాయ్‌మొ*ழ్ి* నూ*ற్ற*న్దాదిగా రచించడం ప్రసిద్ధం.

**(యదీయవశంవదమ్)**- యదీయశబ్దం **"గురుణా యోఽభిమన్యేత"** అనే రీతిలో వరదనారాయణ గురువుల అభిమానానికి పాత్రులైనవారనే పరగత స్వీకారపరమైన అర్థాన్ని ఇస్తుంది. అటువంటివారు దేవరాజగురువులువంటివారే అనేది అర్థతః ధ్వనిస్తున్నది.

**(సమింధే)** - **"ఉపసర్గ - వర్తమాననిర్దేశాభ్యాం దీప్తే రద్యతనాస్మదాది పర్యంతాతి విషయత్వాపాదకా విచ్ఛేదావిచాల్యత్వాపాదకస్ఫోరకత్వే ఉచ్యేతే"** అని సంస్కృతవ్యాఖ్య. **"సమింధే"** అనే క్రియలోని **"సమ్"** అనే ఉపసర్గద్వారా, వర్తమాన నిర్దేశంద్వారా అర్థతత్త్వదీప్తి ఈనాటి వరకు పూర్తిగా, అవిచ్ఛేదంగా, కొనసాగి, అవిచాల్యంగా వర్తిస్తున్నదని స్ఫురిస్తున్నది. శ్లోకంలో తత్త్వపదప్రయోగసావల్ల ఉపనిషత్తులలో అర్థాంతరం కూడా ప్రతిపాదింపబడిందని తెలుస్తున్నది. ఆ అర్థాంతరం ప్రథమపర్వాదికమే కదా! **"భజేత్ సారతమం శాస్త్రమ్"** అనికదా సూక్తి.

**2.** అవ :- ఈ విధంగా స్వాచార్యవందనాన్ని ఆచరించిన తరువాత **"భగవద్వందనం స్వాద్యం గురువందన పూర్వకమ్, స్వదతే హి స్వయం క్షీరం శర్కరయా విశేషతః"** అనే రీతిలో ప్రాపకాచార్య ప్రణతిపూర్వకంగా ప్రాప్యులు, ఇష్టదేవతారూపులు అయిన శ్రీవరవరమునులయొక్క ప్రణామం అతిశయమైన ప్రీతిని కల్గిస్తుంది. కనుక, పూర్వం **"పాదురత్నమ్"** ఇత్యాదిగా ప్రాపకాచార్యులైన కోయిలణ్ణన్‌ను ప్రణమిల్లిన తరువాత ప్రాప్యనమస్కారాన్ని ఆచరిస్తున్నారు.

**గుణమణినిధయే నమో నమస్తే**<br>
**గురుకులధుర్య! నమో నమో నమస్తే।**

**వరవరమునయే నమో నమస్తే**
**యతివరతత్త్వవిదే నమో నమస్తే ॥**

(హే భగవన్ = ఓ పూజనీయా!), గుణమణినిధయే తే = సద్గుణాలనే రత్నాలకు నిధి అయిన మీకు, నమః నమః = పునః పునః నమస్కారం, గురుకులధుర్య = ఆచార్యకులం యొక్క భారాన్ని నిర్వహించే స్వామీ!, తే నమః నమః నమః తే = మాటిమాటికి నమస్కారం, వరవరమునయే = అழகియ మణవాళర్ - అనే పేరును కల్గి, భగవద్భాగవతాచార్యులనుగూర్చి సదా ధ్యానించే మునివరులైన, తే = మీకు, నమః నమః = నమస్కారం, యతివరతత్త్వవిదే తే = భగవద్రామానుజుల యథార్థతత్త్వాన్ని తెలిసినవారైన మీకు, నమః నమః = పునః పునః నమస్కారం.

యతివరుల తత్త్వం ఏమంటే - **"పేఱొన్ఱు మ*ற్ఱి*ల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱు మిల్లై మ*ற్ఱ*చ్చరణన్ఱి"** (శ్రీరామానుజా! నీచరణాలు తప్ప వేఱొక ప్రాప్యం లేదు. ఆ ప్రాప్యాన్ని అనుగ్రహించడానికి తగిన ఉపాయం మీ చరణాలు తప్ప ఇంకొకటి లేదు) అనే రీతిలో యతివరులైన భగవద్రామానుజులే ప్రాప్యం, ప్రాపకం - అనే యథార్థతత్త్వమే. ఒక్కొక్క పాదంలో ప్రయోగింపబడ్డ నమశ్శబ్దాలు ఆయా పాదాలలో చెప్పబడ్డ వరవరమునుల సద్గుణాలకు తాము జితులై, వారి విషయంలో చేసే నమస్కారం సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలలోను అనువర్తించాలనే ఆశను సూచిస్తాయి.

అష్టాక్షరీమంత్రానికి గల వాక్యార్థాన్ని రెండు విధాలుగా తెలుపుతూ ముముక్షుప్పడి అనే రహస్య గ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు - **"ఇతుతన్నిల్ శొల్లుకిఱ అర్థమ్ - స్వరూపముమ్, స్వరూపానురూప మాన ప్రాప్యముమ్; స్వరూపముమ్, ఉపాయముమ్, ఫలమెన్నవుమామ్"** అని రెండు యోజనలను పలికారు. దీనిని వివరిస్తూ - శ్రీవరవరమునులు ప్రణవ-నమస్సులతో స్వరూపం, నారాయణపదంతో ప్రాప్యం చెప్పబడిందని మొదట యోజనలోను, ప్రణవం ద్వారా శేషత్వం, నమస్సుద్వారా ఉపాయం, నారాయణపదం ద్వారా ఫలం చెప్పబడిందని రెండవ యోజనలోను తాత్పర్యమని పలికారు. ఈ క్రమాన్ని బట్టి ప్రకృతశ్లోకంలో మొదటి అన్వయానుసారం మొదటి పాదంలో రెండు నమశ్శబ్దాలు, రెండవ పాదంలో రెండవ అన్వయానుసారం మూడు నమశ్శబ్దాలు ప్రయోగింపబడ్డాయని శ్రీవాధూలవీరరాఘవాచార్య స్వామివారి రస్యవ్యాఖ్య. విశేషమేమంటే - అష్టాక్షరిలో వాక్యార్థంగా ముముక్షుప్పడిలో తెలుపబడ్డ రెండు యోజనలు భగవద్విషయకాలు - అంటే - ప్రథమపర్వానికి సంబంధించినవి కాగా, ప్రకృతంలో అవి చరమపర్వానికి అన్వయించి చెప్పబడ్డాయి. **"ఏవం చాస్య శ్లోకస్య పూర్వార్ధే ప్రథమపాదే నమఃశబ్దస్య ద్విరావృత్తిః ప్రథమయోజనాయాం స్వరూపపురుషార్థరూపస్థాన ద్వయాన్వయతాత్పర్యేణ; ద్వితీయ పాదే తస్య త్రిః ప్రయోగో ద్వితీయయోజనాయాం స్వరూప-ఉపాయ-ఫలాత్మక స్థానత్రయాన్వయ తాత్పర్యేణ"** అని వాధూలవీరరాఘవాచార్య వాఖ్య. ఇక్కడ **"నమః"** అని అంటూ నిషేధింపవలసిన **"అహం, మదీయమ్"** (నేను, నాది) అనే పదాలను ప్రయోగించకపోవడం ఎందుకంటే, అవి అర్థవశం చేత తెలియబడడంవల్ల, శబ్దతః వాటిని నిర్దేశించడం తమకు అభిమతం కాకపోవడంవల్ల ప్రయోగింపబడలేదు. శ్లోకంలోని మొదటి మూడు పాదాలలో వరుసగా - మొదటి పాదంలో స్వారసికులకు (భక్తులకు) ప్రేమను కల్గించే సద్గుణ విశేషమనే వైశిష్ట్యం, రెండవ పాదంలో దానివల్ల చెప్పబడిన ఆచార్యత్వపూర్తి - అనే వైశిష్ట్యాన్ని, మూడవ

పాదంలో ఈ రెండిటికి ఆశ్రయాలైన దివ్యమంగళ విగ్రహ-దివ్యాత్మస్వరూపాలు రెండూ ఉద్దేశ్యాలని సూచించడంకోసం అవి నిర్దేశింపబడ్డాయి. ఇవి అన్నీ ఉద్దేశ్యాలు కావడానికి మూలకారణం - శ్రీవరవర మునులు యతివరతత్త్వవిదులు కావడమేనని నాల్గవ పాదంలో సూచింపబడింది.

**(గుణమణినిధయే)** - **"తే"** - తే అనే పదప్రయోగస్వారస్యాన్నిబట్టి షాడ్గుణ్యపూర్తిని సూచించే **"భగవన్!"** అనే సంబోధనాంతపదాన్ని అధ్యాహరించుకోవాలి. ఇక్కడ గుణశబ్దం - ప్రకరణానుగుణంగా ఆశ్రయణోచితాలైన పరమకారుణికత్వ- నిరవధికవాత్సల్యజలధిత్వాదులను సూచిస్తుంది. వీటిని మణులుగా రూపించడంవల్ల వాటి అనన్యోపమత్వం, తేజిష్ఠత్వం, అనర్ఘత్వం, రసికరంజకత్వం, స్తోత్రార్హత్వం మొదలైన గుణాలు భాసిస్తాయి. **"మణ్యతే ఇతి మణిః, మణ - శబ్దే"** అనే మణిశబ్ద వ్యుత్పత్తి ఇక్కడ స్మరణీయం. నిధిశబ్ద ప్రయోగంద్వారా లోకంలో ఆభరణాలలోని మణులు గనులకు చెందినవై, ఆ గనులనుండే గ్రహించబడినవి అయినట్లే, లోకంలోని ఆచార్యులలో కన్పించే కారుణికత్వాదిసద్గుణాలు శ్రీవరవరముని సంబంధంవల్ల కల్గినవి, వీరివల్ల పొందినవేనని సూచింపబడింది. పూర్వం ప్రస్తావింపబడ్డ మొదటి యోజనానుసారం- ఇక్కడ **"మమ పురుషార్థః"** అనే పదాలను అధ్యాహారం చేసికోవాలి. ఓ భగవాన్! మీ కైంకర్యరూపమైన నా పురుషార్థం **"తనక్కేయాక ఎనై క్కొళ్ళుమ్"** (నీ కోసమే నన్ను స్వీకరించు) అనేటట్లు మీకు చెందినది; నాది కాదు - (నమః మఃన, తే) అని ప్రథమపాదంలోని రెండు నమశ్శబ్దాల అర్థం. మొదటి పాదంలో శ్రీవరవరమునుల గుణవిశేష వైశిష్ట్యాన్నిగూర్చి పల్కి, తరువాత రెండవ పాదంలో దానివల్ల ఉపాదింపబడ్డ వారి ఆచార్యత్వపూర్తిని గూర్చి చెబుతున్నారు.

**(గురుకులధుర్య!)** - ధురాన్ని - అంటే - భారాన్ని - వహించేవాడు ధుర్యుడు. అంటే -భారాన్ని భరించేవాడు. రెండవ యోజనానుసారం **"అహం తే, న మః మదుపాయః తే, మః న, మమ ఫలం తే, మః న"** అని రెండవ పాదంలోని మూడు నమశ్శబ్దాల అర్థాన్ని చెప్పుకోవాలి. ఈవిధంగా రెండు పాదాలలో రెండు యోజనలు స్ఫురిస్తున్నాయి.

**(వరవరమునయే నమో నమస్తే)** ఇక మొదటి రెండు పాదాలలో చెప్పబడ్డ కల్యాణగుణాలకు, ఆచార్యత్వపూర్తికి ఆశ్రయాలైన దివ్యమంగళవిగ్రహ, దివ్యాత్మస్వరూపాలను ఉద్దేశించి మూడవ పాదంలో **"వరవరమునయే"** పల్కుతున్నారు. **"వరవర"** శబ్దం చేత దివ్యమంగళవిగ్రహం, **"ముని"**శబ్దంచేత దివ్యాత్మస్వరూపం తెలుపబడ్డాయి. వరవరమునిశబ్దం శరీరవిశిష్టమైన ఆత్మవాచి కనుక పై రెండు ఈ పదంచేత చెప్పబడ్డాయి. మొదటి పాదంలో - తిరుమంత్రవాక్యార్థానికి చెందిన రెండు యోజనలలో మొదటి యోజన అభ్యర్హితం కనుక, ఆ విషయాన్ని సూచిస్తూ, స్వరూప, స్వరూపానురూప ప్రాప్యాలకు అనుగుణంగా రెండు నమశ్శబ్దాలను ఇక్కడ కూడా మూడవ పాదంలో ప్రయోగించారు.

**(యతివరతత్త్వవిదే నమోనమస్తే)** ఇక, ఈ గుణాలన్నీ ఉద్దేశ్యాలు కావడానికి మూలకందమైన విషయాన్ని **"యతివరతత్త్వవిదే"** అని నాల్గవ పాదంలో తెలిపారు. యతివరతత్త్వమంటే భగవద్రామానుజా చార్యులవారే ఉపాయోపేయాలని తెలియడం - **"ఉపాయోపేయత్వే తదిహ తత్త్వమ్"**- అని అంటూ ఈ రెండిటిని తెలియడమే తత్త్వవేదనమని చెప్పబడింది కదా! లేక, యతివరతత్త్వవిత్ - అంటే - యతివరతా

దాత్మ్యాన్ని పొందినవారు - అని అర్థం. "శ్రీరామానుజా చార్యతాదాత్మ్యవాన్" అని తాత్పర్యం. శ్రీవరవర మునులు "విద్ల్-లాభే" అనే ధాతువుయతివరపునరవతార భూతులుగా సంప్రదాయంలో అనుసంధింప బడుతున్నారు కదా. "అటువంటి మీకే నేను చెందినవాడను, నాకు కాదు - అని భావం. ఈఅర్థంలోని ఆదరాతిశయంవల్ల నాల్గవ పాదంలో నమశబ్దావృత్తి చేయబడిందని కూడా కొందఱి అభిప్రాయం. ఈ శ్లోకంలో మొత్తం తొమ్మిదిమార్లు నమశ్శబ్ద ప్రయోగాన్ని చేయడం - "**నమ పురస్తాదథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ**" అనే గీతాసూక్తి రీతిలో నాల్గు దిక్కులు, నాల్గు దిక్కోణాలు, ఊర్ధ్వ దిశ- మొత్తం తొమ్మిది దిశలలో ప్రమాణాలను చేయడంలో సూచకం - అనికూడా చెప్పవచ్చు. "**గురుకులధుర్య! నమో నమో నమస్తే**" అని అంటూ రెండవ పాదంలో ముమ్మారు నమశ్శబ్దాన్ని ప్రయోగించడం - ఆచార్యులు భగవద్భాగవతాచార్యరూప త్రిమూర్త్యాత్మకులు కనుక, తద్విషయక కైంకర్యం యొక్క త్రివృత్త్వసూచనార్థం. ఆ విధంగా మూడు విధాలైన కైంకర్యాలలోను స్వార్థతాగంధరాహిత్యాన్ని స్ఫురింపజేయడం కోసం "**గురుకుల ధుర్య నమో నమో నమస్తే**" అని ముమ్మారు నమశ్శబ్దప్రయోగం చేయబడింది. "**అత్ర చ - గురుకులధుర్య- ఇత్యత్ర నమశబ్దావృత్తిత్రయ మాచార్యకైంకర్యస్య త్రివృత్త్వసూచ నాయ. ఆచార్యస్య హి భగవద్భాగవతాచార్యాత్మకత్వేన తద్విషయకైంకర్యస్యాపి త్రిగుణత్వాత్. తత్ర త్రిష్వపి స్వార్థతాగంధరాహిత్యద్యోతనం- గురుకులధుర్య నమో నమో నమస్తే" ఇతి నమశ్శబ్దైః త్రిభి ర్భవతి**" అని వాధూల వీరరాఘవాచార్య స్వామి సంస్కృతవ్యాఖ్య.

**3.** అవ :- తాము శ్రీమణవాళమహామునుల శ్రీచరణసరోజాలను ప్రాప్యప్రాపకాలుగా పొందడంలో తమ కులదైవం అయిన చక్రవర్తి తిరుమకన్ (శ్రీరాముని) కరుణే మూలకారణం కనుక, ఆ స్వామిని స్తుతింపబోతూ, ముందుగా, అతని కరుణే మూర్తీభవించినట్లుండే జానకీదేవిని ఈ శ్లోకంలో స్తుతిస్తున్నారు- ఎఱుమ్బియప్పా. "**వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్**" అనే శ్రీరామాయణ సూక్తిలోని "**కృపయా**" అనే పదాన్ని "**కృపారూపిణ్యా**" అని పూర్వాచార్యులు వివరించడం స్మరణీయం.

**కురు మయి విమలం దృగంచలం తే**
**కుశలనిదాన ! దయానిధే ! నమస్తే।**
**నిశిచరపరిపంథినిత్యయుక్తే !**
**నిమికులమంగళదీపికే ! నమస్తే ॥**

కుశలనిదాన దయానిధే = ఆచార్యాభిమానమనే క్షేమానికి మూలకారణం అయిన, దయకు నిధివంటిదానా!, తే = నీయొక్క, విమలం = రజస్తమోగుణాలనే దోషాలను లేని, దృగంచలం = కటాక్షాన్ని, మయి = నాయందు, కురు = (ప్రసరింప) చేయాలి, తే నమః = నీకు నమస్కారం, నిశిచరపరిపంథినిత్యయుక్తే = అసురులకు శత్రువైన శ్రీరామునితో ఎల్లప్పుడు చేరి ఉండేదానా!, నిమికుల మంగళదీపికే = జనకుడు పుట్టిన నిమి వంశాన్ని ప్రకాశింపజేసే మంగళదీపంవంటిదానా!, తే నమః = నీకు నమస్కారం.

ఆచార్యాభిమానానికి ("ఇతడు మనవాడు'' అని శ్రీమణవాళమహామునులు అభిమానించడానికి) కారణం శ్రీరాముని కరుణ. దానికి కారణం పురుషకారస్వరూపిణి అయిన సీతాదేవికరుణ. అందువల్ల సీతాదేవి కరుణను ఆచార్యాభిమానానికి నిదానం- అని అన్నారు. **"నిదానం త్వాదికారణమ్"** అని నిదానమంటే ఆదికారణం - అని అర్థం. **"దేవ్యా కారుణ్యరూపయా"** అని కదా సూక్తి. ఈ ప్రమాణశ్లోకంలోని **"కారుణ్యరూపా"** అనే పదానికి **"కారుణ్యం రూపయతి"** అని కదా వ్యుత్పత్తి. **"కుత్సితం దోషం శలతే సంవృణోతి, శల - చలనే, సంవరణౌచ"** అనే కుశల శబ్దవ్యుత్పత్తి ద్వారా దోషాలను స్వామి చూడకుండా ఉండే రీతిలో పోగొట్టి, లేకపోతే కనపడకుండా చేసి పురుషకారాన్ని చేసేదనే అర్థం **"కుశలనిదాన"** అనే విశేషణం వల్ల ధ్వనిస్తుంది. **"కుశలం క్షేమపుణ్యయోః"** అనే నిఘంటువచనాన్ని బట్టి పూర్వోక్తరీతిలో అనిష్టనివృత్తి రూపక్షేమానికే కాక, ఇష్టప్రాప్తికి కూడా ఈమె కూడా నిదాన భూత-అనే అర్థం స్ఫురిస్తుంది. కుశల శబ్దానికి క్షేమమని, పుణ్యమనే అర్థాలున్నాయి కదా!

**(దయానిధే)** - భగవానుని పరమకారుణికత్వంకూడా ఈమె అధీనమే - అని భావం. భగవానుని దివ్యమంగళరూపం **"పూర్ణషాడ్గుణ్య విగ్రహమ్"** అని చెప్పబడుతున్నదికదా! ఈ జ్ఞానశక్త్యాదులకు లక్ష్మీదేవి అభిమానిదేవత కనుక, స్వామి దయాగుణాలుకూడా తదధీనాలని చెప్పవచ్చు. ప్రధానాలైన ఆఱు గుణాల ప్రకారాలే కదా మిగిలిన కల్యాణగుణాలు. **"కుశలనిదాన, నిశిచరపరిపంథినిత్యయుక్తే"** అనే రెండు విశేషణాలు **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** అనే వైదికసూక్త్యనుగుణాలు.

**(మయి)** - **"చరమపర్వాధికారాత్మకసామ్రాజ్యసింహాసనాధిరూఢే మయి"** అని వాధూలవీరరాఘవాచార్యవ్యాఖ్య. చరమపర్వాధికార రూపమైన రాజ్యాన్ని పాలించే సింహాసనాన్ని అధిష్ఠించిన నాపై - అనే ఈ అర్థం సర్వనామశబ్దం ద్వారా ధ్వనిస్తున్నది. పరమ పర్వనిష్ఠను కల నాపై - అనిభావం.

**(కురు)** - ఆ సింహాసనంనుండి భ్రంశం కలగకుండా ఉండేటట్లు నన్ను కటాక్షించు. **"విజ్ఞానం తదిదం ప్రాప్తం యదిదం స్థానమార్జితమ్, జన్మాంతరేఽపి మే దేవ! మా భూత్తస్య పరిక్షయః"** అనే రీతిలో స్థిరంగా కల్గించు.

**(నిశిచరపరిపంథినిత్యయుక్తే)**- **"పరిపంథి"** శబ్దప్రయోగాన్ని లౌకిక సంస్కృతభాషలో వైయాకరణులు అంగీకరించకపోయినా, కవుల ప్రయోగప్రాచుర్యం ఉన్నది. **"పంథానం పరిపంథినామ్, దనుజ పరిపంథి"**ఇత్యాది ప్రయోగాలు ఉదాహరణీయాలు''- అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. అమరకోశంలో కూడా **"అరాతి ప్రత్యర్థి పరిపంథినః"** అని శత్రువాచకంగా ఈ పదం చూపబడింది. **"పరిశబ్దశ్చ ప్రకృతే దోషాఖ్యానే నిరసనే"** అని మేదినీ నిఘంటువచనాన్ని బట్టి, **"పరి - నిరసనే పంథయితుం శీలః"** అనే వ్యుత్పత్తినిబట్టి అసురుల నిరసనాన్ని స్వభావంగా కలవాడని ఈ శబ్దానికి అర్థం. భగవానుడు సర్వభూత సుహృత్తు. సందేహం లేదు. కాని, దురాచారులైన అసురులను లోకక్షేమంకోసం వధిస్తాడు. **"ద్విషదన్నమ్ న భోక్తవ్యమ్"** అని తానే అన్నాడు కదా!

**(నిత్యయుక్తే)** అనన్యరాఘవేణాహమ్", **"అనన్యా హి మయా సీతా"** ఇత్యాది సూక్తుల భావం ఇక్కడ స్మరణీయం.

**(నిమికులమంగళదీపికే)** - జనకుని కులానికి శ్రేయస్కారిణి అయినందున, ప్రకాశిక అయినందున మంగళదీపికగా రూపింపబడింది. **"జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా"** అని ఈమె కీర్తింపబడినది కదా! **"నిశిచర పరిపంథినిత్యయుక్తే, నిమికులమంగళదీపికే"** అనే పదాల యోజనవల్ల నిమికుల మంగళదీపికకు నిశిచరపరిపంథినిత్యయోగం స్నేహం అవుతున్నదనే అర్థస్వారస్యం ధ్వనిస్తున్నది. దీపం వెలగాలంటే స్నేహం కావాలికదా! సీతాదేవిపట్ల తమకుండే ఉపకారస్మృతి అనువర్తించడంవల్ల స్తుతికర్త మళ్ళీ రెండవ మాఱు నమశ్శబ్దాన్ని ప్రయోగించారు. **"వెమ్ కదిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కు"** (సూర్యకులానికి అద్వితీయదీపం) - శ్రీరాముడైతే, జనకకుల మంగళదీపిక - ఈమె. **"రఘూణాం కులదీపశ్చ నిమీనాం కులదీపికామ్"** అని వీరిరువురు స్తుతింపబడుతున్నారు కదా!

**4.** అవ :- జానకీదేవిని గత శ్లోకంలో పురుషకారార్థం నమస్కరించిన తరువాత, ఈ శ్లోకంలో ఎఱుమ్బియప్పా ఆమెకు వల్లభుడైన శ్రీరామచంద్రుని స్తుతిస్తున్నారు.

**రవిసుతసుహృదే నమో నమస్తే**
**రఘుకులరత్న! నమో నమస్తే।**
**దశముఖముకుటచ్ఛిదే నమస్తే**
**దశరథనందన! సంతతం నమస్తే ॥**

రవిసుతసుహృదే తే = సూర్యపుత్రుడైన సుగ్రీవునికొఱకు మంచిని చింతించే సఖుడవైన నీకు, నమః నమః = పునః పునః నమస్కారం, రఘుకులరత్న = రఘువు యొక్క కులాన్ని అలంకరించే మణి వంటివాడా!, తే నమః నమః = నీకు తిరిగి తిరిగి నమస్కారం, దశముఖమకుటచ్ఛిదే = కిరీటాలచే అలంకరింపబడ్డ రావణుని శిరస్సులను ఖండించిన, తే = నీకు, నమః = నమస్కారం, దశరథనందన = దశరథకుమారా!, తే =నీకు, సంతతం = సదా, నమః = నమస్కారం.

తమ తిరువారాధనలో అర్చామూర్తి అయిన శ్రీరాముడు తాము మణవాళమహామునుల కటాక్షాన్ని పొందడంలో చేసిన ఉపకృతికి జితులైన దేవరాజగురువు తాము ఆ స్వామికి చేసే నమస్కారం సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను ఏ అడ్డంకి లేకుండా అనువర్తించాలనే తమ ఆశను నమశ్శబ్దపౌనఃపున్యంద్వారా సూచించారు.

**(రవిసుతసుహృదే)** - సుగ్రీవుని హితాన్ని చింతించేవానికి -అని అర్థం. **"శోభనం హృదయమస్య", "శోభనశంసీ సుహృత్"** అని కదా సుహృచ్ఛబ్దవ్యుత్పత్తులు. దీనివల్ల జీవుడు తన హితాన్ని గూర్చి చింతించడానికి ముందే భగవానుడు దానినిగూర్చి చింతిస్తాడని స్ఫురిస్తున్నది. ఈ సంబోధన సౌలభ్య సూచకం.

**(రఘుకులరత్న)** - "రవికులరత్న" అనే ప్రాసానుగుణంగా ప్రయోగించవలసి ఉండగా, "రఘుకుల రత్న" అనే ప్రయోగించడంలో ఏమి ఉద్దేశ్యం ? అని అంటే, కులక్రమాగతమైన శ్రీరాముని శరణాగతరక్షణ

దీక్షస్ఫురించడంకోసం. రఘురాక్షస సంవాదం ఆ వంశీయుల శరణాగతపరిత్రాణమహావ్రతాన్ని గుర్తు చేసే ఉదంతం కదా! ఈ సంబోధన కూడా సౌలభ్య సూచకం.

**(దశముఖముకుటచ్ఛిదే)** - ఈ విశేషణంద్వారా ప్రార్థించినవారికి, ప్రార్థించనివారికి- అందఱికీ శ్రీరాముడు అనిష్టనివృత్తిని కలుగజేసేవాడనే అర్థం స్ఫురిస్తుంది. రావణుని శిరస్సులను తుంచడం- అతని రక్షణ ప్రయత్నానికి అతడు కల్గించే ఆటంకాలకు అంతం కల్గించడమేనని స్వయంగా శ్రీరాముడే **"మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్"** అని అంటూ తెలిపాడు కదా!

**(దశరథనందన)** - దీనివల్ల అన్యప్రయోజనులకు సైతం తన స్వరూపంతో భగవానుడు భోగహేతువు అవుతున్నాడని సూచింపబడింది. **"న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"** అని, **"అహం పునర్దేవ కుమారరూపం స్వలంకృతం తం సుత మావ్రజంతమ్, నందామి పశ్యన్నపి దర్శనేన భవామి దృష్ట్వా చ పునర్యువేవ"** అనే దశరథ సూక్తి స్మరణీయం. (శ్లోకంలోని **"నందామి పశ్యన్నపి దర్శనేన"** అనే భాగం ప్రకృతంలో ప్రధానం) ఈ స్తుతిలోని ప్రకృత శ్లోకంలో సుగ్రీవుని దగ్గరకు స్వయంగా పోయి అతని హితాన్ని గూర్చి శ్రీరాముడు ఆలోచించి, దానిని కలుగజేసినట్లే, నా విషయంలో కూడా శ్రీరామచంద్రస్వామి స్వయంగానే శ్రీవరవరముని శ్రీచరణాలను ఆశ్రయించడమనే హితాన్ని ప్రసాదించాడని స్ఫురిస్తుంది. అందువల్లనే, ఉపకారస్మృతి అనువర్తించినందువల్ల పలుమార్లు నమశ్శబ్దం ఆవృత్తమైనది. **"దశముఖ మకుటచ్ఛిదే"** అనడం ద్వారా అనిష్టనివర్తకత్వం, **"దశరథనందన"**, **"రవిసుతసుహృదే"** అని అనడం ద్వారా ఇష్టప్రాపకత్వం తెలుపబడి, ఇందువల్ల ఇక్కడ శ్రీరాముని శరణ్యత్వపూర్తి సూచింపబడింది.

**5.** అవ :- గడచిన శ్లోకంలో శ్రీవరవరమునుల శ్రీచరణసరోజాలే విలక్షణమైన ప్రాప్యం, ప్రాపకం - అనే అనుసంధానం చేసినందువల్ల తమకు కల్గిన తద్విషయకమైన పరమభక్తిచేత ప్రేరితులైన ఎఱుమ్బియప్పా (దేవరాజగురువు) శ్రీవరవరముని శతకమనే ఈ స్తుతిప్రబంధాన్ని రచించబోతూ, ఈ ప్రబంధంలో అడుగడుగునా శ్రీవరవరమునులే ప్రాప్యం, ప్రాపకంకూడా- అనే తత్త్వాన్ని తెలిపినందువల్ల, దానిని తెలిసి ఆనందించగోరేవారికి ఇది తప్పక ఆదరణీయం కాగలదని, ఈ తత్త్వాన్ని ఇంతకుముందే తెలిసినవారికికూడా నిరంతరం శ్రీవరవరమునుల కల్యాణగుణానుభవానికి ఉపయోగించగలదని అంటూ, "ప్రబంధంలోని ప్రమేయం విలక్షణం అయినపుడు, ప్రబంధంయొక్క వక్తృ వైలక్షణ్యాన్ని గూర్చిన విచారణ అక్కరలేదు కదా'' అని అంటూ తామీ స్తుతిని రచించాలని చేసే ప్రయత్నాన్ని సహేతుకంగా సమర్థించు కొంటున్నారు.

**యది పునరభిధేయ మద్వితీయం**
**కృతిభి రతః పరమీక్ష్యతే న కించిత్ ।**
**విజహతి న హి జాతు శుక్తిముక్తం**
**విశదశశిద్యుతిమౌక్తికం విదగ్ధాః ॥**

అభిధేయమ్ = ఈప్రబంధంలో వర్ణింపబడే విషయం, అద్వితీయం యది పునః = తనతో సమానం అయినది, మించినది అయిన ఇంకొక విషయాన్ని లేనిది అయితే, అతః పరం = అంతకంటే

(అటువంటి విషయంకంటే) ఇంకొకటి, కించిదపి = ఏ కొంచెం అయినా (కర్తయొక్క వైలక్షణ్యం మొదలైనవానిలో ఏది అయినా), కృతిభిః = అర్థవైశిష్ట్యాన్ని తెలియగల్గిన కుశలులచేత, న ఈక్ష్యతే = గమనించబడడంలేదు (లెక్కపెట్టబడడంలేదు). శుక్తిముక్తం = ముత్యపు చిప్పనుండి ఉద్భవించినది అయినా, విశదశశిద్యుతి= ఏదోషం లేని చంద్రుని కాంతివంటి కాంతిని కల్గిన, మౌక్తికం = ముత్యాన్ని, విదగ్ధాః = ముత్యంయొక్క అందాన్ని గ్రహించగల సమర్థులు, జాతు = ఏనాడూ, న విజహతి హి = విడువరు కదా!

విలక్షణజ్ఞానాన్ని కలవారు ముత్యపుచిప్పయొక్క తక్కువదనాన్ని చూడకుండా, అందులోనుండి ఉద్భవించిన గొప్ప ముత్యాలను పరిగ్రహించేటట్లే, ఈ ప్రబంధాన్ని రచించే దాసుని (నా) జ్ఞానాదులలోని తక్కువదనాన్ని గమనించకుండా, దాసునిచేత (నాచేత) రచింపబడేది అయినా, ఇందులోని విషయ వైలక్షణ్యాన్ని గమనించి - అంటే - శ్రీవరవరమునులను విషయంగా కల్గినందువల్ల ఏర్పడిన ఈ ప్రబంధ ప్రమేయవైలక్షణ్యాన్ని గమనించి, దాసుని ఈ కృతిని తప్పక స్వీకరిస్తారు - అని తాత్పర్యం.

**(అద్వితీయమ్)** - **"న తత్ సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "ఒత్తార్ మిక్కారై ఇలైయాయ"** ఇత్యాది ఉభయవేదాంత సూక్త్యర్థాలు చరమపర్వాత్మకంగా అనుసంధింపబడ్డాయి.

**(కృతిభిః)** - ఈ పదాన్ని స్త్రీలింగంగా కాని, పుంలింగంగా కాని చెప్పవచ్చు. స్త్రీలింగం అయినపుడు ప్రబంధార్థకం. ప్రబంధాలతో- అని ప్రకృతంలో అర్థం. **"కృతి రాతనుతామ్ ముదమ్"** ఇత్యాది ప్రయోగాలు ఇక్కడ ఉదాహరణీయాలు. పుంలింగం అయినపుడు- కుశలురచేత -అని అర్థం. **"కుశాన్ లాతి ఇతి కుశలః"** అనే వ్యుత్పత్తిని కల ఈ పదం కార్యనిర్వహణవైచక్షణ్యాన్ని కల్గినవానిని తెల్పుతుంది. **"కృతీ కుశల ఇత్యపి"** అని అమరకోశవచనం. **"కృతిభిః అభిధేయం వర్ణనీయవస్తు అద్వితీయం - యది నిస్సమాభ్యధికం చేత్, అతఃపరమ్ న కించిత్ ఈక్ష్యతే"** అని మొదటి అర్థం. ప్రబంధంచేత వర్ణింపబడే వస్తువు అద్వితీయమైతే, ఇంకొక విషయంలో దృష్టి లేనపుడు ఉపేక్షించక పోవడం కైముతికన్యాయ సిద్ధంకదా. ఇక, పుంలింగంగా స్వీకరించినపుడు, **"అభిధేయం వర్ణనీయం వస్తు అద్వితీయం యది, అతఃపరం, కించిత్- వక్తృవైలక్షణ్యాదిష్వన్యతమం, కృతిభిః- ప్రమేయసౌష్ఠవపరిజ్ఞానవద్భిః నిరుక్తవిలక్షణప్రాప్యప్రాపక గుణానుభవ -హేతుభూత భోగ్యతాశయ యుక్తైర్వా, నేక్ష్యతే - న దృశ్యతే"** (వర్ణింపబడే అర్థం గొప్పది అయితే, దానినే గమనిస్తారు. దానిని ఎవరు రచించారు ? ఇత్యాది అంశాలను, ప్రమేయం గొప్పతనాన్ని తెలిసినవారు, విలక్షణమైన ప్రాప్యప్రాపకాల గుణానుభవానికి కారణమైన భోగ్యతాతిశయాన్ని తెలిసినవారు, గమనించరు.) అని రెండవ అర్థం. ఇక, ఈ విషయంలో వైధర్మ్య దృష్టాంతం ప్రదర్శింపబడుతున్నది.

**(విదగ్ధాః)** - ముత్యాల హారంలోని లావణ్యవిశేషాన్ని గమనించగల చతురులు,

**(విశదః)** - నిర్మలమైన - అని అర్థం.

**(శశిద్యుతి)** - చంద్రుని వెన్నెలవంటి చల్లని తెల్లని కాంతిని కల్గినదని భావం. **"యథా మౌక్తికస్య శోభావిశేషాపేక్షయా హేయశుక్తిముక్తత్వ మకించిత్కరమ్, తథా తద్విలక్షణవిషయప్రబంధస్యావిలక్షణకర్తృత్వ**

మకించిత్కరమితి భావః" అని శ్రీవాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. ఇందులో "**వైధర్మ్యేణ**" దృష్టాంతా లంకారం ఉన్నది.

**6.** అవ :- "అయ్యో! స్తుతికర్తలైన మీకు వైలక్షణ్యం లేదని అనుకుంటున్నారే! మఱి, ఇంత తక్కువదనాన్ని కల మీకు ఈ స్తుతిని రచించడానికి కారణం అయిన శ్రీవరవరమునుల కటాక్షం ఏవిధంగా లభిస్తుంది? అనే ప్రశ్న ఉదయించగా, నా ఔన్నత్యమో, లేక, నైచ్యమో - ఇది ఏమీ శ్రీవరవరమునుల కటాక్షం కల్గడానికి కాని, కలుగకపోవడానికి కాని కారణం కాదు. మహనీయులైన ఆచార్యుల సంబంధాన్ని కల్గి ఉండడం, ఆ సంబంధాన్ని కల్గి ఉండకపోవడం - అనేవి మాత్రమే కారణాలు సుమా - అని ఇందులో అంటున్నారు. "**పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా**" అనే పరమాచార్య సూక్తి ప్రక్రియలోని సూక్తిరత్నమిది. శుక్తిస్థానంలో తమను, ముత్యంస్థానంలో స్తుతిని భావించి కవి పలికారు.

**దేవ! ప్రసీద మయి దివ్యగుణైకసింధో!**
**దృష్ట్యా దయామృతదుహా సకృదీక్షితుం మామ్ ।**
**నైతేన కృత్య మసతేతి న చింతయిత్వా**
**నారాయణం గురువరం వరదం విదన్ మే ॥**

దివ్యగుణ+ఏకసింధో = చాలా గొప్ప గుణాలనే నదులు చేరే చోటు అయిన సాటి లేని మేటి సముద్రమా!, దేవ = ఓ శ్రీవరవరమునీ! దేవా!, అసతా ఏతేన = వస్తువు కాని ఇతనిచే (నాచే), కృత్యం న ఇతి = ఏకార్యం లేదు అని, న చింతయిత్వా = అనుకోకుండా, వరదం నారాయణం = వరదనారాయణులనే, మే గురుం = దాసుని ఆచార్యులను, విదన్ = తలచి, (ఆ మహనీయులకోసం), దయా+అమృతదుహా = దయ అనే అమృతాన్ని స్రవించే, దృష్ట్యా = తిరునేత్రాలతో, మాం = (వరదనారాయణ గురువుల అభిమానానికి పాత్రమైన) నన్ను, సకృత్+ఈక్షితుమ్ = ఒక పర్యాయం కటాక్షించడానికి, మయి ప్రసీద = దాసునిపట్ల అనుగ్రహించాలి.

ఓ శ్రీవరవరమునీ! దాసుడు చేసిన పలు విధాలైన అపచారాలను తలచి, మనస్సులో కోపాన్ని పొందకుండా, దాసుని ఉపకారకాచార్యులైన కోయిలణ్ణన్‌ను చూచి మనస్సులో తేటపడి, తమను విషయంగా కల ఈస్తుతిని రచించడానికి యోగ్యుణ్ణి అయేటట్లుగా నన్ను ఒక పర్యాయం కటాక్షించాలి.

**(దివ్యగుణైకసింధో)** - "**దివి భవాః దివ్యాః**" - "**అథ యదతః పరో దివః**" అని, "**త్రిపాదస్యామృతం దివి**" అని వేదంలో పరమపదం కీర్తింపబడినది. ఆ పరమపదంలో వేంచేసి ఉండే పరమాత్మయొక్క దివ్యగుణాలు - పరమకారుణికత్వాదులు. వాటికి అద్వితీయమైన సముద్రమా! అని భావం. ఈ సంబోధన వల్ల, సమస్తకల్యాణగుణాలకు సత్తమాత్రమే పరమపదంలో ఉన్నది, సంఘాతభావం - వాటి కలయిక - భగవద్వరవరమునులలోనే - అనే హార్దభావం ధ్వనిస్తున్నది. సముద్రం - వేర్వేరుగా పుట్టి ప్రవహించే నదీప్రవాహాల కలయికకు చోటు. అదేవిధంగా ఇక్కడకూడా ఒక్కొక్క కల్యాణగుణం ఒక్కొక్క జీవనది కాగా, ఆ కల్యాణ నదుల సంఘాతం శ్రీవరవరమునిలో దర్శించవచ్చునని ఈ విశేషణ తాత్పర్యం. "దేవ

మివాచార్య ముపాసీత" అని, "యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ" అని మొదలైన ప్రమాణాలను బట్టి దేవసదృశులైన ఆచార్యుల విషయంలో దేవశబ్దప్రయోగం చేయబడింది. పరత్వాది పంచకానికి మించి ఆచార్యావతారం అనే ఆఱవ ప్రకారం విశిష్టమైనది కదా! "పూర్వస్మాదపి పూర్వస్మాత్ సులభో హ్యుత్తరోత్తరః" అనే ప్రమాణం స్మరణీయం. పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చా-ఆచార్యరూపాలనే ఆఱువిధాలైన భగవదవతారాలలో ఉత్తరోత్తరం సౌలభ్యం అధికం.

**(దయామృతదుహా)** - అమృతం భోగ్యమైనది, దేహానికి మరణం లేకుండా చేసేది అయినట్లే, శ్రీవరవరమునుల దయ కూడా పరమభోగ్యమైనది, ఆత్మస్వరూపనాశం కలుగకుండా రక్షించేది కనుక, ఆ సాదృశ్యాన్నిబట్టి ఇక్కడ దయ అమృతంగా రూపింపబడింది. దేవతల అమృతం శరీరానికి కలిగే నాశనాన్ని మాత్రమే నివారించగలదు. ఆత్మస్వరూపాన్ని కాపాడలేదు. శ్రీవరవరమునిదయామృతం ఆత్మస్వరూపాన్నికూడా కాపాడగలదు. అందువల్ల దేవతల అమృతం కంటే ఇది విలక్షణమైనది- అనే వ్యతిరేకాలంకార ధ్వనికూడా ఇక్కడ ఉన్నది. లేక, "దయయా అమృతం మోక్షం దుహా" అనే వ్యుత్పత్తిని కూడా చెప్పవచ్చు. అపుడు దయతో అమృతశబ్దవాచ్యమైన మోక్షాన్ని ప్రసాదించేది- శ్రీవరవరమునుల కటాక్షమని తాత్పర్యం. "యస్యానుభావపర్యంతా దృష్టి స్తత్త్వే ప్రతిష్ఠితాః, తద్దృష్టిగోచరా స్సర్వే ముచ్యంతే సర్వకిల్బిషైః", "బాలమూకజడాంధాశ్చ పంగవో బధిరాస్తథా, సదాచార్యేణ సందృష్టాః ప్రాప్నువంతి పరాం గతిమ్" అని చెప్పబడుతున్నది కదా!

**(మామ్)** - అటువంటి వరదనారాయణ గురువుల కటాక్షమనే సదాచార్య సంబంధాన్ని కల్గిన నన్ను - అనే భావం ఈ సర్వనామ శబ్దం ద్వారా ద్యోతితం.

**(ప్రసీద)** - మనస్సులో నా పట్ల ప్రతికూలభావమనే కాలుష్యాన్ని వీడి స్వచ్ఛతను పొందండి - అని భావం. దయాస్వభావులైన శ్రీవరవరమునులు ప్రతికూలభావాన్ని పొందడానికి గతంలో తాము చేసిన నానావిధానంతాపచారాలు మూలం - అని కవి హృదయం.

శ్లోకంలోని సారార్థం ఏమంటే - "దృష్టి ప్రసరించాలంటే విషయం అనే లక్ష్యం ఒకటి ఉండాలికదా! నీవు ఒక పదార్థమే కానపుడు నా కటాక్షం ఏవిధంగా ప్రసరిస్తుంది? - అని దేవరవారు భావించవద్దు. శ్రీవరదనారాయణ గురువరుల అభిమానానికి పాత్రుణ్ణి అయినాను కనుక నాకొక సత్త లభించింది. అందువల్ల మీ దయామృత దృష్టిని అస్తిత్వాన్ని పొందిన నాపై ప్రసరింపజేయాలి"అని.

7. అవ :- ఇంతవరకు ఆఱు శ్లోకాలలో ప్రబంధానికి ఉపోద్ఘాతాన్ని పల్కిన ఎఱుమ్బియప్పా, ఇక ఈ శ్లోకంనుండి స్తుతిప్రబంధాన్ని ఆరంభిస్తున్నారు.

**శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానం**
**భూమా తస్మిన్ భవతు కుశలీ కోఽపి భూమాసహాయః ।**
**దివ్యం తస్మై దిశతు విభవం దేశికో దేశికానాం**
**కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని ॥**

శ్రీమత్ = గొప్ప సంపదను కల్గినది, తేజః నిధానమ్ = పరమపదంలో ఉండే తేజస్సువంటి తేజస్సుకు స్థానమైనది, పరమం ధామ =దీనికి మించినది ఇంకొకటి లేదు అనేటట్లుండే మొదటి దివ్యదేశం అయిన, రఙ్గమ్ = శ్రీరంగమనే దివ్యదేశం, జయతు = ఏ హాని లేకుండా క్షేమంగా వర్ధిల్లాలి, తస్మిన్= ఆ శ్రీరంగంలో, భూమాసహాయః = భూదేవికి, లక్ష్మీదేవికి వల్లభుడై, భూమా = లెక్కించడానికి సాధ్యంకాని ఆనందాన్ని కలవాడైన, కః అపి = మనోవాక్కులకు అందని పరమపురుషుడు, కుశలీ భవతు = క్షేమాన్ని కలవాడు కావాలి, దేశికానాం = (శ్రీరంగనాథునితో పాటు అందఱు) ఆచార్యులకు, దేశికః = ఆచార్యులైన, వరవరమునిః = మణవాళమహామునులు, కాలే కాలే = అన్ని సమయాలలో, మంగళాని =మంగళాలను, కల్పయన్ = ఆశాసించేవారై, తస్మై = ఆ పరమపురుషునకు, దివ్యం విభవం = పరమపదంలో ఉండే ఐశ్వర్యానికి సాటి వచ్చే ఐశ్వర్యాన్ని, దిశతు = ఇచ్చుగాక !

వ్యాఖ్యానమ్ : శ్రీరంగదివ్యక్షేత్రం ఏ హాని లేకుండా ప్రకాశిస్తే, శ్రీరంగనాథుడు కూడా నిరుపద్రవంగా ప్రకాశిస్తాడు. శ్రీరంగనాథుడు క్షేమంగా ఉంటే, ఆ ప్రకాశం ఇంకా ఇంకా ఉన్నతంగా వర్ధిల్లేటట్లు మంగళాశాసనాన్ని చేసి దానివల్ల శ్రీరంగనాథునకు సంపదలు వర్ధిల్లడంలో ఏ ఆటంకం లేకుండా ఉంటుంది. ఆ విధంగా అయితే శ్రీమణవాళమహామునులు ఇంకా ఇంకా సంపదలు అభివృద్ధి చెందేటట్లుగా శ్రీరంగనాథునకు పల్లాండు పాడుతూ, భోగ్యంగా వేంచేసి ఉంటారు - అని, దీనిద్వారా శ్రీరంగంలోని శ్రీరంగనాథుడు, శ్రీరంగం, మణవాళమహామునులు - అనే అందఱికి కవి మంగళాశాసనం చేశారు. శ్రీరంగం విషయంలోను, శ్రీరంగనాథుని విషయంలోను **"శ్రీమద్రంగం జయతు"**అని, **"కోఽపి కుశలీ జయతు"** అని మంగళాశాసనాన్ని కవి చేయడం స్పష్టంగా కన్పించినట్లుగా శ్రీవరవరమునుల విషయంగా మంగళాశాసనం చేయడం శ్లోకంలో కన్పించలేదే! - అని అంటే, అది నిజమే. అయినా, **"మంగళాని కల్పయన్ తస్మై దివ్యం విభవం దిశతు"** మంగళాశాసనం చేస్తూ శ్రీరంగనాథునకు దివ్యవైభవాన్ని కల్గించుగాక - అనే సూక్తి శ్రీవరవరమునులకు మంగళాశాసనం చేయడంలోనే పర్యవసిస్తుంది - అని గ్రహించాలి. మణవాళమహామునులు, శ్రీరంగనాథునకు తాము మంగళాశాసనం చేయగా, దానివల్ల శ్రీరంగనాథునకు దివ్యవైభవం కలుగగా, దానిని చూచి ఆనందించి, ప్రాణధారణను చేసేవారు కనుక, శ్రీవరవరమునులను మంగళాశాసనం చేసినట్లుగానే **"మంగళాని కల్పయన్"** ఇత్యాది ప్రయోగం పర్యవసిస్తుంది. అందువల్ల, వరవరమునులు శ్రీరంగనాథునకు మంగళాశాసనాన్ని చేసి, దివ్యవైభవాన్ని కల్గించాలి - అనే సూక్తి తాము కల్గించిన దివ్యవైభవాన్ని దర్శిస్తూ శ్రీవరవరమునులు నిత్యసమృద్ధిగా వేంచేసి ఉండాలి- అనే అర్థంలో దృష్టిని కల్గినది - అని తెలుపబడినట్లయింది. **"ప్రమాణం చ ప్రమేయం చ, ప్రమాతారశ్చ సాత్త్వికాః, జయంతు క్షపితారిష్టం సహసర్వత్ర సర్వదా"** అని, **"అడియార్కళ్ వాழ அరఙ్గనకర్ వాழ, శడకోపన్తన్ద తమిழ் నూల్ వాழ, కడల్ శూழ்న్ద మణ్ణులకమ్ వాழ, మణవాళ మామునియే ఇన్ను మొరు నూర్రాణ్డిరుమ్"** అని గల ప్రపన్ననిత్యానుసంధేయ సూక్తిలోని పోకడలను ప్రకృతసూక్తి తలపిస్తుంది. ఇక్కడ ప్రమేయం - శ్రీరంగనాథుడు, ప్రమాణం - ప్రణవకారమైన శ్రీరంగ విమానం, ప్రమాత - వరవరమునులు.

ఒక నిర్ణీతప్రణాళికలో ఎఱుమ్బియప్పా ఈశ్లోకంలో మంగళాశాసన ప్రణాళికను రచించారు. **"జయతు, భవతు, దిశతు"** అని అంటూ శ్రీరంగదివ్యక్షేత్రానికి, దానిని అధివసించి ఉండే శ్రీరంగనాథునకు, శ్రీరంగనివాసి అయిన మణవాళమహామునులకు మంగళాశాసనాన్ని చేస్తున్నారు. ఈవిధంగా మొదటగా ప్రథమపర్వంలో ఉపక్రమం చేయబడింది. మన పూర్వాచార్యులందఱు మంగళాశాసనైకజీవనులు కదా! భగవద్భాగవతాచార్యమంగళాశాసనమే తమకు ధారకమని భావించేవారు కదా! **"సతి ధర్మిణి ధర్మాః చింత్యంతే"** (ధర్మి ఉంటే కదా, ఆ ధర్మికి సంబంధించిన ధర్మాలు విచారింపబడతాయి) అనే న్యాయంలో స్తుతిలో ముందుగా ధర్మి అయిన శ్రీవరవరమునులకు మంగళాశాసనం చేయబడింది. ఇదికూడా ఒకవిధమైన కావ్యారంభంలో చేసే మంగళాచరణం. ఇకపై శ్లోకాలలో వారి ధర్మాలను గూర్చిన చింతన చేయబడుతున్నదని కూడా గ్రహించాలి.

**(శ్రీమత్)** - ఇది శ్రీరంగానికి విశేషణం. **"శ్రీః"** అంటే సంపద. ప్రకరణానుసారంగా ఇక్కడ శ్రీరంగానికి గల సంపద ఏమంటే- నిత్యసూరులలో గొప్పవాడైన ఆదిశేషుడు, శేషి అయిన శ్రీరంగనాథునకు సకలశేషవృత్తులను (కైంకర్యాలను) చేయడంకోసంగా స్వరూపంతో సౌమిత్రి-రామానుజాచార్య - శ్రీవరవరమునుల రూపంలోని అవతారాలతో మూడు కాలాలలోను వేంచేసి ఉండే సంపద ఈ శ్రీరంగానికి ఉన్నది. ఇటువంటి ప్రశస్తమైన సంపదను ఈ నగరం కల్గి ఉన్నదనే విషయాన్ని ఈ విశేషణం తెల్పుతున్నది. అందువల్ల **"శ్రీమత్"** అనే విశేషణంలోని **"మతుప్"** ప్రశంసార్థంలో ప్రయోగింపబడింది. దీనివల్ల **"మధురా నామ నగరీ పుణ్యా పాప హరీ శుభా"** అని పొగడబడేది. వామన- భరత- శ్రీకృష్ణరూపావతారాలలో భగవానుని సన్నిధానాన్ని కల్గి ఉండే మధురానగరం కంటే, శేషశేషి సాన్నిధ్యాన్ని పూర్వోక్తక్రమంగా కాలత్రయంలో కల్గి ఉండే శ్రీరంగనగరానికి గల వైలక్షణ్యం వ్యక్తమైనది.

**(తేజోనిధానమ్)** తేజస్సులకు నిధి - అని అర్థం. **"అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః"** (సూర్యునియొక్క, అగ్నియొక్క ప్రకాశానికి మించిన ప్రకాశాన్ని మహాత్ముడైన విష్ణువు నివాసమైన ఆ పరమపదం కల్గి ఉన్నది) అని చెప్పబడిందికదా! లేక, ఇక్కడ తేజశ్శబ్దానికి పరాభిభవన సామర్థ్యమనే అర్థాన్ని గ్రహించి వివరించవచ్చు. అపుడు శత్రువులను అథఃకరించే సామర్థ్యానికి నిధి అయినదని భావం. **"వైకుంఠం రంగమందిరమ్"** అయినపుడు తేజోనిధానం కావడం సహజం కదా! లేక **"నిధీయతే అస్మిన్ ఇతి నిధానమ్"** అనే వ్యుత్పత్తిని నిధానశబ్దానికి చెప్పి, **"నిధానగర్భా మివ సాగరాంబరామ్"** అనే రఘువంశప్రయోగాన్ని (3-9) బట్టి కోశాగారమనే అర్థాన్ని గ్రహించవచ్చు. అపుడు **"శ్రీస్తనాభరణం తేజః"** అనే రీతిలో తేజోరూపుడైన శ్రీరంగనాథుడనే తేజస్సు ఉండే చోటు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(పరమం ధామ)** - ఈ లీలావిభూతిలో ఉత్కృష్టమైన స్థానం. **"ధామ"** శబ్దానికి నివాసస్థానమని అర్థం. లేక, శ్రీరంగం **"ప్రత్యక్షం పరమం పదమ్"** - (శ్రీరంగనగరం సాక్షాత్తు పరమపదం) అని చెప్పబడుతున్నది కనుక, సాక్షాత్తు పరమపదమని కూడా భావం.

**(రంగమ్)** - **"క్షీరాబ్దేః మండలద్భానోః యోగినాం హృదయాదపి, యస్మాద్రక్తిం గతో దేవః తేనేదం రంగముచ్యతే"** (క్షీరాబ్ధిపట్ల కంటే, సూర్యమండలంపట్ల కంటే, యోగిహృదయాలలో కంటే కూడా భగవానుడు

ఇందులో ఎక్కువ ఆసక్తిని కల్గి ఉన్నాడు కనుక, ఇది రంగమనబడుతున్నది) అని చెప్పడినట్లుగా భగవానునకు గొప్ప ఆనందాన్ని కల్గించే స్థానం అయిన శ్రీరంగం. "రంగతి ద్రవతి ఇతి రంగమ్" అనే రంగ శబ్దవ్యుత్పత్తివల్ల స్ఫురించే అర్థస్వారస్యం ఇక్కడ అనుసంధేయం.

**(జయతు)** ఏ ఉపద్రవం లేకుండా నిత్యనిరుపద్రవంగా ఉండాలి.

**(భూమాసహాయః)** - భూదేవి, లక్ష్మీదేవులకు సహాయభూతుడు- అంటే- భర్త. **"భూమాభ్యాం-భూమిలక్ష్మీభ్యాం సహ అయతే ఆగచ్ఛతి"** - భూదేవి, లక్ష్మీదేవులతో కలసి వేంచేస్తాడు, కనుక భూమాసహాయుడు. - అని, లేక భూదేవి, లక్ష్మీదేవులను సహాయభూతులుగా కలవాడని అర్థాలను చెప్పవచ్చు. సహాయుడంటే -ప్రధానకర్త చేయదలచిన పనిలో అప్రధానంగా అన్వయించే కర్త. అందువల్ల, భగవానుడు చేసే జగద్రక్షణమనే క్రియలో ప్రధానకర్తృత్వం **"యేన త్వం బత సంరబ్ధః ప్రాణినః పాలయిష్యసి"** అనే రీతిలో భగవానునకు చెందుతుంది. లక్ష్మీదేవికి **"లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే"** అని చెప్పబడిన రీతిలో అప్రధానకర్తృత్వం స్ఫురింపజేయబడింది. ఇది **"జాయాపత్యోరవిభాగః"** అనే వైదికన్యాయసిద్ధం. భగవానుని శరణాగత రక్షణమనే ధర్మపాలనలో లక్ష్మీదేవితో పాటు భూదేవికి కూడా అన్వయమున్నది. ప్రధానమహిషి లక్ష్మి అయినా **"పుష్ణాంగరాగైస్సమమ్"** అనే **"స్తనబాహుదృష్టిభిరివ"** అని **"ఛాయామివాభ్యుదయనీ మవనీమ్"** అని ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో లక్ష్మీదేవికి అంగభూతురాలైనందున భూదేవికి కూడా అన్వయమున్నది. శ్లోకంలో **"భూమా సహాయః"** అనేది **"భూమా తస్మిన్"** అనే ప్రయోగానికి అనుగుణమైన అనుప్రాసప్రయోగం. అందువల్ల శ్రీవాచకమైన **"మా"** శబ్దం కంటే **"భూ"** శబ్దం ముందు నిపాతం చేయబడింది. **"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"**అని వేదంలో భగవానుడు భూమా శబ్దంతో నిర్దేశింప బడ్డాడు. ఆ విధంగా భూమాశబ్దవాచ్యుడైన స్వామికి భూమాశబ్దవాచ్యలైన దేవేరులు సహాయభూతులై ఉండడం కార్యంలోనేకాక, నామంలో కూడా అనుగుణమేకదా. **"గౌరిలా కుంభినీ క్షమా"** అని అమరకోశ వచనం క్షమాశబ్దం భూపర్యాయవాచకమని తెల్పుతున్నది. **"క్షమయా వారణం యయా"** అని దయాశతక సూక్తి. లేక, ఈ లీలావిభూతి దోషభూయిష్ఠం కనుక, ఆ క్షమాగుణాభిమాన దేవత అయిన భూదేవిని నిర్దేశించే భూశబ్దం ముందు ప్రయోగింపబడింది. లేక, **"తిరుమకళుమ్ మణ్ మకళుమ్ ఆయ్ మకళుమ్ శేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్ద వాఱు"** అని సరోయోగి పల్కినరీతిలో, **"భోగ్యా వామపి నాంతరీయకతయా పుష్ణాంగరాగై స్సమమ్"** అని భట్టర్ పల్కిన రీతిలో లక్ష్మీ - లక్ష్మీపతుల భోగాన్ని వర్ధిల్లజేసే స్వభావాన్ని కల్గిన భూదేవి శబ్దంద్వారా కూడా వారిద్దరి సాహచర్యానికి భంగం కల్గడం ఇష్టపడదు కనుక, ఆమె అభిమతానికి అనుగుణంగా ముందు భూవాచకమైన **"భూ"**శబ్దాన్ని, తరువాత లక్ష్మీవాచకమైన **"మా"** శబ్దాన్ని, తదనంతరం సహాయపదాన్ని సాభిప్రాయకంగా ప్రయోగించారని చెప్పవచ్చు. లేక, **"భూమే సహాయే యస్య సః"** అనే వివరణాన్ని వివక్షించి, **"దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ, విష్ణో ర్దేహానురూపాం వై కరోత్యేషాఽఽత్మన స్తనూమ్"** అనే రీతిలో లక్ష్మీదేవి భగవానుని అన్ని అవతారాలలో స్వామితో పాటు అవతరించేటట్లే, భూదేవి కూడా ఆమెతో పాటు అవతరిస్తుంది కనుక, అర్చావతార

స్థితిలోకూడా ఈ నియమం వర్తిస్తున్నది కనుక, శ్రీరంగంలో శ్రీరంగనాథుడై స్వామి అవతరించగా, స్వామితోపాటు వీరిరువురు భక్తరక్షణలో పురుషకారాన్ని చేయడంకోసం అవతరించారనే స్వారస్యాన్ని చెప్పవచ్చు. శ్రీరంగనాథుడు శ్రీభూసహితుడై వేంచేసి ఉండడం ప్రత్యక్షసిద్ధమే కదా! **“లక్ష్మీధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగరాజమ్”** అని కదా భట్టర్ సూక్తి.

**(భూమా)** - ఇది భగవానుని నిర్దేశించే ధర్మివాచకం. అల్పశబ్దానికి ప్రతిసంబంధి నిర్దేశం. అందువల్ల **“యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా”** అని చెప్పబడిన భూమవిద్యా ప్రతిపాద్యుడైన అపరిచ్ఛిన్నమైన ఆనందస్వరూపుడని భావం.

**(కోఽపి)** - అటువంటి అవాఙ్మానసస్వరూపుడైన పరమపురుషుడు - అని అర్థం. ఈ అర్థం సర్వనామ శబ్దం ద్వారా వ్యంజితం.

**(తస్మిన్)** - ఆ శ్రీరంగదివ్యక్షేత్రంలో- అని అర్థం. ఇచటి పరోక్షనిర్దేశం కూడా **“అప్పెరియనాయకణ్గళ్”** అనే రీతిలో మంగళాశాసనాత్మకమే. లేక, **“తస్మై నిత్యం ప్రదిశతి”** అనే దీనికి అనంతరశ్లోకంవలె ఈ శ్లోకంకూడా శ్రీరంగంలో కాకుండా తామున్న ఎఱుమ్బి అగ్రహారంలోనే రచింపబడినందున పరోక్షనిర్దేశం చేయబడింది - అని చెప్పవచ్చు. దీనికి ఉపోద్బలకంగా స్తుతిలో తరువాత రచింపబడిన పలు శ్లోకాలు దర్శనమిస్తాయి.

**(కుశలీ భవతు)** - క్షేమాన్ని కలవాడై ఉండాలి. ఇచటి ఆశీస్సు మంగళాశాసనాత్మకం.

**(దేశికానాం దేశికః వరవరమునిః)** - భాగవత పర్యంతమైన ఆచార్యులకు ఆచార్యులైన శ్రీవరవరమునులు - అని భావం. **“పీతకవాడై పిరానార్ పిరమ కురువాకి”** అని **“సాక్షాన్నారాయణో దేవః కృత్వా ర్త్యమయీం తనుమ్”** అనే రీతిలో ప్రథమాచార్యుడైన శ్రీరంగనాథునకు కూడా ద్రవిడోపనిషద్భాష్యమైన ఈడు ముప్పత్తాఱాయిరప్పడిని **“రంగీ వత్సర మేక మేవ మశ్రుణోత్”** అని ఒక సంవత్సరకాలం కాలక్షేపంగా అనుగ్రహించినవారు కనుక, దేశికులకు దేశికులు ఈ వరవరమునులు. **“లక్ష్మీనాథ సమారంభామ్... వందే గురుపరంపరామ్”** అనే రీతిలో శ్రీరంగనాథుడు ప్రథమాచార్యుడు కదా! లేక, తమకు ఉపకారకాచార్యులైన కోయిలణ్ణన్‌కు దేశికులని కూడా అర్థం. మొదటి దేశికపదంలోని బహువచనాన్ని గౌరవార్థకంగా గ్రహించాలి.

రెండవదేశిక పదం **“దిశ - అతిసర్జనే”** అనే ధాతువు నుండి ఉత్పన్నమైనది కనుక, అతిసర్జన మంటే **“విలంభస్త్వతిసర్జనమ్”** అనే అమరకోశ వచనానుసారం దానం కనుక, ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యార్థాన్ని దానం చేసిన ఆచార్యులనే అర్థాన్ని ఇస్తుంది.

**(కాలే కాలే)**- అన్ని కాలాలలో - సర్వదా - అని భావం.

**(మంగళాని కల్పయన్)** - మంగళాశాసనం చేస్తూ,

**(తస్మై)** - పూర్వోక్తక్రమంలో పత్నీపరిచ్ఛదసహితుడైన శ్రీరంగనాథునకు - అని అర్థం. **“పూర్వోక్త పత్నీపరిచ్ఛ దాన్వితాయ శ్రీరంగనాథాయ”** అని వాధూల వీరరాఘవాచార్య స్వామి వ్యాఖ్య.

**(దివ్యం విభవం దిశతు)** - త్రిపాద్విభూతిలోని వైభవాన్ని కల్గించాలి. అపుడే నాకు అభీష్టసిద్ధి కల్గుతుంది - అని తాత్పర్యం. **"వైకుంఠం రంగమందిరమ్, స వాసుదేవో రంగేశః"** అనే రీతిలో శ్రీరంగ మందిరం సాక్షాత్తు వైకుంఠమైనపుడు, శ్రీరంగనాథుడు పరవాసుదేవుడైనపుడు, పరమపదవైభవం సిద్ధించడంలో ఏమి లోటు? ప్రథమపర్వానికి అయినా, చరమపర్వానికి అయినా సత్త మంగళాశాసనంవల్ల సిద్ధిస్తుందని భావించేవారు కదా, మన పూర్వాచార్యులు. **"మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః, సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాఽస్తు మంగళమ్"** అనే శ్లోకార్థం ప్రథమ, మధ్యమ, చరమ పర్వాత్మకంగా ఈ శ్లోకంలో అనుసంధింపబడడం గమనార్హం. ప్రథమపర్వం శ్రీరంగనాథుడు, మధ్యమపర్వం శ్రీమద్రంగం, చరమపర్వం ఆచార్యులైన శ్రీవరవరమునులు.

**8.** అవ :- తమ ఉజ్జీవనానికి కారణభూతులైన శ్రీవరవరమునుల వైభవానికి, శ్రీరంగం, శ్రీరంగనాథుడు సహకరించేటట్లే పలు రీతులలో సహకరించేది అయిన కావేరినది ప్రాదుర్భావానికి మూలమైనది దక్షిణదిక్కు దానిని గూర్చి కృతజ్ఞతాపూర్వకంగా దేవరాజగురువు ప్రణమిల్లుతున్నారు.

**తస్మై నిత్యం ప్రదిశతి దిశే దక్షిణస్యై నమస్యాం**
**యస్యా మావిర్భవతి జగతాం జీవనీ సహ్యకన్యా ।**
**పుణ్యై ర్యస్యాః క్షితితలజుషం పూరుషం రంగభూషాం**
**పశ్యన్ ధన్యో వరవరమునిః పాలయన్ వర్తతే నః ॥**

వరవరమునిః = శ్రీమణవాళమహామునులు, యస్యాః = ఏ కావేరీనదియొక్క, పుణ్యైః = పుణ్యాలచే, క్షితితలజుషం = భూతలాన్ని ఆదరంతో పొందినవారై, రంగభూషాం = శ్రీరంగానికి ఆభరణమైన, పూరుషం = అడిగినవానిని అన్నిటిని అధికంగా ఇచ్చే శ్రీరంగనాథుని, పశ్యన్ = దర్శిస్తూ - మంగళాశాసనాన్ని చేసి రక్షిస్తూ, ధన్యః సన్ = ఆ స్వామి అనే ధనాన్ని పొందినవారై, నః = మనకోసం (మనం ఉజ్జీవించడం కోసం), వర్తతే = వేంచేసి ఉన్నారో, సా = అటువంటి, జగతాం జీవనీ = లోకాలను ఉజ్జీవింపజేసే, సహ్యకన్యా = సహ్యపర్వతం నుండి పుట్టినదైన కావేరీనది, యస్యామ్ ఆవిర్భవతి = ఏ దిశలో పుట్టినదో, తస్మై దక్షిణస్యై దిశే = ఆ దక్షిణదిక్కుకు, అయం జనః = దాసుడైన ఈ జనుడు, నమస్యాం ప్రదిశతి= నమస్కరిస్తున్నాను.

**వ్యాఖ్యానమ్ : (యస్యాః పుణ్యైః)-** శ్రీరంగనాథుడు భూమికి వేంచేయడం కావేరీనది చేసికొన్న పుణ్యాల ఫలం. పుణ్యనది అయిన కావేరి పుణ్యాల పంట శ్రీరంగనాథుని శ్రీరంగక్షేత్రాగమనం. ఆవిధంగానే శ్రీవరవరమునుల శ్రీరంగదివ్యక్షేత్రాగమనం కూడా కావేరినది చేసికొన్న పుణ్యమే - అనే అర్థాంతరాన్ని **"యస్యాం పుణ్యైః వరవరమునిః వర్తతే"** అనే అన్వయం ద్వారా చెప్పవచ్చు. భగవదాగమనం వలె, సదాచార్యా గమనం కూడా పుణ్యఫలమే కదా!

**(క్షితితలజుషమ్) - "జుషీ- ప్రీతి, సేవనయోః"** అనే రెండు ధాత్వర్థాలను బట్టి భూతలానికి ప్రీతితో వచ్చినవాడు, అక్కడ ఆనందించేవాడు - అనే అర్థాలు ఇక్కడ స్ఫురిస్తాయి. **"పూర్ణమ్"** అని కీర్తింపబడే

రీతిలో భగవానుని కల్యాణగుణ ప్రకాశకాలైనందున **"ఉకన్దరుళిన నిలఙ్గళ్"** కదా దివ్యక్షేత్రాలు. **"శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే... రమయా రమమాణాయ"** ఇత్యాది సూక్తులు స్మరణీయాలు.

**(రంగభూషామ్)** - శ్రీరంగం భూమికి అలంకారమైతే, శ్రీరంగానికి శ్రీరంగనాథుడు గొప్ప అలంకారం. "శ్రీరంగమంగళమణిమ్" అనికదా ప్రపన్నుల నిత్యానుసంధానం. లేక, శ్రీరంగంలోని శ్రీరంగనాథుడనే భూషణం- అని అర్థం. "శ్రీస్తనాభరణమ్" - కదా శ్రీరంగనాథుడు స్తుతింపబడ్డాడు.

**(పూరుషమ్) - "వేణ్డిర్ గ్రెల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్వళ్ళల్ మణివణ్ణన్"** అని, **"చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవః చతుర్భుజః"** అని కీర్తింపబడే సర్వాపేక్షిత ప్రదుడు. **"పురు బహు సాధతి దదాతి ఇతి పురుషః"** అనే వ్యుత్పత్తి ద్వారా సర్వాపేక్షితాలను అడిగినదాని కంటే అధికంగా ఇచ్చేవాడనే అర్థాన్ని ఇస్తుంది. **"పురుదానాచ్చ కేశవః"** అనే పౌరాణిక సూక్తి దీనిని తెలియజేస్తున్నది. **"పురుహం పురు భూయిష్ఠం స్ఫిరం భూయశ్చ భూరి చ"** అనే అమరకోశవచనం వల్ల పురుశబ్దం అధికమనే అర్థాన్ని ఇస్తుందని తెలుస్తున్నది. శ్రీవిష్ణుసహస్రనామాలలోని **"పురుషః" (14)** అనే నామాన్ని శ్రీపరాశరభట్టర్ వ్యాఖ్యానిస్తూ **"పురు బహు సనోతీతి పురుషః, సనోతేః దానకర్మణః"** అని వివరించడం ఇక్కడ స్మరణీయం. పృషోదరాదిత్వాత్ సకారానికిషత్వం వచ్చి **"పురుషః"** అనే రూపం సిద్ధించింది. పూర్వపదంలో దీర్ఘంరాగా పూరుష అనే రూపం ఏర్పడింది. **"పూరుషం భుజగేశయమ్"** అనే వీరి పూర్వదినచర్యా స్తోత్రసూక్తి స్మరణీయం.

**(పశ్యన్) - "లోచనాభ్యాం పిబన్నివ"** అనే రీతిలో కళ్ళతో పానం చేస్తున్న రీతిలో నిత్యం దర్శిస్తూ- అని అర్థం. శ్రీరంగనాథుడు **"పశ్యన్మనఃప్రవణ మోఘమివామృతస్య"** అని అంటూ భట్టర్, శ్రీరంగనాథుడొక అపూర్వమైన అమృతప్రవాహం అని అన్నారు కదా. ఇది సకలేంద్రియానుభవానికి ఉపలక్షణం. దర్శించడం అంటే- మంగళాశాసనం చేయడమే. **"సదా పశ్యంతి సూరయః"** అని కదా వైదికసూక్తి. దర్శించగానే అస్థానే భయశంకతో చేసేది మంగళాశాసనమే కదా! తత్పర్యంతం అర్థధావనాన్ని చేయాలి. **"మంగళా శాసనం కృత్వా తత్ర తత్ర యథోచితమ్"** అనే దినచర్యా సూక్తి స్మరణీయం.

**(పాలయన్) - "స్నేహాత్ అస్థానరక్షావ్యసనం"**తో సదా మంగళాశాసనాలను చేస్తూ రక్షిస్తూ- అని భావం. సదాదర్శనం, సదామంగళాశాసనం- ప్రకృతంలో వర్తమానకాలిక శతృప్రత్యయాంతపదాల ప్రయోగం ద్వారా ధ్వనిస్తుంది.

**(ధన్యస్సన్) - "లబ్ధ్వా కులధనం రాజా", "కులధనమ్", "అస్మద్ధనమ్"** అనే క్రమంలో నిరుపాధిక, కులధనమైన శ్రీరంగనాథుడనే గొప్పధనాన్ని పొందినవారై - అని అర్థం. **"నిధిరవ్యయః", "వైత్తమానిది"** అనే రీతిలో గొప్ప తరగని అలౌకిక నిధికదా పరమాత్మ. నిధిని ఇచ్చేవాడు, నిధి - శ్రీరంగనాథుడే - అని అనడంవల్ల శ్రీరంగనాథుని ఉపాయోపేయత్వం సూచితం.

**(నః)** - ఇది తాదర్థ్యంలో చతుర్థీవిభక్త్యంతరూపం. మనకోసం - అని అర్థం.

**(జగతాం జీవనీ) - "జీవంతి జనాః అనయేతి జీవనీ"** - జనులు దేనివల్ల జీవిస్తున్నారో, అది జీవని. సమస్తజగత్తులకు జీవితంవంటివాడైన శ్రీరంగనాథుని స్థితికి హేతువు కావేరీనది. అందువల్ల అది **"జగతాం**

జీవనీ" అని అనబడుతున్నది. లేక, "వ్యపగతప్రాణాత్మసంజీవనీమ్" అనే ప్రయోగంలో వలె జీవనీశబ్దం మోక్షమనే నిత్యనిరుపాధిక సంజీవనానికి హేతువనే అర్థాన్ని కూడా ఇస్తుంది. **"కావేరీ విరజా సేయమ్"** కదా. విరజాస్నానంతో కర్మవినిర్ముక్తి కల్గుతుంది. **"కావేరీ మవగాహిషీయ"** అనే శ్లోకంలో భట్టర్ **"భగవద్భోగాంతరాయీభవత్ కర్మక్లేశఫలాశయప్రశమనోద్వేలామలస్రోతసమ్, జంతోః సంసరతోఽర్చిరాదిసరణి వ్యాసంగభంగాయ యా లోక్యేఽస్మిన్ విరజేన వేల్లితజలా"** అని విరజాసామ్యాన్ని ప్రతిపాదించారు. **"జగతాం జీవనీ సహ్యకన్యా"** అనే సూక్త్యర్థానికి అనుగుణంగా **"తీర్థం శుంధతి పాతి నందనతరూన్ రథ్యాంగణా న్యుక్షతి స్నానీయార్హణపానవారి వహతి స్నాతః పునీతే జనాన్"** ఇత్యాది భట్టర్ సూక్తి.

**(సహ్యకన్యా) - "మరుద్వృథా"** ఇత్యాది కావేరీనదీ పర్యాయపదాలను ప్రయోగించకుండా, సహ్యకన్యా శబ్దాన్ని ప్రయోగించడంలో ఆంతర్యం ఏమంటే - ఆ నదికి జన్మస్థానమైన సహ్యపర్వతాన్ని కూడా ఉపకార స్మృతితో స్మరించడం కోసం.

**(తస్యై దక్షిణస్యై దిశే) -** అటువంటి, శ్లోకంలోని మొదటి మూడు పాదాలలో తెలుపబడిన రీతిలో సర్వస్థితినిదానభూత అయిన వైలక్షణ్యాన్ని కల దక్షిణదిక్కుకు- అని భావం. దీనివల్ల గ్రంథకర్త శ్రీరంగనగరానికి ఉత్తరదేశంలో **("ఎఱుమ్బి"** - అనే గ్రామంలో**)** నివసించేవారని తెలుస్తున్నది. **"దక్షతే, దక్ష-వృద్ధౌ, శీఘ్రార్థేచ"** అనే వ్యుత్పత్తినిబట్టి వృద్ధి చెందేది, వృద్ధి పొందించేది అని, త్వరగా అభిమతార్థాన్ని సాధించేది - అనే అర్థాలు ప్రకృతంలో గ్రాహ్యాలు. **"దక్షిణే సరళోదారౌ"** అనే నిఘంటువచనాన్ని బట్టి ఋజువైన, ఉదారమైన హృదయాన్ని కల్గినదనే అర్థం కూడా గ్రాహ్యం. దీనివల్ల నమస్కారార్హత కూడా ద్యోతకమవుతున్నది. ద్రావిడభాషాప్రవర్తకుడైన అగస్త్యముని, దివ్యప్రబంధాలను అనుగ్రహించిన దివ్యసూరులు అవతరించిన దిక్కు అయినందున దక్షిణదిక్కు యొక్క దక్షిణత్వం వ్యక్తం. కావేరియొక్క ప్రసన్నాశయత్వం **"తెణ్ణీర్ పొన్ని"** అనే కులశేఖరసూక్తి ద్వారా స్పష్టం. **"తస్యై"** అనే సర్వనామపదంద్వారా **"ప్రవహతి జగద్ధాత్రీ... మరుద్వృథా"** అనే రీతిలో జగత్తుకు జీవని అయిన కావేరికికూడా జన్మస్థానమైనందున దక్షిణదిశకు కల్గిన అర్హత్తమత్వం సూచింపబడింది.

**(నమస్యాం నిత్యం ప్రదిశతి) -** కానుకగా నమస్కారాన్ని ప్రతిదినం త్రిసంధ్యం కృతజ్ఞతాపూర్వకంగా ఈ దాసుడు సమర్పిస్తున్నాడు - అని భావం. **"ప్రదిశతు"** అనే పాఠానుసారం -**"సమస్తలోకం నమస్కారాలను సమర్పించుగాక"** అని అర్థం. ఇటువంటి మహోపకారిణి అయిన దక్షిణ దిక్కుకు సమస్తలోకం ప్రణమిల్లడం కర్తవ్యమనే గౌరవాతిశయం దీనివల్ల స్ఫురిస్తున్నది. దీనివల్ల **"దిశే వాఽపి నమస్కుర్యాత్"** (మహనీయులుండే దిశకు అయినా నమస్కరించాలి) అనే విధి సూచింపబడింది. **"యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః"** అని కదా శిష్టాచారం. **"దిగ్దక్షిణాఽపి పరిపక్త్రిమపుణ్యలభ్యాత్ సర్వోత్తరా భవతిదేవి! తవావతారాత్, యత్రైవ రంగపతినా బహుమానపూర్వం నిద్రాళునాపి నియతం నిహితాః కటాక్షాః"** అనే దేశికుల గోదాస్తుతి సూక్తి ద్వారా శ్రీరంగనాథుడే దక్షిణ దిక్కువైపు తన అభిముఖ్యాన్ని ప్రదర్శిస్తే ఇక మన కర్తవ్యం కైముతిక న్యాయసిద్ధమని భావం.

9. అవ :- ఈవిధంగా 7వ, 8వ శ్లోకాలద్వారా మణవాళమహాములుల రూపంలోని ధర్మి సిద్ధించినందున, దానిని అనుసరించి, ఇకపై గల శ్లోకాలద్వారా ధర్మి అయిన ఆ శ్రీవరవరమునులయొక్క ధర్మాలను (కల్యాణ గుణాలను) గూర్చి పల్కుతున్నారు.

**ఆశాపాశై రవధివిదురైః స్వైర మాకృష్యమాణం**
**దూరాద్దూరం పునరపి న మే దూయతా మేవ చేతః ।**
**అంతఃకృత్వా వరవరమునే! నిత్య మంఘ్రిద్వయం తే**
**ధారాకారస్మరణసుభగం నిశ్చలీభూయ తత్ర ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, ధారా+ఆకారస్మరణసుభగం = తైలధారవలె నిరంతరమైన స్మరణచేత మిక్కిలి ప్రియమైన, తే అంఘ్రిద్వయం = దేవరవారి శ్రీచరణద్వయిని, మే చేతః = (దాసుడనైన) నా మనస్సు, నిత్యం = ఎల్లప్పుడు, అంతఃకృత్వా = తనలో నిలుపుకొని, తత్ర నిశ్చలీభూయ = ఆ పాదద్వయిలో చలించకుండా స్థిరంగా ఉండి, పునరపి = మళ్లీ (ఇకపై), అవధి విధురైః = అంతు లేని, ఆశాపాశైః = ఆశ అనే పాశాలతో, స్వైరం = యథేష్టంగా, దూరాద్దూరం = చాలా దూరం, ఆకృష్యమాణం= బిగించి లాగబడి, నైవ దూయతామ్ = పరితాపాన్ని పొందకుండా ఉండాలి.

**వ్యాఖ్యానమ్ : (అవధివిధురైః ఆశాపాశైః)** - అవధి అంటే - అంతు - **"అవధి విధురైః"** - అంతులేనివి - అని అర్థం. బంధించే స్వభావాన్ని బట్టి ఆశను పాశంగా రూపించారు. **"ఆశాపాశశతై ర్బద్ధః"** ఇత్యాది ప్రయోగాలు గ్రాహ్యాలు.

**(ధారాకారస్మరణసుభగమ్)** - తైలధారయొక్క ఆకారం వంటి ఆకారాన్ని కల-అంటే-ఎడతెఱపి లేని- అని అర్థం. అటువంటి నిరంతరస్మరణచేత హృద్యమైనదని భావం. **"భజ-సేవాయామ్"** అనే ధాతువు నుండి నిష్పన్నమైన భగవశబ్దాన్ని మూలంగా కల సుభగశబ్ద ప్రయోగం ఇక్కడ సార్థకం, సాభిప్రాయకం కూడా. ధ్యానింపబడే భోగ్యవస్తువుయొక్క దర్శనవైశద్యం అధికమవుతున్నకొలది ఆ దర్శనంయొక్క భోగ్యతాతిశయంకూడా అధికమవుతుంది కదా! **"పునర్విశ్లేషభీరుత్వరూప"** పరమభక్తిదశ ఇచట ప్రార్థితం. విశ్లేషభీతి లేనిదే ప్రార్థన సంభవించదుకదా! అనుభావ్యవస్తువు యొక్క నిత్యాపూర్వతచేత **"అకలకిల్లేన్"** అని లక్ష్మీదేవి పునర్విశ్లేషభీరుత్వంతో నిత్యం ప్రార్థించినట్లుగా ప్రార్థన కూడా నిత్యం కదా!

**(తే)** - ప్రాప్తశేషివి, సులభుడవు అయిన నీయొక్క- అని భావం.

**(అంతః కృత్వా)** - మనస్సులో నిలుపుకొని

**(తత్ర నిశ్చలీభూయ)** - **"చంచలం హి మనః"** అని, **"నిష్టవా నిల్లా నెఞ్జు"** అనే రీతిలో సహజంగా నిలకడ లేనిది, చంచలమైనదైనా, నిరంతర భావనాప్రకర్షనల్ల స్థిరంగా ఉన్నదై.

**(తత్ర)** - ఆ పాదద్వంద్వంలో- అని భావం. వేదోక్తమైన **"పరమాత్మని యో రక్తో విరక్తో పరమాత్మని"** అనే ప్రథమపర్వక్రమం చరమపర్వంలో అనుసంధింపబడింది. స్థితప్రజ్ఞావస్థలోని చివరి దశ ఇక్కడ

ఆచార్యపరంగా అభిలషింపబడింది. "తే అంఘ్రిద్వయమ్. అంతఃకృత్వా, తత్ర నిశ్చలీభూయ" అని అనడం ద్వారా శ్రీవరవరమునుల ఉపాయోపేయత్వం సూచింపబడింది.

**10.** అవ :- ప్రథమపర్వమైన భగవానుడే ఉపాయం, ఉపేయమనే నిష్ఠను కల ఆళ్వార్ల వంటివారు **"వాసుదేవ స్సర్వమ్"** (వాసుదేవుడే అన్నీ) అని, **"త్వమేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ గురు స్త్వమేవ, త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ"** అని, **"పెఱ్ఱ తాయ్ నీయే పెఱప్పిత్త తన్దై నీ మఱ్ఱైయార్ ఆవారుమ్"** అని, **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్ తన్దైయుమ్ అవరే యిని యావారే"** అని భావిస్తారు. ఆచార్యుడే ఉపాయోపేయమనే చరమపర్వంలో అచంచలనిష్ఠను కలవారు **"మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్"** అని, **"యేనైవ గురుణా యస్య న్యాసవిద్యా ప్రదీయతే, తస్య వైకుంఠదుగ్ధాబ్ధిద్వారకా స్సర్వ ఏవ సః"** అని, **"విల్లార్ మణి కొழிక్కుమ్ వేఙ్గడప్పొఱ్కున్ఱు ముదల్ శెల్లార్ పొழிల్ శూழ் తిరుప్పది కళెల్లామ్, మరుళా మిరుళోడు మత్తకత్తు త్తన్తాళ్ అరుళాలే వైత్తవవర్"** అని భావిస్తారు. అటువంటి భావనను ఎఱుమ్బియప్పా తమ ఆచార్యులైన శ్రీవరవరమునుల విషయంలో వ్యక్తం చేస్తున్నారు, ఈ శ్లోకానుగుణంగా శ్రీవచనభూషణంలోని 450వ సూత్రం, దాని వ్యాఖ్యానం అనుసంధేయాలు. ఈ శ్లోకం ఉత్తరదినచర్యాస్తోత్రంలో కూడా కన్పిస్తున్నది.

> **త్వం మే బంధుః త్వమసి జనకః త్వం సఖా దేశిక స్త్వం**
> **విద్యా వృత్తం సుకృత మతులం విత్త మప్యుత్తమం త్వమ్ ।**
> **ఆత్మా శేషీ భవసి భగవన్! ఆంతర శ్శాసితా త్వం**
> **యద్వా సర్వం వరవరమునే! యద్యదాత్మానురూపమ్ ॥**

భగవన్ వరవరమునే = జ్ఞానశక్త్యాది గుణపూర్ణులైన ఓ వరవరమునీ!, త్వం మే బంధుః అసి = మీరే దాసుడనైన నాకు సర్వవిధబంధువులై ఉన్నారు, త్వం మే జనకః అసి = మీరే దాసుడనైన నాకు తండ్రియై ఉన్నారు, త్వం మే సఖా అసి = మీరే దాసుడనైన నాకు మిత్రమై ఉన్నారు, త్వం మే దేశికః అసి = మీరే దాసుడనైన నాకు ఆచార్యులై ఉన్నారు, త్వం మే విద్యా అసి = మీరే నాకు విద్యయై ఉన్నారు, త్వం మే వృత్తమ్ అసి = మీరే నాకు వృత్తమై ఉన్నారు, త్వం మే అతులం సుకృతమ్ అసి = మీరే నాకు సాటి లేని పుణ్యమై ఉన్నారు, త్వం మే ఉత్తమమ్ విత్తమపి అసి = మీరే దాసుడనైన నాకు గొప్ప సంపదయై ఉన్నారు, త్వం మే ఆత్మా అసి = మీరే దాసుడనైన నాకు పరమాత్మయై ఉన్నారు, త్వం మే శేషీ భవసి= మీరే దాసుడనైన నాకు స్వామియై ఉన్నారు, త్వం మే ఆంతరః శాసితా భవసి = మీరే దాసుడనైన నాకు నాలోపల ఉండి నియమించేవారై ఉన్నారు, యద్వా = లేక, (ఇంత ఎందుకు?), ఆత్మానురూపం = శేషత్వమనే ఆత్మస్వరూపానికి తగినట్లుగా, యత్ యత్ (స్యాత్) = ఏయే విషయం ఉన్నదో, తత్ సర్వం = (ఇంతవరకు చెప్పిన, చెప్పని) ఆ విషయాలు అన్నీ, త్వం మే భవసి = దాసుడనైన నాకు మీరే అవుతున్నారు.

వ్యాఖ్యానమ్ : (భగవన్) "బాలమూకజడాంధాశ్చ పంగవో బధిరా స్తథా, సదాచార్యేణ సందృష్టాః ప్రాప్నువంతి పరాం గతిమ్" (బాలురు, మూగవారు, గుడ్డివారు, అవిటివారు, చెవిటివారు- ఎవరైనా సదాచార్యునిచే కటాక్షింపబడిన వారు ఉత్తమగతిని పొందుతున్నారు) అని, "పశుర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవ సంశ్రయాః", అని చెప్పబడిన క్రమంలో ఉత్తారకత్వానికి (ఆశ్రితులను ఉద్ధరించడానికి) కావలసిన జ్ఞానశక్త్యాది గుణాలతో పూర్ణులైన స్వామీ! అని ప్రకృతంలో భావం.

(త్వం మే బంధుః) - "బధ్నాతి ఇతి బంధుః" అనే బంధు శబ్దవ్యుత్పత్తి ద్వారా, "ఇహ లోకంలోని సుఖదుఃఖాలలో పాలు పంచుకొని వెంట ఉండేవాడు - అని తెలుస్తున్నది. బంధువు "అసి" అనే వర్తమాన నిర్దేశంద్వారా ఈ బంధుత్వం నిత్యం కనుక ఆత్మాంతబంధుత్వమనే అర్థం సూచింపబడింది. శ్లోకంలో మిగిలినచోట్ల గల వర్తమాన నిర్దేశానికి కూడా ఇదే రీతిలోని భావాన్ని గ్రహించాలి. "అత్ర పరత్ర చాపి" అని శిష్యాచార్య సంబంధం ఇహలోకంలోనే కాక, పరలోకంలో కూడా అనువర్తించి, ప్రావ్యప్రాపకమై ఉంటుంది.

"దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్య మాఖ్యాతి పృచ్ఛతి, భుంక్తే భోజయతే చైవ షడ్విధం బంధులక్షణమ్" (తనకున్నదానిని ఇస్తాడు, తీసికొంటాడు, తన రహస్యాలను పల్కుతాడు, అడుగుతాడు, భుజిస్తాడు, భుజింపచేస్తాడు) అనే లౌకిక బంధులక్షణాలు ఆఱు ఆచార్యులనే బంధువు విషయంలో సార్థకాలు. ఆచార్యుడు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు, కైంకర్యాన్ని స్వీకరిస్తాడు, గుహ్యమైన భగవత్తత్త్వాన్ని గూర్చి పల్కుతాడు, గుణానుభవ క్రమంలో శిష్యునివద్దనుండి "బోధయంతః పరస్పరమ్" అనే రీతిలో అడిగి వింటాడు, "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అని, "ఓవాత్తొళిల్శార్ఙ్గన్ తొల్శీరై నన్నెఞ్జే ఓవాద ఊణాక ఉణ్" అని చెప్పబడిన రీతిలో అన్న శబ్దవాచ్యుడైన భగవానుని, భగవద్గుణాదులను అనుభవిస్తాడు, అనుభవింపజేస్తాడు- అనే క్రమం అభ్యూహ్యం. "పృచ్ఛతి" - అనే అర్థానికి అనుగుణంగా "తిరుమాలై పాడ క్కేట్టు వళర్త్తదనాల్ పయన్ పెఱ్ఱేన్ వరుక! ఎన్ఱు మడక్కిళియై కైకూప్పి వణఙ్గినాళే" అనే తిరునెడున్దాణ్డక సూక్త్యర్థాన్ని అనుసంధించవచ్చు. పూర్వం తెల్పిన బంధులక్షణాలు ఆఱు ప్రకరణానుగుణంగా చరమపర్వ విషయంగా కూడ అనుసంధించవచ్చు. అపుడు "ఇఙ్గే వా పైఙ్గిళియే తెన్ అరఙ్గమ్ పాడవల్ల శీర్ పెరుమాళ్... శేరలర్కోన్ ఎఙ్గళ్ కులశేకరన్ - ఎన్ఱే కూఱు" అనే పెరుమాళ్ తిరుమొళి తనియన్ పాశురాదులు గ్రాహ్యాలు. ఈ తనియన్లో ప్రస్తావింపబడి చిలుక కూరేశులేనని, పిలిచినవారు శ్రీరామానుజులనే శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యలోని వివరణం స్మరణీయం.

(త్వం జనకః అసి) - మీరే ఉత్పాదకులై ఉన్నారు. "శరీరమేవ మాతా పితరౌ జనయతః, స హి విద్యాత స్తం జనయతి తత్ శ్రేష్ఠం జన్మ" అనే రీతిలో జ్ఞానజన్మను కల్గించి, సత్తను కల్గించే జనకులు మీరు. దేహాత్మభ్రాంతితో, 'నేనే నాకు రక్షకుడను, దేవతాంతరాలు రక్షకులు'' అని తలచి, అసత్కల్పుడనై ఉండే నాకు "అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః" అనే రీతిలో భగవానుడైన శ్రియఃపతియే సర్వరక్షకుడు, సర్వశేషి - అనే తత్త్వాన్ని తెలిసేటట్లు చేసి, అంతటితో నిలువకుండా చరమపర్వపర్యంతమైన నిష్ఠను కల్గి ఉండేటట్లు చేసి, సత్తను ప్రసాదించిన జనకులు మీరు- అని భావం. "ఉత్తరోత్తరజాయమాన

స్వరూపాతిశయ విశిష్టస్వరూపస్య సదోత్పత్తేః జనక స్త్వమసి సదాతన మితి లట్ ఉపపత్తిః" అని వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య. శిష్యుని స్వరూపసమృద్ధి అతిశయంతో కూడిన స్వరూపాన్ని సదా కల్గించినందున నీవు సదా జనకుడవు. ఈ జనకత్వం సదాతనం- నిత్యం- కనుక లట్ ప్రయోగం సార్థకం -అని దీని భావం. మొదట **"బంధు"** శబ్దంతో సంబంధసామాన్యాన్ని నిర్దేశించి, తరువాత కొన్ని విశిష్టలౌకిక సంబంధాల ప్రస్తావనను కవి చేశారు.

**(త్వం సఖా అసి)** - **"సమానః ఖ్యాయతే లోకైః ఇతి సఖా"** అనే సఖాశబ్దవ్యుత్పత్తిద్వారా స్వరూపాను రూపమైన భగవద్భాగవతాచార్య కైంకర్యానుభవంలో వెంట తోడుగా ఉండి, సాచివ్యంద్వారా, వృత్తభోగకీర్త నాదులలో సమానత్వాన్ని కల్గిన సఖులు మీరు. ఈ సంబంధం శారీరకం కాదు ఆత్మీయం.

**(త్వం దేశికః అసి)** - **"దిశతి- ఉపదిశతీతి దేశికః"**- తత్త్వహితాలను ఉపదేశించి, వాటిలో ప్రవర్తింపజేసి, అహితాలనుండి నివర్తింపజేసే ఉపదేష్టలు. మీరు. **"తెరుళ్ తరు మాదేశికులు"** కదా శ్రీవరవరమునులు. **"దిశతి-ప్రదిశతి ఇతి దేశికః"** అనే వ్యుత్పత్తి ద్వారా భగవదనుభవాన్ని కల్గించేవారని కూడా అర్థం. **"దిశతి, దిశ-అతిసర్జనే"** అనే ధాతువు నుండి పుట్టిన ఈ దేశిక శబ్దానికి స్వరూపోపాయ పురుషార్థ జ్ఞానదాతలని తాత్పర్యం.

**(త్వం విద్యా అసి )** - **"కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా"** అని ప్రశంసింపబడిన విద్యాస్వరూపులు మీరు. హితాలను అన్నిటిని కల్గించగల్గిన విద్య మీరే. విద్యాదాతలు మీరే, విద్యాస్వరూపులు మీరే. ప్రాప్యప్రాపకులు మీరే.

**(త్వం వృత్తమ్ అసి )** - ఆ విద్యయొక్క కార్యరూపమైన - ఆచరణరూపమైన - సదాచారంకూడా మీరే. **"వృతు - వర్తనే"** అనే ధాతువునుండి నిష్పన్నమైతే ప్రాపకం అనే అర్థాన్ని, **"వృతు-వరణే"** అనే ధాతునిష్పన్నమైతే ప్రాప్యమనే అర్థాన్ని ఈ వృత్తశబ్దం ఇస్తుంది. అందువల్ల ఇది ఉపాయోపేయత్వ సూచకం.

**(త్వం సుకృతమ్ అసి)** - చెప్పబోయేవానికి అన్నిటికి మూలకారణమైన, జన్మాంతర కృతసుకృతం కూడా మీరే. మిగిలిన సుకృతాలు ఫలాన్ని ఇచ్చిన మఱుక్షణం నశిస్తాయి. కాని **"శుభాని పుష్ణాతి న జాతు హీయతే"** అనే రీతిలో సతతం ప్రవర్తించే విలక్షణసుకృతరూపులు మీరు. ఈ అర్థం వర్తమాన నిర్దేశలబ్ధం. **"సుకృతం తు శుభే పుణ్యే"** అనే నిఘంటు వచనం ద్వారా ఈ పదం ఉపేయవాచికూడా.

**(త్వముత్తమం విత్తమ్)** - స్వరూపానుగుణమైన, ఆత్మాంతమైన భోగానికి సాధనభూతులు (విత్తం భోగసాధనమే కదా!) ఆపదలో రక్షించేవారు - ఇత్యాది కారణాలవల్ల శ్రీవరవరమునులు ప్రకృష్టధన స్వరూపులని భావం. లోకంలోని ధనం **"ఆపదర్థం ధనం రక్షేత్"** అనే రీతిలో దేహానికి కలిగే ఆపదను పోగొట్టుకొనే సాధనం మాత్రమే. శ్రీవరవరమునులనే ధనం ఆత్మకు కలిగే ఆపదను తీర్చే, భగవదనుభవాన్ని కల్గించే సాధనం కదా! లేక, **"ఉత్తమం స్వార్జితం విత్తమ్"** అనే రీతిలో తనకు అసాధారణమైన విత్తం కనుక, శ్రీవరవరమునులు ఉత్తమవిత్తం. **"విద్ల్ - లాభే"** అనే ధాతువునుండి కరణవ్యుత్పత్తి ద్వారా ప్రాప్యమనే అర్థాన్ని కూడా విత్తశబ్దం ఇస్తుంది కనుక, ఇక్కడ కూడా ఈ పదం ద్వారా ప్రాప్య ప్రాపకత్వం సూచితం.

**(త్వమ్ ఆత్మాసి)** - పూర్వం ప్రస్తావింపబడిన అన్నిటికి శేషి మీరే కనుక, ఆత్మస్వరూపులు మీరు. లోకంలో దేహాదులన్నీ ఆత్మకు శేషభూతాలు, ఆత్మ వాటికి శేషియై కదా ఉంటుంది. ఆ ఆత్మకూడా మీకు శేషం, మీరు దానికి శేషి - అని భావం. ఆత్మశబ్దానికి **"ఆప్నోతి, ఆదత్తే, అత్తి- ఇతి ఆత్మా"** ఇత్యాది వ్యుత్పత్తులు గ్రాహ్యాలు. **"ఆదీయతే, అద్యతే"** ఇత్యాది వ్యుత్పత్తులు ఉపాయోపేయత్వ సూచకాలు.

**(ఆంతరః శాసితా)** - **"య ఆత్మాన మంతరో యమయతి"** అని వేదంచే ఆత్మల లోపల ఉంటూ వాటిని శాసించేవాడుగా చెప్పబడే పరమాత్మ మీరే. **"అంతః ప్రవిష్టః శాస్తా"** అనే వేదసూక్త్యర్థం చరమ పర్వాత్మకంగా అనుసంహితం. **"ఆంతరః శాసితా"** అంటే - పరమాత్మ. లోపల ఉండి శాసించేవాడని అర్థం. పరమాత్మ అందఱి లోపల ఉండి శాసించగా, ఆ పరమాత్మకు సైతం ఆత్మస్థానీయులైన జ్ఞానికదా శ్రీవరవరమునులు. **"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** అని కదా గీతాసూక్తి. **"అఱివార్ ఉయిరానాయ్"** అని ఆళ్వార్ల సూక్తి. అందువల్ల అందఱి లోపల ఉండి శాసించే పరమాత్మకుకూడా ఆత్మస్థానీయులై, ఆ స్వామిని శాసించేవారని తాత్పర్యం. ఈ శాసనం ప్రీతి ప్రయుక్తం. అధికారం ప్రయుక్తం కాదు.

**(యద్వా)** - ఇంతగా ఒక్కొక్కటిగా పల్కడం ఎందుకు?,

**(యద్యత్ సర్వమ్ ఆత్మానురూపమ్)** - నిష్కృష్టమైన ఆత్మస్వరూపానికి అనుగుణమైనవి ఏమి ఉన్నాయో, అవి అన్నీ మీరే. లోకంలో తండ్రి తల్లి కాలేడు. తల్లి తండ్రి కాలేదు. బంధువు ధనం కాలేడు. ధనం బంధువు కాలేదు. వారి వారి శక్తి తావన్మాత్రం. కాని, శ్రీవరవరమునులు తండ్రి చేసే పనిని, బంధువు చేసే పనిని, సఖుడు చేసేపనిని, ఆత్మ చేసే పనిని - అందఱు చేసే పనిని నిర్వహిస్తున్నందున జనకాదిసర్వబంధువిధత్వం వారికి ఉన్నది - అని భావం. **"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః"** అనే గీతాసూక్తి భావ్యం. గత్యర్థకాలైన **"సృ-గతౌ"** అనే ధాతువు నుండి **"షర్వ-గతౌ"** అనే ధాతువుల నుండి పుట్టిన సర్వశబ్దం కూడా ప్రాప్యప్రాపకాలను రెండిటిని తెల్పుతుంది. ఈ విధంగా ఈ శ్లోకంలోని పదాలు ఉపయోపేయత్వసూచకాలై ఉండడం గమనార్హం. ఇదే కదా ఈ ప్రబంధ ప్రమేయం.

సుఖాలను అనుభవించేటపుడు వెంట ఉండడం, కష్టాలను అనుభవించేటపుడు లేకపోవడం- అనే తేడా లేకుండా ఎల్లప్పుడు వెంట ఉండి, వాటిని పాలు పంచుకొనేవాడు బంధువు. ఆత్మకు జ్ఞానమనే జన్మను కల్గించేవాడు ప్రకృతంలో జనకుడు. భగవద్భాగవతాచార్యగుణానుభవాన్ని పొందేటపుడు తోడుగా ఉండేవాడు సఖుడు. మంచి చెడ్డలను తెలిపి, తగని మార్గం నుండి మరలించి, సన్మార్గంలో ప్రవర్తింపజేసేవాడు దేశికుడు. హితాలను అన్నిటిని కల్గించగల్గినది విద్య. ఆ విద్యయొక్క ఫలంగా వెలువడేది సద్వర్తనం. ఈవిధంగా ఇక్కడ ప్రస్తావించిన, ప్రస్తావించని గుణాలకు, మంచికి అన్నిటికి మూలకారణం సుకృతం. భగవదనుభవాది సుఖాన్ని కల్గించేదై, ఆపదలో సహాయపడేది ధనం. అన్నిటిని తన ఇష్టానుసారంగా ఉపయోగించుకొని ఆనందించేవాడు శేషి. అన్నిటి లోపల ఉండి, నియమించేవాడు ఆంతరశాసిత. పరమాత్మలో గల ఆత్మత్మ-శేషిత్వ- ఆంతరశాసితృత్వాలనే ఈ మూడు స్వభావాలు శ్రీవరవరమునిలో ఉన్నవని తమకు తోచడంచేత కవి, శ్రీవరవరమునులను ఆత్మగా, శేషిగా, ఆంతర శాసితగా పలికారు. ఇంతేకాక, పరమాత్మ అయిన శ్రీరంగనాథుని తమకు శిష్యునిగా చేసికొన్నందున,

"శ్రీశైలేశ దయాపాత్రమ్" ఇత్యాది తనియన్ అనుసంధానమనే ఉపయోగాన్ని గ్రహించి, ఆనందించినందున, ఆచార్యులైన తాము అతని (శ్రీరంగనాథుని) ధ్యానానికి లక్ష్యమై, లోపల ఉండి, పరమవైదికులు చేసే కైంకర్యాలలో నియమించినందున, శ్రీవరవరమునులు మిగిలిన శిష్యులకువలె, శ్రీరంగనాథునకు కూడా ఆత్మగా, శేషిగా, ఆంతరశాసితగా ఉన్నారు - అనేది ఇచటి ఆంతరమైన అర్థం. ఆ శ్రీరంగనాథుడు కూడా చరమపర్వనిష్ఠుడే. ఈవిధంగా, శ్లోకంలోని మొదటి మూడు పాదాల అర్థం నిర్వహింపబడింది. ఇక, నాల్గవ పాదానికి భావం ఏమంటే - లోకంలో ఒకనికి బంధువు, తండ్రి, సఖుడు, ఆచార్యుడు- అని ఈవిధంగా చెప్పబడే ఒక్కొక్కరు తమ తమ అవధిలోనే ఉంటారు తప్ప, ఒకరు చేసే మంచిని ఇంకొకరు చేయలేరు. ఒకరు ఇంకొకరుగా కాలేరు. కాని, శ్రీవరవరమునులు, మిగిలిన వారికి భగవానుడు సర్వవిధబంధువైనట్లుగా, తమకు సర్వవిధబంధువై ఉన్నారు - అని.

**11.** అవ :- ఇక, ఈ శ్లోకంలో, శ్రీవరవరమునులకే అసాధారణమైన పంచమోపాయ తత్త్వప్రవర్తకత్వాన్ని గూర్చి పల్కుతున్నారు.

**ఆమ్నాయేషు స్మృతిభి రమితైః సేతిహాసైః పురాణైః**
**దృశ్యం యత్నైః యదిహ విదుషా దేశికానాం ప్రసాదాత్ ।**
**స్వైరాలాపైః సులభయసి తత్ పంచమోపాయతత్త్వం**
**దర్శందర్శం వరవరమునే! దైన్యమస్మద్విధానామ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, ఇహ = అన్యథాజ్ఞానాదులు నిండిన ఈ లోకంలో, విదుషా = జ్ఞానాన్ని కల పురుషునిచేత, యత్నైః = పరిప్రశ్న, శుశ్రూషాది ప్రయత్నాలతో (కలిగే), దేశికానాం ప్రసాదాత్ = ఆచార్యుల అనుగ్రహంవల్ల, స్మృతిభిః = మనుస్మృతి మొదలైన స్మృతులచేత, సేతిహాసైః = శ్రీరామాయణ, భారతాలనే ఇతిహాసాలతో కూడిన, పురాణైః = విష్ణుపురాణం మొదలైన అనేక పురాణాల సహాయం చేత, ఆమ్నాయేషు = వేదాలలో, యత్ దృశ్యమ్ = ఏది దర్శించదగినదో, తత్ = అటువంటి, పంచమోపాయతత్త్వం = ఆచార్యుడనే అయిదవ ఉపాయంయొక్క స్వరూపాన్ని, అస్మద్విధానాం = పూర్వం పల్కిన జ్ఞానం, ప్రయత్నం మొదలైనవానిలో దేనినీ లేని నావంటివారియొక్క, దైన్యం = స్వరూపనాశమనే దయనీయత్వాన్ని (జాలిపడదగిన స్థితిని), దర్శందర్శం = గమనించి, గమనించి, స్వైరాలాపైః = యథేష్టంగా, వేడుకగా పలికే మాటలద్వారా, సులభయసి = సులభం చేస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (ఇహ)** - **"ఇరుళ్ తరుళ్ మాఞాలమ్"** అనే ఈలోకంలో- అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానాదులతో నిండిన ఈ సంసారమండలంలో - అని భావం. ప్రత్యక్షంగా కన్పించే ఇహలోకాన్ని దర్శించి నిర్దేశిస్తూ ఈ పదాన్ని పలికారు. దీనిద్వారా ఇహలోకంలోని తమోమయత్వం సూచితం.

**(విదుషా)** - జ్ఞానాన్ని కల్గిన పురుషునిచేత - అని అర్థం. **"విద- జ్ఞానే"** అనే ధాతువుకు వర్తమానార్థక లడాదేశమైన శతృప్రత్యయానికి వసురాదేశంరాగా విద్వచ్ఛబ్దం నిష్పన్నమైనది. అందువల్ల ఈపదప్రయోగం ద్వారా నిరంతరం జ్ఞానాన్ని సముపార్జించేవాడనే అర్థస్వారస్యం ద్యోతకమవుతుంది. "అనవరత

సర్వదురీహావిషయకజ్ఞానశీలేనేతి యావత్" అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్య. ఇది కర్తృపదం. జిజ్ఞాసువని తాత్పర్యం.

**(యత్నైః)** - శ్రవణమనన నిదిధ్యాసనాదిరూపాలైన యత్నాలతో- అని అర్థం. ఇది హేతువాచకం. "దృశ్యమ్" అనే పదంతో గాని, "ప్రసాదాత్" అనే పదంతోగాని అన్వయిస్తుంది. పలు విధాలైన తమ అనువర్తనాలద్వారా - "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" ఇత్యాది యత్నాలద్వారా కలిగేది;

**(దేశికానాం ప్రసాదాత్)** - ఆచార్యానుగ్రహంవల్ల - అని అర్థం. ఆచార్యానుగ్రహం లేకపోతే పరమార్థజ్ఞానస్ఫూర్తి కలుగదు. "యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" అని శ్వేతాశ్వతరీయసూక్తి. "దిశతి దేశికః" అనే వ్యుత్పత్తిని కల దేశికపదం ఇచట సాభిప్రాయకపదం. "తెరుళ్ తరు మాదేశికనై చ్చేర్న్దు" అనే వరవరముని ఉపదేశరత్తినమాలైసూక్తి భావ్యం. "ప్రసాదోஉనుగ్రహే" అని మేదినీనిఘంటువచనం.

**(ఆమ్నాయేషు దృశ్యమ్)** - వేదాలలో దర్శించినదగిన అర్థం ఏదో, ఆ పంచమోపాయాన్ని - అని అర్థం. ఈ వేదార్థాన్ని **"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి"** అనే సూక్తివల్ల స్మృతి. ఇతిహాసపురాణాల సహాయంతో నిశ్చయించాలి. స్మృతులలో కూడా **"మన్వర్థవిపరీతా తు సా యా స్మృతిః సా న శస్యతే"** అనే రీతిలో మనుస్మృతిప్రధానం. ఈ విధంగా స్మృతి-ఆగమ-ఇతిహాస-పురాణాలద్వారా, ఆచార్యానుగ్రహంతో వేదాలలో దర్శించే అర్థం పంచమోపాయమే. "ఆమ్నాయేషు" అనే సప్తమీ ప్రయోగం అధికరణార్థవివక్షతో చేయబడింది. **"నిన్‌తిరువెట్టెழుత్తుమ్ కర్ఱు నాన్ ఉర్ఱదు ఉన్ అడియార్క్కడిమై"** అని కదా తిరుమంగై ఆழ్వార్ల సూక్తి. **"ఋచో యజూంషి సామాని, తథైవాథర్వణాని చ, సర్వమష్టాక్షరాంతస్థమ్"** అనే రీతిలో వేదసారం అష్టాక్షరి. దాని సారం పంచమోపాయం. ముముక్షుప్పడి రహస్యగ్రంథంలో శ్రీపిళ్లైలోకాచార్యులవారు తిరుమంత్రార్థాన్ని వివరించేటప్పుడు నమశ్శబ్దార్థ వివరణ ఘట్టంలో - **"ఇదిలే భాగవత్ శేషత్వమను సంధేయమ్", "ఇదు అకారత్తిలే ఎన్తుమ్ శొల్లువర్‌కళ్, ఉకారత్తిలే ఎన్తుమ్ శొల్లువరకళ్"** అని సూత్రీకరించడం, దానిని వరవరమునులు విశదంగా వ్యాఖ్యానించడం స్మరణీయం.

**(తత్ పంచమోపాయతత్త్వమ్)**- కర్మ-జ్ఞాన- భక్తి -ప్రపత్తులనే. చతుర్విధోపాయాలకంటే విలక్షమైన ఆచార్యరూప పంచమోపాయంయొక్క తత్త్వాన్ని- అని భావం. **"పంచమ శ్చాసౌ ఉపాయః పంచమోపాయః"** అని విగ్రహవాక్యం. రామానుజార్యరూపచరమోపాయమని అర్థం. **"ఊర్ధ్వం నయంత్యుపాయా స్తే"** (ఆ ఉపాయాలు అన్నీ ఊర్ధ్వగతిని పొందిస్తాయి) అనే రీతిలో తదీయాత్యంతపారతంత్ర్యరూపమైన, ఉత్తమగతి ప్రాప్తిహేతువైనది ఉపాయం. "ఉపరి ఆయతి" అనే అర్థంలో పృషోదరాదులలో గల "ఉపరి" శబ్దంలో "రి" లోపం, "ణిచ్" లోపం ఏర్పడగా, ఉపాయమనే రూపం నిష్పన్నమవుతుంది. ఉత్తమ - ఊర్ధ్వగతిని పొందించేది- అని అర్థం. **"ఉపైతి వాంఛిత మనేనే త్యుపాయః"** అని, **"ఉపాయతే అనేన ఇత్యుపాయః"** అని కొన్ని ఉపాయశబ్ద వ్యుత్పత్తులు చెప్పబడినా, ఊర్ధ్వగతి ప్రాపకమనే అర్థాన్ని ఇచ్చే అద్భుతమైన వ్యుత్పత్తిని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారు తెలియజేశారు. ఈ విధమైన ఆచార్యాభిమానమనే

పంచమోపాయం భగవద్రామానుజులలో **"తస్మిన్ రామానుజార్యే గురురితి చ పదం భాతి"** అనే రీతిలో పర్యవసిస్తుంది - అనే తత్త్వాన్ని - అని భావం. **"పంచమో రుచిరే దక్షే"** అనే అమరసుధావ్యాఖ్యానంలో ఉట్టంకింపబడిన ప్రమాణాన్ని బట్టి మనోహరమైన, సమర్థమైన - అనే అర్థాలుకూడా పంచమశబ్దానికి గ్రాహ్యాలు. అందువల్ల పంచమోపాయశబ్దానికి మనోహరమైన, సమర్థమైన ఉపాయమని అర్థం గ్రాహ్యం. దీనివల్ల ఈ ఉపాయం ప్రియం, హితం కూడా - అనే విశేషం స్ఫురిస్తున్నది. **"సుసుఖం కర్తు మవ్యయమ్"** అనే గీతాసూక్తి కూడా ఇక్కడ స్మరించాలి.

**(అస్మద్విధానామ్)** - ఇది సాభిప్రాయక ప్రయోగం. పూర్వం తెల్పిన రీతిలో శ్రవణమననాది యత్నాలను కాని, ఆచార్యుల అనుగ్రహాన్ని కాని, ఆచార్యాభిమానాన్ని కాని లేని మావంటివారికి - అని అర్థం. **"అస్మత్"** అనే బహువచనంవల్ల, దాని చివరగల బహువచనంవల్ల ఈ విధంగా ఏవిధమైన యోగ్యత లేనివారి సంఖ్యాబాహుళ్యం సూచింపబడింది - ఇది **"ఇరుళ్ తరు మా ఞాలమ్"** కదా!

**(దైన్యమ్)**- దీనత్వం - అని అర్థం. క్షయించిన స్వరూపాన్ని కల్గినవాడై ఉండడం. స్వరూపనాశమని తాత్పర్యం. దీన శబ్దం **"దీఙ్- క్షయే"** అనే ధాతువునుండి నిష్పన్నమైనది. దుర్గతిని పొందినవాడని దీని అర్థం. ఇటువంటి మా దీనదశను - దుర్గతిని

**(దర్శందర్శమ్)** - మాటిమాటికి చూచి - అని అర్థం. దీనివల్ల కవి దుర్గతియొక్క పరమావధి, శ్రీవరవరమున అంతులేని దయ సూచితాలు.

**(స్వైరాలాపైః)** - ప్రసంగం మధ్యలో ప్రసక్తానుప్రసక్తంగా, సరసంగా అలవోకగా పలికే శ్రీసూక్తులద్వారా.

**(అస్మద్విధానాం సులభయసి)**- పంచమోపాయతత్త్వాన్ని మావంటివారికి సదా సులభం చేస్తున్నారు. ఈ విషయాన్ని ఉత్తర దినచర్యా ప్రబంధంలో **"స్వైరాలాపైః శుభైః శ్రోతౄన్ నందయంతమ్"** అని సూచించారు. ఇచటి **"శుభైః"** అనే విశేషణం ద్వారా ఈస్వైరాలాపాలు పంచమోపాయతత్త్వవిశదీకరణాలనే విషయం సూచితం. అందువల్లనే **"స్వైరాలాపప్రకారశ్చ శతకేష్వనుసంహితః"** అని అంటూ ఈ శ్లోకాన్ని వాధూల వీరరాఘవాచార్యస్వామివారు దినచర్యా వ్యాఖ్యలో ఉదాహరించారు.

బహుకష్టతరమైన ఆచార్యానువర్తనంద్వారా పొందదగినది, గొప్పదైన ఆచార్యానుగ్రహసాధ్యమైనది, పలువురు పెద్దలవద్ద పలుమార్లు తత్త్వోపదేశాలను ఆలకించడం ద్వారా అతిశయితమైన జ్ఞానాన్ని పొందినవారిలో ఎవరో ఒకరిచే మాత్రం అతికష్టంతో తెలియదగినదైన చరమోపాయతత్త్వాన్ని అనాయాసంగా స్వైరభాషణాలద్వారా అజ్ఞులమైన మావంటివారికి సుగమం చేయడమే కాక, సులభంగా- ఏ శ్రమ లేకుండా పొందదగినదిగా - చేస్తున్నారు - అని తాత్పర్యం. **"సులభయసి"** అనే వర్తమాన క్రియానిర్దేశం ద్వారా ఏదో ఒకమాఱు కాకుండా సదా సులభం చేస్తున్నారని ధ్వనిస్తున్నది. ఇటువంటి మహోదారులు కనుకనే ఆ మహౌదార్యం స్ఫురించేటట్లు శ్రీవరవరమునులు **"ప్రపన్నజన చాతకాంబుదమ్"** అని కీర్తింపబడుతున్నారు. **"కర్తుం త్యక్తు మపి ప్రపత్తు మనలం సీదామి దుఃఖాకులః"** (కర్మాద్యుపాయాలను చేయడానికి, విడువడానికి, ప్రపత్తిచేయడానికి అసమర్థుడనై, దుఃఖాకులుడనై బాధపడుతున్నాను) అని

చెప్పబడిన రీతిలో స్వరూపవిరుద్ధమైనదని, స్వాతంత్ర్యప్రయుక్తమైనదనే చింతనవల్ల కల్గిన భీతిచేత ఏర్పడిన దీనత్వం ప్రకృతంలో దైన్యమనే పదంచేత సూచితమని చెప్పవచ్చు. "స్త్వైరాలాపైః" అనే ప్రయోగంవల్ల- మావంటివారికి ఉపదేష్టృ- ఉపదేశ్యక్రమంలో (ఉపదేశించేవాడు- ఉపదేశింపబడేవాడు అనే క్రమంలో) మీవంటివారు ఉపదేశించినా, అది మా దురభిమానవశంచేత అసూయకు కారణం కాగలదనే కారణంచేత, ఆ క్రమాన్ని దాచిపెట్టి, సరససల్లాపాల రూపంలో అటువంటి మహనీయార్థవిశేషాలను తెలుపుతున్నారు- అనే విశేషార్థం ధ్వనిస్తుంది.

ఇక, శ్లోకంలో "ఆమ్నాయేషు... పురాణైః దృశ్యమ్" అనే ప్రయోగాన్ని వివరిస్తూ శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారు తమ సంస్కృత వ్యాఖ్యలో చరమోపాయానికి చెందిన పలు ప్రమాణాలను పుంఖానుపుంఖంగా ఉట్టంకించారు. "యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః", "దేవ మివాచార్య ముపాసీత", "గురురేవ పరం బ్రహ్మ గురురేవ పరా గతిః, యస్మాత్తదుపదేష్టాఽసౌ తస్మాద్గురుతరో గురుః" "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా", "పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్", "ఆచార్యవాన్ పురుషో వేద" "యేనైవ గురుణా యస్య బ్రహ్మవిద్యా ప్రదీయతే, తస్య వైకుంఠదుగ్ధాబ్ధిద్వారకా స్సర్వ ఏవ సః", "యస్యానుభావపర్యంతాః", "అన్వయాదపి చైకస్య సమ్యక్ న్యస్తాత్మనో హరౌ, సర్వ ఏవ ప్రముచ్యేరన్ నరాః పూర్వే పరే తథా", "బాలమూకజడాంధాశ్చ పంగవో బధిర స్తథా, సదాచార్యేణ సందృష్టాః ప్రాప్నువంతి పరాం గతిమ్", "ధన్యాః కేచన తేభ్యోఽపి తేషామాదేశవర్తినః", "సిద్ధిర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్", "యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః", "యత్రర్షయః ప్రథమజా యే పురాణాః", "చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన!, పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషమ్", "నయ మాం నిజభృత్యపార్శ్వమ్, కథం ను విసృజే తవ భృత్యదాస్యమ్" ఇత్యాది ప్రమాణాలు గమనించదగినవి. ఈ ప్రమాణాలు కేవలం ఉపలక్షణం. ఇటువంటివి కోకొల్లలుగా ఉన్నాయి. పూర్వాచార్య సూక్తులలో కూడా "పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా", "యద్వా భాగవతాభిమానవసతిః", "తవ భరోఽహమకారిషి" "సత్యం సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః", "భక్తిప్రపత్తీ యది దుష్కరే వో రామానుజార్యం నమతేత్యవాదీత్", "విష్ణు శ్శేషీ తదీయ శ్శుభగుణనిలయో విగ్రహః శ్రీశఠారిః, తస్మిన్ రామానుజార్యో పదకమలయుగం భాతి రమ్యం తదీయమ్, తస్మిన్ రామానుజార్యే గురురితి పదం భాతి నాన్యత్ర తస్మాత్ శిష్టం శ్రీమద్గురూణాం కుల మిద మఖిలం తస్య నాథస్య శేషః", "తన్నిష్ఠసంశ్రయః", "తదనుబంధి మదావలిప్తో రామానుజార్యవశగః పరివర్తిషీయ", "రామానుజః శరణమస్తు మునిః స్వయం నః", "అనుకల్పభూతమురభిత్పదమ్", "దివ్యాపాంగం దిశసి కరుణే! యేషు సద్దేశికాత్మా క్షిప్రం ప్రాప్తౌ వృషగిరి పతిం క్షత్రబంధ్వాదయస్తే", "తృణీకృతవిరించాదినిరంకుశవిభూతయః, రామానుజపదాంభోజ సమాశ్రయణ శాలినః", "కాలత్రయేఽపి కరణత్రయనిర్మితాతిపాపక్రియస్య శరణం భగవత్ క్షమైవ, సాఽపి త్వయైవ కమలారమణేఽర్థితా

యత్ క్షేమ స్స ఏవ హి యతీంద్ర! భవచ్ఛ్రితానామ్" ఇత్యాది ప్రమాణాలు పంచమోపాయపరంగా అనుసంధేయాలు. ఉత్తరదినచర్యా స్తోత్రంలోని "స్వైరాలాపైః శుభైః" అనే ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామివారు ఈ శ్లోకాన్ని ఉదాహరించడం గమనించదగినది.

**12.** అవ :- ఇక, రెండు శ్లోకాలద్వారా శ్రీవరవరమునులు పంచమోపాయతత్త్వ ప్రవర్తకులనే విషయానికి శ్రీరంగనాథుడే ప్రమాణం - అని అంటున్నారు.

**సత్సంబంధో భవతి హిత మిత్యాత్మనైవోపదిష్టం**
**శిష్టాచారం ద్రఢయితు మిహ శ్రీసఖో రంగధుర్యః ।**
**ద్వారం ప్రాప్య ప్రథితవిభవో దేవదేవ స్త్వదీయం**
**దృష్ట్వైవ త్వాం వరవరమునే ! దృశ్యతే పూర్ణకామః ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, దేవదేవః = నిత్యసూరినాథుడు, ప్రథితవిభవః = లోకప్రసిద్ధమైన వైభవాన్ని కలవాడైన, రంగధుర్యః = శ్రీరంగనాథుడు, సత్‌సంబంధః = తత్త్వాన్ని తెలిసిన జ్ఞానుల సంబంధం, హితం భవతి ఇతి= మోక్షానికి హేతువు కాగలదని, ఆత్మనా + ఏవ= తనచేతనే, ఉపదిష్టం= గీతాదులలో ఉపదేశింపబడిన విషయాన్ని, శిష్టాచారం = శిష్టాచారాన్ని కల్గినదిగా (మహనీయులచే ఆచరింపబడినదిగా), ద్రఢయితుం = దృఢపఱచడంకోసం, ఇహ= ఇక్కడ, శ్రీసఖ స్సన్ = లక్ష్మీసహితుడై, త్వదీయం = తమయొక్క, ద్వారం = మఠం వాకిలిని, ప్రాప్య = పొంది, త్వాం దృష్ట్వైవ = మిమ్ములను సేవించిన తరువాతనే, పూర్ణకామః = ఆశ తీరినవాడుగా, దృశ్యతే = కన్పడుతున్నాడు.

వ్యాఖ్యానమ్ : **"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"** ఇత్యాదిగా సదాచార్య సంబంధం మోక్షసాధనమని తాను గీతాదులలో తాను శ్రీకృష్ణావతారంలో ఉపదేశించిన విషయం ఎవరిచేత అనుష్ఠింపబడనందున అప్రమాణం కాగలదని తలచి, దానిని లోకులు విడువకుండా ఉండాలని, శ్రీరంగనాథుడు శ్రీవరవరమునుల నివాసస్థలానికి వేంచేసి, గురూపసత్తిని చేసి, సదాచార్యులైన శ్రీవరవరమునుల సంబంధాన్ని పొంది, తనసూక్తి యొక్క శిష్టాగ్రేసరుడైన తన అనుష్ఠానం ద్వారా ప్రామాణ్యాన్ని దృఢపఱచి, తన కోరిక తీరినవాడై ఆనందించాడని భావం. తన ఉపదేశాన్ని తానే అనుష్ఠించి చూపడం ఆవశ్యకం కదా! **"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః"** అని తానే అన్నాడు కదా!

**(సత్సంబంధః)** - **"అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదురితి"** అనే రీతిలో స్వరూపజ్ఞానాన్ని పొందడంవల్ల సత్తను కల్గినవారని, భగవానుని స్వరూపరూపగుణ విభూతుల జ్ఞానానుభవాలను కల్గిన వారని భావం. అటువంటి వారిలో అగ్రేసరులుకదా శ్రీవరవరమునులు. వారితో సంబంధమంటే సహవాసాది రూపమైన, శిష్యాచార్యరూపమైన సంబంధం. లేక, అష్టాక్షరీమంత్రార్థ ప్రతిపాదితమైన నవ విధాత్మక సంబంధం. అది **"త్వం మే బంధుః"** ఇత్యాది శ్లోకంలో ప్రతిపాదితం.

**(హితమ్ ఇతి)** - పరమపురుషార్థమైన మోక్షానికి సాధనం - అని.

**(ఉపదిష్టమ్)** - ఉపదేశమంటే అజ్ఞాతజ్ఞాపనం. తెలియని విషయాన్ని తెలియజేయడం. **"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"** ఇత్యాదిగా గీతాదులలో ఉపదేశింపబడిన హితం.

**(శిష్టాచారమ్)** - శిష్టులంటే తత్త్వహితపురుషార్థాల విషయంలో ఏ భ్రాంతి లేని, స్పష్టమైన జ్ఞానాన్ని కలవారి, **"అలూక్షా ధర్మకామాస్స్యుః''** అని కీర్తింపబడిన మహనీయుల ఆచారం.

**(ద్రఢయితుమ్)** - **"యద్యదాచరతి శ్రేష్ఠ తత్తదేవేతరో జనః", "మేలైయార్ శెయ్‌వనకళ్"** అనే రీతిలో శిష్టాచారమే ప్రమాణం కనుక, తద్ద్వారా తాను ఉపదేశించిన విషయాన్ని దృఢపఱచడంకోసం-అని అర్థం. **"అలూక్షా ధర్మకామా స్స్యుః యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః'** అనే శ్రుతి, **"ధర్మజ్ఞసమయః ప్రమాణమ్"** అనే స్మృతి, **"మహాజనో యేన గతః స పంథాః", "విధయశ్చ వైదికాః"** అనే ఆచార్యసూక్తి. **"సువ్యాహృతాని మహతాం సుకృతాని తత స్తతః, సంచిన్వన్ ధీర ఆసీత"** అని, **"ఆచార శ్చైవ సాధూనామ్"** ఇత్యాదిసూక్తులు శిష్టాచారం ప్రమాణమనే విషయాన్ని తెల్పుతున్నాయికదా! శ్రీరంగనాథుడు శిష్టాగ్రేసరుడనే విషయాన్ని తెలుపడంకోసం **"ప్రథితవిభవః, శ్రీసఖః, దేవదేవః"** అనే మూడు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. లక్ష్మి (సీతా) దేవికూడా **"ఇహ సంతో వా న సంతి స తో వా నానువర్తసే"** అని అంటూ సత్సంబంధం హితాన్ని కలుగజేస్తుందని తెల్పింది. కనుక ఆమె సాన్నిధ్యం కూడా అనుష్ఠానంలో ఆవశ్యకమనే ఉద్దేశ్యంతో **"శ్రీసఖః"** అని ప్రయోగింపబడింది. ఆచార్యమణిహారంలో లక్ష్మీదేవి భాసిస్తున్నది కదా.

**(త్వదీయం ద్వారమ్)** - దేవరవారి నివాసమైన మఠద్వారాన్ని,

**(ప్రాప్య)** - **"సుదూరమపి గంతవ్యమ్ యత్ర భాగవతాః స్థితాః"** అని అంటూ పరమభాగవతులుండే చోటును చేరడం ప్రాప్యకోటిలో చెప్పబడింది కదా! అందువల్ల భాగవతదేశప్రాప్తికూడా ఉద్దేశ్యమే. **"ఆప్త్వా, ఆ+ఆప్య, ప్ర+అ+ఆప్య"** అనే విభాగాన్ని పర్యాక్రమంగా అన్వయింపచేసి, ఆచార్యపద సాన్నిధ్యాన్ని చేరడం **"ప్రాప్య"** అనే పదం ద్వారా తెలుపబడినదని చెప్పవచ్చు. ఇటువంటి వివరణాన్నే 16వ, 17వ శ్లోకవ్యాఖ్యలలో కూడా గమనించవచ్చు.

**(పూర్ణకామః దృశ్యతే)** - మీ సన్నిధానాన్ని చేరి, మిమ్ములను సేవించి, మీ సంబంధాన్ని పొందిన తర్వాతనే తన కోరికను తీరినవాడుగా అందఱికి గోచరిస్తున్నాడు. తాను చెప్పిన మాటను తానే ఆచరించకపోతే, ఇక దానికి ప్రామాణ్యం కలుగదని తలచి, దానిని పరిహరించడంకోసం స్వయంగా వచ్చాడని భావం. తాను చెప్పిన మాటను స్వానుష్ఠానంద్వారా దృఢీకరించడం ఆంతరీయక కృత్యం కాదు, అది ఒక వ్యాజమాత్రమే. దేవరవారి దర్శనాన్ని పొందడమనే విలక్షణమైన లాభాన్ని కల్గినవాడై, శ్రీరంగనాథుడు పూర్ణమనోరథుడయ్యాడు. దీనికి అక్కడ అపుడు ఉన్నవారంతా ప్రత్యక్షసాక్షులు. ఆ శ్రీరంగనాథుడు దేవరవారి అప్రమేయమాహాత్మ్యానికి సాక్షి. **"ప్రాప్య పూర్ణకామః"**- అనే ల్యబంత ప్రయోగం ద్వారా శ్రీవరవరమున సన్నిధి ప్రాప్తి పూర్ణకామత్వానికి హేతువనే అర్థం ధ్వనిస్తున్నది. ఈ శ్లోకంలో ప్రస్తావింపబడిన వృత్తాంతాన్ని యతీంద్రప్రవణప్రభావంలో గమనించవచ్చు.

**13.** అవ :- పూర్వశ్లోకంలో శ్రీరంగనాథుడు గురూపసత్తిని (ఆచార్యసేవను) చేసినట్లు తెలుపబడింది. (గురూపసత్తి అంటే- గురువువద్ద ఉపదేశాన్ని పొందగోరిన శిష్యుడు ఆ ఆచార్యుని సన్నిధికి రావడమే) ఈ శ్లోకంలో **"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"** (నేను తెల్పిన ఆ ఆత్మజ్ఞానాన్ని, జ్ఞానులకు నమస్కరించి, శుశ్రూషచేసి, చక్కగా ప్రశ్నించి నీవు తెలిసికో. ఆత్మస్వరూపాన్ని సాక్షాత్కరించుకొన్న ఆ జ్ఞానులు నీచే సేవింపబడినవారై, తత్త్వాన్ని తెలియడంకోసం ప్రశ్నించే నీ అభిప్రాయాన్ని గ్రహించి, నీకు ఆ ఆత్మజ్ఞానాన్ని ఉపదేశిస్తారు) (గీత-4-3-4) అని తాను గీతలో ఉపదేశించిన విషయాన్ని శ్రీరంగనాథుడు స్వయంగా అనుష్ఠించి చూపుతున్నాడు- అని పల్కుతున్నారు.

**సోఽయం భూయః స్వయ ముపగతో దేశికైః సంసదం తే**
**శ్రుత్వా గూఢం శఠరిపుగిరా మర్థతత్త్వం త్వదుక్తమ్ ।**
**ఆగోపాలం ప్రథయతితరా మద్వితీయం త్వదీయం**
**వాచాం దూరం వరవరమునే! వైభవం శేషశాయీ ॥**

వరవరమునే = ఓ మణవాళమునీ! సః అయం = ఆచార్యులైన దేవరవారికి ఉపసత్తిని చేసిన ఆ ఈ శ్రీరంగనాథుడు, దేశికైః (యుక్త స్సన్) = శ్రీమన్నాథముని, శ్రీయామునముని మొదలైన ఆచార్యులతో కూడినవాడై, తే సంసదం = దేవరవారి గోష్ఠిని ఉద్దేశించి, భూయః = తిరిగి, స్వయమ్ ఉపగతః = స్వయంగా వచ్చినవాడై, తత్ ఉక్తమ్ =దేవరవారిచే చెప్పబడిన, శఠరిపుగిరాం = నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్మొழி దివ్యప్రబంధసూక్తులయొక్క, గూఢమ్ అర్థతత్త్వం = రహస్యమైన తత్త్వార్థాన్ని, శ్రుత్వా= (దేవరవారి సన్నిధిలో) విని, వాచాం దూరం = మాటకు దూరమైన (అందని)ది, అద్వితీయమ్ = సాటి లేనిది అయిన, త్వదీయం వైభవం = దేవరవారి వైభవాన్ని, శేషశాయీ = ఆదిశేషునిపై శయనించి ఉన్నవాడై, ఆగోపాలం = పామరులు కూడా తెలిసేటట్లుగా, ప్రథయతి తరామ్ = చాలా ప్రసిద్ధం చేస్తున్నాడు.

వ్యాఖ్యానమ్ : శ్రీరంగనాథుడు ఇంకొక ఆచార్యుని ఉపసత్తిని చేయకుండా, ఇంకొక ఆచార్యునివద్ద తిరువాయ్మొழி ప్రబంధంలోని తత్త్వార్థాలను వినకుండా, శ్రీవరవరమునుల సన్నిధిలోనే ఈ రెండు కార్యాలను చేసినందున, శ్రీవరవరమునుల వైభవం మాటకు అందనిదిగా, సాటి లేనిదిగా అయినది- అని తాత్పర్యం.

**(సోఽయం) - "సః అయమ్"** అనే ఈ రెండు సర్వనామశబ్దాలు పూర్వశ్లోకాలలో చెప్పబడిన వైలక్షణ్యాన్ని కల్గిన శ్రీరంగనాథుని పరామర్శిస్తాయి. **"దేవదేవః, ప్రథితవిభవః, శ్రీసఖః"** అనే పూర్వశ్లోకోక్త విశేషణాల ద్వారా తెలుపబడిన విలక్షణవైభవాన్ని కలవాడు, శ్రీవరవరమునులను ఉపసత్తిని చేసినవాడైన శ్రీరంగనాథుడు - అని భావం.

**(దేశికైః)** - ఆచార్యపదవిని నిర్వహించగల్గిన జ్ఞానవైలక్షణ్యాన్ని కల్గిన శ్రీమన్నాథయామునప్రముఖులైన అర్చామూర్తుల రూపంలోని ఆచార్యులతో కూడినవాడై.

**(తే సంసదమ్)** - చిరోపాసనకు విషయమైన దేవరవారి దివ్యగోష్ఠిని - అని అర్థం. **"సమ్యక్ సీదంతి అస్యామ్ ఇతి సంసత్"** అనే వ్యుత్పత్తిద్వారా తెలుపబడే సమ్యక్త్వం సమీచీనకర్తృత్వప్రయుక్తం. అంటే- విలక్షణమహాపురుషులైన మణవాళమహామునులచే అధిష్ఠింపబడడమే ఆ గోష్ఠికి కల సమ్యక్త్వం. అందువల్లనే కేవలం **"సభా"** శబ్ద ప్రయోగం చేయబడలేదు.

**(భూయః)** - మళ్ళీ -అని అర్థం. పూర్వశ్లోకంలో తెలుపబడిన ఆగమనాన్ని అనువర్తిస్తూ మఱొక్క మాఱు శ్రీరంగనాథుడు పత్నీసహితుడై ఉపదేశసిద్ధికోసం వేంచేశాడు- అనే విషయాన్ని తెలుపడంకోసం ఈ పదం ప్రయోగింపబడింది.

**(స్వయముపగతః సన్)** - స్వయంగా ఉపసత్తిని చేసినవాడై- అని అర్థం. **"స్వయమ్"** అనే పదప్రయోగం ద్వారా అర్చావతార సాధారణమైన **"అర్చక పరాధీనాఖిలాత్మస్థితిత్వాన్ని"** (అర్చకుల అధీనంలో ఉండే తన స్థితులను అన్నిటిని కల్గి ఉండడమనే దశను) కూడా దాటాడు- అనే అర్థం వ్యక్తమవుతున్నది.

**(త్వదుక్తమ్)** - చిరోపాసితులైన దేవరవారిచే ఉపదేశింపబడిన,

**(శఠరిపుగిరామ్)** - అజ్ఞాన- అన్యథాజ్ఞానాదులను పోగొట్టే, భగవచ్ఛబ్దవాచ్యులైన పరాంకుశమునీంద్రుల దివ్యసూక్తులయొక్క - అని అర్థం. **"గూఢవిప్రియకృత్ శఠః"** అనే నిరుక్తి ప్రకారం ఎదుటి వానికి తెలియ కుండా అపకారాన్ని చేసేవాడు శఠుడు. బ్రహ్మసత్తను అంగీకరించినా, అది భ్రమపరిగతమని, నిర్గుణమని, నిరాకారమని- ఈ విధంగా అప్రియంగా పలికే వారే శఠులు. అటువంటివారిని ప్రబంధప్రారంభంలోనే **"ఉయర్వఱ ఉయర్ నల ముడైయవన్"** అని అంటూ నిరసించారు నమ్మాళ్వార్లు కదా.

**(అర్థతత్త్వమ్)** - అర్థస్వరూపాన్ని - అర్థయాథాత్మ్యాన్ని - అని భావం.

**(శ్రుత్వా)** - విని గ్రహించి - అని అర్థం. లేక, **"త్వదుక్తమ్"** అనే ప్రయోగంలో **"త్వత్"** అనే దానిని ప్రత్యేకమైన పంచమ్యంతపదంగా గ్రహించి, "దేవరవారివల్ల" అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"ఉక్తమ్"**- కలివైరి దాసపాదులనబడే నమ్బిళ్ళైస్వామివారిచేత స్పష్టంగా, విస్తృతంగా ప్రతిపాదింపబడిన, ఈడుముప్పత్తాఱా యిరప్పడి అనే విస్తృతమైన వ్యాఖ్యలో వివరింపబడిన - అని అర్థం. **"బ్రూఞ్- వ్యక్తాయాం వాచి"** అనే ధాతువు నుండి క్తప్రత్యయాన్ని చేర్చగా, **"బ్రువో ర్వచి"** అనే సూత్రంతో వచ్యాదేశం రాగా ఏర్పడిన రూపం కనుక, **"ఉక్త"**మనే పదంవల్ల కేవలం "చెప్పబడిన" అనే అర్థంకాక, "విస్తృతంగా వ్యక్తంగా వ్యాఖ్యానింపబడిన" అనే అర్థం స్ఫురిస్తుంది.

**(గూఢం తత్త్వమ్)** - ఇంతగా విస్తృతంగా వివరించినా సామాన్యులకు దురవగాహాలైన నమ్మాళ్వార్ల సూక్తులలోని అర్థతత్త్వాలను,

**(త్వత్ శ్రుత్వా)** - దేవరవారివల్ల విని. దేవరవారి సన్నిధిలో శిష్యక్రమ నియమపూర్వకంగా అధికరించి- అని భావం.

**(అద్వితీయమ్)** - సదృశమైనది రెండవది లేనిది- అని అర్థం.

**(త్వదీయమ్)** - గురుపరంపరలోని మిగిలిన ఆచార్యులకు ఎవ్వరికీ లేని దేవరవారివిలక్షణ వైభవాన్ని- అనే అర్థం సర్వనామశబ్ద ప్రయోగంవల్ల స్ఫురిస్తుంది. ఆచార్యులు ఇంతమంది ఉండగా, వేఱెవ్వరివద్ద శ్రీరంగనాథుడు ఉపసత్తిని చేయలేదు, తత్త్వార్థ శ్రవణాన్ని చేయలేదు, కేవలం శ్రీవరవరమునులనే ఉపసత్తిని చేసి, వారి సన్నిధిలో శ్రీశఠకోపయోగి ప్రణీతమైన తిరువాయ్‌మొழி దివ్యప్రబంధసూక్తులలోని దురవగాహాలైన అర్థతత్త్వాలను శ్రవణం చేశాడు- అనేదే ఆ వైభవంలోని వైలక్షణ్యం. ఈ అద్వితీయ వైభవాన్ని శ్రీరంగనాథుడు -

**(శేషశాయీ సన్)** - భుజంగశయనుడై- అని అర్థం. వేయి నోళ్ళను కల ఆదిశేషుని అధిష్ఠించినవాడై- అని కూడా అర్థం.

**(ఆగోపాలమ్)** - పల్లెలలో నివసించే గోపాలురు **"ఇడైక్కై వలక్కై తెరియాద"** అనేటట్లు కల్లకపటం తెలియనివారు; విశేషజ్ఞులు కారు- అనే మాట లోకప్రసిద్ధం. వారికి కూడా తెలిసేటట్లుగా - అని అర్థం. విశేషజ్ఞులు- అవిశేషజ్ఞులు- అనే భేదం లేకుండా అందఱు గ్రహించేటట్లుగా- అని తాత్పర్యం.

**(ప్రథయతి తరామ్)** - మిక్కిలిగా ప్రఖ్యాపనం చేస్తున్నాడు.

ఇక్కడ, **"శేషశాయీ"** అనే ప్రయోగంద్వారా "శ్రీవరవరమునుల విలక్షణవైభవాన్ని నేను శపథం చేయడంద్వారా వ్యక్తం చేస్తున్నాను'' అని అంటూ శ్రీరంగనాథుడు భుజంగశయనుడై ఉన్నాడనే అర్థం వ్యక్తమవుతున్నది. "లోకంలో ప్రమాణం చేసేవారు చేతిలో సర్పాన్ని గ్రహించి ప్రమాణం చేస్తారు. నేను ఆ రీతిలో కాకుండా పాముపై నిర్భయంగా శయనించి ఉండి, శ్రీవరవరమునుల వైభవం వాచామగోచర మైనది, అద్వితీయమైనది - అని అంటూ ప్రమాణం చేస్తున్నాను'' అని పలికేటట్లుగా శ్రీరంగనాథుడు భుజంగశాయియై శ్రీవరవరముని వైభవాన్ని వ్యక్తం చేస్తున్నాడని తాత్పర్యం. దీనివల్ల శ్రీవరవరముని వైభవసత్యత్వంలోని దార్ఢ్యం స్ఫురిస్తున్నది. సహస్రవదనుడైన ఆదిశేషుని సహాయంతో ప్రఖ్యాపనం (ప్రచారం) చేయదగినది, శ్రీవరవరమునుల వైభవం - అనే అర్థం ద్వారా ఆ వైభవంయొక్క మహిమాతి శయత్వం ధ్వనిస్తున్నది. **"అత్ర వక్తవ్యం సంప్రదాయతోఽవంగతవ్యమ్"** ఈ శ్లోకంలో (ఆదిశేషుల అవతారమే వరవరమునులు ఇత్యాది) వక్తవ్యాంశాలను సంప్రదాయం ద్వారా (ఆచార్యసన్నిధిలో) గ్రహించాలని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్యానసూక్తి. దీనినిగూర్చి యతీంద్ర ప్రవణ ప్రభావంలో కూడా గమనించవచ్చు.

**14.** అవ :- గడచిన రెండు శ్లోకాలలో శ్రీరంగనాథుడు తన అనుష్ఠానం ద్వారా శ్రీవరవరమునుల వైభవాన్ని వ్యక్తం చేశాడు - అని అన్నారు. దీనివల్ల వారి అసాధారణమాహాత్మ్యం తెలుపబడింది. ఇక, ఈ శ్లోకంలో శ్రీవరవరమునుల ఉపాయత్వం, ఆచార్యత్వం, పురుషకారత్వం తెలుపబడుతున్నాయి. **"స్వయ మాచరతే యస్తు ఆచారే స్థాపయత్యపి"** అని తెలుపబడిన పరార్థ పరతంత్రత్వరూపమైన ఉత్తారకత్వం. పరప్రవాదయితృత్వ రూపమైన ఉపకారకత్వం (పరుడైన భగవానునకు కైంకర్యం చేసే రీతిలో ఒక జీవుని సంస్కరించడమనే ఉపకారకత్వం, పరుడైన భగవానుని వైభవాన్ని విశదంగా పల్కడమనే ఉపకారకత్వం),

పురుషకారత్వం ఈ శ్లోకంలో తెలుపబడుతున్నాయని చెప్పవచ్చు. లేక, శ్రీవరవరమునుల కంటే వేఱయిన ఆచార్యులలో అందఱిలో ఆచార్యత్వం, పురుషకారత్వం, ఉపాయత్వం- మూడూ ఉండవు కాని, వీరిలో ఈ మూడు ఉన్నందున ఏకరూపత్వం భాసిస్తున్నదని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

**సిద్ధోపాయ స్త్వ మిహ సులభో లంభయన్ పూరుషార్థాన్**
**అజ్ఞాతాంశ్చ ప్రథయసి పునః యత్తతో దేశిక స్త్వమ్ ।**
**దేవీ లక్ష్మీ ర్భవసి దయయా వత్సలత్వేన చ త్వం**
**కోఽ సౌ యస్త్వాం వరవరమునే! మన్యతే నాత్మనీనమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, పూరుషార్థాన్ = మోక్షాదిపురుషార్థాలను, లంభయన్ = మానవులు పొందేటట్లు చేసేవారై, సులభః = సులభులై, సిద్ధోపాయః అసి = ప్రయత్నసాధ్యం కాకుండా, సిద్ధోపాయరూపులై (మీరు) ఉన్నారు., పునః= అంతేకాక, అజ్ఞాతాన్ = స్వస్వరూపాదులను తెలియనివారై, అప్రసిద్ధులైనవారిని, ప్రథయసి ఇతి యత్ = జ్ఞానాన్ని కల్గించి, ప్రసిద్ధులుగా చేస్తున్నారు - అనే ఏ కారణం ఉన్నదో, తత్ = దానివల్ల, త్వం = దేవరవారు, దేశికశ్చ అసి = ఆచార్యులై కూడా ఉన్నారు, కించ= అంతేకాక, త్వం = దేవరవారు, దయయా = ఇతరులు పడే దుఃఖాలను చూచి జాలిపడడం- అనే దయచేత, వత్సలత్వేన = దోషాలను గుణాలుగా గ్రహించడమనే వాత్సల్యగుణం చేత, దేవీ = దేవుడైన భగవానునకు పత్ని అయిన, లక్ష్మీః అసి = లక్ష్మీదేవివై ఉన్నారు. (లక్ష్మీదేవివలె పురుషకార స్వరూపులు అవుతున్నారు) (అతః = అందువల్ల), యః = ఎవడు, త్వాం = (పూర్వం తెల్పిన రీతిలో ఉపాయ- ఆచార్య- పురుషకార రూపులైన) మిమ్ములను, ఆత్మనీనం = తనకు హితరూపులుగా, న మన్యతే = భావించరో, అసౌ కః = ఆ ఆత్మద్రోహి ఎవరు? (జ్ఞానం ఉన్నవాడు ఎవడైనా దేవరవారిని తనకు కావలసిన వారిగా- ఆత్మీయులుగా భావిస్తాడు - అని భావం.)

శ్రీవరవరమునులు, పురుషార్థాలను లభింపజేసే సిద్ధోపాయ రూపులుగా ఉన్నారు. దేనికీ పనికిరాకుండా ఉండే అప్రసిద్ధులై ఉండేవారికి జ్ఞానాన్ని కల్గించి, వారిని ప్రసిద్ధులుగా చేసే ఆచార్యులుగా ఉన్నారు. దయ, వాత్సల్యం- అనే కల్యాణగుణాలను కల్గి ఉన్నందున, మానవుల దుఃఖాలను చూచి జాలిపడి, వారి దోషాలనే భోగ్యంగా గ్రహించి, భగవానునితో వారిని చేర్పించే పురుషకారరూపులు అయినందున లక్ష్మీదేవిగా ఉన్నారు. వీటిని చక్కగా గ్రహించి, పూర్వం తెల్పిన రీతిలో దేవరవారిని ఉపాయంగా, ఆచార్యునిగా పురుషకారంగా ఆశ్రయించి, భగవానుని పొందేవాడు వివేకి. ఆవిధంగా కానివాడు ఆత్మద్రోహి- అని భావం.

వ్యాఖ్యానమ్ : **(పూరుషార్థాన్)** ఆ యా పురుషులచే కోరబడే మోక్షాదులను -ధర్మార్థకామమోక్షాలనే ఫలాలను - అని అర్థం. ఈ సందర్భంలో, గీతలో తెల్పిన **"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ"** అని తెలుపబడిన నాల్గు ప్రకారాలకు చెందినవారిని గ్రహించాలి. చరమోపాయవిషయంలో కూడా ఆ నాల్గు ప్రకారాలకు తేడా లేదు కదా! సకలపురుషార్థప్రదాత, శ్రీవరవరమునులని తాత్పర్యం.

**(లంభయన్)**- ఆయా పురుషార్థాలను కోరినవారికి ఆయా పురుషార్థాలను పొందించేవారైన - అని అర్థం. **"పూరుషాన్"** అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి.

**(సులభః)** - సులభుడైన ఉపాయభూతులు మీరు. **"సుకరః"** లని అనకుండా **"సులభః"** అని ప్రయోగించడం గమనించదగినది. **"సులభః, న తు సుకరః త్వమ్"**. సిద్ధోపాయమైనపుడు సుకరత్వప్రసక్తి లేదు కదా!

**(సిద్ధోపాయః)**- చేతనవ్యాపారాన్ని -(ప్రయత్నాన్ని- అపేక్షించని స్వరూపాన్ని కల్గిన పురుషార్థసాధనమైన ఉపాయం. అనుష్ఠాన క్లేశాన్ని లేని ఉపాయమని భావం. కర్మజ్ఞానభక్త్యాదుల విషయంలో ఈ క్లేశం ఉన్నదికదా! **"సులభః"** - అనే పదంద్వారా సిద్ధత్వం, **'లంభయన్"** అనే పదంద్వారా ఉపాయత్వం సూచింపబడ్డాయి. ఈవిధంగా **"సులభః, లంభయన్"** అనే పదాలు సిద్ధోపాయమనే అర్థాన్ని స్ఫురింపజేస్తాయి. అందువల్లనే **"లంభయన్"** అనే ణిజంతక్రియారూపంతో ణిజంతరూపమైన ఉపాయశబ్దం వివరింపబడింది. ఉపాయం సాధ్యం కాకుండా సిద్ధోపాయమైనందున (చేతనప్రయత్నావశ్యకత లేనందున), సర్వదా కార్యోత్పత్తి ప్రసంగం - ఏర్పడుతుంది కదా - ఎల్లప్పుడు ఫలం సిద్ధించడమనే ప్రసక్తి ఏర్పడుతుంది కదా! (ఉపాయం సాధ్యమైనపుడుకదా కొంతకాలంవరకే ఫలం సిద్ధించడమనే ప్రసక్తి ఉంటుంది - అనే శంకను **"పురుషార్థాన్"** అనే పదం ద్వారా సూచింపబడిన **"ప్రార్థనామాత్ర సంతుష్ట", "ప్రార్థనామతి శరణాగతిః", "ప్రపత్తిః శరణాగతిః", "విశ్వాసపూర్వకమ్"** ఇత్యాదులలో ప్రతిపాదింపబడిన ప్రార్థన ప్రకృతంలో వారిస్తున్నది.

**(అజ్ఞాతాన్ ప్రథయసి ఇతి యత్)** - స్వస్వరూపాదులను తెలియని అనభిజ్ఞులకు వాటి జ్ఞానాన్ని పొందేటట్లు చేస్తున్నందున,

**(దేశికోఽసి)** - ఆచార్యరూపులై ఉన్నారు - అని అర్థం. **"దిశతి ఉపదిశతీతి దేశికః"** అని కదా దేశికపదవ్యుత్పత్తి.

**(త్వమ్)** - ఈ సర్వనామపదం శ్రీవరవరమునులు పూర్వం తెలుపబడిన ఉపాయత్వ, దేశికత్వరూప ధర్మద్వయవిశిష్టులనే విషయాన్ని సూచిస్తుంది.

**(దయయా)** - ఆభిముఖ్య మాత్రంచేత ఉద్భవించిన సహజ కృపతో,

**(వత్సలత్వేన చ)** - అదేవిధంగా, ఆభిముఖ్యమాత్ర హేతుకంగా కల్గిన వాత్సల్యంచేత- అని అర్థం. ఈ రెండు పదాల ద్వారా పురుషకారానికి ఇంకొక పురుషకారం కావాలా ? అనే సందేహం నివర్తింపబడింది.

**(దేవీ)** - జీవుల కర్మానుగుణంగా వారికి ఫలప్రదాన రూపవ్యవహార శీలాన్ని కల్గిన భగవానుని ప్రీతికి విషయమైన - అని అర్థం. **"దివు"** ధాతువునకు కల అనేకార్థాలలో వ్యవహారమనే అర్థం ఇక్కడ వివక్షితం. **"నిర్దోషః క ఇహ జగతి"** అని, **"న కశ్చిత్ నాపరాధ్యతి"** అని భగవానునితో వాదించి శరణాగతుని దోషాలను అతడు క్షమించి అనుగ్రహించేటట్లు చేసే స్వభావాన్ని లక్ష్మీదేవి కల్గినదనే భావం ఈ పదం ద్వారా వివక్షితం. **"ఇదం చ పురుషకారతోపయుక్త విశేషణమ్"** అని శ్రీవాధూలవీరరాఘవాచార్యస్వామివ్యాఖ్య.

**(లక్ష్మీర్భవసి)** - **"లక్ష్మ్యధిష్ఠాతృత్వ ప్రయుక్తపురుషకారత్వవాన్ భవసి"** అని శ్రీవీరరాఘవాచార్యవ్యాఖ్య. లక్ష్మీదేవికి అసాధారణ లక్షణమైన పురుషకారత్వంయొక్క ప్రాచుర్యంచేత ఇక్కడ **"త్వం లక్ష్మీర్భవసి"** అనే సామానాధికరణ్యనిర్దేశం చేయబడింది. ఇది **"అయఃపిండో వహ్నిః"** అనే ప్రయోగంవంటిది. ఇనుపగుండు, అగ్ని - రెండు వేర్వేరు ద్రవ్యాలైనా, ఇనుపగుండులోని అగ్నియొక్క ప్రాచుర్యంచేత "ఈ ఇనుపగుండు నిప్పు'' అనే సమానాధికరణ నిర్దేశాన్ని చేసేటట్లే, ఇక్కడ లక్ష్మీదేవికి అసాధారణ లక్షణమైన పురుషకారత్వ ప్రాచుర్యాన్ని కల్గి ఉండడంచేత శ్రీవరవరమునులు **"లక్ష్మీర్భవసి"** అనే సామానాధికరణ్యప్రయోగంతో నిర్దేశింపబడ్డారు. పురుషకారత్వం లక్ష్మీదేవికి అసాధారణ లక్షణం. **"లక్ష్మీః పురుషకారత్వేన నిర్దిష్టా పరమర్షిభిః"** అని కదా భగవద్వచనం. **"ఏతత్సంబంధసాపేక్ష మన్యేషా మమలాత్మనామ్, దేవి! సూరిగురూణాం చ ఘటకత్వం న తు స్వతః"** (దేవీ ! దివ్యసూరులకు, పూర్వాచార్యుల అందఱి, పురుషకారత్వం ఈ లక్ష్మీదేవి సంబంధసాపేక్షమైనది. ఈమె సంబంధంవల్లనే వారి పురుషకారత్వం సిద్ధిస్తుంది. అందువల్ల వారి ఘటకత్వం స్వతస్సిద్ధమైనది కాదు) అని ఈ విషయం చెప్పబడిందికూడా. అందువల్ల ఈ విధంగా-

**(త్వామ్)** - పూర్వోక్తక్రమంలో ఉపాయ- ఆచార్య- పురుషకారరూపులైన మిమ్ములను- అని అర్థం.

**(ఆత్మనీనమ్)** - తన ఆత్మకు హితస్వరూపులుగా- హితాన్ని కల్గించేవారుగా- అని అర్థం. **"ఆత్మనీన ముపతిష్ఠతే"** అనే కిరాతార్జునీయ ప్రయోగం (13-69) ఇక్కడ స్మరణీయం.

**(యః న మన్యతే కోఽసౌ)** - ఎవడు భావించడో, ఆ ఆత్మద్రోహి ఎటువంటి జ్ఞానాన్ని కలవాడు? మీ తత్త్వాన్ని ఏమాత్రం గ్రహించనివాడు - అని భావం.

**15.** అవ :- **"తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి నాన్యత్ర"** (ఆ రామానుజాచార్యుల వారిలోనే గురుశబ్దం శోభిస్తున్నది. వేఱొకరిలో లేదు) అని అంటూ ఆచార్యత్వపూర్తి భగవద్రామానుజులలోనే ఉన్నదని ప్రసిద్ధంగా చెప్పబడుతున్నది కదా. మోక్షోపాయత్వంకూడా వారికే ఉన్నదనికదా ప్రసిద్ధి. మఱి, ప్రకృతంలో మోక్షోపాయస్వరూపులుగా, శ్రీమణవాళ మహామునులను పల్కడం ఏవిధంగా పొసగుతుంది? అని అంటే, శ్రీవరవరమునులుకూడా ఆదిశేషాంశసంభూతులు కనుక, ఆవిధంగా పల్కడం తగును. అంటే - శ్రీరామానుజుల కంటే వేఱు కాని ఆదిశేషులకు మణవాళమహామునులు అభిన్నులు - అంటే - వేఱు కానివారు కనుక, శ్రీరామానుజులకు గల మోక్షోపాయత్వం **"తదభిన్నాభిన్నస్య తదభిన్నత్వమ్"** అనే న్యాయంతో శ్రీవరవరమునులకు సిద్ధిస్తుంది- అని అంటూ ఆ శంకను తీరుస్తున్నారు.

**నిత్యం పత్యుః పరిచరణతో వర్ణతో నిర్మలత్వాత్**
**వృత్త్యా వాచాం విబుధసరిత శ్చాతురీ ముద్గిరంత్యా ।**
**శేషః శ్రీమానితి రఘుపతే రంతరేణాపి వాణీం**
**కో నామ త్వాం వరవరమునే! కోవిదో నావగంతుమ్ ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, కః నామ = ఎవడు, నిత్యం = ఎల్లప్పుడు, పత్యుః = సర్వశేషి అయిన భగవానునకు, పరిచరణతః = కైంకర్యాన్ని చేస్తూ, వర్ణతః = తిరుమేని వర్ణంలోని, నిర్మలత్వాత్=

తెల్లదనంవల్ల, విబుధ సరితః = దేవగంగయొక్క, చాతురీం = అడ్డు లేని వేగంతో ప్రవహించే సామర్థ్యాన్ని, ఉద్గిరంత్యా = వ్యక్తం చేసే, వాచాం వృత్త్యా (చ) = శ్రీసూక్తుల వ్యాపారంచేత, త్వాం = దేవరవారిని, శ్రీమాన్ = భగవత్కైంకర్యమనే సంపదలను కల్గిన, శేషః ఇతి = ఆదిశేషులే అని, రఘుపతేః = దాసుని ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రునియొక్క, వాణీమ్ అంతరేణ (అపి) = శ్రీసూక్తి లేకపోయినా, అవగంతుమ్ = తెలిసికోవడానికి, కోవిదః న భవేత్ = సమర్థుడు కాలేడు? (ఎవడైనా తెలిసికోగలడని భావం.)

**వ్యాఖ్యానమ్ :** ఈ స్తోత్రప్రణేతలైన ఎఱుమ్బియప్పా ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రస్వామి శ్రీవరవరమునులను ఆదిశేషావతారంగా తెలియజేశాడు - అనే ఐతిహ్యం వీరి చరిత్రలో ప్రసిద్ధం. ఆ విధంగా ఆ స్వామి తెలియజేయకపోయినా, శ్రీవరవరమునులు నిత్యం శ్రీరంగనాథ భగవానునకు చేసే కైంకర్యం, ఆదిశేషుని తిరుమేనివర్ణంవంటి తెల్లని వర్ణాన్ని కల తిరుమేని, వేయి నోళ్ళను కల్గిన ఆదిశేషుని వాగ్వైభం వంటి గంగా ప్రవాహంవలె పలికే వాక్సామర్థ్యం - అనే ఈ మూడు (కైంకర్యం- తిరుమేనివర్ణం - వాక్సామర్థ్యం - అనే మూడు) కారణాలతోనే, శ్రీవరవరమునులను "వీరు ఆదిశేషావతారమే'' అని ఎవడైనా తెలిసికోగలరు. అందువల్ల శ్రీరామానుజులవలె, శ్రీవరవరమునులుకూడా ఆదిశేషావతారమే కనుక, శ్రీరామానుజులకు గల మోక్షోపాయత్వం శ్రీవరవరమునులకుకూడా ఉన్నది, కనుక, గడచిన శ్లోకంలో పల్కిన సూక్తి సుసంగతమని తాత్పర్యం.

**(కో నామ)** - పుట్టుకను కలవాడు ఎవడైనా - అని భావం.

**(నిత్యం పత్యుః పరిచరణతః)** - సర్వకాలం శేషి అయిన భగవానుని విషయంలో అశేషశేషవృత్తులను చేయడంవల్ల,

**(వర్ణతో నిర్మలత్వాత్)** - తెల్లని రంగులోని నిర్మలత్వంవల్ల. అంటే- ఏ దోషం లేని స్వచ్ఛమైన తెల్లని వర్ణాన్ని కల్గి ఉండడంవల్ల - అని భావం.

**(విబుధసరితః చాతురీమ్ ఉద్గిరంత్యా)**- దేవగంగాప్రవాహవిభ్రమం వంటి విభ్రమాన్ని వ్యక్తం చేసే-అని అర్థం. **"వాచాం ప్రవాహై రనివారితై స్తైః మందాకినీ మందయితుమ్"** అనే హయగ్రీవ స్తోత్ర సూక్తిభావ్యం.

**(వాచాం వృత్త్యా)** - వాగ్వ్యాపారంచేత - అనే ఈ మూడు హేతువులు. లేక, **"ఇతి హేతు స్తదుద్భవే"** అన్నట్లు మూడు కలిపి ఒకే హేతువుగా కూడా చెప్పవచ్చు.

**(త్వామ్)** - పైన పేర్కొనబడ్డ మూడు విధాలైన వైలక్షణ్యాలను కల దేవరవారిని,

**(శ్రీమాన్ శేష ఇతి)**- భగవత్కైంకర్యలక్ష్మిని నిత్యంగా కల్గిన ఆదిశేషులే- అని అర్థం. **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** అని చెప్పబడిన భగవత్కైంకర్యమే ఇచటి శ్రీశబ్దవాచ్యం. **"శ్రీమాన్ రామానుజార్యః పదకమలయుగమ్"** అని, **"శ్రీమాన్ ఆవిరభూత్ భూమౌ రామానుజదివాకరః"** అని, **"శ్రీమల్లక్ష్మణ యోగినః"**

అని ఇత్యాది ప్రయోగాలద్వారా తెలుపబడ్డ శ్రీరామానుజాచార్యావతారంలోని భగవత్కైంకర్యలక్ష్మికూడా ఇక్కడ వివక్షితం. అటువంటి లక్ష్మిని కల ఆదిశేషులే - అని అనుమించడానికి - అని అర్థం. లేక, శ్రీశబ్దంద్వారా కైంకర్యసంపత్తు, దేహకాంతి, ఋగ్యజుస్సామాథర్వణాలనే వేదాలచేత ఉపలక్షింపబడిన సమస్తం వాఙ్మయం - చెప్పబడుతున్నాయని తెలిపి, వీటిని కలవారనే అర్థాన్ని చెప్పవచ్చు. సత్పురుషుల నశించని సంపద వేదమే కదా! **"ఋచో యజూంషి సామాని సా హి శ్రీ రమృతా సతామ్"** అని కదా సూక్తి. ఆ విధమైన సంపదను కల ఆదిశేషులని భావం. **"ప్రకృష్టవిజ్ఞానబలైకధాముడు"**, వ్యాకరణ, యోగ ఆయుర్వేదాది బహుశాస్త్ర ప్రవర్తకుడు కదా ఆదిశేషుడు.

**(రఘుపతేః వాణీ మంతరేణాపి)** - అస్మత్కులధనమైన అర్చామూర్తి శ్రీరామచంద్రుడు పల్కిన సూక్తి లేకపోయినా, శ్రీవరవరమునులు ఆదిశేషావతారులని గ్రహించడంలో- అని తాత్పర్యం.

**(కో న కోవిదో నామ)** - ఎవరు సమర్థులు కారు? అందఱు సమర్థులే. అని భావం. ఆప్తవాక్య రూపమైన శబ్దప్రమాణాన్ని అనుసరించి గ్రహింపబడే అనుమానం ప్రమాణమనే శాస్త్రవాసనవల్ల **"రఘుపతే రంతరేణాపి"** అని ప్రయోగింపబడింది. ఈ శ్లోకంలో, ఎఱుమ్బియప్పాకు, వారి అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రుడు, శ్రీవరవరమునుల ఆదిశేషావతారాత్మకత్వాన్ని గూర్చి తెల్పిన ఐతిహ్యం సూచింప బడింది. ఈ ఐతిహ్యాన్ని ఎఱుమ్బియప్పా చరిత్రలో (యతీంద్రప్రవణప్రభావాదులలో) గమనించవచ్చు.

**16.** అవ :- ఈవిధంగా శ్రీవరవరమునులు ఆదిశేషావతార రూపులేననే విషయాన్ని తగిన యుక్తులద్వారా సాధించి, శ్రీవరవరమునుల మోక్షోపాయత్వాన్నిగూర్చిన విరోధపరిహారాన్ని ఈ శ్లోకంలో పల్కి ముగిస్తున్నారు.

**సత్యం సత్యం పునరితి పురా సారవిద్భిః యదుక్తం**
**బ్రూమః శ్రోత్రైః శ్రుణుత! సుధియో! మత్సరం వర్జయిత్వా ।**
**తత్త్వం విష్ణుః పర మనుపమం తత్పదం ప్రాప్యమేవం**
**తత్సంప్రాప్తౌ వరవరమునిః దేశికో దీర్ఘదర్శీ ॥**

సుధియః = శాస్త్రాలను గ్రహించి, నిష్కృష్టమైన జ్ఞానాన్ని కల్గిన బుద్ధిమంతులారా!, సారవిద్భిః = సారాన్ని గ్రహించిన వేదవ్యాసభగవానునిచేత, పూర్వాచార్యులచేత, సత్యం సత్యం పునః ఇతి = "నిజం, నిజం, ముమ్మారు ఇది నిజం'' అని ఆరంభించి, యత్ ఉక్తమ్ = ఏమాట చెప్పబడిందో, తత్ బ్రూమః = దానిని పల్కుతున్నాను, మత్సరం వర్జయిత్వా = అసూయను విడచి పెట్టి, శ్రోత్రైః శ్రుణుత = చెవులార (ఆశ తీరేటట్లుగా) వినండి, (ఆ మాట ఏది? అంటే), విష్ణుః పరం తత్త్వం = శ్రీమహావిష్ణువే పరతత్త్వం, అనుపమం తత్ పదం = సాటి లేని అతని స్థానమైన పరమపదమే, ప్రాప్యం = అందఱికి పొందదగిన చోటు, దీర్ఘదర్శీ = సర్వజ్ఞులైన, వరవరమునిః = మణవాళమహామునులు, ఏవం = పూర్వం తెల్పిన రీతిలో శ్రీరామానుజులే, కావున, తత్ సంప్రాప్తౌ = ఆ పరమపదాన్ని పొందే విషయంలో, దేశికః= ఆచార్యులు. (అనేదే ఆ విషయం).

వ్యాఖ్యానమ్ : విష్ణువే పరతత్త్వం - అనే విషయాన్ని **"సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే, వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్ పరమ్"** ఇత్యాదిగా వేదవ్యాసుడు శపథపూర్వకంగా తెలిపాడు. శ్రీరామానుజులే జగదాచార్యులనే విషయాన్ని పూర్వాచార్యులు ప్రమాణపూర్వకంగా పలికారు. అటువంటి శ్రీరామానుజులే శ్రీవరవరమునులుగా అవతరించినందువల్ల, శ్రీవరవరమునులే ఆచార్యులు- అని అంటూ ఎఱుమ్బియప్పా ఇందులో ముమ్మాఱు ప్రమాణం చేసి పలికారు.

**(సుధియః)** నిరంతర శాస్త్రపరిశీలనతో పరిష్కృతమైన బుద్ధిని కల మహాత్ములారా!

**(సారవిద్భిః)** -వేదవ్యాసునిచే, పూర్వాచార్యులచే-అని అర్థం. **"అసార మల్పసారం చ సారం సారతరం త్యజేత్, భజేత్ సారతమం శాస్త్రం రత్నాకర ఇవామృతమ్"** అనే రీతిలో సముద్రంవలె అనంతాలైన వేదాలలోని, శాస్త్రాలలోని సారతమవిషయాన్ని ఉద్ధరించి, గ్రహించగల్గినవారని భావం. **"యత్సారభూతం తదుపాసితవ్యమ్"** అనికదా చెప్పబడుతున్నది. **"వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే"** అని భగవదవతారంగా చెప్పదగిన వేదవ్యాసభగవానుడు, ఆ భగవానుని ఆత్మస్థానీయులై, అతని హృదయాన్ని తెలిసిన పూర్వాచార్యులు - మొదలైన సారవేత్తలు. ఈపదం ద్వారా తెలుపబడ్డారు. భగవానుడు క్షీరాబ్ధి నుండి సారతమమైన అమృతాన్ని వెలికిదీసి ఇచ్చాడు. **"ఆచార్యః స హరి స్సాక్షాత్" "శ్రీమాన్ నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా"** ఇత్యాది ప్రమాణోక్త రీతిలో భగవదవతారరూపులైన ఆచార్యులు వేదశాస్త్రాబ్ధిని మథించి, సారతమజ్ఞానామృతాన్ని వ్యక్తం చేస్తారు.

**(సత్యం సత్యం పునరితి యదుక్తమ్)** - వేదవ్యాసభగవానుడు మహాభారతంలో **"సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే, వేదాత్ శాస్త్ర పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్"** అని అంటూ విష్ణువే పరతత్త్వమని చేతులెత్తి ఉద్ఘాటించాడు. ఆ పరతత్త్వాన్ని - **"సత్యం సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః, స ఏవ సర్వలోకానా ముద్ధర్తా నాస్తి సంశయః"** అని ముక్తకంఠంగా పూర్వాచార్యులు ఉద్ఘోషించారు. కణియనూర్ శిఱియాచ్చాన్ అనే భగవద్రామానుజుల శిష్యులు ఒకరు, ఒకనాడు, శ్రీరామానుజుల జగదాచార్యత్వాన్ని జగద్విదితం చేయదలచి, శ్రీరంగనాథస్వామి ఆస్థానంలో వేంచేసి ఉండే సమయంలో, సచేల స్నానం చేసి, తడి గుడ్డలతో సభలోకి వచ్చి, తమ తలపై శఠారిని పెట్టుకొని, పై శ్లోకాన్ని పఠించి, శ్రీరామానుజులే జగద్రక్షకులు - అని ముమ్మారు ప్రమాణం చేశారు. ఈ వృత్తాంతాన్ని గురుపరంపరా ప్రభావాది గ్రంథాలలో గమనించవచ్చు. ఈ శ్రీవరవరమునిశతక స్తుతికి అద్భుతమైన సంస్కృత వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన వాధూల వీరరాఘవాచార్యస్వామివారు రచించిన శ్రీరామానుజాతి మానుష స్తవంలో కూడా **"స్నాత్వా సచేల మధికార్తివశాత్ ప్రశాంతో రంగే మహాసదసి రంగిసమక్షమేవ, మౌళౌ నిధాయ శఠకోప మహో మహత్త్వాం సత్యాపయన్ తవ హి కశ్చన నిశ్చికాయ"** అనే శ్లోకంలో ప్రస్తావించారు. అటువంటి విషయాన్ని ఇక్కడ తెల్పుతున్నారు.

**(మత్సరం వర్జయిత్వా శృణుత)** - **"బోద్ధారో మత్సరగ్రస్తాః"** అని జ్ఞానులలో సహజంగా కన్పించే మాత్సర్యాన్ని విడచిపెట్టి - అని అర్థం. మాత్సర్యమంటే ఇతరులు చేసిన సత్కార్యాలపట్ల ద్వేషభావాన్ని

కల్గి, అందులో తప్పులను ఆరోపించడం. అటువంటి మాత్సర్యాన్ని విడచి - అని అర్థం. **"ప్రవక్ష్యామ్యన సూయవే"** అని **"న చ మాం యోఽభ్యసూయతి"** అనే రీతిలో అసూయామాత్సర్యాలు తత్త్వాన్ని గ్రహించనీయవు.

**(శ్రోత్రైః శ్రుణుత)**- చెవులున్నందుకు తగిన సాఫల్యాన్ని పొందేటట్లుగా చెవులార వినండి. ఆ గొప్ప విషయం ఏమి? అంటే -

**(పరం తత్త్వం విష్ణుః)** - విష్ణువే పరతత్త్వం, **"తత్త్వం నారాయణః పరః".**

**(అనుపమం తత్ పదం)** - ఆ విష్ణువుయొక్క స్థానమే (లేక, శ్రీచరణ సన్నిధియే).

**(ప్రాప్యమ్)** - చేతనులకు పొందదగిన స్థానం.

**(తత్ సంప్రాప్తౌ)** - చరమపర్వరూపమైన విష్ణుపదాన్ని పొందడంలో,

**(దీర్ఘదర్శీ)** - **"దీర్ఘం పశ్యతీతి దీర్ఘదర్శీ".** పండితవాచకమైన ఈ పదం పరోక్షమైన పరమాత్మతత్త్వం, అనుపమమైన ఆ పరమాత్మ వేంచేసి ఉండే చరమపర్వరూపమైన స్థానం, దానిని పొందే ఉపాయం- అనే వీనిని (తత్త్వహిత పురుషార్థాలను) దర్శించగల్గిన ఆచార్యులనే అర్థాన్ని ఇక్కడ ధ్వనింపజేస్తుంది. సర్వజ్ఞులని దీని తాత్పర్యం. ఈ విధంగా పూర్వం తెల్పిన రీతిలో శ్రీవరవరమునులు శ్రీరామానుజుల అవతారరూపులైనందున,

**(దేశికః)** - దాత - అని అర్థం. **"దిశతి ప్రదిశతి ఇతి దేశికః"** అనే వ్యుత్పత్తి ఇక్కడ వివక్షితం. లేక, ఆచార్యులని కూడా అర్థం. **"తత్ సంప్రాప్తిః - తస్య సంప్రాప్తిః"** అనే విగ్రహాన్ని చెప్పి, **"సంప్రాప్తిః"** అనే పదాన్ని **"ఆప్తిః, ప్రాప్తిః, సంప్రాప్తిః"** అని మూడు విధాలుగా ప్రథమ-మధ్యమ చరమ పర్వక్రమంగా వివరించి, **"ఆప్తిః"** అంటే ప్రథమ పర్వక్రమంలో ప్రాప్తి - అని, **"ప్రాప్తిః"** అంటే మధ్యమపర్వక్రమంలో ప్రాప్తి- అని, **"సంప్రాప్తిః"** అంటే చరమపర్వక్రమంలో ప్రాప్తి అని- అర్థాన్ని చెప్పవచ్చు. ఇదే రీతిలో **"ప్రాప్యమ్"** అనే పదాన్ని కూడా **"ఆప్యమ్, ఆ+ ఆప్యమ్, ప్ర+ఆ+ఆప్యమ్"** అని విడదీసి ప్రథమ, మధ్యమ, చరమపర్వక్రమాలలోని ప్రాప్యవిశేషాలనే అర్థాలను చెప్పవచ్చు. **"ఆ+ ఆప్యమ్, ప్ర+ఆ+ ఆప్యమ్"** అనేటపుడు **"అకః సవర్ణే దీర్ఘః"** అనేసూత్రం ద్వారా విధింపబడిన సవర్ణదీర్ఘం అనుశాసింపబడినదని గ్రహించాలి - అని వాధూలవీరరాఘవాచార్య స్వామి వ్యాఖ్య.

**17.** అవ :- శ్రీవరవరమునుల సంబంధంవల్ల మోక్షం, అది లేనందువల్ల నరకం సిద్ధించడం తథ్యమని అన్వయ-వ్యతిరేకరూపంగా ఇందులో నిశ్చయించి పల్కుతున్నారు.

**లక్ష్యం యస్తే భవతి భగవన్! చేతస శ్చక్షుషో వా**
**తుభ్యం ద్రుహ్యంత్యపి కుమతయో యో వృథా మత్సరేణ ।**
**ముక్తిం గచ్ఛేన్ముషితకలుషో మోహ ముద్ధూయ సోఽయం**
**నానాభూతాన్ వరవరమునే! నారకాన్ ప్రాప్నుయు స్తే ॥**

భగవన్! వరవరమునే = సద్గుణసంపన్నులైన ఓ శ్రీవరవరమునీ!, యః = ఎవడు, తే = దేవరవారి యొక్క, చేతసః చక్షుషః వా = మనస్సుకు గాని, నేత్రాలకు గాని, లక్ష్యం భవతి = లక్ష్యభూతుడు అవుతున్నాడో, సః అయమ్ = అటువంటి ఇతడు, ముషితకలుషః సన్ = పాపం తీరినవాడై, మోహమ్ ఉద్ధూయ = అన్యథాజ్ఞాన- విపరీతజ్ఞానాదులను విదల్చుకొని, ముక్తిం గచ్ఛేత్ = మోక్షాన్ని పొందగలడు, కుమతయః యే = దుర్బుద్ధిని కలవారైన ఏ కొందఱు, మత్సరేణ = అసూయచేత, వృథా = వ్యర్థంగా, తుభ్యం = దేవరవారిపట్ల, ద్రుహ్యంతి = ద్రోహాన్ని చేస్తున్నారో, తే = వారు, నానాభూతాన్ = ఇంకా ఇంకా పలువిధాలుగా ఏర్పడే, నారకాన్ = నరకాలను, ప్రాప్నుయాః = పొందగలరు.

షాడ్గుణ్యపూర్తిని కల ఓవరవరమునీ! దేవరవారి మనస్సుకు గాని, దృష్టికిగాని లక్ష్యభూతుడైన భాగ్యశాలి పాపాన్ని పూర్తిగా పోగొట్టుకొని, అన్యథాజ్ఞానాదులను పూర్తిగా లేకుండా చేసికొని ముక్తిని పొందగలడు. మీ విషయంలో వ్యర్థమైన మాత్సర్యంతో ఎవరు ద్రోహబుద్ధిని కల్గి ఉంటారో, వారు పలువిధాలైన నరకాలను పొందుతారు - అని తాత్పర్యం.

వ్యాఖ్యానమ్ : **(యః తే చేతసః చక్షుషో వా)** మీరు వేటెవ్వరినో కటాక్షించే సమయంలో అనుకోకుండా ఎవడు మనస్సుకు, లేక, మీదృష్టికి.

**(లక్ష్యం భవతి)** - (యాదృచ్ఛికంగా) శరణ్యవిషయమవుతున్నాడో - అని అర్థం

**(సోఽయం)** - అటువంటి దేవరవారి కటాక్షాలకు విషయం కావడమనే అదృష్టాన్ని పొందిన కారణంచేత మహనీయుడైన ఆ పురుషుడు - అని తాత్పర్యం. **"అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదురితి"** అనే శ్రుతిలో పరమాత్మ సత్తను, స్వరూపరూప విభూతికల్యాణగుణలీలాదులను అంగీకరించనివాడై, అందువల్ల అసత్ శబ్దవాచ్యుడైనవాడు **"సః"** అని అంటూ పరోక్షనిర్దేశం చేయబడ్డాడు. అంగీకరించి సత్తను కలవాడు **"అయం"** ప్రత్యక్షంగా సమీపవర్తిగా నిర్దేశింపబడ్డాడు. అదేరీతిలో ఇక్కడ కూడా శ్రీవరవరవమునుల కటాక్షాన్ని పొందనందున అసత్ప్రాయుడైన వాడు ముందుగా **"సః"** అని, కటాక్షప్రాప్తిని పొందిన తరువాత అతడే **"అయమ్"** అని శ్రుతిప్రక్రియలో చరమపర్వాత్మకంగా నిర్దేశింపబడ్డాడు.

**(ముషితకలుష స్సన్)** - అనిష్ట నివృత్తిని పొందినవాడై, తనకు తెలియకుండానే దొంగిలింపబడిన పాపాలను కలవాడై- అని అర్థం. **"తూఱుకళ్ పాయ్న్దనవే"** అని పెరియాళ్వార్లు, **"వానో! మఱికడలో! తీయకమో! కానో ఒరుజ్గేఱ్రుమ్ కణ్డిలమ్ ఆల్ !"** అని నమ్మాళ్వార్లు భగవద్విషయంలో అనుసంధించిన అర్థాన్ని స్తుతికర్త శ్రీవరవరమునుల విషయంలో అనుసంధిస్తున్నారు.

**(మోహమ్ ఉద్ధూయ)** - అన్యథాజ్ఞానాదులను విదల్చుకొని - అని అర్థం. ఇది అనిష్టనివృత్తి. **"అశ్వ ఇవ రోమాణి విధూయ"** అనే శ్రుతి **"ఉద్ధూయ"** పదప్రయోగం ద్వారా స్మరింపజేయబడుతున్నది. **"ఉభే విద్వాన్ పుణ్యపాపే విధూయ"** ఇత్యాదులు కూడా స్మరణీయాలు. దీనివల్ల పాపాలు ఆరోపితాలని,

ఆత్మకు సహజంగా స్వరూపగతాలు కావని సూచింపబడింది. అందువల్లనే **"ఉద్ధూయ"** అనే పద ప్రయోగం సార్థకం. ఆరోపితాలు కాకపోతే విదల్చుకొన్నా పోవు కదా!

**(ముక్తిం గచ్ఛేత్)** - పరమపురుషార్థకాష్ఠ అయిన చరమపర్వప్రాప్తిని పొందగలడు- ఇది ఇష్టప్రాప్తి.

**(యే మత్సరేణ)** - మాత్సర్యమంటే -ఇతరుల గుణాలను, ఇతరులు చేసే మంచికార్యాలను ద్వేషించే, అన్యథాకరించే స్వభావం. అటువంటి గుణంవల్ల అని భావం. **"మాద్యతి హృష్యతి పరకృచ్ఛ్రే మదేన సరతి"** అని మత్సరశబ్దవ్యుత్పత్తి.

**(వృథా తుభ్యమ్ ద్రుహ్యతి)** - దేవరవారు నిర్వహించే కార్యాలను లవలేశం కూడా ద్వేషించే అవకాశం ఏమీ లేకపోయినా, ఏ ప్రయోజనం లేకపోయినా, వ్యర్థంగా ద్వేషించేవారు ఎవరో, వారు - అని భావం. "సర్వప్రాణి ప్రాణనరూపులైన దేవరవారిపట్ల" అనే అర్థం - **"తుభ్యమ్"** అనే సర్వనామపదంద్వారా సందర్భవశం చేత వ్యక్తమవుతున్నది. **"సుహృదం సర్వభూతానామ్"** అనే భగవానునివలె సర్వభూత సుహృత్తుకదా శ్రీవరవరమునులు.

**(ద్రుహ్యతి)**- అపకారం - అపచారం చేస్తున్నారో - అని అర్థం. వారు మాత్సర్యంతో ద్రోహాన్ని చేసేవారు, వీరు దొంగిలింపబడిన పాపాలను కలవారు - అని పల్కినందున పాపాలను దొంగలించేవారెవరో కూడా సూచింపబడింది. **"అప్రియా దుష్కృతమ్"** అని శ్రుతి ఈ విషయాన్ని తెల్పింది కదా!

**(నానాభూతాన్ నారకాన్ ప్రాప్నుయుః)**- చేసిన పాపాల ఫలాలలను అనుభవించడానికి ఉండే నరకాలు చాలనందున, ఇంకా ఇంకా పలు విధాలైన నరకాలను, ఒక్కొక్కటిగా కాకుండా, కలిపి అనుభవిస్తారు. ఇక్కడకూడా **"ఆప్నుయుః, ఆ+ఆప్నుయుః, ప్ర+ఆ+ఆప్నుయుః"** - అనే విధంగా మూడు రీతులలో విడదీసి వీరు నరకప్రాప్తిలో చరమపర్వాన్ని పొందుతారు- అనే అర్థస్వారస్యాన్ని చెప్పవచ్చు. మోక్షంనుండి పునరావృత్తి లేనట్లే, ఈ నరకాల నుండి పునరావృత్తి లేదని కూడా భావం. **"నృణాతి పాపినః సమీపం, నరాః కాయంత్యస్మిన్ - ఇతి నారకః, కై శబ్దే"** అనే నరకశబ్దవ్యుత్పత్తివల్ల పాపుల సమీపాన్ని పొందించేది- అని, ఇక్కడ ఉండేవారు బాధతో మొఱపెడతారని అర్థం.

**"సః అయమ్"**- అనే ఏకవచనం ద్వారా శ్రీవరవరమునుల కరుణకు పాత్రం అయేటట్లు భాగ్యాన్ని చేసినవాడు ఎవడో ఒక్కడే ఉంటాడని (దుర్లభుడని), **"యే తే"** అనే బహువచనం ద్వారా, దానికి పాత్రం కాని రీతిలో మాత్సర్యాన్ని పొందే దౌర్భాగ్యశాలురు పలువురు ఉంటారనే అర్థస్వారస్యాన్ని అభ్యూహించవచ్చు.

శ్రీవరవరమునుల మనస్సుకు, దృష్టికి లక్ష్యభూతుడైనవాడు పాపాలను దొంగిలింపబడినవాడై, ముక్తిని పొందుతాడని, ద్రోహం చేసేవాడు నరకసమూహాలను పొందుతాడని చెప్పబడినందున, శ్రీవరవరమునుల కృపకు లక్ష్యమైనవాని పాపాలను, శ్రీవరవరమునులకు ద్రోహం చేసేవారు అపహరిస్తారని, వారు తాము అంతకు ముందు చేసిన పాపాలు, తాము దొంగిలించిన పాపాలు అనే - అన్ని పాపాల ఫలంగా పలు పలు రీతులలో నరకాలను పొందుతారనే అర్థస్వారస్యంకూడా **"నానాభూతాన్ నారకాన్"** అనే ప్రయోగం ద్వారా అభ్యూహ్యం. ఇది **"ముషితకలుషః"** అనే ప్రయోగస్వారస్యంవల్ల ధ్వనించే అర్థం.

**"ముషిత కలుషః"** అనే పదానికి "అపహరింపబడిన పాపాలను కలవాడు" అని అర్థం. శ్రీవరవరమునుల కృపకు లక్ష్యమైనవాని పాపాలు ఎవరిచే దొంగిలింపబడ్డాయి? అనే ప్రశ్నకు, ఈ శ్లోకంలోనే ప్రయోగింపబడిన **"తుభ్యం ద్రుహ్యంతి యే"** అనే ప్రయోగం సమాధానిస్తున్నది కదా!

శ్రీవరవరమునుల కృపకు పాత్రమైనవానిని **"అయమ్"** ఇతడు (సమీపంలో ఉన్నవాడు) అని అన్నారు. ద్రోహులను **"తే"** - వారు (దూరంలో ఉన్నవారు అని అన్నారు. ఈ ప్రయోగాలను బట్టి స్తుతికర్త, శ్రీవరవరమునులు కృపకు పాత్రమైనవానిని ఎల్లప్పుడు తాము సేవించాలని ఆశపడుతున్నారని, శ్రీవరవరమునులకు ద్రోహం చేసేవారి ముఖాన్ని చూడడానికి కూడా ఇష్టపడడం లేదని ఊహించే అవకాశం ఉన్నది. ఈ సందర్భంలో **"అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేత్ వేద సంత మేనం తతో విదురితి"** అనే శ్రుతిలో వేదపురుషుడు పరబ్రహ్మ అస్తిత్వాన్ని అంగీకరించని పాపిని గూర్చి **"సః"** - అని పరోక్షనిర్దేశాన్ని, పరమాత్మ ఉన్నాడని, అతడు స్వరూపరూపగుణవిభూత్యాది విశిష్టుడని తెలిసిన మహాత్ముని గూర్చి **"ఏనమ్"** అని ప్రత్యక్షనిర్దేశాన్ని చేయడం స్మరణీయం.

**"ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః, వర్ధయంతి స్వకం పుత్రం తథా భాగవతాః స్మృతాః"** అనే సూక్తి సదాచార్యులు తమను ఆశ్రయించినవారిని తమ కటాక్షాలతో, ధ్యానంతో, స్పర్శతో వర్ధిల్లజేస్తారని తెల్పుతున్నందున, ప్రస్తుతశ్లోకంలో **"చేతసః చక్షుషో వా"** అని నిర్దేశింపబడిన ధ్యాన, ఈక్షణాలు రెండిటిచేత మూడవదైన స్పర్శకూడా ఉపలక్షితమని చెప్పవచ్చు. **"యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా, స్థావరాణ్యపి ముచ్యంతే"** అనే ప్రమాణం ఇక్కడ స్మరణీయం. దీనిద్వారా శ్రీవరవరమునుల మత్స్యావతార, కూర్మావతార, హంసావతారసామ్యం అనురణనక్రమంలో ధ్వనిస్తున్నదనికూడా భావించవచ్చు. ఈ అవతారాలు జ్ఞాన ప్రదావతారాలు కావడం, శ్వేతవర్ణాన్ని కల్గి ఉండడం, శ్రీవరవరమునులు కూడా అటువంటివారే కావడం గమనార్హం. ఈ సందర్భంలో ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ కృతమైన శ్రీవరవరముని శతకంలో శ్రీవరవరమునులకు మత్స్యావతార, కూర్మావతార సామ్యాలు వర్ణింపబడడం కూడా స్మరణీయం. వశ్యవాక్కులు, **"ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽ నుధావతి"** అనే రీతిలో ఋషికల్పులైన దేవరాజగురువుల శ్రీసూక్తులలోని అనురణన క్రమంలో స్ఫురించే గంభీరధ్వన్యర్థతరంగాలను సమగ్రంగా వ్యక్తం చేయడం ఎవరితరం? ఎవరైనా, వాటిలో మునకలు వేసి, ఉక్కిరి బిక్కిరి కావలసినదే కదా!

**18.** అవ :- ఏవిధంగా లభించినా శ్రీవరవరమునులతో ఏర్పడిన సంబంధం మోక్షప్రాప్తికి ఏలోటు లేని ఉపాయం సుమా! - అని ఇందులో అంటున్నారు. **"యథాకథంచిత్ వరవరమునిసంబంధోఽపి ముక్త్య వ్యభిచారితోపాయ మిత్యాహ"** అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్యానంలోని అవతారిక.

**స్వప్నేఽపి త్వత్పదకమలయో రంజలిం కల్పయిత్వా**
**శ్రుత్వా యద్వా సకృదపి విభో! నామధేయం త్వదీయమ్ ।**
**నిష్ప్రత్యూహం వరవరమునే! మానవః కర్మబంధాన్**
**భస్మీకృత్య ప్రవిశతి పరం ప్రాప్యమేవ ప్రదేశమ్ ॥**

విభో = గొప్ప మహిమను కల, వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, మానవః= మానవుడై పుట్టినవాడు ఎవడైనా, స్వప్నే+అపి = నిద్రించేటపుడు అయినా (కలలో అయినా), అంజలిం కల్పయిత్వా= అంజలిని చేసిగాని, యద్వా = లేక, త్వదీయం =దేవరవారియొక్క, నామధేయం = తిరునామాన్ని, సకృత్+అపి = ఒకసారి అయినా, శ్రుత్వా = వినిగాని, నిష్ప్రత్యూహం = ఏ ఆటంకం లేకుండా, కర్మబంధాన్ = పుణ్యపాపరూపాలైన బంధాలను, భస్మీకృత్య = భస్మం చేసి, పరం = ఉత్కృష్టమైన, ప్రాప్యం = పొందదగినది అయిన, ప్రదేశమేవ = శ్రీవైకుంఠమనే దివ్యస్థానాన్నే, ప్రవిశతి = పొందుతున్నాడు.

**వ్యాఖ్యానమ్ :** అంతు లేని మహిమను కల ఓమణవాళ మహామునీ! ఏ మానవుడైనా నిద్రించేటపుడు కలలో అయినా దేవరవారికి అంజలిని చేయడం గాని, దేవరవారి నామాన్ని ఒక్కసారి వినడంగాని చేస్తే, అతడు సమస్తపాప వినిర్ముక్తుడై, ఉత్తమమైన పరమపదాన్ని పొందుతున్నాడు.

**(మానవః)** - మానవజాతిలో పుట్టినవాడెవడైనా - అనే అర్థం ఈ నిర్విశేషప్రయోగంవల్ల ధ్వనిస్తుంది.

**(త్వత్పదకమలయోః)- "త్వత్"** అనే సర్వనామశబ్దంద్వారా ప్రాప్తశేషిత్వం, **"కమల"** శబ్దప్రయోగంవల్ల పావనత్వం, భోగ్యత్వం, శిరసా ధార్యత్వం ఇత్యాదులు ధ్వనిస్తాయి. ద్వివచనం ద్వారా పాదాల పరస్పర సాదృశ్యం, ఉపమాన రాహిత్యం ధ్వనిస్తుంది. ఇటువంటి దేవరవారి శ్రీచరణాలకు- అని భావం.

**(అంజలిం స్వప్నేఽపి కల్పయిత్వా)**- స్వప్నావస్థలో చేసినా- అని అర్థం. స్వప్నావస్థలోని కృత్యాలకు ఫలజనకత్వంగాని, అకృత్యాలకు ప్రాయశ్చిత్తం గాని లేదు. కాని, ఫలవిశేషసూచకత్వం- అంటే- కలుగబోయే ఫలవిశేషాలను సూచించే స్వభావంమాత్రం వాటికి ఉన్నది. అటువంటి స్వప్నదశలో శ్రీవరవరమునులను ఉద్దేశించి అంజలిని చేసినా - అనే అర్థంలో **"అపి"** శబ్దప్రయోగం చేయబడింది. మన సిద్ధాంతంలో స్వప్నాలకు యథార్థత్వం అంగీకరింపబడినా, ప్రస్తుతం కీర్తింపబడే శ్రీవరవరమునుల ప్రభావాతిశయాన్ని తెలుపడంకోసం మతాంతరంలోవలె స్వప్నాలకు అయథార్థత్వాన్ని అంగీకరించి, **"అపి"** శబ్దప్రయోగం చేయబడింది - అని చెప్పవచ్చు. **"వపురాదిషు యోఽపి కోఽపి వా"** అని అంటూ భగవదంజలివైభవ విషయంగా భగవద్యామునులు పల్కిన విషయాన్ని శ్రీవరవరమునులకు చేసే అంజలి విషయంగా స్తుతికర్త అనుసంధిస్తున్నారు. స్వప్నంలోగాని, నిద్రలో గాని అసంకల్పితంగా శ్రీవరవరమునులు వేంచేసి ఉండే దిక్కువైపు స్వాపకాలిక వాతప్రయుక్తమైన అంజలిని చేసినా- అని అర్థం.

**(యద్వా)** - ఈ విధంగా అసంకల్పితమైన, స్వాపకాలికమైన అంజలిని చేయకపోయినా,

**(త్వదీయం నామధేయం)** - దేవరవారి తిరునామాన్ని,

**(సకృదపి శ్రుత్వా)** - ఒక్కసారి అయినా విని - అని అర్థం. అపి శబ్దానికి ఏవకారార్థం గ్రహించడంలో స్వారస్యం ఉన్నది. నామధేయ సంకీర్తనం చేయనక్కరలేదు; ఆ నామానుసంధానాన్ని విన్నప్పటికీ -అని దీని భావం. శబ్దం వాయువుద్వారా ప్రయాణం చేసి, శ్రవణకుహరాన్ని (కర్ణభేరిని) తప్పక తాకుతుంది కదా! ఈ దశలో కూడా **"సకృదేవ హి శాస్త్రార్థః"** అనేది అర్థవంతమే. కార్యకరమే.

**(నిష్ప్రత్యూహం)** - ఏ అడ్డు లేని రీతిలో ప్రారబ్ధకర్మల నివృత్తి పూర్వకంగా,

**(కర్మబంధాన్ భస్మీకృత్య)** - ప్రారబ్ధకర్మలకంటే వేఱయిన, సంచిత ఆగామికర్మల రూపంలోని పూర్వోత్తర పాపరూపబంధాలను నాశం చేసి - అని అర్థం. **"కర్మబంధాన్"** అనే బహువచన ప్రయోగస్వారస్యం ద్వారా ప్రారబ్ధ-సంచిత-ఆగామి - అనే మూడు కర్మలు తెలుపబడ్డాయని చెప్పవచ్చు. **"సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** అనే సూక్తిద్వారా సాధ్యభక్తి ప్రారబ్ధకర్మలను కూడా దహిస్తుందని చెప్పబడింది. **"తూమలర్ తూవి త్తొழுదు వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క పోయ పిழైయుమ్ పుకుదరువా నిన్డనవుమ్ తీయినిల్ తూశాకుమ్"** అనే తిరుప్పావైసూక్తి, **"యథేషీకతూల మగ్నౌ ప్రదూయేత ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** అనే శ్రుతి స్మరణీయాలు. పాపాలే కాకుండా, పుణ్యాలు కూడా బంధకాలు కనుక అవికూడా తీరిపోతాయి.

**(పరం ప్రాప్యం ప్రదేశమేవ)** - పొందదగిన ఉత్కృష్ట దేశమైన వైకుంఠాన్ని - అని అర్థం. చరమ పర్వాత్మకమైన ప్రకృతస్తోత్ర తాత్పర్యానుగుణంగా, ఆచార్య పురస్సరంగా నిత్యమైన భగవత్కైంకర్యాన్ని చేసికొనే ప్రాప్యదేశాన్ని - అనే అర్థం అభ్యూహ్యం.

**(ప్రవిశతి)** - చరమాధికారికి ఉచితమైన ప్రదేశాన్ని పొందుతున్నాడు - అనే అర్థం ప్రదేశశబ్ద ప్రయోగసిద్ధం. మనం మేల్కొని ఉన్నపుడు శ్రీవరవరమునుల తిరునామాన్ని మనం నోటితో పలకాలనే శ్రమ లేదు. ఎవరో ఒకరు పలుకగా దానిని మనం చెవులతో వింటే చాలు. ఏదో ఒక విధంగా వారితో సంబంధాన్ని కల్గినట్లయితే, అదే మనకు పరమపదాన్ని పొందించగల్గినది - అనేది శ్లోకసారం.

మొదటి పాదంలో **"త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్ యథాతథా వాఽపి సకృత్ కృతోఽంజలిః, తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి న జాతు హీయతే"** అనే శ్లోకార్థం శ్రీవరవరముని విషయంలో అనుసంధింపబడింది. రెండవ పాదంలో **"సాంకేత్యం పారిహాస్యం చ స్తోభం హేళన మేవ వా, వైకుంఠనామగ్రహణ మశేషాఘహరం విదుః"** అనే సూక్త్యర్థం వరవరమునిపరంగా అనుసంధింపబడింది. ఈ ప్రమాణంలోని "గ్రహణ" శబ్దానికి అనుసంధానమని కాకుండా శ్రవణేంద్రియగ్రహణమని, **"వా"** అనే పదం ద్వారా స్వప్నదశలో అంజలిని చేయడం, నామగ్రహణమని అర్థాన్ని చెప్పడం ప్రకృతార్థానుగుణం. ప్రమాణశ్లోకంలోని **"అశేషాఘహరమ్"** అనే ప్రయోగభావం **"నిష్ప్రత్యూహం కర్మబంధాన్ భస్మీకృత్య"** అనే సూక్తిద్వారా ఉపబృంహితం. ఇష్టప్రాప్తికూడా. **"పరం ప్రాప్య మేవ ప్రదేశమ్ ప్రవిశతి"** అనడం ద్వారా విశేషించి తెలుపబడింది.

శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలోని "ఎన్ ఊరై చ్చొన్నాయ్, ఎన్ పేరై చ్చొన్నాయ్, ఎన్నడియార్క్కు నిழల్ కొడుత్తాయ్" ఇత్యాది సూత్రతాత్పర్యం చరమపర్వాత్మకంగా ప్రకృతశ్లోకంలో అనుసంధింపబడినది భావించడంలో స్వారస్యం ఉన్నది.

**19.** అవ :- "శ్రీవరవరమునుల వైభవాన్ని తెలిసినవానికి నేను పలికే మాట రుచిస్తుంది. కాని, అటువంటి వాడు లోకంలో దుర్లభుడుకదా'' - అని ఇందులో అంటున్నారు.

యస్మిన్ కించిత్ విధిరపి యథా వీక్షితుం న క్షమ స్స్యాత్
వక్తుం శక్తః క ఇహ భగవన్! వైభవం తత్ త్వదీయమ్ ।
య స్సర్వజ్ఞః స ఖలు భగవానీక్షతే తత్ సమగ్రం
తస్యాపి త్వం వరవరమునే! మన్యసే తత్త్వమేకః ॥

భగవన్ వరవరమునే = సద్గుణాలను నిండుగా కల్గిన ఓ శ్రీవరవరమునీ!, యథా = ఏకారణంవల్ల, విధిరపి = జ్ఞానం పూర్ణంగా ఉండే బ్రహ్మదేవుడు కూడా, యస్మిన్ = దేవరవారియొక్క ఏ గొప్పతనంలో, కించిత్ = కొంచెం అయినా, ఈక్షితుం = చూడడానికి, క్షమః న స్యాత్ = సమర్థుడు కాలేడో, తత్ త్వదీయం వైభవం = అటువంటి దేవరవారి నిరతిశయ వైభవాన్ని, ఇహ = అజ్ఞానం, అశక్తి -అనే ఇవి నిండుగా ఉండే ఈ లోకంలో, వక్తుం = పల్కడానికి, కః శక్తః = ఎవడు సమర్థుడు? (ఎవడూ కాడు - అని భావం), యః సర్వజ్ఞః = ఏ సర్వజ్ఞుడైన వాడెవడో, భగవాన్ సః ఖలు = సర్వేశ్వరుడైన అతడొక్కడేకదా, తత్ = ఆ (మీ) గొప్పతనాన్ని, సమగ్రం = పూర్ణంగా, ఈక్షతే = చూడగలడు, ఏకః త్వం = సాటి లేని మీరు, తస్య = ఆ సర్వేశ్వరుని గొప్పతనం యొక్క, తత్త్వమపి = యాథార్థ్యాన్ని కూడా, మన్యసే = తెలియగలరు.

వ్యాఖ్యానమ్ : జ్ఞానాదిగుణషాడ్గుణ్యాన్ని పూర్ణంగా కల్గిన ఓవరవరమునీ! జ్ఞానపూర్ణుడైన బ్రహ్మకూడా దేవరవారి గొప్పతనంలో కొంచెంకూడా దర్శించడానికి కూడా సమర్థుడు కాడు. ఇక, అజ్ఞాన, అశక్తులు నిండిన ఈ లోకంలో  అటువంటి మీ మహిమను తెలియగల్గినవాడు ఎవడూ లేడు. సర్వజ్ఞుడైన ఆ భగవానుడొక్కడే దానిని పూర్తిగా దర్శించగలడు. సాటిలేని మీరు మాత్రమే ఆ భగవానుని గొప్పతనాన్ని తెలియగలరు- అని భావం.

**(యథా)** - ఏకారణం వల్ల అయితే- అని అర్థం.

**(విధిరపి)** - సతతవేదాధ్యయనం ద్వారా "అమ్ కణ్ మాఞాలమ్" అని పొగడబడే విచిత్రమైన సర్వ జగత్తును సృష్టించగల్గిన జ్ఞానవైశద్యాన్ని పొందిన బ్రహ్మకూడా - అని అర్థం. "విధీయతే అనేన విధిః" అనే విధివ్యుత్పత్తి వివక్షితం.

**(యస్మిన్ కించిత్ అపి)** - అప్రమేయమైన మీ వైభవంలోని శతాంశకలాంశాన్ని కూడా,

**(వీక్షితుమ్ అపి)** - దర్శించడానికి కూడా - అని అర్థం. స్తుతించ లేకపోతే లేకపోవచ్చు. కనీసం దర్శించడానికి కూడా - అని భావం. దర్శనానంతరభావి కదా స్తుతి. "పెణ్ణులామ్ శడైయనానుమ్ పిరమనుమ్ ఉన్నై క్కాణ్బాన్" అనే తిరుమాలై దివ్యప్రబంధసూక్తి శ్రీవరవరముని విషయంలో అనుసంధేయం. శ్లోకంలోని "విధిరపి" అనేచోట గల "అపి" శబ్దంచేత తిరుమాలై పాశురంలోని రుద్రాదులు తెలుపబడ్డారని చెప్పవచ్చు.

**(న క్షమః స్యాత్)** - సమర్థుడు ఏనాటికీ కాలేడో.

**(తత్ త్వదీయం వైభవమ్)** - అటువంటి దేవరవారి అప్రమేయ వైభవాన్ని,

**(ఇహ)-** అజ్ఞానాన్ని, అశక్తిని కల **"ఇరుళ్ తరుమా ఞాలమ్"** అయిన ఈ ప్రపంచంలో,

**(వక్తుం కః శక్తః)** - పల్కడానికి ఎవడు సమర్థుడు? పూర్ణంగా పలుకలేకపోయినా, అంశతః పల్కడానికి కూడా సమర్థుడు కాడు - అని భావం. **"విణ్ణోర్ పరవుమ్ తలైమకనై"** (నిత్యసూరులు కూడా తన వైభవాన్నిగూర్చి యథాతథంగా పలుకలేక జల్పించేటట్లుగా ఉండే సర్వాధికుడు) ఇత్యాదిగా ఆళ్వార్లు భగవద్విషయంలో పల్కిన విషయాన్ని స్తుతికర్త శ్రీవరవరమునుల పట్ల అనుసంధిస్తున్నారు. ఈ సూక్తిలోని **"పరవుమ్"** (జల్పించే) అనే ప్రయోగంలోని తాత్పర్యం - యథావత్ పలుకలేరు - అని కదా! **"ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకత్తు ఎవ్వెవైయుమ్ శాదువాయ్ నిన్ పుకழిన్ తకైయల్లాల్ పిరిదిల్లై", "నిన్తొల్ పుకழ் మాశూణాదో"** ఇత్యాదిగా ప్రథమపర్వంలో నమ్మాழ్వార్లు పల్కిన సూక్తుల భావాలు శ్రీవరవరముని విషయంగా అనుసంధేయాలు.

ఈవిధంగా బ్రహ్మమొదలు సామాన్యునివరకు ఎవ్వరూ పలుకలేకపోతే, అది శశవిషాణం, ఆకాశపద్మం - ఇత్యాదులవలె తుచ్ఛం కావలసివస్తుంది కదా! అనే సందేహాన్ని ఇక తీరుస్తున్నారు.

**(యః సర్వజ్ఞః స భగవాన్)** - శ్రుత్యుక్తమైన **"య స్సర్వజ్ఞ స్సర్వవిత్"** అనే సూక్తి దీనిద్వారా ప్రత్యభిజ్ఞాపనం (స్మరింప) చేయబడింది. అన్నిటిని గూర్చి అన్ని రీతులలో ప్రత్యక్షంగా ఒక్కసారిగా స్వయంగా సదా తెలియగల్గిన వాడు, సహజసార్వజ్ఞ్యత్వాన్ని కలవాడు భగవానుడే కదా! **"యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"** ఇత్యాదిగా నిర్వచింపబడిన సర్వజ్ఞత్వాన్ని కల్గిన భగవానుడు,

**(తత్ సమగ్రమ్ ఈక్షతే)** - దేవరవారి అటువంటి అప్రమేయవైభవాన్ని- అనవధికత్వం మొదలైన సమస్తవైలక్షణ్యాలను కల్గిన వైభవాన్ని- సాక్షాత్కరించుకోగలడు. కేవలం దర్శించగలడు. (వర్ణించలేడు)

**(ఏకః త్వమ్)** - **"ప్రకృష్ణ విజ్ఞానబలైకధాములైన"** జ్ఞానంలో సాటి మేటి లేని దేవరవారు,

**(తస్య తత్త్వమపి)** - అనవధికాతిశయమైన ఐశ్వర్యాన్ని కల్గిన ఆ భగవానుని యథార్థతత్త్వాన్ని,

**(సమగ్రం మన్యసే)** - స్వాభావికానవధికాతిశయాది యుక్తంగా, పూర్తిగా తెలియగలరు. మీ గొప్పతనాన్ని సమగ్రంగా తెలియగలవాడు సర్వజ్ఞుడైన భగవానుడొక్కడే. ఆ భగవానుని గొప్పతనాన్ని సమగ్రంగా తెలియగలవారు మీరొక్కరే. ఈవిధంగా శ్రీవరవరమునులు వైభవాన్ని తెలియగల్గినవాడు ఇంకొకడు లేనందున, నేను గత శ్లోకంలో పల్కిన మాట ఎవరికీ రుచించదు- అని తాత్పర్యం. శ్రీవరవరమునులు ఆదిశేషరూపులు కనుక, ఆదిశేషుడు **"ప్రకృష్ట విజ్ఞానబలైకధాముడు"**గా కీర్తింపబడు తున్నాడు కనుక, శ్రీవరవరమునుల జ్ఞానాతిశయం సువ్యక్తం. జ్ఞానంలో పరస్పరసాదృశ్యాన్ని కల వీరిరు వురిని భగవచ్ఛబ్దంతో నిర్దేశించడం గమనించదగినది.

**20.** అవ :- "శ్రీవరవరమునుల వైభవాన్ని భగవానుడు తప్ప వేఱు ఎవరూ తెలియలేరని అన్నారుకదా! మఱి, మీరు మాత్రం ఆ వైభవాన్ని ఏవిధంగా తెలియగలిగారు?'' అని అంటే, "శ్రీవరవరమునుల

కటాక్షంవల్ల వారి గొప్పతనంలో లవలేశాన్ని మాత్రం ఏదో కొంచెం తెలియగలిగాను'' అని సమాధానం పల్కుతున్నారు. **"వరవరమునికటాక్షవీక్షణవశాత్ స్వస్య తద్వైభవవిషయే కించిత్జ్ఞతాఽపీత్యాహ"** అని శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామి వ్యాఖ్యలోని అవతారిక.

**కాలోఽనంతః కమల జనుషో న వ్యతీతాః కియంతః**
**తిర్యఙ్మర్త్యః తృణవనలతాః ప్రస్తరో వాఽప్యభూఽవమ్ ।**
**ఇత్థం వ్యర్థైః జనిమృతిశతై రేనసామేవ పాత్రం**
**దిష్ట్యా సోఽహం వరవరమునే ! దృష్టిగమ్య స్తవాహమ్ ॥**

వరవరమునే = మణవాళమహామునీ, కాలః= కాలం అనేది, అనంతః = అంతు లేనిది, కమలజనుషః= భగవానుని నాభీకమలంలో పుట్టిన బ్రహ్మలు, కియంతః= ఎంతమందో, న వ్యతీతాః= పుట్టి నశించలేదు? అహం = పలువుర బ్రహ్మల సృష్టికి లక్ష్యభూతుడనైన నేను, తిర్యక్ అభూవమ్ = ఒక సమయంలో తిర్యక్కుగా జన్మించాను, మర్త్యః అభూవమ్ = ఇంకొక సమయంలో మానవుడనై పుట్టాను, తృణవనలతాః అభూవం = గడ్డిగా, అరణ్యంగా, లతలుగా జన్మించాను, ప్రస్తరః వా అభూవమ్ = రాయిగా కూడా జన్మించాను, ఇత్థం = ఈవిధంగా, వ్యర్థైః= ఏవిధమైన ప్రయోజనం లేని, జనిమృతిశతైః = వందలకొలది పుట్టుకలతో, మరణాలతో, ఏనసామ్ ఏవ పాత్రం = పాపాలకు మాత్రమే ఆకరమైన, సః అహమ్ = పలు రీతులలో జన్మించిన నేను, దిష్ట్యా = భగవత్కృపతో, తవ = దేవరవారియొక్క, దృష్టిగమ్యః = కటాక్షానికి లక్ష్యంగా, ఆసమ్ =అయినాను.

వ్యాఖ్యానమ్ : ఓ వరవరమునీ! కాలం అంతు లేనిది. ఈ కాలగమనంలో ఎంతమంది బ్రహ్మలు పుట్టి గిట్టలేదు. ఆ బ్రహ్మల సృష్టికి లక్ష్యమైన నేను తిర్యక్కుగా, మానవునిగా, తృణంగా, వనంగా, లతలుగా, చివరిగా రాయిగా కూడా జన్మించాను. వందలకొలది జన్మమరణాలను పొంది కేవలం పాపాలకే నిలయమయ్యాను. ఇటువంటి నేనిపుడు భగవత్కృపవల్ల దేవరవారి దృష్టికి లక్ష్యభూతుడనై, తమ అంతులేని మహిమలో శతాంశ కలాంశను కించిత్తుగా గ్రహించగలిగాను. అందువల్లనే ఈ స్తుతిని చేయగలిగాను - అని భావం.

**(కాలః అనంతః)** కాలం అపరిచ్ఛిన్నం.

**(కియంతః కమలజనుషః)** - భగవానుని నాభీకమలంనుండి ఎంతమంది బ్రహ్మలు,

**(న వ్యతీతాః)** - పుట్టి గిట్టలేదు!

**(అహం తిర్యక్ అభూవమ్, మర్త్యః అభూవమ్)**- ఆబ్రహ్మల సృష్టిలో నేను పశుపక్ష్యాదులుగా జన్మించాను. అనులోమ - ప్రతిలోమ జాతులలో బ్రాహ్మణాది జన్మలను ఎన్నిటినో పొందాను.

**(తృణవనలతాః)** - తృణంగా, వనంగా, లతలుగా అయినాను.

**(ప్రస్తరో వా అభూవమ్)** - చివరకు అహల్యవలె, వాసవదత్తవలె రాయిగా కూడా అయినాను - అని భావం. అహల్య శిలగా మారినట్లు వాల్మీకి రామాయణంలో కన్పించకపోయినా, ద్రావిడసాహిత్యంలోని

కథనాన్నిబట్టి కవిచే ఈవిధంగా పలుకబడింది. **"అనాదౌ సంసారే"** అనే న్యాయం సూచించడంకోసం **"కాలోఽనంతః"** అని, ప్రయోగింపబడింది. సృష్టికర్తలు అనేకులు తెలుపడం కోసం **"కమలజనుషః"** అనే బహువచనం ప్రయోగింపబడింది. లేక, **"కాలోఽనంతః యత ఏవ తతోఽహం వ్యతీతాః కియంతః కమలజనుషః నాభూవమ్"** అని అన్వయించి, కాలం అపరిచ్ఛిన్నమైనందున నేను గడచిన ఎంతమంది బ్రహ్మలుగా పుట్టలేదు? - అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"కియంతః"** అనే బహువచనరూపాన్ని **"కియాన్"** అనే ఏకవచనంగా మార్చి, **"కియాన్ మర్త్యో నాభూవమ్, కియాన్ తిర్యక్ నాభూవమ్"** ఇత్యాదిగా అన్వయించి ఎంతమంది మానవులుగా, తిర్యక్కులుగా, తృణాలుగా, వనాలుగా, లతలుగా, శిలలుగా నేను జన్మించ లేదు?- అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(ఇత్థం)-** ఈవిధంగా - పూర్వం తెల్పిన రీతిలో,

**(వ్యర్థైః జనిమృతిశతైః)** - పరమపురుషార్థ రహితాలైన జన్మమరణాలతో - అని అర్థం. దీనిద్వారా **"వృథైవ భవతో యాతా భూయసీ జన్మసంతతిః"** ఇత్యాది **"పఱ్ఱ్రుదే పల పకలుమ్ పోయిన"**, **"పునరపి జననం పునరపి మరణమ్"** ఇత్యాది సూక్త్యర్థం స్మరింపజేయబడింది.

**(జనిమృతిశతైః)** - ఈ ప్రయోగంద్వారా **"జాయస్వ మ్రియస్వ"** అనే శ్రుతి స్మరింపజేయబడింది. ఇక్కడ శతశబ్దం ఆనంత్యవాచకం.

**(దిష్ట్యా)** - **"దైవం దిష్టం భాగధేయం- విధిః"** అనే అమరకోశవచనం వల్ల ఈ పదానికి విధి -అని అర్థం. విధి అంటే **"విది వాయ్క్కిన్ఱు కాప్పారార్?"** అనే రీతిలో భగవత్కృప. భగవానునకు అది అనతిక్రమణీయం కనుక **"దిష్ట్యా"** అని ప్రయోగింపబడింది. దీనిద్వారా **"ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కరుణా కాఽపి జాయతే"** అనే సూక్త్యర్థం స్మరింపజేయబడింది. లేక, **"దిష్ట్యా సముపజోషం చేత్యానందే"** అనే అమరకోశ వచనాన్నిబట్టి **"దిష్ట్యా"** అనే పదం ఆనందార్థకమైన నిపాతంగా గ్రహించవచ్చు. **"జనిమృతిశతైః"** అనే ప్రయోగం **"అహమ్"** అనే పదంతో అన్వయిస్తుంది. ఆ విధంగా పొందిన పలు జన్మమరణాల కారణంగా భగవత్కృప నాపై ప్రసరించింది. అంతేకాని, నేను చేసిన ఉపాయానుష్ఠానం అనేది ఏదీలేదు - అని తాత్పర్యం.

**(తవ దృష్టిగమ్యః ఆసమ్)** - దేవరవారి నిర్హేతుక కటాక్షానికి లక్ష్యమయ్యాను, దేవరవారి కటాక్షం సోకినందువల్లనే నేను తమ వైభవంలో ఏదో కొంచెం తెలియగలిగాను - అని భావం. **"యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూమ్ స్వామ్"** అనే శ్రుత్యర్థం, **"వెఱిదే అరుళ్ శెయ్‌వర్"** అనేదివ్యసూరి సూక్త్యర్థం. వరవరముని విషయంగా ఇక్కడ అనుసంధేయాలు. శ్రుతిలోని తనుశబ్దానికి **"తనోతి - సర్వత్ర వ్యాప్నోతి"** అనే వ్యుత్పత్తిద్వారా సర్వత్రవ్యాప్తమైన, అనవధికమైన వరవరమునివైభవాన్ని - అనే అర్థాన్ని చరమపర్వానుగుణంగా చెప్పవచ్చు.

**21.** అవ :- శ్రియఃపతి శ్రీపాదద్వంద్వమే ఉపాయోపేయాలు - అనే అధ్యవసాయం కలవారికి కూడా శ్రీవరవరమునుల సంబంధం ఆవశ్యకం - అని అంటున్నారు ఇందులో.

ముక్త్వైవ త్వాం వరవరమునే! సంపదాం మూలకందమ్
క్షేమం కించిన్న ఖలు సులభం కేశవైకాంత్యభాజామ్ ।
దృష్టో దైవాత్తవ పున రనుక్రోశకోశై రపాంగైః
నిర్మర్యాదః పశురపి భృశం నీయతే నిర్మలత్వమ్ ॥

వరవరమునే = ఓమణవాళమహామునీ!, కేశవ+ఐకాంత్య భాజామ్ = కేశవుడైన శ్రియఃపతి విషయంలో "ఇతడొక్కడే ప్రాప్యం, ప్రాపకం'' అనే స్థిరనిశ్చయాన్ని కలవారి, సంపదామ్ = అన్ని సంపదలకు, మూలకందం = మూలకారణమైన, త్వాం ముక్త్వా = దేవరవారిని విడచిపెట్టి (దేవరవారి సంబంధం లేకపోతే), క్షేమం = లభించినదానిని కాపాడుకోవడం అనే క్షేమం, కించిదపి = కొంచెం కూడా, సులభం నైవ = సులభం కానేకాదు, నిర్మర్యాదః= శాస్త్రమర్యాదను దాటిన, పశురపి = పశువువంటివాడు కూడ, అనుక్రోశకోశైః = దయకు కోశాలైన, తవ అపాంగైః= దేవరవారి కటాక్షాలచే, దైవాత్ = అదృష్టవశంచేత, దృష్టః = చూడబడినవాడై, భృశమ్ = మిక్కిలి, నిర్మలత్వం = నిర్దోషత్వాన్ని (పూర్తిగా పాపం లేని స్వభావాన్ని), నీయతే = పొందింపబడుతున్నాడు.

వ్యాఖ్యానమ్ : **"ఉపాయోపేయత్వే తదిహ తవ తత్త్వమ్"** అని, **"పేఱొన్డు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్డు మిల్లైమఱ్ఱ చ్చరణన్ఱి"** అనే రీతిలో భగవానుని శ్రీపాదాలే ఫలం, దానికి ఉపాయం కూడా ఆ శ్రీపాదాలే - అని నమ్మి ప్రపత్తిని చేసిన అధికారి అయినా, అతనికి ఆచార్యోత్తములైన శ్రీవరవరమునుల సంబంధం లేనట్లయితే మోక్షలాభమనే యోగం కలుగదు. అంతేకాదు. ఇంతవరకు ఉన్న "భగవానుని శ్రీచరణాలే ఉపాయోపేయాలు'' అనే అధ్యవసాయాన్ని కాపాడు కోవడం - అనే క్షేమం కూడా ఉండదు - అని భావం. శ్రీవరవరమునుల సంబంధం లేనివాని ప్రపత్తి మోక్షప్రదాయిని కానందువల్ల వ్యర్థం అని, ఆ ఆచార్యుల సంబంధాన్ని పొందినవాని పాపం మోక్షాన్ని అడ్డుకోలేదు కాబట్టి వ్యర్థమని భావించాలి.

**"కేశవైకాంత్యభాజామ్"** అనే ప్రయోగంవల్ల భగవానునివల్ల కలిగే ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి సూచింపబడింది. కేశవనామానికి గల ప్రశస్తమైన కేశాలు కలవాడనే వ్యుత్పత్తిద్వారా ఆనందజనకత్వరూపమైన ఇష్టప్రాపకత్వం, కేశిసంహర్త అనే వివరణంద్వారా విరోధినిరసనరూప అనిష్టనివర్తకత్వం, బ్రహ్మ, శివులకు కూడా ఉత్పత్తి కారణమనే అర్థం ద్వారా **"కారణంతు ధ్యేయః"** అనే ధ్యేయత్వం చెప్పబడినవి. **"కేశవః క్లేశహా లోకే"**, **"నరకే పచ్యమానస్తు యమేన పరిభాషితః, కిం త్వయా నార్చితో దేవః కేశవః క్లేశనాశనః"**, **"కెడుమిడరాయ వెల్లామ్ కేశవా! ఎన్న"** అనే సూక్తులు స్మరణీయాలు. **"ఐకాంత్యభాజామ్"** అన్నందువల్ల ఆ భగవానుని చరణాలే ప్రాప్యప్రాపకాలుగా నమ్మే స్థితి సూచింపబడింది. "నిర్మర్యాదః పశుః" అనే సూక్తి ద్వారా-తల్లికి, ఇతరులకు మధ్య తేడా తెలియకుండా, విధినిషేధ రహితంగా వర్తించే పశుప్రాయుడైన పురుషుడు చెప్పబడ్డాడు. "అనుక్రోశకోశైః" అనే విశేషణంచేత శ్రీవరవరమునుల పరదుఃఖదుఃఖిత్వ రూపమైన కరుణాళుత్వం తెలుపబడింది. ఈ శ్లోకార్థానికి అనుగుణంగా - **"దురాచారోఽపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా, సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయా శరణం యది, నిర్దోషం విద్ధిం తం జంతుమ్ ప్రభావాత్**

పరమాత్మనః", "పశుర్మనుష్యః పక్షీవాయే చ వైష్ణవ సంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్" అని ఇత్యాది ప్రమాణాల అర్థం శ్రీవరవరమునుల విషయంలో అనుసంధేయం.

22. అవ :- పూర్వశ్లోకంలో - **"చితః పరమచిల్లాభే ప్రపత్తిరపి నోపధిః, విపర్యయే తు నైవాస్య ప్రతిషేధాయ పాతకమ్"** (జీవుడు పరమాత్మను పొందడంలో ప్రపత్తిసైతం కారణం కాదు. విపర్యయంలో- అంటే- పరమాత్మ జీవుని పొందాలని అనుకుంటే, ఆ జీవుని పాతకంకూడా అడ్డుకాదు) అనే శ్లోకచ్ఛాయలో శ్రీవరవరముని ఆశ్రయించనివారి ప్రపత్తి, ఆశ్రయించినవారి పాతకం రెండూ అకించిత్కరాలే -అని చెప్పబడింది. ఈ శ్లోకంలో - శ్రీవరవరమునుల శ్రీపాదాలే ప్రాప్యప్రాపకాలుగా అధ్యవసించే స్థితి తమకు కలిగినది కదా - అని దేవరాజగురువు విస్మయం చెందుతున్నాను.

**మర్త్యం కంచిద్వరవరమునే! మానహీనః ప్రశంసన్**
**పాదౌ తస్య ప్రపదనపరః ప్రత్యహం సేవమానః ।**
**తచ్ఛేషత్వం నిరయమపి యః శ్లాఘ్యమిత్యేవ భుంక్తే**
**సోఽయం ప్రాప్తః కథమివ పరం త్వత్పదైకాంత్యవృత్తిమ్ ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, యః = ఏమానవుడు, కించిత్ = కులం గాని, జ్ఞానం గాని, వృత్తం గాని - వీటిలో దేనినీ లేని, ఎవరో ఒక, మర్త్యం = మానవుని, మానహీనః = అభిమానం అనేది ఏమాత్రం లేనివాడై, ప్రశంసన్ = స్తోత్రాన్ని చేస్తూ, ప్రపదనపరః = తనకు కావలసినదానినిగూర్చి ప్రార్థించడంలో శ్రద్ధను కలవాడై, తస్య పాదౌ = అతని పాదాలను, సేవమానః = సేవించేవాడై, నిరయమపి= వాస్తవానికి నరకదుఃఖమైనా, తచ్ఛేషత్వం = అతని దాసుడై ఉండడాన్ని, శ్లాఘ్యమ్ ఇత్యేవ = పొగడదగినది- అని భావించియే, భుంక్తే = (స్వర్గ సుఖం వలె) దానిని అనుభవిస్తున్నాడో, సః అయం = అటువంటి నీచుడైన ఈ మానవుడను (అయిన నేను), త్వత్పద+ఐకాంత్య వృత్తిం = దేవరవారి శ్రీచరణాలనుగూర్చి, "ప్రాప్యం, ప్రాపకం ఇవే" అనే నిశ్చితమైన స్థితిని, కథమివ ప్రాప్తః = ఏవిధంగా పొందానో కదా!

**వ్యాఖ్యానమ్ :** ఓ శ్రీవరవరమునీ! లోకంలో కులం కాని, జ్ఞానం కాని, శీలం కాని లేనివానిని ఒకనిని ఏమానవుడు ఏమాత్రం లజ్జ లేకుండా స్తోత్రం చేస్తూ, తనకు కావలసిన వస్తువును యాచించడంలో శ్రద్ధను కలవాడై, అతని పాదాలను సేవిస్తూ, అది చివరకు నరకతుల్యమైనా, అతనికి శేషభూతుడై ఉండడాన్ని గొప్పదిగా తలుస్తూ దాన్ని స్వర్గంగా అనుభవిస్తున్నాడు. అట్టి నీచుడైనవాడు (అటువంటి నేను) "నీపాదాలే ప్రాప్యప్రాపకాలు'' అనే స్థిరమైన నమ్మకాన్ని ఏవిధంగా పొందాడు? ఆశ్చర్యం! - అని భావం.

**(కంచన)-** ఇచటి **"కిమ్"**శబ్దం **"కశ్చిత్ కాంతావిరహగురుణా"** అనే మేఘసందేశంలోని ప్రయోగంవలె అవ్యపదేశ్యత్వాన్ని సూచిస్తుంది. అందువల్ల అభిజన - విద్యా వృత్తాలలో ఏదీ లేనివాడు, కేవలం మనుష్య జన్మనుమాత్రం ఎత్తినవాడు - అని తాత్పర్యం.

**(మానహీనః)** - మానమంటే ఆత్మసంభావనామూలమైన చిత్త సమున్నతి. దానిని లేనివాడని అర్థం.

**(ప్రశంసన్)** - గొప్పగా - ఎక్కువగా పొగడుతూ - అని అర్థం. **"మానే గచ్ఛతి వారయంత్యుపశమే క్ష్మా మాలిఖంత్యాం హ్రియామ్"** ఇత్యాది శ్లోకార్థం భావనీయం.

**(ప్రపదనపరః)** - తాను కోరేదానిని పొందగోరి, దానికోసం యాచించేవాడై,

**(తస్య)** - తన స్తుతిని విని తనకు అభిముఖుడైన అతని,

**(పాదౌ ప్రతిదినం)**- పాదాలను నిత్యం.

**(సేవమానః)** - తాను స్తుతించే వ్యక్తిని, అతనికి సంబంధించినవారిని, అతని వస్తువులను మోయడంవంటి అనుకూలవృత్తిని (సేవను) చేస్తూ,

**(నిరయమపి)** - అది అప్రాప్తం, హేయం కాబట్టి నరకతుల్యం - అని భావం.

**(తచ్ఛేషత్వమ్)** - ఆ మానవాధమునకు శేషమై ఉండడం - అని అర్థం. **"సేవా శ్వవృత్తి రాఖ్యాతా"** అనే రీతిలో సేవ అంటేనే కుక్కబతుకు. అటువంటి అధముని సేవించడం సాక్షాన్నరకం.

**(శ్లాఘ్యమిత్యేవ)** - ఇచటి **'ఏవ'** కారంద్వారా ఏనాటికీ తాను చేసే సేవలోని అప్రాప్తత్వాన్ని, నీచత్వాన్ని ఎంతమాత్రం తెలిసికోలేడని సూచింపబడింది.

ప్రస్తుతశ్లోకంలో - మొదట నీచపురుషప్రశంస, అనంతరం ఆ స్తుతిచేత సంతోషించిన ఆ నీచుడు తన పాదాలను ముందుకు చాచడం, తరువాత ఆ పాదాలను స్తుతించేవాడు వానిని సేవించడం, అనంతరం ఆ నీచుని వశీకరించుకోవడం, అనంతరం అతని వద్ద తాను అపేక్షించినవానిని యాచించడం, అనంతరం ఆ కోటికలను అంగీకరించిన ఆ వ్యక్తికి తాను శేషభూతుడు కావడం - అనే ఈ క్రమం భావ్యమని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య.

**(సోఽయం)** - అటువంటి వీడు,

**(పరమ్)** - **"ఇంద్రియేభ్య పరా హ్యర్థాః"** అనే రీతిలో పొందడానికి సాధ్యం కానిది అయిన - అని భావం.

**(త్వత్పదైకాంత్యవృత్తిమ్)** - మీ శ్రీపాదాలే ఉపాయోపేయాలనే అధ్యవసాయం కల్గి ఉండడమనే మనోవ్యాపారం.

**(కథమివ ప్రాప్తః)** - ఏ విధంగా పొందగలడు? - అనే విస్మయం ధ్వనిస్తున్నది. **"వర వాఱు ఒన్ఱిల్లై ఆల్! వాழ்வు ఇనిదు ఆల్!"** ఇత్యాది భగవద్విషయంలోని పెరియతిరువన్దాది పాశుర సూక్తి చరమపర్వంగా అనుసంధింపబడినదని చెప్పవచ్చు.

**23.** అవ :- స్వరూపజ్ఞానం పొందిన తరువాత కవి **"సోఽహ మభుంజే"** అని చెప్పవలసి ఉండగా- ఈ రీతిలో కాకుండా **"భుంక్తే"** అని అపరోక్షనిర్దేశం చేయడానికి కారణం పూర్వం ఆ స్వరూపంజ్ఞానం లేకపోవడమే.

**"సోఽహమ్ ప్రాప్తః"** అని చెప్పవలసి ఉండగా, **"సోఽయమ్"** అని పలుకడానికి హేతువు అహం శబ్దాన్ని పలుకడంలోని భయంవల్ల - అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి రస్యవ్యాఖ్య.

**నిత్యానాం యః ప్రథమగణనాం నీయసే శాస్త్రముఖ్యైః**
**కృత్యాఽఽకృత్యా భవసి కమలాభర్తు రేకాంతమిత్రమ్ ।**
**దేవః స్వామీ స్వయ మిహ భవన్ సౌమ్యజామాతృయోగీ**
**భోగీశ! త్వద్విముఖమపి మాం భూయసా పశ్యసి త్వమ్ ॥**

భోగీశ = సర్పప్రభువు అయిన ఓ ఆదిశేషా!, శాస్త్రముఖ్యైః = పాంచరాత్రం మొదలైన శాస్త్రాలతో, యః = ఏ దేవరవారు, నిత్యానాం = నిత్యసూరులలో, ప్రథమగణనాం = మొదటివారుగా లెక్కించడాన్ని, నీయసే = పొందింపబడుతున్నారో, కృత్యా = కైంకర్యాలతో, ఆకృత్యా = వాటికి తగినట్లుగా ఛత్రం, సింహాసనం, పాదుకలు మొదలుగా స్వీకరించే ఆకారాలతో, కమలా భర్తుః = శ్రియఃపతి అయిన భగవంతునకు, ఏకాంతమిత్రం = ఏనాడూ విశ్లేషించని మిత్రంగా, భవసి = అవుతున్నారో, సః త్వం = అటువంటి దేవరవారు, దేవః = శేషియై, స్వామీ = సొత్తుపట్ల అభిమానాన్ని కల, సౌమ్యజామాతృయోగీ = అழகియమణవాళ మహామునులుగా, భవన్ సన్ = అవతరించినవారై, త్వత్+విముఖమపి = దేవరవారికి అభిముఖుడను కాకపోయినా, మామ్ = దాసుడనైన నన్ను, భూయసా = అధికంగా, పశ్యసి = కటాక్షిస్తున్నారు.

పూర్వం ప్రస్తావించిన, వరవరమునులే ఉపాయోపేయాలనే భావం వారి కటాక్షాల వల్లనే కల్గుతుంది- అని ఇందులో అంటున్నారు.

ఓ ఆదిశేషస్వరూపా! పాంచరాత్రాది శాస్త్రాలచే మీరు భగవంతుడైన శ్రియఃపతి యొుక్క నిత్యపరిచరగణాల్లో సర్వప్రథములుగా లెక్కింప బడుతున్నారు. **"నివాసశయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః శరీరభేదైః"** అని పలు కైంకర్యాలతోను, వాటికి తగినట్లు మీరు స్వీకరించిన ఛత్ర - సింహాసన - పాదుకాది పలు ఆకృతులతోను శ్రియఃపతి అయిన స్వామికి విడువలేని మిత్రం అవుతున్నారు. ఇటువంటి మీరు, శేషియై, సొత్తులో అభిమానం ఉన్న సౌమ్యజామాతృయోగియై అవతరించినవారై, మీపట్ల ఆభిముఖ్యాన్ని లేనివాడను అయినా, నన్ను అధికంగా కటాక్షిస్తున్నారు.

వ్యాఖ్యానమ్ : **(భోగీశ)**- ఓ భుజగపతీ! - అని అర్థం. ఈ సంబోధనద్వారా సర్పజాత్యనుగుణమైన శైత్య-సౌరభ్య-మార్దవాది గుణాలను వరవరమునులు కల్గి ఉన్నట్లు తెలుపబడినది.

**(శాస్త్రముఖ్యైః)** - పాంచరాత్రాది శాస్త్రాలతో,

**(యః త్వమ్)** - ఆదిశేషులైన మీరు,

**(నిత్యానామ్ మధ్యే)** - ఏనాడు సంసారసంబంధం లేనివారైన శేష-శేషాశనాదులమధ్య - అని అర్థం. వీరి నిత్యత్వం సైతం భగవత్సంకల్పాధీనమే. "నిత్యం ప్రియా స్తవ హి కేచన తే హి నిత్యాః" అనే కూరేశసూక్తి స్మరణీయం.

**(ప్రథమగణనా నీయసే)** - మొదటివారుగా ఆదిశేషనామంతో వ్యవహరింపబడుతున్నారు. దీనికి ఏమి కారణం? అంటే,

**(కృత్యా)** - అశేషశేషవృత్తి రూపమైన వ్యాపారంతో,

**(ఆకృత్యా)** - **"నివాసశయ్యాశసన పాదుకాంశుకోపధానవర్షాతప వారణాదిభిః"** అనే యామునుల సూక్తి, దానికి మూలం అయిన **"శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్ నిన్ఱాల్ మరవడియామ్ నీళ్కడలుళ్ మణివిళక్కామ్ పూమ్ పట్టామ్ పుల్కు మణైయామ్ తిరుమాల్కు్కరవు"** అనే సరోయోగిపాశురం స్మరణీయాలు.

**(కమలాభర్తుః ఏకాంతమిత్రమ్)**- శ్రియఃపతికి నిత్యమైన మిత్రం అవుతున్నారు.

**(త్వద్విముఖమపి మామ్)** - అటువంటి మీకు విముఖుడనైనా నన్ను,

**(ఇహ)** - ఈ సంసారంలో, **(దేవః)** - శేషి భూతులై?,

**(స్వామీ)**- సొత్తు విషయంలో అభిసంధిని కలవారై - అని భావం.

**(సౌమ్యజామాతృయోగీ సన్)** - అటువంటి శ్రీవరవరమునుల రూపంలో అవతరించి,

**(భూయసా పశ్యసి)** - మిక్కిలిగా అనుగ్రహిస్తున్నారు.

"ప్రకృష్టవిజ్ఞానబలైకధామని" అని పొగడబడే ఆదిశేషుల అవతార విశేషమైన శ్రీవరవరమునులు, తమను కటాక్షించి, ఎవరికీ కలుగడానికి అరుదైన, పూర్వోక్తమైన ఐకాంత్యాన్ని తమకు కలుగజేశారని తాత్పర్యం.

**24.** అవ :- శ్రీవరవరముని స్వయంగానే శ్రీముఖంతో (లేఖతో) తమను అంగీకరించారని ఇందులో అంటున్నారు.

**అర్థౌదార్యాదపి చ వచసా మంజసా సన్నివేశాత్**
**ఆవిర్బాష్పై రమలమతిభిః నిత్య మారాధనీయమ్ ।**
**ఆశాసానై ర్వరవరమునే ! నిత్యముక్తై రలభ్యం**
**మర్త్యో లబ్ధుం ప్రభవతి కథం మద్విధః శ్రీముఖం తే ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అర్థ+ఔదార్యాత్+అపి = అర్థం యొక్క గొప్పతనం చేతను, లేక, పలు అర్థాలను సమృద్ధిగా ఇవ్వడం చేత, వచసాం = పదాలను, అంజసా = సంగ్రహంగా, సన్నివేశాత్+అపి చ = కూర్చడంచేత కూడా, అమలమతిభిః= దోషం లేని జ్ఞానాన్ని కల పెద్దల చేత, ఆవిర్బాష్పైః= ఆనందబాష్పాలతో, నిత్యం = ఎల్లప్పుడు, ఆరాధనీయం = సేవించి, పూజించదగినది, ఆశాసానైః = పొందాలనే అధికమైన ఆశను కల్గిన, నిత్యముక్తైః (అపి) = నిత్యసూరులచే కూడా, అలభ్యం = తమ ప్రయత్నం ద్వారా పొంద వీలుకానిది అయిన, తే శ్రీముఖం = దేవరవారి శ్రీముఖాన్ని, మద్విధః

మర్త్యః = నావంటి చాలా అల్పుడైన మానవుడు, కథం = ఏవిధంగా, ఏకారణంచేత, లబ్ధుం ప్రభవతి = పొందగలడు?

**వ్యాఖ్యానమ్ :** ఓ వరవరమునీ! తెలిపే అర్థంలోని గొప్పతనం వల్ల, (లేక), గొప్ప గొప్ప అర్థాలను అనుగ్రహించడంచేత, పదాలను సంగ్రహంగా ప్రయోగించడంవల్ల నిర్దుష్టమైన జ్ఞానాన్ని కల మహాత్ములుకూడా ఆనందబాష్పాలు స్రవించగా, నిత్యం సేవించి పూజించదగినది, పొందాలనే అధికమైన ఆశను కల నిత్యులచేత, ముక్తులచేతకూడ తమ ప్రయత్నంవల్ల పొంద వీలుకానిది అయిన మీ శ్రీముఖాన్ని (లేఖను) నావంటి నీచుడు ఏవిధంగా పొందగలడు? పొందగలిగాడు అంటే, దానికి మీ నిర్హేతుకకటాక్షమే కదా కారణం.

**(అర్థౌదార్యాదపి చ వచసా మంజసా సన్నివేశాత్)-** వక్తవ్యార్థంలోని గొప్పతనంచేత- అని కాని, గొప్ప గొప్ప పలు అర్థాలను చెప్పడంవల్ల -అని కాని భావం. **"ఉదారో దాతృమహతోః"** అని నిఘంటువు. **"చ"** అనే పదం ద్వారా ఇక్కడ శబ్దతః ప్రతిపాదింపబడని, ప్రసాదగుణాదులను కల్గి ఉండడం మొదలైనవి చెప్పబడినవి. **"దక్షిణే సరళోదారౌ"** అనే అమరకోశవచనం వల్ల అర్థంలోని ఋజుత్వం - యథార్థ ప్రతిపాదకత్వమని అర్థం. **"తత్త్వే త్వద్ధాఽఞ్జసా ద్వయమ్"** అనే అమరకోశవచనంవల్ల వేగంగా శబ్దపరివృత్త్య సహిష్ణుత్వరూపమైన శబ్దగుణంకూడా ఇక్కడ సూచింపబడింది.

**(అమలమతిభిః)** - సారమైన అర్థాన్ని గ్రహించగల, విశుద్ధమైన బుద్ధిని కలవారని భావం.

**(నిత్యమారాధనీయమ్)** - నిత్యాగ్నిహోత్రాదులతో ద్రవ్యకాల నియమరాహిత్యంచేత పూజింపదగినది,

**(ఆశాసానైః నిత్యముక్తైః)** - అతిశయించి ఆశను కల నిత్యముక్తులకు కూడా వారు కోరినా పొందలేనిది -అని అర్థం. ఎందుకంటే నిత్యులకు, ముక్తులకు సత్యకామత్వ, సత్యసంకల్పత్వాదులున్నాయి కదా. అప్యర్థం అర్థాత్ సిద్ధం.

**(అలభ్యమ్)** - మీ కృపలేకపోతే లభించనిది - అని అర్థం.

**(తే శ్రీముఖమ్)** - మీ సన్నిధినుండి వచ్చిన లేఖ. శ్రీముఖమనే ప్రయోగం లేఖ అనే అర్థంలో సాంప్రదాయికం.

**(మద్విధో మర్త్యః)** - నావంటి హేయమైన జంతువు - అని భావం. ఈ శ్లోకం ద్వారా కవి తమను శ్రీవరవరమునుల లేఖను ప్రసాదించడం ద్వారా అనుగ్రహించారని సూచించినట్లయినది. మొదటి పాదంలో **"అర్థౌ దార్యాత్"** ఇత్యాదిగా అవశ్యంభావ్యాలైన కావ్యగుణాలు సూచింపబడడం గమనార్హం.

**25.** అవ : శ్రీరామచంద్రుడు, తనను ఆరాధ్యదైవంగా సేవించే ఈకవికి శ్రీవరవరమునులు ఆదిశేషాంశసంభూలనే విషయాన్ని తెలిపిన వృత్తాంతం పూర్వం 15వ శ్లోకంలో **"శేషః శ్రీమాన్నితి రఘుపతే రంతరేణాపి వాణీమ్"** ప్రస్తావింపబడింది. ఆ విషయమే ఇందులో మళ్ళీ వివరింపబడుతున్నది.

సారాసారప్రమితిరహిత స్సర్వథా శాసనం తే
సద్యః శ్రీమన్! కపికరకృతాం మాలికామేవ కుర్యామ్ ।
నోచేదేతద్వరవరమునే! దూరదూరం శ్రుతీనాం
మౌలౌ కుర్యాత్పురుషవృషభో మైథిలీభాగధేయమ్ ॥

శ్రీమన్ వరవరమునే = (శ్రీరాముడు సైతం పొగడే రీతిలోని) గుణ (కైంకర్య) సంపదను మిక్కిలిగా కల్గిన ఓ వరవరమునీ!, సర్వథా = ఏరీతిలో అయినా, సార+అసారప్రమితి రహితః= ఇది సారం, ఇది అసారం-అనే యథార్థమైన జ్ఞానం లేని, అహం = నేను, తే శాసనం = దేవరవారి నియమనరూపమైన శ్రీముఖాన్ని, శ్రుతీనాం దూరదూరం = వేదాలకుకూడా ఏమాత్రం అందనివాడు, మైథిలీభాగధేయం= సీతాదేవి భాగధేయం మూర్తీభవించినవాడైన, పురుషవృషభః= పురుషోత్తముడైన శ్రీరాముడు, మౌళౌ న కుర్యాత్ చేత్ = తన శిరస్సుతో వహించి ఉండకపోతే, ఇదం = ఈ శ్రీముఖాన్ని, సద్యః = చూచిన వెంటనే, కపికరకృతాం = కోతి చేతికి ఇచ్చిన, మాలికాం = పూలమాలికగా, కుర్యామేవ = చేసి ఉండేవాడనే.

శ్రీరామచంద్రుడుసైతం కీర్తించే గుణసంపదను కల్గిన ఓ శ్రీవరవరమునీ! ఏ రీతిలోను "ఇది మంచిది, ఇది చెడ్డది" - అనే వివేకాన్ని లేని నేను, మీ ఆజ్ఞారూపమైన శ్రీముఖాన్ని, వేదాలకు అంతు చిక్కనివాడు, మైథిలీదేవి భాగ్యమే మూర్తిభవించినట్లున్నవాడు, పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు శిరసా వహించి ఉండకపోయినట్లయితే, ఆ మీ శ్రీముఖాన్ని చూడగానే, కోతి చేతికి ఇచ్చిన పూలదండవలె చేసి ఉండేవాడనుకదా!

**(శ్రీమన్!)** - పరమపురుషుడుకూడ సంభావించదగిన గొప్ప (గుణ-కైంకర్య) సంపదకు నిధివంటి వాడా!- అని అర్థం.

**(సారాసార ప్రమితిరహితః)** - ఉపాదేయ - హేయవిషయాలను గూర్చిన యథార్థజ్ఞానాన్ని లేనివాడనై- అని భావం. దీనివల్ల మీ విషయంలో భ్రాంతి జ్ఞానం కలవాడను - అని స్ఫురిస్తున్నది.

**(తే శాసనమ్)** - మీ ఆజ్ఞారూపమైన శ్రీముఖాన్ని,

**(కపికరకృతాం మాలికామ్ ఏవ)**- కోతి చేతికి ఇచ్చిన పూమాలిక అయి ఉండేది. కోతి తన చేతిలో పెట్టిన పూలదండను నలిపినట్లు, నేను ఆ శ్రీముఖాన్ని చించివేసి ఉండేవాడిని కదా! - అని భావం.

**26.** అవ :- పూర్వశ్లోకంలో శ్రీవరవరమునులు అనుగ్రహించిన శ్రీముఖం లభించిన విషయాన్ని తెలిపారు. శ్రీవరవరమునుల శ్రీముఖం తమకు లభించినందులకు కల్గిన ఫలాన్ని ఇందులో కవి అనుగ్రహిస్తున్నారు.

లక్ష్యం త్యక్త్వా యదపి విఫలో జాయతే రామబాణో
వాణీ దివ్యా వరవరమునే! జాతు నైవ త్వదీయా ।
సోఽయం సర్వం మదభిలషితం వర్షతి శ్రీముఖాబ్దః
తస్మై నిత్యం తదిహ పరమం ధామ కస్మాద్దురాపమ్ ॥

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, రామబాణః = గురి తప్పని రామబాణం, లక్ష్యం త్యక్త్వా= లక్ష్యాన్ని విడచి (తప్పి), విఫలః యదపి జాయతే = వ్యర్థంగా అయితే కావచ్చు, త్వదీయా = దేవరవారి, దివ్యా వాణీ = దివ్యసూక్తి, జాతు = ఎప్పటికీ, విఫలా నైవ జాయతే = వ్యర్థంగా కానే కాదు, సః అయం= అటువంటి ఈ దివ్యసూక్తి, శ్రీముఖాబ్దః సన్ = శ్రీముఖరూపాన్ని పొందిన మేఘమై, మదభిలషితం = దాసుడనైన నేను కోరిన అన్నిటిని, అస్మై = ఆ విధంగా అభిలషించిన దాసుడనైన నాకు, వర్షతి = వర్షిస్తున్నది, తత్ = అందువల్ల, పరమం నిత్యం ధామ = చాలా గొప్పదైన నిత్యవిభూతి, ఇహ = దాసుని విషయంలో, కస్మాత్ = ఏకారణం వల్ల, దురాపం భవేత్ = పొందడానికి సాధ్యం కానిది అవుతుంది? (కానే కాదని భావం)

ఓ శ్రీవరవరమునీ! గుఱి తప్పని రామబాణం గుఱి తప్పి నిష్ఫలం అయినా కావచ్చు. కాని, తమ దివ్యసూక్తి మాత్రం ఏనాడు విఫలం కాబోదు. అట్టి మీ దివ్యసూక్తి శ్రీముఖరూపాన్ని దాల్చి మేఘమై, నా కోఱికలను అన్నిటిని నాకు వర్షిస్తున్నది. అందుచేత మిక్కిలి ఉన్నతమైన నిత్యవిభూతి ఏకారణంవల్ల నాకు పొందరానిది అవుతుంది? తప్పక లభిస్తుంది- అని భావం.

**వ్యాఖ్యానమ్ : (రామబాణః)** - అమోఘమైనదిగా ప్రసిద్ధిని పొందిన రామబాణం.

**(తస్మై)** - ఇచటి తచ్ఛబ్దంచేత పూర్వం నిర్దేశింపబడ్డ అస్మచ్ఛబ్దం పరామర్శింపబడింది.

శ్రీవరవరమునుల శ్రీముఖం అనే మేఘం తమకు **"శాయ్ కొణ్ణ ఇమ్మైయుమ్"** అన్నట్లు ఐహిక సంపదను వర్షించిన సంగతిని చూచిన కవి **"వానవర్ నాట్టైయుమ్"** అనే రీతిలో నిత్యవిభూతినికూడ ఈ శ్రీముఖాబ్దమే వర్షించి తీరుతుంది- అనే అనుమాన ప్రమాణంచేత నిష్కర్షించారు. దీనివల్ల శ్రీముఖం యొక్క అపేక్షితసర్వస్వప్రదత్వం సూచింపబడింది.

**27.** అవ : ఈ విధంగా తమకు కల్గిన సర్వమనోరథపూర్తికి కారణమైన శ్రీముఖాన్ని తమకు శ్రీవరవర మునులు అనుగ్రహించడానికి కారణమైనవారు- శ్రీవరవరమునుల అభిమానానికి విశేషలక్ష్యభూతులైన వరదనారాయణ గురువులనబడే కోయిల్ కన్దాడై అణ్ణన్ -అనే విషయాన్ని ఎఱుమ్బియప్పా ఇందులో ప్రస్తావిస్తున్నారు. **"నారాయణం గురువరం వరదం విదన్ మే" "అకృత్రిమత్వ చ్చరణారవింద" ఇత్యాది స్థానీయం వరదనారాయణానాం వరవరమునివరప్రేమస్థానత్వ మాహ"** అని శ్రీవాధూలవీరరాఘవాచార్య స్వామి వాఖ్యలోని అవతారిక.

**ప్రేమస్థానం వరవరమునే! సంతు సంతః శతం తే**
**తుల్యః కో వా వరదగురుణా తేషు నారాయణేన ।**
**సానుక్రోశః స తు మయి దృఢం సర్వదోషాస్పదేఽస్మిన్**
**మామేవం తే మనసి కురుతే మత్సమః కో హి లోకే ॥**

వరవరమునే = ఓ మణవాళ మహామునీ!, తే = పరమకారుణికులైన దేవరవారియొక్క, ప్రేమస్థానం= ప్రీతికి పాత్రంగా, శతం సంతః = వందమంది సత్పురుషులు, సంతు = ఉండనీ, (ఆది దాసునకు

అభిమతమే), తథాఅపి = అయినా, తేషు = ఆ మహాపురుషులలో, నారాయణేన వరదగురుణా = వరదనారాయణ గురువులనే కోయిలణ్ణన్‌తో, కః వా సమః = ఎవరు సమానులు?, స తు = అటువంటి కోయిలణ్ణన్ అయితే, సర్వదోష+ఆస్పదే = దురాచారం మొదలైన దోషాలు అన్నిటికి స్థానమైన, అస్మిన్ మయి = ఈ దాసుని విషయంలో, దృఢం = ఎవరు కదపడానికి వీలు కానట్లు దృఢంగా, సానుక్రోశః= దయను కలవారై, మాం = దాసుడనైన నన్ను, తే మనసి = దేవరవారి మనస్సులో, ఏవం =ఈ విధంగా, శ్రీముఖాన్ని అనుగ్రహించడానికి తగినవానినిగా, కురుతే = భావించేటట్లు చేశారు. లోకే = ఈ లోకంలో, మత్సమః = నాతో సమానుడు, కః హి = ఎవడున్నాడు కనుక?

ఓ శ్రీవరవరమునీ! పరమకారుణికులైన మీ ప్రీతికి పాత్రమైనవారు నూఱుమంది ఉంటే ఉండనివ్వండి. అది నాకు సమ్మతమే. కాని, ఆ మహానుభావులలో వరదనారాయణగురువుతో ఎవరు సాటి? ఆ ఆచార్యవర్యులు, సకలదోషాలకు స్థానమైనవాడనైన నా విషయంలో అవిచాల్యమైన అనుగ్రహాన్ని కల్గినవారై, మీమనస్సులో నన్ను ఈరీతిలో శ్రీముఖాన్ని అనుగ్రహించడానికి తగినవాడను - అని మీరు తలచేటట్లు చేశారు.

**(తే)-** సర్వనామశబ్దాలకు వక్తృబుద్ధిగతభావాన్ని బోధించే శక్తి ఉన్నందున, ఈ పదానికి ఇక్కడ సందర్భానుసారంగా ఇక్కడ పరమకారుణికులని భావం.

**(తే ప్రేమస్థానమ్)** - అటువంటి దేవరవారి విశేషమైన ప్రీతికి స్థానంగా,

**(శతం సంతు)-** నూఱు- అని మాత్రమే అర్థం కాదు. అనేకులు ఉండనీ- అని భావం. ఇది ఇష్టాపత్తియే. **"శత మానంత్యవాచకమ్"** అని నిఘంటువు.

ఆచార్యులకు శిష్యులందఱు సమానులేకదా! ఈవిధంగా ఒకరు విశేషాభిమానానికి లక్ష్యభూతులయ్యారనడంలో ఏమి ఔచిత్యం ఉన్నది? అని అంటే, శిష్యులలోని **"జ్ఞాన-వ్యవసాయ- ప్రేమసమాచారాత్మక పదత్రయార్థ నిష్ఠాతారతమ్యమేవ ఆచార్యాభిమత విశేషతారతమ్యమూల మితి హృదయమ్"** అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. అంటే, అష్టాక్షరిలోని ప్రణవ, నమశ్శబ్ద, నారాయణాయ పదాలచేత తెలుపబడే అనన్యార్హశేషత్వమనే జ్ఞానం, అనన్యశరణత్వమనే అధ్యవసాయం, అనన్యభోగ్యత్వమనే ప్రేమ- అనే మూడిటి విషయంలో శిష్యులకు ఉన్న నిష్ఠలోని తారతమ్యాన్నిబట్టి ఆచార్యునకు ఆయా శిష్యులపై ఉండే అభిమానంలోని తారతమ్యం ఉంటుందని భావం.

**(సర్వదోషాస్పదే)-** దురాచారాది సమస్త హేయకృత్యాలకు నివాసభూమి- అని భావం.

**(అస్మిన్ మయి)** - ఈ ఏతచ్ఛబ్దంద్వారా "నా దోషాలు ఇన్ని అని మాటలకు అందకపోవడంచేత, వాటినిగూర్చి సర్వజ్ఞులైన మీకే గోచరమవుతుంది.'' అనే భావంతో తమను చేతి వేలుతో నిర్దేశించుకొంటున్నారు.

**(దృఢం సానుక్రోశః)-** ఇటువంటి నా విషయంలో ఏమాత్రం సడలని గొప్ప కరుణను కలవారై- అని అర్థం. నా దుఃఖాలు అంతు లేనట్లే, ఆ దుఃఖాలను చూచి తాముకూడా అంతకుమించి **"భృశం**

భవతి దుఃఖితః" అనే రీతిలో దుఃఖించే అతిశయించిన సడలని గొప్ప కరుణను కలవారై- అని భావం. తమ దుఃఖాలు అతిశయించే కొద్దీ, వారి కరుణకూడా అతిశయిస్తున్నదని హార్దభావం. **"యథా యథా దుఃఖభూయః తథా తథా తదధీనదుఃఖాతిశయాత్మకకృపాతిశయ ఇతి భావః"** అని వీరరాఘువాచార్యస్వామివ్యాఖ్య.

**(మామ్)-** తమ నిర్హేతుకకృపకు విషయభూతుడనైన నన్ను- అని భావం.

**(ఏవం కురుతే)-** ఈ ప్రయోగానికి - నిత్యముక్తులకు కూడా దుర్లభమైన శ్రీముఖానికి నేను అర్హుణ్ణి అయేటట్లు చేస్తున్నారు - అని భావం. ఇక్కడ **"కురుతే"** అనే క్రియయొక్క ఫలమైన దేవరాజగురువుల స్వరూపనిష్పత్తి, కర్త అయన వరదనారాయణ గురువులవల్ల సంభవిస్తున్నందున ఆత్మనే పదిరూపం ప్రయోగింపబడింది. ఇందువల్ల నిత్యులకు, ముక్తులకు కూడా దుర్లభమైన వరవరమునుల శ్రీముఖం నాకు లభించినందున ఈ లోకంలో నాకు సాటి ఎవరూ లేరు. శరణాగతినిష్ఠాపూర్ణుడైనవానిని అనుగ్రహించడమే శరణ్యునకు కర్తవ్యం. కేవలం కృపతో ఎవరినైనా అనుగ్రహిస్తే అది రాగప్రాప్తం, గుణాలు కల్గి ఉండడమనే కీర్తినిబట్టి చేసేది. కాబట్టి అటువంటి ఏ యోగ్యత లేకుండా గొప్ప ఫలాన్ని పొందిన తమకు ఎవరు సాటి లేరు- అని భావం. ఈవిధంగా ఉండగా, **"దేవ ! ప్రసీద !"** అని గతంలో స్తుతికర్త వరవరమునులను గూర్చి చేసిన ప్రార్థన **"ప్రణామం కీర్తనం విష్ణోః స్మరణం వాపి కేవలమ్, ఏకైకమపి చాంగానాం ప్రపత్తిః ప్రాజ్ఞసంశ్రయాత్"** (విష్ణువును కేవలం ప్రణామం చేయడం ప్రార్థన చేశారు కనుక, కీర్తించడం, స్మరించడం- అనే వీటిలో ఏ ఒక్క అంగమైనా అది, ప్రాజ్ఞుడైనవానిని ఆశ్రయించినందున, ప్రపత్తి అవుతుంది) అనే పాంచరాత్ర వచనాన్నిబట్టి ప్రపత్తిగా పర్యవసిస్తుంది. అందువల్ల వరవరమునులు దేవరాజగురువులను కటాక్షించడం నిషిద్ధం కాదని చెప్పాలి. భగవద్విషయకమైన ఈ ప్రమాణం ఇక్కడ శ్రీవరవరముని పరంగా ఉట్టంకింపబడింది. "దేవ! ప్రసీద" అని అంటూ ఆఱవ శ్లోకంలో శ్రీవరవరమునులను ఉద్దేశించి తమ ఆర్తిని వ్యక్తీకరించడం అప్రతిషేధద్యోతకంగా పర్యవసిస్తుంది.

**"నారాయణం గురువరం వరదం విదన్ మే"** అనే ఆఱవ శ్లోకంలో తాము **"అకృత్రిమత్వచ్చరణార విందప్రేమప్రకర్షావధిమ్"** అనే రీతిలో చెప్పవలసిన, వరదనారాయణులు వరవరమునుల ప్రేమకు స్థానమైనవారనే విషయాన్ని ఇందులో ప్రస్తావిస్తున్నారు - అని శ్రీవాధూల వీరరాఘువాచార్యస్వామివారు తమ వ్యాఖ్యలో ఈ శ్లోకానికి అవతారికను ప్రసాదించారు.

**28.** అవ :- ఇందులో, వరదనారాయణ గురువులను, శ్రీవరవరమునులను తప్ప వేఱ్వేరిని ప్రార్థించను- అని అంటున్నారు

**భక్త్యుత్కర్షం దిశతి యది మే పాదపద్మః త్వదీయే**
**తస్మాదస్మై భవతి వరదః సార్థనామా గురుర్మే ।**
**యద్వా తస్మై వరవరమునే! యద్యహం ప్రేమయుక్తో**
**ధన్య స్త్వం మా మనుభజసి తత్కిన్ను మన్యే యదన్యైః ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, సార్థనామా = కోరిన వరాన్ని ఇచ్చేవాడనే అర్థాన్ని పొందికగా కూడిన "వరదు"లనే తిరునామాన్ని కల, వరదః= వరదనారాయణులనే, మే గురుః = దాసుడనైన నా ఆచార్యులు, త్వదీయే పాదపద్మే = దేవరవారి శ్రీచరణపద్మాలలో, భక్త్యుత్కర్షం = "పునర్విశ్లేషభీరుత్వ" రూపమైన (మళ్ళీ విశ్లేషించడానికి భయపడడం - అనే) పరమభక్తిని, యది దిశతి = అనుగ్రహించేవారైతే, సః = ఆ వరదనారాయణులు, తస్మాత్ = అతిశయాన్ని కల్గించిన ఆ భక్తికారణంగా, అస్మై = ఈదాసుని కొఱకు, భవతి = రక్షకులు అవుతున్నారు, యద్వా =లేక, (ఆ పరమభక్తి లేకపోయినా), అహం = నేను, తస్మై = వారిపట్ల, ప్రేమయుక్తః = ప్రేమతో కూడినవాడనుగా, యది స్యామ్ = అయినవాడనైతే, త్వం= దేవరవారు, ధన్యః సన్ = ఏతావన్మాత్రంతో ధనసమూహాన్ని కల్గినవారివలె ప్రీతిని కలవారై, మాం = దాసుడనైన నన్నుగూర్చి, అనుభజసి = అనుకూలమైన కార్యాలను చేస్తున్నారు, (అందువల్ల), అన్యైః = వరదనారాయణ గురువులకంటె, దేవరవారికంటె అన్యులద్వారా, యత్ సాధ్యం తత్ = సాధ్యమైనది ఏదో, అది, కిం ను = ఏమున్నదిగాక!, (ఏమీ లేదు) - అని, మన్యే = భావిస్తున్నాను.

**వ్యాఖ్యానమ్ :** ఓ శ్రీవరవరమునీ!, కోఱిన వరాన్ని అనుగ్రహించేవారనే అర్థాన్ని కల వరదనామాన్ని కల్గిన వరదనారాయణులనే నా ఆచార్యులు తమ పాదపద్మాలలో పునర్విశ్లేషభీరుత్వరూపమైన పరమభక్తిని నాకు అనుగ్రహించినట్లయితే, ఆ వరదగురువు, తాము కల్గించిన ఆ భక్తి కారణంగా, నా విషయంలో రక్షకులు అవుతున్నారు. లేక, (అటువంటి భక్తి నాకు లేకపోయినా) నేను వారి విషయంలో ప్రేమను కలవాడను అయినట్లయితే, తమరు గొప్ప సంపదను పొందినవారివలె నాపట్ల సంతోషించినవారై, నా విషయంలో అనుకూలమైన కార్యాలను చేస్తారు. అందువల్ల, వరదనారాయణగురువుల కంటె, తమకంటె అన్యులవల్ల పొందదగినది ఏదీ నాకు ఉండదని తలుస్తున్నాను.

**(సార్థనామా మే గురుః)** - (వరదరాజస్వామివలె) అడిగిన వరాలను ఇచ్చే, "అర్థితార్థపరిదానదీక్షి"తులనే అవయవార్థాన్ని కలవారైన వరదనారాయణ నారాయణులనే నా గురువులు,

**(త్వదీయే పాదపద్మే భక్త్యుత్కర్షమ్)** - తమ పాదపద్మాల విషయంలో పరమభక్తిని- ప్రాప్యరుచ్యతిశయ రూపమైన, లేక, పునర్విశ్లేష భీరుత్వరూపమైన పరమభక్తిని - అని భావం.

**(దిశతి యది)**- అనుగ్రహిస్తే,

**(తస్మాత్)** - తాము అనుగ్రహించిన ఆ భక్త్యుత్కర్షవల్ల,

**(అస్మై భవతి)** - "క్రియార్థోపపదస్య" అనే సూత్రంవల్ల ఇక్కడ చతుర్థీవిభక్తి ప్రయోగింపబడింది. తమ అతిమాత్రప్రావణ్యానికి విషయభూతుడను, లౌకిక విషయాలలో మితిమీరిన ప్రావణ్యాన్ని కలవాడను అయిన నన్ను రక్షించడానికి అనుకూలమైన పనులను చేసేవారుగా తమకు తామే అవుతున్నారని భావం.

**(యద్వా)** - ఒకవేళ నేను, పైన తెల్పిన రీతిలో తమ పాదపద్మాలలో పరమభక్తిని కలవాడను కానట్లయితే,

**(తస్మై ప్రేమయుక్తో యది)** - ఇక్కడ కూడా **"క్రియార్థోపపదస్య"** అనే సూత్రం వల్ల చతుర్థీ విభక్తి ప్రయోగింపబడింది. ఆవిధమైన, తమ అభిమానానికి విషయభూతులైన వరదనారాయణగురువుల ముఖోల్లాసానికి హేతువైన, ఆ ఆచార్యుల విషయంలో ప్రేమను కలవాడను అయినట్లయితే,

**(త్వమ్)** - వారి విషయంలో నిరతిశయప్రేమను కల మీరు,

**(ధన్యః సన్)** - ఇంతమాత్రంతో నిరతిశయమైన ధనలాభాన్ని కలిగినందువల్ల ఏర్పడిన ప్రీతివంటి ప్రీతిని కలవారై.

**(మామ్)** - మీ విషయంలో ప్రేమను కల నన్ను,

**(అనుభజసి)** - తగిన సమయంకోసం వేచి ఉండి, వెంట ఉండి, నాకు అనుకూలంగా ఆచరిస్తారు. అవి ఏమంటే - మోక్షప్రదానాదులే. అందువల్ల,

**(అన్యైః యత్ తత్ కిమ్)** - వీరిరువురివల్ల కంటే అన్యులవల్ల సాధ్యమైనది నాకు ఏది ఉన్నది ? ఏదీ లేదు.

**29.** అవ :- గతశ్లోకంలో ప్రస్తావించిన రెండు పక్షాలలో రెండవ పక్షమే- అంటే- వరవరమునుల విషయంలో పరమభక్తిని కల్గి ఉండడం కంటే, వరదనారాయణ గురువుల విషయంలో భక్తిని కల్గి ఉండడమే ముఖ్యమని అంటున్నారు. **"ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరమ్, తస్మాత్ పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప!"** అనే ప్రమాణం భగవదారాధన కంటే భాగవతారాధన మిన్న అని తెల్పినట్లే ఇక్కడ, శ్రీవరవరముని విషయంలోని ప్రేమకంటే, తదీయుల పట్ల ప్రేమ మిన్న అని సూచింపబడింది.

**యత్సంబంధాత్ భవతి సులభం యస్య కస్యాపి లోకే**
**ముక్తైః నిత్యైరపి దురధిగం దైవతం ముక్తిమూలమ్ ।**
**తం త్వా మేవం వదతి వరదే! సౌహృదం మే యది స్యాత్**
**తస్యైవ స్యాద్వరవరమునే! సన్నిధౌ నిత్యవాసః ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, ముక్తైః = మోక్షాన్ని పొందినవారిచేతను, నిత్యైః + అపి = నిత్యసూరులచే కూడ, దురధిగం = శ్రమపడి పొందదగినది, ముక్తిమూలం= మోక్షసాధనమైనది అయిన, దైవతం =శ్రియఃపతి అనే దైవాన్ని, లేక, భగవద్రామానుజులనే దైవాన్ని, యత్ సంబంధాత్ = ఎవరి సంబంధంచేత, యస్య కస్యాపి = ఎంతటి తక్కువవానికి అయినా, సులభం భవతి = సులభంగా పొందదగినది, ఇతి = అని, లోకే = లోకంలో కన్పిస్తున్నదో, తత్ త్వా = అటువంటి దేవరవారిని, ఏవం వదతి = మోక్షోపాయంగా పల్కుతున్న, వరదే = వరదనారాయణుల విషయంలో, సౌహృదం = ప్రీతి, మే = దాసునకు, యది స్యాత్ = కల్గినది అయితే, తస్య సన్నిధౌ ఏవ = వారి సన్నిధిలోనే, నిత్యవాసః = దాసునకు నిత్యవాసం, స్యాత్ = అగుగాక!

ఓ శ్రీవరవరమునీ! ముక్తిని పొందినవారిచేత (ముక్తులచేత), నిత్యసూరులచేత కూడ పొందడానికి సాధ్యం కానిది, ముక్తికి మూలమైనది అయిన శ్రియఃపతి అనే దైవం, లేక, భగవద్రామానుజులనే దైవం,

ఎవరి సంబంధంవల్ల ఎంతటి నీచుడైన వాడికైనా సులభం అవుతుంది - అని లోకంలో కన్పిస్తున్నదో, అట్టి తమను మోక్షోపాయంగా తెలిపే వరదనారాయణ గురువుల విషయంలో గల ప్రీతి నాకు కల్గినట్లయితే, వారి సన్నిధిలోనే నిత్యవాసం కలగాలి!

వ్యాఖ్యానమ్ : **(నిత్యైః ముక్తైరపి దురధిగమ్)** - సంసారగంధం ఏమాత్రం లేని నిత్యులకు, సంసారసంబంధం తీరిన ముక్తులకు కూడా సాధ్యం కాదని భావం.

**(ముక్తిమూలం దైవమ్)** - శ్రియఃపతి - అని కాని, భగవద్రామానుజాచార్యులవారు - అని కాని దీని భావం.

**(యస్య కస్యాపి)** - ఆద్వేషం మొదలుకొని పరమభక్తిపర్యంతం వరకు గల దశలలో దేనిని కల్గినవానికైనా- అని గాని, ఆభిజాత్యాదులతో అహంకరించేవానికైనా- అని గాని భావం.

**(సులభం భవతి)** - లోకంలో ప్రత్యక్షసాక్ష్యంగా ఉన్నది- అని భావం.

**(త్వామ్ ఏవం వదతి)** - మిమ్ములను ఉపాయోపాయాలుగా ఉపదేశించే,

**(వరదే)** - వరదనారాయణ గురువుల విషయంలో సులభం కావడం,

**(మే సౌహృదమ్ యది స్యాత్)** - ఇచటి సౌహృద ఏమంటే- ఆవిధంగా ఉపకరించిన వారి విషయంలో అసూయ లేకపోవడమే. ఇది చాల దుర్లభమనే విషయాన్ని గీతాచార్యుడే- **"ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే", "న చ మాం యోఽభ్యసూయతి"** అని గీతలో తెలియజేశాడు. **"అసూయా ప్రసవభూః"** అనే స్తోత్రరత్నసూక్తిని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై -**"పరగుణజ్గళిలే దోషత్తై యుణ్డాక్కుకిఱ దోషత్తుక్కు ఉత్పత్తి స్థానమ్. ఎనక్కు దోషముణ్డామళవేయన్టిక్కే పిఱర్‌గుణజ్గళిలుమ్ దోషత్తై యుణ్డాక్కుమవన్ - ఎన్గై"** (ఇతరుల గుణాలలో దోషాలను ఆరోపించే దోషానికి ఉత్పత్తి స్థానం. నాకు దోషం ఉండడమేకాక, ఇతరుల దోషాలలోకూడా దోషాన్ని ఆరోపించేవాడను - అని భావం) అని వ్యాఖ్యానించడం, నమ్బిళ్ళై ఈడులో (హితాన్ని పల్కిన ఆచార్యుని గొప్పతనాన్ని సహించనివాడను) అని వివరించడం స్మరణీయం.

**(సౌహృదం వా స్యాత్)** - గౌరవ్యతాప్రయుక్తమైన భక్తిని దుర్మానవశంచేత కల్గి ఉండకపోయినా, మహాత్ములకు గల గౌరవాన్నిబట్టి వారిపట్ల ఉండవలసిన భక్తి దురభిమానంవల్ల లేకపోయినా, వారిపట్ల సామ్యబుద్ధితో అయినా, లేక గుణవశంచేత అయినా వారిపట్ల మైత్రి కలిగే అవకాశం ఉన్నది. దాన్ని కల్గి ఉన్నట్లయితే - అని భావం.

మణవాళమహామునుల విషయంలో భక్తిని కల్గి ఉండడం - అనే మొదటి పక్షం కంటే, ఆ వరవరమునులే మోక్షోపాయమని ఉపదేశించిన అణ్ణన్ (వరదనారాయణ గురు) విషయంలో మైత్రిని కల్గి ఉండడమనే రెండవ పక్షమే గ్రాహ్యం. ఎందుకంటే - ఆ విధంగా ఆ మైత్రిని కల్గి ఉండి, వరదనారాయణ

గురువుల అభిమానంలో ఒదిగి ఉండి, వారున్న చోట నిత్యావాసం చేయగల్గినట్లయితే, అదే వరవరమునులకు ఆనందాన్ని కల్గించి, మోక్షపర్యంతమైన లాభాన్ని కల్గిస్తుంది కాబట్టి - అని తాత్పర్యం.

**30.** అవ :- **"స్వాధీనకుశలా స్సిద్ధిమంతః"** (సిద్ధిని పొందినవారు తమ కుశలాన్ని స్వాధీనంలో కల్గి ఉంటారు.) అనే న్యాయంలో వరవరమునులు తాము కోరిన క్షణంలోనే పరమపదానికి వేంచేయగల్గినా, ఆ విధంగా వేంచేయకుండా ఈ లీలావిభూతిలో ఇంకా వేంచేసి ఉండడానికి కారణం తమవంటివారి కోసమే - అని అంటున్నారు.

**సర్వావస్థాసదృశవివిధాశేషగ స్త్వత్ప్రియాణాం**
**త్యక్త్వా భర్తు స్తదపి పరమం ధామ తత్ప్రీతిహేతోః ।**
**మగ్నానగ్నౌ వరవరమునే ! మాదృశానున్నినీషన్**
**మర్త్యావాసో భవసి భగవన్ ! మంగళం రంగధామ్నః ॥**

భగవన్ = ఉభయవిభూతులను స్వాధీనంలో కల్గిన, వరవరమునే = ఓ మణవాళమహామునీ!, త్వత్ ప్రియాణామ్ = దేవరవారిపట్ల ప్రేమను కల్గినవారికి, లేక, దేవరవారి ప్రేమకు లక్ష్యభూతులైనవారికి, సర్వావస్థాసదృశ వివిధ+అశేషగః = మేల్కొన్నపుడు, నిద్రించినపుడు మొదలైన అన్ని అవస్థలలోను తగినవి, పలు విధాలైనవి అయిన ధారకపోషక భోగ్యాలై ఉండే స్థితిని కల్గినవారైన, త్వం = దేవరవారు, తత్ = ప్రసిద్ధమైన ఆ, భర్తుః= శేషి అయిన శ్రీమన్నారాయణుని, పరమం ధామ+అపి = స్థానమైన పరమపదాన్ని కూడా, త్యక్త్వా = విడచిపెట్టి (ఇపుడే పొందకుండా), తత్ ప్రీతిహేతోః = ఆ శ్రియఃపతియొక్క ప్రీతిని సంపాదించడంకోసం, అగ్నౌ మగ్నాన్ = సంసారాగ్నిలో మునిగిన, మాదృశాన్ = దాసుని వంటివారిని, ఉన్నినీషన్= ఉద్ధరించగోరినవారై, మర్త్య+ఆవాసః = మానవ జీవితాన్ని భూమిలో గడపేవారై, రంగధామ్నః = శ్రీరంగమనే దివ్యస్థానానికి, మంగళం భవసి = గొప్ప ఆనందరూపులై ఉన్నారు.

ఉభయవిభూతులను స్వాధీనంగా కల్గిన స్వామీ! శ్రీ వరవరమునీ! తమ విషయంలో భక్తిని కలవారికి, లేక, మీప్రేమను పొందినవారికి నిద్రాదశ, జాగ్రద్దశమొదలైన అన్ని దశలలోను తగినవి, పలువిధాలైనవి, వారికి ధారక, పోషక, భోగ్యాలుగా ఉండేవి అయిన స్థితులను పొందినవారై, మీరు, ప్రసిద్ధమైన, శ్రీమన్నారా యణుని నివాసస్థానమైన పరమపదాన్ని విడచి, ఆ శ్రియఃపతికి ప్రీతిని సంపాదించడంకోసం సంసారాగ్నిలో మునిగిన మావంటివారిని ఉద్ధరించడంకోసం, ఈ మర్త్యలోకంలో నివసించేవారై, శ్రీరంగం అనే దివ్యదేశానికి మంగళంగా వేంచేసిఉన్నారు.

వ్యాఖ్యానమ్ : **(భగవన్)** - ఉభయవిభూతులను స్వాధీనంలో కల స్వామీ! - అని అర్థం. **"భగః శ్రీః"** (భగః - అంటే సంపద - విభూతి) అనే కోశప్రమాణం స్మరణీయం.

**(త్వత్ప్రియాణామ్)** - మీ విషయంలో ప్రీతిని కలవారు - అని కాని, నీ అభిమానాన్ని పొందినవారు- అని కాని చెప్పవచ్చు. **"ప్రియో హి జ్ఞాని నోఽత్యర్థ మహం స చ మమ ప్రియః"** అనే గీతాసూక్త్యర్థం అనుసంహితం.

**(భర్తుః)** - అష్టాక్షరీమహామంత్రంచేత ప్రతిపాదితాలైన **"పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చ"** అనే నవవిధ సంబంధాలలో ముఖ్యమైన, చేతనగతమైన అనన్యార్హశేషత్వరూప సంబంధాన్ని నిరూపించే శేషిత్వరూప సంబంధాన్ని కల్గినవానియొక్క - అని భావం.

**(తదపి పరమం ధామం)** - ఆ ప్రసిద్ధమైన, సర్వోత్కృష్టమైన పరమపదాన్ని సైతం,

**(త్యక్త్వా)** - **"త్యజ్"** ధాతువుకు ఇక్కడ అసంబంధాన్ని తెల్పుతుంది. అందువల్ల, పరమపదానికి పోకుండా - అని తాత్పర్యం. ఈ పదప్రయోగంచేత పరమపదం శ్రీవరవరమునుల స్వాధీనంలో ఉన్నదని తెలుస్తున్నది. శ్లోకంలోని **"అపి"** శబ్దం చేత **"సతీ మపి జ్ఞాతికులైకసంశ్రయాం జనోఽన్యథా భర్తృమతీం విశంకతే"** (పతివ్రత అయినా, ఆమె భర్తను వీడి జ్ఞాతులతో కలసి నివసిస్తే, లోకం ఆమెను శంకిస్తుంది.) అనే దోషాన్నికూడా మావంటి చేతనుల కోసం అంగీకరించి - అనే అర్థం వ్యక్తం అవుతున్నది.

**(తత్ప్రీతిహేతోః)** - **"త్యజ్"** ధాతువుకు ఇక్కడ అసంబంధాన్ని తెల్పుతుంది. అందువల్ల జ్ఞానిని అతని పాంచభౌతిక శరీరంతో పాటు ఆదరించే భగవానుని ప్రీతికి అది కారణం అవుతుంది కాబట్టి - అని భావం. **"వేర్ శూడువార్ మణ్పఱ్ఱు కఴఱ్ఱాదాప్పోలే జ్ఞానియై విగ్రహత్తోడే ఆదరిక్కుమ్"** (శ్రీవచనభూషణమ్-168) అనే రీతిలో సర్వేశ్వరుడు, జ్ఞానులైన శ్రీవరవరమునులను అభిలషించి, అనుభవించేటపుడు వీరి జ్ఞానపరిమళం అంతా స్ఫురించేటట్లున్న వీరి శరీరంతోటే అనుభవించే స్వభావం కలవాడు కాబట్టి, ఆనందంకోసం ఆ స్వామి మనవంటి సంసారులకు జ్ఞానహస్తావలంబాన్ని ఇచ్చి కాపాడడంకోసం శ్రీవరవరమునులు తమ తిరుమేనిని విడచి పరమపదాన్ని చేరకుండా ఆలస్యం చేస్తున్నారు. ఈవిధమైన రెండు ప్రయోజనాలకోసం శ్రీవరవరమునులు ఈలోకంలో ఉన్నపుడు వారిని భక్తులు ధారకపోషక భోగ్యాలుగా తలుస్తున్నారు- అని తాత్పర్యం.

**(అగ్నౌ మగ్నాన్)- "వరం హుతవహజ్వాలాపంజరాంతఃవ్యవస్థితిః, న శౌరిచింతావిముఖజన సంవాస వైశసమ్"** (శౌరిని స్మరించడంలో విముఖులైన జనులతో కలిసి నివసించడం అనే వినాశంకంటే అగ్నిజ్వాలల పంజరంలో ఉండడమే మేలు) ఇత్యాది సూక్తుల అర్థం స్మరణీయం. అందువల్ల ఇక్కడ అగ్నిశబ్దం కేవలం అగ్ని అనే అర్థాన్ని కాకుండా భగవచ్చింతనకు విముఖులైనవారితోడి సహవాసాన్ని లక్షిస్తుంది.

**(మాదృశాన్)** - తాము అధికంగా భవాగ్నిలో మునిగి ఉన్నారనే భావనతో తమను పురస్కరించుకొని **"మాదృశాన్"** అనే ఉపమానాన్ని దేవరాజగురువు ప్రయోగించారు.

**(మర్త్యావాసః)** - మానవుల ఆవాసాన్ని ఆవాసంగా కలవారై - ఈలోకంలో నివసించేవారై,

**(రంగధామ్నః మంగళమ్)**- శ్రీరంగానికి గొప్ప మంగళాన్ని కల్గించేవారుగా ఉన్నారు. **"శ్రీమద్రంగమ్... కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని"** అనే శ్లోకార్థం స్మరణీయం.

**31.** అవ :- శ్రీవరవరమునులు సంసారులను ఉద్ధరించే విధానాన్ని ఇందులో తెలుపుతున్నారు.

**ప్రత్యూషార్కద్యుతి పరిచయస్మేరపద్మాభితామ్రం**
**పశ్యేయం తద్వరవరమునే ! పాదయుగ్మం త్వదీయమ్ ।**

**పాథోబిందుః పర మణురపి స్పర్శవేధీ యదీయః**
**భావే భావే విషయముషితాన్ పావయత్యేవలోకాన్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ !, పరమ్ అణు మపి = చాలా స్వల్పమై ఉన్నా, స్పర్శవేధీ = తాకిన దానిని అంతటినీ బంగారుగా చేయగల్గిన స్పర్శ వేధి - అనే ఒక వస్తువువంటి, యదీయః= ఏ మణవాళమహామునుల (దేవరవారి) శ్రీచరణాలకు చెందిన, పాథోబిందుః = తీర్థకణం, భావే భావే= ఒక్కొక్క జన్మలోను, (అనుభవింపబడే), విషయముషితాన్ = శబ్దాదివిషయాలచే చాలా దూరం ఆకర్షింపబడి లాగికొని పోబడి నశించబోయే, లోకాన్ =జనులకు, పావయతి+ఏవ = తప్పక పరిశుద్ధం చేస్తున్నదో (అటువంటి), ప్రత్యూష+అర్క+ద్యుతి పరిచయస్మేర పద్మ+అభిరామం = ఉదయకాలంలోని సూర్యుని కిరణాల సంబంధంచే వికసించిన తామరపూవువలె మొత్తం ఎట్టిగా ఉన్నది, త్వదీయం = దేవరవారికి చెందినది అయిన, పాదయుగ్మం = శ్రీచరణద్వయిని, పశ్యేయం = దర్శించగోరుతున్నాను.

ఓ శ్రీవరవరమునీ! మిక్కిలి స్వల్పమై ఉన్నా, తనను తాకిన వస్తువులను అన్నిటిని బంగారంగా మార్చగల స్పర్శవేధి అనే వస్తువువంటి తమ శ్రీపాదాల తీర్థబిందువు ప్రతిజన్మలో అనుభవింపబడే శబ్దాది విషయాలచేత చాలా దూరం లాగికొనిపోబడి నశింపబోయే జనాలను పరిశుద్ధం కావిస్తున్నది. అటువంటి, ప్రాతఃకాలభానుని కిరణాల స్పర్శచేత వికసించిన తామరపూవువలె పూర్తిగా ఎట్టినిదైన తమ పాదయుగ్మాన్ని నేను దర్శించాలని ఆశపడుతున్నాను.

**వ్యాఖ్యానమ్ : (పరమణుమపి)** - చాలా చిన్నదైనా,

**(యదీయః పాథోబిందుః)** - ఏ శ్రీవరవరమునుల శ్రీపాదతీర్థబందువు

**(స్పర్శవేధీ)**- తనను తాకిన వస్తువును బంగారంగా మార్చగల వస్తువిశేషం స్పర్శవేధి. ఆవిధంగా తనను తాకిన, అత్యంతం దోషాలను కల్గినవారినిసైతం పూర్తిగా నిర్మలంగా చేయగల్గినది- శ్రీవరవర మునుల చిన్న శ్రీ  పాదతీర్థబిందువు కాబట్టి అది స్పర్శవేధితో తుల్యంగా చెప్పబడింది. అటువంటి స్పర్శవేధివలె,

**(భావే భావే)** - ప్రతిజన్మలో,

**(విషయముషితాన్)** - శబ్దాదివిషయాలచేత దూరంగా తీసికొని పోబడిన లోకులను - అని అర్థం. ముషితశబ్దం ద్వారా ఆవిధంగా దూరంగా ఆకర్షింపబడిన సంగతి వారికి తెలియదని స్ఫురిస్తుంది. **“ముష - స్తేయే”** అనే ధాతువునుండి పుట్టిన పదం ముషితశబ్దం. తెలియకుండా తీసికొని పోవడమేకదా దొంగతనం- అంటే.

**(పాపయతి)** - పవిత్రం చేస్తున్నదో,

**(తత్)** - అటువంటి,

**(ప్రత్యూషార్కద్యుతిపరిచయస్మేరపద్మాభితామ్రమ్)**- ప్రాభాతిక సూర్యకాంతిచేత వికసించిన పద్మంవలె అంతటా ఎఱ్ఱగా ఉన్నదనే (పద్మ) సామ్యంచేత శ్రీవరవరమునుల శ్రీచరణాలకు గల పావనత్వ- భోగ్యత్వ- సేవ్యత్వాలు ధ్వనిస్తాయి.

**(త్వదీయమ్)** - ప్రాప్తశేషి అయిన మీకు సంబంధించిన- అని భావం.

**(పాదయుగ్మం పశ్యేయం)** - శ్రీ పాదాలను రెండిటిని నేను దర్శించాలి.

ఈ శ్లోకం ద్వారా ఎఱుమ్బియప్పా - శ్రీవరవరమునులు తమ శ్రీపాదతీర్థాన్ని అనుగ్రహించి, సంసారులను ఉద్ధరిస్తున్నారు - అని అంటూ వారు సంసారులను తరింపజేసే విధానాన్ని తెలిపారు. ఈ సందర్భంలో **"తత్స్పృష్ట మఖిలం శుచి"**, **"సమిత్పుశుచ్ఛేదనయోగ్యశస్త్రే రసేన హేమీకరణం సమానమ్"** అనే సూక్తులు అనుసంధేయాలు- అని శ్రీవాధూలవీరరాఘవాచార్య వ్యాఖ్య.

**32.** అవ :- **"చితః పరమచిల్లాభే ప్రపత్తిరపి నోపధిః, విపర్యయే తు నైవాస్య ప్రతిషేధాయ పాతకమ్"** (జీవుడు పరమాత్మను పొందడంలో ప్రపత్తికూడా సాక్షాదుపాయం కాదు. భగవానుడు అనుగ్రహించదలిస్తే ఈ జీవుని పాపాలు అడ్డు కానే కావు.) అనే రీతిలో శ్రీవరవరమునులు ఇపుడు తమను నిర్హేతుకంగా కటాక్షించినా, ఇంతకాలంగా ఎందుకు అనుగ్రహించలేదో! అని వారిని ఉపాలంభిస్తున్నారు. శ్రీవచన భూషణంలోని **"అవన్ ఇవనై ప్పెఱ నినైక్కుమ్బోదు పాతకముమ్ విలక్కన్ఱు"** (145) అనే సూత్రార్థం చరమపర్వపరంగా ఇందులో అనుసంధింపబడింది. అదే విధంగా **"మదేకవర్జం కిమిదం వ్రతం తే"** అనే యామునసూక్త్యర్థం చివరి పాదంలో అనుసంధేయం.

**నిత్యం లోకే నివసతి పునః శ్రీమతి క్ష్మాగతానాం**
**దూరీభావః ప్రభవతి పురా దుష్కృతైః దుర్విపాకైః ।**
**సంప్రత్యేవం సకలసులభో యద్యపి త్వం దయాబ్ధే !**
**మామేవైకం వరవరమునే ! మన్యసే వర్జనీయమ్ ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, క్ష్మాగతానాం = భూమిలో ఉండేవారియొక్క, దుర్విపాకైః = దుర్గతి కల్గించే రీతిలోని పరిణామాన్ని కల్గిన, దుష్కృతైః = పాపాలచేత, శ్రీమతి = శ్రీవైష్ణవ సిరి నిండిన దేవరవారు, నిత్యే లోకే = నిత్యమైన శ్రీవైకుంఠలోకంలో, నివసతి (సతి) = వేంచేసి ఉండగా, దూరీభావః= దేవరవారికి చాలా దూరంలో ఉండే స్థితి, పురా ప్రభవతి = పూర్వం చాలా కల్గింది, సంప్రతి పునః= ఇపుడు అయితే, దయాబ్ధే = దయాసముద్రులైన శ్రీవరవరమునీ!, త్వం = దేవరవారు, యద్యపి సులభః = ఈలోకంలో ఈ కాలంలో అందఱి నేత్రాలకు సాక్షాత్కరించడం అనేది వాస్తవం, తథాపి = అయినా, ఏకం మాం = నన్ను ఒక్కని మాత్రం, వర్జనీయమేవ = విడువదగినవానినిగానే, మన్యసే = (తమరు) భావిస్తున్నారు (దానివల్లనే ఇంతవరకు నన్ను ఉపేక్షించారు - అని భావం)

వ్యాఖ్యానమ్ : ఓ శ్రీవరవరమునీ! శ్రీవైష్ణవసంపదను నిండుగా ఉన్న మీరు నిత్యమైన శ్రీవైకుంఠంలో వేంచేసి ఉన్నపుడు భూమిలోనున్నవారు చేసిన దుర్గతిని కల్గించే రీతిలో పరిణమించిన పాపాలచేత,

మీకు వారు చాలాదూరంలో ఉండడమనేది పూర్వం (జీవులకు) సంభవించింది. అందువల్ల వారికి మీ ప్రాప్తి కల్గకపోవడం యుక్తం. కాని, ఇపుడు మాత్రం కరుణాసముద్రులైన మీరు (ఈలోకంలో అవతరించి నందున) సులభులు అయినా నన్ను ఒక్కనిమాత్రం విడువదగినవానినిగా ఎందుకోసం మీరు భావించారు? (అందుచేతనే మీరు నన్ను ఇంతకాలంగా ఉపేక్షించారు)

ఓ శ్రీవరవరమునీ! నాకు మీరు ఇపుడు శ్రీముఖాన్ని అనుగ్రహించి అంగీకరించినా, అందరి మాంసచక్షువులకు గోచరులైన మీరు దాసునికూడా నేరుగా పిలిచి, సేవను అనుగ్రహించి అంగీకరింపరాదా! నన్ను ఒక్కని మాత్రం ఎందువల్ల విడువతగినవానినిగా భావించారు? - అని సారం.

వ్యాఖ్యానమ్ : **(క్ష్మాగతానామపి)** - గొప్ప పుణ్యఫలంగా పరమపురుషార్థసిద్ధికి యోగ్యమైన ఈ భూమిలో ఉండే (ఈ లోకంలో నివసించే)వారియొక్క,

**(జనానాం దుర్విపాకైః)** - దుఃఖాన్ని మాత్రమే కల్గించేవి, పలు రీతులలో పరిణమించేవి అయిన,

**(దుష్కృతైః)**- పాపాలతో- అని అర్థం. ఈ పదం **"నివసతి"** అనే పదంతో అన్వయిస్తుంది.

**(శ్రీమతి)** - స్వరూపానురూపమైన, మిక్కిలి అధికమైన, శ్రీవైష్ణవ సంపదకు నిధివంటివారైన.

**(త్వయి నిత్యే లోకే నివసతి సతి)**- దేవరవారు వైకుంఠంలో వేంచేసి ఉన్నపుడు,

**(దూరీభావః)**- తమ విశ్లేషం,

**(పురా ప్రభవతి)**- పూర్వం మిక్కిలి ఎక్కువగా సంభవించింది. ఇది **"వర్తమానసామీప్యే లట్"** అనే భూతార్థకవర్తమానకాలిక ప్రయోగం. భూతకాలార్థకంగా వర్తమానక్రియారూపం ప్రయోగింపబడింది. **"సంతీహ పురా చ్ఛాత్రాః"** అనే ప్రయోగాలు ఇటువంటివే.

**(దయాబ్ధే)**- అనవధికమైన అతిశయాన్ని కల కరుణకు నిధివంటి స్వామీ!

**(త్వం సకలసులభో యద్యపి)** - అందరికి దేశ-కాల-కరణ సన్నికర్షను పొందడానికి వీలైనవారై. అందటి కన్నులకు గోచరించేవారై, వారు ఆశ్రయించడానికి వీలుగా ఉండేవారై. పర-వ్యూహ- విభవ- అంతర్యామి అర్చా - ఆచార్యులనే ఆఱు రూపాలలో పూర్వపూర్వంకంటె ఉత్తరోత్తరం **"పూర్వస్మాదపి పూర్వస్మాజ్జ్యాయాంశ్చైవోత్తరోత్తరః, సౌలభ్యతో జగత్స్వామీ సులభో హ్యుత్తరోత్తరః"** అనే రీతిలో ఆచార్యరూపులైన మీరు సులభతములు అన్నది నిజమైనా- అని భావం.

**(ఏకం మామైవ వర్జనీయమ్ మన్యసే ఏవ)**- ఏనాడూ నన్ను మీరు అవర్జనీయుడని భావించలేదని భావం. అందువల్లనే ఇంతవరకు నన్ను అంగీకరించలేదని వక్తృహృదయం. ఈ అర్థంలో భూతార్థంలో లట్ ప్రయోగింపబడింది. లేక, శ్రీముఖాన్ని అనుగ్రహించడం మొదలైనవాటిద్వారా నన్ను మానసికంగా అంగీకరించినా, దేవరవారి దర్శనం ఇంతవరకు అనుగ్రహించనందున నన్ను మీరు వర్జనీయునిగా తలచారని ఫలబలంవల్ల ఊహిస్తున్నాను- అని భావం. కాబట్టి **"సకలసులభః"** అనే విశేషణ ప్రయోగం సాభిప్రాయం.

**33.** అవ :- చరమపర్వనిష్ఠులు ఈ లోకంలో నివసించినంతకాలం పలు రీతులలో ఆత్మయాత్రను గడుపుతారు. కొందరు **"దుర్గతావపి జాతాయాం త్వద్గతో మే మనోరథః, యది నాశం న విందేత తావతాఽస్మి కృతీ సదా"** (దుర్గతి కల్గిన సమయంలో కూడా నీ విషయంలో నాకుండే మనోరథం నశించకపోతే, తావన్మాత్రంతో నేను కృతార్థుణ్ణి అవుతాను) అనే రీతిలో ఆచార్యుల విషయంలో ప్రాప్తినిరపేక్షంగా అమృతంవంటి ప్రాప్యరుచితోనే కాలక్షేపం చేస్తారు. మఱికొందరు **"బోధయంతః పరస్పరమ్"** అనే రీతిలో, **"కృష్ణాయంత్యపరా కాచిత్"** అనే రీతిలోను ఆచార్యలీలలను అనుకరించడం మొదలైనవాటికి సహకారులైన తద్భక్తుల సహాయంతో కాలం గడుపుతారు. కొందరు **"స ఏవోపర్యుపర్యస్య పరాం ప్రీతి ముపావహన్, వృత్త్యాఖ్యఫలతాం యాతి తదేవామృత ముచ్యతే"** అనే రీతిలో ఆచార్యుని కంటితో సేవించి, ఆశ్రయించిన అనంతరం వారి సంబంధస్మరణతో కాలం గడుపుతారు. ఇంకా కొందఱు **"ఆమోక్షం లక్ష్మణార్య! త్వత్ప్రబంధపరిశీలనైః"** అనే రీతిలో ఆచార్యుని ఉద్దేశించి రచింపబడిన ప్రబంధాలతో, వారు రచించిన ప్రబంధాలతో కాలక్షేపం చేస్తారు. ఇంకా మఱికొందరు **"శరీరం వసు విజ్ఞానమ్ గుర్వర్థం వినివేదయేత్"** అనే రీతిలో ప్రధానకైంకర్యంలో తమ శరీరాన్ని, ధనాన్ని, విజ్ఞానాన్ని వినియోగించడం ద్వారా కాలక్షేపం చేస్తారు. వీటిలో ఏదీ కూడా మీకు దూరంగా ఉండే దౌర్భాగ్యంవల్ల నాకు లభించలేదు- అని అంటున్నారు.

**త్వత్పాదాబ్జప్రణయవిధురో దూరగ స్త్వత్ప్రియాణాం**
**త్వత్సంబంధస్మరణవిముఖో వీతరాగ స్త్వదుక్తౌ।**
**త్వత్కైంకర్యత్వదుపసదనత్వత్ప్రణామానభిజ్ఞో**
**దూయే దూరం వరవరమునే! దోషలక్ష్యైకలక్ష్యమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, త్వత్+పాదాబ్జప్రణయ విధురః = దేవరవారి శ్రీచరణ పద్మాలలో (వాటిని దర్శించిన తరువాత కలుగవలసిన) ప్రీతిని లేనివాడను, త్వత్ ప్రియాణాం = దేవర వారిపట్ల ప్రీతిని కలవారికి, లేక, దేవరవారి ప్రీతికి లక్ష్యమైనవారికి, దూరగః = చాలా దూరంలో ఉన్నవాడను, త్వత్ సంబంధః = సాక్షాత్తు దర్శించి ఆశ్రయించి పొందిన దేవరవారి సంబంధాన్ని, స్మరణవిముఖః = స్మరించడంలో ఆశ లేనివాడను, త్వదుక్తౌ = దేవరవారు పల్కిన, లేక, దేవరవారికి సంబంధించిన శ్రీసూక్తులో, వీతరాగః = ప్రీతిని లేనివాడను, త్వత్ కైంకర్య= దేవరవారి కైంకర్యం చేయడం, త్వదుపసదన= దేవరవారు చేసే ఉపదేశాన్ని వినడంకోసం దేవరవారి సన్నిధిని చేరడం, త్వత్ ప్రణామ+అనభిజ్ఞః = దేవరవారికి ప్రణామం చేయడం- అనే వీనిని తెలియనివాడను, దోషలక్ష్య+ఏకలక్ష్య= వీటికి అన్నిటికి కారణమైన, పలు లక్షల సంఖ్యలోని పాపాలకు సాటి లేని ఆశ్రయమైన, అహం= దాసుడనైన నేను, దూరం = చాలా దూరంలో ఉంటూ, దూయే = క్లేశపడుతున్నాను.

ఓ వరవరమునీ! నీ శ్రీపాదపద్మాలలో దర్శించిన తర్వాత వాటిపట్ల ఉండదగిన భక్తిని లేనివాడను, తమ విషయంలో ప్రేమను కలవారికి, లేక, తమ ప్రేమకు లక్ష్యభూతులైన వారికి, చాలా దూరంలో ఉన్నవాడను, సాక్షాత్తు సేవించి, ఆశ్రయించి పొందిన తమ సంబంధాన్ని స్మరించడంలో విముఖుడనై

వాడను, తమరు అనుగ్రహించిన, లేక, తమను ఉద్దేశించి ఇతరులు రచించిన సూక్తులపట్ల ఆసక్తి లేనివాడను, తమ కైంకర్యానికి పనికివచ్చే కార్యాలను చేయనివాడను, తమ ఉపదేశాలను ఆలకించడంకోసం తమ సమీపానికి రావడం, తమకు ప్రణామాన్ని చేయడం తెలియనివాడను, వీటికి అన్నిటికి మూలకారణం అయిన పలు లక్షల సంఖ్యలోని పాపాలకు సాటిలేని ఆశ్రయమైనవాడనైన నేను మీకు చాలాదూరంలో ఉండి బాధపడుతున్నాను.

**వ్యాఖ్యానమ్ : (త్వత్పాదాబ్జప్రణయవిధురః)**- పావనత్వ, భోగ్యత్వాలలో పద్మాలతో పోలిన, ప్రాప్తశేషి అయిన తమ శ్రీపాదాలను సేవించి, చక్షుఃప్రీతి పొందిన తర్వాత, తత్ఫలంగా కలుగదగినది, మనస్సంగమనే పదం చేత వ్యవహరింపబడేదైన ప్రేమ విశేషాన్ని పొందనివాడనై- అని భావం. దీనివల్ల ప్రాప్యరుచి లేదని తెలుపబడింది. అబ్జసామ్యంద్వారా శ్రీపాదాల పావనత్వ, భోగ్యత్వ, సౌకుమార్య, శిరసా వాహ్యత్వ, రక్తత్వ, మధుస్యందిత్వాదులు స్ఫురిస్తాయి. ఇచటి మధువు శ్రీపాదతీర్థమే. ఇన్ని గుణాలలో ఒక్క గుణమే చాలు- ప్రేమను పొందడానికి. ఇన్ని ఉన్నా ప్రాప్యరుచి కలుగలేదనే ఖేదం ధ్వనిస్తున్నది.

**(తత్ప్రియాణాం దూరగః)**- మీ విషయంలో ప్రీతిని కలవారికి, అదేరీతిలో మీ ప్రీతికి విషయమైనవారికి దేశాన్నిబట్టి, మానసికంగా దూరంగా ఉన్నాను. దీనివల్ల భాగవతుల సహాయాభావం చెప్పబడింది. త్వత్ప్రియులంటే జ్ఞానులని అర్థం. **"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః"** అని గీతాసూక్తి.

**(త్వత్సంబంధస్మరణవిముఖః)**- నేరుగా సేవించి, ఆశ్రయించిన తరువాత ఏర్పడే తమ సంబంధాన్ని నిరంతరం స్మరించడమనే దశకు విముఖుణ్ణి- దీనివల్ల పూర్వం చెప్పబడ్డ **"ఉపర్యుపర్యస్య"** ఇత్యాది సూక్తి భావం సూచింపబడింది.

**(త్వదుక్తౌ వీతరాగః)** - మీకు సంబంధించినవి, మీరు రచించినవి అయిన ప్రబంధాలలో రాగం లేనివాడను. **"త్వదుక్తౌ"** అన్నప్పుడు కర్తరి అర్థంలో, కర్మణ్యర్థంలో షష్ఠీ విభక్తిని చెప్పుకోవాలి. **"ఆమోక్షం లక్ష్మణార్య! త్వత్ప్రబంధ పరిశీలనైః"** అనే ప్రయోగంలో వలె ఇక్కడ **"త్వత్"** అనే యుష్మచ్ఛబ్దరూపానికి భగవద్భాగవతాచార్యాత్మకమైన మూడు రూపాలను కల మీయొక్క - అని అర్థం.

**(త్వత్కైంకర్యత్వదుపసదనత్వత్ప్రణామానభిజ్ఞః)** - భగవద్భాగవతాచార్యులకు ముఖోల్లాసాన్ని కల్గించే కైంకర్యాలలో, తత్త్వోపదేశం చేయడంద్వారా అజ్ఞానాన్ని పోగొట్టే తమ సన్నిధికి రావడం, మీకు నమస్కరించడం, మీ ఉపదేశాలను ఆలకించిన తరువాత **"యదా సర్వజ్ఞోఽహమ్"** అనే రీతిలో ఇంతకాలంగా అనువర్తించిన సర్వజ్ఞత్వాభిమానం భగ్నమై, వేళ్ళుతెగిన చెట్టు పడినట్లుగా **"అభిమాన పఙ్గమాయ్... వన్దు తలైప్పెయ్దోమ్"** అన్నట్లు తమ పాదాలపై పడడం- అనే వీటిని ఏమీ తెలియనివాడను.

**(దోషలక్షైకలక్ష్యమ్)**- పూర్వం చెప్పబడినవానికి అన్నిటికి మూలకారణమైన ప్రాప్యరుచి మొదలైనవానికి ప్రతిబంధకాలైన లక్షలాది పాపాలకు అద్వితీయలక్ష్యం అయినవాడను నేను. లేక, దోషాలకు లక్ష్యభూతులైన

వారెవ్వరో, వారికి అద్వితీయ లక్ష్యాన్ని- అని కూడా చెప్పవచ్చు. అనేకులు చేసిన పలు పాపాలను నేనొక్కడనే చేశానని భావం. **"పావమే శెయ్దు పావియానేన్"** అనే పెరియతిరుమొழி సూక్త్యర్థం స్మరణీయం. ఈ శ్లోకంలో ఎఱుమ్బియప్పా ప్రకటించిన భావం వారు తమ గ్రామం అయిన **"ఎఱుమ్బి"**లో ఉన్నపుడు కల్గినది - అని భావించాలి.

**(దూయే దూరమ్)**- చాలా దూరంలో ఉంటూ పరితాపాన్ని పొందుతున్నాను.

ఆచార్యుని నేరుగా సేవించి ఆశ్రయించినవారు- వారిని ప్రేమతో స్మరిస్తూ, వారి ప్రేమకు నోచుకొన్న శిష్యులతో కలసి ఉంటూ, వారి సంబంధం అనే తమకు కల్గిన భాగ్యాన్ని తలుస్తూ, వారు రచించిన, లేక, వారిని గూర్చి రచించిన, స్తోత్రాలను, గ్రంథాలను ఆశతో సేవిస్తూ, వారు సంతోషించే కైంకర్యాలను చేస్తూ, వారి ఉపదేశాన్ని విని, తమ అజ్ఞానాన్ని పోగొట్టుకోవడం కోసం ఆచార్యులతో కలసి ఉంటూ, తమకు సర్వజ్ఞత్వ భ్రమ తొలగిన విషయం తోచేటట్లు వారికి మానసిక-వాచిక- కాయిక నమస్కారాలను చేస్తూ ఈ శరీరంతో ఉండే దినాలలో కాలక్షేపం చేస్తారు. వీటిలో దేనికీ తమకు యోగ్యత లేకుండా తాము శ్రీవరవరమునులకు చాలా దూరంగా ఉన్నామే! నేరుగా వెళ్ళి ఆశ్రయించి, పైరీతిలో కాలక్షేపం చేయడానికి అడ్డుగా పలు పాపాలను చేశానుకదా! అని కవి అనుతపిస్తున్నారు. ఈ శ్లోకంలో "ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసితవ్యః" అనే శ్రుత్యర్థం చరమపర్వనిష్ఠాపరంగా అనుసంధింపబడడం గమనించాలి.

**34.** అవ :- మిక్కిలి మహనీయమైన శ్రీవరవరమునుల శ్రీపాదపద్మాలలో, విషయచాపల్యం మొదలైన దోషాలను కల తాము ఆశపడడంకూడా అపరాధకోటిలోనికి చేరుతుందని ఇందులో దేవరాజగురువు అంటున్నారు. ప్రథమపర్వంలోని **"వళవేழுలకు"** దశకభావం, **"నెడియానై అడినాయేన్ నినైన్దిట్టేనే"** ఇత్యాది సూక్తుల భావం చరమపర్వాత్మకంగా అనుసంధింపబడింది.

**ప్రాదుర్భూతప్రచురమతయో యే పరబ్రహ్మసామ్యాత్**
**పశ్యంత స్తత్పద మనుపమం యే పున శ్శుద్ధసత్త్వాః ।**
**సర్వైరేతై ర్వరవరమునే! శశ్వదుద్దిశ్య సేవ్యం**
**కాంక్షత్యేతత్కథ మయ మహో! కామకామః పదాబ్జమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, యే= ఏ, కొందఱు (ముక్తులు), పరబ్రహ్మసామ్యాత్ = భగవానునితో ఉండే సామ్యంవల్ల, ప్రాదుర్భూత ప్రచురమతయః భవంతి = వ్యక్తమైన, పూర్ణమైన జ్ఞానాన్ని (సర్వజ్ఞత్వాన్ని) పొందినవారవుతున్నారో, యే పునః= ఇంకా, ఏ కొందఱు (నిత్యసూరులు), శుద్ధసత్త్వా= రజస్తమోగుణాలు కలువని సత్త్వగుణాన్ని ఒక్కటినే కలవారై, అనుపమం = సాటి లేని, తత్ పదం = ఆ భగవానుని స్థానమైన పరమపదాన్ని, పశ్యంతః = సదా దర్శనాన్ని చేస్తున్నారో, ఏతైః= సర్వైరపి = (ముక్తులు, నిత్యులు - అనే క్రమంలో చెప్పబడిన) అందఱిచేత, శశ్వత్ = ఎల్లప్పుడు, ఉద్దిశ్య = ఆశపడి, సేవ్యం =

సేవించదగిన, ఏతత్ = ఈ (దాసుని మనస్సులో ఉండే), పదాబ్జం = దేవరవారి చరణాబ్జాలను, కామ కామః = నీచులు ఆశపడే రీతిలో దేహాదులలో ఆశను కల, అయం జనః = నీచుడైన ఈ మానవుడు (దాసుడనైన నేను), కథం కాంక్షతి = ఏవిధంగా (ఎందుకు) ఆశపడుతున్నాడు?

**వ్యాఖ్య :** ఓ శ్రీవరవరమునీ! పరమాత్మతో గల సామ్యంచేత వ్యక్తమైన సంపూర్ణజ్ఞానాన్ని (సర్వజ్ఞత్వాన్ని) కలిగినవారుగా ఎవరు (ముక్తులు) అవుతున్నారో, ఎవరు (నిత్యసూరులు) రజస్తమస్సులనే గుణాలు కలవనివారై, సత్త్వగుణం ఒక్కటే కలవారై, సాటి లేని పరమపదాన్ని సదాదర్శనం చేస్తున్నారో- వీరందరిచేత కూడా (ముక్తులు, నిత్యులుగా చెప్పబడే వీరిచేత కూడా) నిత్యం ఆశపడి సేవింపతగిన, నా మనస్సులో ప్రతిష్ఠితమైన తమ శ్రీపాదాలను నీచులు ఆశపడే దేహాదులలో ఆశను కల నీచుడనైన నేను ఏవిధంగా ఆశపడుతున్నాను? అయ్యో!

**(కామకామః)** -నీచులచేత అభిలషింపబడే దేహాదులలో **"సంగాత్ సంజాయతే కామః"** అనే రీతిలో సంగం కల్గిన తర్వాత ఏర్పడే నిరంతర విషయానుభవ స్పృహను కలవాడనైన నేను - అని భావం. ఇక్కడ మొదటి కామశబ్దానికి దేహమని, రెండవ కామశబ్దానికి కోరిక అని - అర్థం. రెండు చోట్ల **"కామ్యత ఇతి కామః"** అనే వ్యుత్పత్తిని చెప్పవచ్చు.

**(అయమ్)** - ఇతడు (నేను - అని భావం) ఇది **"కాంక్షతి"** అనే ప్రధాన క్రియలో అన్వయిస్తుంది.

**(యే పరబ్రహ్మసామ్యాత్)** - వ్యక్తమైన **"అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః"** అని తెలుపబడిన అపహతపాప్మత్వాది గుణాష్టకాన్ని కల్గి ఉండడమనే పరమాత్మ సాదృశ్యాన్ని కల్గి ఉన్నకారణం చేత,

**(ప్రాదుర్భూతప్రచురమతయః)**- దోషాలన్నీ తొలగిపోవడంచేత అసంకుచితమైన పూర్ణమైన జ్ఞానప్రసరణను కలవారు అవుతున్నారో, (వీరు ముక్తులు). ఇక్కడ "మతి" శబ్దం జ్ఞానవాచకం.

**(శుద్ధసత్త్వాః)**- ఏ నాడు దోషాల స్పర్శ లేని అంతఃకరణాన్ని కలవారో, (వీరు నిత్యులు)

**(తత్పదం పశ్యంతః)** - **"తద్విష్ణోః పరమం పదమ్, సదా పశ్యంతి సూరయః"** అనే రీతిలో పరమ పదాన్ని సదా దర్శించే నిత్యసూరులు - అనే.

**(సర్వైరేతైః)**- వీరందఱిచే,

**(శశ్వత్)**- సర్వకాలం, **(ఉద్దిశ్య)** - ప్రార్థించి,

**(సేవ్యమ్)**- సేవించదగినదైన,

**(ఏతత్)** -వాచామగోచరం అయిన మహిమను కల్గినది కాబట్టి అంగుళితో నిర్దేశిస్తూ **"ఏతత్"** అనే సర్వనామ శబ్దంతో నిర్దేశిస్తున్నారు. దీనివల్ల ఇచట గౌరవాతిశయం వ్యక్తం అవుతున్నది. ఈ ప్రత్యక్ష నిర్దేశం మానసికమైన సాన్నిధ్యాన్ని బట్టి చేయబడింది.

**(పదాబ్జమ్)** - దేవరవారి శ్రీచరణ పద్మాన్ని - అని అర్థం. పద్మసామ్యం ద్వారా శ్రీచరణాల భోగ్యత్వ శిరోధార్యత్వాదులు వ్యక్తాలు.

**(కథం కాంక్షతి)**- ఏవిధంగా ఆశపడుతున్నాడు? అయ్యో! (ఇది చాలా అయుక్తమని భావం)

శ్రీవరవరమునుల విషయంలోని కైంకర్యం నిత్యులకు సాధ్యవివృద్ధి కాబట్టి ఉద్దేశ్యం. శేషికి ముఖోల్లాసాన్ని కల్గించడమే ప్రయోజనంగా కల జీవునకు ఆ పరమాత్మ ముఖోల్లాసానికి అతిశయం ఏవిధంగా కలుగుతుందో ఆ రీతిలోనే ప్రవర్తించాలి. శేషికి కలిగే ముఖోల్లాసంలో విషయభేదాన్నిబట్టి తారతమ్యం ఉంటుంది. **"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్"** అనే శేషివచనంవల్ల తన విషయంలో చేసే కైంకర్యంవల్ల ప్రీతి కలిగితే, తన భక్తుల విషయంలో చేసే కైంకర్యంవల్ల అధికప్రీతి కల్గుతుంది. ఆ భక్తుల భక్తులకు చేసే కైంకర్యం వల్ల అభ్యధిక ప్రీతి కల్గుతుందని తెలుస్తున్నది కదా! (ప్రీతి- అధికప్రీతి- అభ్యధిక ప్రీతి అనే పర్వక్రమాన్ని భావించాలి). ఈ విషయం **"మమ మద్భక్తభక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్"** అనే శేషివచనం వల్ల సిద్ధం. అందువల్ల, భగవానునకు అత్యధికప్రీతిని కల్గించే శ్రీవరవరమునుల విషయంలోని కైంకర్యం సాధ్యవివృద్ధి - అని ఆస్తికులైనవారు గుర్తించాలి. సాధ్యమంటే ఉపాయసాధ్యమై, ఫలరూపమైన భగవత్కైంకర్యం. సాధ్యవృద్ధి - (ఆ కైంకర్యం యొక్క వృద్ధి) భగవానుడు మెచ్చే భాగవతకైంకర్యం. సాధ్యవివృద్ధి - (ఆ భగవత్కైంకర్యంయొక్క విశేషమైన వృద్ధి) ఆ భాగవతులు సంతోషించే ఆచార్యకైంకర్యం.

**35.** అవ :- శ్రీవరవరమునుల శ్రీపాదాలను తాము ఆశపడడం తగనిదే అయినా, వారి స్వభావాన్ని చూస్తే వారు తమ చేయి విడువడం తగదని ఇందులో అంటున్నారు. 32వ శ్లోకంలో ప్రసక్తమైన విషయాన్ని ఇందులో స్పష్టం చేస్తున్నారు.

**ప్రాప్తః క్షేమం ప్రకృతిమధురైః ప్రాగపి త్వత్కటాక్షైః**
**సోఽయం జంతుః త్వదనుభజనం త్వత్త ఏవాప్తు మిచ్ఛన్ ।**
**క్రందత్యుచ్చైః కలుషమతిభిః సంవసన్ కామకామైః**
**కాలక్షేపో వరవరమునే! తత్కథం యుజ్యతే తే ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, ప్రకృతిమధురైః= సహజంగానే భోగ్యాలైన, త్వత్ కటాక్షైః= దేవరవారి చూపులతో, ప్రాక్ = ఇంతకు ముందు, క్షేమం =స్వరూపనాశం లేకపోవడం - అనే క్షేమాన్ని, ప్రాప్త అపి = పొందినవాడను అయినప్పటికీ, అయం జంతుః= (కృమికీటకంవంటి క్షుద్రుడనైన) ఈ ప్రాణి (నేను), త్వత్తః ఏవ = దేవరవారివల్లనే, త్వత్+అనుభజనం =దేవరవారిని అనుసంధించి చేసే కైంకర్యాన్ని, ఆప్తుమ్ ఇచ్ఛన్ = పొందగోరినవాడనై, కామకామైః= స్వరూపవిరుద్ధాలైన లౌకిక విషయాలలోని ఆశను కలవారైన, కలుషమతిభిః= (దానికి కారణమైన) కలత చెందిన - దోషాలను కల బుద్ధిని కలవారితో, సంవసన్ సన్ = సహవాసంమాత్రం చేస్తూ, ఉచ్చైః క్రందతి = పెద్దగా ఆర్తధ్వనిని చేస్తున్నాను, తత్ =

అందువల్ల, కాలక్షేపః = కాలవిలంబం, తే = దేవరవారికి, కథం యుజ్యతే = ఏకారణంచేత యుక్తమైనది? (ఇక దేవరవారు ఆలస్యం చేయడం తగదు - అని భావం.)

శ్రీవరవరమునీ! సహజంగానే తీయనివి అయిన తమ కడగంటి చూపులచేత ఇంతకుముందు స్వరూపం నాశాన్ని పొందకపోవడమనే క్షేమాన్ని పొందినా, నీచుడనైన నేను తమ వలననే తమను అనుసంధిస్తూ చేసే కైంకర్యాన్ని పొందగోరేవాడనై, దానికి అనుగుణంగా వర్తించకుండా, స్వరూపవిరుద్ధాలైన శబ్దాది విషయాలలో ఆశను కలవారై, దానికి కారణమైన కాలుష్యాన్ని కల బుద్ధిని కలవారితో సహవాసం చేస్తూ, ఎలుగెత్తి అరుస్తున్నాను. అందువల్ల ఆలస్యం చేయడం ఇక మీకు ఏవిధంగా తగినది? (తగనిది - అని భావం.)

**వ్యాఖ్యానమ్ : (ప్రకృతిమధురైః త్వత్కటాక్షైః)** - సహజంగా రమణీయాలైన దేవరవారి కటాక్షాలతో- అని భావం. ఇచటి మధురశబ్దానికి **"మధు-రాతి ఇతి మధురః"** మధువును స్రవించేది - అనే అర్థం చెప్పవచ్చు. ఇచటి మధువు కరుణయే. ప్రకృతిశబ్దం ద్వారా కరుణయొక్క స్వాభావికత్వం సూచింపబడింది. ఈ మధువు అలౌకికం కూడా.

**(క్షేమమ్)** - స్వరూపనాశాభావ రూపమైన స్థితి పరిపాలనాన్ని,

**(ప్రాప్తః అపి)** - పొందిన వాడనైనా,

**(సోఽయం జంతుః)**- తమను క్రిమికీటకాదులతో సమానంగా భావించి కవి ఇక్కడ జంతుశబ్ద ప్రయోగాన్ని చేశారు. ప్రాణిసామాన్య వాచకం ఇది. **"ప్రాణీ తు చేతనో జంతుః"** అని అమరం. పుట్టుక తప్ప ఏవిధమైన యోగ్యతను లేని నేను - అని తాత్పర్యం.

**(త్వదనుభజనమ్)** - మిమ్ములను అనుసరించడం మొదలైన కైంకర్యాలను.

**(త్వత్త ఏవ)** - మీ వల్లనే,

**(ఆప్తుమిచ్ఛన్)** - పొందగోరుతూ,

**(కామకామైః)** - స్వరూపవిరుద్ధాలైన పురుషార్థాలలో ఆశను కలవారితో - అనిభావం. మొదటి కామశబ్దానికి స్వరూపవిరుద్ధ పురుషార్థాలని, రెండవ కామ శబ్దానికి వాటిలో స్పృహను కలవారని అర్థం.

**(కలుషమతిభిః)** - దానిని మూలంగా కల క్రోధలోభాది కాలుష్యాలను కల బుద్ధిని కలవారితో. **"సంగాత్ సంజాయతే కామః, కామాత్ క్రోధోఽభిజాయతే, క్రోధాత్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః, స్మృతి భ్రంశాత్ బుద్ధినాశః"** ఇత్యాది గీతాశ్లోకార్థాన్ని స్మరించాలి.

**(సంవసన్ సన్)** - **"ప్రియం జన మపశ్యంతీ పశ్యంతీ రాక్షసీగణమ్"** (తనకు ఇష్టులైనవారిని చూడలేనిదై, రాక్షసీగణాన్ని చూస్తున్నదై) అనే రీతిలో కేవలం ప్రతికూలురతో సహవాసాన్ని కల్గినవాడనై- అని భావం.

**(ఉచ్చైః క్రందతి) - "దస్యుభిః ముషితేనైవ యుక్త మాక్రందితుమ్ భృశమ్"** (దొంగలచేత అపహరింపబడ్డవానివలె పెద్దగా ఆక్రందించడం తగినది) అనే రీతిలో ఆక్రందన చేస్తున్నాడు (ను).

**(కాలక్షేపః)** - నేను ఆశించిన మీ సేవను నాకు అనుగ్రహించడంలో ఆలస్యం చేయడం.

**(తే కథం యుజ్యతే)**- సర్వశక్తి, పరమకారుణికులు, సిద్ధోపాయభూతులు అయిన తమకు ఏ రీతిలో తగినది? **"ఆర్తానా మాశు ఫలదా"** అనే ఉక్తినిబట్టి ఏరీతిలోను తగదని భావం.

ముందు శ్లోకంలో - శ్రీవరవరమునుల శ్రీపాదపద్మాలలో కైంకర్యాన్ని తాము ఆశించడం తప్పు- అని అన్నారు. అయినా, ఆశను నివర్తింపజేసికోవడం వీలు కాలేదు. తమను సేవిస్తే తప్ప ఆగలేని రీతిలో ఆర్తి లేదని భావించిన శ్రీవరవరమునులు తమ శ్రీపాదాల కైంకర్యాన్ని అనుగ్రహించడంలో ఆలస్యం చేస్తున్నారు - అని తలచి, ఈ శ్లోకంలో "తమ శ్రీపాదాలలో చేసే కైంకర్యమే ఫలం. దానికి వేరొక ఉపాయంతో కాకుండా తమ మూలంగానే పొందాలని అనుకుంటున్నాను. కాని, నేను సంసారులతో కూడి నివసిస్తున్నానే తప్ప, వారితో నాకు పొందిక ఏమాత్రం లేదు. అయ్యో ! అని ఎలుగెత్తి ఆక్రందిస్తున్నాను. నా ఆర్తి తమకు అర్థం కాలేదా! ఆర్తిని కలవారి ప్రపత్తి శీఘ్రంగా ఫలిస్తుందని శాస్త్రజ్ఞులు అంటారే! వెంటనే దాసుడనైన నన్ను పిలిచి, తమ శ్రీపాదాల సేవను అనుగ్రహించవద్దా! సర్వశక్తులై, పరమ కారుణికులైన మీకు ఈ ఆలస్యం యుక్తమా!''- అని అంటూ తమ ఆర్తి అంతా వ్యక్తమయేటట్లు ఇందులో ఎఱుమ్బియప్పా నివేదిస్తున్నారు.

**36.** అవ :- "శ్రీవరవరమునుల స్వభావాన్ని పర్యాలోచిస్తే కూడా నన్ను వారు విడువడం అనుచితం'' అని ఇందులో అంటున్నారు.

**కోణై రక్ష్ణః కుమనస మిమం నిర్మలం కల్పయిత్వా**
**హాతుం దూరే వరవరమునే! హా! కథం యుజ్యతే తే ।**
**పాథః పాతుం ప్రయతనపరః పంకిలం శోధయిత్వా**
**పంకే ముంచన్ పున రిదమతః ప్రాప్నుయాదేవ కిం వా ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, కుమనసం = చెడ్డ మనస్సును కల, ఇమం = ఈప్రాణిని (నన్ను), అక్ష్ణః= ఒక కంటియొక్క, కోణైః= కోణాలతో, నిర్మలం = అవివేకం, అన్యథాజ్ఞానం- అనే దోషాలు తొలగినవానినిగా, కల్పయిత్వా = చేసి (ఇపుడు), దూరే = చాలా దూరంలో, హాతుం = గెంటివేయడం, తే = దేవరవారికి, కథం యుజ్యతే = ఏవిధంగా తగును?, హా = అయ్యో !, పాతుం ప్రయతనపరః = పానీయాన్ని తాగే ప్రయత్నంలో ఆసక్తిని కల (వివేకి అయిన) వాడొకడు, పంకిలం పాథః= మురికి నీటిని, శోధయిత్వా =వడికట్టి తేర్చి, ఇదం = ఈనీటిని, పునః పంకే ముంచన్ = తిరిగి ఆ బురదలోనే పారబోసి, అతః = బురదలో పోసిన ఈ నీటితో, కిమివ వా = ఏమి ప్రయోజనాన్ని, ప్రాప్నుయాత్ = పొందగలడు?

ఓ శ్రీవరవరమునీ! చెడ్డ బుద్ధిని కల ఈ జంతువును (నన్ను) తమరు ఇంతకుముందు ఒక క్రీగంటిచూపుతో అవివేకం, అన్యథాజ్ఞానం అనే దోషాలు తీరినవానినిగా చేసి, ఇపుడు దూరంగా విడిచిపెట్టడం తమకు ఏ రీతిలో తగినది? అయ్యో! చన్నీళ్ళను తాగాలనే ప్రయత్నం చేసిన జ్ఞానం కలవాడు బురదతో కలిసి ఉన్న నీటిని వడగట్టి, తేర్చిన తర్వాత ఈ నీటినే మరల ఆ బురదలోనే పారబోసి, ఆ బురదనీటిని గ్రహిస్తే ఏమి ప్రయోజనాన్ని పొందగలడు?

**వ్యాఖ్యానమ్ : (కుమనసమ్)** - స్వరూప - ఉపాయ - పురుషార్థాలనే మూడు విషయాలలో అన్యథాజ్ఞానాన్ని కలవాడను, ఇది గ్రహించతగినది, ఇది తగనిది -అనే వివేకాన్ని లేనివాడను,

**(జంతుమ్)** - కాబట్టే, జంతువువంటి నన్ను,

**(అక్ష్ణః కోణైః)** - ఒకే కన్ను చివరికొనలతో- కడగంటిచూపుతో,

**(నిర్మలం)** - పూర్వం చెప్పబడ్డ దోషాలేవీ లేనివానినిగా,

**(కల్పయిత్వా)** - చేసి,

**(దూరే)** - మీకు దూరంలో,

**(హాతుం తవ కథం యుజ్యతే)** - "ఆత్మలాభాత్ పరం కించిత్ అన్యన్నాస్తి" (భగవానునకు మంగళాశాసనం చేయడంకోసం ఒక పరిశుద్ధుడైన ఆత్మ లాభిస్తే అంతకంటే వేఱొక ఫలం అక్కరలేదు) అని నిశ్చయించుకొన్న మీరు నన్ను విడువడం ఏవిధంగా తగినది?

**(హా!)** - అయ్యో!

**(పాతుం ప్రయతనపరః)**- ఉక్తార్థానికి ఒక లౌకికదృష్టాంతం చూపబడుతున్నది. దాహం తీరడంకోసం జలపానాన్ని చేయప్రయత్నించేవాడై,

**(పంకిలం)** - బురద నీటిని,

**(శోధయిత్వా)**- చిల్లగింజలద్వారా, లేక, వడబోయడం ద్వారా శుద్ధిచేసి, నిర్మలంగా చేసి,

**(ఇదం)** - ఈ నిర్మల జలాని, **(పంకే)** - బురదలో,

**(పునః ముంచన్)**- తిరిగి పోసేవాడై,

**(అతః)**- ఆ విధంగా తేర్చిన జలాన్ని తిరిగి బురదలో పోసినందువల్ల- అని భావం.

**(కిమివ ప్రాప్నుయాత్)**- ఏ లాభాన్ని పొందగలడు?

దాహంతో ఉండేవాడొకడు తన దాహాన్ని తీర్చుకోవడంకోసం బురదనీటిని వడగట్టి, తేర్చి, తరువాత ఆ నీటిని తాగి దాహాన్ని తీర్చుకోవలసి ఉండగా, ఆరీతిలో చేయకుండా, తేర్చిన ఆ నీటిని మళ్ళీ బురదలోనే పోస్తే ఏలాభమూ కలుగనట్లే, పూర్వం బుద్ధిలో కలతజెందిన నన్ను మీ కటాక్షంతో అనుగ్రహించి,

నిర్మలుణ్ణిగా చేసి, తరువాత భగవానునకో, భాగవతులకో, లేక, తమకో దాసునిగా నన్ను చేయవలసి ఉండగా, ఆ రీతిలో చేయకుండా, తమకు కడుదూరంలో బుద్ధికాలుష్యాన్ని కల సంసారుల మధ్యలోనే నన్ను ఉంచినట్లయితే ఏమి లాభం కలుగుతుంది? **"ఆత్మలాభాత్ పరం కించిత్ అన్యత్ నాస్తి"** అని నిశ్చయించుకున్న మీకు ఆ నిశ్చయానికి విరుద్ధంగా చేయడం తగునా? - అని తాత్పర్యం. ఈ శ్లోకంలో దృష్టాంతాలంకారం ప్రయోగింపబడింది.

**37.** అవ :- "చక్కగా పరిశీలించి చూస్తే శ్రీవరవరమునులను నిందించి ఏం ప్రయోజనం? మనకు వారితో కూడి ఉండి, ఆనందించే కాలం రాలేదు, అంతే'' అని ఒక విధంగా స్తుతికర్త ఇందులో సమాధానపడుతున్నారు.

**కాలః కింస్వి న్న భవతి స మే కాంక్షితః కాంక్షితానాం**
**యస్మిన్నస్మాదనలజలధే రుత్ప్లుత స్త్వాం నమస్యన్।**
**సిక్తః శ్రీమన్! వరవరమునే! శీతలై స్త్వత్కటాక్షైః**
**ముక్త స్తాపై రమృత మతులం గాహతే మోదమానః ॥**

శ్రీమన్ వరవరమునే = సద్గుణశోభను కల ఓవరవరమునీ!, యస్మిన్ = ఏ కాలంలో, (అయం జంతుః = ఈప్రాణి అయిన నేను), అస్మాత్ = ఈ, అనలజలధేః= (దేవరవారికి దూరదేశమనే) అగ్నిసముద్రంనుండి, ఉత్ప్లుతః సన్ = పైకి ఎగిరివచ్చి చేరినవాడనై, శీతలైః= వాత్సల్యాదిగుణాలతో చల్లని, త్వత్ కటాక్షైః= దేవరవారి కటాక్షాలచే, సిక్తః సన్ = అభిషేకింపబడినవాడనై, తాపైః = తాపత్రయాలచేత, ముక్తః సన్ = విడువబడినవాడనై, మోదమానః= ఆనందించే స్వభావాన్ని కలవాడనై, అతులమ్ =సాటి లేని, అమృతం = ఆ ఆనందమనే అమృత సముద్రాన్ని, గాహతే = అవగాహిస్తున్నానో, కాంక్షితానాం = ఆశపడి ఎదురు చూచిన విషయాల మధ్యలో, కాంక్షితః= మిక్కిలి ఆశపడి ఎదురుచూసే విషయమైన, సః కాలః= ఆకాలం, మే స్వం = నా సొత్తుగా, కిం న భవతి = ఎందువల్ల కావడంలేదు?

సద్గుణశోభను కల శ్రీవరవరమునీ! నేను, ఎపుడూ తమకు దూరంగా ఉండడమనే అగ్నిసముద్రం నుండి బయటపడినవాడనై, శ్రీరంగవాసియైన తమను నమస్కరించేవాడనై, వాత్సల్యాది గుణాలతో చల్లని మీ కటాక్షాలచేత తడుపబడ్డవాడనై, తాపత్రయాలచే విడువబడ్డవాడనై, కావుననే, ఆనందించేవాడనై, నిస్సమాభ్యధికమైన ఆ ఆనందం అనే అమృత సముద్రాన్ని ఎపుడు అవగాహిస్తానో, ఆశపడిన విషయాలన్నికంటే మిక్కిలిగా ఆశపడ్డ విషయమైన ఆ కాలం నా సొంతం ఎందుకు కావడం లేదు?

**(శ్రీమన్! వరవరమునే!)** - ఆర్తుల ఆర్తిని హరించడానికి ఉపయోగించే సౌమ్యత్వ- శీతలత్వాదిగుణ ప్రశస్తివల్ల కల్గిన శోభకు నిధి అయిన శ్రీవరవరమునీ! - అని ప్రకృత భావం. **"శ్రీ"** శబ్దం శోభ - అనే అర్థాన్ని ఇస్తుంది. తమ ఆర్తిని పోగొట్టమని కవి అర్థించే ప్రకృత సందర్భానుసారంగా తదనుగుణకల్యాణగుణ పౌష్కల్యం దీనివల్ల సూచింపబడింది.

**(యస్మిన్ కాలే)** - ఏసమయంలో,

**(అస్మాత్)** - వాచామగోచరమైన, మాయాధిష్ఠితమైన -అని ఈ సర్వనామశబ్ద యొక్క భావం.

**(అనలజలధేః)** - **"వరం హుతవహజ్వాలాపంజరాంతఃవ్యవస్థితిః"** ఇత్యాది సూక్తుల భావాలు స్మరణీయాలు. ఇక్కడ అనలజలధిః ఏమంటే- శ్రీవరవరమునులకు దూరంగా ఉండడమే. **"య స్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా"** అనే ప్రథమపర్వాత్మకమైన సూక్తి చరమపర్వంలో అనుసంధింపబడింది. **"అనలజలధేః"** అని ఉపమేయం మాత్రం చెప్పబడడం చేత నిగీర్యాధ్యవసాయరూపమైన రూపకాతిశయోక్తి అలంకారం ఇక్కడ ఉన్నది. **"అనలజలధి"** అనే పదప్రయోగంవల్ల లోకంలో మిగిలినవారికి ఏడు సముద్రాలు, తమకు మాత్రం ఈ అనలజలధితో ఎనిమిది- అనే విలక్షణమైన భావం గమ్యమానమవుతున్నది. ఈ ప్రయోగంవల్ల కవియొక్క ఆతిశయించిన ఆర్తి సూచింపబడింది.

**(ఉత్ప్లుతః సన్)** - మిక్కిలి వేగంగా బయటకు ఎగిరిపడి - అని అర్థం. ప్లవనం అంటే నేలపై అడుగులు పెట్టి నడవడం కాకుండా, ఆకాశంలో వేగంగా ఎగిరిపడడం. దీనివల్ల కూడా ఆర్త్యతిశయం సూచితం.

**(త్వాం)** - శ్రీరంగంలో ఉన్న మిమ్ములను,

**(శీతలైః)** - వాత్సల్య సౌశీల్య కారుణ్యాదులను ప్రకాశింపజేసేవి, కాబట్టి, అమృతతరంగాలవలె మనోహరాలైన,

**(త్వత్కటాక్షైః)** - ప్రాప్తశేషి అయిన తమ కటాక్షాలచేత

**(సిక్తః సన్)** - అగ్నిసముద్రంలో మునిగినందువల్ల కల్గిన బాధను తీర్చే చల్లదనాన్ని పొందినవాడనై- అని అర్థం. సేచనమంటే తడపడమే కదా! **"శీతలై కటాక్షైః సిక్తః"** అనే ప్రయోగం సాభిప్రాయకం. కాబట్టి పరికరాలంకారం ఉన్నది.

**(తాపైః ముక్తస్సన్)** - తాపాలచేత - అనే ఇచటి బహువచనంద్వారా ఆధ్యాత్మిక- ఆధిభౌతిక- ఆధిదైవికాలనే మూడు విధాలైన తాపాలు సూచింపబడ్డాయి. వానిని తీర్చుకొన్నవాడనై,

**(మోదమానః)** - ఆనందించేవాడనై

**(అతుల మమృతమ్)** - ఇచటి సాటి లేని అమృతం- కైంకర్యంవల్ల కలిగే ఆనందాతిశయలాభమే. కేవలం ఉపమేయప్రయోగం చేయబడడంచేత నిగీర్యాధ్యవసాయరూపమైన రూపకాతిశయోక్తి ఇక్కడ భావ్యం. **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్", "ఆనందసాంద్ర మమృతప్లవనాది-వాభూత్", "తామరైనీళ్ వాశత్తడమ్‌పోల్", "మరకతమణిత్తడమ్", "హరిసరసి"** ఇత్యాది సూక్తుల భావాలు చరపర్వాత్మకంగా స్మరణీయాలు.

**(గాహతే)** - అవగాహిస్తానో,

**(సః కాంక్షితానాం కాంక్షితః)** - అటువంటి అభిలషించిన అన్ని విషయాలలో గొప్ప విషయం అయిన కాలం.

**(స్వం కిం న భవతి)** - నాకు సొంతం కాదా! ఆ కాలం నా స్వంతం అయేంతవరకు ఎదురు చూస్తాను - అని భావం. **"కిం స్విన్నభవతి?"** అనే పాఠానికి ఎందువల్ల కలగడం లేదు - అని భావం. **"అతులమమృతం గాహతే"** అనడం వల్ల శ్రీవరవరమునుల అమృత తటాకసామ్యం ధ్వనిస్తున్నది. కులశేఖరులు **"ఇరుళిరియ"** అనే దశకంలో **"ఎన్రుకొలో!"** అని ఆశించిన ప్రకారవిశేషాలను, శ్రీరంగనాథ స్తోత్రంలో భట్టర్ **"కదాహమ్"** అని ఆశపడిన ప్రకారవిశేషాలను దేవరాజగురువు చరమ పర్వాత్మకంగా శ్రీవరవరమునులపట్ల ఆశపడుతున్నారు.

తాపత్రయాలలో - మనస్సువల్ల, దేహంవల్ల కలిగే ఆధివ్యాధులు ఆధ్యాత్మికాలు. ఆత్మన్ శబ్దానికి దేహం అని, మనస్సు అని అర్థం. పులి, సింహం, సర్పం మొదలైన ప్రాణులవల్ల కలిగేవి ఆధిభౌతికాలు. భూతశబ్దం ప్రాణివాచకం. సూర్యచంద్రాదులు, అతివృష్టి- అనావృష్టి మొదలైన వానివల్ల కలిగేవి ఆధిదైవికాలు. దైవమంటే దేవత.

**38.** అవ :- పూర్వశ్లోకంలో **"అనలజలధే రుత్ప్లుతః"** అని అంటూ ఎఱుమ్బియప్పా తాము ఆకాశంలోకి వేగంగా ఎగరాలని ఆశపడ్డారు కదా! ఆ ఆశ సిద్ధించడానికి ఆవశ్యకమైన సామర్థ్యాన్ని ఇందులో అపేక్షిస్తున్నారు.

**పారావారప్లవనచతురః కుంజరో వానరాణాం**
**పద్మా భర్తుః ప్రియసహచరః పత్త్రిణా మీశ్వరో వా ।**
**వాయుర్భూత్వా సపది యది వా మార్గ ముల్లంఘ్య దుర్గం**
**కాలే కాలే వరవరమునే! కామయే వీక్షితుం త్వామ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అహం = (అగ్ని సముద్రంలో మునిగిన) దాసుడనైన నేను, పారావారప్లవనచతురః= సముద్రాలను దాటడంలో సమర్థుడైన, వానరాణాం కుంజరః= వానరశ్రేష్ఠుడైన హనుమానునిగా గాని, పద్మాభర్తుః= శ్రియఃపతి అయిన భగవానునకు, ప్రియసహచరః= ప్రియసఖుడైన, పత్త్రిణామ్ ఈశ్వరో వా = పక్షులకు ప్రభువైన గరుడుడుగాగాని, యది వా = ఆ విధంగా కాకపోయినా, వాయుః = వాయువుగా గాని, భూత్వా = జన్మించగల్గి, దుర్గం మార్గం = చాలా కష్టపడి పయనించ వలసిన దారిని, సపది ఉల్లంఘ్య= చాలా వేగంగా పూర్తిగా దాటి, కాలే కాలే = ఆ యా కాలాలలో, త్వాం = చాలా భోగ్యరూపులైన దేవరవారిని, వీక్షితుం కామయే = సేవించాలని ఆశపడుతున్నాను.

ఓ శ్రీవరవరమునీ! దేవరవారి వియోగమనే అగ్నిసముద్రంలో మునిగిన నేను, ఆ సముద్రాన్ని దాటడంలో సమర్థుడైనవాడు, వానరశ్రేష్ఠుడైన హనుమంతునిగా అయినా, లేక, శ్రియఃపతికి ప్రియసహచరుడైన పక్షిరాజు గరుత్మంతునిగా అయినా, లేక, వాయువుగా అయినా రూపొంది, దుర్గమమైన మార్గాన్ని కూడా వేగంగా దాటి, ఆయా కాలాలలో మిక్కిలి మధురమైన రూపం గల మిమ్ములను సేవించాలని ఆశపడుతున్నాను.

**(అహమ్)** - పూర్వం చెప్పినట్లుగా దేవరవారికి దూరంగా ఉండడమనే అగ్నిసముద్రంలో మునిగిన నేను - అని తాత్పర్యం.

**(పారావారప్లవన చతురః)** - సముద్రాన్ని లంఘించడంలో నిపుణుడైన,

**(వానరాణాం కుంజరః)** - ఇచటి కుంజరశబ్దం శ్రేష్ఠవాచకం. **"అన్యత్ర గరుడాద్వాయోః అన్యత్ర చ హనూమతః"** అని వేగంగా పోవడంలో గరుడ, వాయు, హనుమానులు ప్రసిద్ధులు.

**(పద్మాభర్తుః ప్రియసహచరః)** - ఈ ప్రయోగం మధ్యమణిన్యాయంతో ముందు వెనుకలలో హనుమంతునితో, గరుడునితో అన్వయించుకోవచ్చు. **"ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః"** అనేశ్రీరాముని వచనం ద్వారా హనుమానుని ప్రియసహచరత్వం నిరూపింపబడింది. గరుడుని విషయంలో **"దాసః స్పఖా వాహనమ్"** ఇత్యాది సూక్తులు స్మరణీయాలు.

**(పత్రిణా మీశ్వరో వా)** - వేగంగా వెళ్ళడం స్వభావంగా కల పక్షుల ప్రభువు గరుడుడు,

**(వాయుర్వా)** - పూర్వం నిర్దేశింపబడ్డ హనుమానుడు, గరుడులకు కూడా వేగాతిశయాన్ని కల్గించే వాయువుగా - అని భావం. హనుమానుడు వాయుపుత్రుడే కదా!

**(యది వా)** - పైన చెప్పబడ్డ హనుమానునితో, గరుడునితో, వాయుదేవునితో తాదాత్మ్యాన్ని పొందినా, వారి వారి వేగాన్నిబట్టి ఏదో కొంతక్రమాన్ని పొందవలసి ఉంటుంది కదా! ఆ క్రమాన్ని అనుసరించడంలోని ఆలస్యాన్ని సహించలేని స్థితిని ఈ ప్రయోగం సూచిస్తుంది. ఇది అంతా కవికి గల ప్రాప్యత్వరను తెలుపుతుంది. అందువల్ల చరమస్వరూపవిరుద్ధమైనా శ్రియఃపతికి ప్రియసహచరులైన హనుమద్గరుడుల తాదాత్మ్యాన్ని, వారికి సాటివచ్చే వాడు కాకపోయినా, వాయువుయొక్క తాదాత్మ్యాన్ని కవి ఆశించారు. ప్రాప్యత్వరలోని వైలక్షణ్యం ఇటువంటిదే కదా. **"సర్వాన్ దేవాన్ నమస్యంతి"** అనే శ్రీరామాయణసూక్తి క్రమం, **"తైయొరు తిజ్గళుమ్"** అనే గోదాదేవీ ప్రణీత దశకార్థం ఇక్కడ చరమపర్వంగా అనుసంధింప బడ్డాయి.

**(దుర్గం మార్గమ్)** - దుర్గమమార్గాన్ని,

**(ఉల్లంఘ్య)** - వేగంగా పైకి ఎగిరి దాటి. **"ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలమ్"** అనే ఆ హనుమానుని వలె అగ్నిసముద్రాన్ని లంఘించి,

**(త్వామ్)** - నిరతిశయభోగ్యరూపులైన మిమ్ములను.

**(కాలే కాలే)** - ప్రతిక్షణం, **(వీక్షితుం కామయే)** దర్శించగోరుతున్నాను. **"సదా పశ్యంతి సూరయః"** అనే శ్రుత్యర్థం శ్రీవరవరమునిపరంగా సంభావింపబడింది. వీక్షణమాత్రంతో ఆశ పూర్తికాదు. **"తద్విప్రాసో విపన్యవః"** అనే రీతిలో తదనంతర కార్యమైన మంగళాశాసనం చేయడం వరకు అర్థాన్ని అనుసంధించాలి.

"దీనికి ముందు **"త్వదనుభజనం త్వత్త ఏవాప్తు మిచ్ఛన్'** (35వశ్లో) అని అంటూ శ్రీవరవరమునుల కైంకర్యాన్ని వారినే ఉపాయంగా చేసికొని పొందాలని ఆశపడేవారుగా తమనుగూర్చి పల్కిన ఎఱుమ్బియప్పా,

ఇపుడు హనుమానుడు, గరుడుడు మొదలైనవారై జన్మించి, పైకి ఎగిరి ప్రయాణం చేసే స్వప్రవృత్తిలో ప్రవేశించారే! అంతేకాక, భగవద్భక్తులైన గరుడ-ఆంజనేయులలో ఒకరుగా కావాలని ఆశపడడం తగనిది అయినా, ఆవిధంగా లేని దేవతాంతరమైన వాయువుగా కావాలని ఆశపడుతున్నారే! స్వరూపజ్ఞులైన ఈ ఎఱుమ్బియప్పాకు ఇవన్నీ తగినవేనా?'' అని ప్రశ్నిస్తే, దారి కాని దారిలో అయినా పోయి శ్రీవరవరమునులను సేవించి, కైంకర్యాన్ని చేసి తీరాలనే రీతిలో ఉన్న వీరి ప్రాప్యత్వరాతిశయం వీరిని పెట్టే పాట్లు ఇవి అన్నీ - అని చెప్పవలసి ఉన్నది. గోదాదేవి వేంకటేశ్వరునకు తనను అర్పించుకోవడంకోసం కామదేవ సమాశ్రయణాన్ని చేసిన వృత్తాంతాన్ని ఇందులకు ఉదాహరణంగా గ్రహించవచ్చు. **"జ్ఞానవిపాకకార్యమాన అజ్ఞానత్తాలే వరుమవై యెల్లామ్ అడిక్కు ళుక్కు పెఱుమ్"** (శ్రీవచనభూషణమ్) (జ్ఞానపరిణామకార్యం అయిన అజ్ఞానంచేత కలిగే దశలు అన్నీ శ్లాఘ్యాలే) అనే రీతిలో ఇటువంటి అతిప్రవృత్తులను శ్రీలోకాచార్యగురువర్యులు అతిశ్లాఘ్యాలు అని అనుగ్రహించిన అంశం ఇక్కడ స్మర్తవ్యం.

**39.** అవ :- పోనీ, శ్రీవరవరమునుల గుణానుభవంతో **"సదా పరగుణావిష్టః"** అనే రీతిలో కాలం గడుపవచ్చుకదా! అంటే,విరోధులు నిండి ఉండే దేశంలో శ్రీవరవరమునుల గుణాలను తలచి, ధరించి ఉండడం కష్టసాధ్యం - అని అంటున్నారు.

**కామక్రోధక్షుభితహృదయాః కారణం వర్జయిత్వా**
**మర్త్యౌపమ్యం వరవరమునే! యే పునః మన్వతే తే ।**
**దుష్టం తేషా మభిమతతయా దుర్వసం దేశ మృచ్ఛన్**
**అంతః స్వాంతం కథమపి మిథో భావయేయం భవంతమ్ ॥**

శ్రీవరవరమునీ! చెడ్డ వస్తువులలో గల ఆశవల్ల, వాటిని పొందడంలో అడ్డు వచ్చినవారిపై కలిగే కోపంవల్ల, కలత జెందిన మనస్సును కల ఏ దుష్టులు, నిష్కారణంగా ఆదిశేషావతారభూతులైన తమకు సాధారణ మానవులతోడి సామ్యాన్ని తలుస్తున్నారో, ఆ దుష్టుల అభిమతానికి లక్ష్యభూతమైనందువల్ల దుష్టమై, అందువల్ల నివసించతగనిదైన దేశాన్ని చేరిన నేను, తమను సేవించాలనే ఆశను కలవాడనై, మనస్సు లోపల రహస్యంగా చాలా శ్రమపడి నిరంతరం స్మరిస్తాను.

వ్యాఖ్యానమ్ : **(కారణం వర్జయిత్వా)** - ఏకారణం లేకుండా,

**(కామః - హృదయాః)**

**(కామేన)** - స్వరూపవిరుద్ధాలైన పురుషార్థాలలోని ఆశచేత,

**(క్రోధేన)** - ఆ పురుషార్థాలను పొందడంలో వీరు అడ్డు వచ్చారు. వీరు - అనే సందేహం మూలంగా కలిగే తీవ్రమైన కోపంచేత - అని అర్థం. **"సంగాత్ సంజాయతే కామః, కామాత్ క్రోధోఽభిజాయతే"** అనే గీతాసూక్తి స్మరణీయం.

**(క్షుభితహృదయాః యే)** - అపకారం చేసి తీరాలనే మనస్సు కలవారైన ఏ దుర్జనులు,

**(తే మర్త్యోపమ్యమ్)** - బాగా వేడి చేయబడ్డ ఇనుపగుండులో ఉన్న అగ్నివలె, విష్ణువుయొక్క విశేషాధిష్ఠానం కల ఆదిశేషులనబడే విలక్షణజీవులైన దేవరవారిని ఆ రీతిలో భావించకుండా, మీరు సామాన్య మానవులని భావించడం-అని అర్థం. అతథాభూతమనుష్యసామ్యమని భావం.

**(మన్వతే)** - భావిస్తున్నారో, **(తేషామ్)** - ఆదుర్జనులకు,

**(అభిమతతయా)** - అభిమతంగా ఉండేటట్లు

**(దుష్టమ్)** - దోషంతో కూడిన, **(దుర్వసం దేశమ్)** - ఉండడానికి కష్టమైన దేశాన్ని,

**(ఋచ్ఛన్)** - చేరి, **(అహం)** మిమ్ములను చూడగోరిన నేను,

**(త్వామ్)** - దర్శిస్తే కాని నేను నిలువడానికి, ప్రాణధారణ చేయడానికి కాని సాధ్యం కానట్లుగా ప్రాప్యులుగా, భోగ్యులుగా ఉండే మిమ్ములను,

**(అంతఃస్వాంతమ్)** - మనస్సులోపల,

**(మిథః)** - హృదయం యొక్క తోడ్పాటుతో, **(కథమపి)**- అతికష్టంతో,

**(భావయేయమ్)** - నిరంతరస్మృతికి విషయంగా చేసికొంటాను.

ఆదిశేషుల అవతారరూపులైన శ్రీవరవరమునులను మానవమాత్రులుగా తలచి, నిష్కారణంగా అపచారపడే దుష్టులు నిండిన తమ గ్రామంలో, వారి గుణాలను మనస్సులో తలచి, ప్రాణధారణ చేయడం కూడా చాలా కష్టసాధ్యం- అని అంటున్నారు. ఆ దుష్టులు - వీరి మనస్సుకు కూడా కావలి పెడుతున్నారు కాబోలు! లేకపోతే **"కథమపి"** అనే ప్రయోగాన్ని చేయరుకదా! **"ప్రియంజన మపశ్యంతీ పశ్యంతీ రాక్షసీగణమ్", స్వగణేన మృగీం హీనాం శ్వగణై రావృతా మివ"** అనే రీతిలో లంకలో బంధింపబడ్డ సీతాదేవి స్థితివంటిదే ఇది. **"ఉణ్ణిలావియ"** (7-1) అనే తిరువాయమొ దశక ప్రమేయం చరమపర్వాత్మకంగా ఇక్కడ అనుసంధేయం.

**40.** అవ :- ఆశించిన రీతిలో తాము శ్రీవరవరమునులను ధ్యానించడానికి, వారి తిరునామాలను సంకీర్తనం చేయడానికి ఇతరుల దోషాలు, తమ దోషాలు అడ్డుగా ఉన్నాయని ఇందులో అంటున్నారు.

**నామైతత్తే నవనవరసం నాథ! సంకీర్త్య నృత్యన్**
**అంతఃకర్తుం వరవరమునే! నిత్యమిచ్ఛత్యయం త్వామ్ ।**
**అర్ధం నిద్రా హరతి దివసస్యార్ధ మన్యన్నృశంసో**
**వాసో మూఢై ర్మలినమతిభిః వాక్ప్రవృత్తిం నిరుంధే ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అయం = ఈ మానవుడు (దాసుడనైన నేను), ఏతత్ = వరవరముని అనే ఈ, నవనవరసం = చాలా మిక్కిలి నూతనమైన రసాన్ని కల, తే నామ = దేవరవారి తిరునామాన్ని, సంకీర్త్య = సంకీర్తనం చేసి, నృత్యన్ = నాట్యాన్ని చేసేవాడనై, త్వాం = దేవరవారిని, నిత్యం=

ఎల్లప్పుడు, అంతః కర్తుం = మనస్సులో నిలుపుకొని ధ్యానించాలని, ఇచ్ఛతి = కోరుతున్నాడు (కోరు తున్నాను), నాథ = స్వామీ, దివసస్య+అర్ధం = దినంలోని సగభాగాన్ని, నిద్రా = నిద్ర, హరతి=హరిస్తున్నది, అన్యత్ హరతి = తిండి తినడం మొదలైన వ్యర్థకార్యాలు హరిస్తున్నవి, నృశంసః =మిక్కిలి క్రూరమైన, మలినమతిభిః= దుష్ట బుద్ధిని కలవారైన, మూఢైః+చ= మూఢులైన వారితో (బుద్ధి లేనివారితో), వాసః= సహవాసం, వాక్ప్రవృత్తిం = సంభాషించడం, నామసంకీర్తనం చేయడం, నిరుంధే = అడ్డుతున్నది.

శ్రీవరవరమునీ! నేను "వరవరముని" అనే ఈ అత్యంతం నూతనమైన రసాన్ని కల మీ తిరునామాన్ని కీర్తించి నృత్యం చేస్తూ, మిమ్మలను నిత్యం మనస్సులో నిలుపుకొని ధ్యానం చేయాలి- అని ఆశిస్తున్నాను. స్వామీ! దినంలో ఒక సగాన్ని నిద్రహరిస్తున్నది. వేఱొక సగాన్ని, తిండి మొదలైన వేఱు కార్యాలు హరిస్తున్నవి. మిక్కిలి క్రూరులైన, దుర్మతులతో, బుద్ధి లేనివారితో సహవాసం నీ నామసంకీర్తనానికి అడ్డు కల్గిస్తున్నది- అని భావం.

**(అయమ్)** - ఇతడు (నేను),

**(ఏతత్)** - ఇది వక్తృబుద్ధిస్థమైన విషయాన్ని ప్రత్యక్షసమానాకారంగా భావించి నిర్దేశించే సర్వనామపదం ఇది.

**(నవనవరసమ్)**- ఎప్పటికప్పుడు కొత్తగా తోచే రసాన్ని కల్గినది.

**(తే నామ)**- పైన చెప్పిన రీతిలో మాధుర్యం లేకపోయినా, **"గురో ర్నామ సదా జపేత్"** అనే రీతిలో సదా జపించతగినదిగా విధింపబడ్డ నీ నామం. అందువల్ల వైధమై, భోగ్యమైన అత్యంతవిలక్షణమైనదని భావం. లోకంలో శాస్త్రం విధించిన కార్యాలన్నీ భోగ్యాలుకావు, భోగ్యమైనవి అన్నీ శాస్త్రీయాలు కావు కదా! ఇది వైధం, భోగ్యం కూడా. హిత, ప్రియం కూడా. **"నణ్ణి త్తెన్‌కురుకూర్‌నమ్బి ఎన్టక్కాల్ అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కు"** అనే మధురకవి సూక్తి స్మరణీయం.

**(సంకీర్త్య)** - **"విసృజ్య లజ్జామ్"** అనే రీతిలో లజ్జను విడచి, కీర్తించి. ఈ భావం **"సమ్"** అనే ఉపసర్గద్వారా వ్యక్తమవుతున్నది. **"పాఱ్కడల్ శేర్న్ద పరమనై పయిలుమ్ తిరువుడైయార్"** అనేసూక్తి వరవరముని పరంగా అనుసంధేయం.

**(నృత్యన్)** - ఆ సంకీర్తనంవల్ల కల్గిన ఆనందపారవశ్యంచేత అంగాలను అన్నిటిని అటు ఇటు చలింపజేస్తూ- **"పయిలుమ్ శుడరొళి"** దశకం యొక్క భావం స్మరణీయం. **"కుమ్బిడు నట్టమిట్టాడి"** అనే శఠకోపసూక్తి భావ్యం.

**(త్వామ్)** - నిరతిశయ భోగ్యభూతులైన మిమ్మలను

**(అంతః కర్తుమ్ ఇచ్ఛతి)** - మనస్సులో ప్రత్యక్ష సమానాకారంగా నిలుపకొనగోరుతున్నాడు. ఆ విధంగా నిలుపుకోవచ్చుకదా! ఏమి అడ్డు? అంటే, ఇకపై సమాధానం పల్కుతున్నారు.

**(నాథ)** - స్వామీ!

**(నృశంసః)** - పరమక్రూరమైన - అని అర్థం. (**"నవాన్ శంసతి"** అనే వ్యుత్పత్తి వల్ల) ప్రాణిహింసను అకారణంగా చేసేవాడు నృశంసుడు.

**(మలినమతిభిః మూఢైః వాసః)** - అన్యథా జ్ఞానాన్ని కలవారు, స్వరూపజ్ఞానశూన్యులైన వారితో సహవాసం,

**(వాక్ ప్రవృత్తిం నిరుంధే)** - నా వాగ్వ్యాపారాన్ని అడ్డుకొంటున్నది. అందువల్ల ఆశపడినట్లు చేయలేకున్నాను.

**(దివ్యసస్యార్ధం నిద్రా హరతి)** - తమోగుణవశంచేత అన్ని ఇంద్రియాల వ్యాపారాలు నిలచిపోవడానికి కారణమైన సుషుప్తి. దినంలో సగ భాగాన్ని హరిస్తున్నది.

**(అన్యత్)** - నిద్ర కాకుండా వేఱయిన ఆహారాదులు. మిగిలిన సగాన్ని,

**(హరతి)** - హరిస్తున్నవి.

**"ఎప్పొ౹ుదుమ్ నాళ్ తిజ్గళ్ ఆణ్డూ౹ి యూ౹ి తొఱుమ్"** అనే రీతిలో ఎప్పటికప్పుడు ఎపుడు ఉచ్చరించినా **"అప్పొ౹ుదైక్కప్పొ౹ుదు ఎన్నారావముదమే"** అన్నట్లు నిత్యనూతనమైన అపర్యాప్తామృతంగా ఆస్వాదింప తగిన మీ తిరునామాన్ని సదా సంకీర్తనం చేయాలని, మిమ్ములను ధ్యానం చేయాలని నాకు తోస్తున్నది- కాని, ఆ రీతిలో చేయడానికి సాధ్యం కాలేదు. నిద్రకు, భోజనాదులకే దినం అంతా గడచిపోవడం వల్ల. ఆ కాలంలో శ్రమపడి అయినా కొని ఘడియలలో మీ నామసంకీర్తనం కోసం ప్రయత్నిస్తే, దేవరవారిని సాధారణ మానవులుగా భావించే దుష్టులతో, వారి గొప్పతనాన్ని ఏమీ తెలియని మూర్ఖులతో నాకు ఏర్పడ్డ సహవాసం దానికి అడ్డువస్తున్నది. అందువల్ల నాకు నిర్వేదం కలుగుతున్నది- అని అంటున్నారు కవి. **"అర్ధం నిద్రా హరతి"** అనడం ద్వారా తమ దోషాలవల్ల జ్ఞానానికి కలిగే అడ్డు, **"వాసో మూఢైః"** అనడం ద్వారా ఇతరుల దోషాలవల్ల కీర్తనానికి కలిగే అడ్డు చెప్పబడ్డాయి. **"వేదమాల్ పిరాయమ్ నూఱు మనిశర్తామ్ పుకువరేలుమ్, పాదియుమ్ ఉఱజ్గిప్పోకుమ్"** ఇత్యాది తిరుమాలై పాశురంలోని "భర్తృహరి నీతి శతకంలోని **"ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతమ్"** అనే శ్లోకంలోని పోకడలు గమనించదగినవి.

**41.** అవ :- తమ తిరునామసంకీర్తనం చేయలేకపోయినా, **"అనిద్ర స్సతతం రామః"** ఏదో రీతిలో శ్రమపడి కొన్ని క్షణాలు నేను మాత్రం తమను ధ్యానించి, సంతోషిస్తున్నా, ఆరీతిలో అయినా ఆనందించకుండా, తినడం, నిద్రపోవడమే జీవనయాత్రగా కాలం గడుపుతూ పలు రీతుల్లో తాపాలను అనుభవంచే లోకులను చూస్తే నా మనస్సు క్షోభిస్తున్నదని ఇందులో అంటున్నారు.

**అంతః ధ్యాయన్ వరవరమునే! యద్యపి త్వా మజస్రం**
**విశ్వం తాపై స్త్రిభి రభిహతం వీక్ష్య ముహ్యామ్యసహ్యామ్ ।**
**క్షుత్సంపాతక్షుభితమనసాం కోఽ హి మధ్యే బహూనాం**
**ఏకః స్వాదు స్వయ మనుభవన్నేతి చేతఃప్రసాదమ్ ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ !, అహం = దాసుడనైన నేను, త్వాం = పరమభోగ్యభూతులైన దేవరవారిని, అజస్రం = నిరంతరంగా, అంతః= మనస్సు లోపల, ధ్యాయన్ యద్యపి = ధ్యానించి ఆనందిస్తూ ఉన్నా, త్రిభిః తాపైః= మూడు విధాలైన తాపాలతో, అభిహతం = బాగా హింసింపబడిన (అందువల్ల), అసహ్యం =చూచి సహించలేని, విశ్వం = (ఈ) ప్రపంచాన్ని (లోకులను), వీక్ష్య = చూచి, ముహ్యామి = మోహాన్ని పొందుతున్నాను, తథా హి = అది యుక్తమే, కః= ఏ మానవుడు, ఏకః సన్ = ఒంటరిగా ఉన్నవాడై, క్షుత్ సంపాతక్షుభితమనసాం = తీరని ఆకలిచే కలత చెందిన మనస్సును కల్గిన, బహూనాం మధ్యే = పలువురి నడుమ, స్వాదు=భోగ్యమైన వస్తువును, స్వయం = తాను మాత్రం, అనుభవన్ = అనుభవిస్తూ, చేతఃప్రసాదం = మనః ప్రసాదాన్ని (ఆనందాన్ని), ఏతి = పొందుతున్నాడు. (పొందడం లేదని భావం.)

శ్రీవరవరమునీ ! దాసుడు పరమభోగ్యులైన తమను నిరంతరం మనస్సులో ధ్యానిస్తూ ఆనందిస్తున్నా, త్రివిధతాపాలతో హింసింపబడినది, అందువల్లనే చూచి సహించ సాధ్యం కానిది అయిన లోకాన్ని చూచి క్షోభిల్లుతున్నాను. ఇది యుక్తమే కదా. ఎవడైనా ఉపశమింపని ఆకలితో బాధపడే పలువురి నడుమలో ఉండి మధురపదార్థాన్ని అనుభవిస్తూ మనః ప్రసాదాన్ని (ఆనందాన్ని) పొందలేదు కదా !

**(అహం)** - నేను,

**(త్వామ్)** - పరమభోగ్యభూతులైన మిమ్ములను,

**(అజస్రమ్)** - సతతం,

**(అంతఃధ్యాయన్ యద్యపి)** - మనస్సులో ధ్యానిస్తూ ఉన్న మిమ్ములను స్మరించడం అనేది మిక్కిలి ప్రియమైనది, కనుక, స్వయంగా దేవరవారిని నా స్మృతిజ్ఞానానికి విషయంగా చేసికొంటూ ఉన్నా - అని అర్థం.

**(త్రిభిః తాపైః)** - ఆధ్యాత్మిక- ఆధిభౌతిక- ఆధిదైవికాలనే త్రివిధ తాపాలచేత,

**(అభిహతమ్)** - అంతటా పూర్తిగా హింసింపబడిన,

**(అసహ్యం విశ్వం వీక్ష్య)**- దుస్సహమై, అజ్ఞానావృతమైన ఈ లోకాన్ని చూచి,

**(ముహ్యామి)** - మూర్ఛ పోతున్నాను,

కః ఏకస్సన్ = ఎవడు ఒంటరిగా,

**(క్షుత్ సంపాతేన)** - ధారావాహికమైన ఆకలిచేత,

**(క్షుభితమనసామ్ మధ్యే)** - సహజదశను పొందని మనస్సును కల పలువురి మధ్య- అని అర్థం. **"క్షుభ- సంచలనే"** అని ధాతువు. సంచలనమంటే ప్రకృతి విపర్యాసమని చెప్పబడింది.

(స్వాదు స్వయమ్ అనుభవన్)- భోగ్యవస్తువును అనుభవిస్తూ,

(కో హి చేతఃప్రసాదమ్ ఏతి)- ఎవడు సంతోషిస్తాడు? "ఏకః స్వాదు న భుంజీత" అని కదా సూక్తి.

"వరవరమునిభృత్యైః అస్తు మే నిత్యయోగః" అని వరవరముని భృతుయలు అందఱితో కలసి శ్రీవరవరమునులను కైంకర్యాన్ని చేసి, ఆనందించాలనే గొప్పమనస్సు కల తమకు, తాము మాత్రం ఒంటరిగా శ్రీవరవరమునులను అనుభవించి ఆనందించే ఆనందం ఒక వస్తువుగా తోచ లేదు! లోకులు "ఉణ్డియే ఉడైయే" అన్నట్లు తిండి, నిద్రతో కాలక్షేపం చేస్తూ అల్లాడేవారుగా ఉన్నారే! "ఇవై యెన్న ఉలకియల్వై?" (తిరువాయ్-4-9) అనే నమ్మాళ్వార్ల వలె "ఇదేమి లోకరీతి!" అని తలచి కలత పడుతున్నారు, ఎఱుమ్బియప్పా. "ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్" అన్నట్లు ఊరువాడా అంతా తమవలె ఆనందించాలని కోరుకొనే మహానుభావులు కదా!

**42.** అవ :- "ఇతరులు పడే దుఃఖాన్ని చూచినపుడుకదా తమకు మోహం కలుగుతున్నది. ఆవిధంగా కలుగని రీతిలో అటువంటి ఇతరులు తమ కన్నులకు కన్పించకుండా ఉండాలి!'' అని అంటున్నారు.

**సత్త్వోదగ్రైః సకలభువనశ్లాఘనీయై శ్చరిత్రైః**
**త్రయ్యంతార్థప్రకటనపరైః సారగర్భై ర్వచోభిః ।**
**లోకోత్తీర్ణం వరవరమునే! లోకసామాన్యదృష్ట్యా**
**జానాన స్త్వాం కథమపి న మే జాయతా మక్షిగమ్యః ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, సత్త్వ+ఉదగ్రైః= (మోక్షహేతువైన జ్ఞానాన్ని కల్గించే) సత్త్వగుణంతో నిండినవి, సకల భువనశ్లాఘనీయైః = లోకులు అందఱిచే పొగడతగినవి అయిన, చరిత్రైః= నడవడికలచేత, త్రయ్యంతార్థప్రకటనపరైః = వేదాంతార్థాలను వ్యక్తం చేయగోరి, ఉచ్చరింపబడినవి, సారగర్భైః= "ఆచార్యుడే ఉపాయం, ఉపేయం'' అనే సారార్థాన్ని తమలో ఇముడ్చుకొన్నవి అయినవి, వచోభిః= శ్రీసూక్తులచేత, లోక+ఉత్తీర్ణం = లోకులను అతిక్రమించిన, త్వాం = దేవరవారిని, లోకసామాన్యదృష్ట్యా = సాధారణమానవుని చూచే చూపుతో, జానానః= చూచి, తెలిసికొనే మానవజంతువు (వంటి), మే = (ఇతరులు పడే బాధను చూచి బాధపడే) దాసుని, అక్షిగమ్యః= కంటికి లక్ష్యంగా, కథమపి= ఏరీతిలోను, న జాయతామ్ = కాకూడదు.

శ్రీవరవరమునీ ! మోక్షహేతువైన జ్ఞానాన్ని కలిగించే సత్త్వగుణాన్ని సంపూర్ణంగా కలిగినవి, లోకంలో ఉన్నవారు అందఱు కీర్తించదగినవి అయిన నడవడికలచేత, వేదాంతార్థాలను వ్యక్తం చేయడంకోసం చెప్పబడినవి, ఆచార్యుడే ఉపాయోపేయాలనే సారార్థాన్ని తమలో ఇముడ్చుకొన్నవి అయిన శ్రీసూక్తులచేత లోకంలోని వారికంటే విలక్షణులైన తమను సాధారణ మానవుడనే దృష్టితో చూచే మానవజంతువు (వంటివాడు) ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక బాధపడే నా కంటికి ఏ రీతిలోను కనపడకుండా ఉండాలి.

వ్యాఖ్యానమ్ : **(సత్త్వోదగ్రైః)**- మోక్షానికి హేతువైన తత్త్వజ్ఞానాన్ని కల్గించేది, భగవదేకనియతమైనది అయిన సత్త్వమనే గుణవిశేషంచేత నిండినవి- అని భావం. ఈ ప్రయోగంవల్ల స్ఫురించే సత్త్వగుణప్రాచుర్యం మిగిలిన గుణాల అల్పత్వానికి సూచకం.

**"సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్", "తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్"** అనే రీతిలో సత్త్వప్రాచుర్యం మోక్షహేతువు. **"సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** అని కదా సూక్తి.

**(సకలభువనశ్లాఘనీయైః)**- అందరిచేత పొగడదగినవి- అని అనడంవల్ల ఎవరైనా పొగడలేదంటే వారిలో ఇతరుల గుణాలను చూచి మెచ్చుకొనే గుణం లేకపోవడమే కారణం తప్ప, శ్రీవరవరమునులలోని గుణాభావంవల్ల కాదని స్ఫురిస్తున్నది.

**(చరిత్రైః)** - చరిత్రలచేత - అనే ఇచటి బహువచనంవల్ల - ఏవో ఒకటి రెండు దోషాలున్నా, వాటిని **"ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"** అని, **"తేజీయసాం న దోషాయ"** (తేజస్సును కలవారిలో ఏదో ఒక లోపం ఉన్నా, అది దోషం కాబోదు) - అనే సమాధానం కూడా చెప్పనవసరం లేదని భావం. అంతేకాక, ఏ చరిత్రను అయినా ఉల్లేఖించి, కల్పించి వర్ణించవలసిన అవసరం లేదని కూడా భావం.

**(త్రయ్యంతార్థప్రకటనపరైః)** - ఋగ్యజుస్సామాలనే మూడు వేదాల నిర్ణయరూపాలైన ఉపనిషత్తుల సారార్థాన్ని వ్యక్తం చేయడంలోనే దృష్టిని కల్గినవి.

**(సారగర్భైః)**- చరమపర్వనిష్ఠను తెలిపేవి. ఆచార్యుడే ఉపాయోపేయాలు అనే సారార్థాన్ని తమలో ఇముడ్చుకొన్నవి. ఇచట **"చరిత్రైః వచోభి శ్చ"** అని అంటూ సముచ్చయార్థకమైన చకారాన్ని ప్రయోగించకపోవడంవల్ల ఈ రెండిటిలో ఏ ఒక్కటి అయినా తరింపజేయడానికి చాలుననే తాత్పర్యం స్ఫురిస్తుంది.

**(వచోభిః)**- శ్రీసూక్తులతో- అని అర్థం. ఇక్కడ సముచ్చాయకమైన చకారం ప్రయోగింపబడనందున ఒక సూక్తి అర్థ పూర్తికోసం ఇంకొక సూక్తిని అపేక్షించని పూర్తిని కల్గినదని సూచింపబడింది. **"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి"** అనే రీతిలో మహానుభావులు పలికే సూక్తులు సారగర్భాలై ఉంటాయి.

**(లోకోత్తీర్ణం త్వామ్)** - పూర్వం చెప్పబడ్డ చరిత్రలచేత, శ్రీసూక్తులచేత లోకంలోని అందరికంటె విలక్షణులై భాసించే దేవరవారిని - అని భావం. ఈ విధమై చరిత్రలు కాని, సూక్తులు కాని నాన్యతో దర్శనీయాలని సారం.

**(లోకసామాన్యదృష్ట్యా జానానః)** - సాధారణమానవులని భావించే నరపశువు - అని అర్థం. **"అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్"** అనే రీతిలో అన్యథా గ్రహించేవారని భావం. **"తత్తమిత్తైయిన్ వడివెన్రు తాళ్గిరైయై వైత్తవరై వణజ్గియరా ప్పిత్తరాయ్ నిన్దిప్పార్క్కుణ్డు ఏఱా నీణిరయమ్"**

(తన శ్రీచరణాలను శిష్యుల శిరస్సులపై పెట్టి అనుగ్రహించిన సదాచార్యుని తాము అర్చించే దైవం యొక్క రూపంగా భావించని ఉన్మత్తులై దూషించే వారికి గొప్ప నరకం కల్గుతుంది'' అని జ్ఞానసారంలో అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ పల్కిన సూక్తి భావ్యం. **"యథాదేవే తథా గురౌ"** అనికదా శ్రుతిసూక్తి.

**(మే అక్షిగమ్యః)** - ఇచటి **"మే"** అనే సర్వనామానికి -ఇతరుల దుఃఖాన్ని చూచి బాధపడే స్వభావాన్ని కల నాకు- అని భావం. నాకంటికి ఏరీతిలోను ఏమాత్రం కూడా కనపడకుండా ఉండాలి - అని తాత్పర్యం.

సదనుష్ఠానాలతో, సదుపదేశాలతో ఉభయవిభూతులలో ఉన్నవారికంటే అతివిలక్షణులై ఉండే శ్రీవరవరమునులను సాధారణమానవులని తలచే అల్పులను చూస్తే- అంటే- దారిని తప్పి చెడ్డ మార్గంలో నడిచేవారిని చూస్తే- శ్రీవరవరమునులను యథాతథంగా భావించి ఆనందించే తమ ఆనందం లెక్కలోకి రానందువల్ల, తమ మనస్సు కలతపడుతున్నదని, ఆ రీతిలో కలతపడకుండా ఉండడంకోసం అటువంటివారు తమ కంటికి కనుపించకుండా ఉండేటట్లు అనుగ్రహించాలని శ్రీవరవరమునులను ఎఱుమ్బియప్పా ప్రార్థించారు.

**43.** అవ :- గత శ్లోకంలో, ఏదో విధంగా శ్రీవరవరమునుల గుణాలను స్మరించడం ద్వారా ప్రాణధారణను చేయడం సాధ్యం- అని పల్కిన కవి, "గుణస్మరణచేత ప్రాణధారణ చేయవచ్చును'' - అని ఇతడు తలుస్తాడు కనుక, "ఇంకా కొన్నాళ్ళు వీడు ఈ రీతిలోనే ఉండిపోనీ! తరువాత ఇతనిని అనుగ్రహించవచ్చు.'' అని తలచి, శ్రీవరవరమునులు తమను ఆలస్యం చేయవచ్చునని భావించి, "తమతో సమాగమాన్ని దాసునకు అనుగ్రహించాలి స్వామీ!'' అని అంటున్నారు.

**కల్యాణైకప్రవణమనసం కల్మషోపప్లుతానాం**
**క్షాంతిస్థేమద్రఢిమ సమతాశీలవాత్సల్యసింధో! ।**
**త్వామేవాయం వరవరమునే! చింతయన్నీప్సతి త్వాం**
**ఆర్తం శ్రీమన్! కృపణమపి మా మర్హసి త్రాతు మేవ ॥**

శ్రీమన్ = శ్రీవైష్ణవ సంపదను మిక్కిలిగా కల్గిన, క్షాంతిస్థేమద్రఢిమ సమతాశీలవాత్సల్యసింధో = దోషాలను సహించే గుణమైన క్షమాగుణం, ఆశ్రిత రక్షణంలో స్థిరసంకల్పమనే స్థేమగుణం, అందులోని సామర్థ్యమనే ద్రఢిమగుణం, ఆశ్రితుల విషయంలో భేదాన్ని చూడకపోవడమనే సమతాగుణం, చాలా చిన్నవారితో కూడా ఏ తేడా లేకుండా కలసిపోవడమనే శీలగుణం, ఆశ్రితుల దోషాలను భోగ్యంగా గ్రహించడమనే వాత్సల్యగుణం- అనే వీటికి సముద్రంవలె ఏనాడూ ఎండిపోని ఆశ్రయమైన, వరవరమునే!= ఓ మణవాళమహామునీ!, అయం జనః= ఈ మానవుడు (నేను), కల్మష+ ఉపప్లుతానాం = అజ్ఞానాది దోషాలతో పీడింపబడినవారి విషయంలో, కల్యాణ+ఏక+ ప్రవణమనసం = మోక్షాన్ని అనుగ్రహించడంలోనే చాలా ఆశను కల్గిన మనస్సును కల, త్వామేవ = పరమభోగ్యభూతులైన దేవరవారినే, చింతయన్= నిరంతరం ధ్యానిస్తూ ఉండేవాడై, త్వాం = దేవరవారిని పొందగోరుతున్నాడు, కృపణం = ఉపాయాంతరాలలో అన్వయాన్ని పొందడానికి యోగ్యత లేనివాడను, ఆర్తం = చాలా దూరంలో ఉండడమనే అధికమైన

దుఃఖాన్ని కలవాడనైన, మామపి = దాసుడనైన నన్నుకూడా, త్రాతుమేవ = దేవరవారి తిరుమేని సేవను అనుగ్రహించి రక్షించడానికే, అర్హసి = (మీరు) తగి ఉన్నారు.

శ్రీవైష్ణవసంపదను నిండుగా కల శ్రీవరవరమునీ! తప్పులను క్షమించే క్షమ, ఆశ్రితరక్షణలోని స్థిరసంకల్పం, అందులోని సామర్థ్యం, ఆశ్రితుల విషయంలో భేదం లేకుండా ఉండడం, చాలా తక్కువ వారితో సైతం ఏ తేడా లేకుండా కలసి ఉండడం, ఆశ్రితుల దోషాలను భోగ్యాలుగా గ్రహించడం - అనే ఈ గుణాలకు ఎండిపోని సముద్రంవంటి స్వామీ! దాసుడు, అజ్ఞానాది దోషాలతో పీడింపబడేవారికి మోక్షాన్ని అనుగ్రహించడంలోనే ఆసక్తిని కల మిమ్ములనే భావిస్తూ తమనే పొందగోరుతున్నాను. ఉపాయాంతరాలను అనుష్ఠించడానికి ఏమాత్రం యోగ్యత లేనివాడను, మీకు చాలా దూరంలో ఉండడమనే దుఃఖాన్ని కల్గి ఉన్నవాడనైన, అయిన నాకు మీ దివ్యమంగళవిగ్రహసేవాభాగ్యాన్ని కల్గించి, నన్ను రక్షించగల శక్తి మీకు ఉన్నది.

**వ్యాఖ్యానమ్ : (శ్రీమన్)** - శ్రీవైష్ణవ సంపదకు నిధీ! - అని కాని, లేక, కృపణులను రక్షించడానికి ఉపయోగపడే గుణసంపదకు నిధీ! - అని కాని భావం.

**(క్షాంతి... సింధో !)**

**(క్షాంతి)-** శిక్షించవలసినవారి విషయంలో సహనం కల్గి ఉండడం. ఇదే క్షమ (ఓర్పు)

**(స్థేమ)** - స్థిరత్వం -అని భావం. ఇక్కడ, ఈపదం పరతంత్రశేషిత్వ ప్రయుక్తమైన మిక్కిలి స్థిరమైన చేతన సంరక్షణ సంకల్పాన్ని కల్గి ఉండే స్థితిని సూచిస్తుంది.

**(ద్రఢిమా)** - ప్రణత ప్రాణిజాతాన్ని (ఆశ్రయించిన వారిని) రక్షించడంలో, భరించడంలో, ధరించడంలో సామర్థ్యాన్ని కల్గి ఉండడం. **"ధృఢః స్థూలబలయోః"** అని నిఘంటువచనం.

**(సమతా)** - ఆశ్రితుల విషయంలో ఏతేడా చూపించకుండా ప్రవర్తించడం.

**(శీల)** - గొప్పవాడు చిన్నవారితో ఏతేడా లేకుండా కలసి మెలసి ఉండడం.

**(వాత్సల్య)** - వాత్సల్యమంటే దోషభోగ్యత్వం. క్షాంతిశబ్దం ద్వారా తన విషయంలో, తనకు సంబంధించినవారి విషయంలో చేసిన అవమానాదులను సహించడాన్ని, వాత్సల్యపదంచేత అనాదికాల ప్రవృత్త- అకృత్యకరణాది దోషాలను భోగ్యాలుగా గ్రహించడాన్ని అర్థం చేసికోవాలి.

**"సింధో"**- (సముద్రమా!) అనే రూపణం ద్వారా పుర్వోక్తగుణాలకు ఏనాడు క్షీణత లేని ఆశ్రయం- నీటికి ఏనాడూ క్షీణత లేని ఆశ్రయం సముద్రం అయినట్లుగా - అనే విశేషార్థం స్ఫురిస్తుంది. పరరూపంలో జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజస్సులనే ఆఱు గుణాలు, విభవరూపంలో **"ఆనృశంస్య మనుక్రోశః శ్రుతం శీలం దమః శమః, షడ్గుణా శ్శోభయంత్యేనం రాఘవం పురుషర్షభమ్"** అనే రీతిలో చెప్పబడ్డ ఆఱు గుణాలు ప్రధానాలు అయినట్లే, అర్చావతారంలోకూడా శ్లోకంలో నిర్దేశింపబడ్డ క్షాంత్యాది గుణాలు ఆఱు ప్రధానాలు- అనే ఉద్దేశ్యంతో చివరలో **"ఆది"** శబ్దాన్ని ప్రయోగించలేదు - అని వాధూల వీరరాఘవా

చార్యస్వామివారి వ్యాఖ్య. ఇవన్నీ ఆశ్రయణ సౌకర్యాపాదకగుణాలు. అంటే - ఆశ్రయించడంలో సౌకర్యాన్ని కల్గించే కల్యాణగుణాలు. **"సమతా"** అనేగుణాలతో పాటు **"ప్రాప్తి, పూర్తి"** అనేవి కూడా సందర్భానుగుణంగా గ్రహించతగినవి.

**(అయమ్)-** ఇతడు (నేను),

**(కల్మషోపప్లుతానామ్)-** అనాదికాలంగా అనువృత్తం అవుతున్న (వెంబడిస్తున్న) అవిద్యాది దోషాలచేత పీడితులైన -అని భావం. ఇది శేషే షష్ఠీ ప్రయోగం.

**(కల్యాణైకప్రవణమనసమ్)-** పరనిశ్శ్రేయసంలో మాత్రమే- అనగా- మోక్షప్రదానంలో మాత్రమే మనస్సును కల్గినవారైన- అని భావం. అంతే తప్ప, పరమాత్మవలె పాపానుగుణంగా ఫలాన్ని ప్రసాదించరు- అని అర్థం. **"కేవల కల్యాణనిరతహృదయమ్ ఇత్యర్థః"** అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. **"భూతానామేవ చరితం దుఃఖాయ సుఖాయ చ, సుఖాయైవ తు భూతానాం త్వాదృశా మచ్యుతాత్మనామ్"** అనే రీతిలో భగవానుడు బంధమోక్షసాధారణుడు. ఆచార్యులవల్ల మాత్రం కేవలం మోక్షసిద్ధి కల్గుతుంది- అనే విషయం సూచింపబడింది. **"ప్రవణ", "కల్మష"** పదాలను ప్రయోగించడంవల్ల అత్యంతం పీడింపబడ్డ చేతనుల దుర్గతిని చూచి, శ్రీవరవరమునులు స్వయంగానే తాము వారిని ప్రార్థించి, వారికి కల్యాణాన్ని అనుగ్రహిస్తారని సూచింపబడింది. **"వన-సంభక్తౌ"** అనే ధాతువునుండి ప్రవణశబ్దం ఉత్పన్నమైనది. సంభక్తి అంటే-ప్రార్థన. **"అర్థికల్పకమ్"** అనే స్తోత్రరత్నసూక్తిని శ్రీదేశికులు **"స్వయమర్థినః కల్పయతీత్యర్థః"** అని వివరించారు. ఇటువంటి భావం శ్రీవరవరముని పరంగా ప్రవణశబ్దప్రయోగం ద్వారా ఇక్కడ అనుసంధింపబడింది - అని చెప్పవచ్చు.

**(త్వామేవ) -** పరమభోగ్యులైన మిమ్ములను - అని అర్థం. ఇక్కడి ఏవకారం చేత ప్రథమపర్వ-మధ్యమపర్వరూప పర్వాంతరవ్యావృత్తి.

**(చింతయన్) -** నిత్యం ధ్యానిస్తూ -అని అర్థం. **"స్వప్నేஉపి యద్యహం వీరం రాఘవం సహ లక్ష్మణమ్, పశ్యేయం నావసీదేయమ్"** అనే రీతిలో సర్వదా ప్రార్థిస్తూ- అని భావం. **"యజ్ఞేన దానేన... వివిదిషంతి"** ఇత్యాది వాక్యంలో యజ్ఞాదులకు **"అశ్వేన జిగమిషతి"** ఇత్యాది వాక్యాల్లోవలె వేదనహేతుత్వం అంగీకరింపబడినా, సిద్ధోపాయ నిష్ఠునకు వేఱొక సాధనం అవసరం లేదు కాబట్టి, చింతనానికి ఆప్తిహేతుత్వం చెప్పనక్కఱలేదు. అందువల్లనే శ్లోకంలో **"కృపణమ్"** అనే విశేషణం ప్రయోగింపబడింది. ఆ విషయాన్నే తరువాత తెల్పుతున్నారు.

**(కృపణమ్) -** ఉపాయాంతర ప్రవృత్తిలో అర్హత లేనివాడను. **"కార్పణ్యేనాప్యుపాయానాం వినివృత్తిరిహేష్యతే"** అనే సూక్తి స్మరణీయం.

**(ఆర్తమ్) -** నీకు దూరంగా ఉండడమనే గొప్ప దుఃఖాన్ని కలవాడను.

**(మామ్ అపి) -** నన్నుకూడ -అని భావం. **"అపి"** శబ్దప్రయోగంవల్ల శ్రీవరవరమునులచేత పలువురు ఉద్ధరింపబడ్డారనే అర్థం స్ఫురిస్తుంది.

**(త్రాతుమేవార్హసి)** - తమ దివ్యమంగళవిగ్రహదర్శనాన్ని ప్రసాదించడంద్వారా నన్ను రక్షించదగినవారై ఉన్నారు. రక్షణమంటే నిష్టనివృత్తిపూర్వక ఇష్టప్రాపణమే కదా! ఇక్కడ అనిష్టం శ్రీవరవరమునుల విశ్లేషం, ఇష్టం వారి దర్శన కైంకర్యాదులు. కేవలం మీగుణాలను చింతింపజేయడంతో ఆగకుండా, మీదర్శన భాగ్యాన్ని కూడా ప్రసాదించి రక్షించాలి. **"పరిత్రాణాయ సాధూనామ్"** అనే గీతావాక్యంలో **"పరిత్రాణ"** శబ్దానికి భగవద్రామానుజులు తమ భాష్యంలో - **"మద్దర్శనాదృతే స్వాత్మధారణపోషణాదిక మలభమానాః క్షణమాత్రకాలం కల్పసహస్రం మన్వానాః ప్రశిథిలసర్వగాత్రాః భవేయురితి మత్స్వరూపచేష్టితావలోక నాలాపాదిదానేన తేషాం పరిత్రాణాయ"** అని వివరించిన అర్థం ఇక్కడ కూడా అర్థాత్ చరమపర్వాత్మకంగా భాసిస్తుంది.

"ఈశ్లోకాన్ని శ్రీవరవరముని విషయంలోని ద్వయంగా భావించవచ్చు. ద్వయమంత్రంలోని పూర్వవాక్యాన్ని **"శ్రీమన్! నారాయణ"** ఇత్యాదిగా సంబోధనాంతంగా గ్రహించే క్రమం ఉన్నది. శరణాగతిగద్యలో భగవద్రామానుజుల అనుసంధానం సంబోధనాంతంగా ఉండడాన్ని గమనించవచ్చు. ఆ రీతిలోనే ఇక్కడకూడా **"శ్రీమన్"** అనే సంబోధన ప్రయోగింపబడింది. ప్రస్తుతం శ్లోకంలోని **"క్షాంతిస్థేమ... సింధో", "వరవరమునే!"** అనే రెండు సంబోధనలద్వారా నారాయణపదార్థం తెలుపబడింది. **"కల్యాణైకప్రవణ మనసం త్వాం చింతయన్", "త్రాతుమర్హసి"** అనే ప్రయోగాలద్వారా ద్వయంలోని **"శరణం ప్రపద్యే"** అనే రెండు పదాల అర్థం అనుసంధింపబడింది. **"ఈప్సతి"** అనే ఆప్ల్ ధాతువునుండి పుట్టిన సన్నంతక్రియ ద్వారా నారాయణపదంలోని చతుర్థీవిభక్త్యర్థం తెలుపబడింది. ఏవకారం ద్వారా నమశ్శబ్దార్థం చెప్పబడింది" అనే ఈ వివరణం శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్యలో తెలుపబడింది.

**44.** అవ :- పూర్వశ్లోకంలో తమను కృపణులుగా - అంటే - ఉపాయాంతర ప్రవృత్తికి యోగ్యత లేని వారినిగా నిర్దేశించిన ఎఱుమ్బియప్పా, దానికి కారణం అయిన తమ దోషాలను ఇందులో ప్రస్తావించి, వాటిని వివరిస్తున్నారు.

**దోషైకాంతీ దురితజలధి ర్దేశికో దుర్మతీనాం**
**మూఢో జంతుః ధ్రువ మయ మితి శ్రీమతా మోచనీయః ।**
**పాదాయుగ్మం భవదనుచరై రర్పితం భక్తినమ్రే**
**మౌలౌ కృత్వా వరవరమునే! వర్తతాం తత్ర ధన్యః ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, శ్రీమతా = కరుణా సంపదను మిక్కిలిగా కల్గిన దేవరవారిచే, అయం జంతుః= ఈ మానవుడు (నేను), దోష+ఏకాంతీ = అకృత్యకరణ - కృత్యాకరణాది దోషాలను నియతంగా కల్గినవాడు, దురిత = పూర్వజన్మలో చేసిన పాపాలకు, జలధిః= సముద్రంవంటివాడు, దుర్మతీనాం = అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానాలను కలవారికి, దేశికః= ఆచార్యుడు, మూఢః= జ్ఞానహీనుడు, ధ్రువం =ఇది నిశ్చయం, ఇతి = అని భావించి, మోచనీయః= ఈ దోషాలనుండి విడిపింపదగినవాడు, భవత్+అనుచరైః= పరమకారుణికులైన దేవరవారి శిష్యులచే, అర్పితం = ప్రసాదింపబడిన, పాదాయుగ్మం=

దేవరవారి పాదుకల జంటను, భక్తినమ్రే = భక్తిచే నమస్కరించిన, మౌళౌ కృత్వా = (నా) శిరస్సులో ధరించి, ధన్యః సన్ = సంపదను కలవాడనై, తత్ర = అక్కడ, దేవరవారి సన్నిధిలో, వర్తతాం = (నేను) ఉండాలి.

శ్రీవరవరమునీ! కరుణాసంపద నిండుగా ఉన్న తమరు, "ఈ దాసుడు అకృత్యకరణ - కృత్యాకరణాది దోషాలను నియతంగా కలవాడు, పూర్వజన్మలో చేసిన పాపాలకు సముద్రంవంటివాడు, అన్యథాజ్ఞాన - విపరీతజ్ఞానాదులను కలవారికి ఆచార్యుడు, జ్ఞానహీనుడు - అనే విషయం నిశ్చయం.'' అని భావించి, ఈ దోషాలనుండి నన్ను విముక్తుణ్ణి చేయాలి. పరమకారుణికులైన తమ శిష్యులచే ప్రసాదింపబడిన తమ పాదుకల జంటను భక్తితో వంచిన శిరస్సుపై దాల్చి, ధన్యుడనై, తమ సన్నిధిలోనే నేను ఉండేటట్లు నన్ను అనుమతించండి.

వ్యాఖ్యానమ్ : **(శ్రీమతా) - "పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!, కార్యం కరుణ మార్యేణ న కశ్చిపరాధ్యతి"** అని నిర్వచింపబడ్డ కరుణాగుణ విశేషవశంచేత కరుణాగుణసంపదతో పూర్ణంగా ఉన్న మీచే - అని సందర్భానుగుణమైన తాత్పర్యం. ఆశ్రితరక్షణలో కరుణాగుణానికే కదా ప్రాథమ్యం. **"దేవీ లక్ష్మీర్భవసి దయయా"** అని పూర్వం 14వ శ్లోకంలో లక్ష్మీదేవియొక్క విశిష్టాధిష్ఠానం వరవరమునిలో ఉన్నదని తెలుపబడింది.

**(అయం జంతుః)** - ఈ జంతువు. ఏవిధమైన గుణాన్ని లేని నేను - అని భావం.

**(దోషైకాంతీ)** - అకృత్యకరణ - కృత్యాకరణాది దోషాలను కలవాడను.

**(దురితజలధిః)** - జన్మాంతరాలలో చేసిన పాపాలకు సముద్రంవంటివాడను.

**(దుర్మతీనామ్)** - అన్యథాజ్ఞాన - విపరీతజ్ఞానాలను కలవారికి,

**(దేశికః)** - మార్గదర్శి దారి చూపేవాడను. వారికి కూడా తెలియని పాపమార్గాలను చూపేవాడను.

**(ఇతి)** - అని పూర్వోక్తహేతువులచేత- అని భావం.

**(మోచనీయః)** - దోషాలనుండి విడిపింపబడదగినవాడను.

ఇక పూర్వశ్లోకంలో **"ఈప్సతి"** అని గడచిన శ్లోకం సూక్ష్మంగా చెప్పిన విషయాన్ని ఈ శ్లోకంలో **"పాదూయుగ్మమ్"** అని ఆరంభించి పలు శ్లోకాలలో వివరిస్తున్నారు. పొందగోరిన ప్రాప్తి ఏది? అని అంటే- తమ పరిచర్యద్వారా సంతోషించిన శ్రీవరవరమునిరూపప్రాప్యానికి అనుకూలవ్యాపారరూపమైన సర్వవిధకైంకర్యమే. అంటే- **"సకృత్సేవయా నిత్యసేవాఫలమ్"** అని, **"ఒన్టు నూఱాయిరమాక పిన్నుమ్ ఆళుమ్ శెయ్‌వన్"** అని నిరవధిక ఉత్తరోత్తరాభివృద్ధ కైంకర్యమే.

**(భవదనుచరైః)** - పరమకారుణికులైన దేవరవారి అనుచరులచే - అని అర్థం. **"అనుసంచరన్ ఛాయా వా"** అని చెప్పబడ్డ రీతిలో మిమ్ములను నీడవలె **"నిழలుమ్ అడితా యిఱుమ్ ఆనోమ్"**

అన్నట్లు ఎల్లప్పుడూ అనుసరిస్తూ సేవచేస్తూ వెంట ఉండే, పారతంత్ర్యరసజ్ఞులైన మహానుభావులచేత - అని తాత్పర్యం. **"ఛాయా వా సత్త్వమనుగచ్ఛేత్"** అనే చోట **"వా"** అనే పదం ఇవార్థకం.

**(అర్పితమ్)- "అస్మాభిః తుల్యో భవతు"** అని అంటూ సుగ్రీవుడు విభీషణుని తీసికొనివచ్చి శ్రీరామునిసన్నిధిలో సమర్పించిన రీతిలో, ఉదారులైనవారిచే అర్పింపబడిన - అని అర్థం. పరసమృద్ధి - అనగా - పరమాత్మ మంగళాశాసనార్థం ఇంకొక ఆత్మ లభిస్తున్నది కదా - అనే ఒక్క ప్రయోజనాన్ని మాత్రం దృష్టిలో పెట్టుకొని అర్పించిన - అని హృదయం. **"ఆత్మలాభాత్ పరం కించిదన్యన్నాస్తి"** అనే పూర్వదిన చర్యాస్తోత్రంలోని ఈ కవి సూక్తి భావ్యం.

**(పాదుయుగ్మం)** - పాదుకల జంటను,

**(భక్తినమ్రే)** - ప్రీతిప్రకర్షచేత, వినయంచేత వంచిన,

**(మౌళౌ కృత్వా)** - (నా) శిరస్సుపై ధరించి,

**(ధన్యః సన్) - "ధనం మదీయం తవ పాదపంకజమ్"** అనే రీతిలో పాదుకారూపమైన నిరతిశయ ధనలాభాన్ని పొందినవాడనై- అని హార్దభావం. వరదనారాయణ గురువరుల రూపంలోని **"గురురేవ పరం ధనమ్"** అని చెప్పబడ్డ ధనాన్ని పొందినవాడనై - అని కూడా భావం.

**(వర్తతామ్)-** ఆత్మయాత్రారూపమైన వృత్తిని పొందాలి

తాము ఉపాయాంతరాలను అనుష్ఠించి శ్రీవరవరమునులను చేరలేని రీతిలో దోషాలను మెండుగా చేసినందువల్ల తమకు వేఱు గతి లేకుండా పోయిందని, శ్రీవరవరమునులు వారి మనస్సులో భావించి, తమను నేరుగా పిలిపించి, సేవను అనుగ్రహించి, ఆశ్రయించేటట్లు చేసి, దోషాలను నిర్మూలించి, పాదుకలను శిరస్సులో ఉంచి, వారి పరిసరంలోనే ఉండేటట్లు చేసి, తమను ఆనందింపజేయాలని ఎఱుమ్బియప్పా ఈ శ్లోకం ద్వారా ప్రార్థించినట్లయింది.

గతశ్లోకంలో **"త్వామేవోపాయం వరవరమునే! చింతయన్నీప్సతి"** అని అంటూ వరవరమునుల దగ్గరకు నేరుగా వెళ్ళి ప్రాప్తిని పొందాలని ఆశపడ్డారు. ఆ ప్రాప్తి ఏమంటే- వరవరమునులు సంతోషించే రీతిలో సర్వవిధకైంకర్యాలను చేయడమే. ఆ కైంకర్యవివరాన్ని ఈ శ్లోకంతో **"పాదుయుగ్మమ్"** అని ప్రారంభించి, పలు శ్లోకాలతో తెలిపారు.

**45.** అవ :- ఈశ్లోకంనుండి వరుసగా ఏడు శ్లోకాలలో కవి శ్రీవరవరమునులు ప్రాతఃకాలంలో నిద్రలేవడంనుండి రాత్రి పరుండేవరకు వారు చేసే చర్యలలో కొన్ని ముఖ్యచర్యలలో తాము అన్వయించి, అనుభవించి, యథోచితకైంకర్యాన్ని చేయాలని ఆశపడుతున్నారు. **"పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః"** అనే శ్రుతి, **"త్వక్చ దృక్చ నిపిపాసతి"** అనే కూరేశుల సూక్తి, దానికి మూలమైన తిరువాయ్మొழి లోని **"ముడియానే" (3-7)** అనే దశక ప్రమేయం, **"గాత్రైః శోకాభికర్శితైః"** అనే శ్రీరామాయణ సూక్త్యర్థం సూక్తి అనుసంధేయాలు. అవి చరమపర్వనిష్ఠాపరంగా అనుసంధింపబడ్డాయి.

**నిత్యం నిద్రావిగమసమయే నిర్విశంకై రనేకైః**
**త్వన్నామైవ శ్రుతిసుమధురం గీయమానం త్వదీయైః।**
**ప్రాయ స్తేషాం ప్రపదనపరో నిర్భర స్త్వత్ప్రియాణాం**
**పాదాంభోజే వరవరమునే! పాతు మిచ్ఛామ్యహం తే ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అహం = దాసుడనైన నేను, నిర్విశంకైః అనేకైః త్వదీయైః= స్వరూప-ఉపాయ- పురుషార్థాలలో ఏవిధమైన సందేహం లేని, దేవరవారి పలువురు శిష్యులచే, తే= దేవరవారి, నిద్రావిగమసమయే = నిద్రనుండి మేల్కొన్న సమయంలో, గీయమానం = పాడబడుతున్న, శ్రుతిసుమధురం = చెవులకు ఇంపైన, త్వత్ నామైవ = దేవరవారి తిరునామాన్నే, తేషాం = ఆ విధంగా గానం చేసే, త్వత్ప్రియాణాం = దేవరవారి ప్రియశిష్యులయొక్క, పాదాంభోజే = శ్రీచరణపద్మాలలో, ప్రాయః= అధికంగా, ప్రపదనపరః సన్ = నమస్కరించడంలో ఊనికను కలవాడనై, నిర్భరః సన్ = పానం చేయడానికి వేఱొక విషయాన్ని వెదుకవలసిన ఆవశ్యకత లేనివాడనై, పాతుమ్ ఇచ్ఛామి = చెవులతో పానం చేయగోరుతున్నాను.

శ్రీవరవరమునీ!, దాసుడనైన నేను, స్వరూప-ఉపాయ-పురుషార్థాలలో ఏవిధమైన సందేహం లేని దేవరవారు పలువురి శిష్యులతో కలసి ఉండి, తమరు నిద్రనుండి లేచే సమయంలో గానం చేయబడే, శ్రుతిసుభగం అయిన తమ తిరునామాన్నే, గానం చేసే తమ ప్రియశిష్యుల పాదపద్మాలలో మాటిమాటికి నమస్కరించడంలో ఆసక్తిని కలవాడనై, వేఱుదేనినీ గ్రహించడంలో ఆసక్తి లేనివాడనై, వారి గానాన్ని చెవులతో పానం చేయాలని ఆశపడుతున్నాను.

వ్యాఖ్యానమ్ : **(అహమ్)** - దాసుడనైన నేను,

**(నిర్విశంకైః)** - స్వరూప-ఉపాయ-పురుషార్థాది విషయాలలో ఏ సందేహం లేని,

**(అనేకైః త్వదీయైః)** - దేవరవారి శిష్యులు అనేకులచే,

**(తే నిద్రావిగమసమయే)** - తమ ప్రబోధసమయంలో,

**(గీయమానం)** - శ్రుతిమధురంగా, రాగయుక్తంగా పాడబడే.

**(శ్రుతిసుమధురమ్)** - గానం చేయబడకపోయినా మధురమైనది- అని భావం. 'సు' అనే పదం ద్వారా భగవన్నామంకంటె శ్రీవరవరముని నామనికి గల వ్యావృత్తి సూచింపబడింది.

**(త్వన్నామైవ)** - ఈ ప్రయోగం **"పాతు మిచ్ఛామి"** అనే ప్రయోగంతో అన్వయిస్తుంది. దేవరవారి తిరునామాన్నే,

**(త్వత్ప్రియాణామ్)** - దేవరవారి విషయంలో గొప్ప ప్రీతిని కలవారి,

**(పాదాంభోజే)** - పాదపద్మాల జంటలో,

**(ప్రాయః)** - అధికంగా,

**(ప్రపదనపరః సన్)** - తమ దివ్యనామాన్ని మధురంగా గానం చేసినవారి విషయంలో గల కృతజ్ఞతా భావనవల్ల వారి కాళ్ళపై పడుతూ - అని భావం.

**(నిర్భరస్సన్ పాతు మిచ్ఛామి)** - పేయాన్ని - పానం చేయవలసిన విషయాన్ని - అన్వేషించే భారాన్ని లేనివాడనై పానం చేయగోరుతున్నాను.

శ్రీవరవరమునుల సుప్రభాతస్తోత్రాన్ని అనుసంధిస్తున్నపుడు, ఆ స్తోత్రంలో ఉచ్చరింపబడే వారి తిరునామాల అనుసంధానాన్ని ఆశతో వినడంకూడా కైంకర్యంలోకే చేరుతుంది. కాబట్టి దాన్ని ఆశపడినట్లయింది. శిష్యుల శ్రీపాదాలలో నమస్కరించడం- వరవరమునుల తిరునామాన్ని వారి శిష్యులు కర్ణమధురంగా పాడడంలోని కృతజ్ఞతవల్ల.

**46.** అవ :- శ్రీవరవరమునులు ప్రాతఃకాలిక అనుష్ఠానాలను, దేవతారాధనను ముగించుకొని, కాలక్షేపాన్ని అనుగ్రహించడంకోసం గోష్ఠిలోకి వేంచేసే సమయంలో ఆ గోష్ఠికి సమీపంలో ఉండి సేవించాలి- అని అంటున్నారు.

**అంతః స్వాంతం కమపి మధురం మంత్ర మావర్తయంతీం**
**ఉద్యద్బాష్పస్తిమితనయనా ముజ్ఝితాశేషవృత్తిమ్ ।**
**వ్యాఖ్యాగర్భం వరవరమునే! త్వన్ముఖం వీక్షమాణాం**
**కోణే లీనః క్వచిదణు రసౌ సంపదం తా ముపాస్తామ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, వ్యాఖ్యాగర్భం = ఉభయవేదాంతరహస్యార్థాల వివరణాలను అంతర్భవించుకొన్న, త్వత్ముఖం = దేవరవారి మోవిని, (ముఖాన్ని), వీక్షమాణాం = చక్కగా సేవిస్తున్నది, అంతః స్వాంతం = మనస్సులోపల, మధురం = తీయనిది, కమపి = లోక విలక్షణమైనది అయిన, మంత్రం = **"జయ విజయీ భవ"** అనే అర్థాన్ని ఇచ్చే దేవరవారిని గూర్చిన మంత్రాన్ని, ఆవర్తయంతీమ్= పలుమార్లు ఆవృత్తిని చేస్తూ ఉన్నది, ఉద్యత్ బాష్పస్తిమితనయనాం = పెల్లుబికే ఆనందబాష్పాలతో చల్లని నేత్రాలను కల్గినది, ఉజ్ఝిత+అశేషవృత్తిం = మఱచి విడచి పెట్టిన మిగిలిన అన్ని కనులను కల్గినది అయిన, తాం సంసదమ్ = పురుషశ్రేష్ఠులు పలువురు వేంచేసి ఉండే, ప్రసిద్ధమైన సభను (గోష్ఠిని దరిచేరి), అసౌ అణుః= ఈ పరమాణువు (దాసుడనైన నేను), క్వచిత్ కోణే = ఎక్కడో ఒక మూల, లీనః = (ఎవరికీ కనపడకుండా) అణగి ఉండేవాడనై, ఉపాస్తామ్ = (ఆ గోష్ఠిని) దగ్గరలోనే సేవిస్తూ ఉండాలి.

శ్రీవరవరమునీ! ఉభయవేదాంతాలలోని రహస్యార్థాల వివరణాన్ని లోపల ఇముడ్చుకొన్న తమ ముఖాన్ని చక్కగా దర్శిస్తూ ఉన్నది; మనస్సు లోపల తీయనిదై, లోకవిలక్షణమైన **"జయ విజయీభవ"** అనే అర్థాన్ని ఇచ్చే తమకు సంబంధించిన మంత్రాన్ని మాటిమాటికి అనుసంధిస్తూ ఉన్నది, బయటకు పొంగి వచ్చే ఆనందభాష్పాలచే చల్లని కన్నులను కల్గినది, మిగిలిన సకల చేష్టలను విస్మరించినది

అయిన పురుషశ్రేష్ఠులు పలువురు కూడి ఉండే ప్రసిద్ధమైన ఆ సభను చేరి, అల్పుడనైన నేను అక్కడ ఎక్కడో ఒక మూల తమకు సమీపంలో దాగి ఉండి, తమను సేవించగలగాలి.

వ్యాఖ్యానమ్ : **(వ్యాఖ్యాగర్భమ్)- "పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్"** అని నిర్వచింపబడ్డ వ్యాఖ్యానశైలిలో వేదాంతద్వయవ్యాఖ్యానాలను లోపల ఇముడ్చుకొన్న,

**(త్వన్ముఖమ్)** - దేవరవారి ముఖాన్ని,

**(వీక్షమాణమ్)**- విశేషంగా దర్శిస్తూ- అని అర్థం. (అందువల్లనే),

**(అంతఃస్వాంతమ్)**- హృదయంలోపల,

**(మధురం కమపి)**- భోగ్యమైన, లోకవిలక్షణమైన,

**(మంత్రమ్)- "జితం తే, జయ విజయీ భవ, వాழி, పోற்றి, పల్లాణ్డు"** అనే అర్థాన్ని ఇచ్చే దేవరవారి విషయంలోని మంత్రాన్ని,

**(ఆవర్తయంతీమ్)** - అర్థానుసంధానం చేసి, తత్ఫలంగా **"అభిమాన భంగమాయ్"** అనేరీతిలో భగ్నాభిమానంతో, సంతతం చింతిస్తూ,

**(ఉద్యద్బాష్ప... వృత్తిమ్)** - నిరంతరం పెల్లుబికి వచ్చే ఆనందాశ్రువులచేత చల్లని, నేత్రాలను కల్గినది లేక ఆసారప్రసారాది సకల చేష్టలను విస్మరించినదైన, నేత్రాలను కల్గినది - అని కూడా అర్థం. స్తిమిత శబ్దానికి - చల్లని, స్తబ్ధమైన - అనే రెండర్థాలున్నాయి.

**(తామ్)** - ప్రసిద్ధమైన, పరమప్రాప్యమైన,

**(సంసదమ్)** - శ్రియఃపతిమొదలు సకలపురుషశ్రేష్ఠులచేత అధిష్ఠింపబడ్డ దివ్యసభను- అని అర్థం. **"సమ్యక్ సీదంతి అస్యామితి సంసత్"** అనే వ్యుత్పత్తి గల ఈ పదప్రయోగం సాభిప్రాయకం.

**(అసౌ అణుః)** - ఈ అల్పుడు,

**(కోణే క్వచిత్)** - ఎక్కడో ఒకమూల,

**(లీన స్సన్)** - అచటివారిలో ఎవరికీ కనపడకుండా కలసిపోయి,

**(ఉపాస్తామ్)** - దేవరవారికి సమీపంలో ఉండి, ఆ సభను దర్శించాలి. **"మొయ్త్తుక్కణ్ పనిశోర మెయ్కళ్... ఏఙ్గ ఇళైత్తు నిన్ఱు...."** ఇత్యాదిగా కులశేఖరుల సూక్తిలోని భావం చరమపర్వాత్మకంగా ఒకవిధంగా ప్రకృతంలో అనుసంధింపబడింది.

శ్రీవరవరమునుల ఉభయవేదాంత కాలక్షేపగోష్ఠిని చేరి, దాని సమీపంలో ఒకమూల తాము కూడా ఉండాలని ఇందులో కవి కోరుకుంటున్నారు. ఆ గోష్ఠిలో భగవానుడు, దేవేరులు, ఇంకా పలువురు

ఆచార్యశ్రేష్ఠులు వేంచేసి యుంటారట. వారు అందఱు, శ్రీవరవరమునులు వ్యాఖ్యానించేటపుడు ఆ ఆచార్యవర్యుల ముఖాన్ని సేవిస్తూ ఉంటారట. ఒక్కొక్క విశేషార్థాన్ని శ్రీవరవరమునులు వివరించేటపుడు, దాన్ని వినేటపుడు తమ దురభిమానం భగ్నమై, వారి విజయాన్ని సూచించే తమ మనస్సులో మాటిమాటికి అనుసంధిస్తూ ఉంటారట. ఆనందబాష్పాలచేత వారి కన్నులు చల్లబడతాయట. అంతేకాదు. వారు ఆ సన్నివేశంతో తను దర్శించేవారి సకలచేష్టలను విస్మరించేటట్లు చేస్తారట. ఇటువంటి మహనీయులు నిండి ఉండే గోష్ఠిలో ఎవరికంటికీ కనపడకుండా ఉండేటట్లు ఒక మూలలో అణగి ఉండి, శ్రీవరవరమునులనే సేవిస్తూ ఉండే ఆ గోష్ఠిని సేవించాలి- అనే ఆశను దీనిలో ఎఱుమ్బియప్పా ప్రకటించారు. **"ఆహ్లాదశీత నేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్యః"** అనే సూక్త్యర్థం చరమపర్వాత్మకంగా ఇక్కడ అనుసంధింపబడింది.

**47.** అవ :- శ్రీవరవరవమునుల కాలక్షేపగోష్ఠిలో ఉండి, వారి శ్రీపాదాలను శిరసా వహించాలి; వారు వేదాంతార్థాలను ఉపన్యసించేటపుడు వానిని వినాలి; వారి దివ్యమంగళరూపాన్ని సేవించాలి. ఈవిధంగా ఉంటూ, సత్పురుషుల కటాక్షానికి పాత్రం కావాలి - అని ఇందులో ఆశపడుతున్నారు.

**ఆబిభ్రాణ శ్చరణయుగళీ మర్పితాం త్వత్ప్రసాదాత్**
**వారం వారం వరవరమునే! వందమానేన మూర్ధ్నా ।**
**శృణ్వన్ వాచః శ్రుతిశతశిరః తత్త్వసంజీవనీ స్తే**
**పశ్యన్ మూర్తిం పరిషది సతాం ప్రేక్షణీయో భవేయమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అహం = దాసుడనైన నేను, పరిషది = దేవరవారి దివ్యపరిషత్తులో (సభలో), త్వత్ ప్రసాదాత్ = దేవరవారి కృపవల్ల, అర్పితాం = అర్పింపబడిన, తే చరణయుగళీం = తమ శ్రీచరణయుగ్మాన్ని, వందమానేన మూర్ధ్నా = వంచిన తలతో, వారం వారం = మాటిమాటికి, ఆబిభ్రాణః= ఆభరణంగా ధరిస్తూ, శ్రుతిశతశిరః తత్త్వసంజీవనీః = పలు వేదాంతవాక్యాలలోని పరమార్థంగా తెలుపబడిన భగవానుని ఉజ్జీవింపజేయగల్గిన, తే వాచః = దేవరవారి శ్రీసూక్తులను, శృణ్వన్ = వింటూ, తే మూర్తిం పశ్యన్ = దేవరవారి తిరుమేనిని సేవిస్తూ, సతాం = సత్పురుషులకు, ప్రేక్షణీయః = కటాక్షించదగినవాడను, భవేయం = కాగలను.

శ్రీవరవరమునీ! దాసుడనైన నేను తమ కాలక్షేపగోష్ఠిలో తమ అనుగ్రహం వల్ల ఉంచబడిన తమ పాదుకాద్వయాన్ని వినయంతో వంచిన శిరస్సుతో మాటిమాటికి ఆభరణంగా ధరించగలగాలి. పలు వేదాంత వ్యాక్యాలలోని పరమార్థంగా నిశ్చయింపబడ్డ, భగవానుని సంతోషింపజేయగలిగే తమ శ్రీసూక్తులను వింటూ తమ రూపాన్ని దర్శిస్తూ ఉండి, సత్పురుషుల కటాక్షానికి పాత్రుణ్ణి కావాలి.

**వ్యాఖ్యానమ్ : (అహమ్)** - దాసుడనైన నేను,

**(తవ పరిషది)** - దేవరవారి దివ్యసభలో,

**(త్వత్ప్రసాదాత్)** - నా అనువృత్తివల్ల కాకుండా, కేవలం మీ అనుగ్రహం వల్లనే - అని భావం. దీనివల్ల పరగతస్వీకారం సూచితం.

**(అర్పితామ్)** - ఉంచబడిన,

**(తే చరణయుగళీం)** - దేవరవారి శ్రీచరణద్వయిని,

**(వందమానేన మూర్ధ్నా)** - నమస్కరించే, వంచిన తలతో,

**(వారంవారమ్)** - మాటిమాటికి,

**(అబిభ్రాణస్సన్)** - **"కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కురైకழలే"** అని, **"త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి"** అనే రీతిలో ఆభరణంగా ధరిస్తూ - అని అర్థం. **"ఆఙ్"** అనే ఉపసర్గపూర్వకమైన **"బిభర్తి"** ధాతువు అలంకారార్థంలో ప్రయోగింపబడుతున్నది. అందువల్లనే ఆభరణశబ్ద వ్యుత్పత్తి. ఇక్కడ సంగతం.

**(శ్రుతిశతశిరస్తత్త్వసంజీవనీః)** - **"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః", "శుడర్ మికు శురుదియుళ్ ఇవైయుణ్ణ శురనే"** ఇత్యాది వందలాది వేదాంత వాక్యాల్లో వ్యక్తం చేయబడ్డ తత్త్వమే పరమాత్మ. శ్రుతి శిరసి విదీప్తుడు శ్రీనివాసుడే కదా! ఆ పరమాత్మకు జీవనౌషధంవంటివి. మీ వాక్కులు కుదృష్టులచేత అపసవ్యంగా వ్యాఖ్యానింపబడ్డ వేదాంతవాక్యాల అర్థాన్ని యథాతథంగా వివరించే మీవాక్కులు భగవాను సత్తను నిలిపి, వర్ధిల్లజేసే సంజీవనౌషధం వంటివి. **"శ్రుతిశతశిరః"** అనే పదానికి నూఱు దశకాలను కల తిరువాయ్‌మొழి ప్రబంధమనే అర్థాన్ని గ్రహించి, ఆ ప్రబంధతత్త్వం చరమపర్వనిష్ఠా ప్రతిపాదనమే- అనే అర్థాన్ని వెలువరించేది - అని వివరించడం ప్రకృతప్రబంధానుగుణం. లేక, **"శ్రుతి శతశిర"** అనే శబ్దానికి తిరువాయ్‌మొழి అనే అర్థాన్ని చెప్పి, దాని తత్త్వం - అంటే సారంగా ఇరామానుశ నూ*ற்ற*న్దాది ప్రబంధాన్ని గ్రహించి, దానికి వరవరమునుల పలికే జీవనౌషధంవంటి వ్యాఖ్యాన సూక్తులను - అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఇరామానుశనూ*ற்ற*న్దాది ప్రబంధానికి శ్రీవరవరమునులు నాతివిస్తృతమైన వ్యాఖ్యను అనుగ్రహించారు కదా!

**(శృణ్వన్ సన్)** - **"సంశ్రవే మధురం వాక్యమ్"** అనే రీతిలో ఒకవేళ అర్థానుసంధానంద్వారా కాకపోయినా, వింటేనే చాలు, మధురంగా ఉండేవి- అని అర్థం. ఆ విధంగా వినేవాడనై,

**(తే మూర్తిం పశ్యన్)** - దేవరవారి దివ్యమంగళవిగ్రహాన్ని నేత్రాలతో సేవించేవాడనై - అని అర్థం. **"మూర్ఛతి ఇతి మూర్తిః, మూర్ఛా - మోహసముచ్ఛ్రాయయోః"** - మోహాన్ని కల్గించేది, ఉన్నతమైనదనే అర్థాన్ని ఇచ్చే మూర్తిశబ్దప్రయోగం ఇక్కడ విలక్షణమైనది. ఇచటి మోహం ప్రాప్యకోటిలోనికి చేరుతుంది, **"విగ్రహాలోకనపరః"** ఇత్యాది సూక్తి, **"తేశారుమ్ శిచ్చ నవన్ శీర్‌వడివై ప్పేణుమవన్"** అనే ఉపదేశరత్తిన మాలై సూక్తి భావ్యాలు, **"సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్ర విగ్రహమ్ ప్రసన్నార్కప్రతీకాశమ్"** ఇత్యాదిగా ఈ భావం ఈ కవిచే పూర్వదినచర్యలో ప్రస్తుతం. **"ప్రత్యూషార్క"** ఇత్యాదిగా ఇక్కడ ప్రస్తుతం.

**(సతామ్)** - స్వరూపజ్ఞానంచేత సత్తను పొందినవారికి అని భావం. "**అస్తి బ్రహ్మేతిచేద్వేద**" అనే శ్రుత్యర్థం చరమపర్వాత్మకంగా వివక్షితం.

**(ప్రేక్షణీయో భవేయమ్)** - కటాక్షింపదగినవాడను నేను కావాలి.

శ్రీవరవరమునుల శ్రీసూక్తులు భగవానుని ఉజ్జీవింపచేసేవి అంటే - శ్రుతులు భగవానునకు గుణాలు లేవు, రూపం లేదు, విభూతి లేదు - అని తెలుపుతున్నవి - అని అంటూ కొన్ని వేదాంతవాక్యాలను ఉట్టంకించి, మతాంతరులు భగవానుని మృతప్రాయునిగా చేశారు. ఆ వాక్యాలకు తగిన అర్థాలను సప్రమాణంగా ఉపపాదించి, ఆ భగవానుని సకలగుణవిగ్రహవిభూతి యుక్తునిగా నిరూపించడమే. భగవానునకు ప్రాణసమానాలు - కల్యాణగుణాలు, దివ్యమంగళవిగ్రహం, ఉభయవిభూతులే కదా! "**కపర్దిమతకర్దమం.... నిపతతః పరబ్రహ్మణః కరగ్రహవిచక్షణో జయతి లక్ష్మణోఽయం మునిః**" అనే యతిరాజసప్తతి శ్లోకార్థం ఇక్కడ భావనీయం.

**48.** అవ :- శ్రీరంగనాథునకు మంళాశాసనం చేయడంకోసం శ్రీవరవరమునులు తమ శిష్యులతో కలసి గోష్ఠిగా సన్నిధికి వేంచేసే సమయంలో తాముకూడ వారి వెంట ఉండి, ఆనందించాలని ఆశపడు తున్నారు. శ్రీవరవరమునులు శ్రీరంగనాథుని మంగళాశాసనార్థం వేంచేసే సన్నివేశాన్ని "**శ్రీమన్మందిరం రంగశాయినః, పత్యుః పదాంబుజం ద్రష్టుమాయాంత మావిదూరతః**" ఇత్యాదిగా పూర్వదినచర్యాస్తోత్రంలో ఈదేవరాజగురువే ప్రస్తుతించారు.

**కాలే యస్మిన్ కమలనయనం దేవ మాలోకయిష్యన్**
**నిర్యాసి త్వం వరవరమునే! నిత్యయుక్తై స్త్వదీయైః ।**
**అగ్రే నృత్యన్ అయ మపి తదా గాహతాం హర్షసింధౌ**
**మజ్జంమజ్జం మధువనజుషాం వైభవం యూథపానామ్ ॥**

వరవరమునే = ఓ శ్రీవరవరమునీ!, యస్మిన్ కాలే = ఏసమయంలో అయితే, త్వం =దేవరవారైన, నిత్యయుక్తైః= క్షణం కూడా విశ్లేషించకుండా ఉండేవారైన, త్వదీయైః= దేవరవారి శిష్యులతో కలసి, కమలనయనం = తామరలవంటి నేత్రాలను కల్గినవాడైన, దేవం = ప్రాప్తశేషియైన శ్రీరంగనాథుని, ఆలోకయిష్యన్ = శ్రీచరణాలనుండి కిరీటంవరకు మంగళాశాసనాన్ని చేయడానికి, నిర్యాసి = గోష్ఠిగా వేంచేస్తున్నారో, తదా= ఆ సమయంలో, అయమపి= ఈ మానవుడు కూడా (దాసుడు కూడా), హర్షసింధౌ= ఆనందసాగరంలో, మజ్జంమజ్జం = మాటి మాటికీ అవగాహిస్తూ, అగ్రే = దేవరవారికి ఎదురుగా, నృత్యన్ సన్= నాట్యమాడేవాడనై, మధువనజుషాం = మధువనాన్ని ప్రీతితో సేవించే, యూథపానాం = (అంగదుడు మొదలైన) వానరుల, వైభవం = ఆంనదసమృద్ధిని, గాహతామ్ = పొందగలగాలి.

శ్రీవరవరమునీ! ఏ సమయంలో అయితే తమరు, మిమ్ములను సదా వెంటనంటి ఉండే తమ శిష్యులతో కలసి, కమలనేత్రుడు, ప్రాప్తశేషి అయిన శ్రీరంగనాథుని దివ్యమంగళవిగ్రహాన్ని దర్శించి పాదాదికేశాంతం మంగళాశాసనం చేయడంకోసం గోష్ఠిగా బయటకు వెడతారో, ఆ సమయంలో నేనుకూడా

మీ వెంట ఉండి దర్శిస్తూ ఆనందసాగరంలో మాటిమాటికి మునుగుతూ, తమకు ఎదురుగా నాట్యం చేస్తూ, మధువనాన్ని చేరిన వానరవీరుల అనుభవవైభవంవంటి వైభవాన్ని పొందాలి.

వ్యాఖ్యానమ్ : **(యస్మిన్ కాలే)**- ఏ సమయంలో అయితే,

**(త్వమ్)** - శేషివిషయంలో మంగళాశాసనరూపమైన సాక్షాత్ఫలాన్ని మాత్రమే మనస్సులో కల్గిన తమరు - అని అర్థం. ఈ అర్థం సర్వనామశబ్దప్రయోగం ద్వారా సూచింపబడింది.

**(నిత్యయుక్తైః)** - మీరే ఉపాయోపేయాలనే అధ్యవసాయాన్ని కల్గినవారు కావడం వల్ల మిమ్ములను సదా వెంటనంటి ఉండే- అని అర్థం. **"నిత్యాయుక్తా ఉపాసతే" (9-14)** అనే భగవద్గీతాసూక్తి, దానిని శ్రీరామానుజులు **"నిత్యయుక్తాః- నిత్యయోగం కాంక్షమాణా ఆత్మాంతదాస్యవ్యవసాయిన ఉపాసతే" ("నిత్యయుక్తాః"**- నిత్యయోగాన్ని కోరేవారు, ఆత్మాంతమైన- నిత్యమైన దాస్యాన్ని చేసేవారై ఉపాసిస్తున్నారు.) అని వ్యాఖ్యానించడం, ఈ భాష్యాన్ని వివరించే వేదాంతదేశికులు **"నిత్యయుక్తా ఇతి ఆశంసాయామ్ క్త ఇత్యాహ"** అని పల్కడం వల్ల ఇచటి క్త ప్రత్యయం ఆశంసార్థకమని, **"కాంక్షమాణా ఇతి కాంక్షమాణ శబ్ద శ్చానీశప్రత్యయాంతః, తాచ్ఛీల్యవయోవచనశక్తిషు చానశ్ - ఇత్యనుశాసనాత్"** అని అనడంవల్ల ఇచటి నిత్యయోగపదంద్వారా అనపాయిత్వాన్ని నిత్యంగా కోరే స్వభావాన్ని కలవారనే అర్థం ద్యోతితమవుతున్నదని తెలుస్తున్నది. దీనివల్ల **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్ మఙ్గై ఉఱైమార్బా"** అని నిత్యయోగాన్ని ఆశించే లక్ష్మీదేవి స్వభావం ప్రకృతంలో చరమపర్వంగా అనుసంధింపబడినదని చెప్పవచ్చు. **"తేషాం నిత్యాభియుక్తానామ్" (9-2-2)** అనే గీతాసూక్తిని కూడా ఇదే రీతిలో శ్రీరామానుజులు వివరించడం గమనార్హం.

**(త్వదీయైః)** - మిమ్ములను పురస్కరించుకొని **"శ్రీవరవరముని దాసు"**లని నిరూపించతగిన మీ శిష్యులైన సత్పురుషులతో- అని భావం. ఇచటి తృతీయావిభక్తి సహార్థంలో ప్రయోగింపబడింది. అందువల్ల శ్రీవరవరముని శిష్యుల అప్రాధాన్యం సూచింపబడింది. దీనివల్ల శ్రీరంగనాథుని మంగళాశాసనం చేయడంకోసం శ్రీవరవరమునులు వెళ్ళినపుడు వారితో పాటు వెళ్ళిన శిష్యులు శ్రీవరవరమునులకు మంగళాశాసనం చేయడంలోనే ప్రాధాన్యం కల్గిఉన్నారనే భావం వ్యక్తమౌతున్నది.

**(కమలనయనమ్)** - పుండరీకాక్షుని - అని అర్థం. ఇది భగవానుని నేత్రసౌభాగ్యాన్ని సూచిస్తున్నది. **"స్నేహాదస్థానరక్షావ్యసనిభిః"** అన్నట్లు నిత్యసూరులు సైతం మంగళాశాసనం చేయడానికి ఇదేకదా హేతువు. **"తామరైక్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్ తలమకనై"** వంటి దివ్యసూరి సూక్తులు ఇక్కడ స్మరణీయాలు. **"రామః కమలపత్రాక్షః సర్వసత్త్వమనోహరః"** అని జనిధర్మాన్ని కల్గినవారిని ఎవరినైనా వశీకరించుకొనగల్గినది స్వామి నేత్రసౌందర్యం, శ్రీరంగనాథుని నేత్ర సౌందర్యానికి వశులైన ధనుర్దాసు **(పిళ్ళై ఉఱఙ్గావిల్లిదాసర్)** వృత్తాంతం స్మరణీయం.

**(దేవమ్)**- ప్రాప్తశేషిని -అని అర్థం. ఈపదం శ్రీరంగనాథ -శ్రీవరవరమునుల స్వరూపానురూపత్వాన్ని ఉపపాదిస్తుంది.

**(ఆలోకయిష్యన్ సన్)** - పాదాదిమౌళిపర్యంతం మంగళాశాసనం చేయడంకోసం దర్శిస్తూ - అని భావం. **"ఆలోకయిష్యన్"** అని అంటూ దర్శనక్రియాఫలం కర్తకు చెందుతుంది- అని తెలిపే ఆత్మనేపద ప్రయోగాన్ని చేయనందువల్ల, దర్శనం పరార్థమని తెలుస్తున్నది. దీనివల్లనే దర్శనం శ్రీరంగనాథుని మంగళాశాసనార్థమని వాచా తెలుపబడింది.

**(నిర్యాపి)** - బయటకు వెడతారో,

**(తదా)** - అపుడు. ప్రథమపరిస్పందకాలంనుండి- అంటే- అడుగు ముందుకు పెట్టడంకోసం ప్రయత్నం చేసే మొదటిదశనుండి- అని హార్దభావం.

**(అయమ్)** - ఇతడు (నేను),

**(హర్షసింధౌ మజ్జం మజ్జమ్)** - ఆనందాబ్ధిలో మునుగుతూ,

**(నృత్యన్ సన్)** - గాత్రవిక్షేపాన్ని చేస్తూ, ఆనందంతో నృత్యం చేస్తూ,

**(మధువనజుషామ్)** - సుగ్రీవునిచేత రక్షింపబడే మధువనం అనే క్రీడోద్యానాన్ని చేరిన -అని గాని, ఆ వనంలో ఆనందించే - అని గాని భావం. **"జుషీ-ప్రీతి సేవనయోః"** అని కదా ఇచటి ధాతువు.

**(యూథపానామ్)** - వానర సేనాయకులయొక్క,

**(వైభవమ్)** - ఆనందసమృద్ధిని,

**(గాహతామ్)** - ఉన్మస్తకంగా పొందాలి. నిండుజలంలో తలముంచి మునుక వేసిన రీతిలో ఆనంద ప్రవాహంలో నేను తలమునకలు కావాలి - అని తాత్పర్యం. మధువనంలోని వానరుల అనుభవం భగవదనుభవానికి ప్రతీక. ఇక్కడ కవి ఆశించే అనుభవం చరమపర్వాత్మకం కావడం విశేషం. **"గాహతామ్"** అనే పదం ద్వారా దివ్యసూరిఅనుభవంవంటి అనుభవాన్ని చరమపర్వపరంగా కవి ఆశపడుతున్నారు. **"ఆళ్వార్"** శబ్దార్థం ఇదే కదా!

ఇచట గాహనమంటే ఆనందప్రవాహం తన తలపై ప్రవహించేటట్లు మునగడం. మధువనాన్ని ప్రవేశించిన వానరవీరుల వైభవాన్ని **"గాయంతి కేచిత్ విలపంతి కేచిత్"** **(శ్రీరామా-సుంద-61-16)** అని ప్రారంభించి వాల్మీకి మహర్షి వర్ణించిన రీతిలో పాడుతూ, ఆడుతూ, నవ్వుతూ, గెంతుతూ ఆనంద ప్రవాహంలో మునిగి ఉండే వైభవాన్ని ఆచార్యపరంగా కల్గి ఉండడమే ఇక్కడ వివక్షితం. ఈ శ్లోకంలో వరవరమునుల తటాక - సాగరసామ్యం ధ్వనిస్తున్నది. ఈ రూపణం తరువాతి శ్లోకంలో కూడా అనువర్తిస్తున్నది.

**49.** అవ :- పూర్వం తెల్పిన రీతిలో సన్నిధికి వేంచేసే సమయంలో నృత్యం చేస్తూ ముందుకు వెళ్ళడమే కాకుండా, వెనుక భాగంలో, రెండు వైపుల, పైన ఉంటూ మంగళాశాసనం చేస్తూ, మార్గదర్శనం చేస్తూ తమ వెంటే ఉండాలి - అని అంటున్నారు. **"నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ"** అనే గీతా శ్లోకార్థం ఆచార్యపరంగా ఇందులో అనుసంధింపబడింది.

**భూత్వా పశ్చాత్పున రయ మథ వ్యోమ్ని గోపాయమానో**
**భూయః పార్శ్వద్వితయసుషమాసాగరం గాహమానః ।**
**జల్పన్నుచ్చైః జయ జయ విభో! జీవజీవేతి వాచం**
**శంసన్మార్గం వరవరమునే! సౌవిదల్లో భవేయమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, అయం = ఈ దాసుడు (నేను), అథ =(పూర్వం తెల్పిన రీతిలో) నాట్యం చేసిన తరువాత, పశ్చాత్ = వెనుకభాగంలోను, వ్యోమ్ని = ఆకాశంలోను, పునః భూత్వా= వెంటనే వెంబడించి ఉండి, దేవరవారి, పార్శ్వద్వితయ సుషమాసాగరం = రెండు వైపుల ఉండే సౌందర్యసాగరాన్ని, గాహమానః = మునిగి ఆనందించేవాడై, గోపాయమానః= అశుభాలనుండి కాపాడాలని తలచి, విభో = అంతటా వ్యాపించి ఉండే స్వామీ!, (దేవరవారు), జయ జయ = అంతట ఎల్లప్పుడు అందరికంటే అధికంగా వర్ధిల్లాలి, జీవ జీవ = అంతట ఎల్లప్పుడు ఏబాధ లేకుండా వర్ధిల్లుదురు గాక, ఇతి వాచం = అనే మంగళాశాసన వచనాలను, ఉచ్చైః జల్పన్ = ఉచ్చైః స్వరంతో పల్కుతూ, మార్గం శంసన్ = స్వామీ! ఈ దారిలో వేంచేయండి- అని దారిని చూపుతూ, సౌవిదల్లః భవేయమ్ = అంగరక్షకుడుగా కావాలి.

వరవరమునీ! దాసుడనైన నేను నృత్యమాడిన తర్వాత తమ వెనుక భాగంలో, ఆకాశంలో వెంబడిస్తూ ఉండి తమ రెండు వైపులలోని దివ్యసౌందర్యసాగరంలో మునిగి, అనుభవిస్తూ, అనిష్టాలు నివారించాలని తలచి, "సర్వత్ర వ్యాపించి ఉన్న స్వామీ!, సర్వదా సర్వత్ర ఏహాని లేకుండా తమరు వర్ధిల్లాలి" అనే మంగళాశాసన వచనాలను గట్టిగా ఉచ్చరిస్తూ తమకు మార్గదర్శనం చేస్తూ- అంటే -"స్వామీ! ఇట్లా వేంచేయండి! ఇట్లా వేంచేయండి!" అని అంటూ దారి చూపుతూ, మీ దివ్యమంగళవిగ్రహ (అంగ) రక్షకుణ్ణిగా కావాలి.

**వ్యాఖ్యానమ్ : (అహమ్)** - దాసుడనైన నేను,

**(అథ)** - పూర్వశ్లోకంలో తెల్పిన రీతిలో నర్తనం చేసిన తర్వాత,

**(పశ్చాత్ పృష్ఠతః వ్యోమ్ని ఊర్ధ్వం పున భూత్వా)** - **"స ఏకధా భవతి ద్విధా భవతి.... అనేకధా భవతి"** అనే శ్రుత్యుక్తరీతిలో నిత్యముక్తులవలె అనేక రూపపరిగ్రహణాశంస ఇచట ధ్వనిస్తున్నది.

**(పార్శ్వద్వితయ సుషమాసాగరమ్)** - మీ దివ్యరూపంలోని రెండు వైపులలో గల లావణ్య సముద్రంలో, శ్రీరంగరాజస్తవంలో **"ఏకైకస్మిన్"** అనే శ్లోకంలో భట్టర్ శ్రీరంగనాథునిలావణ్యాన్ని సముద్రంతో పోల్చిన వైనం ఇక్కడ వరవరమునుల విషయంగా స్మరణీయం.

**(గాహమానః సన్)** - తల మునకలు వేస్తూ - అనిష్టనివారణం చేస్తూ - అని అర్థం.

**(విభో!)** - సర్వదేశ సర్వకాలవ్యాపీ!,

**(జయ జయ)** - సర్వదా అంతట సర్వోత్కృష్టులై మీరు వెలగాలి,

**(జీవజీవ ఇతి)** - సర్వత్ర సర్వదా నిరామయులు కావాలి- అనే,

**(వాచముచ్చైః జల్పన్)** - మాటను బిగ్గరగా పల్కుతూ,

**(మార్గమ్ శంసన్)** - "స్వామీ! ఈ దారిలో వేంచేయండి'' అని అంటూ దారి చూపుతూ,

**(సౌవిదల్లః)** - కంచుకిని - అనగా - అంగరక్షకుణ్ణి కావాలి, **"సుష్ఠు విదంతం విద్వాంసమపి లాతి వశవర్తినం కరోతి ఇతి సువిదల్లః, తస్య అయం రక్షకః"** అనే వ్యుత్పత్తిని సౌవిదల్ల శబ్దానికి చెప్పినపుడు దీనిద్వారా వరవరమునుల సర్వజన వశీకరణ సామర్థ్యం, దేవరాజగురువుల వరవరముని మంగళాశాసన స్వభావం వ్యక్తమవుతున్నవి.

శ్రీవరవరమునులను అనిష్టాలనుండి రక్షించాలని, వారికి చుట్టూ ఉండి మంగళాశాసనాన్ని చేయాలని, మార్గదర్శకుణ్ణి కావాలని ఇందులో కవి ఆశపడ్డారు. ఇది యుక్తమే. శ్రీవరవరమునులకు పైభాగంలో ఎగిరి, రక్షించాలని ఆశపడ్డారు కదా! ఇది తగినదా? అని సందేహించనక్కఱలేదు. మంగళాశాసనంలో అభినివేశాన్ని కల్గినవారు పడే పాట్లు ఇవి- అని గ్రహించాలి. ప్రాప్యవిషయంలో చేసే సేవ ఎటువంటిదైనా ఉపాదేయమేకదా!

**50.** అవ :- గోదాదేవి మొదలుగా పరమపదనాథునివరకు గల అందఱిని వరవరమునులు మంళాశాసనం చేసేటపుడు, వారి శ్రీపాదయుగ్మాన్ని **"రమమాణా వనే త్రయః"** అనే రీతిలో లక్ష్మణుడు ఆనందించినట్లు సేవించి ఆనందించాలని ఆశపడుతున్నాను - అని అంటున్నారు. **"రమమాణా వనే త్రయః"** అనే ప్రయోగాన్ని (3-3 ప్రవేశం) పూర్వాచార్యులు వివరిస్తూ - సీతారాముల రూపంలోని శేషిదంపతుల అన్యోన్యసంశ్లేషరసాన్ని దర్శించడంవల్ల కల్గిన ఆనందం లక్ష్మణునిది - అని అనడం ప్రకృతంలో స్మరణీయం. అది భగవదనుభవం. ఇది చరమపర్వానుభవం.

**దేవీ గోదా యతిపతిశఠద్వేషిణౌ రంగశృంగం**
**సేనానాథో విహగవృషభః శ్రీనిధిః సింధుకన్యా ।**
**భూమానీళాగురుజనవృతః పూరుష శ్చేత్యమీషాం**
**అగ్రే నిత్యం వరవరమునే రంఘ్రియుగ్మం ప్రపద్యే ॥**

దేవీ గోదా = భూదేవియొక్క అవతారరూపమైన గోదాదేవి, యతిపతి శఠద్వేషిణౌ= భగవద్రామానుజులు, నమ్మాళ్వార్లు, రంగశృంగం = శ్రీరంగమనే విమానంయొక్క శిఖరం, సేనానాథః= విష్వక్సేనులు, విహగవృషభః= పక్షిరాజైన గరుడుడు, శ్రీనిధిః= లక్ష్మికి వాసస్థానమైన పెరియపెరుమాళ్ (శ్రీరంగనాథుడు), సింధుకన్యా = క్షీరసాగరకన్యకయైన పెరియపిరాట్టి (శ్రీరంగనాయకి), భూనీళా గురుజనవృతః = భూదేవి, లక్ష్మీదేవి, నీళాదేవి, నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులు- అనే వీరిచే పరివేష్ఠింపబడిన, పూరుషః + చ = పరమపురుషుడు (పరమపదనాథుడు), ఇతి అమీషామ్ అగ్రే = అనే వీరి సమక్షంలో, వరవరమునేః = వరవరమునుల, అంఘ్రియుగ్మం = శ్రీచరణయుగాన్ని, నిత్యం = ఎల్లప్పుడు, ప్రపద్యే = ఆశ్రయిస్తున్నాను.

అయోనిజగా అవతరించినందువల్ల ఏర్పడిన అప్రాకృతశోభను కల్గిన గోదాదేవి, భగవద్రామానుజులు, శఠకోపులు, శ్రీరంగవిమానం, విష్వక్సేనులు, గరుత్మంతుడు, మహాలక్ష్మికి నిధివంటి శ్రీరంగనాథుడు, లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి, నమ్మాళ్వార్లు మొదలైన ఆచార్యవర్గంతో పరివేష్ఠితుడైన పరమపదనాథుడు- అనే వీరి సమక్షంలో స్వాచార్యులైన శ్రీవరవరమునుల శ్రీపాదద్వయిని ఆశ్రస్తున్నాను.

వ్యాఖ్యానమ్ : ఈ శ్లోకం మన పూర్వాచార్యులు శ్రీరంగాలయంలో చేసే సేవాక్రమాన్ని తెలుపుతున్నది.

**(దేవీ)-** గోదాదేవి తులసీవనంలో అవతరించినందున అంతర్హితం కాని దివ్యతేజస్సును కల్గినది. **"దివు- దీప్తౌ"** అనే ధాత్వర్థం ఇక్కడ వివక్షితం.

**(రంగశృంగమ్)-** పర్వతాగ్రాన్ని చెప్పే ఈ శృంగశబ్దం చేత పర్వతశిఖరం వలె ఉన్నతంగా, స్థిరంగా, విశాలంగా ఉన్న శ్రీరంగవిమానం తెలుపబడుతున్నది. రంగమంటే శ్రీరంగనాథుడు వేంచేసి ఉండే గర్భగృహం. శృంగమంటే పరవాసుదేవునితో, కలశాలతో సాక్షాత్కరించే పైభాగం.

**(భూమా.... పూరుషః)** - శ్రీదేవి, భూదేవి, నీళాదేవి, **"పరాంకుశాద్యాః ప్రథమే పుమాంసః"** అని స్తుతింపబడే దివ్యసూరులు - అనే వీరు అందఱు పరమపదనాథుని సన్నిధిలో వేంచేసి ఉంటారు. అందువల్ల ఇక్కడ ఈ ప్రయోగం చేయబడింది.

**(అమీషామగ్రే)** - అనే వీరి సమక్షంలో,

**(వరవరమునేః అంఘ్రియుగ్మం ప్రపద్యే)-** ప్రపత్తి అంటే విశ్వాసపూర్వక పార్థన. **"విశ్వాసపూర్వక ప్రార్థనామతిః శరణాగతిః"** అని కదా నిర్వచనం. ప్రకృతంలో - మణవాళమహామునుల శ్రీపాదాలే మోక్షోపాయం - అనే విశ్వాసాన్ని కల్గి, "వరవరముని పాదుకాయుగ్మమా! దాసునకు నీవే మోక్షోపాయం కావాలి!'' అని కవి ప్రార్థించారని భావం.

ఈ శ్లోకం ద్వారా ఎఱుమ్బియప్పా పెద్దల సేవాక్రమానుసారం సేవించి, శ్రీవరవరమునులు మంగళాశాసనం చేసేటపుడు ఈ గోదాదేవి మొదలైనవారి సమక్షంలో శ్రీవరవరమునులను ఆశ్రయించాలి- అనే తమ ఆశను వ్యక్తీకరించారు.

**51.** అవ :- **"సాయంతనం తతః కృత్వా సమ్యగారాధనం హరేః"** అని అంటూ దినచర్యలో తెలుపబడ్డ రీతిలో శ్రీవరవరమునులు సాయంకాలంలో ఆరాధనను, సకలానుష్ఠానాలను ముగించుకొని, రాత్రి శయనించి ఉండే సమయంలో తాము సేవించదలచిన క్రమాన్ని ఇందులో దేవరాజగురువు తెలుపుతున్నారు.

**భృత్యైః ద్విత్రైః ప్రియహితపరై రంచితే భద్రపీఠే**
**తుంగం తూలాసనవర మలంకుర్వత స్సోపధానమ్ ।**
**అంఘ్రిద్వంద్వం వరవరమునే రబ్జపత్రాభితామ్రం**
**మౌలౌ వక్త్రే భుజశిరసి మే వక్షసి స్యాత్క్రమేణ ॥**

ప్రియహితపరైః = శ్రీవరవరమునులకు ఆయా సమయాలలో ప్రియంగా, తరువాత మంచిని కల్గించేవి అయిన కార్యాలలో ఊనికను కల్గిన, భృత్యైః ద్విత్రైః = ఇద్దఱు ముగ్గురు దాసులచే, అంచితే = గౌరవంగా ఇవ్వబడిన (అలంకరింపబడిన), భద్రపీఠే = మంగళాన్నే కల్గించే పీఠంలో, తుంగం =గొప్పదైన ఔన్నత్యాన్ని కల, సోపధానం = తలగడతో కూడిన, తూలాసనం = దూదితో చేయబడిన ఆసనాన్ని, అలంకుర్వతః = అలంకరిస్తూ వేంచేసి ఉండే, వరవరమునేః= మణవాళమహామునుల, అబ్జపత్ర+ అభితామ్రం = తామరరేకులవలె అందమైన ఎఱ్ఱని, అంఘ్రిద్వంద్వం = శ్రీచరణయుగం, మే = దాసుడనైన నాయొక్క, మౌళౌ = శిరస్సులోను, వక్త్రే = ముఖంలోను, భుజశిరసి = బాహువులలో, వక్షసి చ = వక్షస్సులోను, క్రమేణ = క్రమంగా, స్యాత్ = ఉండాలి.

శ్రీవరవరమునులకు ఆయా సమయాలలో ప్రియంగా, అనంతరకాలంలో హితంగా ఉండే కార్యాలలో అభినివేశాన్ని కల శిష్యులు ఇద్దఱు ముగ్గురిచే గౌరవంగా ఇవ్వబడిన, మంగళాన్నే కలుగజేసే భద్రపీఠంలో అమర్చబడిన ఔన్నత్యాన్ని కల, తలదిండుతో కూడిన పరుపుని అలంకరిస్తూ వేంచేసి ఉండేవారైన శ్రీవరవరమునుల తామరరేకువలె చక్కని, ఎఱ్ఱని పాదయుగ్మం దాసుని శిరస్సులో, ముఖంలో, భుజాగ్రాలలో, వక్షఃస్థలంలో క్రమంగా ఉండాలి. (ఆచార్యుల పాదముద్రాంకితాలైన తిరువడి వస్త్రాలను ప్రపన్నులు ప్రతిదినం ఊర్ధ్వపుండ్రధారణానంతరం ఇదే క్రమంలో ధరించడం స్మరణీయం.)

వ్యాఖ్యానమ్ : **(ప్రియహితపరైః)- "భృత్యైః ప్రియహితైకాగ్రైః"** అనే పూర్వదినచర్యా స్తోత్రంలో ఈ కవి చేసిన ప్రయోగం దీనిచే స్మారితం. ఆ సమయంలో ప్రియమై, తరువాత హితమైన కార్యాలలో ఆసక్తులైనవారిచే - అని భావం. ప్రియమంటే ఆ సమయంలో ప్రీతిని కల్గించేది. హితమంటే **"పరిణామే అమృతమివ"** అని మంచిని కల్గించేది. ఇవి రెండు సామాన్యంగా ఒకటిగా ఉండవు. **"హితం మనోహారి చ దుర్లభమ్"** అని కదా భారవిసూక్తి.

**(ద్విత్రైః భృత్యైః)** - పూర్వం తెల్పిన ప్రియంగా, హితం ప్రచురంగా ఉండే అరుదైన కార్యాలను చక్కగా పరిశీలించినవారై, అటువంటి కార్యాలలో ఆసక్తిని కలవారు దుర్లభులు- అనే విషయాన్ని ఈ ప్రయోగం తెలుపుతున్నది. **"ద్వౌ వా త్రయో వా"** అనే విగ్రహం ద్వారా ఇద్దరు, లేకపోతే ముగ్గురు, అంతేకాని నల్గురు ఉండనే ఉండరు - అనే నిర్ధారణ స్ఫురిస్తుంది. ఈ ఇద్దరు, లేక ముగ్గురు ఎవరు? అని అంటే - శ్రీవరవరమునులకు పాదుకాస్థానీయులైన వరదనారాయణ గురువులు, పాదరేఖాస్థానీయులైన రామానుజమునులు (వానమామలైజీయర్) - ఈవిషయం **"వరవరమునివర్యపాదురత్నం వరదగురుం గురుమ్"** అనే ఈ స్తుతి ప్రారంభశ్లోకం వల్ల **"రమ్యజామాతృయోగీంద్రపాదరేఖామయం సదా"** ఇత్యాది సాంప్రదాయిక తనియన్ శ్లోకంవల్లకూడా స్పష్టపడుతున్నది.

**(భృత్యైః)** - దాసులచే - అని అర్థం. వీరి భృత్యం కైంకర్యమే.

**(అంచితే)** - గౌరవంగా సిద్ధం చేయబడిన - అని భావం. ఏ విధంగా ఇష్టదేవతాదుల ఆరాధన చాలా సావధానంగా చేయాలో, ఆ రీతిలోనే జాగ్రత్తగా అలంకరించి, సిద్ధం చేయబడిన - అని తాత్పర్యం.

**(భద్రపీఠే)** - కేవలం మంగళాన్ని కల్గించే పీఠంలో- అని అర్థం. **"అబ్జక్షః"** అనే ప్రయోగంలోవలె ఇచట కూడ అర్థం చెప్పుకోవాలి. ఇందువల్ల మంగళాశాసన పరులైన మహాజ్ఞానులు సైతం అస్థానే భయపడవలసిన అవసరం లేదని స్ఫురిస్తుంది.

**(తుంగమ్)** - ఉన్నతమైన - అని అర్థం. (ఈ విశేషణంద్వారా శయ్యయొక్క అత్యంతసౌకుమార్యం చెప్పబడింది.)

**(తూలాసనవరమ్)** - దూదితో చేయబడిన గొప్ప ఆసనాన్ని - అని అర్థం. శయ్య అనే పదాన్ని ప్రయోగించనందువల్ల వరవరమునుల నిద్ర లోకంలోనివారి నిద్రవంటిది కాదని భావం.

**(అలంకుర్వతః)** - అలంకరిస్తున్న- అని అర్థం. ఈ ప్రయోగంద్వారా అనన్యప్రయోజనంగా భృత్యులు తులాసనం సిద్ధం చేయడంలో చేసిన కృషిని సఫలం చేయడం కోసమే శ్రీవరవరమునులు తులాసనాన్ని అధిష్ఠించారని ఏర్పడుతున్నది. నగయొక్క ప్రయోజనం ఆ నగకు కాదుకదా! ఆ ఆభరణాన్ని చూచేవారికే కదా చెందుతుంది. ఈ అర్థవిశేషం **"అలంకుర్వతః"** అనే పరస్మైపదిరూపప్రయుక్తమైన శత్రర్థక ప్రయోగంద్వారా కూడా వ్యక్తమవుతున్నది. లేకపోతే, **"అలంకుర్వాణస్య"** అనే ఆత్మనేపదిరూపప్రయుక్తం అయిన శానజంతప్రయోగం చేయబడి ఉండేది. అంతేకాక, లోకంలో అపూర్వశోభను కల్గించగలిగేదే అలంకారం కాగలదు. కాబట్టి శ్రీవరవరమునులు తూలాసనాన్ని అలంకరిస్తున్నారని అంటే - దానికి శోభను కల్గిస్తున్నారని భావం. దీనివల్ల శయనకాలంలోని శ్రీవరవరమునుల శోభ **"శ్రీమాన్ సుఖసుప్తః"** అనే శ్రీరామాయణ సూక్తిరీతిలో సూచింపబడింది. ఈ శ్రీరామాయణ సూక్తిలోని **"శ్రీమాన్"** అనే విశేషణాన్ని మంగళాశాసనపరంగా వ్యాఖ్యాతలు వివరించిన విషయం ఇక్కడ గుర్తించతగినది. ఆలంకారికులుసైతం అలంకారశబ్దాన్ని నిర్వచిస్తూ **"కావ్యశోభాకరా యే స్యుః తేఽలంకారాః ప్రకీర్తితాః"** - కావ్యానికి శోభను కలుగజేసేవి అలంకారాలు- అని అన్నారు. అటువంటి శ్రీవరవరమునియొక్క - అని సారం. **"సర్వభూషణ భూషార్హాః"** అనే భగవానుని దివ్యరూపానికి సాటివచ్చే వైభవాన్ని కల్గినది కదా శ్రీవరవరమునుల రూపం.

**(అబ్జపత్రాభితామ్రమ్)** - తామరపూరేకువలె బాగా ఎఱ్ఱనైన - అని భావం. **"అబ్జపత్రాభితామ్ర మంఘ్రిద్వయం మౌలౌ"** అనే ప్రయోగంలోని పుష్పసాదృశ్యం ద్వారా శిరస్సులో, రసపరిమళాలచేత ముఖంలో, పత్రశబ్దప్రయోగంచేత పలు పూలపత్రాలను కూర్చిన పూలమాలతో సాదృశ్యం స్ఫురిస్తుంది కాబట్టి భుజాగ్రాలపై, వక్షస్సులో మాలికవలె శ్రీవరవరమునుల పాదయుగం ఉండాలి - అనే స్వారస్యం తోస్తున్నది. పాదాల దిండుగా తమను చేసికోవాలనే కవి ఆశయం ఇక్కడ వ్యక్తమవుతున్నది. దాసుల ప్రార్థనను మన్నించి తూలాసనాన్ని అలంకరిస్తూ వేంచేసి ఉండేటట్లే, నా ప్రార్థనను కూడ మన్నించి తమ శ్రీపాదాలను భృత్యులలో ఒకడనైన నా శిరస్సు మొదలైన చోట్ల ఉంచాలని అనడం యుక్తమైన ప్రార్థనయే కదా!

**52.** అవ :- ఈ రీతిలో ఏడు శ్లోకాలలో వర్ణించిన రీతిలో శ్రీవరవరమునుల దినచర్య ప్రతిదినం ప్రవర్తించడాన్ని సూచిస్తూ, ఆయా సమయాలలో అంతట వారి శ్రీపాదాలను సేవిస్తూ, సంసారాబ్ధిని దాటాలి - అని

అంటున్నారు. తిరువాయ్‌మొழிలోని **"ఇవైయుమ్ అవైయుమ్" (1-9)** అనే దశకంలోని అనుభవాన్ని ఈ శ్లోకం గుర్తుచేస్తుంది. అది ప్రథమపర్వాత్మకంకాగా, ఇది చరమపర్వాత్మకంగా కావడం విశేషం.

**అగ్రే పశ్చాదుపరి పరితో భూతలం పార్శ్వతో మే**
**మౌలౌ వక్త్రే వపుషి సకలే మానసాంభోరుహే చ ।**
**దర్శందర్శం వరవరమునే! దివ్య మంఘ్రిద్వయం తే**
**నిత్యం మజ్జన్నమృతజలధౌ నిస్తరేయం భవాబ్ధిమ్ ॥**

వరవరమునే! = ఓ శ్రీవరవరమునీ!, (అహం = దాసుడనైన) నేను, మే = దాసునియొక్క, అగ్రే= ముందు, పశ్చాత్ = తరువాత, ఉపరి = పైన, భూతలం పరితః = చుట్టూ ఉండే భూమిపై, పార్శ్వతః= రెండు వైపుల, మౌళౌ = శిరస్సుపై, వక్త్రే = ముఖంలో, సకలే వపుషి = మిగిలిన అన్ని అంగాలలో, మానసాంభోరుహే చ = హృదయపద్మంలోను, తే = దేవరవారియొక్క, దివ్యమ్+అంఘ్రిద్వయం = అప్రాకృతమైన పాదయుగాన్ని, దర్శం దర్శం = సేవిస్తూ సేవిస్తూ, అమృత జలధౌ = ఆనందామృత సాగరంలో, నిత్యం = ఎల్లప్పుడు, ప్రతిదినం, మజ్జన్ = మునిగి ఉండేవాడనై, భవాబ్ధిం = సంసారసాగరాన్ని, నిస్తరేయం= దాటగలను. (దాటాలి)

శ్రీవరవరమునీ! దాసుడనైన నా ముందు, వెనుక, పైన, భూమిలో అంతట, రెండు ప్రక్కల, తలపై, ముఖంలో, అన్ని అంగాలలో, హృదయకమలంలో తమ దివ్యపాదయుగ్మాన్ని సేవించి, సేవించి ఆనందామృతసాగరంలో ప్రతినిత్యం ఎల్లప్పుడు మునిగి ఉన్నవాడనై సంసారసముద్రాన్ని దాటాలి.

**వ్యాఖ్యానమ్ :** తాము శ్రీవరవరమునులకు వెనుక సేవించేటపుడు తమకు ముందు, ముందుభాగంలో సేవించేటపుడు తమకు వెనుక, శ్రీపాదాలను వహించేటపుడు తమకు పైన, దివ్యదేశయాత్రను చేసే సమయంలో భూమిలో అంతటా **"జయ! జయ! జీవ! జీవ! ప్రభో !"** అని పూర్వం 49వ శ్లోకంలో తెల్పిన క్రమంలో మంగళాశాసనం చేసేటపుడు తమకు రెండు వైపుల, రాత్రి తాము శయనించడానికి ముందు పూర్వం తెల్పిన రీతిలో తలపైన, ముఖంలో, మిగిలిన అంగాలలో, తాము నిద్రించేటపుడు, లేక, కార్యాంతరాన్ని పురస్కరించుకొని తమను శ్రీవరవరమునులు నియమించి, పంపే సమయంలో తమ హృదయకమలంలో శ్రీవరవరమునులు శ్రీపాదాలను ఎల్లప్పుడూ సేవిస్తూ, ఆనందసముద్రంలో మునిగి, పిమ్మట జన్మజలధిని దాటి, పరమపదాన్ని చేరాలనే ఆశను ఎఱుమ్బియప్పా ఈ శ్లోకంలో వ్యక్తం చేశారు. **"మజ్జన్ మజ్జన్"** అని నాల్గవ పాదంలో, **"పశ్యన్ పశ్యన్"** అని మూడవ పాదంలో పాఠాంతరాలున్నాయి.

**(అగ్రే పశ్చాత్ ఉపరి భూతలం పార్శ్వతః మౌళే వక్త్రే వపుషి సకలే)** - నా ముందు, వెనుక, పైన, చుట్టూ శిరస్సులో, ముఖంలో, శరీరంలో అంతటా,

**(మానసాంభోరుహే చ)** - హృదయపుండరీకంలో- అని అర్థం. అనుక్త సముచ్చాయకమైన ఇచటి చకారంచేత చక్షురాది ఇంద్రియాలు అన్నీ చెప్పబడ్డాయి. భావనాప్రకర్షవల్ల భావించే విషయం సర్వత్ర

గోచరించడం ప్రాకృతవిషయంలోకూడా సహజమే కదా! **"పశ్యామి తా మిత ఇత పురత శ్చతత్"**, **"పృష్ఠత స్సా పుర స్సా"** ఇత్యాదులీవిషయంలో ఉదాహరణీయాలు.

**(తే దివ్య మంఘ్రిద్వయమ్)** - మీ దివ్యమైన చరణయుగళాన్ని,

**(దర్శం దర్శమ్)** - పునః పునః దర్శిస్తూ,

**(అమృతజలధౌ నిత్యం మజ్జన్ భవాబ్ధిం నిస్తరేయమ్)** - పూర్వం తెల్పిన రీతిలో ప్రతిదినం అవగాహిస్తూ సంసారాబ్ధి దాటగలను. తాము శ్రీవరవరమునుల ముందు ఉండి నడుస్తూ సేవించాలని **"అగ్రే"** అని కవి అన్నారు. వెనుకనే వెంట వేగంగా పరుగుతీస్తూ సేవించాలని **"పశ్చాత్"** అని అన్నారు. తాము వరవరమునుల మోయాలనే ఆశంసతో **"ఉపరి"** అని అన్నారు. **"జల్పన్ ఉచ్చైః జయ జయ విభో! జీవ! జీవ!"** ఇత్యాదిగా పల్కుతూ మంగళాశాసనం చేయాలని **"పార్శ్వతః"** అని అన్నారు. దివ్యదేశదివ్య యాత్రాభిప్రాయంతో **"పరితో భూతలమ్"** అని అన్నారు. పాదాల దిండుగా కావాలని **"మౌళౌ వక్త్రే వపుషి సకలే"** అని అన్నారు. తాము నిద్రించే సమయంలో కూడా వరవరమునుల పాదాలను ధ్యానించాలని **"మానసాంభోరుహే చ"** అని అన్నారు- అని గమనించాలి. ఒక సముద్రంలో మునిగి, ఇంకొక సముద్రాన్ని దాటగలను - అనడం ఉక్తిచమత్కారం. ఇదంతా శ్రీవరవరమునుల దివ్యపాదాల దర్శనమహిమ సుమా! అన్నది తాత్పర్యం. **"అమృతజలధౌ మజ్జన్"** అనే సూక్తికి అనుగుణంగా వైకుంఠ గద్యలోని **"పాదారవింద యుగళం శిరసి కృతం ధ్యాత్వా, అమృతసాగరాంతర్నిమగ్న సర్వావయవ స్సుఖ మాసీత"** అనే సూక్తి భావనీయం. భగవానుని విషయంలో భగవద్రామానుజులు పల్కిన సూక్తిని ఎఱుమ్బియప్పా శ్రీవరవర మునుల విషయంలో అనుసంధించడం ఇచటి విశేషం. ప్రాకృతవిషయంలోనే **"ఆనందసాంద్ర మమృతప్లవనాదివాభూత్"** అనే రీతిలో అనుభవం కల్గినపుడు, ఇక అప్రాకృతవిషయంలో కల్గడంలో ఏమి వింత?

**53.** అవ :- **"కుశస్థలే నివసతి స చ ప్రాతరిహేష్యతి"** అని మరునాడు సంభవించే అయోధ్యకు శ్రీరాముని రాకను గూర్చి భరతుడు ఎదురు చూచినట్లుగా, దేవరవారి ప్రాప్తికి హేతువైన (పూర్వవర్తి అయిన) అవ్యవహిత ప్రభాతాన్ని సుప్రభాతం అయేటట్లు కల్పించండి- అని అంటున్నారు.

**కర్మాధీనే వపుషి కుమతిః కల్పయన్నాత్మభావం**
**దుఃఖే మగ్న కిమితి సుచిరం దూయతే జంతు రేషః ।**
**సర్వం త్యక్త్వా వరవరమునే ! సంప్రతి త్వత్ప్రసాదాత్**
**దివ్యం ప్రాప్తుం తవ పదయుగం దేహి మే సుప్రభాతమ్ ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ !, కర్మాధీనే = దుష్కర్మలు, సత్కర్మలు ఉన్నంతవరకు విడువకుండా అనువర్తించే, వపుషి = శరీరంలో, ఆత్మభావం = ఆత్మ అనే భావాన్ని, కల్పయన్ = తెలిసికొనేవాడై (ఆరోపించి భావించేవాడనై), కుమతిః = విపరీతజ్ఞానాన్ని కల్గినవాడు, దుఃఖే =(అందువల్లనే)

దుఃఖంలో, మగ్నః = మునిగినవాడైన, ఏషః జంతుః = ఈప్రాణి (నేను), కిం = ఎందుకోసం, సుచిరం= చాలాకాలంగా, దూయతే = పరితపిస్తున్నాడు? ఇతి = అని, దేవరవారు భావించి, సంప్రతి = ఇపుడే, త్వత్ ప్రసాదాత్ = దేవరవారి భోగ్యమైన కృపతో, మే = దాసుడనైన నాకు, సర్వం త్యక్త్వా = అన్నిటిని విడచిపెట్టి, దివ్యం = అప్రాకృతమైన, తవ పదయుగం = దేవరవారి శ్రీచరణయుగాన్ని, ప్రాప్తుం = పొందడానికి (కారణమైన), సుప్రభాతం = మంచి ఉదయాన్ని, దేహి =అనుగ్రహించండి.

శ్రీవరవరమునీ! సత్కర్మ, దుష్కర్మలు ఉన్నంతకాలం విడువకుండా వెంటాడే శరీరంలో ఆత్మ అనే భావాన్ని కల్పించుకుంటూ, అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞానాలను కలవాడనై, దానివల్ల దుఃఖంలో మునిగినవాడనైన నేను ఎందువల్ల చాలా కాలంగా పరితపిస్తున్నాను? అని నా గూర్చి తమరు ఆలోచించి, ఇప్పుడే తమ మధురమైన దయతో అన్నిటిని విడచి, అప్రాకృతమైన తమ పాదద్వంద్వాన్ని పొందడానికి కారణం అయిన సుప్రభాతాన్ని నాకు అనుగ్రహించాలి.

వ్యాఖ్యానమ్ : **(సంప్రతి)** - ఇపుడే, ఈనాడే,

**(త్వత్ప్రసాదాత్)** - తమ నిర్హేతుకమైన అనుగ్రహం అనే హేతువువల్ల,

**(మే సర్వం త్యక్త్వా దివ్యం తవ పదయుగళం ప్రాప్తుం సుప్రభాతమ్)** - అవిద్యమొదలు భగవానుని వరకు గల అన్నిటిని విడచిపెట్టడమనే రీతిలోనిది, చరమపర్వరూపమైన తమ శ్రీపాదయుగళాన్ని పొందడానికి హేతుభూతమైనదైన చక్కని ప్రభాతకాలాన్ని- అని అర్థం. మీ విశ్లేషమనే కాళరాత్రికి అవసానదశరూపమైన ప్రాతఃకాలాన్ని-అని భావం. ఈ కర్మపదం **"దేహి"** అనే క్రియతో అన్వయిస్తుంది.

**(కర్మాధీనే)** - పుణ్యాపాపరూప ద్వివిధ కర్మానుగుణమైనది. కనుకనే అందుచేత ఔపాధికమని చెప్పబడింది. **"పొయ్ నిన్ఱ ఞానముమ్ పొల్లా వొ*ழு*క్కుమ్ అ*ழு*క్కుడమ్బుమ్"** అని నమ్మా*ழ்*వార్ల సూక్తి **"పొల్లా వొ*ழு*క్కుమ్"** (దుష్కర్మ) అని చెప్పినా అది సత్కర్మను కూడా ఉపలక్షిస్తుంది. **"ఉభే విద్వాన్ పుణ్యపాపే విధూయ"** అని వేదం సత్కర్మదుష్కర్మలు రెండూ బంధరాలని తెల్పింది. ఈ **"ఒ*ழு*క్కు"** (ప్రవర్తన - కర్మ) వల్ల **"అ*ழு*క్కుడమ్బు"** (మలిన శరీరం) కల్గుతుంది.

**(వపుషి ఆత్మభావమ్)** - ఆత్మ అనేది లేదని భావించడం. ఇది విపరీత జ్ఞానం. ఒక వస్తువును ఇంకొక వస్తువుగా గ్రహించడం. తాడును చూచి పాము అనుకొన్నట్లు అచిద్రూపమైన శరీరాన్ని చిద్రూపంగా భావించడం.

**(కుమతిః)** - జ్ఞానం ఉన్నా అదిదుష్టం. అన్యథా జ్ఞానాన్ని కల్గినవాడనై. తాడును చూచి పాము అని భ్రమిస్తే విపరీతజ్ఞానం. తెల్లని శంఖాన్ని పచ్చగా ఉందని అనుకుంటే అన్యథాజ్ఞానం. ఇవి రెండు ప్రకారి-ప్రకారాలకు చెందిన జ్ఞాన దోషాలు. (ధర్మి- ధర్మాల విపర్యాసాలు).

**(ఆత్మభావమ్)** - ఆత్మత్వాన్ని - అని కాని, ఆత్మరూపదార్థాన్ని - అని కాని అర్థం. భావశబ్దం పదార్థవాచకం కూడా.

**(కల్పయన్)** - కల్పించుకొనేవాడనై - అని అర్థం. దేహంలో ఆత్మత్వాన్ని ఆరోపిస్తే ధర్మివిపర్యాసం కాబట్టి అన్యథాజ్ఞానం. దేహాన్ని ఆత్మగా భావిస్తే ధర్మి విపర్యాసం కాబట్టి విపరీతజ్ఞానం. రెండూ ఆరోపాలే; అజ్ఞానాలే అందువల్లనే,

**(దుఃఖే మగ్నః దూయతే కిమితి)** - దుఃఖసముద్రంలో పూర్తిగా మునిగి బాధపడుతున్నాడే- అని,

**(ఇతి)** - **"మత్వా"** (భావించి) అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. ఇంతవరకు చెప్పబడినది శ్రీవరవరమునులకు తమ భక్తుల విషయంలో ఉన్న భావనకు అనువాదం.

**(సర్వం త్యక్త్వా)** - ఇంతకుముందు తెలిపిన రీతిలో అన్యథాజ్ఞాన- విపరీతజ్ఞానాలు, వాటివల్ల కలిగే అజ్ఞానం, దుఃఖం- వాటివల్ల కలిగే తాపం- వీటిని అన్నిటినీ విడచి,

**(దివ్యం తవ పదయుగం ప్రాప్తుమ్)**- గొప్పదైన తమ శ్రీపాదయుగళాన్ని పొందడం కోసం. **"ప్రాప్తమ్"** అని పాఠాంతరం.

**(సర్వం త్యక్త్వా దివ్యం పదయుగం ప్రాప్తమ్ సుప్రభాతమ్)** - అనే పాఠాంతరం వాధూల వీరరాఘవాచార్య స్వామివ్యాఖ్యలో ఆదరింపబడి వ్యాఖ్యానింపబడింది. అవిద్యమొదలు భగవంతునివరకు ఉండే అన్నిటినీ విడువడంతోపాటు, చరమపర్వం అయిన తమ శ్రీపాదద్వంద్వాన్ని పొందడంలో హేతుభూతం అయినది, శోభన ప్రభాతమంగళరూపమైనది, తమ విశ్లేషం అనే కాలరాత్రియొక్క అంతాన్ని సూచించేదైన ప్రాతఃకాల రూపసుప్రభాతాన్ని - అని ఆ వ్యాఖ్యలోని వివరణం. ఈ శ్లోక అవతారికలో కూడా **"కుశస్థలే నివసతి స చ ప్రాత రిహేష్యతి"** (శ్రీరాముడు ఈనాడు కుశస్థలంలో ఉన్నాడు, అతడు ఉదయమే ఇక్కడకు వస్తాడు) అన్నట్లు తమ ప్రాప్తికి హేతుభూతం అయినది, వెనువెంటనే సంభవించేది అయిన ప్రాతఃకాల రూపసుప్రభాతాన్ని - అని అవతారికలోని వివరణం. సుప్రభాతాన్ని తమరు సంకల్పించాలి- అని ఈ ప్రయోగంలోని భావమని తెలుపబడింది. శ్రీవరవరమునుల శ్రీపాదప్రాప్తిని ఏమాత్రం ఆలస్యం చేయకుండా కల్గించే ప్రభాతం సుప్రభాతం. ఇంతవరకు శ్రీవరవరమునుల విశ్లేషం అనే కాళరాత్రి యొక్క అవసానాన్ని సూచించేది ఈ సుప్రభాతం. ఇటువంటి సుప్రభాతాన్ని నాకు మీరు అనుగ్రహించాలి- అని తాత్పర్యం. **"ప్రాప్తమ్"** అనే పదానికి **"స్వరూపానురూపగుణమ్"** అని కొందఱు వివరించారు.

లేక, **"ఏష జంతుః"** అని ప్రారంభించి, **"దుఃఖే మగ్నః సన్ కిమితి దూయతే"** అని అన్వయించి, అర్థం చెప్పవచ్చు. అపుడు - **"సర్వం త్యక్త్వా"** - నా దోషాలను అన్నిటినీ చూడకుండా వదలిపెట్టి, నా విషయంలో **"క్షిపామి, న క్షమామి"** అనే నిగ్రహాన్ని ప్రదర్శించకుండా, అన్ని దోషాలను వాత్సల్యంతో క్షమించి, **"త్వత్ప్రసాదాత్"**- కాలుష్యం లేని- అంటే- దోషాలను లెక్కించి, తోసిరాజనడం - అనే కాలుష్యం లేని, ప్రసన్నమైన, స్వచ్ఛమైన తమ స్వభావం చేతగాని, అనుగ్రహంచేతగాని, దివ్యం - అప్రాకృతం అయిన, ప్రాప్తం = దాసుడనైన నాకు స్వరూపానురూపమైన, సుప్రభాతం = తమ అనుభవం సిద్ధించే గొప్ప దినానికి ప్రారంభమైన, తవ పదయుగం = తమ శ్రీపాదద్వయిని, మే = చరమపర్వనిష్ఠను కలవాడనై,

పూర్వం **"ఏష జంతుః"** అని నిర్దేశింపబడ్డ నాకు, దేహి = అనుగ్రహించండి- అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ అన్వయం స్తోత్రరత్నంలోని- **"కిం తు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ న తేఽనురూపః"** అనే సూక్తిని అనుసరిస్తూ చూపబడింది.

ఇక, ఈ స్తుతిలో "దివ్యం ప్రాప్తుం తవ పదయుగమ్" అని పలు మార్లు శ్రీవరవరమునుల శ్రీపాదాల దివ్యత్వాన్ని అభ్యాసం చేయడం ఆచార్యుని పట్లగల దివ్యత్వభావనతో- అని చెప్పాలి. ఆచార్యుని విషయంలో ఇటువంటి భావనను శిష్యుడు కల్గిఉండాలని, మానుషభావన తగదని శాస్త్రాలు తెలుపుతున్నవి. **"యో గురౌ మానుషం భావమ్"** అనే శ్రీభాగవతశ్లోకం ఇందులకొక ఉదాహరణం. **"యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ", "యస్య సాక్షాద్భగవతి జ్ఞానప్రదీపే గురౌ, మర్త్యబుద్ధిః శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్"** (జ్ఞానదీపాన్ని అనుగ్రహించిన, సాక్షాత్తు భగవానుడైన ఆచార్యుని విషయంలో మానవభావనను కలవాని జ్ఞానం అంతా గజస్నానంవలె నిష్ఫలం) **"తత్త మిఱైయిన్ నడివెన్జు తాళిణైయై వైత్తవరై ఇరాప్పిత్తరాయ్"** (తాము తాము ఆరాధించే భగవత్స్వరూపంగా, తమ శిరస్సులపై శ్రీచరణాలను పెట్టి అనుగ్రహించిన ఆచార్యులను భావించని ఉన్మత్తులై) ఇత్యాది జ్ఞానసార ప్రబంధపాశురం మొదలైన సూక్తులుకూడా స్మరణీయాలు. **"ప్రాప్తుమ్"** అనే పదానికి బదులు **"ప్రాప్తుః"** అనే పాఠాంతరాన్ని కొందఱు గ్రహించారు. అపుడు దానిని **"మే"** అనే సర్వనామపదానికి విశేషణంగా చేయాలి.

**54.** అవ :- తమ త్రికరణాత్మకాలైన అన్ని కృత్యాలు శ్రీవరవరమునులను గూర్చేకావాలి - అని ఈ శ్లోకంలో స్తుతికర్త ఆశపడుతున్నారు. లేక, శ్రీవరవరమునుల విషయంలో అనుభవజనిత ప్రీతికారిత కైంకర్యాన్ని కరణత్రయాలతో చేయాలని ఆశపడుతున్నారని కూడా చెప్పవచ్చు. **"అభినివేశాతిశయేన అన్యపరజ్ఞానాది జనకసామగ్ర్యధీనజన్మకజ్ఞానాదికం త్వద్విషయసంస్మరణాదిరూపేణ జాయతా మిత్యాహ"** అని వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్యానంలోని అవతారిక. "ప్రపన్నస్యాపి" అనే రీతిలో ప్రపన్నునకు కూడా లోకంలో ఉన్నంతకాలం పంచేంద్రియాల ద్వారా కరణత్రయం ద్వారా ఆయా ఇంద్రియాలకు కరణాలకు తగిన వస్తుసామగ్రి ద్వారా జ్ఞానం కలుగకతప్పదు. అయితే, ఆ జ్ఞానం దేవరవారి స్మృతికి కారణం కావాలని ఆశపడుతున్నారని భావం. ఈ విధమైన అనుభవాన్ని నమ్మాళ్వార్లకు **"వాయుమ్ తిరైయుకళుమ్"** అనే (2-1) తిరువాయ్‌మొழி దశకంలో, గోదాదేవికి **"శిన్దుర చ్చెమ్బొడి"** అనే నాచ్చియార్‌తిరుమొழி దశకంలో, **"దివి వా భువి వా మమాస్తు వాసో నరకే వా... అవధీరితశారదారవిందౌ చరణౌ తే మరణేఽపి చింతయామి"** అని కులశేఖరులకు కల్గింది. అయితే అది ఇచట చరమపర్వాత్మకం కావడం విశేషం. **"నిరయత్తొయ్యిల్ కిడక్కిలుమ్ శోదివిణ్ శేరిలుమ్ ఇవ్వరుళ్ నీ శెయ్యిల్ తరిప్పన్"** అనే ఇరామానుశ నూఱ్ఱన్దాది సూక్తిని కూడా ఒకవిధంగా ఇక్కడ అన్వయించుకోవచ్చు.

**యా యా వృత్తి ర్మనసి మమ సా జాయతాం సంస్మృతి స్తే**
**యో యో జల్ప స్స భవతు విభో నామసంకీర్తనం తే ।**
**యా యా చేష్టా వపుషి భగవన్! సా భవేద్వందనం తే**
**సర్వం భూయాద్వరవరమునే! సమ్యగారాధనం తే ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, మమ మనసి = నా (దాసుని) మనస్సులో, యా యా వృత్తిః = ఏ యే భావన, జాయతే = పుడుతున్నదో, సా = ఆ భావన అంతా, తే సంస్మృతిః=దేవరవారిని గూర్చిన గొప్ప స్మృతిగానే, జాయతాం = కలగాలి, విభో = స్వామీ!, యః యః జల్పః భవతి = ఏయే మాట (నానోటినుండి) పుడుతున్నదో, సః= ఆయా మాట అంతా, తే నామసంకీర్తనం = దేవరవారి తిరునామ సంకీర్తనంగా, భవతు = కావాలి, భగవన్ = జ్ఞానశక్త్యాది గుణపూర్ణా!, మమ వపుషి = దాసుని దేహంలో, యా యా చేష్టా = ఏయే కార్యం, భవతి = పుడుతున్నదో, సా = ఆ కార్యం అంతా, తే వందనం = దేవర వారికి చేసే నమస్కారంగానే, భవేత్ = కావాలి, సర్వం = ఇంతవరకు చెప్పినవి, చెప్పనవి అన్నీ, తే = దేవరవారికి (చేసే), సమ్యక్ ఆరాధనం = చక్కని ఆరాధనగానే, భూయాత్ = కావాలి.

భగవన్! శ్రీవరవరమునీ! దాసుని మనస్సులో ఏయే భావన కలుగుతున్నదో, అది అంతా తమకు సంబంధించిన స్మృతిగానే కావాలి. స్వామీ! నానోటినుండి ఏయే మాటలు వస్తున్నవో, అవి అన్నీ మీ నామసంకీర్తనాలు కావాలి. శ్రీవరవరమునీ! నా దేహంతో ఏయే చేష్టలు చేయబడుతున్నవో, అవి అన్నీ తమకు చేసే వందనాలుగానే ఉండాలి. అన్నీ మీకు చక్కని ఆరాధనారూపాలుగానే పర్యవసించాలి.

**వ్యాఖ్యానమ్ : "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్"** అని గీతలో చెప్పిన రీతిలో కరణాలు కుర్వద్రూపాలు. ఎప్పుడూ ఏదో ఒక పనిని చేయకమానవు. అందువల్ల ప్రకృతిసంబంధాన్ని కల్గిన నాకు ఆయా కారణాలవల్ల కలిగే, ఇతరవిషయాలను గూర్చిన భావన, స్మృతి, మాట, చేష్ట మిగిలిన అన్నీ తమను గూర్చిన భావన, స్మృతి, మాట, చేష్టలుగానే కావాలి- అని ప్రార్థించడంలో తాత్పర్యం ఏమంటే- ఇతర విషయాలకు సంబంధించిన స్మృత్యాదులను కల్గించే కారణాలే, వాటిని కల్గించకుండా, శ్రీవరవరమునులనుగూర్చిన స్మృత్యాదులను కల్గించాలని ప్రార్థించడమే. అటువంటి శక్తి శ్రీవరవరమునులకు ఉన్నది- అనే విషయాన్ని సూచించడం కోసమే **"భగవన్", "విభో"** అనే సంబోధనలు చేయబడ్డాయి.

**(మనసి)- "చంచలం హి మనః కృష్ణః"** అని, **"నిన్టవా నిల్లా నెఞ్జు"** అని, **"అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్"** అని ఈ రీతిలో చెప్పబడేటట్లు చాలా చంచలం అయిన మనస్సులో- అని అర్థం.

**(యా యా వృత్తిః జాయతామ్)- "జాయతామ్"** అనే లోట్ రూపం అర్హతార్థంలో ప్రయోగింపబడింది. ఏ యే భావన కల్గడానికి అర్హత ఉన్నదో- అని అర్థం.

**(సా)-** ఆయా కారణాలవల్ల అవర్జనీయంగా కలిగే ఆ జ్ఞానం,

**(తే సంస్మృతిః జాయతామ్)** - స్మరిస్తే సుఖాన్ని కల్గించే మీయొక్క సమ్యక్ స్మృతిగా కావాలి - అనే విశేషార్థం **"తే"** అనే సర్వనామశబ్దం ద్వారా వ్యక్తం. ఇక్కడి **"లోట్"** ప్రార్థనార్థకం. ఇక విషయానికి సంబంధించిన జ్ఞానం ఇంకొక విషయానికి సంబంధించిన స్మృతి ఏవిధంగా కల్గుతుంది? అంటే, గోమయంనుండి వృశ్చికోత్పత్తివలె, శరణ్యుని శక్తివిశేషంచేత కల్గడంలో అనుపపత్తి లేదని వాధూల

వీరరాఘవాచార్య వ్యాఖ్య. అంతేకాని, నాకు బుద్ధిపూర్వకమైన నిషిద్ధప్రవృత్తి తప్పక కల్గనీ, అది మీ సంస్కృతివలె భోగ్యంగా ఉండనీ - అనే అర్థాన్ని గ్రహించకూడదు. అపుడు సంస్కృత్యాది పదాలకు లక్షణావృత్తి గ్రహించవలసిన అగత్యం ఏర్పడుతుంది. అంతేకాక, వరవరముని కైంకర్యాన్ని ప్రార్థించే ఈ సందర్భాన్ని ఈ అర్థం అనుగుణం కూడా కాదు కదా!

**(యో యో జల్పో మమ భవతు)** - ఆ యా కారణావల్ల ఏయే జల్పనాలు (భాషణాలు) నాచేత **"విష్ణోర్ పరవుమ్"** అనే రీతిలో చేయబడతాయో - అని భావం. పూర్వం వలె ఇక్కడ కూడా **"లోట్"** అర్థాతార్థకం. ఏ యే మాటలు నాచే పల్కాదగినదో - అని అర్థం. **"యద్ధి మనసా ధ్యాయతి"** అనే వైదిక క్రమాన్ని అనుసరించి మానసిక ప్రవృత్తి పూర్వం తెలుపబడగా, ఇపుడు **"తద్వాచా వదతి"** అనే క్రమంలో పలుకబడింది.

**(సః తే నామసంకీర్తనం భవతు)** - ఆ భాషణం అంతా తమ దివ్యనామధేయాల సమ్యక్ కీర్తనంగా పరిణమించాలి. పూర్వంవలె ఇక్కడి **"లోట్"** ప్రార్థనార్థకం.

**(మమ వపుషి యా యా చేష్టా భవేత్)** - **"యన్మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి"** అనే వైదిక సూక్తి క్రమంలో ముందుగా మనోవ్యాపారాన్ని, తరువాత వాగ్వ్యాపారాన్ని చెప్పి, ఆ పిమ్మట ఇపుడు తమ శరీర చేష్టలనుగూర్చి ప్రస్తావిస్తున్నారు. సంస్కారవశంచేత సంకల్పితాలుగానో, అసంకల్పితాలుగానో చేసే నా శరీరవ్యాపారాలు అన్నీ - అని అర్థం.

**(సా మమ చేష్టా తే సమ్యగ్వందనం భవేత్)** - మీకు అవి చక్కని నమస్కృతులుగానే కావాలి. దేవరవారికి నిరతిశయ ముఖోల్లాసాన్ని కల్గించే వ్యాపారాలుగా కావాలి. **"వది - అభివాదన, స్తుత్యోః"** అనే ధాతువునుండి నిష్పన్నమైన ఇచటి **"వందన"** శబ్దం కేవలం అభివాదాన్ని మాత్రం తెలుపుతుంది. వాచికరూపం అయిన స్తుతి ప్రస్తుతపూర్వం కదా!

**(సర్వం తే సమ్యగారాధనం భూయాత్)** - ఇంతవరకు చెప్పినది, చెప్పనిది - అంతా - మిమ్ములను సంతోషపెట్టేదిగా కావాలి. ఏతావతా, **"తొழுదు, వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క"**, **"శిన్దైయినాల్ శొల్లినాల్ శెయ్‌కైయాల్"**, **"మనసా వాచా కర్మణా"** అని చెప్పే రీతిలో స్మృతి-కీర్తన-ప్రణామాల నమవాయ రూపమైన, మనోవాక్కాయాలనబడే కరణత్రయాలద్వారా చేయబడే సమ్యగారాధనం తెలుపబడింది. తమకు నిరతిశయ ముఖోల్లాసాన్ని కల్గించే వ్యాపారాలుగా కావాలి. ఆవిధంగా అవి ఉత్పత్తి దశలో నుండి అయినపుడు ఇక ప్రాయశ్చిత్తానుష్ఠాన క్లేశం కూడా ఉండదుకదా - అని భావం - అని శ్రీవాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. **"ఉత్పత్తిదశాయామేవ తథావిధత్వేనోత్పత్తేః న ప్రాయశ్చిత్తానుష్ఠానక్లేశ ఇతి భావః"** అని అచటి సూక్తి.

ఈ శ్లోకార్థానికి అనుగుణంగా **"దాస్యాభిమానోఽనువ్రజ్యా శ్రవణం కీర్తనం స్మృతిః"**, **"ఆత్మనోఽహ్యతినీచస్య యోగిధ్యేయపదార్హతామ్, కృపయైవోపకర్తార మాచార్యం సంస్మరేత్ సదా"** ఇత్యాది సూక్తుల భావాన్ని అనుసంధించాలి. **"జాయతామ్"** ఇత్యాది క్రియాపదాలను ఆవృత్తి చేసికోకుండా, **"మనసి యా**

**యా వృత్తిః, యద్యత్ జ్ఞానం, సా తే సంస్మృతి ర్జాయతామ్, తత్ జ్ఞానం త్వత్ స్మృతిరూపం సదుత్పద్య తామ్"** (దాసుని మనస్సులో కలిగే జ్ఞానం అంతా తమ తలపుగానే, నా నోటినుండి వచ్చే వాక్కులన్నీ తమ కీర్తనాలుగానే, నా దేహంతో చేసే క్రియలన్నీ తమ ఆరాధనగానే కావాలి)అని అర్థం చెప్పడం కూడా తగినదే. **"జాయతామ్, భవేత్, భవతు"** ఇత్యాది క్రియారూపాల లకారాలను మార్చి **"జాయతే, భవతి"** ఇత్యాదిగా అన్వయించవచ్చునని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య.

**55.** అవ :- ఇక, ఈ శ్లోకంలో తిరుమంత్రంలోని నమశ్శబ్దం ద్వారా ప్రతిపాదింపబడ్డ తదీయ పర్యంతకైంకర్యాన్ని ఉత్తరార్ధంద్వారా ప్రార్థిస్తూ, తదీయుల విషయంలో తీవ్రమైన రుచి సిద్ధించడంకోసం తత్పూర్వం కలుగవలసినదైన, ప్రకృతంలో **"తదీయ"** శబ్దంలోని తత్పదంచేత చెప్పబడే శ్రీవరవరమునుల విషయంలో పరమభక్తిని పూర్వార్ధం ద్వారా ప్రార్థిస్తున్నారు. ఇక్కడ తదీయులంటే- శ్రీవరవరమునులతో సాక్షాత్తుగానో, పరంపరగానో సంబంధాన్ని పొందిన దాసులు. భగవానునిబట్టి చూస్తే శ్రీవరవరమునులు చరమపర్వం. శ్రీవరవరమునులబట్టి చూస్తే వారి శిష్యులు చరమపర్వం. ఈ చరమపర్వం చాలా గొప్పది. ఈ చరమపర్వంలోనే ప్రకృత శ్లోకంలో కైంకర్యం ప్రార్థింపబడుతున్నది. ఈ ప్రార్థన **"యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ, త్వా మనుస్మరత స్సా మే హృదయాన్మాపసర్పతు"** అనే విష్ణు పురాణ శ్లోక రీతిలో చేయబడుతున్నదని వీరరాఘవాచార్యవ్యాఖ్య.

> **కామావేశః కలుషమనసా మింద్రియార్థేషు యోఽసౌ**
> **భూయో నాథే మమ తు శతధా వర్తతా మేవ భూయాన్ ।**
> **భూయోఽప్యేవం వరవరమునే! పూజనత్వే ప్రియాణాం**
> **భూయోభూయ స్తదనుభజనే పూర్ణకామో భవేయమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, కలుష మనసాం = కాలుష్యాన్ని, మలినాన్ని కల్గిన మనస్సును కలవారికి, యః కామావేశః = ఎటువంటి కామంయొక్క ఆవేగం, ఇంద్రియ+అర్థేషు = ఇంద్రియాలకు లక్ష్యాలైన శబ్దాదివిషయాలలో, వర్తతే = ఉంటుందో, అసౌ = అటువంటి కామావేశం, మమ=దాసుడనైన నాకు, నాథే =స్వామి అయిన దేవరవారి విషయంలో, భూయః= పలుమార్లు, శతధా= పలు రీతులలో, భూయాన్ = మిక్కిలి పెద్దదిగా, వర్తతాం = ఏర్పడాలి, ఏవం = ఈవిధంగానే, త్వత్ ప్రియాణాం = దేవరవారికి ప్రీతికి పాత్రమైన భక్తుల, పూజనే = పూజించడంలో, భూయః= పలురెట్లుగా, పూర్ణకామః= అంతులేని ఆశను కలవాడనుగా, భవేయం = కాగలను, తత్ అనుభజనే = దేవరవారి దాసులను పూజించడం- అనేదానిని అనుసరించిన భజనంలో (అంటే- దేవరవారి దాసులెవరో, వారి దాసులెవరో, వారికి చేసే కైంకర్యంలో) భూయః భూయః= పలురెట్లుగా, పూర్ణకామః= అంతులేని ఆశను కలవాడుగా, భవేయం = కాగలను.

శ్రీవరవరమునీ! లౌకిక వాంఛలతో కలుషమైన మనస్సును కలవారికి ఎంతటి కామావేశం లౌకిక విషయాలలో కలుగుతుందో, అటువంటి కామావేశమే దాసునకు స్వామి అయిన తమపట్ల పలు మార్లు

పలు రీతుల్లో మిక్కిలి ఎక్కువగా కలగాలి. ఈవిధంగానే, మీకు ఇష్టులైన తమ దాసులను పూజించడంలో పలురెట్లుగా అంతులేని ఆశను కలవాడనుగా కావాలి. మీదాసులను పూజించేవారిని పూజించడంలో మాటిమాటికి పలురెట్లుగా అవధి లేని అభినివేశాన్ని కలవాడనుగా కావాలి.

వ్యాఖ్యానమ్ : ఈ శ్లోకంద్వారా, శ్రీవరవరమునుల పట్ల, వారి దాసులపట్ల, ఆదాసుల దాసులపట్ల పరమభక్తిని కల్గి ఉండాలని ప్రార్థించినట్లయింది. ప్రథమపర్వం భగవద్విషయం అయితే, చరమపర్వం ఆచార్యవిషయం- అని ఇతః పూర్వమే చెప్పబడింది. ఈ శ్లోకంలో ఆ చరమపర్వం అయిన శ్రీవరవరమునులను ప్రథమపర్వంగాను, వారి దాసులను మధ్యమపర్వంగాను, వారికి దాసులను చరమపర్వంగాను నిరూపించడం గమనించతగినది. ఇది ఆచార్య విషయంలోని చరమపర్వనిష్ఠ.

**(కలుషమనసామ్)** - క్షోభను పొందిన మనస్సును కలవారియొక్క,

**(యః)** - ఏ స్వరూపాన్ని కల్గిన, ఎంత పరిమితిని కల్గిన,

**(కామావేశః)** - తన ప్రకృతిని విస్మరిచడంతో పాటుగా శరీరానికి పారవశ్యాన్ని కల్గించే దశావిశేషమే ఆవేశం. (ఇది అభినివేశాతిశయ పరిణామం) ఉన్నదో,

**(అసౌ)** - అటువంటి, అంతటి పరిమాణాన్ని కల్గిన కామావేశం - వరవరమునుల విషయంలోని పరమభక్త్యతిశయ రూపం - అని భావం.

**(మమ నాథే)** - నాకు స్వరూపానురూపశేషిభూతులైన మీ పట్ల,

**(భూయః శతథా భూయాన్)** - పలుమార్లు - పలు రీతుల్లో - అంతు లేనిదిగా కావాలి. **"భూయో వర్తతామ్, శతథా వర్తతామ్ భూయాన్ వర్తతామ్"** - మాటిమాటికి వేలాది రీతులలో అంతులేనిదిగా కావాలి. **"కణ్ణినుక్కే ఆమదు కామమ్"** అనే సూక్త్యర్థం చరమపర్వాత్మకంగా అనుసంహితం.

**(ఏవమ్)**- మీ విషయంలో ఏవిధమయిన కామావేశం ప్రార్థింపబడిందో- ఆవిధమైన అభినివేశం. **"భూయః, శతథా, భూయాన్"** అని విశేషింపబడ్డ అభినివేశం.

**(భూయః)**- ఇంకా ఎక్కువగా కావాలి.

**(తదనుభజనే)**- మీ దాసుల దాసులను భజించడంలో కలగాలి- అని భావం. **"యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ"** ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో లోకంలోనివారికి లౌకికవిషయాలలోని నిరవధికమైన ఏ ప్రీతి కలుగుతున్నదో, అటువంటి ప్రీతి దాసునకు తమ విషయం, తమ దాసుల విషయంలో, తమ దాసదాసుల విషయంలో కలగాలని కవి ప్రార్థించినట్లయింది. మాటలకు మించిన, అంతులేని పలువిధాలైన రీతిలో కలగాలని భావం.

తిరుమంత్రంలోని నమశ్శబ్దంద్వారా తదీయపర్యంత కైంకర్యం వివక్షితం అనే విషయాన్ని శ్రీపిళ్లైలోకాచార్యులవారు ముముక్షుప్పడిలో- **"ఉఱ్ఱదు మున్నడియార్క్కడిమై - ఎన్డైయాలే ఇతిలే**

భాగవతశేషత్వమనుసంధేయమ్" అని సూత్రీకరించగా, శ్రీవరవరమునులు "ఇప్పదత్తిలే తదీయశేషత్వమ్ ఆర్థమాక అనుసంధేయమాకైయాలే అత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ - అతావతు నిన్ తిరువెట్టెழுత్తుమ్ కఱ్ఱు నానుఱ్ఱదు మున్నడియార్‌క్కడిమై - ఎన్నుమివ్వర్థత్తిలే- ఎన్గిఱపడియే అహంకార మమకారజ్గళ్ నివృత్తమాయ్, భగవచ్ఛేషత్వమ్ ఉళ్ళపడి ప్రకాశిక్కిఱ ఇన్నమస్సాలే తత్కాష్ఠైయాన భాగవతశేషత్వమ్ అనుసంధిక్కవేణ్డుమెన్గై." (ఈ పదంలో తదీయశేషత్వాన్ని అర్థతః అనుసంధించవలసి ఉన్నది కనుక దానిని అనుగ్రహిస్తున్నారు. అంటే - నీ అష్టాక్షరిని అభ్యసించి, నేను ఊనికను కల్గినది - నీ దాసులకు శేషంగా ఉండడంలోనే - అనే ఈ అర్థంలో- అనే రీతిలో అహంకార-మమకారాలు తొలగి భగవచ్ఛేషత్వం అనుసంధించాలి - అని భావం) అని దీనిని వ్యాఖ్యానించారు.

**56.** అవ :- గడచిన శ్లోకంలో శ్రీవరవరమునులు, వారి దాసులు, వారి దాసులు- అనే వీరి విషయంలో **"ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** అనే రీతిలో చేసే సర్వకాల సర్వావస్థలలో సకల విధకైంకర్యాలకు కారణమైన, వారి ముగ్గురి విషయంలో ఉండవలసిన అభినివేశాతిశయం ఏర్పడాలని ప్రార్థించబడింది. ఇపుడు, అటువంటి అభినివేశాతిశయం కల్గితే, దానివల్ల చేసేది, ముందు తాము ప్రార్థించినదైన కైంకర్యాన్ని చేయడంలో- భక్ష్యాభక్ష్యభక్షణం, సేవ్యాసేవ్యసేవనం, కృత్యాకృత్యకరణం - అనే ఇవి ఇటువంటి చరమోపాయాధికారికి సంభవించినా దానివల్ల విరోధం ఏమీ ఉండదు. ఎందుకు ఉండదు? అవి శాస్త్రాలలో త్యాజ్యాలుగా ప్రాప్యవిరోధాలుగా, అనర్థ సాధకాలుగా చెప్పబడ్డాయికదా! అని అంటే, అవి అన్నీ ముందు పల్కిన చరమపర్వాత్మకమైనఅభినివేశాతిశయం కారణంగా ఏర్పడినవి కనుక, భగవానునకు ఇష్టంలేక పోవడానికి కాని, పురుషార్థహానికి కాని కారణం కానందువల్ల విరోధం ఏమీ ఉండదు. **"అత్యంత భక్తియుక్తానాం న శాస్త్రం నైవ చ క్రమః"** అని కదా సూక్తి. అందువల్లనే కదా అనన్యదైవత్వమనే స్థితి కూడా శిథిలమయే రీతిలో గోదాదేవి కామదేవుని ఆశ్రయించడ మనే ప్రవృత్తి దుష్టమని చెప్పబడకపోవడమే కాదు, **"అడిక్కழுఞ్జపెరుమ్"** అనే రీతిలో అత్యంతం గొప్పగా శ్లాఘింపబడుతున్నదని పూర్వాచార్యులు అనుగ్రహించారు. లోకాపవాదభీతి ప్రసక్తి కూడా లేదు. వీటినిబట్టి ముందు ప్రస్తావించిన అభక్ష్యభక్షణ- అకృత్యకరణ కృత్యా కరణ అసేవ్య సేవనాదులు చేసినా సరే, శ్రీవరవరమునులకు, వారి దాసులకు, వారి దాసులకు కైంకర్యాన్ని చేయడం యుక్తం- అభినివేశాతి శయం లేనివారికే ఈ శాస్త్రనియమాలు - అని ఇందులో అంటున్నారు. భక్ష్యాభక్ష్య - సేవ్యాసేవ్య - కృత్యాకృత్యాల వివరం లక్ష్మీతంత్రాదులలో (17వ అధ్యాయంలో) గమనించవచ్చు.

**భక్ష్యాభక్ష్యే భయవిరహిత స్సర్వతో భక్షయిత్వా**
**సేవ్యాసేవ్యౌ సమయరహిత స్సేవయా తోషయిత్వా ।**
**కృత్యాకృత్యే కిమపి న విదన్ గర్హితం వాఽపి కృత్వా**
**కర్తుం యుక్తం వరవరమునే! కాంక్షితం త్వత్ప్రియాణామ్ ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ! (అభినివిష్టః = కామావేశాన్ని కలవాడొకడు), సర్వతః = భగవానుని అనంగీకారం, పురుషార్థహాని - అనే వానిలో దేనివల్లకూడా, భయరహితః = భయం లేనివాడై,

భక్ష్య+అభక్ష్యే = తినదగిన, తినదగని వస్తువును, భక్షయిత్వా అపి = భక్షించినా, సమయరహితః = ఏ ఆచార్య నియమ వ్యవస్థను లేనివాడనై, సేవ్య+అసేవ్యౌ = సేవించదగినవానిని, సేవించదగనివానిని, సేవయా = సేవతో, తోషయిత్వా అపి = ఆనందింపజేసినా, గర్హితం కమపి = దూషించబడిన ఏపనిని కూడా, న విదన్ = తెలియనివాడనై, కృత్య+అకృత్యే = చేయదగినవానిని, చేయదగనివానిని, కృత్వా అపి వా = చేసినా, త్వత్ ప్రియాణాం = దేవరవారి దాసులకు, కాంక్షితం = ఆశించదగిన కైంకర్యాన్ని, కర్తుం యుక్తం = చేయదగినవాడవుతున్నాడు.

ఓ శ్రీవరవరమునీ! మిక్కుటం అయిన కామావేశాన్ని కలవాడు, "ఇది భగవానునకు అభిమతం కాదు, పురుషార్థహానికరం"- అనే భయం ఏమీ లేకుండా భక్షించదగినవానిని, భక్షించకూడనివానిని కూడా భక్షించి అయినా, వ్యవస్థను దేనినీ పాటించనివాడై సేవించదగినవారిని, సేవించరానివారిని కూడా సేవిస్తున్నవాడై అయినా, ఇది నిందించదగిన పని- అనికూడా గమనించనివాడై, చేయదగిన కార్యాలను, చేయదగని కార్యాలను చేసి అయినా నీ దాసులకు అభిలషణీమైన కైంకర్యాన్ని చేయడం యుక్తం సుమా!

మూడవపాదంలో ఉండే **"వా"** అనే పదం వికల్పాన్ని, **"అపి"** అనే పదం సముచ్చయార్థాన్ని తెలుపుతున్నది. అందువల్ల పూర్వం పల్కిన మూడింటిలో ఏదో ఒకటి సంభవించినా, లేక మూడు కలసి సంభవించినా ఏదోషం లేదు- అని తెలుపబడినట్లయింది. **"యుక్తమ్"** అనే పదం అవ్యయం. ఇది **"అభినివిష్టః"** అని అధ్యాహారం చేసికోబడ్డ కర్తృపదానికి చెందిన క్రియ. తగినవాడని తాత్పర్యం. **"యత్త్వత్ప్రియం తదిహ పుణ్య మపుణ్యమన్యత్"** ఇత్యాది కూరేశ సూక్తి చరమపర్వాత్మకంగా భావ్యం.

**వ్యాఖ్యానమ్** - ఈశ్లోకంలో **"అభినివిష్టః"** అనే ప్రథమాంతపదం అధ్యాహారం చేయాలి.

**(అభినివిష్టః)** పూర్వం ప్రార్థించిన, లోకం అంతా చూచిన, వరవరమునులపట్ల అతిమాత్రమైన అభినివేశాన్ని కల పురుషుడు,

**(సర్వతః)** లోకాపవాదం, భగవంతునకు అభిమతం కాకపోవడం, పురుషార్థహాని -అనే వీనిలో దేనివల్ల కూడా,

**(భయవిరహితః)** - భవిష్యత్తులో అనర్థం జరుగుతుందనే సందేహరూపంలోని భీతి ఏది ఉన్నదో, అదికూడా లేనివాడై,

**(భక్ష్యాభక్ష్యే భక్షయిత్వా)** - భక్ష్యమంటే - పురుషార్థసాధకమైన భక్షణక్రియకు కర్మభూతమైనది (తినదగినది), అభక్ష్యమంటే - అనర్థాన్ని కల్గించే భక్షణ ప్రక్రియకు కర్మభూతమైనది- అంటే- తినకూడనిది- అయిన వస్తువులను భుజించి అయినా అని అర్థం. ఈ ప్రయోగం **"త్వత్ప్రియాణాం కాంక్షితం కర్తుం యుక్తమ్"** (మీకు ప్రియమైన వారికి ఇష్టమైన కైంకర్యాన్ని చేయడం తగినది) అనే ప్రయోగంతో అన్వయిస్తుంది. భక్ష్యమంటే- ద్వాదశినాడు భుజించే అవిసెకూర (మునిశాకం) మొదలైనవి అభక్ష్యమంటే ఉల్లిగడ్డలు మొదలైనవి.

**(సమయరహితః)** - ఏవిధమైన వ్యవస్థను పాటించనివాడనై,

**(సేవ్యాసేవ్యౌ తోషయిత్వా)** - సేవ్యులంటే - పురుషార్థాన్ని సాధించే కైంకర్యమనే దానికి కర్మభూతులైన, ఆయా కర్మలనే ఉపాధివల్ల ఏర్పడిన తల్లిదండ్రులు మొదలైనవారు. అసేవ్యులంటే- అనర్థాన్ని కల్గించే సేవకు కర్మభూతులైన నీచాదులు. వారిని సేవతో సంతోషపెట్టి - అని భావం. దీనికి కూడా **"త్వత్ప్రియాణామ్"** ఇత్యాది ప్రయోగంతో అన్వయం. సేవించదగినవారని, సేవించదగనివారు -అనే తారతమ్యం లేకుండా ఎవరినైనా సరే సేవించి, సంతోషపెట్టి- అని తాత్పర్యం.

**(కిమపి గర్హితం న విదన్ సన్)** - నిందింపబడిన కర్మలలో దేనినీ తెలియకుండా.

**(కృత్యాకృత్యే కృత్వా)** - పురుషార్థసాధకాలైన కృత్యాలను, పురుషార్థవిరోధులైన కృత్యాలను ఆచరించి - అని అర్థం. దీనికి కూడా **"త్వత్ప్రియాణామ్"** అనే దానితో అన్వయం. **"వా, అపి"** అనే అవ్యయాలవల్ల, పైన తెల్పినవాని సముచ్చయం, వికల్పం స్ఫురిస్తుంది. అంటే - భక్ష్యాన్ని భక్షించి, లేక, అభక్ష్యాన్ని భక్షించి, లేక రెండిటిని భక్షించి - అని, సేవించదగినవారిని సేవించి, లేక, సేవించదగనివారిని సేవించి, లేక, ఈ ఇద్దఱిని సేవించి - అని కృత్యాలను చేసి, లేక, అకృత్యాలను చేసి, లేక ఈ రెండిటిని చేసి - అని భావం.

**(త్వత్ప్రియాణామ్)** - నీకు ప్రియమైన వారికి, నీ ప్రీతికి విషయమైనవారికి - అని అర్థం.

**(కాంక్షితమ్)** - కాంక్షకు అర్హమైనదనే అర్థం. ఇక్కడ **"క్త"** ప్రత్యయం అర్హార్థంలో వచ్చింది. దీనివల్ల వరవరమునుల భక్తుల కాంక్షకు విషయం కాదగని వానిని చేయకపోవడం వల్ల స్ఫురిస్తుంది. వరవరముని భృత్యుల అభినివేశాతిశయ స్వరూపాన్ని పర్యాలోచన చేసినపుడు వారి కాంక్షకు అనర్హమైన కృత్యాలను చేసే ప్రసక్తిలేదు. ఈ కవియే **"అపగతమదమానైః అంతిమోపాయనిష్ఠైః, అధిగతపరమార్థైః. అర్థకామానపేక్షైః నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః వరవరమునిభృత్యైః"** (గర్వం దురభిమానం లేనివారు, ఆచార్యుడే ఉపాయం, అంతిమోపాయంలోనిష్ఠను కలవారు, ఆచార్యకైంకర్యమనే పరమార్థాన్ని పొందినవారు, అర్థకామాలను ఆశించనివారు, అందఱిపట్ల స్నేహభావాన్ని కలవారు, క్రోధాన్ని, లోభాన్ని జయించినవారైన వరవరముని భక్తులు) అని పలికారుకదా! అటువంటి విలక్షణమైన కాంక్షను,

**(కర్తుం యుక్తమ్)**- చేయడం తగినది - అని అర్థం. ఇక్కడ తాత్పర్యమేమంటే - వరవరముని భృత్యులపట్ల అభినివేశాతిశయం కల్గిన పురుషుడు తనకు గల ఆ గొప్ప అభినివేశం కారణంగా నిర్భయంగా భక్ష్యాభక్ష్య భక్షణం, సేవ్యాసేవ్యసేవనం, కృత్యాకృత్యకరణం- అనే వీనిని చేయడంలో ఏ దోషం లేదని భావం. ప్రాణం పోయే సమయంలో ఏపని అయినా, ఏమి భక్షించినా ప్రాణాన్ని నిలుపుకోవడం తప్పులేదు. **"సర్వాన్నానుమతి శ్చ ప్రాణాత్యయే"** అనే సూత్రార్థం స్మరణీయం. అదే విధంగా **"అత్యంతభక్తి యుక్తానాం న శాస్త్రం నైవ చ క్రమః"** (మిక్కిలి భక్తిని కలవారికి ఏ శాస్త్రం వర్తించదు, ఏ క్రమం లేదు) ఇత్యాదులు స్వరూపానురూపమైన అభినివేశాన్ని కలవారి విషయంలో దోషాన్ని కల్గించదు - అనే విషయాన్ని తెల్పుతాయి. **"యుక్త"**మనే పదం అవ్యయం.

**57.** అవ :- గడచిన శ్లోకంలో తెల్పిన రీతిలో అభక్ష్యభక్షణాదులకు అనిష్ట ప్రయోజకత్వం- అంటే- మోక్షాన్ని పొందడంలో అడ్డుకొనే శక్తి ఏమాత్రం లేదు. ఆవిధంగా కాకుండా, ఒకవేళ అటువంటి అనిష్టప్రయోజకత్వం ఉన్నా, ముందు తెల్పిన చరమపర్వకైంకర్యం అనే పరమపురుషార్థం సిద్ధించేటపుడు ఆ మూడు మోక్షప్రాప్తిని అడ్డుకొని, నరకాన్ని కల్గించినా కూడా, అది ఒక విషయమే కాదు. దానిని నేను ఆనందంగా అనుభవిస్తాను - అని ఇందులో అంటున్నారు.

**వృత్తిం త్రాతుం వరవరమునే! విశ్వతో వీతరాగైః**
**ప్రాప్యం సద్భిః పర మిద మసౌ నేచ్ఛతి బ్రహ్మసామ్యమ్ ।**
**నిర్మర్యాదః పతతు నిరయే నిందితై రప్యనల్పైః**
**లబ్ధ్వా కించిత్ త్వదనుభజనం త్వన్ముఖోల్లాసపూర్వమ్ ॥**

వరవరమునే! = ఓ మణవాళమహామునీ!, అసౌ = చరమపర్వంలో అభినివేశాన్ని కల్గిన ఇతడు (నేను), విశ్వతః వీతరాగైః= ఐశ్వర్యాది పురుషార్థాలలో ఆశను లేనివారైన, సద్భిః= బ్రహ్మజ్ఞానులచే, ప్రాప్యం = పొందదగిన, పరం బ్రహ్మసామ్యం = (అపహత పాప్మత్వాది గుణాష్టకావిర్భావరూపమైన) పరిపూర్ణమైన బ్రహ్మసామ్యమనే మోక్షాన్ని, న ఇచ్ఛతి = కోరలేదు (ఎందుకు? అంటే), వృత్తిం త్రాతుం= దొరికిన చరమపర్వకైంకర్యాన్ని కాపాడుకోవడంకోసం, నిర్మర్యాదః = కట్టుబాటును మీఱినవాడై, అనల్పైః = అంతు లేని, నిందితైః = శాస్త్రాలచే నిందించబడిన అభక్ష్యభక్షణం మొదలైన కార్యాల మూలంగా, త్వన్ముఖ+ఉల్లాసమూలమ్ = దేవరవారి ముఖోల్లాసానికి కారణమైన, కించిత్ = ఏదో ఒక, త్వదనుభజనం= దేవరవారి కైంకర్యంతో పాటు, దేవరవారి దాసుల కైంకర్యాన్ని, లబ్ధ్వా = పొంది(తర్వాత), నిరయే = నరకంలో, పతతు అపి = పడితే పడనీ.

శ్రీవరవరమునీ! చరమపర్వనిష్ఠలో అత్యంతాభినివేశాన్ని కల్గిన నేను, ఐహికైశ్వర్యాది అపరపురుషార్థాలలో ఆశ లేనివారైన బ్రహ్మజ్ఞానాన్ని కల్గినవారిచేత పొందదగిన పరిపూర్ణమైన బ్రహ్మసామ్యం అనే మోక్షాన్ని సైతం కోరను. ఎందుకు? అని అంటే, లభించిన చరమపర్వకైంకర్యాన్ని కాపాడుకోవడంకోసం కట్టుబాట్లను మీఱినవాడనై, అనల్పాలైన (లెక్కలేని), శాస్త్రాలలో నిందింపబడ్డ అభక్ష్యభక్షణాది కార్యాలను చేయడం మూలంగా, తమ తిరుముఖానికి ఉల్లాసాన్ని కల్గించడంలో కారణమైన ఏదో ఒక తమ కైంకర్యంతో పాటు తమ దాసుల కైంకర్యాన్ని కూడా పొందిన తరువాత నరకంలో పడినా చాలు. అది నాకు అభిలషణీయమే సుమా!

తమ ముఖోల్లాసమే ఏనా ముఖ్యలక్ష్యం. అది తమకు, తమ సాక్షాత్ శిష్యులకు, పరంపరాసంబంధం ద్వారా తమ శిష్యులైనవారికి కైంకర్యాన్ని చేస్తే కల్గుతుంది. అటువంటి కైంకర్యాల కోసంగా అభక్ష్యభక్షణాది దురాచారాలు ఏర్పడినా, అవి మోక్షానికి ఆటంకాలు కావు. ఆవిధంగా కాక ఆటంకాన్ని కల్గించి, దాసునకు నరకవాసమే ఫలించినా ఫలించనీ. దానిని నేను సంతోషిస్తాను - అని ఇందులోని సారం. "దర్శితకైంకర్యరూప

మహాఫలసిద్ధౌ సత్యాం తదకించిత్కరమ్" అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య. "ఎమ్మావీట్టుత్తిఱముమ్ శెప్పమ్ నిన్ శెమ్మాపాదపఱ్ఱు త్తలైశేర్‌త్తు, ఒల్లై క్కైమాతున్బమ్ కడిన్దపిరానే! అమ్మా! అడియేన్ వేణ్డువదీదే" అనే పాశురార్థం చరమపర్వరూపంలో అనుసంధింపబడిన పై సంగమనార్థం.

**(అసౌ)** - చరమపర్వవిషయంలో అత్యంతం అభినివేశాన్ని కల ఇతడు (నేను)

**(విశ్వతో వీతరాగైః)** - ఐశ్వర్యాదులైన సకల లౌకిక పురుషార్థాలపట్ల వైరాగ్యాన్ని కలవారైన,

**(సద్భిః)** - బ్రహ్మజ్ఞానులచే - అని అర్థం. **"అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః"** అనే శ్రుతిసూక్తి ఇక్కడ స్మరణీయం.

**(ప్రాప్యం)** - పొందడానికి శక్యమైన,

**(ఇదమ్)** - ఆశ ఉంటే చాలు, సిద్ధంగా ఉండే ఈ ప్రాప్యం- అని భావం. సాక్షాన్నిర్దేశం సిద్ధాన్నంగా ఎదురుగా పొందడానికి సిద్ధంగా ఉండే స్థితిని తెల్పుతుంది.

**(పరం బ్రహ్మసామ్యమ్)** - **"నిరంజనః పరమం సామ్యముపైతి"** అనే శ్రుతిక్రమంలో అపహత పాప్మత్వాది గుణాష్టకావిర్భావరూపమైన బ్రహ్మసామ్యాన్ని - అని భావం. **"తమ్మైయే నాళుమ్ వణఙ్గి త్తొழువార్‌క్కు తమ్మైయేయొక్క అరుళ్‌శెయ్‌వర్"** (తనను నిత్యం నమస్కరించి కొలిచేవారికి పరమాత్మ తనతో పరమసామ్యాన్ని కల్గిస్తాడు) అని దివ్యసూరి సూక్తి.

**(నేచ్ఛతి)** - కోరను. ఎందుకు? అంటే, ఇంతకుముందే నేను పొందిన చరనిష్ఠారూపమైన వృత్తిని కాపాడుకోవడం కోసంగా - అని భావం.

**(నిర్మర్యాదః)** - చరమపర్వంలోని అతిమాత్రప్రావణ్యంచేత ఏవ్యవస్థను అయిన దాటిన నేను,

**(అనల్పైః)** - అపరిమితాలైన,

**(నిందితైః)** - శాస్త్రాలద్వారా నిషేధింపడిన కృత్యాలతో,

**(త్వన్మఖోల్లాసమూలమ్)** - మీభక్తుల మనస్సుకు ప్రీతికి కారణమైన,

**(త్వదనుభజనమ్)** - మీ కైంకర్యంతో కూడిన మీ భక్తుల కైంకర్యాన్ని,

**(లబ్ధ్వా)** - పొంది,

**(నిరయే పతతు అపి)** - నరకంలో పడితే పడనీ. నరకంలో పడినా అది ఇష్టమే, ఒకవేళ చేసే కైంకర్యం మీకు, మీ భక్తులకు ప్రీతిని కల్గిస్తే - అని భావం.

**58.** అవ :- ఇంతవరకు చరమపర్వకైంకర్యంయొక్క అవశ్యకతనుగూర్చి పల్కి, ఇకపై ఆ కైంకర్యం కోసం ఆ లీలావిభూతిలో వాసాన్ని కోరుతున్నారు.

నాసౌ వాసం నభసి పరమే వాంఛతి త్వత్ప్రసాదాత్
మర్త్యావాసో యదిహ సులభః కోఽపి లాభో మహీయాన్ ।
కించిత్కృత్వా వరవరమునే! కేవలం త్వత్ప్రియాణాం
పశ్యన్ ప్రీతిం భవతి భవతో వీక్షణానాం నిధానమ్ ॥

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, యత్ = ఏ కారణంవల్ల, ఇహ = ఈలోకంలో, మహీయాన్ = మిక్కిలి పెద్దదై, కః అపి = లోక విలక్షణమైన, లాభః= లాభానికి కారణం అయిన, మర్త్య+ఆవాసః= సాధారణ మానవులు నివసించే చోటు అయినా, త్వత్ ప్రసాదాత్ = దేవరవారి కృపకారణంచేత, సులభః= సులభంగా లభిస్తున్నదో, తత్ = ఆ కారణంచేత, అసౌ = దేవరవారివిషయంలో మిక్కిలి అభినివేశాన్ని కల్గిన ఈ దాసుడు, పరమే నభసి = పరమాకాశమనబడే శ్రీవైకుంఠంలో, వాసం న వాంఛతి = నివసించాలని కోరడం లేదు, త్వత్+ప్రియాణాం = దేవరవారి దాసులకు,(దేవరవారి ప్రీతికి లక్ష్యమైనవారి, లేక, దేవరవారి పట్ల ప్రీతిని కల్గినవారి) కించిత్ కృత్వా = కైంకర్యాన్ని చేసి, త్వత్+ప్రియాణాం ప్రీతిం కేవలం పశ్యన్ = దాసుని ప్రీతిని కాక, దేరవారి దాసుల ప్రీతి మాత్రమే ప్రయోజనంగా భావించి, భవతః= దేవరవారి, వీక్షణానాం = కటాక్షాలను, నిదానం = మూలకారణంగా, భవతి= కాగలడు. (కాగలను.)

శ్రీవరవరమునీ! ఈ లోకంలో చాలా గొప్పది, లోకవిలక్షణమైనది అయిన లాభానికి కారణమైన సాధారణమానవులు నివసించే చోటు (లీలావిభూతి) నీ అనుగ్రహంవల్ల సులభంగా లభిస్తున్నది. ఆ కారణం వల్ల తమ విషయంలో అత్యంతం అభినివేశాన్ని కల్గిన నేను పరమాకాశం అనబడే శ్రీవైకుంఠంలో వాసాన్ని సైతం కోరనేకోరను. తమ దాసులకు కైంకర్యాన్ని నా సంతృప్తిని కోసం కాకుండా, తమ దాసుల, వారి దాసుల సంతృప్తిని మాత్రమే ప్రధానంగా తలచి తమ కటాక్షాలకు లక్ష్యం కాగలను.

వ్యాఖ్యానమ్ : **"భక్తి శ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి", "వైకుంఠవాసేఽపి న మేఽభిలాషః", "ఇచ్చువై తవిర... అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్", "ఎమ్మావీట్టు త్తిఱముమ్ శెప్పమ్" (2-9) "అరఙ్గనైక్కణ్డ కణ్కళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** ఇత్యాది సూక్తుల భావాలు ఇచట అనుసంధేయాలు. దాసుని ప్రధానమైన ఉద్దేశ్యం - తమ మనస్సులో కలిగే ప్రీతివల్ల జనించే నా విషయంలోని తమ కటాక్షమే. ఆ ప్రీతి తమ దాసుల ప్రీతికోసం నేను చేసే కైంకర్యాలచేత కలగాలి. ఆ కైంకర్యం కూడా, సాధారణమానవులు నివసించే చోటు అయిన ఈ లోకంలో నేను ఉంటేనే సిద్ధిస్తుంది. కాబట్టి ఈ లోకవాసమే దాసుడనైన నాకు పరమ లాభం. ఇందువల్ల నాకు పరమాకాశం అనబడే శ్రీవైకుంఠానికి పోవాలనే ఆశ లేదు సుమా! - అని తెలిపినట్లయింది. ఈ లోకంలో భగవదనుభవాన్ని పొందేవారిని ఆళ్వార్లు కూడా **"విణ్ణుళారిలుమ్ శీరియర్"** అని నిత్యసూరుల కంటే గొప్పవారని అన్నారు కదా!

**(అసౌ)** - నీ విషయంలో గొప్ప అభినివేశాన్ని కల నేను - అనే భావం ఈ సర్వనామశబ్దం ద్వారా ద్యోతితం.

**(పరమే నభసి)** - వైకుంఠ దివ్యభవనంలో

**(వాసం న వాంఛతి)** - నివాసాన్ని కోరడం లేదు. ఎందుకంటే,

**(ఇహ)** - ఈ విభూతిలోనే,

**(మహీయాన్)** - చాలా గొప్ప,

**(కోఽపి లాభః)** - విలక్షణమైన ప్రాప్యం,

**(త్వత్ప్రసాదాత్ సులభః)** - నీ అనుగ్రహం వల్ల సులభం.

**(త్వత్ప్రియాణామ్)** - నీకు ఇష్టమైన వారికి, నిన్ను ఇష్టపడేవారికి,

**(కించిత్ కృత్వా)** - సకల కైంకర్యాలను చేసి,

**(కేవలం త్వత్ప్రియాణాం ప్రీతిం పశ్యన్)** - స్వార్థతాగంధం ఏమాత్రం లేని రీతిలో, తాను చేసిన కైంకర్యాన్ని చూచి వరవరముని భక్తులు పొందే ప్రీతిని దర్శించడమే చైతన్యఫలంగా గ్రహించినవాడనై,

**(భవతో వీక్షణానాం నిధానమ్)** - దేవరవారి కటాక్షాలకు విషయం కాగలను.

**59.** అవ :- శ్రీవరవరమునులు తమ ఇష్టానుసారంగా ఎపుడు అభిలషించినా పరమపదానికి వెళ్ళగల్గిన వారైనా, ఆవిధంగా వెళ్ళకుండా ఆలస్యం చేయడానికి గల కారణాన్ని, వారిని విడచి తాము పరమపదాన్ని చేరినా ప్రయోజనం లేదని ఇందులో అంటున్నారు. **"ఏవం చరమప్రాప్యకైంకర్యస్యావశకత్వం ప్రతిపాదితమ్. అథ తదర్థం లీలావిభూతౌ వాస మపేక్షతే"** అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్య.

**అస్మద్భూయాం స్త్వమసి వివిధానాత్మనః శోధయిత్వా**
**పద్మాభర్తుః ప్రతిదిన మిహ ప్రేషయన్ ప్రాభృతాని ।**
**తస్మిన్ దివ్యే వరవరమునే! ధామని బ్రహ్మసామ్యాత్**
**పాత్రీభూతో భవతి భగవన్! నైవ కించిద్దయాయాః ॥**

భగవన్ వరవరమునే = ఉభయవిభూతి నిర్వాహకులైన (యతివరపునరవతారభూతులైన)మణవాళ మహామునీ!, వివిధాన్ = జన్మ, జ్ఞానం, ఆచారమనే వీటిచే పలు రీతులలో ఉండే, ఆత్మనః = స్వాభావికమైన శేషత్వ - జ్ఞానానందమయత్వ లక్షణాన్ని కల్గిన జీవాత్మలను, శోధయిత్వా = సదుపదేశాలతో పరిశుద్ధులుగా చేసి, పద్మాభర్తుః= లక్ష్మీనాథుడైన పరమపదనాథునకు, ప్రాభృతాని = కానుకలుగా, అస్మాత్ = ఈలోకం నుండి, ప్రతిదినం = ఒక్కొక్క దినం, ప్రేషయన్ = పంపించేవారై, ఇహ =ఈలోకంలో, పద్మాభర్తుః= ఆ శ్రియఃపతికి, భూయాన్ = గౌరవించదగినవారుగా, అసి = ఉన్నారు, (అందువల్లనే దేవరవారు పరమపదానికి వెళ్ళడానికి ఆలస్యమవుతున్నది), దివ్యే = అప్రాకృతమైన, తస్మిన్ ధామని = ఆ పరమపదంలో, బ్రహ్మ సామ్యాత్ = పరబ్రహ్మతో సమానమైన ఆనందాన్ని అనుభవించడమనే మోక్షానికి కారణమైన, దయాయాః = దేవరవారి దయకు, అయం జనః= ఈదాసుడు (నేను), పాత్రీభూతః= లక్ష్యంగా, నైవ భవతి = కానేకాడు.

ఓవరవరమునీ! యతివరపునరవతారభూతులైన స్వామీ! జన్మ-జ్ఞాన-శీలాదులను బట్టి పలు రీతులలో ఉండే జీవులను, సదుపదేశాలతో పరిశుద్ధులను చేసి, లక్ష్మీనాథుడైన పరమపదనాథునకు కానుకగా ఈలోకం నుండి ప్రతిదినం పంపేవారై, ఈ విభూతిలో శ్రియఃపతికి గౌరవించదగినవారై మీరు ఉన్నారు. అందువల్లనే కదా! తమరు పరమపదానికి వెళ్ళడంలో ఆలస్యం అవుతున్నది. అప్రాకృతమైన ఆనందాన్ని అనుభవించడమనే మోక్షంకోసం దాసుడనైన నేను తమ దయకు పాత్రంగా కాలేకపోతున్నాను.

వ్యాఖ్యానమ్ : శ్రీవరవరమునులకు వారి ఆచార్యానుగ్రహంవల్ల మోక్షం వారికి స్వాధీనం. ఎపుడు కోరినా అది వారికి సిద్ధిస్తుంది. అయినా, పరమపదానికి వారు వెళ్ళకుండా ఆలస్యం చేయడం ఎందుకు? అని అంటే- ఈలోకంలో ఉంటే జన్మశీలాదులచే పలు విధాలుగా ఉండే జీవాత్మలను తమ సదుపదేశాలద్వారా, శ్రీపాదతీర్థాన్ని ప్రసాదించడంద్వారా పరిశుద్ధులను చేసి, పరమపదనాథునకు కైంకర్యం చేయడంకోసం పంపుతున్నందున, తాము పరమపదానికి వేంచేస్తే ఆ పని సాధ్యం కాదనే కారణంవల్లనే. శ్రీవరవరమునులు పరమపదానికి వేంచేయకపోతే ఏమి? కటాక్షాన్ని పొందిన ఎఱుమ్బియప్పా వెళ్ళకూడదా? అని అంటే, శ్రీవరవరమునులు ఉండే చోట వారిని సేవించడం, వారికి వారి దాసులకు ఆనందాన్ని కల్గించే రీతిలో కైంకర్యాన్ని చేయడమే లక్ష్యంగా కల్గిన ఎఱుమ్బియప్పాకు పరమపదవాసంలో ఏ ప్రయోజనం లేదు కనుక, వీరి అభిమతానుసారంగా ప్రవర్తించే శ్రీవరవరమునులు వీరికి మోక్షాన్ని ఇవ్వాలని చూడరు- అని తాత్పర్యం. "అత్ర పరత్ర చాపి నిత్యం యదీయ చరణౌశరణం మదీయమ్" అని కదా తమ ఆచార్యుల విషయంలో పరమాచార్యసూక్తి.

**60.** అవ :- మణవాళమహామునులను దర్శించి కైంకర్యం చేయడమనే పరమపురుషార్థం ఈ విభూతిలోనే లభిస్తే, ఈభూలోకంలో నిత్యవాసాన్ని చేయడం స్వరూపవిరుద్ధం కానేకాదు - అని అంటున్నారు. "పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతమ్" ఇత్యాది శ్రుత్యర్థాన్ని చరమపర్వంలో అనుసంధిస్తున్నారు.

**జప్యం నాన్యత్ కిమపి యది మే దివ్యనామ్న స్త్వదీయాత్**
**నైవోపాస్యం నయనసులభాదంఘ్రియుగ్మాదృతే తే।**
**ప్రాప్యం కించి న్నభవతి పరం ప్రైష్యభావాదృతే తే**
**భూయాదస్మిన్ వరవరమునే! భూతలే నిత్యవాసః ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, త్వదీయాత్ = దేవరవారికి సంబంధించిన, దివ్యనామ్నః= మోక్షసాధనమైన తిరునామం కంటే, అన్యత్ కిమపి = వేఱయిన భగవన్నామాదులలో ఏదీ, జప్యం = జపించదగినది, న స్యాత్ యది = కానిదే అయితే, నయనసులభాత్= కన్నులకు సులభంగా చూడదగిన, తే= దేవరవారి, అంఘ్రియుగ్మాత్ ఋతే = చరణద్వంద్వం కంటే, అన్యత్ కిమపి = వేఱేదీ కూడా, ఉపాస్యం = ఉపాసించదగినది, న స్యాత్ యది = కాకపోతే, తే = దేవరవారి, ప్రైష్యభావాత్ ఋతే = కింకరుడై ఉండడం కంటే, అన్యత్ కిమపి = వేఱేదీ, పరమప్రాప్యం = గొప్ప ప్రయోజనం, న స్యాత్

యది = కాకపోతే, అస్మిన్ భూతలే = (రజస్తమః పూర్ణమైన), ఈ లోకంలో, నిత్యవాసః= కాలతత్త్వం ఉన్నంతవరకు ఉండడం, అనేది, భూయాత్ = అగుగాక (నాకు సిద్ధించాలి).

వేఱొక తిరునామాన్ని జపించకుండా, శ్రీవరవరమునుల తిరునామాన్నే జపించగల్గితే, వేఱొకరి శ్రీచరణాలను ధ్యానం చేయకుండా శ్రీవరవరమునుల శ్రీచరణ ధ్యానించగల్గితే, ఇంకొకరికి కైంకర్యంచేయకుండా, శ్రీవరవరమునులకే కైంకర్యంచేయడం సంభవిస్తే, పరమపదానికి పోకుండా, ఇక్కడ లీలావిభూతిలోనే నిత్యవాసం చేయడం స్వరూపంతో చేరినది (స్వరూపానురూపమైనది) కనుక, అది నాకు సిద్ధించాలి.

**వ్యాఖ్యానమ్ : (త్వదీయాత్ దివ్యనామ్నః)** - **"దివి భవం దివ్యమ్, దివే హితం వా దివ్యమ్"** - పరమపదంలో పుట్టినది, వ్యవహరింపబడేది, పరమపదప్రాప్తికి సాధనమైనది- అని అర్థం. ఈరెండు వ్యుత్పత్తులవల్ల శ్రీవరవరమునుల నామం యొక్క భోగ్యత, ఉపాదేయత్వం తెలుపబడ్డాయి. ఈవిధంగా భోగ్యమైన, మోక్షహేతువైన - ఉపాయోపేయమైన దేవరవారి నామంకంటే,

**(అన్యత్)** - వేఱయిన నామాలు - అంటే - భగవన్నామాదులు

**(న జప్యమ్)** - నిరంతరం నేను చేసే అనుసంధానానికి లక్ష్యం కాకుండా ఉంటే కేవలం శ్రీవరవరమునుల దివ్యనామానుసంధానం తప్ప, వేఱొక నామాన్ని అనుసంధించని అనన్యభక్తిదశ-అవ్యభిచారిణి అయిన భక్తి దశ నాకు కల్గితే- అని భావం.

**(నయనసులభాత్)** - నా నేత్రాలకు సులభంగా దర్శనమిచ్చే,

**(తే అంఘ్రియుగ్మాత్ ఋతే అన్యత్)** - దేవరవారి శ్రీచరణయుగళం కంటే ఇంకొకటి,

**(ఉపాస్యం నైవ చేత్)** - ఏరీతిలోను నా ఉపాసనకు విషయం కాకపోతే.

**(తే ప్రైష్యభావాత్ ఋతే)** - దేవరవారికి కైంకర్యం చేయడంకంటే - అని అర్థం. **"నియుజ్యః కింకరః ప్రైష్యః"** అని అమరం.

**(పరం ప్రాప్యం కించిత్ యది న భవతి)**- ఉత్కృష్టమైనది ఇంకొకటి ఏదీ ప్రాప్యం కాకపోతే,

**(అస్మిన్ భూతలే)** - **"ఇరుళ్తరు మాఞాలమ్"** గా చెప్పబడే రజస్తమోమయమైనదైన ఈలోకంలో

**(నిత్యవాసః భూయాత్)** - కాలం నిత్యం కనుక, కాలం ఉన్నంతవరకు వాసం కలగాలి- అని ఆశంస. **"తవ దాస్యసుఖైకసంగినామ్ భవనేష్వస్త్వపి కీటజన్మ మే"** అని అంటూ యామునులు భాగవతసంబంధాన్ని కల్గిన నీచజన్మఅయినా కలగాలి అన్నారు కదా! ఆ జన్మని నిత్యంగా కలగాలని అంటున్నారు.

**61.** అవ :- పూర్వశ్లోకంలో తమకు ఈ లోకంలో నిత్యవాసం కలగాలని ఆశించారు. ఆవిధంగా అనుకూల సహవాసం దొరకకుండా, ప్రతికూలసహవాసమే సంభవిస్తే, ఈ దేహాన్ని త్యజించాలనే నిశ్చయం తమకు

కలగాలని ఇందులో అంటున్నారు. "ప్రియం జన మపశ్యంతీ పశ్యంతీ రాక్షసీగణమ్" అనే రీతిలో ప్రతికూల సహవాసం దాపురించి, అనుకూలసహవాసం దుర్లభమే అయితే, అపుడు దేహత్యాగంలో నాకు నిశ్చయం కలగాలి - అని అంటున్నారు. "న హి మే జీవితేనార్థో నైవార్థై ర్నచ భూషణైః, వసంత్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్" అనే శ్రీరామాయణసూక్తి తిరువాయ్‌మొழ్రిలోని "ఏఱాళుమ్" (8-7) అనే దశక ప్రమేయం, "న దేహం న ప్రాణాన్ న చ సుఖ మశేషాభిలషితమ, న చాత్మానం నాన్యత్ కిమపి తవ శేషత్వవిరహాత్" అనే స్తోత్రరత్నసూక్తి చరమపర్వాత్మకంగా స్మరణీయం.

మంత్రో దైవం ఫలమితి మయా వాంఛితం యద్యపి స్యాత్
మధ్యే వాసో మలిన మనసా మేవమేవం యది స్యాత్ ।
యద్వా కించిత్ త్వదనుభజనం సర్వదా దుర్లభం స్యాత్
దేహం త్యక్తుం వరవరమునే! దీయతాం నిశ్చయో మే ॥

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, మంత్రః= దేవరవారి తిరునామాలనే మంత్రం, దైవం = దేవరవారి శ్రీచరణాలనే దైవం, ఫలమ్ = దేవరవారి కైంకర్యమనే ఫలం, మయా = దాసుడనైన నాచే, యద్యపి వాంఛితం = ప్రార్థించబడినదిగా కావడం వాస్తవమే. తథాపి = ఆ విధంగా అయినా, మలిన మనసాం= రజోగుణతమోగుణాలచేత మాలిన్యాన్ని పొందిన ఈలోకుల, మధ్యే = నడుమ, ఏవం వాసః= ఇటువంటి స్థితి, ఏవం యది స్యాత్ = ఈవిధంగానే ఇంకా అనువర్తిస్తే, యద్వా = అంతేకాక, కించిత్ = ఏదో కొంచెం, త్వత్+అనుభజనం = దేవరవారి మానసోల్లాసానికి తగిన కైంకర్యం, (సర్వదా=అన్ని స్థితులలోను), సర్వథా = పూర్తిగా, దుర్లభం యది స్యాత్ = లభించడం సుతరాం కష్టమైనదే అయితే, మే దేహం త్యక్తుం =దాసునకు కైంకర్యానికి సహాయపడని శరీరాన్ని, త్యక్తుం = విడచిపెట్టడానికి తగిన, నిశ్చయః= నిశ్చయం, మే = దాసునకు, దీయతాం = దేవరవారిచే అనుగ్రహింపబడాలి.

శ్రీవరవరమునుల తిరునామసంకీర్తనమనే మంత్రజపం, వారి శ్రీచరణాల ధ్యానం, వారి శ్రీచరణాల కైంకర్యం- అనే వీటిని చేయడంకోసం, పరమపదాన్ని కోరకుండా ఈ లోకంలో వాసమే తమకు కావాలి- అని ముందుశ్లోకంలో ప్రార్థించారు. ఈ శ్లోకంలో శ్రీవరవరమునులను గూర్చి తాము చేసే తపోధ్యానకైంకర్యాలకు విరోధాన్ని కల్గించేవారి మధ్యలో తాము ఉంటే అవి లభించవు కనుక, ఇపుడు ఉండే ఆ విరోధుల సహవాసం ఈరీతిలోనే అనువర్తిస్తే, అపుడు ప్రాణత్యాగం చేసే రీతిలోని అధ్యవసాయాన్ని తమకు కల్గించాలి- అనే భావాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (మంత్రో దైవం ఫలమితి యద్యపి వాంఛితమ్) -"మంత్రోదైవం ఫలం స్యాత్ ఇతి యద్యపి మయా వాంఛితమ్"** అని అన్వయం. గడచిన శ్లోకంలో **"జప్యం నాన్యత్"** ఇత్యాదిగా శ్రీవరవరముని నామమనే మంత్రాన్ని, **"తే అంఘ్రియుగ్మమ్ ఉపాస్యమ్"** ఇత్యాదిగా శ్రీవరవరమునుల శ్రీచరణద్వంద్వమనే దైవాన్ని, **"తే ప్రేష్యభావాత్ ఋతే ప్రాప్యమ్"** ఇత్యాదిగా శ్రీవరవరమునుల శ్రీచరణాలలో చేసే కైంకర్యమనే ఫలం ప్రస్తావింపబడ్డాయికదా! వాటిని ఉద్దేశించి పల్కుతున్నారు. ఈ మూడిటిని నేను ప్రార్థించడం

వాస్తవమే - అని భావం. **"యద్యపి"** అనేది నిశ్చయార్థక ప్రయోగం. (**"తథాపి"** అని అధ్యాహారం చేసికోవాలి. ఆవిధంగా ప్రార్థించినప్పటికీ- అని అర్థం.)

**(మలినమనసామ్ మధ్యే వాసః)** - దేవరవారి విషయంలోని ప్రావణ్యానికి విరోధి అయిన, రజస్తమస్సులచే కలుషితమైన మనస్సును కలవారి నడుమ నివాసం.

**(ఏవమ్ ఏవమ్ యది స్యాత్)** - తప్పని రీతిలో- ఇపుడు కల్గిన ఈవిధంగా సంభవించినట్లయితే,

**(యద్వా)** - ఏతావన్మాత్రమే కాకుండా -దుర్జనుల నడుమ తప్పక నివసించవలసిన పరిస్థితి కల్గడమే కాకుండా - అని తాత్పర్యం.

**(త్వదనుభజనం సర్వదా దుర్లభం యది స్యాత్)** - పలు విధాలైన, దేవరవారికి ముఖోల్లాసాన్ని కల్గించే కైంకర్యాలలో ఒక్కటి కూడా లభించనిదే అయితే.

**(దేహం త్యక్తుం నిశ్చయో మే దీయతామ్)**- పైన తెల్పిన రీతిలో ఏవిధంగాను ప్రయోజనం లేని- అంటే - నేను ప్రార్థించినట్లుగా దేవరవారి తిరునామమంత్రజపాన్ని చేయడానికి, దేవరవారి శ్రీచరణ ద్వంద్వమనే దైవాన్ని ఉపాసించడానికి, దేవరవారికి కైంకర్యం చేయడానికి పనికిరాకుండా, తమ విషయంలో ఏమాత్రం ప్రావణ్యం లేనివారిమధ్యలో వాసం చేయడానికే ఉపయోగపడితే, అటువంటి దేహంతో నాకు పని లేదు. దానిని విడిచే నిశ్చయం కలిగేటట్లు నన్ను అనుగ్రహించండి- అనిభావం. **"దీయతామ్"**- ఇది ప్రార్థనార్థకమైన లోట్ రూపం. **"న హి మే జీవితేనార్థో నైవార్థై ర్నచ భూషణైః, వసంత్యా రాక్షసీ మధ్యే వినా రామం మహారథమ్"** అని పల్కిన సీతాదేవి వచనశైలి ఈ శ్లోకశైలిని స్ఫురింపజేస్తున్నదని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్యాన శ్రీసూక్తి. ఈ శ్రీరామాయణ శ్లోకాలను ఉట్టంకిస్తూ నమ్మాళ్వార్ **"ఏఱాళుమ్"** (8-7) అనే దశకానికి ప్రవేశం అనుగ్రహించిన రీతికూడా ప్రకృతంలో అనుసంధేయం. అది ప్రథమపర్వవిషయం కాగా, ఇది చరమపర్వవిషయం. ఈరీతిలో ఈ స్తుతిలోని పలు శ్లోకాలలో తిరువాయ్‌మొழி దశకార్థప్రమేయాలు స్ఫురింపజేయబడడం కూడా గమనించాలి. **"మధ్యే వాసః"** ఇత్యాది ప్రయోగంద్వారా చుట్టూ ప్రతికూలమనస్కులు పరివేష్టించి ఉండడంవల్ల, దేవరవారు అలంకరించిన దిక్కును దర్శించడానికి కూడా అవరోధం కల్గిందని ధ్వనిస్తున్నది. **"సర్వదా"**- అనే పదం ద్వారా జాగ్రద్దశలోను, స్వప్నదశలోనుకూడా దేవరవారి అనుభజనం దుర్లభమైనదని స్ఫురిస్తున్నది. ఇందువల్ల **"స్వప్నేఽపి యద్యహం వీరం రాఘవం సహ లక్ష్మణమ్, పశ్యేయం నావసీదేయం స్వప్నోఽపి మమ మత్సరీ"** అనే శ్రీరామాయణశ్లోకార్థం స్ఫురిస్తున్నదని శ్రీవాధూలవీరరాఘవాచార్య స్వామి వ్యాఖ్య. దీని ద్వారా **"వారణమాయిరమ్"** దశకంలోని గోదాదేవి అనుభవాన్ని ఆశపడ్డారని స్ఫురిస్తున్నది. **"దేహం త్యక్తుమ్"** అనే ప్రయోగం ద్వారా **"విషస్య దాతా న హి మేఽస్తి కశ్చిత్ శస్త్రస్య వా"** అనే శ్రీరామాయణ శ్లోకార్థం ధ్వనిస్తున్నదని కూడా ఆవ్యాఖ్యలో వివరింపబడింది. దీనివల్ల **"ఊరెల్లామ్ తుఞ్జి"** అనే దశకంలోని ఆழ்వార్ల అనుభవం కూడా ప్రకృతంలో చరమపర్వవిషయంగా అనుసంధింపబడినదని భావించవచ్చు.

**62.** అవ :- గడచిన శ్లోకంలో **"మంత్రో దైవమ్"** ఇత్యాదిగా మంత్రాన్ని గూర్చిన ప్రస్తావం చేసినందువల్ల **("శ్రీశైలేత్యాది)** మంత్రాన్ని అనుగ్రహించిన శ్రీరంగనాథునిపట్ల తమకు గల కృతజ్ఞతాభావాన్ని ఈశ్లోకంలో కవి అనుసంధిస్తున్నారు.

**ఆచార్యత్వం తదధికమితి ఖ్యాత మామ్నాయముఖ్యైః**
**ఏషః శ్రీమాన్ భవతి భగవానీశ్వరత్వం విహాయ ।**
**మంత్రం దాతా వరవరమునే! మంత్రరత్నం త్వదీయం**
**దేవః శ్రీమాన్ వరవరమునిః వర్తతే దేశికత్వే ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, శ్రీమాన్ భగవాన్ = లక్ష్మీదేవితో నిత్యయోగాన్ని కల్గిన, జ్ఞానశక్త్యాది గుణగణపూర్ణుడైన, ఏషః = ఈ శ్రీరంగనాథుడు, ఆమ్నాయముఖ్యైః= వేదం మొదలైనవానిచే, ఖ్యాతం = విస్తరించి చెప్పబడిన, ఈశ్వరత్వం = (తన) శేషిత్వాన్ని, విహాయ = విడచి, (కిం చ = ఇంతేకాక), దేవః శ్రీమాన్ వరవరమునిః = శోభను కల్గినవారు, సద్గుణసంపదను నిండుగా కలవారైన శ్రీవరవరమునులు, దేశికత్వే వర్తతే = తమకు ఆచార్యస్థానంలో ఉన్నారు, తత్ = అందువల్ల, ఆచార్యత్వం = ఆచార్యులై ఉండడం అనేది, అధికం = తనకు గల శేషిత్వ-నియమకత్వాలకంటే గొప్పది - అని (తలచి), మంత్రరత్నం = మంత్రాలన్నిటిలో రత్నంవలె గొప్పది అయిన, త్వదీయం = దేవరవారికి చెందిన, మంత్రం = "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే మంత్రమనే తనియన్‌ను, దాతా = అనుగ్రహించినవాడై, భవతి = సత్తను పొందుతున్నాడు.

శ్రీరంగనాథుడు, తనకు ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యను ఒక సంవత్సరకాలం కాలక్షేపంగా అనుగ్రహించడంద్వారా ఆచార్యులైన శ్రీవరవరమునులకు గల ఆచార్యత్వం తనకు గల శేషిత్వంకంటే (ఈశ్వరత్వం కంటే) గొప్పది అని, ఆ ఆచార్యత్వాన్ని తానుకూడా పొందాలని భావించి, ఆ ఈశ్వరత్వాన్ని విడచిపెట్టి, ఈడు కాలక్షేపాన్ని శ్రవణం చేసినందులకు గురుదక్షిణగా శ్రీవరవరమునుల విషయంగా **"శ్రీశైలేశ దయాపాత్రమ్"** అనే తనియన్‌ను అనుగ్రహించి, తాను మంత్రప్రదరూపుడైన ఆచార్యత్వాన్ని పొంది, ఆనందిస్తున్నాడు.

వ్యాఖ్యానమ్ : **(శ్రీమాన్ భగవాన్ ఏషః)** - లక్ష్మీనిత్యసంశ్లేషాన్ని కల్గినవాడు, జ్ఞానశక్త్యాది గుణ పరిపూర్ణుడైన ఈ శ్రీరంగనాథుడు - అని అర్థం.

**(ఆమ్నాయముఖ్యైః ఖ్యాతమ్)** - వేదాలతోపాటు, పాంచరాత్రాగమాలు, ఇతిహాసాలు, పురాణాలు- మొదలైనవానిలో విస్తృతంగా ప్రతిపాదింపబడిన - అని అర్థం. **"ఖ్యా - ప్రకథనే"** అని ధాతువువల్ల ప్రకృష్టంగా చెప్పబడిన - అనే అర్థం సిద్ధం.

**(ఈశ్వరత్వమ్ విహాయ)** - **"స్వామీ త్వీశ్వరః"** అని అమరం. **"ఈశ-ఐశ్వర్యే"** అనే ధాతువునుండి పుట్టిన ఈపదానికి చిదచిత్తులను సొత్తుగా కలవాడై, వాటిని నియమించేవాడనే అర్థం. అందువల్ల, నియంతృత్వాన్ని విడచి - అనిగాని, శేషిత్వాన్ని విడచి - అనిగాని అర్థం.

**(దేవః)** - **"దివు- దీప్తౌ"** అనే ధాత్వర్థాన్నిబట్టి, నిరతిశయమైన దీప్తిని కలవాడని అర్థం. దీనివల్ల దోషప్రతిభటత్వం సిద్ధిస్తుంది.

**(శ్రీమాన్)** - ఇది సకలకల్యాణ గుణాకరత్వాన్ని సూచిస్తుంది. ఈ విధంగా ఇక్కడ ఆచార్యపరంగా ఉభయలింగాలు సూచింపబడ్డాయి.

**(వరవరమునిః)** - శ్రీమణవాళమహామునులు,

**(దేశికత్వే వర్తతే)** - ఆచార్యస్థానంలో వేంచేసి ఉన్నారు,

**(తత్)** - ఆ కారణంవల్ల. మహాజనపరిగ్రహకారణంగా,

**(ఆచార్యత్వమ్)** - అభిమతాన్ని ఉపదేశించేవాడు ఆచార్యుడు. **"ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి, స్వయ మాచరతే"** అని నిర్వచింపబడిన ఆచార్యత్వం.

**(అధికమితి)** - పైన పేర్కొన్న ఈశ్వరత్వ, శేషిత్వాలకంటే గొప్పది - అని తలచి - అని అర్థం. **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్"** అని, **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** ఇత్యాదులు ప్రమాణాలు.

**(మంత్రరత్నమ్)** - **"మంతారం త్రాయత ఇతి మంత్రః"** అనుసంధించేవారిని రక్షించేది మంత్రం. అటువంటి ప్రసిద్ధాలైన మూలమంత్రం మొదలైన మంత్రాలలో శ్రేష్ఠమైన - అని అర్థం. రత్నశబ్దం శ్రేష్ఠవాచకం. **"రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి"** అని అమరం, మేదినీనిఘంటువులు తెల్పుతున్నాయి. భగవద్విషయంలో ద్వయమంత్రం మంత్రరత్నంకాగా, ఇది వరవరమునుల విషయంలోని మంత్రరత్నం- అనే స్వారస్యం మంత్రరత్న ప్రయోగం ద్వారా అభ్యూహ్యం. ఇందులో కూడా పూర్వార్ధ, ఉత్తరార్ధాలనే విభాగమున్నది కదా. ఈ మంత్రరత్నం కూడా షట్పదమే. **"శ్రీశైలేశదయాపాత్రం, ధీభక్త్యాదిగుణార్ణవం, యతీంద్రప్రవణం, వందే, రమ్యజామాతరం, మునిమ్"** అనేవి ఈ ఆఱు పదాలు. అందువల్ల **"షట్పదోఽయం ద్విఖండః"** అనే ద్వయస్వరూపం దీనికి కూడా ఉన్నది. ద్వయమంత్రాన్ని వైకుంఠంలో పరవాసుదేవుడైన శ్రియఃపతి ఉపదేశిస్తే, ఈద్వయాన్ని వైకుంఠపర్యాయమైన శ్రీరంగంలో వాసుదేవ ప్రతిరూపుడైన శ్రీరంగనాథుడు ఉపదేశించాడు. ఆ ద్వయం ప్రథమపర్వాత్మకం కనుక పరత్వప్రధానమైన వైకుంఠంలోను, ఈ ద్వయం సౌలభ్య ప్రకాశకమైన చరమపర్వాత్మకం కనుక, సౌలభ్యగుణ ప్రకాశకమైన శ్రీరంగంలోను ఉపదేశింపబడింది. ఈ విధంగా పలు సామ్యాలు ఇక్కడ ఈ రెండు మంత్రరత్నాల మధ్య భావ్యాలు.

**(త్వదీయమ్ మంత్రం దాతా)** - దేవరవారిని స్తుతించే **"శ్రీశైలేశ"** ఇత్యాది మంత్రాన్ని ఇచ్చేవాడై- అని అర్థం. **"వక్తా వేదాన్"** అనే రీతిలో తృన్నంతశబ్దంపై ద్వితీయావిభక్తి ప్రయోగింపబడింది.

**(వర్తతే)** - సత్తను పొందుతున్నాడు - అని అర్థం. శ్రీరంగనాథునకు ఆచార్యులుగా శ్రీవరవరమునులు ఉన్నందున, ఈశ్వరత్వ, శేషిత్వాలకంటే ఆచార్యత్వం గొప్పదని భావించి దానిని ఆశపడి, శ్రీరంగనాథుడు

తన ఈశ్వరత్వాదులను మఱుగుపరచుకొని, "శ్రీశైలేశే"త్యాది తనియన్ రూపంలోని గొప్పమంత్రాన్ని లోకానికి ఉపదేశించి ఆచార్యత్వాన్ని పొంది, తన మనోరథం తీరినవాడై ఆనందిస్తున్నాడు - అని తాత్పర్యం.

**63.** అవ :- భగవానుడైన శ్రీరంగనాథుడు ఆచార్యత్వాన్ని ఆశపడినా, శ్రీవరవరముని విషయకమైన మంత్రాన్ని ఉపదేశించడంద్వారా తాను ఆచార్యత్వాన్ని పొందడంలో ఏమి ఉద్దేశ్యం? అని అంటే, దేహాత్మాభి మానం, అన్యశేషత్వ భావన మొదలైన దోషాలను కల్గి, అధఃపతనాన్ని చెందే మనవంటివారిని తమ శ్రీచరణచ్ఛాయను పొందించి, తద్ద్వారా రక్షించే మహోపకారకులైన శ్రీవరవరమునులకు ప్రత్యుపకృతిని చేయదలచిన శ్రీరంగనాథుడు, వారివల్ల ద్రవిడోపనిషత్ భాష్యమైన ఈడును శ్రవణం చేసి, తద్ద్వారా వారికి శిష్యుడై, ఆ వ్యాజంతో ఆ మహాచార్యుల వైభవాన్ని ప్రకాశింపజేసే "శ్రీశైలేత్యాది" తనియన్‌ను ఉపదేశించడమే వారి విషయంలో చేయగల్గిన ప్రత్యుపకారమని తలచాడు. అందువల్ల ఆ విధంగా చేశాడు - అని భావించి, "శ్రీశైలేశే"త్యాది మంత్రరత్నాన్ని ప్రకాశింపజేయడంకంటే శ్రీరంగనాథునకు చేయదగిన ప్రత్యుపకృతి ఇంకొకటి ఏదీ లేదు- అని అంటున్నారు. భగవద్విషయంలోని మంత్రరత్నం ద్వయమంత్రం కాగా, శ్రీవరవరముని విషయంలోని మంత్రరత్నం "శ్రీశైలేశదయాపాత్రమ్" ఇత్యాది తనియన్ శ్లోకం - అనే అర్థ మంత్రరత్న ప్రయోగం ద్వారా సూచింపబడింది.

**ఆత్మానాత్మప్రమితివిరహాత్ పత్యు రత్యంతదూరో**
**ఘోరే తాపత్రితయకుహరే ఘూర్ణమానో జనోఽ యమ్ ।**
**పాదచ్ఛాయాం వరవరమునే ! ప్రాపితో యత్ప్రసాదాత్**
**తస్మై దేయం తదిహ కిమివ శ్రీనిధేః విద్యతే తే ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, ఆత్మ+అనాత్మ ప్రమితివిరహాత్ = ఆత్మ జ్ఞానానంద గుణకమని, దేహం పలు దోషాలను కల్గినదనే యథార్థమైన జ్ఞానం లేనందువల్ల, పత్యుః= సర్వేశ్వరుడైన భగవానునకు, అత్యంతదూరః= చాలా దూరంలో ఉండేవాడై, ఘోరే =భయంకరమైన, తాపత్రయకుహరే= ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవికాలనే మూడు విధాలైన తాపాలు నిండిన పాడుగోతిలో, ఘూర్ణమానః= ఎల్లప్పుడు పడి ఉండి పరిభ్రమించే, అయం జనః=ఈమానవుడు (నేను-నావంటిమానవుడు) పత్యుః= పైన తెలుపబడిన సర్వేశ్వరుని, పాదచ్ఛాయాం = శ్రీచరణాల నీడను, యత్ ప్రసాదాత్ = ఎవరి అనుగ్రహం వల్ల, ప్రాపితః= పొందింపబడ్డాడో, తస్మై తే = అటువంటి దేవరవారికి, ఇహ = ఈ ఉపకారం విషయంలో, శ్రీనిధేః=శ్రీరంగనాథునకు, యత్ దేయమ్ = ప్రత్యుపకారంగా ఏది ఇవ్వదగినదో, తత్ = అది, కిమివ= ఈ తనియన్‌ను ప్రకాశింపజేయడం కంటే వేఱయినది ఏమి ఉన్నది ? (ఏమీ లేదని భావం)

వ్యాఖ్య : శ్రీవరవరమునులు, ఈస్తుతికర్త అయిన దేవరాజ గురువులకు, వారి వంటి పలువురకు- "మలమూత్రాదులకు ఆశ్రయమైన శరీరంకంటే జ్ఞానానందమయమైన ఆత్మ విలక్షణమైనది, ఇటువంటి ఆత్మ స్వతంత్రం కాదు, ఇంకొకరికి శేషం కాదు, శ్రియఃపతి భగవానునకు మాత్రమే శేషం, అతని ఆనందంకోసమే అతనికి కైంకర్యంచేసే పరతంత్ర రూపమైనది'' - అనే జ్ఞానాన్ని కల్గించి, వారందఱు

శ్రీరంగనాథుని శ్రీచరణనీడలో నిలచి ఉండి, కైంకర్యం చేసేటట్లుగా సంస్కరించారు. అందువల్ల, స్వామి అయిన ఆ శ్రీరంగనాథుడు తాను ఇంతకాలంగా ఎదురు చూచి, ఆశపడిన ఆత్మలాభాన్ని కల్గించిన శ్రీవరవరమునుల పట్ల కృతజ్ఞతాభావాన్ని ప్రకటించాలని భావించాడు. వారికి శిష్యుడై, తిరువాయ్మొழி ప్రబంధదివ్యార్థాలను ఆలకించే వ్యాజంతో వారి విషయంలోని "శ్రీశైలేశే"త్యాది తనియన్‌ను రచించి, దానిని సభలో ప్రకాశింపజేసి, కృతజ్ఞతను తెలిపాడు. తద్వారా అంతకుముందే తాను ఆశపడిన ఆచార్యత్వాన్ని పొందాడు - అని భావం.

శ్రీవరవరమునులు పరమవిరక్తులైనందున తనవద్ద వేఱు దేనినీ గ్రహించరు - అనిగాని, వారే పూర్వం భగవద్రామానుజులుగా అవతరించినపుడు ఉభయవిభూతిని వారికి ఇచ్చివేశానుకదా - అని గాని భావించిన శ్రీరంగనాథునకు ఈ తనియన్ తప్ప, శ్రీవరవరమునులకు ప్రత్యుపకారంగా సమర్పింపగల్గిన వేఱొకటి ఏమున్నది గాక! - అని ఇచటి హార్దహృదయం.

పరమసమర్థుడు, సత్యసంకల్పుడైన శ్రీరంగనాథుడు తన కృతజ్ఞతను తెలుపడానికి వేఱొక కార్యాన్ని, ఆచార్యత్వాన్ని పొందడానికి ఇంకొక కార్యాన్ని చేసి శ్రమపడకుండా, తనియన్‌ను ప్రకాశింపజేయడమనే ఒకే కార్యాన్ని చాతుర్యంగా నిర్వహించడం ద్వారా రెండు ప్రయోజనాలను పొందాడని గ్రహించాలి.

**(ఆత్మ-అనాత్మప్రమితివిరహాత్)** - **"జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః"** అని ఈ ఆత్మ జ్ఞానానందస్వరూపుడు, పరమాత్మకు శేషం- అని ఈ దేహం **"అழுక్కుడమ్బు"** అని, **"యది నామాస్య దేహస్య యదంత స్తద్బహి ర్భవేత్, దండమాదాయ, లోకోఽయం శునః కాకాంశ్చ వారయేత్"** అని అనే రీతిలో మలదూషితం - ఇత్యాది రూపంలోని యథార్థజ్ఞానం లేనందువల్ల, విపరీతజ్ఞానాన్ని-అంటే-దేహమే ఆత్మ - అనే విపరీతజ్ఞానాన్ని కల్గి ఉన్నందున- అని భావం. ఒక వస్తువును ఇంకొకవస్తువుగా గ్రహించడం విపరీత జ్ఞానం. ఒక వస్తువులోని ధర్మాన్ని వేఱు ప్రకారంగా గ్రహించడం అన్యథా జ్ఞానం. ప్రకృతంలో ఆత్మ కాని దేహాన్ని ఆత్మ అని భావించినందున విపరీతజ్ఞానం.

**(పత్యు రత్యంతదూరః)** - **"పతిం విశ్వస్య"** అని, **"యస్యాస్మి పత్యుః"** అని చెప్పబడే సర్వరక్షకునకు దూరమై- అని భావం. నిర్విశిష్టంగా ప్రయోగింపబడినందున ఇక్కడ పతిశబ్దం సర్వరక్షకత్వవాచకం. ఇది **"పా-రక్షణే"** అనే ధాతువునుండి పుట్టిన పదం. **"పత్యుః"** అనే పదాన్ని ఇక్కడ పంచమ్యంతంగా గాని, షష్ఠ్యంతంగా గాని గ్రహించవచ్చు. భగవానునకు అత్యంతం దూరంలో ఉండడానికి కారణం భగవత్సన్నికర్షలేకుండా ఉండడమే. ఇక్కడ సన్నికర్ష ఏమంటే - భగవానుడైన శ్రీమన్నారాయణునకు ఈ ఆత్మ అత్యంతం పరతంత్రమనే జ్ఞానం. ఆ జ్ఞానం, జ్ఞానారోహక్రమంలో దేహాత్మవివేకానికి నాల్గవ జ్ఞానంలో ఉండేది. ఈక్రమం **"వివేకాన్యశేషత్వ స్వస్వాతంత్ర్యనివృత్తి పారతంత్ర్యాణి"** (దేహాత్మవివేకం, ఆత్మ ఇతరులకు శేషం కాదనే జ్ఞానం, తనకు తాను శేషం కాదనే జ్ఞానం, భగవానునకు అత్యంతం పరతంత్రుడనే జ్ఞానం) అని ఆచార్యహృదయంలో తెలుపబడింది. అందువల్ల, ఆత్మ-అనాత్మ వివేకమనే ప్రథమపర్వజ్ఞానమే లేనివానికి, నాల్గవ పర్వంలోని జ్ఞానమైన భగవదత్యంత పారతంత్ర్యజ్ఞానం ఏవిధంగా

కల్గుతుంది? కలుగదు కదా! - అని ఇచటి తాత్పర్యం. అందువల్ల **"అత్యంతదూరః"** అనే ప్రయోగం సార్థకం, సాభిప్రాయకం.

**(ఘోరే) - "దారుణం.... ఘోరం భయానకమ్"** అని అమరం. **"సంసారం సాగరం ఘోరమ్"** అనే రీతిలో తలచినా భయాన్ని కల్గించేది ఘోరం. అనుభవించకపోయినా కేవల స్మృతి చాలు భయాన్ని కల్గిస్తుంది- అని తాత్పర్యం. అది ఏది? అంటే- **"ఘోరయతి, హంతి వా ఇతి ఘోరమ్"** అనే ఘోరశబ్ద వ్యుత్పత్తి ద్వారా వింటేనే భయం కల్గించేది, స్వరూపనాశాన్ని కల్గించేది - అని అర్థం.

**(తాపత్రితయ కుహరే)** - ఆధ్యాత్మిక- ఆధిభౌతిక- ఆధిదైవిక రూపాలైన తాపాలు - అనే భయానకమైన పాడు గోతిలో. (లేక) గుహలో - అనిఅర్థం. **"కుత్సితం కృత్వా హరతి, కుహతి - విస్మాపయతి తమసా వా ఇతి కుహరమ్"** అనే కుహరశబ్ద వ్యుత్పత్తి వల్ల పలు వికారాలను కల్గిస్తుందని, అజ్ఞాన ప్రదమనే అర్థాన్ని ఈ పదం ఇస్తుంది.

**(ఘూర్ణమానః)** - సతతం అంతు లేకుండా పరిభ్రమిస్తూ **"ఘూర్ణ-భ్రమణే"** అనే ధాతువు నుండి పుట్టిన వర్తమానకాలిక రూపం ఇది.

**(అయం జనః)** - నావంటి జీవుడు - అని అర్థం. ఇది జాత్యేకవచన ప్రయోగం.

**(పత్యుః పాదచ్ఛాయామ్)** - మొదటి పాదంలోని **"పత్యుః"** అనే పదాన్ని ఇక్కడ ఆవృత్తి చేసికోవాలి. సర్వరక్షకుడైన భగవానుని చరణసాన్నిధ్యాన్ని- అని అర్థం. ఛాయాశబ్దం లక్షణయా సన్నికర్షను సూచిస్తుంది. జీవుని శేషత్వానుగుణంగా **"పాదచ్ఛాయా"** అనే ప్రయోగం చేయబడింది. ఆర్తి, శ్రమ ఛాయలోనే కదా నివర్తిస్తుంది. చంటిబిడ్డ తన ఆకలిని, ఆర్తిని తీర్చే తల్లి స్తన్యాన్ని స్మరించినట్లు, ప్రపన్నుడు తన ఆర్తిని తీర్చే శ్రీచరణాలను స్మరించడం సహజం. **"తుయరఱు శుడరడి"** అని, **"తిణ్కழల్"** అని కీర్తింపబడేవి కదా భగవానుని శ్రీచరణాలు.

**(యత్ప్రసాదాత్ ప్రాపితః)**- ప్రసాదమంటే విశేషమైన, నిర్మలమైన కటాక్షం. ఏమాత్రం నిగ్రహస్వభావం లేని అనుగ్రహం- అని భావం. నేను నా అనుమతి కూడా చూపకపోయినా, నా అద్వేషాన్ని, అడ్డుపెట్టని స్వభావాన్నే ఆలంబనంగా చేసికొని, ప్రథమపరిస్పందం నుండి మీరే చేసి, దండంవలె- అచిత్తువలె జ్ఞానహీనుడనైన నన్ను తీసికొనిపోయారు- అని భావం. **"నీతః ప్రీతిపురస్కృతః"** అనే శ్రీరామాయణసూక్తి ఇక్కడ స్మరణీయం. **"ప్రాప్తః"** అని చెప్పవలసి ఉండగా, **"ప్రాపితః"** అని అనడం వల్ల పరగతస్వీకారాత్మకమైన ఈవిశేషార్థం ధ్వనిస్తుంది. వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్యలో **"ప్రాపితః"** అనేపదానికి **"దండాది భిః నీతః"** అనే వ్యాఖ్యాన వివరణపంక్తి ఉన్నది. దీనికి అనుగుణంగా, ఎఱుమ్బియప్పాపై వారి అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రుడు కోపించడం, శ్రీవరవరమునులను క్షమను అర్థించమని ఆదేశించడం మొదలైన ఐతిహ్యాలు గ్రాహ్యాలు. ఇక్కడ దండమంటే దండోపాయం.

లేక, **"విష్ణుః శేషీ తదీయ శ్శుభగుణనిలయో విగ్రహః శ్రీశఠారిః, శ్రీమాన్ రామానుజార్యః పదకమల యుగం భాతి రమ్యం తదీయమ్"** ఇత్యాది రీతిలో జగత్పతి అయిన శ్రీమన్నారాయణుని పాదస్థానీయులు

శ్రీరామానుజులు. వారి ఛాయాస్థానీయులు యతివరపునరవతారభూతులైన- శ్రీవరవరమునులు. వారి వద్దకు తీసికొని రాబడినవాడు - అని తాత్పర్యం. అంటే - దేవరవారి శ్రీచరణాలను చేరడానికి దేవరవారి అనుగ్రహమే కారణమని సారం.

**(తస్మై తే)** - అటువంటి దేవరవారికోసం - అని అర్థం. **"తే"** అనే పదం చతుర్థీవిభక్త్యంతరూపం

**(శ్రీనిధేః)** - సంపదకు నిలయమైన భగవానునకు కూడా- అని అర్థం. అప్యర్థం ఇక్కడ వివక్షితం.

**(ఇహ)** - దేవరవారు చేసిన ఉపకారం విషయంలో,

**(యత్ దేయమ్)** - ప్రత్యుపకారరూపంగా సమర్పించదగినది ఏదో,

**(తత్ కిమివ)** - పూర్వశ్లోకంలో ప్రస్తుతమైన, తనియన్ సమర్పణం కంటే ఇంకొకటి ఏమున్నది!- ఏమీ లేదని భావం.

**"పత్యుః పాదచ్ఛాయామ్"** అనే ప్రయోగం ద్వారా **"పాదచ్ఛాయా సుఖా భర్తు స్తాదృశస్య మహాత్మనః, స హి నాథో జనస్యాస్య స గతి స్స పరాయణమ్"** అనే శ్లోకంలోని **"భర్తుః పాదచ్ఛాయా సుఖా"** అనే నిర్దేశం స్మరింపజేయబడింది.

ఆశ్లోకం తిరుమంత్ర, ద్వయమంత్రార్థరంజకం. **"తాదృశస్య"** అనే సర్వనామపదం భగవానుని ఉపాయత్వ - ఉపేయత్వాలకు ఆవశ్యకాలైన కల్యాణగుణాలను అతడు కల్గి ఉండే స్థితిని తెల్పుతుంది. **"మహాత్మనః"** - అనే పదం అనన్యసాధ్యత్వం- అంటే -చేతనరక్షణం భగవానునివల్లనే సాధ్యమవుతుందని తెల్పుతుంది - **"పత్యుః" (భర్తుః")** అనే పదం జీవ-పరమాత్మల మధ్య ఉండే అవర్జనీయమైన (విడువడానికి వీలులేని) సంబంధాన్ని సూచిస్తుంది. **"పాదచ్ఛాయా"** అనే పదం ద్వారా **"చిత్తాలంబనసౌకర్యకృపోత్తంభన హేతుభిః, ఉపాయత్వ మిహ స్వామిపాదయో రనుసంహితమ్"** అనే రీతిలో కృపను ఉద్బుద్ధం చేయడంలో హేతువైన శ్రీచరణాలు తెలుపబడ్డాయి. **"సుఖా"** అనే పదంచేత ప్రాప్యభేదం తెలుపబడింది. **"ఛాయా"** అనే పదంచేత విశ్రమస్థానత్వం ధ్వనిస్తున్నది. **"స హి నాథః"** అని అనడంద్వారా భగవానుని తెలిపే ప్రణవార్థం శేషిత్వాన్ని తెలుపబడింది. **"స గతిః"** అని శరణ్యత్వాన్ని తెలిపే నమశ్శబ్దార్థం, **"స పరాయణమ్"** అనేపదం ద్వారా ప్రాప్యత్వపరమైన, వ్యక్తంగా నిర్దేశింపబడిన (**"నారాయణ"** అనేపదంలోని) చతుర్థీ విభక్త్యంతమైన నారాయణ శబ్దార్థం అనుసంధింపబడ్డాయి - అనే ఈ విషయాలను సారజ్ఞులు గ్రహిస్తారు- అని వీరరాఘవాచార్య వ్యాఖ్య.

ఈ శ్లోకంలో ప్రస్తావింపబడిన, ఆచార్యుడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకృతి లేదనే అర్థాన్ని శ్రీవచనభూషణదివ్యగ్రంథంలోని- **"ఆచార్యనుక్కు సదృశప్రత్యుపకారమ్ పణ్ణలావతు - విభూతి చతుష్టయముమ్, ఈశ్వరద్వయముమ్ ఉణ్డాకిల్"** అనే (432) సూత్రాన్ని, దానికి శ్రీవరవరమునులు చేసిన వ్యాఖ్యానాన్ని స్మరించాలి. అదే రీతిలో- "ఆచార్యత్వాన్ని భగవానుడు పొందాలని ఆశపడ్డాడు'' - అనే సూక్తికి అనుగుణంగా శ్రీవచనభూషణంలోని- **"ఈశ్వరన్ తానుమ్ ఆచార్యత్వత్తై ఆశైప్పట్టిరుక్కుమ్"**

అని, "ఆకైయిఱే గురుపరంపరైయిలే అన్వయిత్తదుమ్, శ్రీగీతైయుమ్, అభయప్రదానముమ్ అరుళిచ్చెయ్ దదుమ్" అనే (430,431వ) సూత్రాలను, వాటిని వివరిస్తూ శ్రీవరవరమునులు చేసిన రస్యవ్యాఖ్యానాన్ని స్మరించాలి. వీటికి అన్నిటికీ మూలంగా నాచ్చియార్‌తిరుమొழிలోని "తలైయల్లాల్ కైమ్మాఱు ఇలేనే" అనే దివ్యసూక్తి కూడా స్మరణీయం. అదేరీతిలో శ్రీవరవరమునుల వ్యాఖ్యానంలో ప్రమాణంగా ఉట్టంకింపబడిన "యో దద్యాత్ భగవద్జ్ఞానం కుర్యాద్ధర్మోపసేవనమ్, కృత్స్నాం వా పృథివీం దద్యాత్ న తత్ తుల్యం కథంచన" అనే శ్లోకం, దీనిని వివరిస్తూ శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారు ప్రస్తావించిన- "బ్రహ్మవిద్యాప్రదానస్య దేవైరపి న శక్యతే, ప్రతిప్రదాన మథవా దద్యాచ్ఛక్తిత ఆదరాత్" అనే శ్లోకం అనుసంధేయాలు. ఆచార్యునకు చేయదగిన సదృశప్రత్యుపకారం ఏమీ లేకపోయినా యథాశక్తి ప్రత్యుపకృతిని చేయడంలో అనుజ్ఞ ఇవ్వబడింది- అనే విషయం "యో దద్యాత్" అనే శ్లోకంలోని "కుర్యాత్" అనే క్రియాప్రయోగం ద్వారా వ్యక్తమవుతున్నదనికూడా వారు వివరించడం గమనించదగినది. లేకపోతే, ఇక ఎవరూ ఏ రీతిలోను ఆచార్యునకు కృతజ్ఞతాపూర్వకంగా యత్కించిత్ సమర్పణం చేసే అవకాశమే లేకుండా పోతుంది కదా.

అందువల్ల భగవానుని విషయంలో "ఎనదావి తన్దొழிన్దేన్" అని, "అహ మద్యైవ మయా సమర్పితః" అని ఆత్మసమర్పణాన్ని చేసి, వెంటనే "ఎనదావియావియుమ్ నీ" అని, "అథవా కిం ను సమర్పయామి తే" అనే రీతిలో అనుతపించి భావించేటట్లే, ఆచార్యుని విషయంలో కూడా యథాశక్తి ప్రత్యుపకారస్మృతిలో సమర్పణం చేయాలి, వారు చేసిన మహోపకృతికి చేసిన సమర్పణం ఎంతమాత్రం సదృశం కాదని అనుతపించాలి- అనే రహస్యాన్ని ఇక్కడ గ్రహించాలి.

**64.** అవ :- గడచిన శ్లోకంలో దేవరాజగురువు "యత్ప్రసాదాత్" ఇత్యాదిగా శ్రీవరవరమునుల కృప తమను భగవానుని శ్రీచరణాలలో చేర్చింది - అని అన్నారు. ఇందులో ఆ కృపయే తమకు అజ్ఞాతజ్ఞాపనాన్ని చేయడంద్వారా రక్షకమైనది - అని అంటున్నారు.

విఖ్యాతం యద్రఘుకులపతేః విశ్వతః క్ష్మాతలేఽస్మిన్<br>
నిత్యోదగ్రం వరవరమునే! నిస్సపత్నం మహత్త్వమ్ ।<br>
పశ్యన్నంధః ప్రకృతివివశో బాలిశో యాదృశోఽయం<br>
తత్త్వం తస్య ప్రకటయసి మే తాదృశైరేవ యోగైః ॥

వరవరమునే = ఓ మణవాళమహామునీ !, విశ్వతః (ఉపలక్షితే) = స్నేహం కలవారు, పగ కలవారు- మధ్యస్థులు- అనే పలువిధాలైన జనులతో కూడిన, అస్మిన్ క్ష్మాతలే = ఈ భూమిలో, విఖ్యాతం = చాలా ప్రసిద్ధమైనది, నిత్య+ఉదగ్రం = ఎల్లప్పుడు తల ఎత్తి ఉండేది, నిస్సపత్నం = సాటి లేనిదైన, రఘుకులపతేః= రఘుకులనాథుడైన శ్రీరామచంద్రుని, మహత్త్వం యత్ = "శరణాగతుని రక్షించి తీరుతాను'' అనే వ్రతరూపంలోని గొప్పతనం ఏది ఉన్నదో, తత్ = ఆ గొప్పతనాన్ని, పశ్యన్ అపి =బాహ్యవస్తువులను బాహ్యనేత్రాలతో వ్యక్తంగా దర్శిస్తూ ఉండేవాడైనా, అంధః= ఆంతరనేత్రమనే జ్ఞానంలేని గుడ్డివాడై,

ప్రకృతివివశః= (దానికి కారణమైన) శరీరసంబంధాన్ని కలవాడుగాను, బాలిశః= (దానివల్లకల్గిన) విపరీతజ్ఞానాన్ని కల్గినవాడుగాను ఉండే, అయం = చాలా నీచుడైన ఇతడు (నేను), యాదృశః= ఏ ఉపాయాలతో తత్త్వజ్ఞానాన్ని కలవాడను కాగలనో, తాదృశైః ఏవ యోగైః= అటువంటి ఉపాయాలతోనే, త్వం = (దాసునిపట్ల చాలా కృపను కల) దేవరవారు, తస్య = పూర్వం పల్కిన రీతిలో నీచుడైన అతనికి (నాకు), ప్రకటయసి = (శ్రీరాముడు పల్కిన చరమశ్లోకార్థోపదేశాన్ని నోటితో)వ్యక్తం చేస్తున్నారు, **("వరవరమునే! త్వం రఘుకులపతేః నిస్సపత్నం మహత్త్వం ప్రకటయసి"** అని అన్వయం.)

వ్యాఖ్యానమ్ : **(విశ్వతః క్ష్మాతలేఽస్మిన్)** - శత్రువులు, మిత్రులు, మధ్యస్థులు - అనే మూడు విధాలైనవారు నివసించే ఈ భూమండలంలో,

**(విఖ్యాతమ్)** - మిక్కిలిగా ప్రసిద్ధమైన - అని అర్థం. సీతాదేవి కూడా **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** (ఆ ధర్మజ్ఞుడైన ఆ శ్రీరాముడు శరణాగతవత్సలుడుగా ప్రసిద్ధుడు కదా) అని అంటూ **"విదితః"** అని అన్నది కదా!

**(నిత్యోదగ్రమ్)** - నిత్యం తల ఎత్తినది - నిత్యం ఉన్నతమైన త్రికాలాబాధితమైన - అని తాత్పర్యం. **"క్రోధ మాహారయత్తీవ్రమ్"** (తీవ్రమైన క్రోధాన్ని ఆరోపించుకొన్నాడు) అనే రీతిలో ఆరోపించుకోవలసిన అవసరం లేనిది- ఈ శరణాగత రక్షణమనే మహత్త్వం. నీటికి చల్లదనం సహజమైనట్లు, శ్రీరామునకు ఈ స్వభావం నిరుపాధికం, సహజం కనుక నిత్యోదగ్రం. లేక, **"ఆత్మానం మానుషం మన్యే"** (నన్ను నేను మానవునిగా భావిస్తున్నాను) అనే సంకల్పవిశేషంతో తిరోహితం కానిది- అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. అందువల్లనే కూరేశులు అతిమానుషస్తవంలో **"మానుష్యకం చరిత మాచరితుం ప్రవృత్తో దేవాతిగం చరిత మంగ ! కిమంగ్యకార్షీః ?"** అని అంటూ చమత్కారంగా భగవానుని ప్రశ్నించారు. **"అబ్ధిం న తేరిథ న జిగ్యథ రాక్షసేంద్రం నైవాస్య జజ్ఞిథ యదా చ బలాబలం త్వమ్, నిస్సంశయ స్సపది తస్య పదేఽభ్యషించః తస్యానుజం కథమిదం హి విభీషణం చ"** ("సముద్రాన్ని దాటకుండానే, రావణుని సంహరించకుండానే, వానర-రాక్షస సేనలబలాబలాలను తెలిసికోకుండానే ఏమాత్రం సందేహం లేకుండా విభీషణుడు శరణాగతి చేసిన వెనువెంటనే రావణుని తమ్ముడైన అతనిని లంకాధిపతిగా అభిషేకించావు? ఇది ఏమి స్వామీ!") అని ప్రశ్నించారు కూడా. అందువల్ల శ్రీరాముని శరణాగతరక్షణదీక్ష నిత్యోదగ్రం.

**(నిస్సపత్నమ్)** - అడ్డు లేనిది. ప్రత్యర్థి లేనిది- అని అర్థం. **"ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణాగతః, అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా"** అని, **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** అని అంటూ స్వయంగా ఆశ్రిత సంరక్షణతో పోలిస్తే ప్రాణత్యాగంకూడా తనకు అకించిత్కరమని పల్కినందున శ్రీరాముని ఆశ్రితసంరక్షణ స్వభావం బలీయస్తమమని, దానిని వేఱొక స్వభావం తిరోధానం చేయలేదని తెలుస్తున్నది. ఇందువల్ల **"నిస్సపత్నమ్"** - అని అర్థం. **"సపత్న"**శబ్దం ప్రత్యర్థివాచకం. **"రిపౌ వైరిసపత్నారి"** అని అమరనిఘంటువు.

**(రఘుకులపతేః)** - **"రఘుకుల"** శబ్దప్రయోగంద్వారా శరణాగతుని రక్షిస్తే తప్ప ప్రాణధారణను చేయలేని స్వభావం తెలుపబడింది. కకుత్స్థ, దిలీప, రఘుమహారాజుల చరిత్రలు దీనికి సాక్షీభూతాలు.

**(యత్ మహత్త్వమ్)** - సర్వనామమైన యచ్ఛబ్దం వక్త్రుబుద్ధిస్థమైన శ్రీరాముని శరణాగత సంరక్షణ స్వభావంలోని మహత్త్వాన్ని పరామర్శిస్తుంది. **"సీతా ముమాచాతియశాః రాఘవం చ మహావ్రతమ్"** అని, **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"** అని **"సంరక్షణైకవ్రత"** అని చెప్పబడిన రీతిలో శరణాగతరక్షణమే శ్రీరామావతారంలోని ముఖ్యప్రయోజనం కనుక, దాని ఉత్కర్షమే ఇక్కడ **"మహత్త్వమ్"** అనే శబ్దం ద్వారా వివక్షితం. జగద్విఖ్యాతమైన శరణాగతరక్షణైక వ్రతత్వరూపమహత్త్వమని దీని తాత్పర్యం. **"ప్రకటయసి"** అనే క్రియతో ఈ ద్వితీయాంతపదం అన్వయిస్తుంది.

**(పశ్యన్)** - బాహ్యనేత్రాలను కలవాడనై, బాహ్యవస్తుదర్శనాన్ని చేస్తూ ఉన్నా,

**(అంధః సన్)** - **"ఆంధ్యవాన్ జీవన్మృతః"** అని అంటూ గ్రుడ్డివాడు బ్రతికున్నా చనిపోయినవానితో సమానమని చెప్పబడుతున్నాడు. ఇక్కడ చెప్పబడిన గుడ్డితనం బాహ్యనేత్రానికి చెందినది కారాదు- ఆంతరనేత్రంగా చెప్పబడే జ్ఞానానికి చెందినది. చైతన్యాన్ని కల్గి ఉన్నందులకు ఉండదగిన సమీచీన జ్ఞానరూపమైన ముఖ్యప్రయోజనాన్ని లేనివాడనై- అని తాత్పర్యం. దీనికి ఏమి కారణం? అంటే-

**(ప్రకృతివివశః)** - ప్రకృతి సంబంధాన్ని కలవాడనై, దానికి పరతంత్రుడనై- అని అర్థం. ఇందువల్ల ఏమి జరిగింది? అంటే,

**(బాలిశస్సన్)** - మూర్ఖుడనై, విపరీతజ్ఞానాన్ని కలవాడనై, దేహాత్మభ్రాంతిని కలవాడనై- అని అర్థం. అజ్ఞాన - విపరీతజ్ఞానాలకు హేతువు ప్రకృతిసంసర్గం కనుక, దానిని తెలిపే **"ప్రకృతివివశః"** అనే పదం **"అంధః బాలిశః"** అనే పదాల నడుమ ప్రయోగింపబడింది. అపుడే కదా దానికి ఆరెండిటిలో శాబ్దికసంబంధం ఉంటుంది. ఇది ఒక శబ్దప్రయోగచమత్కారం. **"పొయ్న్నిన్ఱ ఞానమ్ పొల్లా వొழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్"** అని అంటూ అజ్ఞాన - అన్యథాజ్ఞానాదులు, అసత్ప్రవర్తన, ప్రకృతిసంబంధం - అనే ఇవి కార్యకారణ రూపాలని అన్నారుకదా! **"బలిశః"** అంటే మత్స్యాలను వధించేవాడు. అతనివలె మూర్ఖుడు, అపూజ్యుడు కనుక బాలిశుడనబడుతున్నాడు. **"బలిశవత్ మూర్ఖత్వాత్, అపూజ్యత్వాత్"** అని అమరసుధలో వివరింపబడింది. గురుబాలప్రబోధికలో చూపిన ఇంకొక అద్భుతమైన అర్థం కూడా స్మరణీయం - **"పరదత్తం బలిం పూజాం శ్యతీతి బలిశః, బలిశ ఏవ బాలిశః** - తనకు చేసిన సన్మానాన్ని పాడుచేసికొనేవాడు, **దేవతార్థం దత్త మాపూపాదిబలిం శ్యతి భక్షణేన తనూకరోతీతి బలిశః- బలిశ ఏవ బాలిశః"** దేవతలకోసం సమర్పించిన భక్షణాదులను తిని దానిని చెఱచేవాడు కనుక బలిశుడు, అతడే బాలిశుడు- అనే రెండు వివరణాలనుబట్టి **"విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్"** అనే రీతిలో భగవానుని ఆరాధనకోసం తనకు సాధనంగా అనుగ్రహింపబడిన దేహమనే సంపదను దుర్వినియోగం చేసి పాడు చేసేవాడని, **"ఓమిత్యాత్మానం యుంజీత"** అనే రీతిలో భగవదర్పణాన్ని చేయదగిన, అనర్ఘమైన ఆత్మవస్తువును

తనకు శేషమని తలచి అనుభవించేవాడనే అర్థవిశేషాలు ఈపదం ద్వారా ధ్వనిస్తాయి కనుక, ఇవి కూడా ప్రకృతంలో అనుసంధేయాలు. తద్వారా అన్యథాజ్ఞానాదులు కూడా ఆక్షిప్తమైనవి.

**(అయమ్)** - ఈ సర్వనామశబ్దం ద్వారా శ్లోకంలో తెలుపబడనివి, వక్తృబుద్ధిస్థమైనవి అయిన దోషాంతరాలు కూడా సూచింపబడ్డాయి.

**(యాదృశః)** - ఈ (విశేషణ)- పదం ద్వారా- ఏయే ఉపాయాలద్వారా నేను తత్త్వజ్ఞానాన్ని కలవాడను కాగలనో-అనే అర్థం స్ఫురిస్తుంది.

**(తాదృశైరేవ)** - అజ్ఞాన - విపరీతజ్ఞానాదులకు హేతుభూతమైన ప్రకృతిసంబంధాన్ని ఎదిరించి, సమ్యక్జ్ఞానాన్ని కల్గించడంలో సమర్థాలైన ఉపాయాలతో-అని భావం. విపరీతజ్ఞానాదుల ఉత్పత్తిని అడ్డుకొనేవి, సమ్యక్జ్ఞానాదుల ఉత్పత్తికి సమర్థాలైనవి - అని అర్థం. "ఏవ" కార ప్రయోగంద్వారా - అధికారం కల్గినవారికే శాస్త్రాన్ని ఉపదేశించడం మొదలైన నియమాలను కల్గిన భగవానుని ఉపాయాలకంటే వీటికి గల వ్యావృత్తి తెలుపబడింది.

**(యోగైః)** - **"యోగః సన్నహనోపాయ"** ఇత్యాది నిఘంటువచనంవల్ల యోగశబ్దం ఉపాయవాచకం. ఉపాయాలతో అని అర్థం. నిర్హేతుకకృప మొదలైన ఉపాయాలను తంత్రేణ సూచించడంకోసం నిర్విశేషంగా **"యోగైః"** అని ప్రయోగింపబడింది. **"యోగః కర్మసు కౌశలమ్"** (యోగమంటే కార్యకౌశలం) అనే యోగ శబ్దనిరుక్తిని కూడా అన్వయించుకోవచ్చు. కుశలంగా ప్రయోగించే ఆయా ఉపాయాలతో- అని భావం.

**(త్వమ్)** - నా విషయంలో ప్రపన్నులైన దేవరవారు.

**(తస్య మే)** - అటువంటి నాకు - **"పశ్యన్ అంధః"** ఇత్యాదిగా శ్లోకంలో పూర్వం నిర్దేశింపబడిన స్వరూపాన్ని కల్గిన నాకు.

**(రఘుకులపతేః తత్త్వం ప్రకటయసి)** - **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన", "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే"** అనే శ్రీరామచరమ శ్లోకద్వయార్థాలను ఉపదేశించడం ద్వారా దర్శింపజేస్తున్నారని భావం.

**"యోగైః"**- నిర్హేతుకకృప, చక్కగా ఉపదేశించడం, ఉపదేశించేటపుడు తమవద్ద నమ్మకం కల్గడం కోసంతమ అప్రాకృతవైభవాన్ని వ్యక్తం చేయడం - మొదలైనవి ఉపాయాలు.

శ్రీరాముడు ఉపదేశించిన చరమశ్లోకాలు రెండు. అవి - **(1) మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్", (2) "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చయాచతే, అభయం సర్వభూతేభ్యో దదామేతద్వ్రతం మమ"** అనే రెండు శ్లోకాలు. ఇతడు మిత్రుడు- నమ్మదగినవాడు - అని నేను భావించేటట్లు నటిస్తూ అయినా, ఒకడు నా దగ్గరకు వచ్చి, శరణు వేడితే, నాకు ఎన్ని బాధలు కల్గినా, నేను ఏనాడూ నేను అతనిని విడిచే సంభావన లేనే లేదు. అతని వద్ద దోషాలు ఒకవేళ ఉన్నా, ఉండనీ. దోషాలు నిండినవారిని కాపాడితే, పెద్దలు నిందించరా? అని మీరు

భావించవచ్చు. అటువంటి దోషులను రక్షిస్తే - "దోషాలను కలవారినికూడా విడచిపెట్టకుండా రక్షించాడు కదా'' అని సత్పురుషులు నన్ను పొగుడుతారు తప్ప, ఏనాడూ నిందించరు- అనేది "మిత్రభావేన" ఇత్యాది శ్లోకభావం. దీనివల్ల, శ్రీరాముని సహజమైన స్వభావం- శరణాగతుని విడువకుండా రక్షించడమేనని తెలుపబడింది.

ఇక, "సకృదేవ" ఇత్యాది శ్లోకంద్వారా శ్రీరాముడు తన సహజ స్వభావానికి తగినట్లుగా ప్రతిజ్ఞను చేయడం తెలుపబడింది. "ఒకసారి నన్ను శరణు పొందినవానినిగూర్చి, "నీకు నేను రక్షింపదగినవాడనై ఉన్నాను'' అని నన్ను వేడినవానిని గూర్చి - వారు ఎటువంటివారైనా వారికి నేను అభయాన్ని ఇస్తాను. ఇది నా వ్రతం. (వ్యర్థం కాని నా మనోనిశ్చయం) - అనేది ఆ శ్లోక భావం.

**65.** అవ :- ఇక, "శ్రీరామచరమశ్లోకార్థాన్ని ఉపదేశించి, శ్రీరామచంద్రుని మహత్త్వాన్ని వ్యక్తం చేసి, తమకు నమ్మికను కల్గించి, తిరుమంత్రం, ద్వయం, శ్రీకృష్ణచరమశ్లోకం - అనే రహస్యత్రయంయొక్క అర్థాలను ఉపదేశించి, దాసుడనైన నన్ను మీరు రక్షించారు'' అని ఇందులో వరవరమునులను ఉద్దేశించి అంటున్నారు.

**లక్ష్మీభర్తుః పరమగురుతాం లక్షయంతీ గురూణాం**
**పారంపర్యక్రమవివరణీ యా హి వాణీ పురాణీ ।**
**అర్థం తస్య ప్రథయతి చిరాదన్యతో యద్దురాపం**
**దివ్యం తన్మే వరవరమునే! వైభవం దర్శయిత్వా ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, లక్ష్మీభర్తుః = శ్రియఃపతి యొక్క, పరమగురుతాం = పరమాచార్యత్వాన్ని, లక్షయంతీ = నిరూపించేది, పురాణీ = చాలా ప్రాచీనమైనది అయిన, వాణీ = రహస్యత్రయరూపమైన వాక్కు, గురూణాం = శ్రియఃపతికి తరువాత ఆవిర్భవించిన ఆచార్యుల, పారంపర్యక్రమవివరణీయా హి = పరంపరాక్రమానుసారంగా వివరించదగినదికదా!, తస్యాః = ఆ రహస్యత్రరూపమైన వాక్కుయొక్క, అర్థం = అర్థాన్ని, చిరాత్ = చాలా కాలమైన తరువాతకూడా, అన్యతః = దేవరవారివల్ల తప్ప ఇంకొకరివల్ల, దురాపం = పొందడానికి సాధ్యం కానిది, యత్ = ఏది ఉన్నదో, తత్ = ఆ, దివ్యం = అప్రాకృతమైన, వైభవం = (దేవరవారి) వైభవాన్ని, మే = దాసుడనైన నాకు, దర్శయిత్వా = దర్శింపజేసి, ప్రథయసి = వ్యక్తం చేస్తున్నారు (ఉపదేశిస్తున్నారు)

రహస్యత్రయాన్ని మొట్టమొదటగా ఉపదేశించినవాడు భగవానుడే. తిరుమంత్రాన్ని బదరికాశ్రమంలో తన అవతారమైన నరునకు, ద్వయాన్ని శ్రీవిష్ణులోకంలో తన ధర్మపత్ని అయిన లక్ష్మీదేవికి, చరమశ్లోకాన్ని ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో తనతో సమానుడైన అర్జునునకు భగవానుడు నిర్హేతుకంగా ఉపదేశించాడు. భగవానుని పరమాచార్యత్వం అనేది- వినేవారి ప్రార్థనను కూడా ఎదురు చూడకుండా ఈ రహస్యార్థాలను ప్రప్రథమంగా ఉపదేశించే స్వభావమే. ఇవి ఏవిధంగా ఉద్భవించాయి? అని పరిశీలిస్తే, ఇవి భగవానుని నిర్హేతుకకృపామూలకమైన పరమాచార్యత్వాన్ని నిరూపించగల్గినవి. వీటిలోని అర్థాలను చూస్తే-

ఆచార్యపరంపర ద్వారా - క్రమంగా కొంచెం కొంచెంగా చిరకాలం గ్రహించదగినవి, వైభవాన్ని కల్గినవి. అటువంటి రహస్యత్రయార్థాలను అన్నిటినీ సులభంగా, శీఘ్రంగా ఉపదేశించారు, శ్రీవరవరమునులు. ఆ విధంగా ఉపదేశించేటపుడు- తాము పలికే అర్థాలు వాస్తవమైనవి- అనే నమ్మకం కల్గడంకోసం తమ అప్రాకృతమైన స్వరూపాన్ని (ఆదిశేషావతారమైన స్వరూపాన్ని) నాకు దర్శింపజేశారు- అని అంటున్నారు- **"అన్యతః దురాపం దివ్యం వైభవం దర్శయిత్వా"** అని అనడం ద్వారా. భగవానుడు అర్జునునకు చరమశ్లోకాన్ని ఉపదేశించేటపుడు ఏరీతిలో తన పరత్వాన్ని- అంటే- నారాయణత్వాన్ని, విశ్వరూపాన్ని ప్రదర్శించడం ద్వారా చూపించాడో, అదే రీతిలో శ్రీవరవరమునులుకూడా తమకు రహస్యత్రయార్థాలను ఉపదేశించేటపుడు, తాము ఆదిశేషులనే విషయాన్ని సహస్రఫణాత్మకమైన రూపంతో దర్శనాన్ని అనుగ్రహించి, చూపించారని ఈసూక్తి ద్వారా దేవరాజగురువులు పలికారు. రహస్యత్రయంలోని ఒక్కొక్క పదంలోను, అంతే కాదు, ఒక్కొక్కఅక్షరంలోను విశేషార్థాలు ఉన్నాయి. వాటి అన్నిటిని ముముక్షుప్పడి వివరణరూపంగా శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యలో సేవించాలి.

వ్యాఖ్యానమ్ : **(లక్ష్మీభర్తుః పరమగురుతామ్) - "పరో మా యస్మాత్ సః పరమః, పరమ శ్చాసౌ గురుశ్చ- పరమగురుః, పరమగురో ర్భావః - పరమగురుతా, తామ్"** అనే విగ్రహవాక్యాన్ని **"పరమగురుతామ్"** అనే పదానికి చెప్పాలి. ఎవరికంటే గొప్ప ఆచార్యులు ఇంకొకరు లేరో, ఆ ఆచార్యుడు పరమగురువు. **"గుశబ్దస్త్వంధకార స్స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః, అంధకారనిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే"** అని నిర్వచింపబడిన రీతిలో హితోపదేశం చేయడం ద్వారా అజ్ఞానాన్ని పోగొట్టేవాడు- అనే అర్థం. గురుశబ్దం ద్వారా ఇక్కడ వివక్షితం. ఆ గురుత్వంలోని పరమత్వం ఏమి? అంటే - **"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః"** అని, **"స గురు మేవాభిగచ్ఛేత్"** అని, **"నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్"** అని, **"మైత్రేయః పరిపప్రచ్ఛ ప్రణిపత్యాభివాద్య చ"**, **"నాపృష్టతః కస్యచిత్ బ్రూయాత్"** అని చెప్పిన రీతిలో శ్రోతలనుండి ఏవిధమైన ప్రార్థనను, శుశ్రూషను ఎదురు చూడకుండా, నిర్హేతుకకృపతోనే ఉపదేశించడం. రహస్యత్రయాలను భగవానుడు ఉపదేశించడానికి ఎవరి ప్రార్థన మూలం కాదని పూర్వోక్తమే కదా! **"అస్థానస్నేహకారుణ్య ధర్మాధర్మధియాఽఽకులమ్, పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్"** అని అంటూ అర్జునుని వ్యాజంగా చేసికొని లోకానికి అంతటికి ఉపదేశం చేసిన పరమాచార్యుడు కదా, గీతాచార్యుడు. ఇచట **"ఉద్దిశ్య"** అనే పదాన్ని శ్రీరామానుజులు **"వ్యాజీకృత్య"** అని వ్యాఖ్యానించి భగవానుని పరమగురుత్వాన్ని సూచించారు. **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** అనేది దివ్యసూరిసూక్తి. ఈ సూక్తిని పల్కిన పెరియాళ్వార్లు భగవానుని పరమాచార్యత్వానికి సాక్షాత్ సాక్షీభూతులుకదా! **"లక్ష్మీభర్తుః"** అనే ప్రయోగం ద్వారా భగవానుని ఆచార్యత్వంలో, లక్ష్మీవాల్లభ్యం- అంటే ఆస్వామికి లక్ష్మివిషయంలో ఉండే అనురాగం -ప్రేరకమనే విషయం సూచింపబడింది.

**(లక్షయంతీ)-** ఆచార్యత్వం భగవత్సంకల్పవిశేషం కదా! దానిని ఉపదేశకత్వాదులు వ్యక్తం చేస్తాయి. కనుక **"లక్షయంతీ"** అని అన్నారు.

**(గురూణాం పారంపర్యక్రమవివరణీయా హి)** - భగవానునకు తరువాత ఉద్భవించిన ఆచార్యుల పరంపరాక్రమంలో - ఒకరు ఇంకొకరికి కొంచెం కొంచెంగా చిరకాలం ఉపదేశించడమనే రీతిలో ప్రకాశింపజేయదగినవి కదా- అని అర్థం.

**(పురాణీ వాణీ)** - రహస్యత్రయరూపమైన వేదవాణి - అనిభావం. **"లక్ష్మీభర్తుః పరమగురుతాం లక్షయంతీ పురాణీ వాణీ గురూణాం పారంపర్యక్రమ వివరణీయా హి"** అని అన్వయం. అష్టాక్షరీ మహామంత్రం నారాయణోపనిషద్గతం. త్రయీసారం. ద్వయమంత్రం కఠవల్లీగతం. ఇక, చరమశ్లోకం పంచమవేదంగా, వేదోపబృంహణంగా చెప్పబడే మహాభారతాంతర్గతం. ఈవిధంగా రహస్యత్రయం పురాణవాణి.

**(తస్యాః అర్థమ్)** - ఆ విధంగా ప్రసిద్ధమైన, రహస్యత్రయరూపమైన వేదవాక్కుయొక్క అర్థాన్ని,

**(ప్రథయసి)** - దేవరవారు వ్యక్తం చేస్తున్నారు. ఏమి చేసి? అని అంటే,

**(చిరాత్ అన్యతః దురాపమ్)**- చిరకాలానికి కూడా ఇంకొకరివల్ల -చివరికి భగవానునివల్లకూడా పొందడానికి సాధ్యంకానిదైన,

**(వైభవం దర్శయిత్వా)**- తమ వైభవాన్ని దర్శింపజేసి- అని అర్థం. కేవలం హితతమమైన అర్థాలను ఉపదేశిస్తే, మందబుద్ధులకు వాటి విషయంలో అప్రామాణ్యశంక కలగువచ్చునని భావించి, ఆ విధంగా కలుగకుండా ఉండడంకోసం తమ అప్రాకృతవైభవప్రదర్శనం ద్వారా వాటిని ఉపదేశించారు- అని తాత్పర్యం. దీనివల్ల శ్రీకృష్ణుడు చరమశ్లోకాన్ని ఉపదేశించినపుడు విశ్వరూపాన్ని అర్జునునకు దర్శింపజేసినట్లే, రహస్యత్రయార్థోపదేశ సమయంలో శ్రీవరవరమునులు సహస్రాత్వరూపమైన తమ అప్రాకృతరూపాన్ని, వ్యాఖ్యాన వైభవాన్ని ప్రదర్శించి, అనుగ్రహించారనే సాంప్రదాయికార్థం ధ్వనిస్తున్నది. యతీంద్రప్రవణ ప్రభావమనే వరవరమునిచరిత్రగ్రంథంలో **"పూర్వాచార్యర్కళుడైయ జ్ఞానానుష్ఠానపూర్తికళై కూఱువరాయ్ ఎழுన్దరుళియిరున్ద అప్పోతై సేవైయు మనుభవిత్తు, అవ్వనుభవత్తుక్కు ఉద్దేశ్యరానవర్కళుడన్ అస్థానే భయశంకికళాయ్....", "మంగళం రమ్యజామాతృమునివర్యాయమంగళమ్, మంగళం పన్నగేంద్రాయ మర్త్యరూపాయ మంగళమ్. ... ఎన్గిఅపడియే మంగళాశాసనమ్ పణ్ణి"** ఇత్యాదిసూక్తులు భావ్యాలు.

**66.** అవ :- పూర్వశ్లోకంలో **"అన్యతో యద్దురాపమ్"** అని పల్కిన అంశాన్ని ఇందులో వివరిస్తున్నారు. లేక, ఇటువంటి శ్రీవరవరమునుల వైభవాన్ని వారే స్వయంగా దాసునకు వ్యక్తమయేటట్లుగా అనుగ్రహించినవాడు, దాసుని ఆరాధ్యదేవత అయిన శ్రీరామచంద్రుడు మిగిలిన లోకులకుకూడా ఈ అనుగ్రహాన్ని ఎందుకు చేయలేదు? అని అంటున్నారు- అని కూడా చెప్పవచ్చు.

**తత్త్వం యత్తే కిమపి తపసా తప్యతామప్యృషీనాం**
**దూరాద్దూరం వరవరమునే! దుష్కృతైకాంతినో మే ।**
**వ్యాకుర్వాణః ప్రతిపద మిదం వ్యక్తమేవం దయావాన్**
**నాథో నైతత్ కిమితి జగతి ఖ్యాపయత్యద్వితీయమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, కిమపి = పరిచ్ఛేదించడానికి సాధ్యం కానిది, తపసా = ఉపాసనం మొదలైన నియమాలతో, తప్యతాం = తాము కోరిన ఫలాన్ని పొందే సామర్థ్యాన్ని కల్గిన, ఋషీణామ్ అపి = మునులకు కూడా, దూరాద్దూరం = మిక్కిలి దూరంలో ఉన్నది, తెలిసికోవడానికి పూర్తిగా సాధ్యం కానిది అయిన, తే = అప్రాకృ'తమైన వైభవాన్ని కల్గిన దేవరవారియొక్క, యత్ = ఏ, తత్త్వం = గొప్ప జ్ఞాన శక్తులతో కూడి ఉండడమనే స్వరూపంయొక్క తత్త్వం ఏది ఉన్నదో, ఇదం = (ఆ) ఈ దేవరవారి తత్త్వం, దుష్కృత+ ఏకాంతినః= పాపాలను చేయడంలోనే లగ్నమై ఉండే నియమాన్ని కల్గిన, మే = దాసునకు, వ్యక్తం = సుస్పష్టంగా, ప్రతిపదం = మాటిమాటికి, వ్యాకుర్వాణః= ప్రకాశింపజేస్తున్న, నాథః= మా కులదేవత అయిన శ్రీరామచంద్రుడు, అద్వితీయం ఏతత్ = సాటి లేని ఈ దేవరవారి తత్త్వాన్ని, ఏవం = ఈ విధంగా దాసునకు ప్రకాశింపజేసినట్లే, జగతి = లోకంలో (మిగిలినవారికికూడా), కిమితి = ఏ కారణంవల్ల, న ఖ్యాపయతి = ప్రకాశింపజేయడం లేదు.

శ్రీరామచంద్రుడు, శ్రీవరవరమునుల తత్త్వాన్ని దాసునకు (నాకు) వ్యక్తం చేయడానికి కారణాలు- (1) దాసుడు పాపకార్యాలను చేయడంలోనే నియమాన్ని కల్గి ఉండడం, (2) తన నిర్హేతుక కృప-అనేవి రెండే. వీటిలో, తనకు దయ లేకపోవడంవల్లనా ?, లేక, దాసునకువలె పాపాలను చేయడంలోనే నియమం లేకపోవడంవల్లనా?, ఏకారణంవల్ల లోకంలో ఉండే మిగిలినవారికి కూడా శ్రీవరవరమునుల యథార్థ తత్త్వాన్ని శ్రీరాముడు వ్యక్తం చేయలేదు? వ్యక్తం చేసి ఉంటే, దాసునివలె మిగిలినవారుకూడా శ్రీవరవర మునుల శ్రీచరణాలలో భక్తిని కలవారై ఉండేవారు కదా! వ్యక్తం చేసి ఉంటే బాగా ఉండేది కదా!- అని తాత్పర్యం.

వ్యాఖ్యానమ్ : **(తే)** అప్రాకృత వైభవాన్ని కల దేవరవారియొక్క,

**(యత్ తత్త్వమ్)** - ప్రసిద్ధమైన తత్త్వం - జ్ఞానశక్త్యాదిగుణవిశిష్టమైన స్వరూపంయొక్క యథార్థతత్త్వం,

**(తపసా తప్యతామ్ ఋషీణామ్ అపి)** -అభిమతాన్ని సాధించడానికి సాధనమైన **"కాయోడు నీడు కని యుణ్డు... తవమ్"** అనే రీతిలో కాయశోషణం మొదలైన నియమాలతో చేసే తపస్సు ద్వారా ఐశ్వర్యాన్ని కల్గిన ఋషులకు కూడా- అని అర్థం. **"తప-ఐశ్వర్యే వా"** అనే అనుశాసనాన్నిబట్టి తపోధాతువు ఐశ్వర్యార్థకంకూడా. యమనియమాది పూర్వకమైనయోగంద్వారా జ్ఞానవైశద్యాన్ని పొందినవారికికూడా- అని తాత్పర్యం.

**(దూరాద్దూరమ్)** - చాలా దూరంలో ఉండేది -ఏమాత్రం అర్థం కానిది- అయిన,

**(ఇదమ్)** - ఇటువంటి దేవరవారి తత్త్వం,

**(దుష్కృతైకాంతినో మే)** - దుష్కార్యాలను చేయడంలోనే నియతిని- నియమాన్ని కల నాకు- అనిగాని, దుష్కార్యాచరణమే ముఖ్యకర్తవ్యంగా నిశ్చయించుకొన్న నాకు-అని గాని అర్థం.

**(వ్యక్తమ్)** - స్ఫుటంగా,

**(ప్రతిపదమ్)** - మాటిమాటికి,

**(వ్యాకుర్వాణః)** - ప్రకాశింపజేసేవాడైన- దేవరవారి వైభవాన్ని వ్యక్తం చేయడంలో హేతువైన నిర్హేతుక దయను కల్గినవాడైన,

**(నాథః)** - "కులధనమ్" అనదగిన శ్రీరామచంద్రుడు,

**(అద్వితీయమ్)** - నిస్సమాభ్యధికమైన.. "న తత్ సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే" అని, "ఒత్తార్ మిక్కారై ఇలైయాయ" అని, "తన్నొప్పారిల్లప్పన్" అని కీర్తింపబడిన భగవద్వైభవానికి మించినదైన

**(ఏతత్)** - (దేవరవారి) ఈవైభవాన్ని,

**(ఏవమ్)** - ఈరీతిలో - నాకు ప్రకాశింపజేసిన రీతిలో

**(కిమితి న ఖ్యాపయతి)** - ఏకారణంవల్ల ప్రకాశింపజేయడం లేదు? **"భూత్వా భవ్యో వరవరమునిః భోగినాం సార్వభౌమః శ్రీమద్రంగే వసతి విజయీ విశ్వసంరక్షణార్థమ్, తత్త్వం గంతుం వ్రజ శరణ మిత్యాదిశద్రాఘవోఽయం స్వప్నే సోఽయం వరవరగురుః సంశ్రయో మాదృశానామ్"** అని యతీంద్ర ప్రవణ ప్రభావంలో ఉట్టంకింపబడిన శ్లోకార్థం ఇక్కడ స్మరణీయం.

**67.** అవ :- "శ్రీరామచంద్రుడు శ్రీవరవరమునుల అద్వితీయ మాహాత్మ్యాన్ని లోకానికి ప్రకాశింపజేయ నందువల్లనే, లోకంలో పలువురు శ్రీవరవరమునుల చరణాలను ఆశ్రయించడం లేదు'' అని ఇందులో అంటున్నారు.

**కాలే కాలే కమలజనుషాం నాస్తి కల్పాయుతం కిం**
**కల్పే కల్పే హరి రవతరన్ కల్పతే కిం న ముక్త్యై ।**
**మృత్వా మృత్వా తదపి దురితై రుద్భవంతో దురంతైః**
**అద్యాపి త్వాం వరవరమునే! హంత! నైవాశ్రయంతే ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, కాలే కాలే = అన్ని కాలాలలోను, కమలజనుషాం = భగవానుని నాభీకమలంలో జనించే బ్రహ్మలయొక్క, కల్ప+అయుతం = ఆయుష్కాల విభాగాల అయుతం (పదివేలు- అంటే- అనేకం), కిం నాస్తి = లేదా ఏమి? (ఉన్నది కదా), కల్పే కల్పే = ప్రతికల్పంలోను (బ్రహ్మల ఆయా ఆయుష్కాల విభాగాలు అన్నిటిలోను), హరిః= పాపాలను హరించే భగవానుడు, అవతరన్ =అవతరించేవాడై, ముక్త్యై కిం న కల్పతే = ప్రాణులకు మోక్షాన్ని అనుగ్రహించగల్గినవాడు కాడా ఏమి?, తత్+అపి = అయినా, జనాః= జనులు, మృత్వా మృత్వా = మరణించి, మరణించి, దురంతైః= అంతులేని, దురితైః= పాపాలతో, అద్యాపి = దాసుడు ఆశ్రయించిన ఈనాడు సైతం, త్వామ్ = నిన్ను, నైవ ఆశ్రయంతే = ఆశ్రయించడం లేదే!, హంత = అయ్యో! ఎంతకష్టం.

బ్రహ్మ కల్పాలు ఎన్నో గడిచాయి. ఇంకా సంభవించబోతాయి. ఒక్కొక్క బ్రహ్మకల్పంలోను భగవానుడు మోక్షాన్ని అనుగ్రహించడం శక్తిని కల్గినవాడై అవతరించకుండా ఉండలేదు. అయినా, జనులు

అంతులేని పాపాలను చేసి, మరణిస్తూ జనిస్తూ ఉన్నారే తప్ప, ఎవరూ శ్రీవరవరమునులను ఆశ్రయించి ముక్తిని పొందలేదూ! అయ్యో! అనర్థాన్ని నాకళ్ళతో చూచి సహించలేకుండా ఉన్నాను - అని భావం.

కల్పమంటే- చతుర్ముఖుని నూఱు సంవత్సరాల వయస్సులోని ఒక దినభాగంలోని పగటి కాలం. అది నాల్గువందల ముప్పైరెండు కోట్ల మానవసంవత్సరాల పరిమితిని కల కాలం. అంతే కాలం పరిమితిని కల్గినది రాత్రి భాగంకూడా. అటువంటి ఒక పగలు, ఒక రాత్రి కలిస్తే ఒక దినం, అటువంటి దినాలు 360 కలిస్తే చతుర్ముఖుని ఆయుస్సులో ఒక సంవత్సరం. అటువంటి నూఱు సంవత్సరాలను కల్గినది- చతుర్ముఖుని ఆయుష్కాలం. దీనికి **"పరమ్"** అని పేరు.

**వ్యాఖ్యానమ్ : (కాలే కాలే)** ప్రతికాలంలోను,

**(సకలజనుషామ్)** - భగవానుని నాభీకమలంనుండి పుట్టిన బ్రహ్మల, **"జనుః"** - అంటే జన్మ.

**(కల్పాయుతమ్)** పరార్ధద్వయ పరిమితమైన బ్రహ్మ ఆయుష్కాలంలోని కాలవిభాగాల పదివేలు. **"అయుత"** శబ్దం ఆనంత్యాన్ని తెల్పుతుంది. అనేక కల్పాలకాలం- అని భావం. **"శత సహస్ర మయుతం సర్వ మానంత్యవాచకమ్"** అని అమరవచనం. **"కాలే కాలే"** అనే ప్రయోగంద్వారా కల్పాల అక్షయస్థూలకాలం వివక్షితం.

**(కిం నాస్తి)** - లేదా ఏమి? - ఉన్నది- అని భావం. ఆయా మహాకాలాంతర్భూతాలైన, అనంతాలైన బ్రహ్మకల్పాలు ఎన్నో ఉన్నాయి- అని భావం.

**(కల్పేకల్పే)** - ప్రతిబ్రహ్మకల్పంలోను- అని అర్థం. **"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని కదా భగవదుక్తి.

**(హరిః)** - **"హరిర్హరతి పాపాని"** అనే రీతిలో పాపాలను హరించే స్వభావాన్ని కల్గిన భగవానుడు,

**(అవతరన్)** - అవతరించేవాడై,

**(ముక్త్యై న కల్పతే కిమ్)** - ప్రాణులకు మోక్షాన్ని అనుగ్రహించడంలో సామర్థ్యాన్ని కలవాడు కావడంలేదా?

**(తదపి)** - కాలం అపరిచ్ఛిన్నమైనా, భగవానుడు అవతారాదుల ద్వారా మోక్షాన్ని అనుగ్రహించడంలో సమర్థుడైనా- అని భావం.

**(మృత్వా మృత్వా)** - **"జాయస్వ మ్రియస్వ", "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ", "పునరపి జననం పునరపి మరణమ్ పునరపి జననీజఠరే శయనమ్"** అనే రీతిలో ఇంకా ఇంకా తల్లిగర్భం నుండి పుట్టడం, మరణించడం - అనే జన్మమరణరూపపరంపరను కల్గినవారై,

**(జనాః)** - అని అధ్యాహరించుకోవాలి.

**(దురంతైః)** - అంతులేని - అని అర్థం. **"దుష్ప్రాపోఽంతో యేషాం తథోక్తైః"** అని విగ్రహవాక్యం. పాపశబ్దం లోపించిన మధ్యమపదలోపి సమాసంగా గ్రహించాలి. **"అంత"** శబ్దాన్ని పరిణామార్థకంగా

గ్రహించి, చెడ్డ పరిణామాన్ని, విపాకాన్ని కల్గిన అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అంతు లేని పాపాల ఫలంగా- అని భావం. ఈ పాపాల పరిణతివల్లనే భగవానుడైన శ్రీరామచంద్రుడు శ్రీవరవరమునుల వైభవాన్ని లోకులకు ప్రకాశింపజేయలేదు- అని భావం.

**(అద్యాపి)** - ఈనాటికీ గొప్ప దుర్గతిని కల్గిన నాకు కూడా ఆ వరవరమునులు తత్త్వాన్ని ప్రకాశింపజేసిన ఇపుడు కూడా,

**(త్వాం నైవాశ్రయంతే ఏవ హంత!)** - భగవానునిచే ప్రకాశింపజేయబడిన వైభవాన్ని కలవారు, అవ్యభిచారిఉపాయస్వరూపులైన దేవరవారిని ఆశ్రయించడమే లేదు. ఎంతకష్టం! దీనివల్ల స్తుతికర్తకు పరానర్థాన్ని చూచినపుడు కల్గిన దుఃఖాతిశయం ధ్వనిస్తున్నది. **"ఇవై ఎన్న ఉలకియల్బే?"** అని నమ్మాళ్వార్లు లోకాన్ని చూచి బాధపడిన క్రమం స్మరణీయం.

**68.** అవ :- ఇక, ఈవిధంగా పాపాతిశయం వల్ల శ్రీవరవరమునులను ఆశ్రయించనివారు, తమ స్వరూపానికి తగని శబ్దాది విషయాలలో చిక్కుకొని, పరిభ్రమిస్తున్నారు-అని అంటున్నారు.

**కారాగారే వరవరమునే! వర్తమానః శరీరే**
**తాపై రేష స్త్రిభి రపి చిరం దుస్తరై స్తప్యమానః ।**
**ఇచ్ఛన్ భోక్తుం తదపి విషయానేవ లోకః క్షుధార్తో**
**హిత్వైవ త్వాం విలుఠతి బహిర్ద్వారి పృథ్వీపతీనామ్ ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, కారాగారే = చెఱసాలవంటి, శరీరే = శరీరంలో, వర్తమానః = ఉండేవాడై, దుస్తరైః = దాటడానికి సాధ్యం కాని, త్రిభిః తాపైః = తాపత్రయాలచేత - మూడువిధాలైన తాపాలచేత, చిరం = చిరకాలంగా, తప్యమానః= తపింపబడేవాడై, తత్+అపి = అటువంటి కష్టమైన స్థితి కల్గినా, విషయాన్+ఏవ = శబ్దాది విషయాలనే, భోక్తుమ్ ఇచ్ఛన్ = అనుభవించగోరేవాడై, క్షుత్+ఆర్తః లోకః= దాహం, ఆకలి మొదలైనవానిచే బాధింపబడ్డవాడైన మానవుడు, త్వాం = దేవరవారిని- నిత్యమైన పురుషార్థం దానికి ఉపాయమై, సులభులైన దేవరవారిని, హిత్వైవ = ఆశ్రయించకుండానే విడచిపెట్టి, భూపతీనాం = ప్రభువులు, బహిర్ద్వారి = బయటవాకిటిలో, విలుఠతి = పొర్లుతున్నాడు.

అత్యంతసులభులైన శ్రీవరవరమునులను ఆశ్రయించి, పరమపురుషార్థాన్ని అనుభవించి, ఉజ్జీవించే దారి ఉండగా, దానిని చేయకుండా, ఈలోకంలోని జనులు, ప్రవేశించడంలో చాలా శ్రమపడదగినది, ప్రవేశిస్తే బయటకు రావడానికి సాధ్యం కానిది. అయిన చెఱసాలవంటి శరీరాలను పరిగ్రహించడానికే కారణమైన శబ్దాది విషయసుఖాలను అనుభవించగోరి, అవి లభించకపోవడమేకాక, తిండి, నీరుకూడ దొరకకుండా, వాటికోసం పలువురు ప్రభువులు అంతఃపురాల బయటి వాకిళ్ళలో దినాలతరబడి వారి దర్శనంకోసం వేచి, అది లభించనందున అక్కడ పొర్లుతూ కాలాన్ని గడుపుతున్నారే ! ఇదేమి హైన్యం ! అని భావం.

తాపత్రయాలంటే- గర్భవాసాదులవల్ల, మృపక్షి గర్వాదులవల్ల, యమలోకంలోని యమభటులవల్ల కలిగే మూడు విధాలైన దుఃఖాలు. ఇవి ఆధ్యాత్మిక - ఆధిభౌతిక - ఆధిదైవికాలనబడతాయి.

వ్యాఖ్యానమ్ : **(కారాగారే)** - **"కారా స్యాత్ బంధనాలయే"** అని అమరకోశవచనాన్ని బట్టి **"కారా"** అంటే బంధనాలయం. అదేవిధంగా **"కారా దూత్యాం ప్రసేవకే బంధనే బంధనాగారే"** అనే విశ్వనిఘంటువును బట్టి బంధనమని అర్థం. అందువల్ల **"కారాగార"** మంటే బంధించే చోటు- అని అర్థం. **"కృ-విక్షేపే"** అనే ధాతువునుండి **"కారా"** అనే శబ్దం వ్యుత్పన్నమైనది. శరీరం కారాగారంగా చెప్పబడడం ఎందువల్ల? అంటే, అది జీవుడు బంధింపబడే చోటుకనుక, అక్కడ ఉండడం అతనికి దుఃఖాన్ని కల్గిస్తుంది కనుక; అది దుఃఖరూపమైనదని తెలిసినా ఒకసారి ప్రవేశిస్తే, ఇక అక్కడనుండి బయటపడడం సాధ్యం కాని పని కనుక. ఇంతేకాక, శరీరం **"శీర్యతే ఇతి శరీరమ్"** అనే వ్యుత్పత్తి స్వారస్యాన్నిబట్టి ప్రతిక్షణం క్షయించే స్వభావాన్ని కల్గినది, ఆ క్షయం ప్రత్యక్షంగా కన్పించేటట్లు ఉంటుంది. **"మాంసాసృక్పూయవిణ్మూత్ర"** ఇత్యాది పలు హేయాలకు ఆస్పదమైన ఉంటుంది. ఇటువంటి, చెఱసాల అనదగిన శరీరంలో- అని భావం. శరీరం యొక్క హేయత- **"యది నామాస్య కాయస్య యదంతః తద్బహిర్భవేత్, దండ ముద్యమ్య లోకోఽయం శునః కాకాంశ్చ వారయేత్"** ఇత్యాదిగా తెలుపబడింది. అటువంటి శరీరంలో,

**(వర్తమానః)** - స్థితిని కలవాడై,

**(దుస్తరైః)** - అతికష్టంపైన దాటదగిన - దాటడానికి సాధ్యం కాని - అని తాత్పర్యం.

**(త్రిభిః తాపైః)** - గర్భవాసాది దుఃఖాలు, పక్షిసరీసృపాదుల వల్ల కలిగే బాధలు, యమయాతనలు- అనే త్రివిధతాపాలచే,

**(చిరమ్)** - అనంతకాలంగా - అనాదిగా,

**(తప్యమానః అపి)** - బాధింపబడినవాడై ఉన్నా - అని అర్థం. దీనివల్ల కారాగారంలో బంధింపబడిన వారిని బాధించే పలు ప్రకారాలు సూచితాలు.

**(తదపి)** - అయినా, **"ఆహారోఽపి న రోచేత, కిముతాన్యా విభూతయః"** అని చెప్పబడిన దశావిశేషం ప్రాప్తించినా,

**(విషయానేవ)** - శబ్దాది లౌకిక సుఖాలనే - అని అర్థం. "ఏవ"కార ప్రయోగంచేత- ఏయే విషయాల అనుభవాలు శరీరస్థిత్యాదులకు హేతువులో, ఆయా విషయాలనే - అని స్ఫురిస్తుంది.

**(భోక్తుమిచ్ఛన్)** - అనుభవించగోరేవాడై - అని అర్థం. **"ఇచ్ఛన్"** అనే పదం ద్వారా విషయానుభవాల అలాభం సూచింపబడింది. లభించేవిషయాన్ని కోరనక్కరలేదుకదా! **"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ పున ర్భూయోఽభివర్ధతే"** అనే రీతిలో ఎంత అనుభవించినా, ఇంకా ఇంకా అనుభవాన్ని కోరేవాడై - అని భావం.

**(క్షుధార్తః)** - క్షుద్రపురుషుల సేవవల్ల అన్నపానాదులను కూడా పొందనివాడై, అందువల్ల ఆకలి దాహాదులతో ఆర్తిని పొందినవాడై - అని అర్థం. **"వస్త్రాభావాత్ గగనవసనః తైలశూన్యో జటావాన్ శూలీ జాతః కదశనవశాత్ భైక్ష్యయోగాత్ కపాలీ, ఇత్థం నిత్యం త్వదుపసదనాదీశ్వరత్వం మయాఽప్తం కస్మాద్దేతోః కథయ నృపతే! నార్ధచంద్రం దదాసి"** (కట్టుకోవడానికి వస్త్రం లేనందున దిగంబరుడను, తలకు రాసుకోవడానికి నూనె లేనందున జడలు కట్టిన కేశాలను కలవాడను, సరిగా ఆహారం లేనందున శూలం వలె సన్నబడ్డాను, బిచ్చమెత్తేవాడను కనుక కపాలాన్ని (పగిలిన కుండచిప్పను) చేతిలో కలవాడను. ఈ విధంగా నిత్యం నీ దర్శనార్థం నీవద్దకు వచ్చినందున నాకు కూడా నీవలె ఈశ్వరత్వం సిద్ధించింది. మఱి ఇక నాకు మిగిలినదైన అర్ధచంద్రుని, ఓరాజా! ఎందుకు ఇవ్వడంలేదు?) అనే చమత్కార శ్లోకాన్ని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వారు తమ వ్యాఖ్యలో ఉదాహరించారు. శ్రీదేశికుల వైరాగ్యపంచకంలోని **"దురీశ్వరద్వార బహిర్వితర్దికా దురాసికాయై రచితోఽయ మంజలిః"** (దుష్ట ప్రభువుల ద్వారానికి బయట ఉండే తిన్నెలపై వేచి ఉండే స్థితికి, ఇదిగో, ఓ నమస్కారం) ఇత్యాది శ్లోకార్థాన్ని, **"శొన్నాల్ విరోద మిదు"** అనే తిరువాయ్‌మొழி దశకార్థాన్ని - ఇంకా ఇటువంటి సూక్తులను దృష్టిలో ఉంచుకొని కవి ఈ శ్లోకాన్ని రచించారు. ఇటువంటి,

**(ఏష లోకః)** - (ఈ) జనుడు - పూర్వం తెల్పినరీతిలో పలు విధాలైన దుఃఖాలకు పాత్రమైన ఈ జనుడు,

**(త్వామ్)** - నిరుపాయపురుషార్థప్రదులు, నిరపాయపురుషార్థ భూతులు- అంటే -నిరుపాధికమైన ఉపాయం, ఉపేయం అయిన దేవరవారిని,

**(హిత్వైవ)** - విడచి, ఆశ్రయించకుండానే,

**(పృథ్వీపతీనామ్)** - ప్రభువుల యొక్క - అని అర్థం. బహువచనం ద్వారా వారి సంఖ్యాబాహుళ్యం, **"పృథ్వీ"** శబ్దం చేత **"క్షోణీకోణశతాంశ పాలనపర"** ఇత్యాదిగా శ్రీదేశికుల వైరాగ్యపంచకంలో తెలుపబడిన వారి ఐశ్వర్యంలోని అల్పత్వం సూచింపబడ్డాయి.

**(బహిర్ద్వారి)** - బయటవాకిటిలో - అని అర్థం. **"బహిః"** అని అన్నందువల్ల, ఒకవేళ ఇతడు లోపల ద్వారం వరకుపోయి అక్కడ వేచి ఉంటే, అపుడు బయటి ద్వారం దగ్గర వేచి ఉండేవాడు. "ఇతడు లోపలకు రాజువద్దకు పోయి, అతనితో సంప్రదిస్తాడు, అందువల్ల నా కార్యాన్ని సాధించి, నాకు సహాయపడగలడు'' అనే భ్రమతో ధనాన్ని ఇచ్చి, సహాయపడే అవకాశం ఉన్నది. అటువంటి అవకాశం కూడా లేదు - అని స్ఫురిస్తున్నది. దీనివల్ల ప్రభువుల దౌర్లభ్యం సూచింపబడింది. **"నిద్రాతి స్నాతి భుంక్తే"** (రాజదర్శనార్థం వచ్చినవారిని సేవకులు తరిమికొట్టే విధానాన్ని తెలిపే) ఇత్యాది చాటు శ్లోకార్థం ఇక్కడ స్మరణీయం.

**(విలుఠతి)**- కాలపరిమితి లేకుండా చిరకాలం అక్కడ వేచి ఉన్నందున, కూర్చోవడానికి కూడా తగిన సౌకర్యం లేనందున కింద పొర్లిన రీతిలో క్లేశపడుతున్నాడని భావం.

**69.** అవ :- "**త్రిభి స్తాపైః**" అని గడచిన శ్లోకంలో తాపత్రయాల ప్రస్తావన చేయబడింది. వాటి స్వరూపాన్ని ఈ శ్లోకంలో వివరిస్తూ, వాటి సంబంధం వల్ల ఏర్పడే చాలా జుగుప్సాకరమైన స్థితిని ఇందులో తెల్పుతున్నారు.

**మధ్యే మాంసక్షతజగహనం విడ్భుజాభ్యా మేవ భోజ్యం**
**దీనో వోఢుం దృఢమితి వపు శ్చేష్టతే రాత్ర్యహాని ।**
**భగ్నే తస్మిన్ పరిణమతి యః పాతకీ యాతనాభ్యః**
**దేహీ నిత్యో వరవరమునే! కేన జిజ్ఞాసనీయః? ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, యః = ఏ జీవాత్మ, మధ్యేమాంస క్షతజగహనమ్ = మాంసరక్త మయమైన (తల్లియొక్క) గుహవంటి గర్భం మధ్యలో, విట్+భుజామేవ భోజ్యం = దానిలో ఉండే మలినాన్ని తినే కృములచే భుజంచదగిన, వపుః= తన శరీరాన్ని, దృఢమ్ ఇతి = నశించనిది-దృఢమైనది అని, భావించి, వోఢుం = దానిని నశించకుండా ధరించడం కోసం, దీనః = "అయ్యో! పాపం'' అని జాలిపడదగినవాడై, రాత్రి+అహాని = రాత్రింబగళ్ళు, చేష్టతే = ప్రయత్నిస్తున్నాడో, తస్మిన్= ఆ శరీరం, భగ్నే సతి = నశించినది అయినపుడు, పాతకీ = ఆ శరీరంతో సంపాదించుకొన్న పాపాలను కలవాడై, యాతనాభ్యః= యమలోకంలోని దుర్భర క్లేశాలను అనుభవించడంకోసం, పరిణమతే =దానికి తగినట్లుగా నరక శరీర సంబంధమైన ఒకస్థితిని పొందుతున్నాడో, సః దేహీ = ఆ దేహాన్ని పొందిన జీవాత్మ, నిత్యః (అపి) = వాస్తవానికి జన్మ-మరణాలు లేనివాడైనా, కేన = ఏకారణంచేత, జిజ్ఞాసనీయః= తెలియదగినవాడుగా అభిలషింపబడుతున్నాడు (అతనిని గూర్చిన జ్ఞానం జుగుప్సతో కూడుకొన్నది-అని భావం)

ఈ జీవుడు తల్లిగర్భంలో నవమాసాలు ఉంటాడు. అది మాంసరక్తమయమైన ఒక గుహవంటిది. ఆ గర్భవాస స్థితిలో ఉండే అతని శరీరం అక్కడ ఉండే కృములకు భోజనం. అటువంటి ఆ శరీరాన్ని దృఢమని తలచి జీవుడు జన్మించిన తరువాత ఎన్నో ప్రయత్నాలతో దానిని కాపాడుకోవడానికి ప్రయత్నిస్తాడు. రాత్రింబగళ్ళు అతడు చేసే ప్రయత్నాలను చూస్తే "అయ్యో ! పాపం !'' అని ఎవరికైనా జాలి కల్గుతుంది. చివరకు ఆ పతనశీలాన్ని కల శరీరం పతనం అయినపుడు, జీవించిన కాలంలో ఆ శరీరంతో చేసిన పలు పాపాలకు ఫలంగా నరకంలోనికి చేరి, అక్కడ పలు యాతనలను అనుభవించడంకోసం తగిన యాతనా దేహాన్ని పొందుతాడు. ఆవిధంగా తల్లిగర్భంలోను, జన్మించిన తరువాత, మరణించిన తరువాత ఎన్నో క్లేశాలను పొందే జీవుడు, సహజంగా "**జ్ఞానానందమయస్త్వాత్మా**" అనే రీతిలో జ్ఞానానందమయుడే అయినా, అతనిని గూర్చిన జ్ఞానం పైన తెల్పిన రీతిలో చాలా జుగుప్సను కల్గిస్తుంది-అని భావం.

**వ్యాఖ్యానమ్ : (యః)** - వివిధ విషయసుఖాలను అనుభవిస్తున్న ఏజీవుడు,

**(మధ్యే మాంసక్షతజగహనమ్)** - **"మధ్యేగంగమ్"** అనే రీతిలో ఇది ఒకే సమస్తపదం. మాంసరక్తమయమైన, గర్భసంచిరూపమైన, కళేబరంలోని ప్రదేశవిషయంలో **"మాతుః"** అనే పదాన్ని అధ్యాహారం చేసికోవాలి.

**(విడ్భుజామేవ భోజ్యమ్)** - **"విట్"** అంటే మలినం. అక్కడ ఉండే మలినాలను మాత్రమే తినే కృములకు అన్నంవంటిది అయిన,

**(వపుః)** - శరీరాన్ని - అని అర్థం. **"వపతి, ఉప్యతే వా ప్రాక్కర్మభిః ఇతి వపుః"** - ప్రాక్తనకర్మల కారణంగా జీవుని పొందేది, జీవునిచే పొందబడేది- అని అర్థం. దీనివల్ల అవర్జనీయత్వం సూచితం.

**(దృఢమితి మత్వా)** - స్థిరమని భావించి, కర్మవశం చేత ప్రాప్తించిన శరీరం, ఆ కర్మల అనుభవం తీరగానే నశిస్తుంది - అనే విషయాన్ని తెలియక, శాశ్వతంగా నిలచి ఉంటుందని భావించి- అని తాత్పర్యం. అశాశ్వతమైన శరీరంలో శాశ్వతత్వ బుద్ధిని కల్గి ఉండడం అన్యథాగ్రహణం.

**(వోఢుమ్)** - దానిని ధరించడానికి అన్ని విధాలుగాను ప్రయత్నించి,

**(దీనః)** - తాపత్రయాలు కల్గడానికి కారణమైన భాగ్యహానిని కలవాడై. **"దీనో దరిద్రో దుర్గతోఽపి"** అని అమరం. దరిద్రుడై, చూచేవారికి "అయ్యో !" అని అనిపించే స్థితిని పొందినవాడై- అని భావం.

**(రాత్ర్యహాని)** - రాత్రులు, పగళ్ళు - పూర్తిగా,

**(చేష్టతే)** - శరీరాన్ని రక్షించుకొనే ప్రయత్నంలో హితప్రాప్తికోసం, అహితనివృత్తి కోసం నిరంతరం ప్రయత్నిస్తున్నాడు.

**(తస్మిన్ భగ్నే)** - అటువంటి ఆ శరీరం పతనం కాగానే,

**(పాతకీ దేహీ)** - శరీరంతో చేసిన పాపాలను కలవాడైన ఏ జీవుడున్నాడో, అతడు,

**(యాతనాభ్యః పరిణమతి)** - యమలోకంలో అనుభవించదగిన తీవ్రవేదన అనుభవంకోసం నరకశరీరాలను పొందినవాడై పరిణమిస్తున్నాడు.

**(స దేహీ)** - అటువంటి నరకానుభవానికి తగిన శరీరపరిగ్రహణాన్ని చేసిన జీవుడు,

**(నిత్యః)** - స్వరూపతః ఉత్పత్తి వినాశాలు లేనివాడే. అయినా, **"నిత్యో నిత్యానామ్"** అని **"అజో నిత్యః శాశ్వతః"** అని కదా శ్రుతులు గీత తెలిపాయి. ఇక్కడ **"అపి"** శబ్దాన్ని అధ్యాహరించుకోవాలి.

**(కేన జిజ్ఞాసనీయః)** - దేనివల్ల తెలిసికోవడానికి ఇష్టమైన వాడవుతున్నాడు? ఇటువంటి జీవుని తాపత్రయాలను చూస్తే ఇతని గూర్చి తెలిసికోవడమే అనభిమతంగా తోస్తుంది- అని భావం.

ఈ శ్లోకంలోని మొదటి పాదంలో **"మధ్యేమాంసక్షతజగహనమ్"** ఇత్యాదిగా గర్భవాసాది దుఃఖస్వరూపమైన ఆధ్యాత్మికతాపం, రెండవ పాదంలో **"వపుః వోఢుం రాత్ర్యహాని చేష్టతే"** అని అంటూ

శరీరాన్ని సర్పాదులవల్ల ఆపద కలుగకుండా ప్రయత్నిస్తున్నాడని అన్నందున, పిపీలికా సర్పపశుపక్ష్యాదులవల్ల కలిగే తాపాలు- అనే ఆధిభౌతికతాపం, మూడవ పాదంలో **"పాతకీ యాతనాభ్యః" పరిణమితి"** అని అన్నందున యమలోకంలో సంభవించే ఆధిదైవిక తాపాలు తెలుపబడ్డాయి. నాల్గవ పాదంలో ఇటువంటి దేహాన్ని పొందిన జీవుడు, వాస్తవానికి పరమాత్మవలె నిత్యుడైనా, అభిలషింపబడేవాడు కూడా, మిక్కిలి జుగుప్సను పొందేటట్లుగా ఉన్నాడు- అని తెలుపబడింది.

**70.** అవ :- ఎంతగా తాపత్రయాలవల్ల బాధింపబడినా, మధ్యలో ఎంతోకొంత ఏదో ఒక సమయంలో ఏదో ఒక రీతిలో సుఖానుభవాలు కల్గి తీరుతాయి కనుక, **"కేన జిజ్ఞాసనీయః?"** (జీవుడు అభిలషింపబడి తెలిసికొనబడడంలో కారణమేమీ లేదు) అని అంటూ మానవజన్మను గూర్చి అత్యంతం హేయంగా పల్కడం ఎందుకు? అని అంటే, పలు విధాలైన దుఃఖాలకు కారణమైన పాపాల ఫలంగా ఏర్పడేది, రాబోయే కాలంలో కూడా దుఃఖాన్ని విడచి ఉండనిదైన సుఖం కూడా (లౌకిక) సుఖం కూడా దుః ఖరూపమే కదా - అని పల్కుతూ, మోక్షానికి మూలమైన శరీరాన్ని, దేవరవారిని ఆశ్రయించి సఫలం చేసికోకుండా, లోకంలోని జీవులు వ్యర్థం చేస్తున్నారే! అని అంటూ శ్రీవరవరమునులను ఉద్దేశించి ఈ శ్లోకంలో పల్కుతున్నారు. **"విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్"** (విచిత్రమైన దేహసంపద భగవంతుని నివేదన కోసం ఏర్పడింది) అనే సూక్త్యర్థాన్ని శ్రీవరవరమునుల విషయంగా అనుసంధిస్తున్నారు.

**అల్పాదల్పం క్షణిక మసకృత్ దుష్కృతాన్యేవ కృత్వా**
**దుఃఖోదగ్రం సుఖ మభిలషన్ దుర్లభై రింద్రియార్థైః ।**
**మోఘం కృత్వా వరవరమునే ! ముక్తిమూలం శరీరం**
**మజ్జత్యంధే తమసి మనుజ స్త్వప్రియః త్వత్ప్రియాణామ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ, మనుజః తు = అరుదైన మానవజన్మను పొందిన జీవుడు అయితే, అసకృత్ =పలుమార్లు, దుష్కృతాని+ఏవ = దుష్కార్యాలనే, కృత్వా = చేసి, దుర్లభైః = పొందడానికి సాధ్యం కాని, ఇంద్రియార్థైః (జన్యమ్) = శబ్దాదివిషయాల చేత, కలుగదగినది, క్షణికం = క్షణం మాత్రమే నిలచి ఉండేది, దుఃఖ+ఉదగ్రం = ముందు వెనుకలలో దుఃఖమే నిండినది అయిన, సుఖం = సుఖమనే పేరును మాత్రమే కల్గినదానిని, అభిలషన్ సన్ = మిక్కిలిగా ఆశపడేవాడై, త్వత్ ప్రియాణాం = దేవరవారిపట్ల ప్రేమను కల్గినవారియొక్క, దేవరవారి ప్రేమకు లక్ష్యభూతులైనవారియొక్క, అప్రియః= ప్రీతికి లక్ష్యం కానివాడై, ముక్తిమూలం = మోక్షానికి హేతువైన, శరీరం = (తన) శరీరాన్ని, మోఘం కృత్వా = వ్యర్థం చేసి, అంధే = జ్ఞానాన్ని నశింపజేసే, తమసి = తమోగుణం నిండిన సంసారమండలంలో, మజ్జతి = మునుగుతున్నాడు.

మణవాళమహామునులను ఆశ్రయించడమనే ధర్మానికి సాధనమై, దానిద్వారా మోక్షానికి కారణమైన తన శరీరాన్ని ఈ జీవుడు-పాపాన్నే చేసి, దుఃఖాలను అనుభవించడానికే ఉపయోగించి, పాడు చేసి, సంసారసాగరంలో మునిగిపోతున్నాడు. అందువల్ల శ్రీవరవరమునుల పట్ల ప్రేమను కల్గి ఉండి, ఆ

శ్రీవరవరమునులచే ప్రేమింపబడే భక్తులకు అప్రియుడు అవుతున్నాడు. పలుదుఃఖాల మధ్య అనుభవింపబడే ఏదో ఒక చిన్న సుఖం దుఃఖంతో సమమే కనుక, దుఃఖాన్నే అనుభవిస్తున్న ఈ జీవుని జన్మం చాలా హేయమైనదే- అని అనడంలో ఏ విప్రతిపత్తి లేదు - అని భావం.

వ్యాఖ్యానమ్ : **(మనుజః)** - **"జంతూనాం నరజన్మ దుర్లభమ్"** (ప్రాణి జన్మలో మానవజన్మ దుర్లభం) అని **"దుర్లభో మానుషో దేహో"** (మానవ దేహం దుర్లభం) అనే రీతిలో గొప్ప అదృష్టఫలంగా లభించిన మానవజన్మను కల జీవుడు,

**(అసకృత్)** - పలుమార్లు, మాటిమాటికి,

**(దుష్కృతాన్యేవ కృత్వా)- "పావమే శెయ్దు పావియానేన్"** (కేవలం పాపాన్నే చేసి పాపిని అయ్యాను) అనే రీతిలో పుణ్యాల లవలేశాలతో ఏమాత్రం సంబంధం లేని పాపాలను మాత్రమే ఆచరించి,

**(దుర్లభైః ఇంద్రియార్థైః)** - అలభ్యాలైన- చాలా కష్టపడి పొందడానికి వీలయిన లౌకిక విషయాలచేత పొందదగిన- అని అర్థం. **"జన్య"**మనే పదాన్ని అధ్యాహరించుకోవాలి.

**(అల్పాదల్పమ్)**- అల్పంకంటే అల్పమైన- అసత్ప్రాయమైన- చివరికి తుచ్ఛంగా పర్యవసించే- అని భావం.

**(క్షణికమ్)**- క్షణమాత్రస్థాయి అయిన- అని అర్థం. **"శంపాచలం బహుళదుఃఖ మనర్థహేతుః అల్పీయ ఇత్యపి విమృష్టిషు దృష్టిదోషమ్, దుర్వాసనా ద్రఢిమతః సుఖ మింద్రియోత్థమ్ హాతుం న మే మతి రలమ్"** ఇత్యాదిగా కూరేశులు వరదరాజస్తవంలో పల్కిన సూక్త్యర్థం అనుసంధేయం.

**(దుఃఖోదగ్రం సుఖమ్)**- మొదట, చివరకూడా దుఃఖాన్నే కల్గించే సుఖాన్ని,

**(అభిలషన్)** - మిక్కిలి గాఢంగా కోరుతూ, అందువల్లనే,

**(త్వత్ప్రియానా మప్రియః)** - నీపై భక్తిని కల్గినవారియొక్క, నీ ప్రేమను నోచుకొన్నవారియొక్క ప్రీతికి లక్ష్యం కానివాడై, వారిపట్ల ప్రేమను లేనివాడై - అని భావం. ఈ రెండూ అనర్థహేతువులే. **"ప్రజాపతిం త్వం వేద, ప్రజాపతి స్త్వాం వేదః" "యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి"** అని (ధర్మసాధనాలలో శరీరం ప్రథమం) అనే రీతిలో స్వగత-పరగత స్వీకారాలు రెండూ చెప్పబడ్డాయికదా! ఈ రెండిటిని లేనివాడై- అనిభావం.

**(ముక్తిమూలం శరీరమ్)** - **"శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్"** (ధర్మసాధనాలలో శరీరం మొదటిది), అని, **"మహతా పుణ్యాపాపేన క్రీతేయం కాయనౌ స్త్వయా"** (గొప్పవైన పుణ్య పాపాలతో శరీరమనే ఈ నౌక నీచే కొనబడింది) అని చెప్పబడిన రీతిలో, తాను ఆశపడిన ఐహికవిషయాల అనుభవం సుఖభ్రాంతి కనుక, వాటివల్ల సుఖం లేదు. ముక్తిసాధనకోసం ఉపయోగించవలసిన శరీరాన్ని అందుకోసం ఉపయోగించలేదు కనుక, ముక్తిసుఖం లేదు. అందువల్ల,

**(మోఘం కృత్వా)** - వ్యర్థమైనదానినిగా చేసి,

**(అంధే తమసి)** - జ్ఞానానికి హానిని కల్గించే తమస్సులో- **"ఇరుళ్ తరు మాఞాలమ్"** (అజ్ఞాన ప్రదమైన విశాలభూమి) అనబడే తమోమయమైన ఈ సంసారమండలంలో,

**(మజ్జతి)** - లోలోపలకు మునిగిపోతున్నాడు. ఏనాడూ పైకిరాలేనంత లోతుకు మునిగి పోతున్నాడు- అని భావం.

**"త్వత్ప్రియాణా మప్రియస్సన్, ముక్తిమూలం శరీరమ్"** అనే సూక్తిద్వారా దేవరవారి భక్తులకు (దేవరవారి విషయంలో ప్రీతిని కల్గినవారికి, దేవరవారి ప్రీతికి లక్ష్యమైనవారికి) ప్రియమైతే, ముక్తిని కల్గించడంలో స్వరూపయోగ్యతను కల్గిన శరీరానికి ముక్తిఫలోపాధాయకత్వం సిద్ధిస్తుందని సూచింపబడింది. అంటే- మోక్షసాధనత్వం సిద్ధిస్తుందని భావం. ఇక్కడ ప్రియశబ్దం ప్రీత్యాశ్రయాన్ని, ప్రీతివిషయాన్ని - అంటే - ప్రీతిని కల్గి ఉండే, ప్రీతికి విషయంగా- లక్ష్యంగా ఉండే శరీరాన్ని సూచిస్తుంది)- **"ప్రియగుంఫః"** ఇత్యాది ప్రయోగాలను ప్రీతివిషయవాచిత్వానికి ఉదాహరణగా గ్రహించవచ్చు.

**71.** అవ :- శ్రీమద్వరవరమునుల అప్రీతికి లక్ష్యం కావడానికి - పూర్వం తెల్పిన స్వల్పసుఖాన్నే ఆశపడి, దానికోసమే రాత్రి పగలు శ్రమించే జీవుడు, మణవాళమహామునులను ఆశ్రయించడంద్వారా మోక్షాన్ని సాధించవలసిన తన శరీరాన్ని పాడుచేసికోవడం మాత్రమే కారణం కాదు; శ్రీవరవరమునులను పరిహసించడం, వారిపట్ల అసూయను కల్గి ఉండడం కూడా హేతువులే. వీటికి అన్నిటికీ కారణం- శ్రీవరవరమునుల యథార్థమైన మహిమను అతడు తెలియకపోవడమే- అని భావించి, "ఓ శ్రీవరవరమునీ! దేవరవారి గొప్పతనాన్ని దాసునకు ప్రకాశింపజేసినట్లే, లోకంలో ఉండే సాధారణమానవులకు కూడా తమరు ప్రకాశింపజేయాలి'' అని ఇందులో ఎఱుమ్బియప్పా ప్రార్థిస్తున్నారు.

**పశ్యన్నేవం ప్రభవతి జనో నేర్ష్యితుం త్వత్ప్రభావం**
**ప్రాజ్ఞై రుక్తం పునరపి హసన్ దర్శయత్యభ్యసూయామ్ ।**
**నశ్యత్యస్మిన్ వరవరమునే! నాథ! యుక్తం తదస్మిన్**
**ప్రత్యక్షం తత్ పరికలయితుం తత్త్వ మప్రాకృతం తే ॥**

వరవరమునే =ఓ మణవాళమహామునీ!, జనః= జీవుడు, (ఈలోకంలోని సామాన్యమానవుడు), త్వత్ ప్రభావం = దేవరవారి గొప్ప మహిమను, పశ్యన్నేవ సన్ = కళ్ళతో చూస్తూ ఉన్నవాడై ఉన్నందున, ఈర్ష్యితుం = ఈర్ష్యను పొందడానికి, న ప్రభవతి = సమర్థుడు కావడం లేదు, ప్రాజ్ఞైః= దేవరవారి మహిమను యథాతథంగా తెలిసిన పెద్దలచే, ఉక్తం = ఉపదేశింపబడిన, త్వత్ ప్రభావం పునః= దేవరవారి ప్రభావాన్ని అయితే, అపహసన్ = పరిహాసం చేస్తూ ఉన్నవాడై, అభ్యసూయాం = దానిపట్ల అసూయను, దర్శయతి = ప్రదర్శిస్తున్నాడు, తత్ = అందువల్ల, నాథ = దాసుని విషయంలోవలె ఇతని పట్లకూడా కరుణను కల ఓస్వామీ!, అస్మిన్ = ఈ మానవుడు, నశ్యతి సతి = దేవరవారిపట్ల అపచారపడి నశిస్తూ

ఉండగా (ఆవిధంగా అతడు నశించకుండా ఉండడంకోసం), అప్రాకృతం = దివ్యమైన, తే తత్త్వం = దేవరవారి తత్త్వాన్ని, అస్మిన్ = ఈ మానవునిలో, ప్రత్యక్షం = కంటికి ఎదురుగా, పరికలయితుం = ప్రదర్శించడానికి, యుక్తం = తగినది (అందువల్ల, కటాక్షించాలి- అని భావం.)

శ్రీవరవరమునీ! దేవరవారి గొప్పతనాన్ని తెలియకుండా సాధారణమానవులు విషయపరవశులై పరిభ్రమించి తిరుగుతున్నందున, దేవరవారి మహిమనుగూర్చి చక్కగా తెలిసిన పెద్దలు, వారిపట్ల అప్రీతిని కల్గినవారైనా, వారికి దేవరవారి మహిమను తెలియజేస్తే వారు లౌకికవిషయవాంఛలను విడచిపెట్టి, దేవరవారిని ఆశ్రయించి ఉజ్జీవించవచ్చునని తలచి, వారికి దానిని ఉపదేశించారు. ఆ విధంగా వారు తెల్పినా, దానిని విని వారు దేవరవారి గొప్పతనంలో అసూయను కలవారై, పరిహాసం చేసి, అపచారపడ్డారు. వారు, శబ్దాదివిషయాంతరాలలోని ఆశను కల్గి ఉండడంతో నిలువకుండా, దేవరవారిపట్ల అపచారంకూడా చేసినందున వారిపట్ల దేవరవారి భక్తులకు అప్రీతి దృఢపడింది. ఇవి అన్నీ తీరడానికి ఒకే దారి ఉన్నది. అది ఏమంటే- దేవరవారి దివ్యమైన మహిమను (దేవరవారు ఆదిశేషాంశసంభూతులనే మహిమను) వారి కంటికి కన్పించేటట్లు చేయడమే ఆ దారి. వారు ఈవిధంగా నశించి, నిత్యసంసారులై పోవడం చూచి దేవరవారు (వారిపట్ల) దయచూపి, వారికి తమ ఆదివ్యమైన మహిమను సాక్షాత్కరింపజేస్తే, వారి మనస్సులో తమ వైలక్షణ్యం నిలుస్తుంది. దేవరవారిని వారు ఆశ్రయించి ఉజ్జీవిస్తారు. అందువల్ల వారి లౌకికవిషయచాపల్యం, దేవరవారి విషయంలో చేసే పరిహాసం, అసూయ - అనేవి తీరిపోవడంతోపాటు, దేవరవారి భక్తుల ప్రీతికి లక్ష్యం కాగలరు. అందువల్ల ఆ విధంగా చేయాలి - అని భావం.

వ్యాఖ్యానమ్ : **(త్వత్ప్రభావమ్)**- దేవరవారి నిరతిశయమైన, అద్వితీయమైన వైభవాన్ని,

**(పశ్యన్నేవ)** - సాక్షాత్కరిస్తూ ఉన్నా - ఎవరో చెప్పగా వినడం కాకుండా సాక్షాత్తు కంటితో చూస్తూ ఉన్నా- అని భావం. అప్యర్థం వివక్షితం.

**(ఈర్ష్యితుమ్)** - అసహనాన్ని ప్రదర్శించడానికి,

**(న ప్రభవతి)** - సమర్థుడు కావడంలేదు. ఈర్ష్యను దేవరవారి విషయంలో బలవంతంగా ప్రదర్శించాలని అనుకున్నా సాధ్యం కావడం లేదు- అని భావం

**(ప్రాజ్ఞై రుక్తమ్ త్వత్ప్రభావమ్ పునరపి)**- దేవరవారి మహిమను యథాతథంగా తెలిసిన మహాత్ములచే ఉపదేశింపబడిన దేవరవారి ప్రభావాన్ని అయితే,

**(హసన్ అభ్యసూయాం దర్శయతి)**- తగని మాటలను పల్కి పరిహసించేవాడై- అని అర్థం. సాక్షాత్తుగా గుణాలలో దోషాలను ఆరోపించడం అసూయ అనబడుతుంది. దేవరవారి కల్యాణగుణాలు ఎన్ని ఉన్నాయో, వాటిలో అన్నిటిలో దోషత్వాన్ని ఆరోపిస్తున్నారు- అనే భావం **"అభి"** శబ్దంప్రయోగం చేత సూచింపబడింది. అందువల్ల,

**(నాథ)**- స్వామీ! ఇటువంటి వారిపట్లకూడా దయాగుణాన్ని ప్రదర్శించడానికి హేతువైనది, తనకు మాత్రమే తెలిసినది అవర్జనీయమైనది అయిన స్వస్వామిభావసంబంధాన్ని దేవరవారు కల్గి ఉన్నారు.

**(అస్మిన్ నశ్యతి)** - ఇటువంటి జీవుడు నశిస్తూ ఉండగా - అని అర్థం. పూర్వం తెల్పిన రీతిలో దేవరవారి విషయంలో అసూయను ప్రదర్శించి అపహసించి, అసహ్యాపచారాన్ని చేయడం ద్వారా స్వరూపంగా నాశాన్ని పొందుతూ ఉండగా - అని భావం. ఇచటి నాశం రూపనాశం కాదు; స్వరూపనాశం.

**(అప్రాకృతం తే తత్ తత్త్వమ్)** - దివ్యమైన దేవరవారి ఆ వైభవాన్ని

**(అస్మిన్ ప్రత్యక్షం పరికలయితుమ్ యుక్తమ్)** - పూర్వోక్త క్రమంలో మిక్కిలి దుర్గతిని కల్గినవాడైనందున, అతనికి దేవరవారి వైభవాన్ని ప్రత్యక్షంగా, ప్రకాశింపజేయడం యుక్తం. **"అస్మిన్"** అనే పదం మళ్ళీ ప్రయోగించడంలో ఉద్దేశ్యం- నశించే జీవుని దుర్గతియొక్క అతిశయాన్ని సూచించడం కోసం. **"అప్రాకృతమ్"** అనేటపుడు **"ప్రాకృతాః ప్రకృతి సంస్పృష్టాః, తే న సంతి ఆధారతయా యస్య తత్ తథోక్తమ్"** (ప్రకృతిసంబంధాన్ని కల్గినవారిని ఆధారంగా కల్గినది కానిది) అనే విగ్రహం వివక్షితం. ప్రకృతి సంబంధాన్ని కల్గినవారిలో ఉండనిది - దివ్యమైనదని అనడం ఫలితార్థాన్ని పల్కడం.

**72.** అవ :- శ్రీవరవరమునులు, తమ మహిమను లోకులు అందఱికి ప్రకాశింపజేయకపోతే, వారు శ్రీవరవరమునుల పట్ల అసూయను కల్గి, నశించిపోగలరు - అని గడచిన శ్లోకంలో అనడం ఏవిధంగా పొసగుతుంది? శ్రీవరవరమునుల విషయంలో అసూయను కల్గి ఉన్నా, మిగిలిన పెద్దలెంతమందో ఉన్నారు కదా! వారిపట్ల అసూయలేని వారికి మోక్షం సిద్ధించడంలో ఏమి లోటు? అనే ప్రశ్న రాగా, అన్యులపట్ల అసూయారాహిత్యాన్ని కల్గి ఉండడం అనేది మోక్షానికి కారణం కానందున, అది అకించిత్కరం, నిష్ప్రయోజనం - అని ఇందులో పల్కుతున్నారు.

**సత్త్వోన్మేషప్రముషితమనఃకల్మషైః సత్త్వనిష్ఠైః**
**సంగం త్యక్త్వా సకలమపి యః సేవ్యసే వీతరాగైః ।**
**తస్మై తుభ్యం వరవరమునే! దర్శయన్నభ్యసూయాం**
**కస్మై కృత్వా కిమివ కుమతిః కల్పతా మిష్టసిద్ధ్యై ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, యః= ఎటువంటి, ప్రసిద్ధమైన జ్ఞానశక్తులను కల దేవరవారు, సత్త్వ+ఉన్మేష =సత్త్వగుణంయొక్క ఉత్పత్తిచేత, ప్రముషిత = పూర్తిగా అపహరింపబడిన, లేకుండా చేయబడిన, మనఃకల్మషైః= మనస్సులోని దోషాలైన రజోగుణ-తమోగుణాలను కల ముముక్షువులచే, సత్త్వనిష్ఠైః = శుద్ధసత్త్వమనే పరమపదంలో స్థిరంగా ఉండే నిత్యులచే, ముక్తులచే, సకలమపి = అన్నివిధాలైన, సంగం = సంబంధాన్ని (ఐశ్వర్య-కైవల్య- భగవత్ ప్రాప్తి- అనే వానిలో ఆశను) త్యక్త్వా = విడచిపెట్టి, వీతరాగైః (సద్భిః) = దేవరవారికి చేసే కైంకర్యాలలో "ఇది మన సంతోషంకోసం" అనే ఆశను లేనివారిచే, సేవ్యసే = సేవింపబడుతున్నారో, తస్మై = అటువంటి మహాత్ములచే సేవింపబడిన, తుభ్యం = దేవరవారి విషయంలో, అభ్యసూయాం = అసూయను, దర్శయన్ = ప్రదర్శిస్తున్న, కుమతిః= చెడ్డబుద్ధిని కలవాడు, కస్మై = మిగిలిన ఎవనికి, కిమివ కృత్వా = ఏమి మంచిని చేసి, ఇష్టసిద్ధ్యై= అభిలషించిన పురుషార్థం నెఱవేరడంకోసం, కల్పతామ్ = యోగ్యతను పొందగలడు? (పొందలేడు)

నిత్యులయొక్క, ముక్తులయొక్క, ముముక్షువులయొక్క, భగవానునియొక్క గౌరవానికి పాత్రమైన శ్రీవరవరమునుల పట్ల అసూయను కలవాడు, మిగిలిన వారి పట్ల అసూయారాహిత్యంతో కూడిన గొప్ప భక్తిని కల్గి ఉన్నా, మోక్షాన్ని పొందడానికి అర్హుడు కాబోడు - అని తాత్పర్యం.

వ్యాఖ్యానమ్ : **(యః త్వమ్)** - సాత్త్వికుల గోష్ఠిలో ప్రసిద్ధమైన జ్ఞానశక్త్యాదులచే ఉత్కర్షను కల దేవరవారు,

**(సత్త్వోన్మేషప్రముషితమనః కల్మషైః)** - **"సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్"** అని, **"తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్"** (సత్త్వగుణం నిర్మలమైనందున ప్రకాశం కల్గిస్తుంది, దోషాలు లేనిది) ఇత్యాదిగా శాస్త్రాలలో ప్రసిద్ధమైన సత్త్వమైన అచిత్ద్రవ్యగుణ విశేషం ఉద్బుద్ధమైతే మనస్సులోని కల్మషాలు-దోషాలు అన్ని తొలగిపోతాయి. మనస్సు పరిశుద్ధమవుతుంది. రజస్తమస్సులు రెండు అన్యథాజ్ఞానవిపరీత జ్ఞానాదులను కల్గిస్తాయి. కనుక అవి మనస్సులోని మలినాలు, సూర్యుడు ప్రకాశించగానే చీకటి తనంత తానే తొలగిపోయేటట్లు, మనస్సులో సత్త్వగుణం ప్రకాశించగానే అటువంటిరజస్తమస్సులనే మలినాలు పూర్తిగా నశిస్తాయి. ఈ సత్త్వోన్మేషానికి కర్మాదులు హేతువులుగా చెప్పబడనందున, **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయః"** (జన్మించే సమయంలో ఎవనిని మధుసూదనుడు కటాక్షిస్తాడో అతడు సాత్త్వికుడుగా తెలియదగినవాడు) అనే సూక్తిప్రకారం జాయ మానసమయంలో మధుసూదనుని దివ్యకటాక్షాన్ని పొందినవాడు సాత్త్వికుడు కాగలడని చెప్పబడినందున, భగవానుని సౌహార్దమే ఈ సత్త్వోన్మేషానికి మూలమని గ్రహించాలి.

**(సత్త్వనిష్ఠైః)** - పరమపదం శుద్ధసత్త్వాత్మకం. అక్కడ స్థిరంగా ఉండేవారు నిత్యసూరులు. ముక్తపురుషులు. వారిచే- అని అర్థం.

**(సకలమపి సంగం త్యక్త్వా)** - ఇహలోకైశ్వర్యం మొదలు భగవత్ప్రాప్తి పర్యంతంగల ప్రయోజనాలపట్ల గల ఆశను విడచిపెట్టి,

**(వీతరాగైః)**- దేవరవారికి కైంకర్యం చేయడంలో కూడా స్వార్థతాగంధాన్ని, మమతాగంధాన్ని, బుద్ధిని విడచిపెట్టిన మహాత్ములచే - అని అర్థం. **"జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః"**- అనే రీతిలో ఆత్మ జ్ఞానానంద స్వరూపుడైనా పరమాత్మకు శేషభూతుడు'' అని ఆత్మస్వరూపం నిర్వచింపబడింది. జ్ఞానానందాలను రెండిటిని స్వరూపనిరూపకాలుగా జీవుడు కలవాడైనా, అతని అంతరంగనిరూపకం పరమాత్మకు శేషమై ఉండడమే- అనే విశేషార్థాన్ని ఈ శ్లోకంలోన **"తు, హి"** అనే రెండు అవ్యయపదాలు తెల్పుతున్నాయి. ఈ శేషత్వం పారతంత్ర్యపర్యవసాయి. జీవునకు జ్ఞానంద్వారా కర్తృత్వం, ఆనందంద్వారా భోక్తృత్వం సిద్ధించినా, ఈ కర్తృత్వభోక్తృత్వాలు రెండు పరమాత్మాధీనాలు. ''నేను నాకోసం చేస్తున్నాను'' అనే భావన లేకుండా, "భగవానుడే స్వయంగా నా ద్వారా తన ఆనందంకోసం చేయిస్తున్నాడు'' అనే భావనతోనే కైంకర్యం చేయాలి. తాను చేసిన కైంకర్యానికి ఆనందపడే స్వామిని దర్శించి ఆనందించాలి'' అనేది ఆత్మయాథాత్మ్య స్వరూపం. ఇక్కడ **"తనక్కేయాక ఎనై కొళ్ళుమ్"** అని, **"ప్రహర్ష యిష్యామి**

సనాథజీవితః" అనే సూక్తుల భావాలు చరమపర్వాత్మకంగా భావ్యాలు. ఇది ప్రకృతంలో చరమపర్వంలో అన్వయించి "వీతరాగైః" అని అన్నారు. "త్వత్కైంకర్యవిషయేఽపి స్వార్థతాభిలాషగంధరహితైః' అని వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్య. దేవరవారికి చేసే కైంకర్యం విషయంలో కూడా కర్తృత్వ- భోక్తృత్వాలలో మమతా బుద్ధి లేని, అత్యంత పారతంత్ర్యభావనను కల్గినవారిచే- అని తాత్పర్యం.

**(సేవ్యసే)** - (మీరు) సేవింపబడుతున్నారో- వారు చేసే కైంకర్యాలకు విషయభూతులై ఉన్నారో- అని అర్థం.

**(తస్మై తుభ్యమ్)** - అటువంటి దేవరవారిపట్ల- ముముక్షువులచే, నిత్యులచే, ముక్తులచే సేవింపబడే దేవరవారి విషయంలో,

**(అభ్యసూయామ్ దర్శయన్)** - గుణాలలో లేని దోషాలను ఆరోపించడం అసూయ. **"గుణేషు దోషావిష్కరణ మసూయా"**అని అసూయానిర్వచనం. ఆ విధమైన అసూయను ప్రదర్శించేవాడై- అసూయాభావనను మనస్సులో పొందడమే కాక, దానిని వ్యక్తంగా ప్రకటించేవాడై -అని తాత్పర్యం.

**(కుమతిః)** - ఈవిధమైన అసూయను పొందడానికి కారణమైన అన్యథాజ్ఞాన- విపరీతజ్ఞానాలను నిండుగా కల్గినవాడు - అని అర్థం. "అభ్యసూయాం దర్శయన్, కుమతిః" అనే ప్రయోగంద్వారా పూర్వం తెలుపబడిన "సేవా, సత్త్వోన్మేషా"లకు విరుద్ధమైన రెండు స్థితులు తెలుపబడ్డాయి.

**(కస్మై కిమివ కృత్వా)** - భగవానుని మొదలుగా ఉండే ఏ పురుషునిపట్ల- భక్తిమొదలైన నిష్కృతులలో దేనిని ఆచరించి,

**(కల్పతామ్)** - ఇష్టసిద్ధిని పొందడంలో సమర్థుడు కాగలడు. "స పిత్రా చ పరిత్యక్తః... త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః" అని అంటూ కాకాసురుడు చివరకు తల్లిదండ్రులచే కూడా విడువ బడినవాడై, ఆశ్రీరామునే శరణు వేడి ఉజ్జీవించినట్లుగా, జగత్పిత, జగన్మాతలచే కూడా విడువబడిన ఈ జీవునకు (దేవరవారి విషయంలో అపచారపడినవానికి) దేవరవారి శ్రీచరణాలే ఉపాయం, దానిని పొందినపుడే అతడు ఉజ్జీవిస్తాడు - అని భావం. నిత్యముక్తాదులచే సేవింపబడే దేవరవారిపట్ల అపచారపడిన వానికి ఆ నిత్యముక్తాదులలో ఎవరూ ఉపాయభూతులు కాలేరు, అతడు చేసే కైంకర్యానికి ప్రతిసంబంధులు- ఉద్దేశ్యభూతులు ఎవరూ కాలేరు - అని తాత్పర్యం.

**73.** అవ :- ఈవిధంగా దేవరవారిపట్ల అసూయను కల్గి నశించే అవకాశం లేనట్లుగా, దేవరవారి మహిమను అతనికి ప్రకాశింపజేసి, అతనిని రక్షించాలి - అని మళ్ళీ ఈ శ్లోకంలో అర్థిస్తున్నారు.

దివ్యం యత్తే యదిహ కృపయా దేవదేవోపదిష్టం
తత్త్వం భూయాద్వరవరమునే! సర్వలోకోపలభ్యమ్ ।
వ్యక్తే తస్మిన్ విదధతి భవద్వైభవద్వేషిణో యే
ద్వేషం త్యక్త్వా సపది దురితధ్వంసినీం త్వత్సపర్యామ్ ॥

వరవరమునే = ఓ మణవాళమహాముని!, దివ్యాం = అప్రాకృతమైన, చాలా గొప్పది అయిన, యత్ = ఏ, తే = దేవరవారి, తత్త్వం = గొప్ప మహిమ, ఇహ = ఈ దాసునిపట్ల, కృపయా = దయతో, దేవదేవ+ఉపదిష్టం = దాసునకు కులదైవమై, దేవదేవుడైన శ్రీరామచంద్రునిచే ఉపదేశింపబడిందో, తత్ = ఆ తత్త్వం, సర్వలోక+ఉపలభ్యం = అసూయను, పగను కల లోకంలోని అందరి జనులకు దర్శించ గలిగినదిగా, భూయాత్ = అగుగాక !, (ఆవిధంగా దేవరవారు దర్శింపజేయాలి. ఆ విధంగా దర్శింపజేస్తే), యే భవత్+వైభవద్వేషిణః= దేవరవారి వైభవవిషయంలో ద్వేషాన్ని కల్గి ఎవరు ఉన్నారో, తే = వారు, తస్మిన్ వ్యక్తే సతి = ఆ వైభవం చక్కగా తెలిసినది అయినపుడు, ద్వేషం త్యక్త్వా = పగను విడచి, సపది = వెంటనే, దురితధ్వంసినీం = దేవరవారిని పొందడానికి అవరోధంగా ఉండే పాపాలను పోగొట్టగల్గిన, త్వత్ సపర్యాం = దేవరవారికి చేసే కైంకర్యాన్ని, విదధతి =దేవరవారి ఆనందంకోసం చేస్తారు.

దేవరవారి అప్రాకృతమైన మహిమను యథాతథంగా తెలియనందున దేవరవారిపట్ల, అపచారం చేస్తున్నారు. తమ మహిమను తెలిస్తే ద్వేషం తొలగి, దేవరవారికి కైంకర్యం చేసి, పాపం నశించి, పురుషార్థాన్ని పొందడానికి తగినట్లుగా, దాసుడనైన నాకు శ్రీరాముడు తానుగా దేవరవారిని పురస్కరించుకొని తెలియజేసిన తమ మహిమను వారికికూడా చక్కగా ప్రకాశింపజేయాలి- అని భావం.

వ్యాఖ్యానమ్ : **(దివ్యమ్)** - దివ్యమైన,

**(ఇహ)** - శేషభూతుడనైన నాకు,

**(దేవదేవ+ఉపదిష్టమ్)** - నా దుఃఖాన్ని చూడలేనందున నా కులధనమైన శ్రీరామచంద్రునిచే ఉపదేశింపబడిన,

**(తే యత్ తత్త్వమ్)** - అటువంటి విలక్షణమైన దేవరవారి తత్త్వం,

**(సర్వలోకైః)** - అసూయ, ద్వేషం మొదలైన దోషాలను కల లోకంలోని జనులచే (కూడా),

**(ఉపలభ్యమ్)** - స్పష్టంగా సుఖంగా తెలిసికొనదగినది,

**(భూయాత్)** - అగుగాక,

**(యే భవద్వైభవద్వేషిణః)** - పేరును కూడా ఉచ్చరించదగనివారు - దేవరవారి వైలక్షణం పట్ల ద్వేషాన్ని కల్గి ఉండడమే నిరూపకంగా నిర్దేశింపదగినవారైన జనులు ఎవరో - అని అర్థం. "అడియేన్ వరవరమునిదాసన్" అని దేవరవారి భక్తులకు నిరూపకనామం అయినట్లే వీరికిది నిరూపకనామం- అని చమత్కారం. ఇది అవ్యపదేశ్యత్వంలో వ్యపదేశత్వం. దేవరవారిపట్ల ద్వేషమే స్వభావంగా కలవారు- అని భావం.

**(తే)** - అటువంటి వారు,

**(తస్మిన్ వ్యక్తే)** - తమ సాటి లేని వైభవం వ్యక్తం కాగా,

**(ద్వేషం త్యక్త్వా)** - అంతకు ముందు తమపట్ల కల్గి ఉండే అప్రీతిని విడచి,

**(సపది)** - వెంటనే,

**(దురితధ్వంసినీమ్)** - దేవరవారి ప్రాప్తికి విరోధి అయిన సకలపాపాలను నశింపజేసే,

**(త్వత్సపర్యామ్)** - దేవరవారి కైంకర్యాన్ని,

**(విదధతి)** - దేవరవారి ఆనందంకోసం చేస్తున్నారు. ఈ పరస్మై క్రియాపదం ప్రయోగం సాభిప్రాయకం. క్రియాఫలం కర్తకు చెందుతుంది- అనే అర్థాన్ని తెలిపే ఆత్మనే పది క్రియాప్రయోగం కాకుండా పరస్మై పదిరూప ప్రయోగం చేయబడినందున ప్రయోజకత్వనివృత్తి సూచింపబడింది. తద్వారా శ్రీవరవరముని ముఖోల్లాసంకోసమే కైంకర్యాన్ని చేస్తారని భావం. **"అవశాః ప్రతిపేదిరే"** అని, **"ఝటిత్యస్మిన్ దృష్టే కిమితి పరవానస్మి"** (తటాలున అతడు కన్పించగా, అతనికి పరాధీనుడనయ్యాను! ఏమి!) అని చెప్పబడిన రీతిలో శ్రీవరవరమునుల వైభవసాక్షాత్కారం కాగానే, తత్ప్రభావంవల్ల ద్వేషనివృత్తి స్వరూపయాథాత్మ్యజ్ఞానప్రాప్తి మొదలైనవి కల్గి, స్వరూపానురూపమైన కైంకర్యాన్ని చేస్తారని తాత్పర్యం.

**74.** అవ :- దేవరవారిచే, దేవరవారి మహిమ ప్రకాశింపజేయబడగా, సంస్కరింపబడి, దేవరవారినే ప్రాపకంగా, ప్రాపంగా భావించి ఆశ్రయించిన జనులు, దేవరవారిని ఆశ్రయించడానికి ముందు జన్మ, జ్ఞానం, వృత్తం - అనే వీటిలో ఏదైనా ఒక విషయంలో కొఱత కల్గినవారైనా, వారే దేవరవారికంటే, దాసునకు (నాకు) ఇష్టులైన దేవరవారి దాసులలో నా అత్యంతప్రీతికి లక్ష్యభూతులు- అని అంటున్నారు.

తమను ఆశ్రయించడానికి ముందు తమ విషయంలో అసూయాద్వేషాదులను కల్గి ఉన్నందున దూరంగా త్యజింపబడినవారే, తరువాత దేవరవారి మహిమను దేవరవారి కటాక్షంవల్లనే యథాతథంగా గ్రహించి, సర్వాత్మను ఆశ్రయించినవారైతే, వారు జన్మ-వృత్త- జ్ఞానాలలో దేనిలోనైనా కొఱతకల్గినవారైనా, నాకు దేవరవారికంటే కూడా మిక్కిలి ప్రియమైనవారని అంటున్నారు.

**కేచిత్ స్వైరం వరవరమునే! కేశవం సంశ్రయంతే**
**తానప్యన్యే తమపి సుధియః తోషయంత్యాత్మవృత్త్యా ।**
**త్వత్తో నాన్యత్ కిమపి శరణం యస్య సోఽయం త్వదీయో**
**భృత్యో నిత్యం భవతి భవతః ప్రేయసాం ప్రేమపాత్రమ్ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, కేచిత్ = కొంతమంది భాగ్యశాలురు, కేశవం = కేశవుడనే నామాన్ని కల భగవానుని, స్వైరం = తమ అభీష్టానుసారంగా, సంశ్రయంతే = ప్రాప్యంగా, ప్రాపకంగా తలచి ఆశ్రయిస్తున్నారు, అన్యే = వారికంటే భాగ్యశాలురైన మఱి కొందఱు, తానపి = కేశవుని ఆశ్రయించినవారిని, తమపి = ఆ కేశవునికూడా (సమానంగా), ఆత్మవృత్త్యా = తమ కైంకర్యాలతో, సుధియః= కైంకర్యానికి అంగమైన పరమభక్తి రూపంగా పరిణమించిన సమీచీనజ్ఞానంతో కూడినవారై, తోషయంతి = ఆ ఇరువర్గాల (భగవద్భాగవతుల) ఆనందాన్నే ప్రయోజనంగా తలచి, ఆనందింపజేస్తున్నారు

(ఈవిధంగా ప్రస్తావింపబడ్డ రెండు విధాలైన వారు ఉండనీ), యస్య = ముందు పల్కిన ఇరువర్గాల వారికంటె భాగ్యశాలి అయిన ఎవనికి, త్వత్తః= దేవరవారికంటే, అన్యత్ = వేఱొక విషయం, శరణం = ప్రాప్యంగా గాని, ప్రాపకంగా గాని, కిమపి = ఏదీ, న = అభిమతం కాదో, సః = అటువంటి, త్వదీయః భృత్యః= దేవరవారికి దాసుడై, అయం = దాసుని మనస్సులో స్థిరంగా నిలచి ఉండే ఇతడు, భవతః= దేవరవారి కంటే కూడా, ప్రేయసాం = దాసుని (నా)ప్రేమకు లక్ష్యభూతులైన దేవరవారి దాసులలో (భక్తులలో), ప్రేమపాత్రం = నా అత్యంత ప్రేమకు లక్ష్యభూతుడై, నిత్యం భవతి = ఎల్లప్పుడు ఉన్నాడు.

ఈ శ్లోకంలో- కేశవుడు, ఆ స్వామిని ఆశ్రయించిన భాగవతులు, ఆచార్యులైన శ్రీవరవరమునులు, వారిని ఆశ్రయించిన మహాత్ములు, వారిలో ఉన్నతులైనవారొకరు - అని ఈ రీతిలో జీవాత్మలకు ఆశ్రయింపదగిన అధికారులు అయిదుగురు ప్రస్తావింపబడ్డారు. వీరిలో, పూర్వ పూర్వాధికారులను ఆశ్రయించే జీవాత్మలకంటే ఉత్తరోత్తరాధికారులను ఆశ్రయించేవారు గొప్పవారు. గొప్ప పుణ్యశాలురు- అని భావం. ఇక్కడ పుణ్యమంటే భగవత్కృపయే. **"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్విక స్స తు విజ్ఞేయః"** అనే రీతిలో భగవానుని నిర్హేతుక జాయమానకటాక్షమే ఇచటి పుణ్యం.

భగవానుడు ప్రథమ పర్వం, భాగవతులు మధ్యమపర్వం, ఆచార్యులైన శ్రీవరవరమునులు చరమపర్వం. ఈ ఆచార్యులను ప్రథమపర్వంగా గ్రహిస్తే, వారిని ఆశ్రయించిన ఆచార్యభక్తులు మధ్యమపర్వం, వారిలో ఉన్నతుడైన వారొకరు చరమపర్వం. ఈవిధంగా చరమపర్వమైన ఆచార్యులకంటే ఈ అధికారి చరమపర్వస్థానీయులు అవుతున్నారు. దేవరాజగురువు ఈ శ్లోకంలో చరమపర్వమైన శ్రీవరవరమునుల విషయంలో మాత్రమే ఊనికను కల్గి ఉండడం కాకుండా, వారికి కూడా చరమపర్వమై, వారి దాసులలో గొప్పవారైన ఒకరి విషయం ప్రాప్య-ప్రాపక నిశ్చయాన్ని కలవారై ఉండే తమ అతిశయాన్ని వ్యక్తం చేశారు.

కేశవుడనే నామానికి పలు నిర్వచనాలున్నాయి. వానిలో ఒకటి, **"శురుణ్డిరుణ్డ కుౘల్ తాౘ్న్ద ముకత్తాన్"** (పెరియాౘ్వార్ తిరు-3-6-9) ("గుండ్రంగా ఉండే ముంగురులు కదలాడే ముఖాన్ని కలవాడు) అని అంటూ పెరియాౘ్వార్లు - **"ప్రసన్నస్నిగ్ధనీలకుటిలకుంతలః"** (సహస్రనామ భాష్యం) అని భట్టర్ పల్కిన రీతిలో పొగడదగినది, నిగనిగమనే కాంతిని కల్గినది, నల్లనిది, గుండ్రనిది అయిన కేశపాశాన్ని కలవాడు- అనేది. ఇందువల్ల భగవానుడు పరమభోగ్యుడు-అంతులేని గొప్ప అందాన్ని కలవాడని భావం. ఇంకొకటి- కేశవుడనే అశ్వరూపధారి అయిన అసురుని వధించినవాడు- అనే అర్థం. దీనివల్ల ఆశ్రితుల విరోధులను నశింపజేసే స్వభావాన్ని కలవాడని తెలుపబడింది. ఈ అర్థాలు రెండు క్రమంగా భగవానుని ప్రాప్యత్వ, ప్రాపకత్వాలను, యోగ-క్షేమనిర్వాహకత్వాన్ని తెలుపుతున్నాయి. (బ్రహ్మ రుద్రులకు అధిపతి- అనే ఇంకొక కేశవ శబ్ద నిరుక్తి ఉన్నది. అది ఇక్కడ ప్రస్తావించబడలేదు.)

**వ్యాఖ్యానమ్: (కేచిత్)-** ధన్యతను కల్గించడానికి హేతువైన భగవత్కటాక్షానికి లక్ష్యభూతులైనవారు- అని భావం.

**(కేశవమ్)** - అందమైన కేశాలను కల్గి ఉండడంవల్ల భోగ్యభూతుడై, కేశిని సంహరించినందున ఆశ్రితుల విరోధులను నిరసించే స్వభావాన్ని కలవాడైనందున ప్రాప్య- ప్రాపకభూతుడైన భగవానుని,

**(స్వైరమ్)** - ఉపాయంగా, ఉపేయంగా ఆశ్రయించడంలో ఏవిధమైన అడ్డు లేనందున, యథేష్టంగా- అని భావం. ఏదయినా అవరోధం ఉంటే స్వైరంగా ఆశ్రయించడం సాధ్యం కాదుకదా! కేశవునిలో ఈ రెండు స్వభావాలున్నాయనే విషయం ఆ నామమే తెల్పుతున్నది. కనుక స్వైరంగా - అని చెప్పబడింది.

**(సంశ్రయంతే)** - భగవత్స్వరూపానుగుణంగా, తమ స్వరూపానుగుణంగా ఉపాయోపేయభావంతో స్వీకరిస్తున్నారు.

**(అన్యే కేచిత్)** - ధన్యతములు కావడానికి హేతువైన భగవత్కటాక్షానికి లక్ష్యభూతులైనవారు, మఱికొందరు శ్లోకంలో పూర్వం ప్రస్తావింపబడిన వారికంటే విలక్షణులైన (గొప్పవారైన) మఱికొందఱు జీవులు,

**(తానపి తమపి)** - భగవానునిపట్ల ప్రావణ్యాన్ని కల్గినవారిని, భగవానుని - ఇద్దఱిని - అని అర్థం. ముందు వీరి కేశవుని భక్తులను, తరువాత కేశవుని నిర్దేశించినందునకేశవ సమాశ్రయణం ధ్వనిస్తున్నది. **"సౌమ్యోపయంత్ర్యమినా మమ దర్శితౌ తే శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే"** అని కదా అభియుక్తోక్తి.

**(ఆత్మవృత్త్యా)** - తాము చేసే ప్రీతికారిత కైంకర్యాలతో,

**(సుధియః)** - ఇచటి ధీ శబ్దం భక్తివాచకం. ప్రీతికారితమైన కైంకర్యాన్ని చేయడానికి భోజనానికి ఆకలివలె, పరికరరూపమైన, **"శేముషీ భక్తిరూపా"**, **"ఞానమ్ కనిన్ద నలమ్"** అనే రీతిలో పరమభక్తిగా పరిణమించిన సమ్యక్ జ్ఞానాన్ని కలవారై - అని అర్థం. **"భక్తి ప్రాప్యరుచియిలే పుకుమ్"** అనే ముముక్షుప్పడి లోని సూత్రం (282), **"భక్త్యా త్వనన్యయా లభ్యః- ఎన్గిఅపడియే భగవత్ప్రాప్తిక్కు సాధనమాన బుద్ధి, అన్ద సాధన బుద్ధిపోనవాఱే, భోజనత్తుక్కు క్షుత్తుప్పోలే ప్రాప్యమాన కైంకర్యత్తుక్కు పూర్వక్షణత్తిలే అనువర్తిక్కక్కడవదాన రుచియిలే అంతర్భవిక్కుమ్"** (అనన్యమైన భక్తికి లభిస్తాడు - అనే రీతిలో భగవత్ప్రాప్తికి సాధనమైన బుద్ధి, అది సాధనమనేభావం పోతే, భోజనానికి ఆకలివలె, ప్రాప్యమైన కైంకర్యానికి ముందు ఉండవలసిన రుచిలో ఆ భక్తి అంతర్భవిస్తుంది) అనే శ్రీవరవరముని వ్యాఖ్య అనుసంధేయాలు.

**(తోషయంతి)** - **"తనక్కేయాక ఎనై క్కొళ్ళుమీదే"** అని, **"ప్రహర్షయిష్యామి"** అనే రీతిలో వారిని ఆనందింపజేస్తున్నారు. **"తుష్యంతి"** అని అనకుండా **"తోషయంతి"** అనే పరస్మైపదిప్రయోగంవల్ల ఈ అర్థం స్ఫురిస్తుంది. **"అపి"** శబ్దం **"తానపి, తమపి"** అని రెండు చోట్ల ప్రయోగింపబడినందున వారిని ఇరువురిని సమానప్రతిపత్తితో సేవిస్తున్నారని కూడా స్ఫురిస్తుంది. **"ధన్యాః కేచన తేభ్యోఽపి తేషామాదేశవర్తినః"** (భగవానుని ఆదేశంలో వర్తించేవారికంటే భాగవతుల ఆదేశంలో వర్తించేవారు ధన్యులు) అనే సూక్తిలో భగవానుని సేవించేవారు ధన్యులు, భగవానుని, భాగవతులను సేవించేవారు ధన్యతములు- అని తెలుపబడిన అర్థవిశేషాన్ని స్ఫురింపజేయడం కోసమే **"కేచిత్, అన్యే"** అనే పదాలు ప్రయోగింపబడ్డాయి- అనేది స్తుతి కర్తృహృదయగతాభిప్రాయం.

**(యస్య)**- పూర్వం తెలుపబడిన ధన్యత్వ, ధన్యతమత్వాలనే రెండు విధాలైన విలక్షణత్వాలను కల్గి ఉండడానికి మూలమైన భగవత్కటాక్షానికి విషయభూతుడైన ఏ చేతనునకు (ఏభాగ్యశాలికి) -అని అర్థం. ఇతని విషయంలో జాత్యాదులు **"ఏఱ్ఱై ఏదలన్ కీழ్ మకన్ ఎన్నాదు ఇరఙ్గి"** (జ్ఞానహీనుడు, తక్కువజాతివాడు - అని భావించకుండా అనుగ్రహించి) అనే రీతిలో వివక్షితాలు కావు, అప్రయోజనాలు- అనే భావం స్ఫురింపజేయడం కోసంగా నిర్విశేషంగా **"యస్య"** అనే సర్వనామశబ్దప్రయోగం చేయబడింది.

**(త్వత్తః)** - విలక్షణమైన ఉపాయ-ఉపేయరూపులైన దేవరవారికంటె - అని అర్థం. **"ఉపాయోపేయత్వే తదిహ తత్త్వమ్"** అనే రీతిలో భగవానుడు ఉపాయోపేయ భూతుడైనా, అవి రెండు ప్రథమపర్వగతాలు. ఇవి చరమపర్వగతాలు కనుక విలక్షణమైనవి.

**(అన్యత్)** - ఇంకొకటి - ఉపాయోపేయభూతమైనది- అని అర్థం. **"పరబ్రహ్మప్రభృతిక మిత్యర్థః"** అని వీరరాఘవాచార్యవ్యాఖ్య.

**(కిమపి శరణమ్)** - శరణమైనది ఏదీ - అని అర్థం. ఇక్కడ శరణశబ్దానికి ఉపాయమని, ఉపేయమని రెండర్థాలు. వేఱు ఏవిషయం ఉపాయం కాదు, ఉపేయంగా కూడా కాదు- అని భావం. శరణశబ్దం తంత్రేణ ఉపాయార్థకంగా వివరింపబడింది. **"శరణం గృహరక్షిత్రోః శబ్దః శరణ మిత్యయం వర్తతే"** (శరణమనే పదం గృహం, రక్షకుడు శరణమనే అర్థాలను ఇస్తుంది) అని చెప్పబడిన ఉపాయ-ఉపేయాలు రెండిటిలో ఏ ఒక్కటిని - అని భావం.

**(సః)** - దేవరవారికంటే ఉపాయంగా గాని, ఉపేయంగా గాని వేఱొక విషయాన్ని కల్గి ఉండని ఆ భాగ్యశాలి - అని అర్థం.

**(అయమ్)** - అటువంటివాడు నా మనస్సులో నిత్యంగా నిలచి ఉంటాడు- అనే అర్థవిశేషాన్ని ఈ సర్వనామశబ్దం ధ్వనింపజేస్తుంది. ఎల్లప్పుడు నా మనస్సులో సన్నిహితమై ఉండే ఇతడు- అని అర్థం. అతడు ఎవడు? అంటే -

**(త్వదీయః భృత్యః)** - అతనికి నిరూపకధర్మం దేవరవారి భృత్యుడనియే. అతని జన్మ జ్ఞానవృత్తాదులు ఎటువంటివి అయినా కానీ, అతడు దేవరవారికి భృత్యుడై ఉంటే చాలు. అతనికి జీవనభృతి దేవరవారి కైంకర్యమే. అటువంటివాడు.

**(భవతః)** - దేవరవారికంటే కూడా,

**(ప్రేయసామ్)** - అతిశయించిన నా ప్రీతికి విషయభూతులైన మహాత్ముల మధ్యలో,

**(ప్రేమపాత్రమ్)** - మిక్కిలి అతిశయించిన నా ప్రీతికి విషయమవుతున్నాడు.

**(నిత్యం భవతి)** - పరిచయమైన క్షణంనుండి ఇటువంటి అత్యంతమైన నా ప్రీతి అతని విషయంలో నిత్యంగా వర్తిస్తుంది - అని తాత్పర్యం. చరమపర్వనిష్ఠలో చరమపర్వనిష్ఠాప్రకాశనం ఈ శ్లోకంలోని

పరమతాత్పర్యం. "ఆరాధనానామ్ సర్వేషామ్" (దేవతలందరి ఆరాధన కంటే విష్ణువు ఆరాధన గొప్పది. అంతకంటే కూడా ఆ విష్ణుభక్తుల ఆరాధన గొప్పది) ఇత్యాది శ్లోకాలలో "మాఱాయ తానవనై" (హిరణ్య కశిపుడనే దానవుని సంహరించిన నృసింహస్వామిని ఆరాధించే భక్తుల తపస్సు కంటే, ఆ భక్తులను ఆరాధించే వారి భాగవతభక్తుల తపస్సు గొప్పది) ఇత్యాది పాశురంలో ప్రథమపర్వంలోని చరమపర్వనిష్ఠ తెలుపబడగా, ఇందులో చరమపర్వంలో చరమపర్వనిష్ఠ ప్రకాశింపజేయ బడింది. శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలోని చరమపర్వనిష్ఠాప్రకరణంలోని పలు సూత్రాలు, వాటికి శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యాన విశేషాలు ప్రకృత శ్లోకప్రమేయానికి అనుగుణంగా అనుసంధేయాలు.

**75.** అవ :- గడచిన శ్లోకంలో **"త్వదీయో భృత్యో నిత్యం భవతి భవతః ప్రేయసాం ప్రేమపాత్రమ్"** అని అంటూ, దేవరవారి ప్రీతికి మిక్కిలి లక్ష్యభూతులైన శ్రీవరవరముని భక్తశ్రేష్ఠుల ప్రస్తావన చేసిన స్తుతికర్త, అటువంటి నిష్ఠావిశేషం కలుగడానికి హేతువైన శ్రీవరవరమునుల సన్నిధిని చేరడంలో తమకు గల త్వరాతిశయాన్ని ఇందులో వ్యక్తం చేస్తున్నారు.

**దీనే పూర్ణాం భవదనుచరే దృష్టిం దయార్ద్రా**
**భక్త్యుత్కర్షం వరవరమునే! తాదృశం భావయంతీమ్ ।**
**యేన శ్రీమన్! ద్రుత మహ మితః ప్రాప్య యుష్మత్పదాబ్జం**
**త్వద్విశ్లేషే తను విరహిత స్తత్ర లీనో భవేయమ్ ॥**

శ్రీమన్ వరవరమునే = గొప్ప తిరుమేని సౌందర్యాన్ని కల్గిన ఓ వరవరమునీ!, తాదృశం = అటువంటి (దేవరవారి భక్తులపట్ల కూడా ప్రేమ కలుగడానికి కారణమైన), భక్తి+ఉత్కర్షం = దేవరవారిపట్ల గొప్ప భక్తిని, భావయంతీం = నిరంతరం కల్గిస్తున్న, పూర్ణాం = పూర్ణమైన, దయా+ఆర్ద్రాం = దాసుడనైన నాపట్ల గల దయచే చల్లనిదైన, దృష్టిం = (దేవరవారి) విశేషకటాక్షాన్ని,భవత్ +అనుచరే = దేవరవారి దాసుడనైన, దీనే (మయి) = దాసుడనైన నా విషయంలో, దేహి = అనుగ్రహించండి, యేన = ఏ ఉన్నతమైన భక్తిచే, త్వత్+విశ్లేషే = దేవరవారి విశ్లేషంలో, తనువిరహితః= విరహార్తిచేత కృశించిన దేహాన్ని కల్గినవాడనైన, అహం = నేను, ఇతః = "ఎఱుమ్బి" అనబడే గ్రామంనుండి, ద్రుతం = వేగంగా, యుష్మత్+పాదాంబుజమ్ = దేవరవారి (దేవరవారియొక్క, దేవరవారి దాసులయొక్క), పాదపద్మాలను, ప్రాప్య= తిరిగి విశ్లేషంచని రీతిలో చేరి, తత్ర = ఆ పాదపద్మాలలో, లీనః= ప్రత్యేకమైన పేరు, రూపం లేని రీతిలో లీనమైనవాడనుకాగలనో? (అటువంటి ఉన్నతమైన భక్తిని కల్గించడానికి విశేషకటాక్షాన్ని దాసుని పట్ల ప్రసరింపజేయాలి)

భగవానుని మనస్సుతో భావించి, సుఖాన్ని, అతనిని సమీపించి అనుభవించలేని దుఃఖాన్ని ఒకేసారి అనుభవించి, శరీరాన్ని విడచిన ఒక గోపిక **"చింతయంతి"** అనబడుతున్నది. ఆ రీతిలో ఒకేసారి కాకుండా, సుఖం, దుఃఖం మాటిమాటి పలుమార్లు అనుభవించి, చివరలో తిరుమేనిని విడచిన నమ్మాళ్వార్లు **"దీర్ఘచింతయంతి"** అనబడుతున్నారు.

ఈ విధంగా ప్రథమపర్వమైన భగవద్విషయంలో ప్రావణ్యాన్ని కల ఈ ఇరువురివలె కాకుండా, ఆచార్యవిషయంలో సుఖదుఃఖాలను మాటి మాటి అనుభవించే ప్రావణ్యాన్ని కల్గినవారై ఈ ఎఱుమ్బియప్పా **"చరమదీర్ఘయంతి"** అని వ్యవహరించదగినవారు- అని ఈ శ్లోకం ద్వారా సూచింపబడింది. ఈ అర్థవిశేషాన్ని **"తనువిరహితః"** అనే ప్రయోగం సూచిస్తున్నది.

**వ్యాఖ్యానమ్ : (తాదృశమ్)**- పూర్వశ్లోకంలో తెలుపబడిన రీతిలో దేవరవారిపట్ల, దేవరవారి భక్తులపట్ల గొప్ప ప్రీతి కల్గడానికి కారణమైన,

**(భక్త్యుత్కర్షమ్)** - అతిశయించిన భక్తిని,

**(భావయంతీమ్)** - మాటిమాటికి కలుగజేసేది,

**(పూర్ణాం దయార్ద్రామ్)** - సమగ్రమైనది - నా అనర్థాన్ని చూచి సహించలేనందున కల్గిన దయతో చల్లనిది - అని అర్థం. **"ఆర్ద్రామ్"** అని అన్నందున దయయొక్క సుధాసామ్యం ధ్వనిస్తున్నది.

**(దృష్టిమ్)** - విశేషకటాక్షాన్ని,

**(భవదనుచరే)** - దేవరవారి పరిజనుడను,

**(దీనే)** - దేవరవారికి భృత్యుడను - అనే కారణం తప్ప, దేవరవారిని పొందడంలో ఏవిధమైన యోగ్యతను లేనివాడైనందున దీనుడను - దరిద్రుడను అయిన నా విషయంలో- అని అర్థం. **"ఉపాయేనైవ సిద్ధ్యంతి హ్యపాయా బహులా స్తథా, ఇతి యా గర్వహాని స్తత్ దైన్యం కార్పణ్య ముచ్యతే"** (ఉపాయం ద్వారానే అన్ని అపాయాలు పరిష్కృత మవుతాయి, మన శక్తి చాలదు - అనే గర్వ హానిదైన్యమని కార్పణ్యమని అనబడు తున్నది) అని నిర్వచింపబడిన దైన్యం ఇక్కడ వివక్షితం. **"దీనే"** అనే ఈ విశేషణం వరవరమునుల కటాక్షానికి పాత్రం కావడంలోని యోగ్యతను సూచిస్తుంది. **"దీయతే ఇతి దీనః, దీఙ్- క్షయే"** అనే వ్యుత్పత్తివల్ల, **"నిస్స్వస్తు దుర్విధో దీనో"** అని పర్యాయ పదాలవల్ల ఆకించనన్య, అనన్యగతిత్వాదులు ధ్వనిస్తాయి.

**(దేహి)** - అనుగ్రహించండి.

**(యేన)** - ఏ భక్త్యతిశయంచేత,

**(త్వద్విశ్లేషే)** - దేవరవారి వియోగంలో,

**(తనువిరహితః)** - శరీరం లేనివాడనై- విరహాగ్నిచే కృశించిన శరీరాన్ని కలవాడనై- అని భావం.

**(అహమ్)** - దేవరవారికి దూరంలో ఉండే నేను,

**(ఇతః)** - **"ఎఱుమ్బి"** అనబడే ఘటికాద్రి క్షేత్రానికి సమీపంలో ఉండే గ్రామంనుండి,

**(ద్రుతం)** - వేగంగా,

**(యుష్మత్పదాబ్జమ్)** - **"యుష్మత్"** అనే దానివల్ల స్వరూపానురూపత, **"అబ్జ"** శబ్దం వల్ల భోగ్యత సూచింపబడ్డాయి. దీనివల్ల స్వరూపకృతదాస్యం, గుణకృతదాస్యం - రెండూ తెలుబడ్డాయి. ఈవిధంగా **"అహమస్యావరోభ్రాతా గుణైర్దాస్య ముపాగతః"** (నేను శ్రీరామునకు భ్రాతను. అతని గుణాలవల్ల అతనికి దాసుడనయ్యాను) - అనే సూక్త్యర్థం చరమపర్వంలోని పర్వత్రయాత్మకంగా అనుసంధింపబడినది చెప్పవచ్చు. (ఇక్కడ భ్రాత - అన్నందున స్వరూపకృతదాస్యం, తరువాత దాస్యశబ్దంచేత గుణకృతదాస్యం తెలుపబడ్డాయి) **"త్వదనుచరాశ్చ త్వం చ యూయమ్"** - అనుచరవర్గంతోకూడి ఉండే దేవరవారి శ్రీచరణపద్మాలను - అనే విగ్రహవాక్యం ఇచటి యుష్మచ్ఛబ్దానికి ప్రకరణానుగుణంగా చెప్పాలి.

**(ప్రాప్య)** - **"న చ పునరావర్తతే"** (ముక్తుడు ఈ లోకానికి తిరిగిరాడు) అని పునారవృత్తిలేని మళ్ళీ ఏనాడూ వియోగం పొందని రీతిలో చేరి - అని భావం. ఇది **"ప్ర"** అనే ఉపసర్గ ద్వారా ధ్వనిస్తుంది. **"ఆప్త్వా, (ఆజ్)+అప్త్వా= ఆప్య, ప్ర+ఆప్య-ప్రాప్య"** అనే మూడు రూపాలను గ్రహించి చరమపర్వంలో ప్రథమ -మధ్యమ- చరమపర్వాల పరంగా అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు.

**(తత్ర)**- దేవరవారి సన్నిధిలో, దేవరవారి భక్తుల సాన్నిధ్యంలో వారి ఆపాదపద్మాలలో,

**(లీనః)**- నామరూపాలను లేని రీతిలో -అని అర్థం. **"ఏకాంతీ వ్యపదేష్టవ్యో నైవ గ్రామకులాదిభిః, విష్ణునా వ్యపదేష్టవ్యః"** (ఏకాంతి అయినవాడు లౌకికమైన గ్రామం, కులం మొదలైనవానిని పురస్కరించుకొని వ్యవహరింపబడరాదు. విష్ణుసంబంధాన్ని పురస్కరించుకొని వ్యవహరింపబడాలి) అనే సూక్తి భావం చరమపర్వక్రమంలో అనుసంధింపబడింది. దేవరవారి సంబంధపూర్వకంగానే నామరూపాలను కలవాడనై,

**(భవేయమ్)**- కాగలను. **"కోణే లీనః క్వచిదణు రసౌ సంసదమ్ తా ముపాస్తామ్"** అనే పూర్వోక్త (16వ శ్లోకం) సూక్త్యర్థం అనువర్తిస్తున్నది.

(శ్లోకంలోని **"తాదృశమ్"** అనే పదం, శ్లోకంలోని ఉత్తరార్ధంలో ప్రయోగింపబడిన **"యేన"** అనే పదంలో ప్రతిసంబంధినిర్దేశాన్ని కల్గినది. దీనివల్ల, శరీర వియోగం కల్గిన తరువాతకూడ ఈ భక్త్యతిశయం ప్రాప్యమనే అర్థం ప్రతిపాదింపబడుతున్నది. **"తద్విశ్లేషే తనువిరహితః తత్ర లీనః"** అనే పదప్రయోగం ద్వారా భాగవతంలోని **"చింతయంతీ"** వృత్తాంతం స్మరింపజేయబడింది. దీనిద్వారా ఎఱుమ్బియప్పా **"చరమదీర్ఘచింతయంతి"** అనే పేరుతో వ్యవహరింపబడదగినవారనికూడా ధ్వనిస్తున్నది. **"చింతయంతీ జగత్సూతిమ్"** (జగత్కారణరూపుని ధ్యానిస్తూ) అనే రీతిలో భగవద్విషయ ప్రావణ్యాన్ని కల్గిన గోపిక **"చింతయంతి"** అని, అంతకంటే దీర్ఘమైన భగవత్ప్రావణ్యాన్ని కల్గిన పరాంకుశముని **"దీర్ఘచింతయంతి"** అని పిలువబడినట్లే, ఆచార్యుల విషయంలో అత్యంతప్రావణ్యాన్ని కల్గి ఉన్నందున **"చరమదీర్ఘచింత యంతి"** అని వీరిని వ్యవహరించవచ్చునని తాత్పర్యం. ఈ దేవరాజగురువులే దినచర్యాస్తోత్రంలో- **"వరవరముని మేవ చింతయంతీ మతి రియ మేతు నిరత్యయం ప్రసాదమ్"** (వరవరమునులనే ధ్యానిస్తూ నామతి గొప్ప స్వచ్ఛతను పొందాలి) అని అంటూ **"చింతయంతీ"** శబ్దప్రయోగాన్ని తమ మనస్సును ఉద్దేశించి చేయడంకూడా గమనార్హం, పరమరస్యం.

**76.** అవ :- **"మనోరథానా మతటాః ప్రవాహాః"** (కోరికలనేవి ఒడ్డులేని ప్రవాహాలవంటివి) అనే రీతిలో శ్రీవరవర మునుల శ్రీపాదప్రాప్తి దుర్లభం అయితే కానీ, అంతేకాక, వారి భక్తులతో సహవాసం కూడా దుర్లభం అయితే కానీ. అయినా, శ్రీవరవరమునుల విషయంలో వైముఖ్యాన్ని కల్గినవారితో నాకు సహవాసం కల్గకుండా ఉంటే, అదే నాకు పురుషార్థంలోని పరాకాష్ఠ సిద్ధి - ఇష్టప్రాప్తి లేకపోయినా అనిష్టసిద్ధి అయినా కలుగకుండా ఉండాలి. అని అందులో పల్కుతున్నారు.

**త్వత్పాదాబ్జం భవతు భగవన్! దుర్లభం దుష్కృతో మే**
**వాసోఽపి స్యాద్వరవరమునే! దూరత స్త్వత్ప్రియాణామ్ ।**
**త్వద్వైముఖ్యాద్విఫలజనుషో యే పున స్తూర్ణ మేషాం**
**దూరీభూతః క్వచన గహనే పూర్ణకామో భవేయమ్ ॥**

భగవన్ = జ్ఞానశక్త్యాది కల్యాణగుణపూర్ణులైన, వరవరమునే = ఓ మణవాళమహామునీ!, త్వత్+ పాదాబ్జం = పావనం, భోగ్యం అయిన దేవరవారి శ్రీచరణపద్మాలు, దుష్కృతః మే = విషయచాపలం మొదలైన దుష్కార్యాలను చేసిన నాకు, దుర్లభం భవతు = లభించకపోయినా పోనీ, త్వత్ ప్రియాణాం= దేవరవారి పట్ల ప్రీతిని కలవారికి, దేవరవారి ప్రీతికి లక్ష్యమైనవారికి, దూరతః = దూరదేశంలో, వాసః అపి=నివాసం కూడ, స్యాత్ = సంభవిస్తే సంభవించనీ, (ఇందులో ఏ నిర్బంధం లేదు), యే పునః= దురదృష్టవంతులైన వారెవరున్నారో, త్వత్ వైముఖ్యాత్ = దేవరవారి విషయంలోని ద్వేషంతో, విఫల జనుషః= దుఃఖాన్ని కల్గించే జన్మను కల్గినవారో, ఏషాం = ఇటువంటి వారికి, తూర్ణం దూరీభూతః సన్ = వేగంగా చాలా దూరంగా పోయినవాడనై, క్వచన గహనే = ఎవరూ ప్రవేశించడానికి సాధ్యం కాని ఏదో ఒక దట్టమైన అడవిలో, పూర్ణకామః భవేయం = అన్ని మనోరథాలు తీరినవాడనై, ఆనందించినవాడనుగా కావాలి.

దేవరవారిపట్ల ద్వేషం లేకుండా ఉండడం, దేవరవారి విషయంలో ప్రీతిని కల్గి ఉండడం, దేవరవారి కల్యాణగుణాలను ధ్యానిస్తూ ఆత్మధారణం చేయడం, దేవరవారితో కలసి ఉండడం, దేవరవారి దాసులతో కలసి ఉండడం- మొదలైన ఒకదానికంటె ఇంకొకటి గొప్పవైన పురుషార్థాలున్నాయి కదా! అవి అన్నీ లభిస్తే ఎంత ఆనందం కల్గుతుందో, ఆ ఆనందం అంతా దాసునకు దేవరవారిని ద్వేషించే పాపిష్ఠివారు ప్రవేశించలేని చోట నివసించగల్గితే కల్గుతుంది. అటువంటి వారుండే చోట నన్ను ఉండనీయవద్దు స్వామీ!- అని ఇందులో ప్రార్థించారు.

వ్యాఖ్యానమ్ : **(భగవన్! వరవరమునే!)**- జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాలతో నిండిన ఓమణవాళమహామునీ!

**(త్వత్పాదాబ్జమ్)** సర్వనామమైన యుష్మచ్ఛబ్దాన్ని ప్రయోగించినందున పావనత్వాదులు, అబ్జశబ్ద ప్రయోగం ద్వారా భోగ్యత్వం,శిరసా ధార్యత్వం ఇత్యాదులు ధ్వనిస్తాయి. లేక, అబ్జసాదృశ్యం చేతనే ఈ

రెండు ధ్వనిస్తాయని చెప్పవచ్చు. మంగళద్రవ్యాలలో పద్మంకూడా ఒకటి కదా! ఈవిధంగా పావనం, భోగ్యం అయిన దేవరవారి శ్రీచరణపద్మాలు -అని భావం.

**(దుష్కృతః మే)** - దేవరవారి శ్రీచరణపద్మాలను నా శిరస్సుకు అలంకారంగా ధరించకుండా, తద్విరుద్ధమైన విషయాలలో ఆసక్తిని కల్గి ఉండడం మొదలైన తగని కార్యాలను చేసిన నాకు,

**(దుర్లభమ్ భవతు)** - అలభ్యం అయితే కానీ, ఇచటి లోట్‌రూపం కామచారానుజ్ఞలో ప్రయోగింప బడింది.

**(త్వత్ప్రియాణామ్)** - దేవరవారి అభిమానానికి పాత్రమైన, మహనీయులకు, దేవరవారిపట్ల ప్రీతిని కల్గి ఉన్న మహాత్ములకు,

**(దూరతః వాసోఽపి స్యాత్)** - చాలా దూరంలో నివసించవలసిన స్థితి కల్గితే కల్గనీ-వారితో కలసి ఉండడం అనేది **"అడియార్‌కు ళ్ళాజ్ఞళుడన్ కూడువదు ఎన్నుకొలో!"** (భగవద్భక్తుల సమూహంతో కలువ గలిగేది ఎపుడో!) అనే రీతిలో పరమపురుషార్థం. దానికి విరుద్ధమైన, వారికి కడు దూరంలోని నివాసం సంభవిస్తే సంభవించనీ. **"అపి"** శబ్దప్రయోగం ద్వారా అటువంటి చోట నివాసం చాలా హేయమైనది- అనే భావం ధ్వనిస్తుంది. ఇటువంటి అత్యంతం హేయమైన, అనపేక్షితమైన విషయం కంటే ప్రస్తావించబోయే విషయం మంచిదే. ఇందువల్ల **"యుష్మత్పదాబ్జమ్"** అని అంటూ గతశ్లోకంలో అభిలషింపబడిన తదీయప్రాప్తి వరవరముని భక్తులతో కలయిక) కంటె కూడా ప్రస్తుతించబోయే విషయం అభిప్రేతతమమని భావం. అయితే మీకు అభిమతమైన ఆవిషయం ఏమి? అంటే -

**(యే పునః)**- ఎవరైతే- అని అర్థం. ఇటువంటివారి స్మరణకూడా **"కశ్చిత్"** అనే రీతిలో తమకు దుస్సహం- అనే భావాన్ని ధ్వనింపచేయడం కోసం నామరూపాదుల నిర్దేశం లేకుండా నిర్విశేషప్రయోగం చేయబడింది. **"పునః"** శబ్దంద్వారా వారి దుర్గతియొక్క పరమావధి మాటలకు (మనస్సుకు కూడా) అందనిది - అవ్యపదేశ్యులు కదా వారు - అని స్ఫురిస్తుంది.

**(త్వద్వైముఖ్యాత్)** - పరమకారుణికులు, పరమప్రాప్యభూతులు, పరమసులభులు, పరమ వాత్సల్యాన్ని కలవారైన దేవరవారు - అనే అర్థం సర్వనామపదలబ్ధం. అటువంటి తమ విషయంలో ప్రీతి లేకపోయినా, కనీసం అద్వేషం -ద్వేషం లేకుండా ఉండే మధ్యస్థస్థితి ఉన్నా చాలు. అదికూడా లేనందువల్ల -అని భావం.

**(విఫలజనుషః యే)** - విఫలశబ్దానికి విరుద్ధమైన ఫలమనే అర్థం వివక్షితం. ఫలాభావం సంభవించినా మంచిదే. కాని, విరుద్ధమైన ఫలాన్ని కల్గినవారెవరో, వారు - అని భావం. శ్రీవరవరమునులపట్ల ఆభిముఖ్యాన్ని లేనందువల్ల వారికి ప్రాప్తమైన ఫలం కల్గకపోవడమే కాక, సత్తానాశంకూడా సంభవిస్తుంది- అనే విరుద్ధఫలప్రాప్తిని ఈప్రయోగం స్ఫురింపజేస్తున్నది.

**(ఏషామ్)**- ఇటువంటి వ్యర్థజన్ములకు,

**(తూర్ణం దూరీభూతః)** - **"తురతే అనే నేతి తూర్ణమ్, తుర-త్వరణే"** అని తూర్ణశబ్ద వ్యుత్పత్తి. వేగంగా దూరంగా తొలగి పోయినవాడనై -అని భావం. **"ఏషాం తూర్ణమ్"** అని అన్నందువల్ల అటువంటివారి సమీపంలోని స్థితి ప్రస్తుతం నాకు ఉన్నది- అనే భావం ధ్వనిస్తున్నది. ఇది యుక్తమే. **"వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మామపి స్పృశ, త్వయి మే గాత్రసంస్పర్శః చంద్రే దృష్టిసమాగమః"** (ఓ వాయుదేవా! నాప్రేయసి ఎక్కడ ఉన్నదో అక్కడ వీచి, ఆమెను స్పృశించి, తరువాత నన్ను కూడా స్పృశించు. నాప్రేయసిని స్పృశించిన నీవు నన్ను తాకడంవల్ల, నీ ద్వారా ఆమె స్పర్శను పొందగలను. అదేవిధంగా మా ఇరువురి చూపుల కలయిక చంద్రునిలో జరుగుతుంది. ఆమె చూచిన చంద్రుని నేనుకూడా చూడడంవల్ల మా ఇరువురి చూపుల సమాగమం చంద్రునిలో సంభవిస్తుంది), అని అంటూ అనుకూలమైన వాయువు, ఆతపం (గాలి, ఎండ) మొదలైనవాని సంపర్కం శ్రీరామునకు అనుకూలమైనపుడు, తుల్యన్యాయం ప్రకారం, ప్రతికూలవాతాదుల సంపర్కం (సీతాదేవి స్పర్శతో కలవని వాతాదుల సంపర్కం) శ్రీరామునకు ప్రతికూలమని సిద్ధిస్తుంది కదా! అదే రీతిలో ఇక్కడ కూడా అన్వయించుకోవాలి. 'దూరంగా తొలగినవాడను కాగలను'' అని అన్నందున ప్రస్తుతం ప్రతికూల సహవాసం దాపురించింది'' అనే బాధ ధ్వనిస్తున్నది- అని అనడంలో విప్రతిపత్తి లేదుకదా!

**(పూర్ణకామో భవేయమ్)** - సకలపురుషార్థసిద్ధిని పొందినవాడను- కాగలను. అభిలషితపురుషార్థాలు- శ్రీవరవరమునుల విషయంలో ఆభిముఖ్యం, వారి విషయంలో ప్రీతి, వారి కల్యాణగుణాలను ధ్యానించడం ద్వారా దేహధారణం, వారితో సమాగమం, వారి దాసులతో కలయిక - అని ఈవిధంగా అనేకం. ఇవి ఉత్తరోత్తరం గొప్పవి. ఇవి అన్నీ లభిస్తే ఎంత ఆనందం కల్గుతుందో, అంత ఆనందం పూర్తిగా నాకు దేవరవారికి విముఖులుగా ఉండేవారు ఏనాడూ రాలేని దుర్గమమైన గుహలో ఉండగల్గితే లభిస్తుంది- అనిహార్దభావం.

శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో ప్రపన్నదినచర్యను నిరూపిస్తూ, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు. **"అనుకూలసహవాసమమ్, ప్రతికూల సహవాసనివృత్తియుమ్"** అని పల్కడం, ప్రతికూలసహవాసనివృత్తిని గూర్చి **"ప్రతికూలరాకిఙార్"** అని ఆరంభించి (263వ సూత్రంనుండి ఆరంభించి, 273వ సూత్రం వరకు) నిరూపించిన విశేషాలు, ఈ సూత్రాలకు విశదవాక్ శిఖామణి శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం ప్రకృతంలో అనుసంధేయాలు. అంతేకాక వీటికి అన్నిటికిమూలంగా తిరువాయ్మొழிలోని **"పయిలుమ్ శుడరొళి"** (3-8) శదకం **"నెడుమాఱ్కడిమై"** (8-10) దశకం **"నణ్ణాద"** (2-6) అనే పెరియతిరుమొழி ప్రబంధ దశకం, **"తేట్టరుమ్"** అనే పెరుమాళ్తిరుమొழி ప్రబంధంలోని రెండవ దశకం - ఇత్యాదుల ప్రమేయం కూడా అనుసంధేయం.

77. అవ :- గడచిన శ్లోకంలో **"త్వద్వైముఖ్యాత్ విఫలజనుషో యే పున స్తూర్ణమేషాం దూరీభూతః క్వచన గహనే పూర్ణకామో భవేయమ్"** అని అంటూ శ్రీవరవరమునులను ద్వేషించే వారు ప్రవేశించలేని గహనంలో నివసించాలి - అని అన్నారుకదా! గహనమంటే - గుహ అని భావిస్తే, గుహలలో సింహాలు,

పులులు మొదలైన ప్రాణాలు తీసే క్రూరమృగాలు ఉంటాయి. లేక, గహన శబ్దానికి లోపలకు ప్రవేశించడానికి వీలు కాని ముళ్ళ పొదలు - అని భావిస్తే, వాటిలో విషకీటకాలు, సర్పాలు మొదలైనవానివల్లగాని, కొన్ని సమయాలలో ఆ పొదలలో కార్చిచ్చు అంటుకొనే అవకాశం ఉన్నందున, ఆ దావాగ్నివల్ల గాని మీకు మరణపర్యంతమైన గొప్ప అపాయం జరుగవచ్చుకదా !''- అని మీరు అడుగవద్దు. ఇది అంతా దాసుడనైన నాకు, శ్రీవరవరమునుల పట్ల వైముఖ్యాన్ని కల్గిన వ్యర్థజన్ములతో కలసి ఉండడం కంటే అభిమతమే సుమా!- అని ఇందులో అంటున్నారు. స్వరూపనాశం స్వభావనాశం కంటే మేలుకదా !

**సింహవ్యాఘ్రౌ సపది విపినే పన్నగః పావకో వా**
**కుర్యుః ప్రాణాంతకమపి భయం కో విరోధ స్తతో మే ।**
**నైతే దోషగ్రహణరుచయ స్త్వప్రియై ర్నిర్నిమిత్తైః**
**నానాజల్పై ర్వరవరమునే ! నాశయంత్యంతికస్థాన్ ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ !, విపినే = గుహలు, పొదలు నిండిన అరణ్యంలో, సపది= నేను ప్రవేశించిన వెంటనే, సింహవ్యాఘ్రౌ =సింహం గాని, పులిగాని, పన్నగః వా = సర్పం గాని, పావకః వా = అగ్నిగాని, ప్రాణ+అంతకమ్ భయమపి = ప్రాణాలు పోవడానికి కారణమైన మరణభయాన్ని, కుర్యుః = చేస్తే చేయవచ్చు, తతః = అందువల్ల, మే = నాకు, కః విరోధః= ఏమి విరోధం (ఆటకం)?, ఏతే తు = ఈ సింహం, పులి, పాము, అగ్ని మొదలైనవి అయితే, (శ్రీవరవరమునులను ద్వేషించేవారివలె), దోషగ్రహణరుచయః= దోషాలను చూచి గ్రహించడంలో అధికమైన ఆశను కల్గినవై, అప్రియైః= అందఱు గర్హించదగినవ, నిర్నిమిత్తైః = ఏ కారణం లేనివి (అసత్యాలైనవి) అయిన, నానాజల్పైః= పలు రీతులలోని, ముందు వెనుకలు విరోధాన్ని కల్గిన మాటలతో, అంతికస్థాన్ = తమ సమీపంలో ఉండే జనులను, న నాశయంతి= నశింపజేయడంలేదు.

వ్యాఖ్యానమ్ : ఈ శ్లోకం ద్వారా ఆత్మస్వరూప నాశాన్ని కల్గించే పాపిష్ఠివారు ఉండేచోట ఉండి నశించడం కంటే, ఆత్మనాశాన్ని కల్గించకుండా, కేవలం ప్రాణాలను మాత్రం తీసి, శరీరాన్ని నశింపజేసే సింహం, పులి, మొదలైన జంతువులు నివసించే గుహలు, పొదలు కల్గిన అరణ్యంలో నివసించడమే మేలు - అని తెలుపబడింది.

ఇందులోని మూడవ పాదంలో "అప్రియైః" అనే పదస్థానంలో "త్వత్ప్రియైః" అనే పాఠం ఉన్నది. అపుడు **"ఏతే త్వత్ప్రియైః సహ అంతిక స్థాన్ న నాశయంతి"** అని అన్వయించి, "సింహం, పులి మొదలైనవి ఇవి- నీపట్ల భక్తిని కలవారిని, భక్తిని గాని, పగనుగాని లేని తమ సమీపంలో ఉండే సాధారణ జనాలను నాశం చేయడం లేదు'' అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, **"త్వత్ప్రియైః నానాజల్పైః అంతికస్థాన్ న నాశయంతి"** అని అన్వయించి, దేవరవారికి ఇష్టమైన దేవరవారిని గూర్చిన పలుదోషోక్తులతో తమ సమీపంలో ఉండేవారిని నశింపజేయడంలేదు -అనే అర్థాన్ని చెప్పవచ్చు. "సత్పురుషులు- తమనుగూర్చి ఇతరులు దోషోద్భావనచేస్తే దానిని ఆదరిస్తారు''అనే మాటకు అనుగుణంగా, శ్రీవరవరమునులపై దోషాలను ఆరోపించి పరిహసించడం వారికి ఇష్టమే - అనే భావం కూడా అన్వయంలో గమనించదగినది.

**(వరవరమునే)** - ఓ వరవరమునీ!

**(విపినే)** - **"వేపంతేఽత్ర ఇతి విపినమ్"** దీనిపట్ల భయాన్ని పొందుతారు - అనే వ్యుత్పత్తిని కల విపినశబ్ద ప్రయోగంచేత దర్శనమాత్రంతో భీతిజనకత్వం తెలుపబడుతున్నది. అటువంటి దట్టమైన, భయంకరమైన కొండగుహలతో, ముళ్ళ పొదలతో నిండిన అరణ్యంలో - అని భావం.

**(సపది)** - నేను ప్రవేశించిన ఆక్షణంలోనే - అని అర్థం. **"సంపదయతే అస్మిన్"** అని దీని వ్యుత్పత్తి.

**(సింహవ్యాఘ్రౌ)** - **"హినస్తీతి సింహః"** అనే వ్యుత్పత్తి ద్వారా సింహం యొక్క హింసైకనిరూపణీయత్వం తెలుపబడుతున్నది. అంటే- దాని హింసాస్వభావత్వం స్పష్టమవుతున్నది. **"హినస్తీతి హింసః"** అనే వ్యుత్పత్తిని కల **"హింసః"** అనే పదమే వర్ణవ్యత్యయం ద్వారా **"సింహో వర్ణవిపర్యయాత్"** అనే సూక్తి ప్రకారం **"సింహః"** అని మారింది. ఈ వర్ణవ్యత్యయాన్ని భాషాశాస్త్రజ్ఞులు కూడా అంగీకరించారు. **"వ్యాజిఘ్రతి ఇతి వ్యాఘ్రః"**- కేవలం వాసనచూడడంతోనే హింసించగల్గినది, ప్రాణాలను తీయగల్గినది పెద్దపులి. **"వ్యాఘ్రాఘ్రాతమృగీ"** అనే ప్రయోగంకూడా ఇక్కడ స్మరణీయం. ఇటువంటి హింసాస్వభావాన్ని కల్గిన సింహం గాని, పులి గాని,

**(పన్నగః)**- దృష్టితో, విషశ్వాసతో, విషంతో- ఇంకా అనేకవిధాలుగా ప్రాణాలు తీసే సర్పాల ప్రకారాలు అనేకం.

**(పావకః వా)** - అగ్ని కాని - కార్చిచ్చు - అని అర్థం. **"వా"** శబ్దప్రయోగం ద్వారా వీటిలో ఏదో ఒక దానివల్లగాని, లేక, అన్నిటివల్ల గాని అపాయం కలుగవచ్చు- అనే వికల్ప, సముచ్చయాలు తెలుపబడింది.

**(ప్రాణాంతకమపి భయమ్)** - ప్రాణవియోగాన్ని కల్గించే భయాన్ని - అని అర్థం. అపిశబ్దంద్వారా ప్రాణహాని కూడా కలుగవచ్చుననే అనర్థశంక కూడా సముచ్చీకరింపబడింది.

**(కుర్యుః)** - కలుగజేయవచ్చు.

**(తతః)** - సింహవ్యాఘ్రాదులద్వారా కలిగే ప్రాణిహానివల్ల,

**(మే)** - దేవరవారి పట్ల విముఖులైనవారితో సహవాసం కల్గి ఉండడమనే దుఃఖాన్నిమాత్రం కల్గిన నాకు,

**(కో విరోధః)** - ఏమి విరోధం? విరోధంగా ఉండే ప్రయోజనం ఏమున్నది? సింహాదులవల్ల నాకు మరణం సంభవిస్తే, దేవరవారిని విరోధించేవారితో కలసి ఉండడంకంటే అది మేలయిన ప్రయోజనమే కాగలదు- అని భావం. లేక, దేవరవారిని విరోధించేవారికి దూరంగా ఉండాలనే నా పురుషార్థం సిద్ధించినదే కాగలదు. అందువల్ల పురుషార్థసిద్ధిలో ఏవిరోధం ఉన్నది? అని భావం. దేవరవారిలో లేని దోషాలను ఆరోపించడం గాని, అప్రియాలను జల్పించడంగాని, నిర్హేతుకంగా జల్పించడంగాని- ఇవి ఏమీ సింహాదులవల్ల ఉండవుకదా!

**(నైతే తు)** - ఈ సింహవ్యాఘ్రాదులు అయితే - అని అర్థం. **"తు"** అనే పదం శ్రీవరవరమునులకు విముఖులైన వ్యర్థజన్ములకంటే సింహవ్యాఘ్రాదులకు గల వైలక్షణ్యాన్ని సూచిస్తుంది.

**(దోషగ్రహణరుచయః సంతః)** - శ్రీవరవరమునులపట్ల విముఖులైనవారివలె వరవరమునుల దోషాలను తెలిసికోవడంలోనే ఎక్కువ అభినివేశాన్ని కల్గినవై - అని అర్థం. రుచిశబ్దం అభినివేశాతిశయ వాచకం.

**(అప్రియైః)** - సమస్తజనుల ద్వేషానికి విషయాలైన- అందఱికి అప్రియాలుగా ఉండే, అసత్యాలైన- అళీకాలైన- అని తాత్పర్యం. **"అళీకం త్వప్రియేఽనృతమ్"** అని కోశవచనం.

**(నిర్నిమిత్తైః)** - ఏదైనా ఒక శబ్దాన్ని ప్రయోగించడానికి నిమిత్తం -కారణం అర్థమే కదా. ఆవిధంగా ఏకారణం లేని- అని అర్థం.

**(నానాజల్పైః)** - ముందుమాటకు వెనుక మాటకు సంబంధం లేని జల్పనాలతో - అని భావం. ఇచటి బహువచనంద్వారా ఈవిధమైన జల్పనం ఒకసారి కాదు, పలుమార్లు చేయబడుతున్నవి- అని తెలుపబడుతున్నది. **"జల్పాకస్తు... బహుగర్హ్యవాక్"** - అని మిక్కిలి నిందించదగిన పలువాక్కులను పలికేవాడు కదా జల్పాకుడు. అతని మాటలే జల్పాలు.

**(అంతికస్థాన్)**- తన సమీపంలో ఉండేవారిని,

**(న నాశయంతి)**- స్వరూపనాశాన్ని కల్గించడం లేదు. కాని, శ్రీవరవరముని విముఖులు మాత్రం స్వరూపనాశాన్ని కల్గిస్తున్నారని భావం. **"అఙ్జుపొరుళు మఱిత్తవన్‌పాల్ అన్బిలార్ నఞ్జిల్ మికక్కొడియర్, నామ్ శొన్నోమ్, నఞ్జుదాన్ ఊనై ముడిక్కుమ్, ఇవర్ ఉయిరైముడిప్పర్"** (అర్థపంచకాన్ని ఉపదేశించిన ఆచార్యునిపట్ల ప్రేమ లేనివారు విషంకంటే క్రూరులు. ఎందుకంటే - విషం కేవలం శరీరాన్ని మాత్రమే నశింపజేస్తుంది. వీడు ఆత్మను కూడా నశింపజేస్తాడు) అనే సప్తగాథై ప్రబంధ పాశురార్థం స్మరణీయం. (పాశురంలోని **"ఇవర్"** అనే బహువచనం వ్యతిరేకలక్షణలో నిందావాచకం)

**"త్వత్ప్రియైః"** అనే పాఠాంతరంలో- ఆ పదాన్ని **"జల్పైః"** అనే పదానికి విశేషంగా చేసి, "దేవరవారికి ప్రియమైన జల్పాలు''- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"వృత్త్యా పశుః"**, **"కూరాధినాథ"** అనే యతిరాజవింశతిలోని రెండు శ్లోకాలలో ప్రస్తావింపబడిన నైచ్యానుసంధానాన్ని చేసిన దేవరవారికి మిమ్ములను విరోధించేవారు నిర్నిమిత్తంగా మీమీద దోషారోపణలు చేసినా, అవి మీకు ప్రియమే కాగలదు- అని తాత్పర్యం. ఇతరులు తనలో దోషాలను ఆరోపించి పల్కడం మహాత్ములకు అభిమతమే కదా! - **"పరై ర్దోషోక్తిలాభ శ్చేత్ వయం జీవనలాభినః"** అని చెప్పబడుతున్నది కదా! (పరులు మనలో దోషాన్ని ఆరోహించి పల్కడమనే లాభం కల్గితే, మన ఉజ్జీవనాన్ని పొందిన వారం కాగలము)

శ్లోకంలో గల **"దోషగ్రహణరుచయః"** అనే ప్రయోగంలోని **"రుచి"** శబ్దంచేత దోషాభావప్రయుక్తమైన తద్గ్రహణాభావం ధ్వనిస్తున్నది. అంటే - సింహాదులు, దోషాలు ఉంటేనే వాటిని గ్రహిస్తాయి - అని, శ్రీవరవరముని విరోధులవలె లేని దోషాలను ఉద్భావించి ఆరోపించరని ధ్వనిస్తున్నదని భావం.

**78.** అవ :- ఇంతకుముందు **"దీనే పూర్ణామ్"** అనే 75వ శ్లోకంలో ఇష్టప్రాప్తిని, **"త్వత్పాదాబ్జమ్"** 76వ శ్లోకంలో అనిష్టనివృత్తిని ప్రార్థించారు. **"సింహవ్యాఘ్రౌ"** అనే 77వ శ్లోకం **"త్వత్పాదాబ్జమ్"** అనే శ్లోకంలో ఏర్పడిన ఒక సందేహానికి సమాధానరూపంగా ప్రాసంగికంగా ఉద్భవించింది. ఈ విధంగా ప్రాసంగికంగా ప్రధాన విషయానికి సంబంధించిన విషయాంతర ప్రస్తావన ప్రమితాధికరనాదులలో గమనించవచ్చు. భగవద్విషయం ఈడు వ్యాఖ్యలో కూడా ఈ క్రమం గోచరిస్తుంది. ఈ శ్లోకంలో - శ్రీవరవరమునుల వద్ద తమ ఇష్టాన్ని ప్రార్థించడం కంటే, వారికి చరమపర్వంలో దాసుడైన మహాపురుషునివద్ద ఇష్టప్రాప్తిని ప్రార్థించడం గొప్పది - అని అంటున్నారు.

> **త్వద్భృత్యానా మనుభజతి య స్సర్వతో భృత్యకృత్యం**
> **తద్భృత్యానా మనుభజతి య స్తాదృశం ప్రేష్యభావమ్ ।**
> **మద్భృత్యోఽ సావితి మయి స చేత్ సానుకంపై రపాంగైః**
> **క్షేమం కుర్యాత్ వరవరమునే! కింపునః శిష్యతే మే ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ !, యః= ఎవడు, త్వత్+భృత్యానాం = దేవరవారి దాసుల దాసుల దాసునకు, భృత్యకృత్యం = దాస్యాన్ని, సర్వతః= మనోవాక్కాయాలనే మూడు విధాలైన రీతులలో, అనుభజతి = చేసేవారిని అనుసరించి చేస్తున్నాడో, తత్ భృత్యానాం = అతని దాసుల దాసుల దాసునకు, తాదృశం = అటువంటి మనోవాక్కాయ రూపాలలోని, ప్రేష్యభావం = కైంకర్యాన్ని, యః= ఎవరు, అభిలషతి = చేయాలని కోరుతున్నాడో, సః= అటువంటి మహాపురుషుడు, మయి = నా విషయంలో, అసౌ మద్భృత్యః= "ఇతడు నా భృత్యుడు'', ఇతి = అని, సానుకంపైః అపాంగైః= దయతో కూడిన కటాక్షాలతో, క్షేమం = దాసుడనైన నాకు దేవరవారి పట్ల ఇపుడు ఏర్పడిన భక్తియొక్క రక్షణను, కుర్యాత్ చేత్= చేసేవారు అయితే, మే = ఉండే భక్తియొక్క రక్షణను పొందిన నాకు, కిం శిష్యతే =ఇక ప్రార్థించవలసిన ఏ అంశం మిగిలి ఉన్నది ? (ఏమీ లేదు)

**వ్యాఖ్యానమ్ :** మొదటి పాదంలోని **"తద్భృత్యానామ్"** అనే ప్రయోగం శ్రీవరవరమునుల దాసులను ముగ్గురిని నిర్దేశిస్తుందని తెలియాలి. ఈ ముగ్గురు సాక్షాత్తుగా శ్రీవరవరమునులకు దాసులు కారు. (1) శ్రీవరవరమునులకు సాక్షాత్తు దాసులొకరు, (2) వారి దాసులు ఇంకొకరు (3) వారికి దాసులు ఇంకొకరు- కనుక, ఇంతవరకు నేరుగాను, పరంపరగాను శ్రీవరవరమునుల భృత్యులు ముగ్గురు **"త్వద్భృత్యానామ్"** అన అనడంద్వారా నిర్దేశించారు. **"యః భృత్యకృత్యమ్ అనుభజతి"** అనే ప్రయోగాన్ని **(4) "యః భృత్యకృత్యం భజతి"** అని, **(5) "భజంతమ్ తమ్ అనుసృత్య భజతి"** అని రెండు వాక్యాలుగా గ్రహించి, ముందు పల్కిన వారిలోని మూడవ భృత్యునకు దాస్యం చేసేవారెవరో, వారిని అనుసరించి వారికి దాస్యం చేసేవారెవరో- అనే అర్థాన్ని గ్రహిస్తే, శ్లోకంలోని మొదటి పాదంలో వరుసగా అయిదుగురు నిర్దేశింపబడినట్లు స్ఫుటమవుతున్నది.

ఇక, రెండవ పాదంలోని **"తత్ భృత్యానామ్"** అనే ప్రయోగంలో **"తత్"** అనే పదంతో మొదటి పాదంలో నిర్దేశింపబడిన భృత్యులవరుసలో అయిదవ భృత్యుని నిర్దేశించి, **"భృత్యానామ్"** అనే పదంతో ఆ అయిదవ భృత్యునకు (6) సాక్షాత్ భృత్యుడు, (7) అతనికి భృత్యుడు, (8) అతనికి భృత్యుడు- అని ముగ్గురు నిర్దేశింపబడ్డారు. ఈవిధంగా ఇంతవరకు శ్రీవరవరముని భృత్యులకు ఎనిమిదిమంది వరుసగా నిర్దేశింపబడినట్లయింది. ఇక, **"తత్ భృత్యానాం ప్రేష్యభావం యః అభిలషతి సః"** అనే ప్రయోగంతో (9) ఆ ఎనిమిదవ భృత్యునకు దాస్యం చేయాలని ఎవరు ఆశపడుతున్నారో, వాడు- అని తొమ్మిదవ భృత్యుడు నిర్దేశింపబడ్డారు. **"సః మయి క్షేమం కుర్యాత్"** అటువంటివారు దాసునకు క్షేమాన్ని కల్గించాలి- అని అనడంవల్ల వరుసలో శ్రీవరవరమునులకు పదియవ భృత్యునిగా తాము ఉండాలని ఎఱుమ్బియప్పా ఆశపడ్డారు- అని ఈశ్లోక తాత్పర్యంగా గ్రాహ్యం.

కులశేఖరులు ముకుందమాలలో **"(1) త్వద్భృత్య (2) భృత్య (3) పరిచారక (4) భృత్య (5) భృత్య (6) భృత్యస్య (7) భృత్య ఇతి మాం స్మర"** అని అంటూ ప్రథమపర్వంలో తమతో కలుపుకొని ఏడు పర్వాల క్రమంలోని శేషత్వాన్ని ప్రార్థించారు. నమ్మాళ్వార్లు తిరువాయ్మొళిలోని **"అడియార్న్ద వైయ ముణ్డు ఆలిలై అన్నవశమ్ శెయ్యుమ్ పడియాదు మిల్ కుళవిప్పడి ఎన్దై పిరాన్ తనక్కు, (1)అడియార్, (2), అడియార్ తమ్, (3) అడియార్, (4) అడియార్ తమక్కు, (5) అడియార్, (6) అడియార్ తమ్, (7) అడియార్, (8) అడియోఙ్గళే"** -అనే పాశురంలో దాస్యపరంపరలో తమను ఎనిమిదవ దాసునిగా భావించారు.

వేదాంతదేశికులు పాదుకాసహస్రంలోని సమాఖ్యాపద్ధతిలోని 26వ శ్లోకంలో **"యస్సప్తపర్వ్యవధాన తుంగాం శేషత్వకాష్ఠా మభజన్మురారేః, తస్యాపి నామోద్వహనాత్ త్వయాஉసౌ లఘూకృతోஉభూత్ శఠకోపసూరిః"** (ఏ మహానుభావులు ఏడు పర్వాలను కల్గిన పరంపరలో గొప్పదైన భగవచ్ఛేషత్వంలోని పరాకాష్ఠను- అంటే- తాము ఎనిమిదవ శేషభూతునిగా ఉండే స్థితిని పొందారో, ఆ శఠకోపులనబడే నమ్మాళ్వార్ల **"శ్రీశఠకోపన్"** అనే తిరునామాన్ని నీవు కల్గి ఉన్నందున, ఓ భగవానుని పాదుకా!, నీచే ఆ నమ్మాళ్వార్లు నామాన్ని కల్గి ఉండి, తద్వారా వారికి కూడా శేషమై ఉండడమనే తొమ్మిదవ పర్వం రూపంలోని శేషత్వాన్ని పొందావు - అని పల్కినందున, ఆళ్వార్లకంటే పాదుక శేషత్వంలో ఉన్నతమైనది.

ఇక, ఎఱుమ్బియప్పా అయితే, తమను శ్రీవరవరమునులకు శేషత్వపరంపరలో పదియవ శేషభూతునిగా భావించినందున నమ్మాళ్వార్లు భగవత్పాదుకలు - అనేవీటి కంటే ఎఱుమ్బియప్పా శేషత్వక్రమంలో గొప్పవారని స్ఫురిస్తుంది. ఇంతేకాక, ఆళ్వార్లు, పాదుక - ప్రథమపర్వమైన భగవానుని ఉద్దేశించిన శేషత్వకాష్ఠను ఆశపడగా, వీరు చరమపర్వమైన మణవాళమహామునులనుగూర్చిన శేషత్వ కాష్ఠను ఆశపడినందునకూడా వీరి మహిమ వారి మహిమకంటే అతిశయించింది - అనేది స్ఫుటం.

**(యః)-** ఏ మానవుడు,

**(త్యద్భృత్యానామ్)** - చరమశేషి, చరమోపాయం, చరమప్రాప్యమైన దేవరవారికి పరిజనభూతులైన వారియొక్క- అని అర్థం. దీనిద్వారా జన్మవృత్తాదులు ఏవీ కైంకర్యం చేయడానికి ఆవశ్యకాలు కావు- అని తెలుస్తున్నది.

**(సర్వతః)** - అందటికి- కళత్రపుత్రసహితులైన దేవరవారి భృత్యులకు- అని అర్థం. లేక, భిన్నభిన్న వర్ణాలకు, ఆశ్రమాలకు చెందినవారనే అర్థాన్ని గ్రహించవచ్చు. లేక, సమస్తభృత్యకృత్యాలనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. సార్వవిభక్తికమైన **"తసిల్"** ప్రత్యయం ద్వితీయావిభక్తిలోకూడా వస్తుంది. పాదసంవాహనం, వాచిక కైంకర్యం మొదలైన సకలమైన అంతరంగ కైంకర్యాలు- అని తాత్పర్యం. లేక, **"సర్వతః"** అనే పదానికి "అన్నిటికంటే" అనే పంచమీ విభక్త్యర్థాన్ని చెప్పి, లోకంలో ప్రసిద్ధమైన సమస్తభృత్యకృత్యం కంటే విలక్షణమైన భృత్యకృత్యాన్ని -అనే అర్థాన్ని **"సర్వతః భృత్యకృత్యమ్"** అనే ప్రయోగానికి చెప్పవచ్చు. **"సర్వతః"** అనే పదానికి- అన్ని ప్రదేశాలలో- అని కూడా అర్థం. ఇది సర్వదేశ- సర్వకాలాదులకు కూడా ఉపలక్షణం. తంత్రేణ ఈ అర్థాలను అన్నిటినీ గ్రహించవచ్చు.

**(అనుభజతి)**- సర్వదేశ - సర్వకాల - సర్వావస్థోచిత కైంకర్యాన్ని చేసేవారిని అనుసరించి చేస్తున్నాడో- అని అర్థం. ఆచార్యశ్రీహస్త పురస్సరంగా కదా ఆరాధన చేయాలి.

**(తద్భృత్యానామ్)** - ఆ మహాత్ముని భృత్యులు ఎవరో, వారికి,

**(తాదృశం ప్రేష్యభావమ్)** - వారికి అధీనమైన ప్రవృత్తిని కల్గి ఉండే స్థితిని - అని అర్థం. **"ప్రేష్య"** శబ్దం అతినీచమైన దూత్యవృత్తిని కూడా పరమోపాదేయంగా భావించడం తెల్పుతున్నది.

**(యః అభిలషతి)**- ఎవరు మిక్కిలిగా, పూర్తిగా కోరుతున్నాడో- అని అర్థం. **"తాదృశమ్"** అనే ప్రయోగంచేత ఆ ప్రేష్యభావం **(దాసవృత్తి)** నిరతిశయపురుషార్థమనే విశేషం వ్యక్తమవుతున్నది. **"అభిలషతి"** అనే పదంచేత దాని దౌర్లభ్యం సూచింపబడింది. దుర్లభమైన విషయమే కనుక, అభిలాషకు విషయమైన (లక్ష్యమైన) వస్తువుయొక్క పరమగౌరవం కూడా వ్యక్తమవుతుంది.

**(సః)** - ఆవిధంగా అభిలషించే మహాపురుషుడు,

**(మయి)**- నా విషయంలో,

**(అసౌ మద్భృత్య ఇతి)**- "ఇతడు నా భృత్యుడు"- అనే రూపంలోని,

**(సానుకంపైః అపాంగైః)**- దయతో కూడిన కటాక్షపరంపరలతో,

**(క్షేమం కుర్యాత్ చేత్)**- క్షేమాన్ని కల్గిస్తే- అని అర్థం. స్థితస్య రక్షణం క్షేమమనబడుతుంది. అంటే- అనిష్టనివృత్తి. **"క్షిణోత్యశుభమితి క్షేమమ్"**- అశుభాన్ని పోగొట్టేది క్షేమం.

**(మే కిం పునః శిష్యతే)** అంతకుమించి ఇక నాకు ఏమి కావాలి? ఇక్కడ ప్రస్తుతమైన క్షేమం ఏమంటే - తాము పొందిన శ్రీవరవరమునుల విషయంలోని ప్రావణ్యాన్ని కోల్పోకుండా రక్షించడమే.

దీనిని నాకు చేస్తే, ఇక నేను ప్రార్థించదగినది ఏదీ లేదని భావం. దేవరవారిని ప్రార్థించినా, దేవరవారి భృత్యుల విషయంలో చేయవలసిన ప్రార్థన మిగిలి ఉంటుంది. దేవరవారికి శేషత్వపరాకాష్ఠలో సుప్రతిష్ఠితంగా ఉండే మహాపురుషుడే నా రక్షణభారాన్ని (క్షేమాన్ని) వహిస్తే, ఇక నాకు ప్రార్థించవలసినది ఇంకొకటి ఏమున్నది?- అని తాత్పర్యం.

శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వారు ఈ శ్లోకానికి సంస్కృత వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన రీతి అత్యంతం హృదయంగమం, సహృదయ హృదయైకవేద్యం.

**79.** అవ :- తమకు గల అన్యథాజ్ఞానం మొదలైన దోషాలను, శ్రీవరవరమునులతో కలసి ఉన్నపుడు సుఖం, విశ్లేషంలో దుఃఖం కల్గడానికి కారణమైన హృదయమార్దవాన్ని వివరిస్తూ, శ్రీవరవరమునుల సన్నిధిలో తమకు ఆ స్థితులను కల్గించే బుద్ధి (భక్తి) యోగాన్ని అనుగ్రహించవలసినదని ప్రార్థిస్తున్నారు.

**క్వాఽహం క్షుద్రః కులిశహృదయో దుర్మతిః క్వాఽత్మచింతా**
**త్రయ్యంతానా మసులభతరం తత్పరం క్వాఽత్మతత్త్వమ్ ।**
**ఇత్థంభూతే వరవరమునే! యత్పున స్స్వాత్మరూపం**
**ద్రష్టుం తత్తత్ సమయసదృశం దేహి మే బుద్ధియోగమ్ ॥**

వరవరమునే = ఓ వరవరమునీ!, క్షుద్రః = దుష్కార్యాలను చేసే నీచుడనై, కులిశహృదయః = వజ్రంవంటి కఠినమైన మనస్సును కలవాడనై, దుర్మతిః = అన్యథా జ్ఞానాదులతో నిండినవాడనైన, అహం = నేను, క్వ = ఎక్కడ, ఆత్మచింతా = శరీరం కంటే విలక్షణమైన ఆత్మనుగూర్చిన విచారం, క్వ= ఎక్కడ, త్రయ్యంతానాం = వేదాంతాలకు, అసులభం = తెలియరానిది, తత్ = అటువంటి (అనిర్వచనీయమైన), పరం = గొప్పదైన, ఆత్మతత్త్వం = దేవరవారి యథార్థతత్త్వం, క్వ = ఎక్కడ, ఇత్థం భూతే సతి = ఈవిధంగా ఉండగా, స్వ+ఆత్మరూపం =దాసుడనైన నా యథార్థతత్త్వమైన చరమశేషత్వం, దేవరవారి యథార్థతత్త్వమైన శేషిత్వం - అనేవి, యత్ పునః అస్తి = ఏది అయితే ఉన్నదో, తత్ = ఆ రెండిటిని, ద్రష్టుం = సాక్షాత్కరించడానికి అనువుగా, తత్తత్ సమయసదృశం = ఆయా కాలాలకు తగినది అయిన, బుద్ధియోగం = బుద్ధివిశేషమైన భక్తి అనే ఉపాయాన్ని, మే = దాసుడనైన నాకు, దేహి= అనుగ్రహించాలి.

శ్రీవరవరమునులను గూర్చిన శేషత్వంలో చరమపర్వంలో ఉండే తమ యథార్థస్వరూపాన్ని, తమను గూర్చిన శేషిత్వంలో చరమపర్వంలో ఉండే శ్రీవరవరమునుల యథార్థస్వరూపాన్ని మనస్సుతో సాక్షాత్కరించుకోవాలి - అంటే, దానికి అనువుగా శ్రీవరవరమునుల విషయంలో భక్తి కల్గి ఉండాలి. ఇక్కడ భక్తి అంటే - శ్రీవరవరమునులతో కలసి ఉంటే సుఖాన్ని, విశ్లేషించినపుడు దుఃఖాన్ని పొందేటట్లుగా తమ మనస్సులో మార్దవాన్ని కల్గి ఉండే స్థితి. అటువంటి మనోమార్దవానికి విరుద్ధమైన వజ్రాయుధంవంటి కఠినమైన మనఃస్థితియే తమకు ఉన్నది. దీనికి కారణం - తాము నీచులై ఉండడం, అన్యథా జ్ఞానాదులకు ఆశ్రయభూతులై ఉండడమే. దీనివల్ల తమకు, శ్రీవరవరమునులయొక్క యథార్థతత్త్వాన్ని తెలియలేని

స్థితి కల్గింది. అందువల్ల ఆవిధంగా దానిని సాక్షాత్కరించుకోవడానికి కావలసిన భక్తి శ్రీవరవరమునుల విషయంలో తమకు కలగాలి - అని వారినే ఉద్దేశించి స్తుతికర్త ప్రార్థిస్తున్నారు - ఈ శ్లోకంలో. మహాభారతం ఉద్యోగపర్వంలోని **"శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దనమ్"** (మనస్సులో శుద్ధమైన భావనను కలవాడనై, భక్తి పురస్కృతమైన శాస్త్రం ద్వారా జనార్దనుని తెలిపికొంటున్నాను - అని అర్థం. కేవలం శాస్త్రం చాలదు. అది భక్తితో సంస్కరింపబడినపుడే భగవత్ సాక్షాత్కారం లభిస్తుందని భావం) అనే ప్రథమపర్వానికి సంబంధించిన సూక్త్యర్థం ప్రకృతంలో చరమపర్వంలో అనుసంధింపబడింది. తత్త్వయాథాత్మ్య జ్ఞానం కలగాలంటే కేవల శాస్త్రసహాయం చాలదు. భక్తికూడా కావాలి ఆ నియమం చరమపర్వంలో కూడా వర్తిస్తుంది. **"పత్తుడై అడియవర్క్కెళియన్ పిఱర్ కళ్కుు అఱియవిత్తకన్"** (భక్తిని కల దాసులను సులభుడు, ఇతరులకు తెలియడానికి వీలుకానివాడు) అనే సూక్తి ఇక్కడ కూడా అన్వయిస్తుంది.

వ్యాఖ్యానమ్ : (క్షుద్రః)- **"క్షుద్రః స్యాదధమః క్రూర కృపణాఖ్యేషు వాచ్యవత్"** అనే నిఘంటువచనంలో చెప్పబడిన అర్థాలు, **" సోఽహం క్షుద్రతయా జుగుప్సితతమం దుష్కర్మ నిత్యం స్మరన్ కుర్వన్ కామమ్"** (నేను క్షుద్రుడనైనందున చాలా నీచమైన పనులను గూర్చి భావిస్తూ, వానినే యథేచ్ఛంగా చేస్తూ) అనే అభిజ్ఞసూక్తి స్మరణీయం. అత్యంతం నిహీనమైన కృత్యాలను చేయడంవల్ల చాలా అల్పుడను - అని తాత్పర్యం.

**(కులిశహృదయః)** - వజ్రంవలె చాలా కఠినమైన హృదయాన్ని కలవాడను,

**(దుర్మతిః)** - అన్యథాజ్ఞానాదులతో పూర్ణుడనైన,

**(అహం క్వ)** - నేను ఏ రీతిలో ఉన్నాను?

**(ఆత్మచింతా)** - దేహంకంటే విలక్షణమైన ఆత్మయొక్క స్వరూపాన్ని నిరూపించడం అనేది,

**(క్వ)** - ఎటువంటి రీతిలోనిది?

**(త్రయ్యంతానా మసులభతరమ్)** -వేదాంతాలకు కూడా చాలా దుర్లభం. ప్రథమపర్వం. **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (భగవానుని ఆనందగుణాన్ని తెలియాలని ప్రయత్నించిన వేదాలు దానిని కనుగొనలేక మనస్సుతో పాటు వెనుకకు తిరిగాయి) అని, **"నాన్మఱైకళ్ తేడి యోడుమ్ శెల్వన్"** (నాల్గు వేదాలు అన్వేషించి తెలియలేని సంపద్రూపుడు) అని చెప్పబడిన రీతిలో అసులభం. ఇది అసులభతరం. అత్యతందుర్లభమని భావం. ప్రథమపర్వాత్మకాలైన ఈసూక్తులు చరమపర్వంలో అనుసంధింపబడ్డాయి.

**(తత్)** - అటువంటి వాచామగోచరమైన మహిమను కల,

**(పరమ్)** - సర్వవిలక్షణమైన,

**(ఆత్మతత్త్వమ్ క్వ)** - ఇక్కడ **"ఆత్మన్"** శబ్దం శ్రీవరవరమునులను నిర్దేశిస్తుంది. దేవరవారి యథార్థతత్త్వం ఎక్కడ? ఏ రీతిలోనిది? - అని భావం.

**(ఇత్థంభూతే)** - ఈవిధంగా ఉండగా - అంటే - హృదయకాఠిన్యాదులను కల్గిన నేను జ్ఞాతృత్వ యోగ్యతను లేనివాడనై ఉండగా, దేహాత్మ వైలక్షణ్యం (దేహం - ఆత్మ అనేవి పరస్పర విలక్షణమైన స్వరూప స్వభావాలను కల్గినవి - అనే విషయం) తెలియరానిదై ఉండగా, నిర్దోషప్రమాణమైన వేదానికికూడా తెలియడానికి సాధ్యం కానిది అయిన దేవరవారి తత్త్వయాథాత్మ్యజ్ఞానం అత్యంతం దుర్జ్ఞేయమై ఉండగా- అని తాత్పర్యం.

**(యత్పునః స్వాత్మరూపమ్)** ఇక్కడ **"స్వ"**, **"ఆత్మన్"** శబ్దాలు స్తుతికర్త అయిన ఎఱుమ్బియప్పాను, శ్రీవరవరమునులను నిర్దేశిస్తాయి. నాయొక్క, దేవరవారియొక్క యథార్థస్వరూపాన్ని - అని అర్థం. చరమశేషిత్వాది రూపమైన దేవరవారి ఆకారం, చరమశేషత్వాదిరూపమైన దాసుని ఆకారం - అనేది ఏది ఉన్నదో- అని తాత్పర్యం. **"త్వత్"** అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. నా యథార్థస్వరూపాన్ని, దేవరవారి యథార్థస్వరూపాన్ని,

**(సాక్షాత్కర్తుమ్)** సాక్షాత్కరించుకోవడానికి,

**(తత్తత్ సమయసదృశమ్)** - దేహాత్మాభిమానం, కాలం మొదలైనవాని రూపంలో ఆయా సమయాలకు అనుగుణంగా.

**(బుద్ధియోగం)** - భక్తి - అనే పేరును కల ఉపాయాన్ని -దేవరవారితో కలసి ఉన్నపుడు సుఖాన్ని, విశ్లేషించినపుడు దుఃఖాన్ని పొందే రీతిలోని పరమప్రాప్యమైన దశావిశేషం. పరమభక్తిదశ - కల్గడానికి సాధనమైన భక్తి అనే ఉపాయాన్ని - అని భావం. **"యోగః సన్నహనోపాయః"** అని యోగశబ్దం ఉపాయ వాచకంగా తెలుపబడింది.

**(మే)** - పూర్వం తెల్పిన రీతిలో ఉండే నాకు,

**(దేహి)** - అనుగ్రహించండి - అని ప్రార్థిస్తున్నారు. **"దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే"** (నన్ను చేరడానికి ఉపాయమైన భక్తి యోగాన్ని ఇస్తాను) (గీత 10-10) అని అంటూ గీతాచార్యుడు పరమభక్తిదశను కల్గించే ఉపాయమైన బుద్ధియోగాన్ని అనుగ్రహిస్తానని అన్నాడు. అటువంటి పరమభక్తిదశ తమకు చరమపర్వంలో కల్గడంకోసం ఎఱుమ్బియప్పా శ్రీవరవరమునులను ప్రార్థిస్తున్నారు. గీతాచార్యుడు రామానుజుడే, శ్రీవరవరమునులు శ్రీరామానుజుల పునరవతారభూతులే కదా! దేవరవారి **"అరుళ్ పెరువార్ అడియార్"** (అనుగ్రహానికి నోచుకున్న దాసుల) లో ఒకనిగా నన్ను అనుగ్రహించండి అని హార్దభావం.

**80.** అవ :- **"యస్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా"** (నీతో కలసిఉండడం స్వర్గం, నీతో కలసి ఉండలేకపోవడం నరకం) అనే రీతిలో శ్రీవరవరమునులతో కలిగే సంశ్లేషవిశ్లేషాలు తమ సుఖదుః ఖాలకు హేతువులు అయేటట్లుగా ఉండే మనోమార్దవం తమకు లేదని పూర్వశ్లోకంలో తెలియజేశారు.

ఆ మార్దవమే ఉంటే ప్రార్థన అక్కరలేదు కదా! అటువంటి మనోమార్దవం ఎవరికైనా ఉన్నదా? అని అంటే, ఆ మార్దవం ఉండే ఒక చోటును తెలుపగోరిన ఎఱుమ్బియప్పా, మొట్టమొదటగా, తమ కులధనమైన శ్రీరామచంద్రుడే ఆ మార్దవగుణానికి ప్రథమోదాహరణంగా గ్రహించదగినవాడని అంటున్నారు.

**సోఢుం తాదృక్ రఘుపరిబృఢో న క్షమ స్త్వద్వియోగం**
**సద్యః కాంక్షన్ వరవరమునే! సన్నికర్షం తవైషః ।**
**సాయం ప్రాత స్తవ పదయుగం శశ్వదుద్దిశ్య దివ్యం**
**ముంచన్ బాష్పం ముకుళితకరో వందతే హంత ! మూర్ధ్నా ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, త్వత్+వియోగం = తన ప్రీతికి మిక్కిలి లక్ష్యభూతులైన దేవరవారి వియోగాన్ని, సోఢుం = సహించడానికి, న క్షమః= సమర్థుడు కాని, తాదృక్ = పలుకడానికి సాధ్యం కాని మనోమార్దవాన్ని కల్గినవాడైన, ఏషః= దాసుని కులధనమైన, రఘుపరిబృఢః= రఘుకులపతి అయిన రామచంద్రుడు, సద్యః= ఇపుడే, తవ సన్నికర్షం = దేవరవారి సమీపంలో ఉండడాన్ని, కాంక్షన్ సన్ = అభిలషించేవాడై, శశ్వత్ = మాటిమాటికి, బాష్పం ముంచన్ = కన్నీటిని విడుస్తూ, తవ = తిరువాయ్మొழி వ్యాఖ్య ఈడును ఉపదేశించిన దేవరవారియొక్క, పదయుగమ్ ఉద్దిశ్య = శ్రీచరణయుగం యొక్కక్షేమాన్ని గూర్చి, ముకుళితకరః= జోడించిన చేతులను కలవాడై, సాయం ప్రాతః= రాత్రి, పగలు, మూర్ధ్నా వందతే = తలతో దేవతలను అందఱిని నమస్కరిస్తున్నాడు, హంత = అయ్యో! (అతనికి గల మార్దవం దాసుడనైన నాకు లేదే!)

**"స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ సాయం ప్రాతః సమాహితాః, సర్వాన్ దేవాన్ నమస్యంతి రామస్యార్థే యశస్వినః"** (రామా-అయో- 2-53) (వృద్ధురాండ్రు, యౌవనంలో ఉండే స్త్రీలు రాత్రింబగళ్ళు వేఱు భావన లేకుండా ఏకాగ్రతతో గొప్ప కీర్తిని కల శ్రీరాముని క్షేమంకోసం కన్పించిన దేవతలకు అందఱికి నమస్కరిస్తున్నారు) అనే రీతిలో శ్రీరాముని క్షేమంకోసం అయోధ్యా పురవాసినులైన స్త్రీలు అందఱు దేవతలను నమస్కరించినట్లే, శ్రీరామచంద్రుడుకూడా శ్రీవరవరమునుల క్షేమంకోసం దేవతలందఱిని చేతులను జోడించి అంజలి ఘటిస్తూ శిరసా నమస్కరిస్తున్నాడు- అని భావం. దీనివల్ల శ్రీవరవరమునుల విషయంలో మంగళాశాసనపరుడైన శ్రీరామచంద్రునకు వారిపట్లగల ఉత్కూలమైన ప్రేమ- అనే మార్దవగుణం తెలుపబడింది. లక్ష్మణుని అవతారమైన శ్రీవరవరమునుల విషయంలో శ్రీరామచంద్రునకు మార్దవగుణం ఉంటుందా? అని అడుగవలసి ఉన్నదా? అటువంటి మార్దవం తమకు లేదే !- అని బాధ **"హంత!"** అనే పదంతో సూచింపబడింది. అందువల్లనే కదా **"దేహి మే భక్తియోగమ్"** అని అంటూ భక్తియోగమనే మార్దవాన్ని ఎఱుమ్బియప్పా గత శ్లోకంలో ప్రార్థించారు.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే!)** - ఓమణవాళమహామునీ!,

**(త్వద్వియోగమ్)** - మిక్కిలిగా తన ప్రీతికి లక్ష్యభూతులైన దేవరవారి విశ్లేషాన్ని,

**(సోఢుం న క్షమః)** - సహించలేనివాడైన,

**(ఏషః రఘుపరిబృఢః)-** నా కులధనమైనందున నా గేహవాసియైన శ్రీరామచంద్రుడు **"పరివర్ధతి, పరివృంహతి వా ఇతి పరివృఢః, వృహ, వృహి-వృద్ధౌ"** అనే వ్యుత్పత్తివల్ల రఘుకులవర్ధకుడని అర్థం.

**(సద్యః)** - ఈనాడే - వేగంగా - అని అర్థం.

**(తవ) - "క్షణేఽపి యద్విరహోఽతిదుస్సహః"** (క్షణకాలం అయినా నీ విరహం మిక్కిలి సహించ లేనిది) అనే రీతిలో క్షణకాలం విరహంకూడా దుస్సహమైన మీకు,

**(సన్నికర్షమ్)-** సమీపంలో ఉండే స్థితిని,

**(కాంక్షన్ సన్)-** కోరుతున్నవాడై,

**(శశ్వత్)-** మాటిమాటికి,

**(బాష్పం ముంచన్)-** దుఃఖాశ్రువులను విడుస్తూ,

**(తవ పదయుగం)-** ద్రవిడోపనిషత్‌గా ప్రసిద్ధమైన తిరువాయ్‌మొழி దివ్యప్రబంధవ్యాఖ్య ఈడును ఉపదేశించినందువల్ల ఆచార్యులైన దేవరవారియొక్క,

**(పదయుగమ్ ఉద్దిశ్య)-** శ్రీచరణయుగాన్ని ఉద్దేశించి,

**(ముకుళితకరః)-** అంజలి ఘటించినవాడై,

**(సాయం ప్రాతః)-** రాత్రింబగళ్ళు,

**(మూర్ధ్నా వందతే)-** శిరసా నమస్కరిస్తున్నాడు. **"సాయం ప్రాతః"** అనే పదప్రయోగం శ్రీరామాయణంలోని **"స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ"** ఇత్యాది శ్లోకాన్ని స్మరింపజేస్తుంది. **"పరిబృఢ"** శబ్దం పరబ్రహ్మపరంగా నిరుక్తికారులైన యాస్కాచార్యులచే వివరింపబడింది. అపుడు "శ్రీరామచంద్రుని రూపంలోని పరమాత్మ" అని అర్థం.

**81.** అవ :- గడచిన శ్లోకంలో శ్రీవరవరమునుల విశ్లేషం శ్రీరామచంద్రునకు దుస్సహమైనది - అని అన్నారు. ఇందులో వారి విశ్లేషంవల్ల ఆ శ్రీరామునకు కల్గిన అవస్థావిశేషాలను ప్రస్తుతిస్తున్నారు.

**అంత స్తామ్యన్ రఘుపతి రసౌ అంతికే త్వా మదృష్ట్వా**
**చింతాక్రాంతో వరవరమునే ! చేతసో విశ్రమాయ ।**
**త్వన్నామైవ శ్రుతిసుఖమితి శ్రోతుకామో ముహుర్మాం**
**కృత్యై రన్యైః కిమిహ తదిదం కీర్తయేతి బ్రవీతి ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ !, అసౌ రఘుపతిః = శ్రీరామచంద్రుడు, అంతికే = తన సమీపంలో, త్వాం = మిక్కిలి ప్రియమైన దేవరవారిని, అదృష్ట్వా = చూడలేక, అంతః = మనస్సులో, తామ్యన్ = తాపాన్ని పొందినవాడై, చింతా+ఆక్రాంతః సన్ = అస్థానే భయశంకతో నిండినవాడై, చేతసః=

మనస్సుయొక్క, విశ్రమాయ = కొంచెం ఊఱట కల్గడం కోసం, త్వత్ నామైవ = దేవరవారి తిరునామాన్నే, శ్రుతిసుఖమ్ ఇతి = చెవులకు ఆనందాన్ని కల్గిస్తుంది - అనే కారణంవల్ల, శ్రోతుకామః= వినగోరినవాడై, ఇహ = శ్రీవరవరమునులను విశ్లేషించి చాలా దుఃఖాన్ని పొందే నా విషయంలో, అన్యైః కృత్యైః = (నేను) చేసే అర్ఘ్యపాద్యాచమన నివేదనాది అన్యోపచారాలతో, కిమ్ = ఏమి ప్రయోజనం, ఏమీ లేదు, తత్ = అందువల్ల, ఇదమ్ = ఈ శ్రీవరవరమునుల తిరునామాన్ని, కీర్తయ ఇతి = సంకీర్తనం చేయి- అని, ముహుః మాం బ్రవీతి = మాటిమాటికి నాతో అంటున్నాడు.

ఎఱుమ్బియప్పా తిరుమాళిగలో కులధనంగా వారిచే ఆరాధింపబడుతున్న శ్రీరామచంద్రుడు తనకు పిమ్మట జన్మించిన లక్ష్మణుని అవతారమైన మణవాళమహామునులు తన వద్దనే ఉండాలనే ఆశవల్ల, తన సమీపంలో అర్చావతారంగా వేంచేసి ఉండే లక్ష్మణస్వామి తనకంటికి కన్పించలేదు కాబోలు. అందువల్ల ఆ శ్రీరాముని మనస్సు వాడిపోయింది. ఎన్నో విధాలైన దశలు ఆ స్వామికి కలిగాయి. ఈ విశ్లేషం వల్ల కల్గిన శ్రమను ఏదో ఒక రీతిలో ఓర్చుకోవాలి- అనే ఆలోచన ఆ స్వామికి కల్గింది. ఈ దశలో, ఎఱుమ్బియప్పా ఆ స్వామికి తిరువారాధనను సమర్పింపబోయారు. శ్రీరాముడు వారిని చూచి, "నాకు ఆరాధనగాని, నివేదన గాని శ్రీవరవరమునులను విశ్లేషించిన ఈ సమయంలో ఊఱటను కల్గించదు సుమా ! ఇవి ఏమీ నాకు వద్దు. నాకిపుడు ఊఱటను కల్గించే శ్రీవరవరమునుల తిరునామానుసంధానాన్ని చేయండి''- అని పల్కుతున్నట్లుగా- ఈ శ్లోకంలో అంటున్నారు, ఎఱుమ్బియప్పా. దీనివల్ల శ్రీవరవరమునుల విశ్లేషంలో శ్రీరామునకు కల్గిన దశలు సూచింపబడ్డాయి.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే)**- ఓ మణవాళమహామునీ !,

**(అసౌ)** - నా ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రుడు,

**(అంతికే త్వామదృష్ట్వా)**- తన సమీపంలో తన అత్యంతప్రీతికి విషయభూతులైన దేవరవారిని చూడలేక, అర్చామూర్తి రూపంలో ఉన్నా, తావన్మాత్రంతో తృప్తిచెందక, విభవరూపాన్ని ధరించిన దేవరవారిని చూడలేక- అని తాత్పర్యం.

**(అంతః)**- మనస్సులో,

**(తామ్యన్)**- తాపాన్ని పొందుతున్నవాడై- అని అర్థం. **"అనిర్విణ్ణో గభీరత్వా దంతర్గూఢఘనవ్యథః"** (గాంభీర్యాన్ని కలవాడు కనుక బయటకు విచారాన్ని వ్యక్తంచేయలేదు. కాని, లోపల చాలా గొప్ప వ్యథను కల్గిఉన్నాడు) అని పల్కినట్లుగా తనకు మాత్రమే తెలిసిన వేదనను కలవాడై - అని తాత్పర్యం.

**(చింతాక్రాంతస్సన్)**- పలు విధాలైన విపరీత సంభావనలతో నిండినవాడై-అని అర్థం. **"యాతా భవేద్భగవతీ భవనం సఖీ నో జీవత్యథేష్యతి న వేత్యభిశంకితోఽస్మి"** (మన చెలి భవనాన్ని చేరిందా? లేదా? జీవించి ఉన్నదా? వస్తుందా? అని చాలా సందేహపడుతున్నాను) అనే రీతిలో పలు రీతులలోని విపరీతసంభావనలు కలవాడై - అని అర్థం.

**(చేతసః)** - పూర్వం తెలుపబడిన రీతిలో శ్రీవరవరమునుల విశ్లేషవ్యసనం వల్ల మిక్కిలి ఆయాసాన్ని పొందిన హృదయానికి,

**(విశ్రమాయ)** - కొంచెం ఊరటకల్గడం కోసం,

**(త్వన్నామైవ)** - వాగతీతమైన తన ప్రీతికి విషయమైన దేవరవారి దివ్యనామాన్నే -అని అర్థం. ఏవకారం ద్వారా వేఱొక వాక్కు ఏదీ రుచించదని తెలుస్తున్నది. ఈ ద్వితీయాంత పదం **"శ్రోతుకామః"** అనే పదంతో అన్వయిస్తుంది.

**(శ్రుతిసుఖమితి)- "మద్వక్త్రత స్తవ గుణా నభిశ్రుణ్వతశ్చ ప్రత్యక్షరం పులకజాలికపోలమూలమ్"** (నా నోటి నుండి మీ గుణాలను వినేవానికి ప్రతి అక్షరం గొప్ప ఆనందాన్ని కల్గించి, చెక్కిళ్ళలో పులకాలను అంకురింపచేస్తున్నది) అనే రీతిలో గొప్ప సౌఖ్యానికి హేతువు - అనే కారణంచేత - అని అర్థం. **"ఇతి"** అనే పదం హేత్వర్థకం.

**(శ్రోతుకామః)** - వినాలని మిక్కిలి అపేక్షించేవాడై,

**(ఇహ)** - అభిమతవిశ్లేషంచేత మిక్కిలి ఆర్తిని పొందిన నా విషయంలో,

**(అన్యైః కృత్యైః కిమ్?)** - శ్రీవరవరమునుల దివ్యనామ సంకీర్తనం కంటే వేఱయిన కార్యాలతో- అంటే - నివేదన, ఆసన, సమర్పణాది సేవలతో - అని అర్థం. ఇవి ఏవీ నాకు కల్గిన విరహాన్ని తీర్చలేవు. అభిమతమైన శ్రీవరవరమునుల సంశ్లేషాన్ని కల్గించలేవు.

**(తత్)**- అందువల్ల- మీరు చేసే అర్ఘ్యపాద్యాదులు నాకు అకించిత్కారాలు అయినందువల్ల -అని అర్థం.

**(ఇదమ్)** - ఎల్లప్పుడు నామనస్సులో నిలచి ఉండే ఈ శ్రీ వరవరమునుల దివ్యనామాన్ని,

**(కీర్తయ ఇతి)** - సంకీర్తనం చేయండి - అని,

**(మామ్)** - శ్రీరామచంద్రుని ఆరాధించబోయినవాడనైన నన్ను- ఆస్వామి కనుబొమల కదలికలను బట్టి ప్రవర్తించే నన్ను - అని అర్థం.

**(ముహుః బ్రవీతి)** - మాటిమాటికి పల్కుతున్నాడు - అని అర్థం. **"ముహుః"** అనే పదం ద్వారా శ్రీవరవరముని దివ్యనామకీర్తనంపట్ల (శ్రీరామునకు) గల అత్యాదరం వ్యక్తమవుతున్నది. **"ఇదమ్"** అనే ఏకవచనం ద్వారా ఒక్కసారి వారి నామాన్ని కీర్తించినా, అది తన ప్రాణప్రతిష్ఠాపనను చేస్తుందనే భావం స్ఫురిస్తున్నది. **"అంతస్తామ్యన్"** అని అన్నందున **"గ్లాని"** అనబడే వ్యభిచారి భావం వ్యక్తమవుతున్నది. **"గ్లాని ర్భయస్యాపచయాఽ వైవర్ణ్యాఽ రతికారణమ్"** (గ్లాని అంటే - భయంవల్ల కల్గిన మనోవికారం. అది వైవర్ణ్యాన్ని తెల్లగా పాలిపోవడాన్ని, అరతిని - దేనిలోను ఆసక్తి లేకపోవడాన్ని కల్గిస్తుంది) - అని గ్లాని నిర్వచింపబడింది. **"చింతా క్రాంతః"** అనే పదం ద్వారా **"శంకా"** అనే వ్యభిచారిభావం సూచింపబడింది.

**"అనిష్టాగమనోత్ప్రేక్షా శంకా ద్వేషాదికారణమ్"** (అనిష్టం కల్గుతుందేమో అనేభావం శంక. ఇది ద్వేషాదులను కల్గిస్తుంది.) అని శంక నిర్వచింపబడింది. **"చేతసో విశ్రమాయ"** అనే ప్రయోగంద్వారా **"శ్రమ"** అనబడే సంచారిభావం వ్యక్తమవుతున్నది. **"శ్రమః ఖేదోఽధ్వరత్యాదేః జాతస్వేదాది భూమికృత్"** అని ఈ వ్యభిచారిభావం నిర్వచింపబడింది. **"చింతాక్రాంత"** అని అన్నందున **"చింత"** - అనే సంచారిభావం వ్యక్తం. **"ఇష్ట్యాఽనభిగమాద్ధ్యానం చింతా శూన్యత్వతాపకృత్"** అని ఈభావం నిర్వచింపబడింది. **"కిమితి"** అనే ప్రయోగం ద్వారా **"అరతి"** అనే అవస్థ సూచింపబడింది. **"అన్యత్రాప్రీతి రరతిః"** (వేఱు ఏ విషయంలోని ఆసక్తి లేకపోవడం అరతి) అని ఈ భావం నిర్వచింపబడింది. ఈవిధంగా ఈ శ్లోకంలో ఇష్టమైనవారిని విశ్లేషించినందున కలిగే దుఃఖాతిశయమనే కరుణా రసం వర్ణింపబడినందున, ఆ రసానికి సంబంధించిన సంచారిభావాల నిర్దేశం చేయబడింది.

**82.** అవ :- శ్రీవరవరమునులు శ్రీరామచంద్రుని అత్యంతప్రీతికి లక్ష్యభూతులు - అనే విషయాన్ని వివరించి తెలుపడంకోసం శ్రీరామచంద్రునకు గల శ్రీవరవరమునుల విశ్లేషాన్ని సహించలేని స్వభావాన్ని ఇందులో దృఢీకరిస్తున్నారు.

**భుంక్తే నైవ ప్రథమకబలే యస్త్వయా నోపభుక్తే**
**నిద్రా నైవ స్పృశతి సుహృదం త్వాం వినా యస్య నేత్రే ।**
**హీనో యేన త్వమసి సలిలోత్క్షిప్తమీనోపమానః**
**కోఽసౌ సోఢుం వరవరమునే! రాఘవ స్త్వద్వియోగమ్ ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, యః = ఏ శ్రీరాముడు, ప్రథమకబళే = మొదటి ముద్ద, త్వయా = లక్ష్మణస్వామివి అయిన నీచే, నోపభుక్తే సతి = ప్రక్కను కూర్చొని భుజింపబడనపుడు, న భుంక్తే = తాను భుజించడం లేదో, సుహృదం త్వాం వినా = తన పట్ల సౌహృదాన్ని కల్గిన దేవరవారిని విడచి, యస్య నేత్రే = ఏ శ్రీరాముని రెండు నేత్రాలు, నిద్రాం = నిద్రను, నైవ స్పృశతి = తాకనే తాకదో, యేన హీనః త్వం = ఏ శ్రీరాముని విడచిన దేవరవారు, సలిల+ఉత్క్షిప్త మీన + ఉపమానః= నీటిలో నుండి పైకి తీయబడిన చేపతో సామ్యాన్ని కల్గినవారుగా, అసి = అవుతున్నారో, అసౌ = అటువంటి శ్రీరామచంద్రుడు, త్వత్ వియోగం = సోఢుమ్ = దేవరవారి విశ్లేషాన్ని సహించడానికి, కః= ఎవరు? (శత్రువా? మధ్యస్థుడా? - అని భావం అంటే - విషయప్రవణులైన మనం, శత్రువులైన రావణాదులు సహించగలరే తప్ప, శ్రీవరవరమునుల పట్ల అత్యంతప్రీతిని కల శ్రీరాముడు సహించలేడు-అని భావం)

లక్ష్మణుడు లేకుండా శ్రీరాముడు భోజనాన్ని చేయడు నిద్రను కూడా పొందడ- అనే విషయాన్ని **"న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః, మృష్ట మన్నముపానీత మశ్నాతి న హితం వినా"** (రామా-బాల-18-32) (పురుషోత్తముడైన శ్రీరాముడు, లక్ష్మణుడు తన ప్రక్కన లేకపోతే నిద్రను పొందడు. మృష్టాన్నాన్ని తీసికొనివచ్చి పెట్టినా, ఆ లక్ష్మణుని వీడి భుజించడు కదా) - అనే ఈ శ్లోకం ప్రమాణం. శ్రీరాముని విశ్లేషిస్తే లక్ష్మణుడు నీటి నుండి వెలువడిన చేపవలె జీవించలేడు - అనే విషయానికి "న చ

**సీతా త్వయా హీనా చ చాహ మపి రాఘవ!, ముహూర్త మపి జీవావః జలాన్మత్స్యావివోద్ధృతౌ"** (రామా-అయో-53-31) (శ్రీ రామా! నన్ను విశ్లేషిస్తే సీత జీవించదు. నేను కూడా జీవించను. ఒకవేళ ప్రాణాలతో నిలచి ఉంటే, ఒక ముహూర్తకాలం ఉండగలం. దేనివలె ? అంటే, నీటి నుండి బయటకు తీసిన చేపలవలె) అని లక్ష్మణుడు శ్రీరామునితో పల్కిన మాట ప్రమాణం.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే!)** - ఓ మణవాళమహామునీ!,

**(యః)** - ఏ శ్రీరామచంద్రుడు,

**(ప్రథమకబళే)** - మొదటి ముద్దను,

**(నోపభుంక్తే)** - తనకు సమీపంలో ఉండి భుజించకపోతే - అనే అర్థం. ఈ అర్థం **"ఉప- సమీపే"** అనే ఉపసర్గార్థంద్వారా లబ్ధం. **"న"** శబ్దం ఉపభుక్తశబ్దంతో కలిపి సమాసం చేయబడితే **"నోపభుంక్త"** మనే రూపం సిద్ధిస్తుంది.

**(న భుంక్తే ఏవ)** - తాను భుజించనే భుజించడో, **"మృష్టమన్న ముపానీతమ్"** ఇత్యాది పూర్వోదాహృత శ్రీరామాయణసూక్తి స్మరణీయం.

**(సుహృదమ్)** - స్నేహభావాన్ని కల్గిన,

**(త్వామ్ వినా)** - దేవరవారు లేకుండా,

**(యేన)** - ఏ శ్రీరామచంద్రునిచే,

**(నిద్రా నేత్రే నైవ స్పృశతి)** - నిద్ర నేత్రాలను తాకనే తాకదో - అని అర్థం. నిద్ర అనేది నేత్రాలను మూసికోవడం ద్వారా కల్గుతుంది. ఆవిధంగా కనులు మూసికోవడం కూడా సంభవించదు- అని తాత్పర్యం. **"న చ తేన వినా నిద్రామ్"** (లక్ష్మణుడు వెంటలేకపోతే శ్రీరాముడు నిద్రించడు) ఇత్యాది శ్రీరామాయణ సూక్తి భావ్యం.

**(యేన హీన స్త్వమ్)** - ఏ శ్రీరామచంద్రునితో కలసి ఉండకపోతే దేవరవారు,

**(సలిల+ఉత్క్షిప్తమీన+ఉపమానః)** - **"న చ సీతా"** ఇత్యాది పూర్వోదహృత శ్లోకార్థం భావ్యం. నీటినుండి బయటకు తీసిన చేపతో సాదృశ్యాన్ని కలవారు అవుతున్నారో- అని అర్థం. శ్లోకంలోని హీనశబ్దం సంభవించే విశ్లేషాన్ని ఉద్దేశించి ప్రయోగింపబడింది. విశ్లేషం సంభవిస్తే ఆ సమయంలోని స్థితిని **"మీనోపమానః"** అనే ప్రయోగం తెల్పుతుంది. లేక, యథాశ్రుతంగానే ఈ ప్రయోగానికి అర్థాన్ని గ్రహించవచ్చు. **"పరిత్యజే త్వాం సౌమిత్రే! మాభూ త్తస్య విపర్యయః, త్యాగో వాపి వధో వాపి సాధూనా ముభయం సమమ్"** (లక్ష్మణా! నిన్ను నేను పరిత్యజిస్తున్నాను. ఈ విషయంలో మార్పు ఉండదు. సాధువులకు, పరిత్యాగం కాని, వధకాని- రెండూ సమానమే) - అని అంటూ ఉత్తరకాండలో శ్రీరాముడు లక్ష్మణుని వధించవలసిన సందర్భంలో అతనిని విడచిపెట్టడం ఇక్కడ చెప్పబడిన నీటినుండి బయటకు

తీసిన చేపతో సాటి వచ్చే స్థితి - ఆ చేపవలె ఉత్తరక్షణంలో మాత్రమే కదలిక ఉంటుంది. ఆర్ద్రభావం (తడసి ఉండే స్థితి) ఉన్నంత కాలమే ఏదో ఒక రీతిలో ప్రాణాలను చేప ధరించగల్గుతుంది. తరువాత వెంటనే మరణిస్తుంది. దేవరవారి స్థితి కూడా అటువంటిదే -అనే అర్థాన్ని స్ఫురింపజేస్తుంది.

**(అసౌ రాఘవః)** - ఇటువంటి శ్రీరామచంద్రుడు,

**(త్వద్వియోగమ్)** - ఇటువంటి దేవరవారి విశ్లేషాన్ని,

**(సోఢుమ్ కః)** - సహించడానికి ఎటువంటివాడు? విషయాంతర ప్రవణులైన మనవంటివాడు కాదు, ప్రతికూలభావాన్ని కల్గిన రావణాదులవంటివాడు కాదు కదా - అని భావం.

83. సహజంగా భోగ్యతను లేని వస్తువులు కూడా లక్ష్మణుని సంబంధవశంచేత శ్రీరామచంద్రునకు చాలా భోగ్యాలు అయినవి. ఆ లక్ష్మణుని అవతారవిశేషమైన శ్రీవరవరమునుల విషయంలో భగవానునకు గల మిక్కిలి అభిమానాన్నిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

**పత్రం మూలం సలిల మపి యత్ పాణినోపాహృతం తే**
**మాత్రా దత్తాదపి బహుమతం పత్యురేతద్రఘూణామ్ ।**
**శాఖాగేహం సమజని విభోః సమ్మతం సౌధశృంగం**
**భూత్వా వాసో మహదపి వనం భోగభూమి స్త్వయాऽభూత్ ॥**

(వరవరమునీ!) తే పాణినా = దేవరవారి శ్రీహస్తాలతో, యత్ ఉపాహృతం = ఏది తీసికొని రాబడినదో, ఏతత్ =ఈ, పత్రం మూలం సలిలమపి = ఆకులు, దుంపలు, జలం కూడా, రఘూణాం పత్యుః = రఘుకులంలో జన్మించినవారికి పతి అయిన శ్రీరామునకు, మాత్రా = (తన) తల్లి అయిన కౌసల్యాదేవిచే, దత్తాత్+అపి = ఇవ్వబడిన వస్తువుకంటే, బహుమతం = మిక్కిలి ప్రీతికి లక్ష్యంగా, అభూత్ = అయినది, శాఖాగేహం = (దేవరవారిచే నిర్మింపబడిన) పర్ణశాల, త్వయా = దేవరవారిచే (దేవరవారు నిర్మించినది అయినందువల్ల), విభోః = భగవానునకు, సమ్మతం = మిక్కిలి అభిమతానికి విషయమైన, సౌధశృంగం = ఉన్నతమైన సౌధంగా, సమజని = అయినది (నిర్మింపబడినది), మహత్ వనమపి = చాలా దట్టమైన అరణ్యంకూడా (దండకారణ్యం కూడా) త్వయా = నీతో కలసి ఉన్నందున, వాసః భూత్వా = నివసించే చోటైన, భోగభూమిః= ఏ ఆటంకం లేని ఆనందం అనుభవించదగిన చోటు అయిన శ్రీవైకుంఠంగా, అభూత్ = అయినది.

శ్లోకంలోని మొదటి రెండు పాదాలకు **"జల మేవాదదే భోజ్యం లక్ష్మణేనాహృతం స్వయమ్"** (రామా-అయో-50-48) (గుహుడు తీసికొని వచ్చిన తేనె మొదలైనవానిని గ్రహించకుండా వద్దని పల్కి, లక్ష్మణుడు తీసికొని వచ్చిన నీటిని మాత్రమే ఆహారంగా శ్రీరాముడు గ్రహించాడు) ఇత్యాది వచనాలను, ఉత్తరార్ధానికి **"రాఘవః పర్ణశాలాయాం హర్ష మాహారయత్పరమ్"** (రామా-ఆర-15-26) (శ్రీరాముడు, లక్ష్మణుడు, నిర్మించిన పర్ణశాలలో, అయోధ్యలోని అంతఃపురంలో నివసించడంకంటే ఎక్కువ గొప్ప

సంతోషాన్ని పొందాడు) ఇత్యాది వచనాలను, **"తస్మిన్ దేశే బహుఫలే న్యవసత్ సుసుఖం వశీ, కంచిత్ కాలం స ధర్మాత్మా సీతయా లక్ష్మణేన చ, అన్వాస్యమానో న్యవసత్ స్వర్గలోకే యథాఽమరః"** (రామా-ఆరణ్య-15-30,31) (పలు విధాలైన ఫలాలతో నిండిన ఆ వనంలో ఇంద్రియనిగ్రహాన్ని కల్గిన ఆ శ్రీరాముడు చాలా ఆనందంగా నివసించాడు. ధర్మాత్ముడైన ఆ శ్రీరాముడు సీతచే, లక్ష్మణునిచే సేవింపబడేవాడై చిరకాలం ఆ అడవిలో, పరమపదంలో దివ్యదేవేరులతో, నిత్యముక్తులతో పరిచర్యచేయబడే శ్రీమన్నారాయణునివలె సుఖంగా నివసించాడు) ఇత్యాదులు ప్రమాణంగా గ్రాహ్యాలు.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే)-** ఓమణవాళమహామునీ! ఈ పదాన్ని పూర్వశ్లోకంలో నుండి అనుషంగం చేసికోవాలి.

**(తే పాణినా)** - మిక్కిలి ఇష్టులైన దేవరవారి శ్రీహస్తంతో,

**(ఉపాహృతమ్)** - తీసికొని రాబడిన,

**(యత్ పత్రం మూలం సలిలమపి ఏతత్)-** పత్రాలు, కందమూలాలు, జలం కూడా- అని అర్థం. **"అపి"** శబ్దం ద్వారా మాంసాదులు కూడా చెప్పబడతాయి. ఇవి అన్నీ,

**(రఘూణాం పత్యుః)** - రఘుకులపతి అయిన శ్రీరామచంద్రునకు,

**(మాత్రా దత్తాదపి)** - తన విషయంలో అత్యంతం ప్రేమను కల్గిన కౌసల్యచే ఇవ్వబడిన వస్తువుకంటే,

**(బహుమతమ్ అభూత్)** - మిక్కిలిగా నీ ప్రీతికి లక్ష్యమైనది, **"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతమశ్నామి"** (పత్రమైన పుష్పమైనా, ఫలమైనా, జలమైనా భక్తితో ఇస్తే దానిని నేను ప్రీతితో స్వీకరిస్తాను) అనే సూక్తి ఇక్కడ స్మరణీయం.

**(శాఖాగేహమ్)** - దేవరవారిచే నిర్మింపబడిన పర్ణశాల, దేవరవారు నిర్మించారు- అనే కారణంగా,

**(విభోః సమ్మతం సౌధశృంగం సమజని)** - ప్రభువైన శ్రీరామునకు అభిమత విషయమైన, సౌధంలోని పై అంతస్థులో ఉండే గృహమైనది,

**(మహదపి వనమ్)** - చాలా భయంకరమైన దండకారణ్యం కూడా,

**(వాసో భూత్వా)** - నివాసభూమియై,

**(త్వయా)** - దేవరవారి కారణంగా,

**(విభోః భోగభూమి రభూత్)** - భోగవిభూతి అయిన శ్రీవైకుంఠనగరమైంది- అని భావం. **"వనవాసోమహోదయః"** - అనే శ్రీరాముని మాటకు లక్ష్మణుని వంటి పరమభక్తులతో ఏకాంతంగా గడిపే గొప్ప అవకాశం వనవాసంలో కల్గుతుందని కదా తాత్పర్యం.

శ్లోకంలోని "పత్రమూలం సలిల మపి" అనే ప్రయోగానికి అనుగుణంగా శ్రీరామాయణంలోని **"జల మేవాదదే భోజ్యం లక్ష్మణేనాహృతం స్వయమ్"** (లక్ష్మణునిచే తీసికొనిరాబడిన జలాన్నే రాముడు ఆహారంగా స్వీకరించాడు) ఇత్యాదులు గ్రాహ్యాలు. **"రమణీయాన్ బహువిధాన్ పాదపాన్ కుసుమోత్కరాన్, సీతావచనసంరబ్ధ ఆనయామాస లక్ష్మణః"** (పలు విధాలైన, అందమైన, పూలను కల్గిన చెట్లను సీతాదేవి మాటలతో ప్రేరితుడై లక్ష్మణుడు తీసికొని వచ్చాడు) అనే వచనం కూడాగ్రహించాలి. **"రాఘవః పర్ణశాలాయాం హర్షమాహారయత్పరమ్, సుసంధృష్టః పరిష్వజ్య బాహుభ్యాం లక్ష్మణం తథా, అతిస్నిగ్ధంచ గాఢం చ వచనం చేద మబ్రవీత్, ప్రీతోఽస్మి తే మహత్కర్మ త్వయా కృతమిదం ప్రభో! ప్రదేయో యన్నిమిత స్తే పరిష్వంగో మయా కృతః, భావజ్ఞేన కృతజ్ఞేన"** అని ఆరంభించి, **"తస్మిన్ దేశే బహుఫలే... న్యవసచ్చ సుఖీ"** ఇత్యాదిగా చెప్పబడిన వచనాలు కూడా భావ్యాలు. ఇష్టజనులతో సమాగమం వల్ల చాలా దుఃఖాన్ని కల్గించే వనం కూడా గొప్ప సుఖాన్ని కల్గిస్తుంది - అని ఇక్కడ ధ్వనిస్తున్నది. సీతాదేవికూడా అయోధ్యాకాండలో- **"ఏతత్తు వచనం శ్రుత్వా రామస్య తు సుదుఃఖితా, ప్రసక్తాశ్రుముఖీ మందం వచనం చేద మబ్రవీత్, యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి, గుణా ఇత్యేవ తాన్ మన్యే తవ స్నేహపురస్కృతా"** (రాముడు పల్కిన ఈ వచనాన్ని విని సీతాదేవి చాలా దుఃఖించినదై, కన్నీళ్ళతో తడసిన ముఖంతో మెల్లగా ఈవిధంగా పల్కింది. "వన వాసాన్ని గూర్చి నీలో ఏ దోషాలున్నాయని నీవు పలికావో, ఆ దోషాలను అన్నిటినీ నేను గుణాలుగానే భావిస్తాను, ఎందువల్ల అంటే - నీపట్ల నాకు కల ప్రేమవల్ల అవిగుణాలుగానే నాకుతోస్తాయి.) అని, **"కుశకాశశరేషీకా యే చ కంటకినో ద్రుమాః, తృణలాజినసమస్పర్శా మార్గం మమ సహ త్వయా, మహావాతసముద్భూతం యన్మామవకరిష్యసి, రజో రమణ తాన్ మంస్యే పారార్ధ్య మివ చందనమ్"** (దర్భలు, రెల్లు, ముళ్ళు, ముళ్ళు మొదలైనవానితో కూడిన దారినాకు నీతోకలసి ఉన్నందున మెత్తని దూది, అజినం తాకినట్లుంటుంది. గొప్ప గాలివల్ల పుట్టిన ధూళి నాకు గొప్ప చందనంగా భావిస్తాను) అని పల్కింది. **"అధికం పురవాసాచ్చ"** అని, **"జహౌ చ దుఃఖం పురవిప్రవాసాత్"** ఇత్యాది అనే శ్రీరామాయణ వచనాలు కూడా వ్యక్తంగా అనుసంధేయాలు.

**84.** అవ :- శ్రీవరవరమునులు లక్ష్మణులై అవతరించిన కాలంలో **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే"** (రామా-అయో-31-27) (దేవరవారు సీతతో కలిసి కొండచరియలలో ఆనందించబోతున్నారు. ఆ సమయంలో దేవరవారు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు నేను అన్ని విధాలైన కైంకర్యాలను చేస్తాను) అని పల్కిన సూక్తిలో **"సర్వ"** శబ్దంచేత సంగ్రహంగా చెప్పబడిన కైంకర్యవిశేషాలను గూర్చి ఇందులో దేవరాజగురువు ప్రస్తావిస్తున్నారు.

అధ్వశ్రాంతిం హరసి సరసైః ఆర్ద్రశాఖాసమీరైః
పాదౌ సంవాహయసి కురుషే పర్ణశాలాం విశాలామ్ ।
భోజ్యం దత్వా వరవరమునే! కల్పయన్ పుష్పశయ్యాం
పశ్యన్ ధన్యో నిశి రఘుపతిం పాసి పత్నీసహాయమ్ ॥

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, (దేవరవారు) సరస్తైః = పూవులో ఉండే తేనెతో కూడిన, ఆర్ద్ర శాఖాసమీరైః = చల్లని సంపెంగ మొదలైన వృక్షశాఖలవల్ల పుట్టే సమీరాలతో, అధ్వశ్రాంతిం = శ్రీరాముడు, సీత దారిలో పయనించినపుడు కల్గిన శ్రమను, హరసి = పోగొడుతున్నారు, పాదౌ సంవాహయసి = వారి శ్రీచరణాలను సంవాహనం చేస్తున్నారు (ఒత్తుతున్నారు), విశాలాం పర్ణశాలాం = పెద్ద పర్ణశాలను, కురుషే = నిర్మిస్తున్నారు, భోజ్యం దత్వా = వారు భుజించదగిన పండ్లు, కందమూలాలు మొదలైన ఆహారాన్ని ఇచ్చి, పుష్పశయ్యాం కల్పయన్ = పూల పడుకను మాటిమాటికి సిద్ధం చేస్తూ ఉన్నవారై (వారిని నిద్రింపజేసి), నిశి = రాత్రిలో, పత్నీసహాయం = పత్ని అయిన సీతతో కూడిన రఘుపతిం = శ్రీరాఘువుని, పశ్యన్ = రెప్పపాటు లేని నేత్రాలతో దర్శిస్తూ, ధన్యః= (దేవరవారు చేసిన కైంకర్యాలను వారు శ్లాఘించడమనే) ధనలాభాన్ని పొందినవారై, పాసి = వారిని కాపాడుతున్నారు.

ఈ శ్లోకంలోని మొదటి పాదంలో శ్రీరాముడు, సీతాదేవి మేల్కొని ఉన్నపుడు లక్ష్మణస్వామి చేసిన సేవలు, నాల్గవ పాదంలో వారు నిద్రించేటపుడు చేసిన సేవలు తెలుపబడ్డాయి. ప్రాప్తశేషి అయిన అగ్రజుడు శ్రీరామునకు తగిన దాసుడైన లక్ష్మణుని **"ధన్యః"** అని అంటూ ధనరాశిని పొందినవానినిగా పల్కడం- తన కైంకర్యాలను స్వీకరించడానికి తగిన సంబంధం లేని శకుంతలకు- **"సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ"**, "నీకు తామరాకుతో నీ ఆయాసం తీరేటట్లుగా విసరనా ?'' అని అడిగి **"త్వత్పాదపంకజ పరిగ్రహధన్యజన్మా"** అని పల్కిన రీతిలోనే సేవ చేసిన దుష్యంతుడు ధన్యుడు కాడు- అని సూచింపబడింది. **"విశాలాం పర్ణశాలామ్"** అనేది- దైవగృహం, హోమగృహం, ఋషులు వస్తే, వారితో సంభాషించే గృహం, శయనగృహం- ఇత్యాదులకు అన్నిటికి ప్రత్యేక ప్రత్యేకంగా తగిన చోటు కావాలి, ఆ విధంగా పర్ణశాల నిర్మింపబడింది- అనే భావాన్ని తెల్పుతుంది. **"అహం పునః దేవకుమారరూపమ్"** (రామా- అయో-12-106) అనే శ్లోకంలో దేవకుమారునివలె అలంకరించుకొని తనకెదురుగా ఒంటరిగా వచ్చే తన కుమారుడైన శ్రీరాముని చూచి, ఆనందించి, ముసలివాడైన తాను యువకునివలె అయినట్లుగా పల్కిన దశరథుని కంటే, సీతాదేవితో కూడిన శ్రీరాముని చూచి ధన్యుడైన లక్ష్మణుడు చాలా గొప్పవాడు- అనే భావం సూచింపబడింది.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే)**- ఓమణవాళమహామునీ!

శ్లోకంలోని నాల్గవ పాదంలోని **"రఘుపతిం పత్నీసహాయమ్"** అనే రెండు పదాలను షష్ఠీ విభక్త్యంతాలుగా మార్చుకొని మొదటి మూడు పాదాలలో అన్వయించాలి- **"రఘుపతేః పత్నీసహాయస్య అధ్వశ్రాంతిం హరసి"** ఇత్యాదిగా.

**(సరస్తైః)** - తేనెతో కూడుకొన్నవి అయిన - అని అర్థం.

**(ఆర్ద్రశాఖాసమీరైః)** - చల్లని నీటితో తడుపబడిన సంపెంగ, వకుళం మొదలన శాఖలు (కొమ్మలు) వీచడంద్వారా జనించే సమీరాలతో-అని అర్థం. "అగ్రశాఖాసమీరైః" అని పాఠంలోని "అగ్ర" పదం ద్వారా చిగుళ్ళతో నిండి ఉండడం సూచింపబడింది. "సరస్తైః ఆర్ద్ర" ఇత్యాది ప్రయోగం ద్వారా సౌరభ్యం (సువాసన),

శీతలత్వం (చల్లదనం), **"సరసైః వాతైః"** అనే బహువచనం ద్వారా మాంద్యం (మెల్లగా వీచడం) తెలుపబడ్డాయి. ఇవి మూడు శ్రమాన్ని తొలగించగల్గినవాయువునకు ఉండదగిన గుణాలు. **"లతాం పుష్పవతీం స్పృష్ట్వా స్నాతో విమలవారిషు, పునః స్పర్శనశంకీవ మందం చలతి మారుతః"** (పూలతో నిండిన తీగను తాకిన వాయువు చల్లని నీటిస్పర్శను కల్గినదై, మెల్లగా వీస్తున్నది) అని అంటూ భోజమహాకవి ఈ మూడు గుణాలను సూచిస్తూ పల్కిన రస్యమైన శ్లోకం ప్రకృతంలో భావ్యం. ఈ మూడు గుణాలలో ఏ ఒక్క గుణం ఉన్నా, శ్రమను తీర్చడానికి అది చాలు. మూడు ఉంటే, ఇక కిం వక్తవ్యం?

**(పత్నీసహాయస్య రఘుపతేః)** - జానకీసహితుడైన శ్రీరామునియొక్క,

**(అధ్వశ్రాంతిం హరసి)** - దారిలో పయనించినపుడు వారికి కల్గిన అసటను తీరుస్తున్నారు. **"య స్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా"** (నీతో కలసి ఉండడం స్వర్గం, నీకు దూరంగా ఉండడం నరకం) అనే రీతిలో పరస్పర సాన్నిహిత్యం వల్ల సీతారాములలో ఎవరికీ కలిగే అవకాశం లేదు. కాని, వారిరువురిలో, పరస్పరశ్రమశంకవల్ల - సీతకు శ్రమ కల్గిందేమోననే శంక శ్రీరామునకు, శ్రీరామునకు శ్రమ కల్గిందేమోననే శంక సీతాదేవికి కల్గడం వల్ల, వారిరువురికి మానసికశ్రమ కలిగే అవకాశం ఉన్నదికదా! (పెరియతిరుమొழிలోని **"కళ్వన్ కొల్"** అనే దశకప్రమేయం ప్రకృతంలో స్మరణీయం.) ఆ విధంగా పరస్పరం కల్గిన శ్రమను తీరుస్తున్నారని భావం. ఆత్మనే పదప్రయోగం కాకుండా **"హరసి"** అనే పరస్మైపదప్రయోగం చేయడం ద్వారా పరిచర్యలోని స్వార్థతారహితపూర్వకమైన పరార్థత్వం వ్యక్తమవుతున్నది. **"కురుష్వ మా మనుచరమ్"** (నన్ను అనుచరునిగా చేసికో) అని అంటూ లక్ష్మణుడు ప్రప్రథమంగా క్రియాఫలం కర్తకు చెందుతుంది - అని సూచించే ఆత్మనే పదప్రయోగాన్ని చేసినందువల్ల, త్రేతాయుగంలో దేవరవారు లక్ష్మణుని రూపంలో చేసిన మిక్కిలి సౌఖ్యాన్ని కల్గించే ఉపాచారవిశేషాలు, ఫలించేవరకు నీటితో తడిపే రీతిలో, ఈనాటికికూడా భగవానునకు ధారకాలై ఉన్నాయి- అనే అర్థవిశేషం **"హరసి"** అనే వర్తమాన కాలికక్రియా పదప్రయోగంవల్ల ధ్వనిస్తుంది. **"పత్నీ"** శబ్దప్రయోగం ద్వారా దివ్యదంపతులిద్దరు ఉపచరణీయులు- అంటే- సేవించదగినవారనే విషయం తెల్పుతున్నది. **"పత్యుర్నో యజ్ఞసంయోగే"** అని శాస్త్రంలో అనుశాసింపబడింది. ద్వయమంత్రంలోని ఉత్తరఖండంలో భగవత్కైంకర్యం విధింపబడింది. ఈ కైంకర్యాన్ని స్వీకరించేవాడు కేవలం భగవానుడొక్కడే కాదు; దివ్యదంపతులిద్దరు ఈ కైంకర్యాన్ని స్వీకరించేవారే- అని పూర్వాచార్యాభిప్రాయం. పూర్వఖండంలో తెలుపబడిన సమాశ్రయణానికి (శరణాగతికి) మాత్రం లక్ష్మీవిశిష్టుడైన నారాయణుడొక్కడే ప్రతిసంబంధి. లక్ష్మీదేవికి పురుషకారంలో అన్వయం.

**(పత్నీసహాయస్య రఘుపతేః పాదౌ సంవాహయసి)** - జానకీదేవియొక్క, శ్రీరామునియొక్క శ్రీచరణాలను సంవాహనం చేస్తున్నారు. ప్రయాణ గమనంలో పాదాలకు కల్గిన శ్రమ తీరే రీతిలో దృఢంగా ఒత్తుతున్నారు - అని భావం. **"కరేణ"** చేతలో అనే పదాన్ని ప్రయోగించకపోవడానికి కారణం- అతిసుకుమారాలైన దివ్యదంపతుల శ్రీచరణకిసలయాల సంవాహనంలో, లక్ష్మణుని కరాలు కూడా కిసలయసదృశాలే కనుక, అవి సాధనాలు కానట్లుగానే తోస్తున్నవి - అనే అర్థం స్ఫురించడంకోసం. ఇక్కడ కూడా **"సంవాహయసి"** అనే పరస్మై పదప్రయోగం ద్వారా కైంకర్యంలోని పారార్థ్యం వ్యక్తమవుతున్నది.

**(పత్నీసహాయస్య రఘుపతేః విశాలాం పర్ణశాలాం కురుషే)** - సీతాసహితుడైన శ్రీరామునకు విశాలమైన పర్ణశాలను నిర్మిస్తున్నారు - అని అర్థం. పర్ణ నిర్మితమైన శాల పర్ణశాల. **"విశాలామ్"** అని అనడంవల్ల దైవగృహం - హోమగృహం మొదలైన విభాగాలు, శయ్యాగృహాది విభాగాలు కల్గి ఉండే రీతిలో పర్ణశాలవైశాల్యం వ్యక్తమవుతున్నది. **"వివిధాః శాలాః యస్యాం సా"** శబ్దానికి వివక్షించడం ద్వారా ఈ విశేషార్థం స్ఫురిస్తుంది. **"శాల్యతే ఇతి శాలా, శాల-శ్లాఘాయామ్"** అనే శాలా శబ్దవ్యుత్పత్తి ద్వారా ఈ గృహాలన్నీ చాలా మనోహరంగా ఉన్నాయని ధ్వనిస్తున్నది. **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ, త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ"** (లక్ష్మణా! వై భావజ్ఞుడవై, కృతజ్ఞుడవై, ధర్మజ్ఞుడవై, పుత్రుడవైన నీవల్ల ధర్మాత్ముడైన నా తండ్రి మరణించలేదు. అతడు నాకు చేసిన సేవలన్నింటిని నీవు చేస్తున్నావు.) అనే శ్రీరామాయణశ్లోకంలోని **"భావజ్ఞేన"** అనే పదం ద్వారా వివక్షితమైన అర్థం **"విశాలామ్"** అనే పదం ద్వారా తెలుపబడిది. **"త్వయా మమ పితా న సంవృత్తః"** అనే ప్రయోగం ద్వారా అభిప్రేతమైన అర్థం **"కురుషే"** అనే పదం ద్వారా వ్యక్తమవుతున్నది. తండ్రి, కుమారునకు చేసే ఉపచారాదులు తండ్రికోసమే కదా కాగలవు. ఎందుకు? అంటే, పుత్రులు **"యస్యై తే తస్య తద్ధనమ్"** అనే రీతిలో తండ్రి సొత్తు కదా! కనుక శేషభూతులు. తండ్రి శేషి. సొత్తును రక్షించే ప్రయత్నాల ఫలం సొత్తుదారునకే చెందుతుంది. కనుక క్రియాఫలాన్ని కర్త అనుభవిస్తాడని సూచించే **"కురుషే"** అనే ఆత్మనే పదప్రయోగం చేయబడింది. అందువల్ల **"న సంవృత్తః పితా మమ"** అనే ప్రయోగార్థం ఈ క్రియాద్వారా సూచింపబడింది. **"భావజ్ఞేన"** అనే శ్లోకం పర్ణశాల నిర్మాణ సందర్భంలో చెప్పబడినందున, ఇక్కడ శ్లోకంలో **"పర్ణశాలాం కురుషే"** అనే ఆత్మనేపద పూర్వక ప్రయోగం చేయబడింది.

**(పత్నీసహాయస్య రఘుపతేః భోజ్యం దత్వా)**- జానకీసహితుడైన రాముని కోసం భోజనానికి అర్హమైన ఫలాలను, కందమూలాలను ఉపహారంగా సమర్పించి- అని అర్థం. ఒక వస్తువుపైగల తన స్వామ్యాన్ని వదలుకొంటూ దానిని ఇతరులకు చేసే సమర్పణం దానమనబడుతుంది. ఇక్కడ ఆవిధమైన స్వస్వత్వనివృత్తి ప్రసక్తిలేనందువల్ల **"దత్వా"** అనే పదానికి "ఉపహారంగా సమర్పించి' అని మాత్రమే అర్థం. శాస్త్రాలలో దానశబ్దానికి తెలుపబడ్డ అర్థం ఇక్కడ సమన్వయించదు. అపుడే **"రఘుపతేః"** అనీ షష్ఠీవభక్త్యంతశబ్దంతో అన్వయం సిద్ధిస్తుంది. లేకపోతే చతుర్థీవిభక్త్యంతరూపంగా కదా ఉండాలి.

**(పుష్పశయ్యామ్)** - పూలతో నిర్మించిన శయ్యను,

**(కల్పయన్)** - నిర్మించేవారై, దివ్యదంపతులకు ఏవిధమైన సంకోచం, బాధలేకుండా శయనించడం వీలవుతుందో, ఆవిధంగా నిర్మించేవారై- అని అర్థం. **"కల్పయన్"** అనే వర్తమానార్థక పదప్రయోగంద్వారా మాటిమాటికి శ్రమపరిహారంకోసం వాడని పూలతో పడుకను సిద్ధం చేసే కైంకర్యం సూచింపబడింది.

**(నిశి)** - రాత్రివేళలో,

**(పత్నీసహాయం రఘుపతిం పశ్యన్)**- పత్నీసహితుడైన శ్రీరాముని నిర్నిమేష (రెప్పపాటులేని) నేత్రాలతో **"సదాపశ్యంతి"**గా దర్శించేవారై,

**(ధన్యః సన్)** - తాము చేసిన కైంకర్యాలను దివ్యదంపతులు అంగీకరించి స్వీకరించడమనే గొప్ప ధనలాభాన్ని కలవారై - అని భావం. కైంకర్యమే కదా శేషభూతుని సంపద **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** (ధన్యులు నా నాథుని దర్శిస్తున్నాం) - అంటే లక్ష్మణుడు కైంకర్యసంపదను కలవాడని కదా అర్థం. **"ధన్యాః పశ్యంతి మే నాథమ్"** అని సీతాదేవిసూక్తి. ఇక్కడ శేషిదంపతుల కైంకర్యం కనుక, **"పత్నీ సహాయం రఘుపతిం పశ్యన్ ధన్య స్సన్"** అని అనబడింది. కైంకర్యం చేయడం దివ్యదంపతులకే కాని, బ్రహ్మచారి నారాయణునకు కాదు కదా!

**(పాపి)**- రక్షిస్తున్నారు. ధనుర్ధారియై, అప్రమత్తులై ఏ అపాయశంకాసంభావన లేని గుహాదిప్రదేశాలలో కూడా అతిశంకను పొంది, రక్షిస్తున్నారని భావం. ఇది ఆదిశేషుని స్వభావమే. **"ఆజ్గారవారమదు కేట్టు అழలుమిழుమ్ పూజ్గారరవణైయాన్"** (క్షీరాబ్ధిలో నిత్యముక్తులు చేసే మంగళాశాసనధ్వనిని విని, ఆదిశేషుడు స్వామిక్షేమం పట్ల అతిస్నేహ హేతుకమైన భయాన్ని పొంది తన పడగలనుండి విషాన్ని వెలువరిస్తున్నాడు) అనే దివ్యసూరి సూక్తి భావ్యం.

ఈ శ్లోకంలోని మొదటి మూడు పాదాలలో **"అహం సర్వం కరిష్యామి"** ఇత్యాది శ్రీరామాయణ శ్లోకార్థం తెలుపబడింది. **"నిశి రఘుపతిమ్"** ఇత్యాదిగా **"స్వపతః అహం సర్వం కరిష్యామి"**(నీవు నిద్రించేటపుడు అన్ని సేవలను చేస్తాను) అనే సూక్త్యర్థం తెలుపబడింది. **"ధన్యః"** అనే పదం ద్వారా అప్రాప్తమైన వ్యక్తి విషయంలో సంవాహనాదిసేవలను చేసే దుష్యంతాది అన్యప్రభువుల అధన్యత్వం సూచింపబడింది. దుష్యంతుడు **"కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్ సంచారయామి నళినీదళతాళవృంతైః, అంకే నిధాయ కరభోరు! యథాసుఖం తే సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ"** (చల్లని, శ్రమను పోగొట్టే, తామరాకులతో చేసిన విసనకర్రలతో చల్లని గాలులను వీస్తూ, నిన్ను నా ఒడిలో పెట్టుకొని, ఓ సుందరీ!, నీకు సుఖంగా కలిగేటట్లుగా, తామరల వలె ఎఱ్ఱని నీ పాదాలను సంవాహనం చేయనా?) అని అన్నాడు కదా! ఇతడు చేసిన సేవ పారమార్థికదృష్టిలో అప్రాప్తవిషయంలోని సేవయే కనుక ఇతనికి ధన్యత్వం సిద్ధించలేదు. **"ధనగణం లబ్ధా"** అనే సూత్రం ద్వారా సిద్ధించే ధన్యశబ్దం ధనలాభాన్ని పొందినవానిని తెల్పుతుంది. **"నిశి పత్నీసహాయం రఘుపతిం పశ్యన్ ధన్యః"** అనే ప్రయోగం ద్వారా **"అహం పునర్దేవ కుమారరూపం స్వలంకృతం తం సుత మాప్రజంతమ్, నందామి పశ్యన్నపి దర్శనేన భవామి దృష్ట్వా చ పునర్యువేవ"** (పరమపదంలో యువకుడైన భగవంతునివలె అందమైన రూపాన్ని కలవాడు, చక్కగా అలంకరించుకొన్నవాడు, దగ్గరకు వస్తున్నవాడైన ఆ కుమారుని చూచి, అతని దర్శనంతో ఆనందించాను. మళ్ళీ యువకుడనయ్యాను) అని పల్కిన దశరథునికంటే గల వైలక్షణ్యాం స్ఫురిస్తున్నది. **"రఘుపతేః భోజ్యమ్"**అనే ప్రయోగంలోని భోజ్యశబ్దంలో గల అర్హార్థాన్ని (తగినది అనే అర్థాన్ని) తెలిపే య ప్రత్యయం ద్వారా **"యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః"** (ఏ అన్నాన్ని పురుషుడు భుజిస్తాడో, ఆ అన్నాన్నే అతడు కొలిచే దేవతలు కూడ స్వీకరిస్తారు) అని చెప్పబడిన నిర్బంధం వ్యావర్తింపబడింది. లక్ష్మణునకు శ్రీరాముని విషయంలో గల భావబంధం (ప్రీతి) ఇటువంటిది కదా! లక్ష్మణుడు - **"అనురక్తోఽస్మి భావేన భ్రాతరం దేవి! తత్త్వతః, సత్యేన ధనుషా చైవ దత్తేనేష్టేన తే శపే,**

దీప్తమగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి, ప్రవిష్టం తత్ర మాం దేవి! త్వం పూర్వ మవధారయ" (సీతా దేవీ! నేను శ్రీరాముని పట్ల మనస్సులో ప్రీతిని కల్గిఉన్నాను. నా ధనుస్సు సాక్షిగా శపథం చేస్తున్నాను. విను. జ్వలించే వనంలోకి గాని, అగ్నిలోకి కాని శ్రీరాముడు ప్రవేశిస్తే, వెంటనే ముందుగానే నేను కూడా అతనితో పాటుగా వానిలో ప్రవేశిస్తాను - అని గ్రహించు) (అయోధ్య-21-18) అని అన్నాడు. తన కరణ కళేబరాదులు ఎల్లప్పుడు అన్ని రీతులలోను భగవానుని సేవకు మాత్రమే వినియోగపడతాయి - అనే విషయాన్ని స్వయంగా **"అద్య చందనసారస్య కేయూరామోక్షణస్య చ, వసూనాం చ విమోక్షస్య సుహృదాం పాలనస్య చ, అనుకూలా విమౌ బాహూ రామ కర్మ కరిష్యతః"** అని అంటూ పలికాడు. **"తత శ్చిరోత్తరాసంగసంధ్యా మన్వాస్య పశ్చిమామ్, జలమేవాదదే భోజ్యం లక్ష్మణే నాహృతం స్వయమ్, తస్య భూమౌ శయానస్య పాదౌ ప్రక్షాళ్య లక్ష్మణః"** (శ్రీరాముడపుడు సాయం సంధ్యను ఉపాసించి, లక్ష్మణుడు తీసికొని వచ్చిన జలాన్ని ఆహారంగా స్వీకరించాడు. అపుడు లక్ష్మణడతని పాదాలను కడిగాడు) అని, **"తమ్ జాగ్రతమ్"** అని గల వచనాలు స్మరణీయాలు. **"పుష్పశయ్యాం కల్పయన్"** అని, **"పశ్యన్"** అనే ప్రయోగాల ద్వారా శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలోని **"పరప్రయోజనప్రవృత్తి ప్రయత్నఫలమ్, తద్విషయ ప్రీతి చైతన్యఫలమ్"** అనే సూత్రం (72వ సూత్రం), దానికి శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం స్మరింపజేయబడ్డాయి. అక్కడ లక్ష్మణులు పల్కిన **"అహం సర్వం కరిష్యామి"** అనే సూక్తి ప్రమాణీకరింప బడడం కూడా గమనార్హం.

**85.** అవ :- గడచిన రెండు శ్లోకాలలో కాయికమైన పరిచర్య తెలుపబడింది. ఇందులో, వాచిక కైంకర్యం ప్రస్తావింపబడుతున్నది.

> **పశ్యన్నగ్రే పరిమితహిత స్నిగ్ధవాగ్వృత్తియోగం**
> **సద్యః శోకప్రశమనపరం సాంత్వయంతం భవంతమ్ ।**
> **ప్రాజ్ఞో జజ్ఞే స ఖలు భగవాన్ దూయమానో వనాంతే**
> **పశ్చాత్కర్తుం వరవరమునే! జానకీవిప్రయోగమ్ ॥**

వరవరమునే = ఓమణవాళమహామునీ!, భగవాన్ సః = జ్ఞానం, శక్తి మొదలైన కల్యాణగుణాలను పూర్ణంగా కల్గిన ఆ శ్రీరాముడు, దూయమానః సన్ = సీతను విశ్లేషించి, పరితపించేవాడై, పరిమిత = తన వినయం, శ్రీరామునిపట్ల గౌరవం, విషయంయొక్క యథార్థతత్త్వం స్ఫురించేటట్లుగా పరిమితమైనది, హిత = ఉత్తరకాలంలో మంచిని కల్గించేది, స్నిగ్ధ = స్నేహంతో కూడినది అయిన, వాగ్వృత్తియోగం = వాక్కు అనే శ్రీరాముని పరితాపాన్ని తీర్చే ఉపాయాన్ని కల్గినవారై, సద్యః శోకప్రశమనపరం = వెంటనే శోకాన్ని తీర్చడమే ఉద్దేశ్యంగా కల్గినవారై, సాంత్వయంతమ్ = మంచిమాటలతో ఓదార్పును పలికే, భవంతం = దేవరవారిని, అగ్రే =తమకు ఎదురుగా, పశ్యన్ = చూస్తూ ఉన్నవాడై, వనాంతే = వన ప్రదేశంలో, జానకీవిప్రయోగం = సీతాదేవివిశ్లేషంవల్ల తనకు కల్గిన దుఃఖాన్ని, పశ్చాత్ కర్తుం = దాటడానికి, ప్రాజ్ఞః జజ్ఞే కిల = సమర్థుడయ్యాడు కదా!

పరిమితమైన, హితాన్ని కల్గించే, ప్రీతి పూర్వకమైన, శోకాన్ని ఉపశమింపజేయడంలోనే ఉద్దేశ్యాన్ని కల్గినవి అయిన లక్ష్మణుని మాటల మాధుర్యంచేత రావణుడు నశించి పోవడం తథ్యమని, సీతాదేవి తిరిగి లభించడం నిశ్చయమనే అభిప్రాయం శ్రీరామునకు కల్గినందున, అతడు సీతాదేవి విశ్లేషవ్యసనాన్ని సహించగలిగాడు.

లక్ష్మణుడు శ్రీరాముని ఓదార్చిన విషయం **"ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సంధ్యా ముపాసత, స్మరన్ కమలపత్రాక్షీం సీతాం శోకాకులీకృతః"** (రామా- యుద్ధ-5-23) (శ్రీరాముడు, తామరరేకులవంటి కన్నులను కల సీతాదేవిని తలచి, దుఃఖంతో వ్యాకులాన్ని పొందినవాడై, లక్ష్మణుడు ఓదార్చగా ఊఅటను పొంది, సంధ్యావందనాన్ని చేశాడు) అనే శ్రీరామాయణ శ్లోకం ద్వారా తెలుస్తున్నది.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే)** - ఓమణవాళమహామునీ!,

**(భగవాన్ సః)** - జ్ఞానశక్త్యాదిగుణపూర్ణుడైన, సీతావియోగాన్ని పొందినవాడైన ఆ శ్రీరాముడు,

**(పరిమితహితస్నిగ్ధవాగ్వృత్తి యోగమ్)**- శ్రీరామునిపట్ల వినయంవల్ల, గౌరవంవల్ల **"సత్యాయ మితభాషిణామ్"** అనే రీతిలో సత్యం కోసం పరిమితమైనది, ఉత్తరకాలంలో మంచిని కల్గించేది, స్నేహహేతుకమైనది, అందువల్లనే మిక్కిలి మధురమైనది అయిన వాగ్వ్యాపారమనే వాక్కులను పల్కడమనే ఉపాయాన్ని కలవారై- అని అర్థం. **"పరిమిత, హిత, స్నిగ్ధ"** అనే విశేషణాలు వాక్కు ఏవిధంగా ఉండాలో తెల్పుతున్నాయి. పరిమితమంటే సూత్రప్రాయంగా, పరివృత్త్యసహిష్ణువుగా ఉండడం. హితమంటే శుభోదర్కంగా ఉండడం. స్నిగ్ధమంటే ప్రీతిని కల్గి ఉండడం. లేక, స్నేహశబ్దానికి సాంద్రత అనికూడా అర్థం ఉన్నందున పలు విధాలైన అర్థాలను ఇముడ్చుకొనగల్గి ఉండడం. **"పరిచిత మివాథాపి గహనమ్"** అనే రీతిలో గంభీరంగా ఉండడం - ఇత్యాదులు భావ్యాలు **"హిత, స్నిగ్ధ"** అనే విశేషణాల ద్వారా **"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్"** ఇత్యాది సూక్తి స్మరింపజేయబడింది. లక్ష్మణుని వచనాలు ఇటువంటివి అనే విషయాన్ని తరువాతి శ్లోకంలోని **"సూనృత"** అనేశబ్దం సూచిస్తున్నది.

**(సద్యః శోకప్రశమనపరమ్)** - శోకాతిరేకం కల్గిన క్షణంలోనే దానిని పూర్తిగా తీర్చడమే పరమ ప్రయోజనంగా కలవారై - అని అర్థం. **"ప్రశమన"** పదంలోని **"ప్ర"** అనే ఉపసర్గవల్ల ధ్వనించే అర్థం భావ్యం.

**(సాంత్వయంతమ్)** - మిక్కిలి తీయని మాటలతో ఓదార్చేవారైన,

**(భవంతమ్)** - దేవరవారిని,

**(అగ్రే పశ్యన్)** - తన ముందు చూస్తూ,

**(వనే)** - వనసీమలో,

**(జానకీవిప్రయోగమ్)** - సీతాదేవీ విశ్లేషదుఃఖాన్ని,

**(పశ్చాత్ కర్తుమ్)** - దాటడానికి,

**(ప్రాజ్ఞో జజ్ఞే ఖలు)** - సమర్థుడయ్యాడు కదా !

శ్లోకంలో **"పరిమిత"** ఇత్యాది విశేషణాలద్వారా అనిష్టనివృత్తిని కలుగజేసే వచనాలలోని మాధుర్యం తెలుపబడింది. **"సాంత్వయంతమ్"** అనే ప్రయోగంద్వారా ఇష్టప్రాప్తిని కలుగజేసే వచనాలలోని తీయదనం సూచింపబడింది. ఈవిధంగా దేవరవారి వచనాలను వినిన శ్రీరామునకు "సీత లభించింది'' అనే రూపంలోని ప్రతిపత్తి కల్గడంవల్ల అతనికి సీతావిప్రయోగం సహించగల్గినది అయినదని భావం. ఈవిధమైన భావన కల్గడం యుక్తమే. **"చిరనిర్వృత్తమప్యేతత్ ప్రత్యక్షమివ దర్శితమ్"** అని ఎపుడో జరిగిన వృత్తాంతం ఇపుడే జరుగున్నట్లుగా భాసించడం ప్రతిపాదించే వక్తయొక్క సామర్థ్యాన్నిబట్టి ఉంటే, జరుగబోయే వృత్తాంతం కూడా ఆవిధంగా ఇపుడే సంభవిస్తున్న భావన కల్గడం న్యాయమే. **"ఆశ్వాసితో లక్ష్మణేన"** అని ఆరంభించి **"స్మరన్ కమలపత్రాక్షీం రామః సంధ్యా ముపాసత"** ఇత్యాదిగా లక్ష్మణుని వచనాలు శ్రీరామాయణంలో తెలుపబడ్డాయి. **"ప్రజ్ఞః''** - ప్రకర్షంగా విశేషంగా తెలిసికొనేవాడే ప్రజ్ఞుడు- ప్రజ్ఞుడే ప్రాజ్ఞుడని అనబడుతున్నాడు. ఇక్కడ జ్ఞానంలోని ప్రకర్ష ఏమంటే- దానికి అనుగుణమైన శక్తిని, ఉత్సాహాన్ని కలుగజేయగల్గడమే. అందువల్లనే శ్రీరాముడు సీతావిరహాన్ని సహించడంలో శక్తిని కలవాడయ్యాడని ఏర్పడుతున్నది- అని వాధూలవీరరాఘవాచార్య స్వామివారి వ్యాఖ్య.

**86.** అవ :- గడచిన శ్లోకంలో, సహోదరుని పత్నీవిరహదుఃఖం ఉపశమించేటట్లుగా అతనికి ఉపశమన వచనాలను పల్కడమనే లక్ష్మణుని వాచికకైంకర్యం తెలుపబడింది. ఇందులో, సహోదరుని కార్యం నెఱవేరడం కోసం- అన్యులవద్ద మాటలాడడమనే వాచికకైంకర్యం ప్రస్తావింపబడుతున్నది.

**సుగ్రీవో న శ్శరణ మితి యత్ సూనృతం భ్రాతు రర్థే**
**పంపాతీరే పవనజనుషా భాషితం శోభతే తే ।**
**కాలాతీతే కపికులపతౌ దేవ! తత్రైవ పశ్చాత్**
**చాపం ధూన్వన్ వరవరమునే! యద్భవాన్ నిగ్రహేఽభూత్ ॥**

వరవరమునే! = ఓ మణవాళమహామునీ!, పంపాతీరే = పంపాసరస్తీరంలో, పవనజనుషా = వాయుపుత్రుడైన హనుమానునితో, సూనృతం = ప్రియమైనది, సత్యమైనది అయిన, **"సుగ్రీవః నః శరణమ్"** ఇతి= "సుగ్రీవుడు మాకు దిక్కు'' అని, యత్ = ఏ మాట, భ్రాతుః అర్థే = సోదరుడైన శ్రీరాముని ప్రయోజనం కారణంగా, భాషితం = దేవరవారిచే పలుకబడిందో, భవాన్ = దేవరవారు, కపికులపతౌ = వానరుల కులానికి అధిపతి అయిన సుగ్రీవుడు, కాల+-ఃఅతీతే సతి = "రావణుని సంహరించడంకోసం సేవను సమీరిస్తాను'' అని అతడు పల్కిన వర్షాకాలానికి అనంతరంకూడా ఆలస్యం చేసినపుడు, చాపం ధూన్వన్ = వింటి నారిని కదల్చి, ధ్వనిని (ధనుష్టంకారాన్ని) చేసి, తత్రైవ = ఆ సుగ్రీవుని విషయంలోనే, పశ్చాత్ = తరువాత, నిగ్రహే =వధించే ప్రయత్నమైన దండనలో, అభూత్ ఇతి యత్ = ప్రయత్నించారు- అనేది ఏది ఉన్నదో, తత్ = ఆ రెండు, తే శోభతే = శ్రీరాముని హితాన్నే తమ హితంగా భావించిన దేవరవారికి శోభను కల్గిస్తున్నది.

**"అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణం గతః"** (రామా-కిష్కిం-4-18), (నేను, శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందాము)- అనేది, **"యస్య ప్రసాదే సతతం ప్రసీదేయు రిమాః ప్రజాః, స రామో వానరేంద్రస్య ప్రసాద మభికాంక్షతే"** (రామా-కిష్కింధ-4-22) (ఎవరి కృప ఉంటే ఈ లోకంలో జనులు ఆనందిస్తున్నారో, అటువంటి శ్రీరాముడు ఇపుడు వానరప్రభువైన సుగ్రీవుని కృపను కోరుతున్నాడు) అనేది ఈ శ్లోకంలోని పూర్వార్ధంలో ప్రస్తావింపబడిన లక్ష్మణవాక్యం-అని గమనించాలి.

ఉత్తరార్ధంలో ప్రస్తావింపబడిన లక్ష్మణుడు ధనుష్టంకారాన్ని చేసిన వృత్తాంతం, సుగ్రీవుడు కాలాతీతం చేశాడు అనే వృత్తాంతం- **"రోషవేగ ప్రతపితః శ్రుత్వాఽఽభరణధ్వనిమ్, చకార జ్యాస్వనం వీరః దిశః శబ్దేన పూరయన్"** (రామా- కిష్కింధ- 33-25) (తీవ్రమైన కోపంయొక్క వేగంచేత తాపాన్ని పొందిన వీరుడైన లక్ష్మణుడు సుగ్రీవుని ఆభరణధ్వనిని విని, దిక్కులను శబ్దంతో పూరిస్తూ (ప్రతిధ్వనింపజేస్తూ), ధనుష్టంకారాన్ని చేశాడు) అనే వాక్యంవల్ల, **"మాసాంశ్చ చతురః కృత్వా ప్రమాణం ప్లవగేశ్వరః, వ్యతీత స్తాన్ మదవ్యగ్రః విహరన్ నావబుద్ధ్యతే"** (రామా-కిష్కింధ-33-44) (వానరాధిపుడైన సుగ్రీవుడు నాల్గు మాసాలను గడువుగా పెట్టి అవి దాటిపోయినా, తన కామంవల్ల కల్గిన మదంచేత, ఆనందంలో నిండినవాడై, కాలం గడచిన విషయాన్ని కూడా తెలియలేకుండా ఉన్నాడు) అని అంటూ తారవద్ద పల్కిన వాక్యంవల్ల తెలియవచ్చు. ఇంతేకాక, లక్ష్మణుడు సుగ్రీవుని దండించాలని సిద్ధపడిన విషయం- **"కృతం త్వం నాభిజానీషే రామస్యాక్లిష్టకర్మణః, సద్య స్త్వం నిశితై ర్బాణైః హతో ద్రక్ష్యసి వాలినమ్"** (రామా- కిష్కింధ-34-17) (శ్రీరాముడు నీకు చేసిన మంచిని నీవు తెలియలేకున్నావు, ఏ కార్యాన్ని అయినా సులభంగా పూర్తిచేయగల్గిన అతని పదునైన బాణాలచే ఇపుడే వధింపబడి, నీ అన్నవాలిని చేరి అతనిని చూడబోతావు) అనే వాక్యంవల్ల గ్రహించవచ్చు. దీనినిబట్టి శ్రీవరవరమునులు. లక్ష్మణుడై అవతరించినపుడు శ్రీరామునికోసం హనుమానుని వద్ద, సుగ్రీవునివద్ద, తారవద్ద తగినమాటలను పల్కి, కైంకర్యం చేశారు- అని తెలుపబడింది.

వ్యాఖ్యానమ్ : (దేవ! వరవరమునే!) ఓ మణవాళమహామునీ!,

**(పంపాతీరే)** - పంపా అనబడే సరస్సుఒడ్డున,

**(పవనజనుషా సహ)** - హనుమానునితో,

**(సూనృతమ్)** - ఏ మధురమైనది, సత్యమైనది అయిన - అని అర్థం. **"సూనృతం ప్రియే సత్యే"** అని, **"సూనృతం మంగళేఽపి స్యాత్ ప్రియసత్యే వచస్యపి"** అనే నిఘంటు వచనాలనుబట్టి సూనృతశబ్దం నిజమైన, వినగానే ఆనందాన్ని కల్గించే మాటను తెల్పుతుంది.**"సుష్ఠు నృత్యంతి అనేన"**అని దీని వ్యుత్పత్తి. వినగానే ఆనందంతో గంతులు వేసేటట్లుగా ఉండేదని భావం. సూనృతం అనేది హితమై, ప్రియమై ఉంటుంది. దీనినిబట్టి లక్ష్మణుడు పల్కిన మాట శుభోదర్కమైనది, దానిని ఆలకించిన శ్రీరామునకు మిక్కిలి ఆనందాన్ని కల్గించినదని ధ్వనిస్తున్నది. ఆ సూనృతవచనం ఏమి? అంటే -

**(సుగ్రీవో నః శరణమ్ ఇతి)** - "సుగ్రీవుడు మనకు శరణం" అని. **"అస్మదోర్ద్వయోశ్చ"** అనే సూత్రానుసారం ద్వివచనార్థంలో **"నః"** అనే బహువచనం ప్రయోగింపబడింది.

**(భ్రాతురర్థే)** - సహోదరుడైన శ్రీరామునికోసం - అని అర్థం. **"భ్రాజతే ఇతి భ్రాతా, భ్రాజృ-దీప్తౌ"** అని ఈ పద వ్యుత్పత్తి.

**(యత్ భాషితమ్)** - "నాకు, శ్రీరామునకు కూడా సుగ్రీవుడే అనిష్టప్రాప్తికి, అనిష్టనివృత్తికి తగిన నిరపేక్షోపాయం - అనే అర్థాన్ని ఇచ్చే మాటను- అని అర్థం. సహోదరుడైన శ్రీరాముని ప్రయోజనమే తన ప్రయోజనంగా కల్గినదైన ఏమాటను- అని హృదయం.

**(భవాన్)** - దేవరవారు - అని అర్థం. **"యత్"** అనే శ్లోక పూర్వార్ధంలోని పదాన్ని అనువర్తింపజేసికోవాలి.

**(కపికులపతౌ)** - దేవరవారి పురుషకారంవల్ల రాజ్యాన్ని పొందింపబడిన వాడైన సుగ్రీవుడు- అని భావం. ఇక్కడ వానరాధిపత్యాన్ని సూచించే ఈ పదం సాభిప్రాయకప్రయోగం. అతడు కపికులపతి కావడానికి దేవరవారి పురుషకారమే కారణమని హృదయం. ఆ విషయాన్ని మఱచినవాడై, సుగ్రీవుడు,

**(కాలాతీతే)** - ఆలస్యం చేసినవాడు - కాలాన్ని అతిక్రమించినవాడు - కాగా. ఇక్కడ కాలశబ్దంద్వారా రావణవధకోసం తాను సేనను సమీకరించడం మొదలైన ప్రయత్నాలను చేస్తానని ప్రతిజ్ఞను చేసిన, వర్షాకాలానికి పిమ్మట గల కాలం - తెలుపబడుతున్నది.

**(చాపం ధూన్వన్)** - వింటినారి శబ్దాన్ని చేస్తూ,

**(తత్రైవ)** - ఆవిధంగా తాము శరణు పొందినవాడు, తమ పురుషకారం ద్వారా కపికులాధిపత్యాన్ని పొందినవాడు కావడం తమ అత్యంతాభిమానానికి పాత్రుడైన సుగ్రీవుని విషయంలో కూడా,

**(పశ్చాత్)** - తరువాత,

**(నిగ్రహే)** - వధపర్యంతమైన దండన చేయడానికి - అని అర్థం. నిగ్రహఫలం వధయే కనుక, ఇక్కడ నిగ్రహశబ్దానికి వధ- అని తాత్పర్యం.

**(అభూత్)** - సిద్ధపడ్డారో,

**(తత్)** - ఆ రెండు మాటలు,

**(దేవ! తే శోభతే)** - సహోదరుని ప్రయోజనమే స్వప్రయోజనంగా కల్గిన దేవరవారికి శోభను కల్గిస్తున్నది - అనే అర్థం ప్రకరణానుగుణం. **"దేవ"** అనే పదంచేత తదుచిత మాహాత్మ్యం ధ్వనిస్తుంది. **"దివు-దీప్తౌ"** అని కదా ధాత్వర్థం.

**87.** అవ :- శ్రీవరవరమునుల యథార్థస్వరూపం- చరమశేషిత్వం చరమోపాయత్వం - అనే విషయాన్ని సీతాదేవి హనుమానునిద్వారా శ్రీరామునకు సందేశాన్ని పంపే వార్త మూలంగా తెలియజేసింది. భగవానుడు ప్రథమశేషి, ప్రథమోపాయం. అతని భక్తులు మధ్యమశేషి, మధ్యమోపాయం. ఆచార్యుడు చరమశేషి, చరమోపాయం శేషి- అంటే -కైంకర్యాన్ని గ్రహించి ఆనందించేవాడు. ఉపాయం అంటే- అనిష్టనివారణానికి, ఇష్టప్రాపణానికి తగిన సాధనం.

యస్మిన్ ప్రీతిం మదభిలషితా మార్యపుత్రో విధత్తే
యేనోపేతః స్మరతి న పితుః సోఽతివీరో గతిర్మే ।
ఇత్యేవం త్వాం ప్రతి రఘుపతిప్రేయసీ సందిశంతీ
వ్యక్తం దేవీ వరవరమునే! తత్త్వ మాహ త్వదీయమ్ ॥

వరవరమునే = ఓవరవరమునీ!, ఆర్యపుత్రః = నా భర్తయైన శ్రీరాముడు, మత్+అభిలషితాం = నేను కోరిన, ప్రీతిం = ప్రీతిని, యస్మిన్ = ఏలక్ష్మణునిలో, విధత్తే = స్వప్రయోజనంగా కల్గి ఉన్నాడో, యేన = ఏ లక్ష్మణునితో, ఉపేతః సన్ = కూడి ఉన్నవాడై, పితుః= తండ్రిని, న స్మరతి = స్మరించడం లేదో, అతివీరః = శ్రీరాముని కంటే వీరుడైన, సః = ఆ లక్ష్మణుడు, మే = నాకు, గతిః = శ్రీరాముని పొందడానికి ఉపాయమవుతున్నాడు, ఇతి వం = అని ఈవిధంగా, త్వాం ప్రతి = లక్ష్మణుడవై అవతరించిన దేవరవారి విషయంగా, సందిశంతీ = హనుమానుని ద్వారా సందేశాన్ని పల్కి పంపిన, దేవీ = మహాలక్ష్మి యొక్క అవతారమైన, రఘుపతి ప్రేయసీ = శ్రీరామునకు చాలా ప్రియమైన సీతాదేవి, త్వదీయం = దేవరవారియొక్క, తత్త్వం = యథార్థస్వరూపాన్ని, వ్యక్తమ్ ఆహ = స్పష్టంగా పలికింది.

శ్రీరామునకు మిగిలిన వారి విషయంలో గల ప్రేమకంటే, సీతాదేవిపట్ల గల ప్రేమ అధికం అనే విషయం - **"న చాస్య మాతా న పితా న చాన్యః స్నేహాత్ విశిష్టోఽస్తి మయా సమో వా"** (రామా-సుందర-36-30) (ఈ శ్రీరామునకు, ప్రేమకారణంగా, నాతో సమానమైనవారుగాని, నాకంటె మించినవారుగాని, ఆ శ్రీరాముని తల్లిగాని, తండ్రిగాని, ఇంకా మిగిలిన వేటెవ్వరుకాని, లేనే లేరు. వారందఱి పట్ల గల ప్రేమ కంటే నాపట్ల గల ప్రేమయే అధికం) అనే వాక్యాన్నిబట్టి, ఆ సీతాదేవి పట్ల గల ప్రేమకంటే లక్ష్మణుని విషయంలో అతని గల ప్రేమ అధికమనే విషయం - **"మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః"** (రామా-సుందర- 38-63) (శ్రీరామునకు, నాకంటె, సహోదరుడైన లక్ష్మణుడు మిక్కిలి అభిమానపాత్రుడు) అని అంటూ సీతాదేవి హనుమానుని వద్ద పల్కిన మాటను బట్టి తెలియవచ్చు. తనపట్ల కంటే, లక్ష్మణునిపట్ల శ్రీరాముడు మిక్కిలి ప్రేమను కల్గి ఉండడం సీతాదేవికి ఇష్టమనే విషయం **"మదభిలషితాం ప్రీతిం యస్మిన్ విధత్తే"** అనే ప్రయోగం వల్ల తెలుస్తున్నది.

లక్ష్మణునితో కూడి ఉన్నందున శ్రీరామునకు "మన తండ్రి జీవించి లేడు"- అనే దశరథుని గూర్చిన స్మృతి కలుగదు - అనే విషయాన్ని **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ, త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ"** (రామా- ఆరణ్య-15-28) (ఓ లక్ష్మణా! నా మనస్సును గ్రహించి, నా తండ్రి నా విషయంలో ఏవిధంగా చేశాడో, ఆ రీతిని తెలిసి, నేను ఏవిధంగా పర్ణశాలను నిర్మిస్తే సంతోషాన్ని పొందుతానో, ఆ రీతిలో నిర్మించడమే ధర్మం - అనే ధర్మాన్ని తెలిసి పర్ణశాల నిర్మాణం చేసిన పుత్రుడవైన నీచే (నీవు జీవించి ఉన్నందున) నా తండ్రి జీవించి ఉన్నాడు - మరణాన్ని పొందలేదు- అని నేను భావిస్తున్నాను) అని శ్రీరాముడు లక్ష్మణునితో పల్కడం ప్రమాణంగా భావించాలి.

భగవానుని కృపను మాత్రమే ఉపాయంగా గ్రహించే స్వభావాన్ని కల జీవాత్మకు, భగవానుని నూతనకృపకు లక్ష్యభూతులైనవారిలో, ముందువారికంటె వెనుకగల వారిపట్ల ప్రీతికి అధికంగా ఉంటుంది

కనుక, వెనుక అనుగ్రహింపబడిన విషయంలో ముందు అనుగ్రహింపబడినవారు చేసే కైంకర్యం స్వరూపాను రూపం. అందువల్ల తరువాత అనుగ్రహింపబడినవారు, తమకు ముందు అనుగ్రహింపబడిన వారు చేసే కైంకర్యాన్ని స్వీకరించడమనే శేషిత్వం అనేది భగవానుని ప్రీతివిశేషానికి లక్ష్యమైనందున వారిపట్ల ఉంటుంది. దీనికి ఉదాహరణగా తిరుప్పాణ్ ఆళ్వార్ల వృత్తాంతాన్ని గ్రహించవచ్చు. ముందు అనుగ్రహింపబడిన లోకసారంగముని తరువాత అనుగ్రహింపబడిన తిరుప్పాణ్‌కు సేవ చేయడం, దానిని తిరుప్పాణ్ భగవత్ప్రీతికరమని భావించి అంగీకరించడం, ఈ విషయాన్ని తమ ప్రబంధంలోని **"అడియార్క్కెన్నై ఆట్పడుత్తవిమలన్"** అనే సూక్తిద్వారా వ్యక్తం చేయడం గమనించవచ్చు. అందువల్ల శ్రీరాముని ప్రేమవిశేషానికి లక్ష్యమైన లక్ష్మణునిపట్ల గల శేషిత్వం - అనేది "నాపట్ల కంటే లక్ష్మణునిపట్ల శ్రీరామునకు ప్రీతి అధికం'' అని సీతాదేవి పల్కడంవల్ల తెలుస్తున్నది. ఈ విషయానికి శ్రీరాముడు పల్కిన **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్"** అనే వాక్యాన్ని కూడా ప్రమాణంగా గ్రహించవచ్చు. ఈ శ్లోకంలో శ్రీరాముడు త్యజించడానికి సిద్ధపడిన తన ప్రాణం, సీతాదేవి, లక్ష్మణుడు- అనే విషయ **"అపి, వా, సలక్ష్మణామ్"** అనే ప్రయోగాల ద్వారా ఈప్రాధాన్యం ధ్వనిస్తున్నది. శ్రీరాముడు ముందు తన ప్రాణాన్ని, తరువాత సీతాదేవిని, తరువాత లక్ష్మణుని నిర్దేశించినందున, ఈ మూడిటికి గల ఉత్తరోత్తర ప్రాధాన్యాన్నిబట్టి ఈ విషయం ధ్వనిస్తున్నది. శ్రీరంగరాజస్తవంలోని **"సద్యః సంశ్రిత కామధేనుమ్"** అనే ప్రయోగం ఈ అర్థాన్నే ఇస్తున్నదని వ్యాఖ్యానింపబడడం గమనార్హం. ఇది భగవానుని వాత్సల్యగుణానికి ప్రతీక.

సీతాదేవియొక్క ఇష్టప్రాప్తిని (శ్రీరామప్రాప్తిని) గూర్చి లక్ష్మణునకు గల ఉపాయత్వం **"మత్తః ప్రియతరో నిత్యం భ్రాతం రామస్య లక్ష్మణః, రాఘవ స్త్వత్సమారంభాత్ మయి యత్నపరో భవేత్"** (రామా- సుందర-38-66) (శ్రీరామునకు నాపట్ల కంటే సోదరుడైన లక్ష్మణుని పట్ల గల ప్రీతి ఎక్కువ. ఏవిధంగా నీ ప్రయత్నంవల్ల నా విషయంలో- శ్రీరాముని నేను పొందే విషయంలో చేయదగిన ప్రయత్నం పట్ల - ఆ లక్ష్మణుడు ఆసక్తిని పొందుతున్నాడో, ఆ విధంగా నీవు చేయాలి) అని హనుమానునితో సీతాదేవి పల్కిన దానినిబట్టి వ్యక్తమవుతున్నది. ఈవిధంగా సీతాదేవియొక్క సందేశవాక్యాలచేత ఆమెపట్ల శేషిత్వం, ఉపాయత్వం అనేవి లక్ష్మణరూపులైన శ్రీవరవరమునులకు ఉన్నదని సూచింపబడింది. ఇచటి వరవరవముని విషయంలో చెప్పబడిన శేషిత్వ, ఉపాయత్వాలు చరమపర్వాత్మకాలు భగవత్సంకల్పాధీనాలు, భగవత్ప్రీతికరాలు, భగవత్కైంకర్యంలో పర్యవసించేవి కనుక స్వరూపానురూపాలు. అందువల్ల, భగవానుని శేషిత్వ- ఉపాయత్వాలకు లోటు లేదని గమనించాలి.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే !)** ఓవరవరమునీ !,

**(ఆర్యపుత్రః)**- ఆర్యశబ్దం చేత మామ (భర్త తండ్రి) నిర్దేశింపబడుతాడు. అందువల్ల ఆర్యపుత్రశబ్దంతో భర్త నిర్దేశింపబడతాడు. నా భర్త అయిన శ్రీరాముడు- అని భావం.

**(మదభిలషితామ్ ప్రీతిమ్)** - నాచే అభిలషింపబడిన స్నేహవిశేషాన్ని,

**(యస్మిన్)** - ఏ లక్ష్మణునిలో,

**(విధత్తే)** - చేస్తున్నాడో - కల్గి ఉన్నాడో- స్వప్రయోజనంగా కల్గినవాడై ఉన్నాడో- అని భావం. **"న చాస్య మాతా న పితా న చాన్యః స్నేహాద్విశిష్టోఽస్తి మయా సమో వా"** అని చెప్పబడిన రీతిలో సర్వాతిశాయి అయిన ప్రీతిని సీతాదేవి విషయంలో శ్రీరాముడు కల్గి ఉన్నాడనే విషయం ప్రసిద్ధం. ఆ ప్రీతికంటే మించిన ప్రీతిని ఎవరిలో కల్గి ఉన్నాడో, ఆ లక్ష్మణుడు- అని భావం.

**(ఆర్యపుత్రః యేనోపేతః సన్)** - శ్రీరాముడు ఏ లక్ష్మణునితో కూడినవాడై,

**(పితుః న స్మరతి)** - తండ్రిని స్మరించలేదో - అని భావం. **"భావజ్ఞేన కృతజ్ఞేన... న సంవృత్తః పితా మమ"** అని చెప్పబడిన రీతిలో దశరథవిషయంలోని స్మరణ ఏమాత్రం కలుగడం లేదని భావం.

**(అతివీరః)** - శ్రీరామునకు మించిన గొప్ప వీరుడైన,

**(సః)** - ఆ శ్రీరాముని అత్యర్థమైన ప్రీతికి లక్ష్యభూతుడైన లక్ష్మణుడు- అని అర్థం.

**(మే)** - శ్రీరాముని అత్యంత ప్రీతికి లక్ష్యభూతురాలైన నాకు,

**(గతిః ఇత్యేవమ్)** - శరణమని ఈ రీతిలో,

**(త్వాం ప్రతి)** - లక్ష్మణుని రూపంలోని దేవరవారిని ఉద్దేశించి ఐంద్రవ్యాకరణ పండితుడైన హనుమాను ని ద్వారా,

**(సందిశంతీ)** - సందేశాన్ని పంపుతూ,

**(దేవీ)**- అనియోనిజ అయినందున తిరోహితం (మఱుగుపడనీ) తన అప్రాకృత స్వరూపాన్ని కల్గినదైన,

**(రఘుపతిప్రేయసీ)**- **"న జీవేయం క్షణమపి వినా తామసితే క్షణామ్"** (నల్లని కన్నులను కల ఆ సీతను వీడి క్షణంకూడా జీవించలేను) అని, **"ప్రాణేభ్యోఽపి గరీయసీ"** (నా ప్రాణాల కంటే మిన్న) అనే రీతిలో శ్రీరామునకు ప్రాణాలకంటే ప్రియమైన జానకి. **"దేవీ"** అనే ప్రయోగం ద్వారా వక్తృదోషాలుగా చెప్పబడే భ్రమప్రమాద విప్రలంభాదిదోషరాహిత్యం సూచింపబడింది.

భ్రమ - అంటే అన్యథాజ్ఞానం, ప్రమాదమంటే అనవధానం - అశ్రద్ధ. విప్రలంభమంటే - బుద్ధిపూర్వకంగా ఇతరులకు భ్రమను కల్గించడం, ఆదిశబ్దం ద్వారా అశక్తి మొదలైనవి తెలుపబడతాయి. అశక్తి అంటే - ఇంద్రియాల అసమర్థత. ఇవి అన్నీ లోకంలోని వక్తలో సాధారణంగా కన్పించే దోషాలు.

**(త్వదీయం తత్త్వమ్)** - దేవరవారి యథార్థతత్త్వాన్ని - అని అర్థం. భగవానుని అత్యర్థప్రీతికి విషయమైనవారిపట్ల దేవరవారు శేషియై, శరణ్యులై ఉండడమనే దేవరవారి స్వరూపయథాత్మ్యాన్ని,

**(వ్యక్తమాహ)**- స్ఫుటంగా ప్రతిపాదించింది- అని భావం.

**88.** అవ :- గడచిన శ్లోకంలో **"అతివీరః"** అని అంటూ శ్రీరాముని మించిన వీరునిగా లక్ష్మణుడు చెప్పబడ్డాడు కదా! ఆ అతిపరాక్రమశాలిత్వాన్ని- అతడు చేసిన ఇంద్రజిద్వధాదులను పురస్కరించుకొని నిరూపిస్తూ, అది లక్ష్మణుని రూపంలోని శ్రీవరవరమునులు చేసిన కాయికకైంకర్యమని అంటున్నారు.

**బాణై ర్యస్య జ్వలనవదనైః వాహినీ వానరాణాం**
**వాత్యావేగభ్రమితజలదస్తోమసాధర్మ్య మేతి ।**
**సోఽయం భగ్నో వరవరమునే! మేఘనాద శ్శరై స్తే**
**రక్షోనాథః కథ మితరథా హన్యతే రాఘవేణ ॥**

వరవరమునే = ఓ మణవాళమహామునీ!, వానరాణాం వాహినీ = అంతు లేని వానరుల సైన్యం, జ్వలన వదనైః= జ్వలించే నిప్పును తమ చివరలో కల్గిన, వాత్యావేగభ్రమిత = సుడిగాలి వేగంతో పరిభ్రమింపజేయబడిన, జలదస్తోమసాధర్మ్యం = మేఘాల సమూహంలో సామ్యాన్ని, ఏతి = పొందుతున్నదో, సః= అటువంటి, అయం = నాకంటిముందు నిలచిన వానివలె ప్రత్యక్షంగా తోచే (ఈ), మేఘనాదః = (పుట్టినపుడు మేఘం వలె గర్జించినందున మేఘనాదుడని రావణునిచే నామకరణం చేయబడిన) ఇంద్రజిత్తు, తే శరైః = లక్ష్మణుల రూపంలోని దేవరవారి బాణాలతో, భగ్నః= ఓడింపబడ్డాడు, ఇతరథా = లేకపోతే, రాఘవేణ = శ్రీరామునిచే, రక్షోనాథః= రాక్షసులకు ప్రభువైన రావణుడు, కథం హన్యతే = ఏవిధంగా వధింపబడతాడు.

రావణునికంటే పరాక్రమశాలి అయిన ఇంద్రజిత్తును లక్ష్మణుడు వధించినందుననే రావణుని శ్రీరాముడు వధించడం సాధ్యమైనది - అని పల్కినందున ఇటువంటి లక్ష్మణుని అతివీర్యాన్ని సీతాదేవి ముందు గానే గ్రహించి, ముందు శ్లోకంలో **"అతివీరః"** అని లక్ష్మణుని నిర్దేశించినదని గ్రహించాలి. ఈ విధంగా లక్ష్మణుడై ఉండే శ్రీవరవరమునులు శ్రీరామునకు శత్రుసంహారంలో సహాయపడిన కాయికకైంకర్యం ఈశ్లోకంలో ప్రస్తావింపబడింది.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే)** - ఓమణవాళమహామునీ!,

**(వానరాణాం వాహినీ)** వానరుల సంఖ్య లెక్కకు మించినది, **"తేషు సంఖ్యా న విద్యతే"** అనే రీతిలో. **"ఏష్షైవాశంసతే లంకాం స్వేనానీకేన మర్దితుమ్"** (తన సేనతో లంకను మర్దించాలని ఈ సుగ్రీవుడు కోరుతున్నాడు) అనే రీతిలో ఒక్కొక్కరు ప్రత్యేకంగా లంకను నశింపజేయడంలో సమర్థులైన వారు, సుగ్రీవాదులు. అటువంటి వానరుల సంఖ్య అనేకం. **"మత్తః ప్రత్యవరః కశ్చిత్ నాస్తి సుగ్రీవసన్నిధౌ"** (నాకంటే తక్కువవాడెవడూ సుగ్రీవుని సన్నిధిలో లేడు) అనేటపుడు షష్ఠీవిభక్త్యర్థం ప్రాధాన్యం. దీనిద్వారా ఒక్కొక్క వానరునియొక్క ప్రాధాన్యం సూచింపబడింది. అంటే- జాంబవంతుడు మొదలైన అన్యజాతులు సేనలో ఉన్నా, ప్రాధాన్యం సంఖ్యాప్రాచుర్యం- వానరులదే- అని భావం.

**(జ్వలనవదనైః)** జ్వాలను కల్గిన అగ్నిని చివరి (అగ్ర) భాగంలో కల్గినవి అయిన బాణాలతో,

**(యస్య) - "కిం ప్రశంససి రావణిమ్?"** (ఇంద్రజిత్తును ఎందుకు పొగడుతున్నావు?) అనే రీతిలో చాలా గొప్ప శౌర్యపరాక్రమాదులను కల్గినవాడని ప్రసిద్ధి చెందిన మేఘనాథుడని అర్థం.

**(బాణైః)** - బాణాలతో,

**(వాత్యా వేగసాధర్మ్యమ్ ఏతి)** - సుడిగాలివేగంవల్ల గుండ్రంగా తిరిగే మేఘాల సమూహంతో పోలికను వానరసేన పొందుతున్నది. **"ఏతి"** అనే వర్తమాలిక క్రియా ప్రయోగస్వారస్యం సహృదయైకవేద్యం. ఎపుడో చాలాకాలం క్రితం యుద్ధరంగంలో ఇంద్రజిత్తు తన బాణాలతో వానరసేనను, సుడిగాలితో పరిభ్రమింపజేయబడిన మేఘాలవలె, పరిభ్రమింపజేసిన సంఘటనను శ్రీరామచంద్రుని విషయంలో అత్యంతభక్తిని కల్గిన ఎఱుమ్బియప్పా శ్రీరామాయణం ద్వారా బ్రహ్మదేవునివలె ప్రత్యక్షీకరించుకొని, దానిని వర్తమానవృత్తాంతం వలె అనుభవిస్తూ **"ఏతి"** అనే వర్తమానకాలిక క్రియను ప్రయోగించారు- అని శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామివారు తమ వ్యాఖ్యలో ఈవర్తమాన కాలికక్రియా పదప్రయోగ స్వారస్యాన్ని హృదయంగమంగా వివరించారు. అంతేకాదు, ఈ విధమైన అనుభవం గతంలో కులశేఖరాళ్వార్లకు కల్గిన విషయం ప్రసిద్ధమని కూడా **"ప్రసిద్ధ శ్చాయం భగవతి కులశేఖరే"** అని ఒక ఉదాహరణాన్ని కూడా ఉట్టంకించారు. ఇది కవియొక్క ప్రత్యక్ష సమానాకార జ్ఞానరూపమైన పరజ్ఞానాన్ని సూచిస్తుంది.

**(సః అయమ్)**- అటువంటివాడు- స్మరించినంత మాత్రంలోనే నాకు ఎదురుగా ఉన్నట్లుతోచేవాడైన,

**(మేఘనాదః)**- పుట్టినపుడే మేఘంవలె గర్జించినందున అతని తండ్రి రావణుడు అతనికి మేఘనాదుడనే పేరును పెట్టాడు. ఆవిధంగా మేఘనాదుడనే పేరును కల ఇంద్రజిత్తు.

**(తే శరైః)**- లక్ష్మణావతార రూపులైన దేవరవారి బాణాలతో,

**(భగ్నః ఇతి యత్)**- వధింపబడ్డాడు; కనుకనే,

**(ఇతరథా)**- ఇంతకంటే వేఱు కారణంచేత- దేవరవారు చేసిన ఇంద్రజిద్వధకంటే వేఱయిన కారణంచేత- అని భావం. ప్రకారార్థకమైన **"థాల్"** ప్రత్యయం ఇక్కడ హేతుప్రకారవాచి.

**(రక్షోనాథః)**- రావణుడు,

**(రాఘవేణ కథం హన్యతే)**- ఈనాడు మనం అనుసంధిస్తున్న రీతిలో శ్రీరాముడు రావణుని వధను ఏవిధంగా చేసి ఉండేవాడు? అని భావం. ఈ విషయానికి అనుగుణంగా **"రావణే ర్హి జయేనాద్య జిత మిత్యుపధారయ"** (ఇంద్రజిత్తు జయింపబడినందున రావణుడు జయింపబడ్డాడనే భావించు) ఇత్యాది శ్రీరామాయణ వచనాలు స్మరణీయాలు.

**89.** అవ :- విరోధియైన ఇంద్రజిత్తును వధించి, తద్ద్వారా శ్రీరామునకు చేసిన కాయికకైంకర్యంకంటే, శ్రీరామచంద్రుని తిరుమేని విషయంలో చేసిన కైంకర్యమైన కాయిక వ్యాపారం చాలా గొప్పది - అని తెలుపడంకోసం శుశ్రూషా రూపమైన శేషవృత్తినిగూర్చి మళ్ళీ ఇందులో ప్రస్తావిస్తున్నారు.

పృథ్వీం భిత్వా పునరపి దివం ప్రేయసీ మశ్నువానామ్
దృష్ట్వా శ్రీమద్వదనకమలే దత్తదృష్టిః ప్రసీదన్ ।
ప్రేమోదగ్రైః వరవరమునే! భృత్యకృత్యై స్త్వదీయైః
నీతః ప్రీతిం ప్రతిదిన మసౌ శాసితా నైఋతీనామ్ ॥

వరవరమునే = ఓ వరవరమునీ!, నైఋతీనాం శాసితా అసౌ = రావణుడు మొదలైన రాక్షసులను వధించే ఈ శ్రీరాముడు, పృథ్వీం పునరపి భిత్వా = భూమిని, పుట్టినపుడువలె, మళ్ళీ బ్రద్దలు చేసికొని, దివమ్ అశ్నువానామ్ = శ్రీవైకుంఠాన్ని పొందుతున్న, ప్రేయసీమ్ = తన ప్రేమకు లక్ష్యభూతురాలైన సీతాదేవిని, దృష్ట్వా అపి = ప్రత్యక్షంగా చూచిన తరువాతకూడ, శ్రీమద్వదనకమలే = కైంకర్యమనే గొప్ప సంపదను పొందిన దేవరవారి శ్రీముఖపద్మంలో, దత్తదృష్టిః = దృష్టిని పెట్టినవాడై, ప్రసీదన్ = సీతాదేవి విశ్లేషం వల్ల కల్గిన కలత తీరి తేటపడినవాడై, ప్రేమ+ఉదగ్ర = తనపట్ల కల్గి ఉండే ప్రేమతో చాలా గొప్పవైన, త్వదీయైః = దేవరవారు చేసే, భృత్యకృత్యైః = దాస్యకృత్యాలతో (కైంకర్యాలతో), ప్రతిదినం = ప్రతిదినం, ప్రీతిం నీతః = సంతోషాన్ని పొందింపబడ్డాడు.

సీతతో కలసి ఉన్నపుడు శ్రీరామునకు ఎటువంటి సంతోషం కల్గిందో, అటువంటి సంతోషం ఆమెను విశ్లేషించినపుడుకూడా, లక్ష్మణుని ప్రీతి పురస్సరమైన కైంకర్యాలతో కల్గింది. పూర్వం రావణుడు అపహరించినపుడు తాను లేనందువల్ల, తరువాత తానే విశ్లేషించినందువల్ల, శ్రీరామునకు సీతాదేవి విశ్లేషం కొంతవరకు సహ్యమైనది. మూడవ విశ్లేషం తాను సాక్షాత్తు చూస్తూ ఉన్నపుడే భూమిని బ్రద్దలు చేసికొని లోపలకు వెళ్ళిపోయినందున కల్గినది కనుక, ఆదుఃఖం ఏమాత్రం సహ్యంగా ఉండదు. అటువంటి, సహించలేని దుఃఖాన్ని కూడా శ్రీరాముడు తన మనస్సును గ్రహించి లక్ష్మణుడు ప్రీతితో చేసే కైంకర్యాలవల్ల, మఱచిపోయి, ఆనందం పొందాడు- అని భావం.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే)**- ఓమణవాళమహామునీ!,

**(నైఋతీనాం శాసితా)**- రావణుడు మొదలైన రాక్షసులను వధించినవాడైన శ్రీరాముడు,

**(పృథ్వీం భిత్వా)**- **"తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి"** అని పల్కిన రీతిలో భూమిని బ్రద్దలు చేసికొని (భూమిలో అవకాశాన్ని పొంది),

**(దివమ్ అశ్నువానామ్)**- పరమపదాన్ని తిరిగి పొందుతున్న -పరమపద సంబంధాన్ని పొందుతున్న- అని అర్థం. లేక, **"పునరపి పృథ్వీం భిత్వా"** అని అన్వయించి, అవతరించిన కాలంలోవలె, నిర్యాణ సమయంలోకూడా భూమిని బ్రద్దలు చేసికొని- అని అర్థాన్ని చెప్పవచ్చు.

**(ప్రేయసీమ్)**- **"ప్రాణేభ్యోఽపి గరీయసీ"** (నా ప్రాణం కన్న మిన్న) అని స్వయంగా శ్రీరాముడే పల్కిన రీతిలో మిక్కిలి ప్రేమపాత్రురాలైన,

**(జానకీం దృష్ట్వా)**- జానకిని చూచి,

**(శ్రీమద్వదనకమలే దత్తదృష్టిః)** - **“లక్ష్మణో లక్ష్మిసంపన్నః”** (కైంకర్యం లక్ష్మిని కల లక్ష్మణుడు) అనే రీతిలో ప్రశస్తమైన కైంకర్యసామ్రాజ్యలక్ష్మిని కలవారైన లక్ష్మణుని రూపంలో అవతరించిన దేవరవారి, పద్మంవలె భోగ్యమైన ముఖపద్మంలో దృష్టిని పెట్టినవాడై,

**(ప్రసీదన్)** - జానకీవిరహంవల్ల కల్గిన దుఃఖాన్ని విడచి,

**(ప్రేమోదగ్రైః)** - గొప్ప అనురాగం కారణంగా అంతు లేని- అని అర్థం. **“ఉద్గతమ్ అగ్రమ్ అస్య”** అనే వ్యుత్పత్తిద్వారా ఉద్గతశబ్దం లక్షణయా అసంఖ్యేయత్వవాచకం. **“రాత్రిరేవ వ్యరంసీత్”** అనే రీతిలోని అంతులేని - అని తాత్పర్యం.

**(త్వదీయైః భృత్యకృత్యైః)** - **“ఎమ్మై విఱ్కవుమ్ పెఱువార్కళే”** (మమ్ములను అమ్మగల్గినరీవారు కూడా) అనే రీతిలో క్రమవిక్రయార్హులైన దాసులు చేసే అసాధారణ - అంతరంగకైంకర్యాలైన దేవరవారి సేవావ్యాపారాలతో,

**(ప్రతిదినమ్ ప్రీతిం నీతః)** - అనుదినం ఆనందాన్ని పొందాడు. జానకీదేవితో కలసి ఉండే స్థితిలో ఎటువంటి ప్రీతిని పొందాడో, అటువంటి ప్రీతినే పొందాడు - అని భావం. ధైర్యాన్ని స్థిరంగా సుస్థాపించే తన సేవల ద్వారా శ్రీరాముని మనస్సులో కలిగే శూన్యత్వాన్ని పోగొట్టాడు- లక్ష్మణుడని భావం. **“దృష్ట్వా”** అని అనడంవల్ల పూర్వం కల్గిన విశ్లేషంకంటే చివరలో సంభవించిన విశ్లేషం ప్రత్యక్షమైనది కనుక, దాని తీవ్రత సూచింపబడింది. పూర్వం సంభవించిన విశ్లేషం తాను దగ్గరలో లేని సమయంలో సంభవించింది కనుక, ఆ వియోగాన్ని ఏదో ఒక రీతిలో సహించవచ్చు. కాని, ఈ వియోగం అపరోక్షమైన వియోగం. అందువల్ల దుస్సహం - అనే రీతిలోని దుఃఖాన్ని కూడా శ్రీరాముడు దేవరవారి సేవలతో విస్మరించాడని భావం.

**90.** అవ :- శ్రీవరవరమునులు లక్ష్మణులుగా అవతరించినపుడు వారితో కలసి ఉన్నందున శ్రీరామునకు కల్గిన నిరతిశయానందం గతశ్లోకంలో తెలుపబడింది. దానికి మాఱుగా, వారి విశ్లేషం వల్ల శ్రీరామునకు కల్గిన నిరతిశయమైన వ్యసనం ఇందులో తెలుపబడుతున్నది.

**సోదర్యేషు త్వమసి దయితో యస్య భృత్యః సుహృద్వా**
**సోఢవ్యోఽభూత్ త్వయి సహచరే జానకీవిప్రయోగః ।**
**ధ్యాయన్ ధ్యాయన్ వరవరమునే! తస్య తే విప్రయోగం**
**మన్యే నిద్రా మరతిజనితాం మానయత్యగ్రజోఽయమ్ ॥**

వరవరమునే ! = ఓ మణవాళమహామునీ !, త్వం = పూర్వం లక్ష్మణునిగా అవతరించిన దేవరవారు, యస్య = ఏ శ్రీరామునకు, సోదర్యేషు = తోబుట్టువులైన వారిలో, దయితః= మిక్కిలి ప్రేమకు లక్ష్యభూతులైన, భృత్యః= దాసుడుగా గాని, సుహృత్ వా = స్నేహితుడుగా గాని, అసి = అవుతున్నారో, త్వయి సహచరే = అటువంటి దేవరవారితోకూడ ఉన్నపుడు, జానకీవిప్రయోగః= సీతాదేవితో సంభవించిన

మూడవ విశ్లేషం, యస్య = ఏ శ్రీరామునకు, సోఢవ్యః అభూత్ = సహించగల్గినదిగా అయినదో, సః= అటువంటి, అయం = ఈ (దాసుడనైన నా గృహంలో వేంచేసి ఉండే), అగ్రజః= దేవరవారికి ముందు అవతరించిన (అర్చారూపియైన శ్రీరాముడు), తస్య తే = అటువంటి (లక్ష్మణులుగా అవతరించిన) దేవరవారి, విప్రయోగం = విశ్లేషాన్ని, ధ్యాయన్ ధ్యాయన్ = మాటిమాటికి తలచేవారై, అరతిజనితాం = మిగిలిన వస్తువుల పట్ల (తనకు) కల్గిన అప్రీతివల్ల జనించిన, నిద్రాం = నిద్రను, మానయతి = గౌరవించి, ఎల్లప్పుడు స్వీకరిస్తున్నాడు, ఇతి మన్యే =అని ఊహిస్తున్నాను.

అర్చారూపిగా తమ గృహంలో వేంచేసి ఉండే శ్రీరామునకు, బయట ఉండే ఏ వస్తువులనుగూర్చి భావించకుండా ఉండడమనే నిద్ర అర్చావతార (సమాధి) స్వభావంచేత ఏర్పడింది. లక్ష్మణుని విరహాన్నిగూర్చి భావించినందున- అన్య విషయాలపట్ల అప్రీతి కలుగగా, దానివల్ల కల్గిన నిద్రగా అది ఇక్కడ ఉత్ప్రేక్షింపబడింది, అందువల్ల ఈ శ్లోకం ద్వారా- లక్ష్మణుని విశ్లేషాన్ని మాటిమాటికి తలచి, అన్యవిషయాల పట్ల అప్రీతి కలిగే అవధికి శ్రీరామునకు కల్గిన దుఃఖాతిశయం తెలుపబడింది.

ఇందులో, లక్ష్మణుని భృత్యునిగా (దాసునిగా) పల్కడం - అతడు, తనను శ్రీరామునకు దాసునిగా భావించినందున- అని, స్నేహితునిగా పల్కడం- శ్రీరాముడు అతనిని తన స్నేహితునిగా భావించినందున- అని గ్రహించాలి. **"అహ మస్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః"** (రామా-కిష్కింధా-4-11) (నేను శ్రీరామునకు భ్రాతను. అతని గుణాలను చూసి దాసుడనయ్యాను) అని లక్ష్మణుడు తనను గూర్చి హనుమానునితో పరిచయం చేసికొనేటపుడు "నేను తనకు తోడబుట్టిన సహోదరుడనేది - శ్రీరాముని అభిప్రాయం. శ్రీరాముని గుణాలకు జితుడనై, వారికి దాసుడనయ్యానని నేను నన్ను భావిస్తాను'' అని పల్కడం ఇక్కడ స్మరించాలి. శ్రీరామాయణంలో **"భ్రాతా"** అని లక్ష్మణుడు నిర్దేశింపబడగా, ఈ స్తుతిలో అతనిని **"సుహృత్"** అని అనడం - **"తోళుక్కు విఞ్జినాల్ తోழన్"** (భుజాల ఎత్తును మించి ఎదిగితే సోదరుని మిత్రునివలె చూడాలి) అనే తమిళ సామెతను అనుసరించి. **"ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్ర వదాచరేత్"** (పదహారవ ఏడువస్తే పుత్రుని పట్ల మిత్రునిగా వ్యవహరించాలి) అనే సంస్కృత ఆభాణకం కూడా ఇటువంటిదే.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే!)** ఓమణవాళమహామునీ!,

**(త్వమ్)** - లక్ష్మణునిగా అవతరించిన దేవరవారు,

**(యస్య)** - ఏ శ్రీరామునియొక్క,

**(సోదర్యేషు)** - దశరథుడనే ఒకే తండ్రికి పుట్టిన భ్రాతల మధ్యలో- అని అర్థం.

**(దయితః)** - మిక్కిలి ఇష్టమైన,

**(భృత్యః వా)** - క్రయవిక్రయార్హుడైన దాసుడుగా గాని,

**(సుహృత్ వా అపి)** - సఖుడుగా గాని - అవుతున్నారు. ఇక్కడ **"వా"** అనే పదం వికల్పార్థకం. శ్రీరాముని అభిప్రాయానుసారం భ్రాతృత్వ, సుహృత్త్వాదులు, లక్ష్మణుని అభిప్రాయం ప్రకారం అయితే భృత్యత్వం వివక్షితం. అందువల్లనే శ్రీరామాయణంలోని **"అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్య ముపాగతః"** అనే శ్లోకంలో స్ఫురించే శ్రీరామ, లక్ష్మణుల అభిసంధి (అభిప్రాయ) భేదానుసారంగా ఈడు వ్యాఖ్యలో వివరింపబడింది.

**(త్వయి సహచరే సతి)** - మీరు అతని సమక్షంలో ఉన్నపుడు,

**(జానకీవిప్రయోగః)** - అభిజన శ్లాఘనీయురాలైన జానకీదేవియొక్క మూడవ విశ్లేషం,

**(యస్య)**- ఏ శ్రీరామునకు,

**(సోఢవ్యః అభూత్)** - ఏ శ్రీరామునిచే సహించగల్గినది అయినదో,

**(అయమ్)** - అటువంటి నా కులధనమైన అర్చామూర్తి శ్రీరామచంద్రుడు,

**(తస్య)** - అతనికి,

**(తే విప్రయోగమ్)** - దేవరవారి విశ్లేషం. **"విసర్జయే త్వాం సౌమిత్రే !"** అనే రీతిలో తనకు తానుగానే వచ్చి మీదపడిన విశ్లేషాన్ని,

**(ధ్యాయన్ ధ్యాయన్)** - మాటిమాటికి ఉత్కంఠతో తలుస్తూ ఉన్నవాడై,

**(అరతిజనితామ్)** - అన్ని వస్తువుల పట్ల ఉండే అప్రీతి రూపమైన అరతిచేత కల్గిన,

**(నిద్రామ్)** - పరాగర్థానుసంధానాభావరూపమైన నిద్రను,

**(మానయతి ఇతి)** - గౌరవిస్తున్నాడు కాబోలు-అని,

**(మన్యే)** - ఉత్ప్రేక్షిస్తున్నాను.

ఈ శ్లోకంలో అర్చావతారసహజమైన, ఎవరినీ సాక్షాత్తుకటాక్షించక పోవడం, మాటలాడకపోవడం, భోజనపానాదులను సాక్షాత్తుగా గ్రహించకపోవడం అనే స్వభావం లక్ష్మణుని విశ్లేషంవల్ల కల్గిన అరతిహేతుకమైన నిద్రగా ఉత్ప్రేక్షింపబడింది- అనే విషయం **"మన్యే"** అనే ఉత్ప్రేక్షవ్యంజక శబ్దప్రయోగంవల్ల తెలుస్తున్నది. లేక, **"మన్యే"** అనే పదప్రయోగం స్వాభిప్రాయకథనంగా కూడా చెప్పవచ్చు.

**91.** అవ :- గడచిన శ్లోకంలో, లక్ష్మణుని రూపంలోని దేవరవారితో విశ్లేషం కలుగని సమయంలో శ్రీరామునకు సీతాదేవితో సంభవించిన వియోగం బాధించలేదని తెలుపబడింది. ఇందులో, దేవరవారి విశ్లేషం సంభవించినపుడు సీతాసంశ్లేషం కూడా అకించిత్కరమైనదని అంటున్నారు.

**ముగ్ధాలోకం ముఖ మనుభవన్ మోదతే నైవ దేవ్యాః**
**స్నిగ్ధాలాపం కపికులపతిం నైవ సించత్యపాంగైః ।**

త్వామేవైకం వరవరమునే! సోదరం ద్రష్టుకామో
నాథో నైతి క్వచిదపి రతిం దర్శనే యూథపానామ్ ॥

వరవరమునే! = ఓ మణవాళమహామునీ!, నాథః= రఘునాథుడైన శ్రీరాముడు, సోదరం = సహోదరుడై, ఏకం = ముఖ్యుడైన, త్వామ్+ఏవ = లక్ష్మణుని రూపంలోని దేవరవారిని మాత్రం, ద్రష్టుకామః సన్ = చూడాలని చాలా ఆశపడినవాడై, దేవ్యాః = బంగారు ప్రతిమరూపంలోని సీతయొక్క, ముగ్ధ + ఆలోకం = అందమైన చూపును, లేక, లావణ్యాన్ని కల, ముఖం = ముఖాన్ని, అనుభవన్ అపి = అనుభవిస్తూ ఉన్నవాడైనా, నైవ మోదతే = ఆనందాన్ని ఎంతమాత్రం పొందడంలేదు, స్నిగ్ధ+ఆలాపం = స్నేహం చేత మృదువైన వచనాలను కల, కపికులపతిం = వానరకులానికి అధిపతి అయిన సుగ్రీవుని, అపాంగైః= తన కటాక్షాలతో, నైవ సించేత్ = తడపడం లేనేలేదు, యూథపానాం = వానరసమూహానికి నాయకుడైన హనుమానుడు మొదలైనవారిని, సాక్షాత్కారే = కటాక్షించడంలోను, క్వచిదపి = సుఖాన్ని కల్గించే వేఱొక ఏవస్తువులోను, రతిం న ఏతి = ఆనందాన్ని పొందడంలేదు.

సీతాదేవియొక్క మూడవ విశ్లేషం తరువాత కాలక్షేపార్థం, సీతను చూడలేని దుఃఖాన్ని ఒకరీతిలో తీర్చుకోవడంకోసం, సీతను పోలిన, చాలా అందమైన ఒక బంగారు ప్రతిమను చేయించి, దానిని తన ప్రక్కన పెట్టుకొని, దానిని చూస్తూ దుఃఖాన్ని కొంతవరకు పోగొట్టుకోవడానికి శ్రీరాముడు ప్రయత్నించాడు. దానికి పిమ్మట, లక్ష్మణుని విశ్లేషం సంభవించింది. అపుడు లక్ష్మణునిమాత్రం చూడాలని తోచిందే తప్ప, సీతయొక్క ప్రతిమను చూడడంలో ఆశలేనివాడై, దానివైపు చూడకుండానే శ్రీరాముడు ఉండిపోయాడు. లక్ష్మణుని విశ్లేషించిన దుఃఖాన్ని ఉపశమనవాక్యాలతో మఱపించే సుగ్రీవుని వైపు చూడలేదు. పలు మాటలు ఎందుకు? హనుమానుని వైపు చూడడంలోగాని, ఇంకా ఆనందాన్ని కల్గించే ఏ వస్తువును చూడడంలో గాని శ్రీరాముడు ఆశను పొందలేదు- అని పల్కినందున తన ప్రాణాలకంటే మిన్న అయిన సీతాదేవి యొక్క ప్రతిమ తనప్రక్కనే ఉండగా, పూర్వం దానిని ఎల్లప్పుడు చూచి ఆనందించిన శ్రీరాముడు లక్ష్మణుని విశ్లేషించిన తరువాత, ఆ ప్రతిమకూడ అతనికి ఆనందాన్ని కల్గించలేదు. లక్ష్మణుని విశ్లేషం శ్రీరామునకు అంత మిక్కిలి గొప్ప దుఃఖాన్ని కల్గించింది- అని ఈ శ్లోకభావం.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే!)** ఓవరవరమునీ!,

**(నాథః)** - రఘుకులనాథుడైన శ్రీరాముడు,

**(సోదరమ్)** - సోదరుని - అని అర్థం. **"సాదరమ్"** అనే పాఠాంతరానికి తన విషయంలో మిక్కిలి ఆదరాన్ని ప్రీతిని కల్గినవానిని - అని అర్థం. లేక, **"సాదరమ్"** ఈ పదాన్ని **"ద్రష్టుకామః"** అనే పదానికి అన్వయించి, దర్శనవిశేషణంగా చేయవచ్చు. "సాదరంగా చూడడంకోసం" అని అర్థం.

**(ఏకమ్ ఏవ)** - లక్ష్మణుని రూపంలోని దేవరవారిని ఒక్కరినే - అని అర్థం. **"ఏవ"** కారం చేత సీతావలోకనం చేయడానికికూడా ఇష్టపడలేదని భావం.

**(ద్రష్టుకామ స్సన్)** - చూడడంలో తీవ్రమైన అభిలాషను కలవాడై - అని అర్థం. **"సంగాత్ సంజాయతే కామః"** అనేచోట తెల్పిన రీతిలో, విషయానుభవం అతిశయించినపుడు స్వరూపయాథాత్మ్యాన్ని ధరించడంకూడా దుర్లభమయే - అంటే - సహజమైన, స్వాభావికమైన స్వరూపాన్ని కూడా ధరించలేని అవశమైన అవస్థను కల్గించే - తీవ్రమైన అభిలాష కల్గుతుంది. దానికే కామమని పేరు. అటువంటి, అత్యంతం బలమైన అభిలాషను శ్రీరాముడు, లక్ష్మణుని చూడడంలో పొందాడని భావం.

**(ముగ్ధాలోకమ్)** - అందమైన, లావణ్యాన్ని కల్గిన- అని అర్థం. ఆలోకమంటే తేజస్సు. దాని ద్వారా లావణ్యం ఇక్కడ వివక్షితం.

**(దేవ్యాః)** - బంగారు ప్రతిమరూపంలోని సీతాదేవియొక్క,

**(ముఖ మనుభవన్)** - ముఖాన్ని చూస్తూ ఉన్నవాడైనా - అని అర్థం. ఇక్కడ అప్యర్థం వివక్షితం.

**(నైవ మోదతే)** - ఆనందం పొందే స్థితిలో కూడా ఆనందించడంలేదు- అని అర్థం. **"కదా ను ఖలు బింబోష్ఠం తస్యాః పద్మమివాననమ్, ఈషదున్నమ్య పాస్యామి రసాయన మివాతురః"** (దొండపండు వంటి కిందిపెదవిని కలిగిన ముఖం కలిగిన సీతాదేవి యొక్క ముఖాన్ని కొంచెం ఎత్తి, ఆమె అదరాన్ని రసాయనం వలె ఎప్పుడు పానం చేయగలను?) అని ఆశపడిన సీతాదేవి యొక్క ముఖాన్ని చూస్తూ ఉన్నా - అని భావం. జానకీదేవీవిశ్లేషానంతరమే లక్ష్మణుని వియోగం సంభవించినందున, దానికి ముందు సీతాదేవి ముఖానుభవప్రసక్తి కేవలం హిరణ్య ప్రతిమరూపంలోని సీతాదేవి విషయంలోనే సంభవిస్తుంది. కనుక, ఈ విధంగా వ్యాఖ్యానించబడింది.

**(స్నిగ్ధాలాపమ్)** - స్నేహపూర్వకమైన మృదువచనాలను పలికే,

**(కపికులపతిమ్)** - సుగ్రీవుని - **"లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి"** (పూర్వం లోకనాథుడైన శ్రీరాముడిపుడు సుగ్రీవుని శరణుపొందుతున్నాడు) అని, **"త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ"** (నీకు ఏ కొంచెమైనా ఆపదకల్గితే ఇక నాకు సీతతో ఏమి పని?) అని అభిమానించిన సుగ్రీవుని కూడా,

**(అపాంగైః)** - కటాక్షాలతో,

**(నైవ సించతి)** - తడపడం లేదు. సుగ్రీవుడు విరహాన్ని పోగొట్టడం కోసం ఆయా వృత్తాంతాలను గూర్చి పల్కుతూ, శ్రీరాముని లక్ష్మణ వియోగదుఃఖాన్ని తీర్చాలని ప్రయత్నించినా, అతనివైపు శ్రీరాముడు కన్నెత్తి కూడా చూడలేదని భావం.

**(యూథపానాం దర్శనే)** - ఐంద్రవ్యాకరణపండితుడైన హనుమానుడు మొదలైనవారిని చూడడంలో,

**(క్వచిదపి)** - పూర్వం తెల్పిన, ప్రస్తావించని సౌఖ్యహేతువులైన ఏ వస్తువుపట్ల కూడా,

**(రతిం నైతి)** - ఆసక్తిని ప్రీతిని పొందడం లేదు,

**"తత్రాపి బాష్పదిగ్ధం చక్షు ర్వినోదయామి"** అని చెప్పబడిన రీతిలో బంగారు సీతాదేవి ప్రతిమను చేయడంలోని ఫలం- ఉత్కంఠను పోగొట్టుకోవడం కోసమే. అశ్వమేధాదుల నిర్వహణ నిమిత్తం కాదు, ఆనృశంస్య (దయ)- కారణంగా కాదు. **"యజ్ఞే యజ్ఞే చ కురుతే సీతాం పత్నీం హిరణ్మయీమ్"** అనే సూక్తిని **"హిరణ్మయీం యజ్ఞే యజ్ఞే పత్నీం చ కురుతే"** అని అన్వయించడం వల్ల (చకారం ద్వారా) అశ్వమేధసహచరీకరణం అప్రధానమని, దుఃఖాన్ని పోగొట్టుకోవడమే ప్రధాన ప్రయోజనమని తెలుస్తున్నది - అని వీర రాఘవాచార్య స్వామివ్యాఖ్య.

**92.** అవ :- ఈ విధంగా **"భుంక్తే నైవ"** అనే 83వ శ్లోకం నుండి గడచిన 91వ శ్లోకం వరకు వరుసగా తొమ్మిది శ్లోకాల అర్థాన్ని అనుసంధించడం ఎందుకోసం? అని అంటే, చరమపర్వనిష్ఠులచే శ్రీరామాయణం ప్రమాణంగా గ్రహింపబడడానికి కారణం- చరమశేషి అయిన శ్రీవరవరమునుల కంటే వేఱుకాని లక్ష్మణుని వైభవాన్ని ప్రతిపాదించడమే - అనే విషయాన్ని సూచించడంకోసమే - అని గ్రహించాలి. లేకపోతే, చరమపర్వనిష్ఠులైన ఈ ఎఱుమ్బియప్పా ఈ శ్లోకాలను పల్కడం పొసగదు కదా! అందువల్లనే **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్"** (రామా-బాల-4-7) (కావ్యమైన శ్రీరామాయణం పూర్తిగా సీతయొక్క గొప్ప చరిత్ర) - అనే రీతిలో శ్రీరామాయణం ద్వారా ముఖ్యంగా చెప్పదలచిన సీతను నిర్దేశించడానికి ముందే **"రామలక్ష్మణసీతాభిః"** (రామా-బాల-3-3) అని అనుక్రమణికాసర్గలో లక్ష్మణుని నామాన్ని వాల్మీకి భగవానుడు నిర్దేశించారని గమనించాలి.

ఈ రీతిలో, ఈ శ్లోకంలో, శ్రీరామావతారంలో తనకు అన్నివిధాలైన కైంకర్యాలను చేసిన లక్ష్మణునకు, తానే అటువంటి సేవలను చేయాలని ఆశపడి **"కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి"** (రామా-అయో-1-11) (తెలిసిగాని, తెలియకగాని చేసిన ఒక ఉపకారంతో శ్రీరాముడు ఆనందిస్తాడు) అని చెప్పబడ్డ కృతజ్ఞత- అనే స్వభావవిశేషాన్ని కల్గి ఉన్నందున, నిరంకుశ స్వాతంత్ర్యాన్ని పరిగ్రహించి, లక్ష్మణుని అవతారమైన బలరామునకు తమ్ముడుగా శ్రీకృష్ణావతారాన్ని భగవానుడు గ్రహించాడు- అని అంటూ, చరమపర్వమైన బలరాముని విషయంలో ఆదరాన్ని కల్గిన శ్రీకృష్ణుని చరిత్ర అయినందువల్లనే చరమపర్వనిష్ఠులు భారతాదులను ప్రమాణంగా పరిగ్రహిస్తున్నారు- అనే విషయాన్ని సూచింపగోరినవారై, "ఇక ఎల్లప్పుడు, ఓ వరవరమునీ! దేవరవారి విశ్లేషం భగవానునకు కలుగకూడదు'' అని అంటున్నారు.

**ఏవం దేవః స్వయ మభిలషన్ ఏష తే శేషవృత్తిం**
**జజ్ఞే భూయ స్తదను జగదానందనో నందసూనుః ।**
**దూరీభావం వరవరమునే! దుస్సహం పూర్వజ స్తే**
**ధన్య స్త్యక్త్వా ధయతు న చిరాచ్చక్షుషా రాఘవ స్త్వామ్ ॥**

వరవరమునే! = ఓ మణవాళమహామునీ!, దేవః= సర్వేశ్వరుడైన, తే పూర్వజః= లక్ష్మణులై అవతరించిన దేవరవారికి అగ్రజుడైన, ఏషః రాఘవః= దాసుని గృహంలో అర్చామూర్తిగా వేంచేసి ఉండే ఈ శ్రీరాముడు, తే = అన్ని రీతులలోను ప్రియులైన దేవరవారికి, శేషవృత్తిం = అన్నివిధాలైన కైంకర్యాలను, ఏవం =

తనకు దేవరవారు చేసిన రీతిలోనే చేయాలని, స్వయం = తానుగానే, అభిలషన్ = మిక్కిలిగా ఆశపడేవాడై, భూయః = తిరిగి, త్వత్+అను=బలరామునిగా అవతరించిన దేవరవారికి పిమ్మట, జగత్+ఆనందనః= లోకంలో ఉండే భగవద్భక్తులు, ఆచార్యభక్తులు - అనే అందఱిని ఆనందింపజేసే, నందసూనుః = నందగోపాలుని కుమారుడైన శ్రీకృష్ణునిగా, జజ్ఞే = అవతరించాడు, (ఇపుడా భగవానుడు), దుస్సహం= సర్వశక్తి, అయిన తనకు కూడా సహించడానికి సాధ్యం కాని, దూరీభావం = శ్రీరంగంలో వేంచేసియుండే దేవరవారి విశ్లేషాన్ని, త్యక్త్వా = విడచి, ధన్యః సన్ =దేవరవారు- అనే సంపదను పొందినవాడై, చక్షుషా = తన నేత్రాలతో, న చిరాత్ = త్వరలోనే, త్వాం ధయతు = దేవరవారిని పొందుగాక!

దాసుడనైన నా ఆరాధ్యదేవతయై, నా గృహంలో వేంచేసి ఉండే అర్చావతారరూపియైన శ్రీరామ చంద్రుడు, పూర్వావతారాలలో దేవరవారి వియోగం వల్ల క్లేశాన్ని పొందినట్లే, ఇపుడు కూడా, **"కృత్యైరన్యై కిమిహ తదిదం కీర్తయేతి బ్రవీతి"** (81వ శ్లోకం) అని అంటూ "మీరే చేసే తిరువారాధనం మొదలైన ఏ సేవలవల్ల ఏమీ ప్రయోజనం లేదు. శ్రీవరవరమునుల తిరునామాన్నే అనుసంధానం చేయండి.'' అని పూర్వం పల్కిన రీతిలో దేవరవారి వియోగం వల్ల మనఃక్లేశాన్ని పొందుతున్నాడు. అందువల్ల ఆ స్వామి దేవరవారిని చూచి, చాలా తృప్తిని పొందడంకోసం దేవరవారు ఇక్కడకు వేంచేయాలి- అని ప్రార్థిస్తున్నాడు. దుర్భిక్షకాలంలో ఆకలితో పీడింపబడిన వాడొకడు తాను తన కరుణతో తన పత్నికి, సంతానానికి అన్నం కావాలని కోరేటట్లే, మణవాళమహామునుల విశ్లేషానికి క్లేశాన్ని పొందిన ఎఱుమ్బియప్పా- తమ ఆచార్యుల దైవమైన శ్రీరామచంద్రుడు శ్రీవరవరమునుల విశ్లేషానికి పడే బాధతీరి ఆనందించడంకోసం తాము వేంచేసి ఉండే **"ఎఱుమ్బి"** అనే గ్రామానికి వేంచేయమని శ్రీవరవరమునులను వేడుతున్నారు. అభిషిక్త క్షత్రియకులంలో జన్మించినందున శ్రీరాముడు తాను దూతగా వెళ్ళడానికి, రథసారథ్యం చేయడానికి వీలు లేకుండా పోయినందులకు చాలా బాధపడి, వాటిని చేయడం కోసమే శ్రీకృష్ణావతారాన్ని ఎత్తాడు- అని అంటూ తిరుమఙ్గైయాళ్వార్లు పెరియతిరుమొழி దివ్యప్రబంధంలో **"ఇన్నార్ తూదనెన నిన్ఱాన్"** (2-2-3) అని పల్కినట్లే, అన్నగా పుట్టినందున తన తమ్ముడైన లక్ష్మణునకు కృతజ్ఞతను తీర్చుకోవాలని తలచి, ఆ అవతారంలో తాను లక్ష్మణునకు కైంకర్యం చేయలేనందుకు బాధపడి, అనంతరం ఎత్తిన అవతారంలో ఆ లక్ష్మణుని అవతారమైన బలరామునకు తమ్మునిగా చేసికొని, శ్రీకృష్ణుడై అవతరించి ఆ బలరామునకు కైంకర్యాన్ని చేసి తృప్తి పొందాడని భావించాలి.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునే)** - ఓమణవాళమహామునీ!,

**(దేవః)** - సర్వేశ్వరుడైన,

**(తే పూర్వజః)** - లక్ష్మణుని రూపంలో అవతరించిన దేవరవారికి అగ్రజుడైన,

**(రాఘవః)** - శ్రీరాముడు,

**(తే శేషవృత్తిమ్)** - అన్ని విధాలుగాను తన మనస్సుకు మిక్కిలి అభిమానపాత్రులైన దేవరవారికి అన్ని విధాలైన పరిచర్యలను - దేవరవారికి సంతోషాన్ని కల్గించే పరిచర్యలను- అని భావం. దేవరవారు

శ్రీరాముని విషయంలో **"క్రియతా మితి మాం వద"** అనే విధంగా శ్రీరాముని నియోగాన్ని పురస్కరించుకొని కైంకర్యం చేసినట్లే, ఆ స్వామి కూడా దేవరవారి నియమనాన్ని పురస్కరించుకొని చేసే కైంకర్యాన్ని- అని హృదయం.

**(స్వయమభిలషన్)** - స్వయంగా చేయాలని అభిలషిస్తూ - గల నిరంకుశ స్వాతంత్ర్యమనే విశేషస్వభావాన్ని కల్గిన తాను స్వయంగా మిక్కిలిగా అభిలషిస్తూ - అని అర్థం. **"అభి"** శబ్దపురస్కారంచేత సర్వదేశ - సర్వకాల - సర్వావస్థోచిత కైంకర్యం సూచింపబడింది.

**(జగదానందనః)** - లోకంలోని ప్రథమపర్వనిష్ఠను కోరేవారు, చరమపర్వనిష్ఠను కోరేవారు- అనే ఈ రెండు విధాలైన జనుల సముదాయరూపమైన జగత్తుకు ఆనందం కల్గడంలో కారణభూతుడైనవాడు- అని అర్థం.

**(నందసూనుః)**- దౌత్యం, సారథ్యం మొదలైన అర్వాచీనవ్యాపారాలను చేసేవాడు, పట్టాభిషేక యోగ్యతలేని క్షత్రియవంశమైన యదువంశంలో జన్మించడంతో పాటు, యదువంశసంభవుడైన వసుదేవునకు కుమారుడై జన్మించడంతోపాటు, గోపాలజన్మను కలవాడైన శ్రీకృష్ణుడై -అని అర్థం.

**(భూయః)**- మళ్ళీ,

**(త్వదను)**- దేవరవారికి పిమ్మట,

**(జజ్ఞే)**- అవతరించాడు. దేవరవారికి తమ్ముడై అవతరించాడని భావం

ప్రస్తుత సందర్భంలోని భావం ఏమంటే - పట్టాభిషేకానికి యోగ్యతను కల సుక్షత్రియవంశంలో శ్రీరామునివలె జన్మిస్తే, దౌత్యం చేయడం, సారథ్యం చేయడం దుర్లభం కనుక, వాటిని చేయదలచిన భగవానుడు, తదనుకూలమైన యదుకులంలో జన్మించడంతో పాటు, గోపాలకులోద్భవుడైన నందగోపాలునకు కుమారుడయ్యాడు. ఆవిధంగా అవతరించేటపుడు కూడా, శ్రీరామునివలె అగ్రజుడై జన్మిస్తే దేవరవారికి తాను ఆశపడిన పరిచర్యను చేయడం దుర్లభం కనుక, శ్రీరామావతారంలో లక్ష్మణులై అవతరించి, పలు కైంకర్యాలను చేసిన దేవరవారికి **"కృతే చ ప్రతికర్తవ్యం ఏష ధర్మః సనాతనః"** అనే రీతిలో ఉపకృతికి ప్రతికృతి చేయలేనందున బాధపడిన శ్రీరాముడు, ఆ ప్రత్యుపకృతికి అనుకూలంగా దేవరవారికి (బలరామరూపులైన దేవరవారికి) అనుజుడై అవతరించాడు- అని తిరుమఙ్గైయాళ్వార్లు **"మున్ ఓర్ తూదు వానరత్తిన్ వాయిల్ మొழిన్దు, అరక్కన్ మన్నూర్దన్నై వాళియినాల్ మాళ మునిన్దు, అవనే పిన్ ఓర్ తూదు ఆది మన్నర్ క్కాగి పెరునిలత్తార్ ఇన్నార్ తూదనెన నిన్ఱాన్"** (పూర్వం శ్రీరామావతారంలో హనుమంతుని ద్వారా సీతాదేవికి దౌత్యాన్ని పలికించి, తరువాత రావణుని అందమైన లంకాపురిని అద్వితీయమైన బాణంతో నశించిపోయేటట్లుగా కోపించి, తరువాత ఒకానొక కాలంలో రాజాధిరాజులైన పాండవులకోసం విలక్షణమైన దూతయై విశాలమైన ఈ భూమిలో ఉన్నవారంతా "ఇతడు వీరి దూత" అని పల్కగా, దానిని విని నిలువగల్గిన స్వామి) అనే పెరియతిరుమొழி (2-2-3) పాశురంలో పలికారు.

ఈ దశకంలోని మొదటి పాశురంలోను, రెండవ పాశురంలో కూడా పరకాలసూరి శ్రీరామావతారాన్నే అనుసంధించారు. ఈవిధంగా శ్రీరామావతారాన్ని పరకాలసూరి మాటిమాటికి అనుసంధించడంలోని భావాన్ని వివరించడంకోసం పెరియవాచ్చాన్‌పిళ్ళై ఈ దశకంలోని మొదటి పాశురవ్యాఖ్యలో భట్టర్‌కు సంబంధించిన ఒక ఐతిహ్యాన్ని ఈ విధంగా ప్రస్తావించారు.

**"శిఱియాత్తాన్, భట్టర్ శ్రీరామావతారత్తిలే పక్షపతిత్తిరుప్పర్ - ఎన్రు అరుళిచ్చెయ్యుమ్ వార్తై కేట్కైక్కాక, "పెరుమాళుక్కు ఎల్లా ఏర్‌ఱముమ్ ఉణ్డాకిలుమ్, ఆశ్రితార్థమాక కళ్ళుత్తిలే ఓలై క్కట్టి త్తూతుపోన ఇవ్వేఱ్ఱమ్ ఇల్లైయే" ఎన్న, "అవర్ పోకామైయల్ల, పిఱప్పిల్ కుఱ్ఱమ్ కాణుమ్ - ఎన్రు అరుళిచ్చెయ్‌దార్"**

భట్టర్ శ్రీరామావతారంలో చాలా గొప్ప అభినివేశాన్ని కలవారైనందున, వారివద్ద శ్రీరామావతారాన్ని గూర్చి కొఱతగా పల్కితే, ఏమి బదులిస్తారో వినాలి- అనే కుతూహలంతో **శిఱియాత్తాన్** అనే ఆచార్యులు ఒకనాడు, "శ్రీరామునకు ఎన్ని గొప్పతనాలు ఉన్నా, తన భక్తులకోసం దూతగా పోయిన గొప్పతనం మాత్రం అతనికి లేదు కదా! మెడకు దూత్య పత్రాన్ని కట్టి, "దూతగా వెళ్ళు'' అని పల్కినా, పాండవుల కోసం దూతగా పోయిన వైలక్షణ్యం (సౌలభ్యం) శ్రీకృష్ణునకే కదా ఉన్నది'' అని అన్నారు. అపుడు భట్టర్ "శ్రీరాముడు దూతగా పొమ్మంటే వెళ్ళనివాడు కాడు. అతడు ఇక్ష్వాకువంశంలో దశరథచక్రవర్తికి కుమారుడై అవతరించినందువల్ల, అతనిని దూతగా పొమ్మని పలికే సాహసం ఎవరూ చేయలేదు. అందువల్లనే అతడు దూత్యం చేయలేదు తప్ప, దూతగా వెళ్ళకూడదు - అనే అభిప్రాయాన్ని కలవాడు శ్రీరాముడు కాడు. దీనికి అంతటికి కారణం అతడు పుట్టిన కులం - అనేది పై వ్యాఖ్యానసూక్తిలోని తాత్పర్యం. ఈ ఐతిహ్యాన్నే నమ్పిళ్ళై తిరువాయ్‌మొళ్ళిలోని **"తయరతన్ మకన్ తన్నై యన్రి మఱ్ఱిలేన్ తఞ్జమాకవే"** (3-3-6) అనే పాశురం ఈడు వ్యాఖ్యలోను, **"కఱ్పార్ ఇరామపిరినైయల్లాల్ మఱ్ఱుమ్ కఱ్పరో"** (7-5) అనే దశక ప్రవేశంలోను ఉట్టంకించడం గమనించదగినది.

**"జగదానందనః"** అనే విశేషణాన్ని, పూర్వం శ్రీరామావతారపరంగా ప్రయోగించకుండా శ్రీకృష్ణావతార పరంగా ప్రయోగించినందువల్ల, శ్రీకృష్ణావతారంలో ఎఱుమ్బియప్పాకు గల ప్రావణ్యం స్వశేషిశేషత్వ మూలకమని వ్యక్తమవుతున్నది. **"కృషి ర్భూవాచక శ్శబ్దో ణస్తు నిర్వృతి వాచకః"** (కృష్ - అనేది భూవాచకం ణకారం ఆనందవాచకం) అని కదా కృష్ణశబ్దనిరుక్తి.

**(తే పూర్వజో రాఘవః)** - లక్ష్మణరూపులైన దేవరవారికి ముందు జన్మించిన శ్రీరాముడు,

**(దుస్సహమ్)** - **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** (పరమాత్మ శక్తి గొప్పది, పలువిధాలైనది) అని కీర్తింపబడే సర్వశక్తి అయిన తనకు కూడా సహించరాని,

**(తే దూరీభావమ్)** - దేవరవారు శ్రీరంగంలో వేంచేసి ఉన్నందువల్ల కల్గిన దేవరవారి విరహాన్ని,

**(త్యక్త్వా ధన్య స్సన్)** - విడచి, దేవరవారి రూపంలోని గొప్పధనాన్ని పొందినవాడై,

**(చక్షుషా)** - తన విశాల లోచనాలతో,

**(న చిరాత్)** - త్వరలోనే,

**(త్వాం ధయతు)** - నిన్ను **"లోచనాభ్యాం పిబన్నివ"** (కళ్ళతో పానం చేస్తున్నట్లు) అనే రీతిలో పానం చేయాలి. చూచి ఆనందించాలని తాత్పర్యం. ఈవిధంగా పూర్వం సంభవించిన అవతారాలలోకూడా దేవరవారి వియోగాన్ని సహించలేని శ్రీరాముడు ఇపుడు నా గృహంలో అర్చారూపిగా వేంచేసి ఉన్నా, **"కృత్యైరన్యైః కిమిహ తదిదం కీర్తయేతి బ్రవీతి"** అనే రీతిలో దేవరవారి వియోగం వల్ల దుఃఖపడుతున్నాడు. అందువల్ల, దేవరవారు ఎఱుమ్బికి వేంచేయాలి. దేవరవారిని చూచిన అత్యానందంతో శ్రీరాముడు ఆనందించాలి- అనే ప్రార్థన ఇక్కడ వ్యక్తం చేయబడింది. ఈ ప్రార్థన ఎటువంటిది? అంటే, కఱువుకాలంలో తాను మిక్కిలి ఆకలితో బాధపడే ఒకానొక దయాళువు తన భార్యాపుత్రులకోసం అన్నాన్ని ప్రార్థించడం వంటిది - అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి రస్యమైన వ్యాఖ్య. ఇక్కడ శ్రీవరవరమునుల విరహంతో బాధపడే ఎఱుమ్బియప్పాయే ఆ ఆకలితో బాధపడే దయాళువు. అర్చారూపియైన శ్రీరాముడే ఆ దయాళువు యొక్క సంతానం. తాను పోషించే బిడ్డవంటి వాడేకదా **"అర్చకపరాధీనాఖిలాత్మ స్థితి"**యైన అర్చామూర్తి. ఆ బిడ్డవంటి శ్రీరాముడు అనుభవించగోరిన శ్రీవరవరముని సంశ్లేషమే ఆ స్వామి ఆకలిని తీర్చే అన్నం. ఆ సంశ్లేషరూపమైన అన్నం లభించని వియోగదశయే దుర్భిక్షదశ - ఈవిధంగా పరమరస్యమైన ఈ వివరణలోని స్వారస్యం సహృదయ భావ్యం.

**93.** అవ :- గడచిన శ్లోకంలో ''దేవరవారు ఇక్కడకు వేంచేస్తే దేవరవారి అగ్రజులైన శ్రీరాముడు సంతోషిస్తాడు'' అని అన్నారు. ఇందులో, ఆ స్వామికోసం దేవరవారు వేంచేస్తే దాసుడనైన నాకుకూడా పురుషార్థం సిద్ధిస్తుంది- అని అంటున్నారు.

> **పాయం పాయం ప్రణయమధురే పాదపద్మే త్వదీయే**
> **పశ్యేయం తత్ కిమపి మనసా భావయంతం భవంతమ్ ।**
> **కామక్రోధప్రకృతిరహితైః కాంక్షితత్వత్ప్రసాదైః**
> **సద్భి స్సాకం వరవరమునే! సంతతం వర్తిషీయ ॥**

హే వరవరమునే = ఓ మణవాళమహామునీ!, ప్రణయమధురే = పరభక్తిలో కల్గి ఉండే దాసుని ప్రీతిచేత తేనెతో కూడినట్లుగా మధురమైన, త్వదీయే పాదపద్మే = చరమశేషి అయిన దేవరవారి శ్రీచరణపద్మాలను, పాయం పాయం = (నేత్రాలతో), పానం చేసి పానం చేసి, మనసా = మనస్సుతో, కిమపి తత్ = అన్నిటికంటే గొప్ప పురుషార్థమైన, **"ఆమ్ ముదల్వన్ ఇవన్"** అనే విషయాన్ని, భావయంతమ్= మాటిమాటికి భావిస్తూ ఉండే, భవంతమ్ = దేవరవారిని, పశ్యేయం = కళ్ళార దర్శిస్తాను, కామక్రోధప్రకృతి రహితైః= తగని విషయాలలో కామం, ఆ వస్తువులను పొందడంలో అడ్డుపడే వారి విషయంలో తీవ్రమైన కోపం- అనే వీటిని సహజంగానే లేనివారై, కాంక్షితత్వత్ ప్రసాదైః= ఆశింపబడిన దేవరవారి కృపను కలవారైన, సద్భిః సాకం = సత్పురుషులతో పాటు కూడి, సంతతమ్ = ఎల్లప్పుడు, వర్తిషీయ = ఉండాలి.

మణవాళమహామునులు తమ ఇంటిలోని అర్చామూర్తి అయిన శ్రీరాముని కోసం శ్రీరంగంనుండి వేంచేస్తే, చెడ్డగుణాలను వేటినీ లేకుండా సద్గుణాలను కలవారై, శ్రీవరవరమునుల కృపను ఆశపడి, వారితో పాటుగా ఉండే వారి శిష్యులు కూడా వస్తారు. శ్రీవరవరమునులను, తాము నమస్కరించేటపుడు వారు **"ఆమ్ ముదల్వన్ ఇవన్"** అని తమను మంగళాశాసనం చేస్తారు. అటువంటి శ్రీవరవరమునులను తాము సదా సేవిస్తూ, వారి శిష్యులతో కలసి ఉండి ఆనందించాలి - అని భావం. **"అపగతమదమానై రంతిమోపాయనిష్ఠైః, అధిగతపరమార్థై రర్థకామానపేక్షైః, నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః వరవర ముని భృత్యైరస్తు మే నిత్యయోగః"** (మదాన్ని, అహంకారాన్ని లేనివారు, అంతిమోపాయ నిష్ఠను కలవారు, పరమార్థమైన భగవద్భాగవతాచార్యకైంకర్యాన్ని చేసేవారు, అర్థకామాలను కోరనివారు, అందఱిపట్ల సుహృద్భావాన్ని కలవారు, క్రోధలోభాలను లేనివారైన వరవరముని శిష్యులతో నాకు సదా సహవాసం కలగాలి) అనే ఈ కవి రచించిన శ్లోకం భావ్యం. **"పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ"** (పరస్పర హితాన్ని కోరే సత్పురుషాల సన్నిధిలో నేను ఉండేటట్లు అనుగ్రహించు) అనే దేశిక సూక్తి కూడా భావ్యం.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే!)** = ఓమణవాళమహామునీ!,

**(ప్రణయమధురే)** - పరమభక్తి పట్ల కల్గి ఉండే దాసుని ప్రణయం చేత తేనెతో కూడినది అయినట్లుగా (మనస్సుకు) తీయనిదై - అని అర్థం. **(మధు-రాతి ఇతి మధురః, రాః-దానే"** అనే వ్యుత్పత్తి ప్రకారం తేనెను ఇచ్చేది, స్రవించేది మధుర మనబడుతుంది) మధుశబ్దంపైన, మత్వర్థీయమైన ప్రత్యయం రాగా, మధువును - తేనెను కల్గినది - అనే అర్థాన్ని ఈ శబ్దం ఇస్తుందని వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య. ఊషర, ముష్కర, సుషిర శబ్దాలలోని రప్రత్యయం వంటిదే - మధురశబ్దంలోని రప్రత్యయం.

**(త్వదీయే)**- ప్రాప్తశేషి అయిన దేవరవారియొక్క,

**(పాదపద్మే)**- పాదాలనే పద్మాలను రెండిటిని-అని అర్థం. ఇక్కడ **"పాద ఏవ పద్మే"** అనే రూపక సమానం ఇక్కడ వివక్షితం. దీనివల్ల పాదాల పావనత్వ, భోగ్యత్వాలు స్ఫురిస్తాయి. అంతేకాక, **"పాయం పాయమ్"** అనే క్రియాపదానికి కూడా అన్వయం సిద్ధిస్తుంది.

**(పాయం పాయమ్)**- మాటిమాటికి పానం చేసి దర్శించి- అని భావం. దర్శనాన్ని పానంగా పల్కడం ద్వారా నిగీర్యాధ్యవసానం చేయబడినందున ఇక్కడ రూపకాతిశయోక్త్యలంకారం.

**(మనసా)**- దివ్యహృదయంతో,

**(కిమపి)**- కొంచెంకూడా,

**(తత్)**- అటువంటి అన్ని పురుషార్థాలకంటె విలక్షణమైనది ఇది- అనే రీతిలోని అర్థాన్ని,

**(భావయంతమ్)**- భావించేవారైన,

**(భవంతమ్ పశ్యేయమ్)**- దేవరవారిని సాక్షాత్కరించుకొంటాను

**(కామక్రోధప్రకృతిరహితైః)** - కామం అంటే - తగని విషయాలలోని కోరిక, క్రోధమంటే - ఆవిషయాలను పొందడంలో అడ్డు వచ్చేవారిపట్ల కలిగే తీవ్రమైన కోపం. ఇవి రెండు లోభాదులను కూడా సూచిస్తాయి. ఇటువంటి అరిషడ్వర్గాన్ని సహజంగానే లేనివారు,

**(కాంక్షితత్వత్ప్రసాదైః)** - దేవర అనుగ్రహాన్ని ఆశించేవారైన- అని అర్థం.

**(సద్భిః సాకమ్)** - దేవరవారి నిర్హేతుక కటాక్షంవల్ల సత్తను పొందినవారైన మహాపురుషులతోపాటు,

**(సంతతమ్)** - విచ్ఛేదం లేకుండా ఎల్లప్పుడు,

**(వర్తిషీయ)** - ఉండగలనో, అటువంటి దేవరవారి పాదపద్మాలను సేవిస్తాను- అని తాత్పర్యం.

శ్లోకంలో **"పాయమ్ పాయమ్"** ఇత్యాది శబ్దసందర్భం ద్వారా **"స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః, వరణాన్వేషీ"** అని చెప్పబడిన విభీషణుడు స్ఫురింపజేయబడుతున్నాడు. **"పశ్యేయం తత్"** ఇత్యాది ప్రయోగంద్వారా **"తస్య తద్వచనం శ్రుత్వా రామో వచన మబ్రవీత్, వచసా సాంత్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ"** (అతడు పల్కిన ఆ మాటను వినగానే శ్రీరాముడు అతనిని మాటలతో ఓదారుస్తూ, కన్నులతో పానం చేస్తున్నట్లుగా ప్రేమతో చూస్తూ పలికాడు) అనే సూక్తి స్మరింపజేయబడుతున్నది. **"కామక్రోధే"**త్యాది ప్రయోగం ద్వారా **"తస్మాత్ క్షిప్రం సహాస్మాభిః తుల్యో భవతు రాఘవ, విభీషణో మహాప్రాజ్ఞః సఖిత్వ ముపయాతు నః"** (శ్రీరామా! ఈ మహాప్రాజ్ఞుడైన విభీషణుడు వెంటనే మాతో సమానుడు కావాలి. మాతో మిత్రత్వాన్ని పొందాలి) అనే సూక్త్యర్థం ధ్వనిస్తున్నది - అని వాధూలవీరరాఘవా చార్య స్వామివాఖ్య.

**94.** అవ :- శ్రీవరవరమునులు, వారి భక్తులు - అనే ప్రాప్యపురుషార్థాన్ని పొందడంలో గల త్వరాతి శయంచేత మనస్సులో కలత పొందిన ఎఱుమ్బియప్పా, తాము పూర్వం పల్కిన త్వరాతిశయంచేత, భగవానుని తప్ప వేఱెవ్వరిని దేవతగా భావించని తన స్వరూపానికి విరుద్ధంగా కామదేవుని ఉపాసించిన గోదాదేవివలె, చరమపర్వనిష్ఠ అనే తన స్వరూపానికి విరుద్ధంగా, చరమపర్వాన్ని పొందడానికి లక్ష్మీదేవిని పురుషకారంగా, భగవానుని ఉపాయంగా కావాలని ప్రార్థిస్తున్నారు.

> పశ్యత్వేనం జనకతనయాపద్మగర్భైః రపాంగై
> ప్రారబ్ధాని ప్రశమయతు మే భాగధేయం రఘూణామ్ ।
> ఆవిర్భూయా దమలకమలోదగ్ర మక్ష్ణోః పదం మే
> దివ్యం తేజో వరవరమునే! దేవదేవ! త్వదీయమ్ ॥

దేవదేవ = నిత్యసూరులలో ప్రముఖుడైన ఆదిశేషుని అవతారమైన, వరవరమునే! = ఓ మణవాళ మహామునీ!, జనకతనయా = జనకరాజు కుమార్తె అయిన సీతాదేవి, పద్మగర్భైః= తామరపూవు లోపలి భాగంవలె అందమైన ఎఱ్ఱని, మృదువైన, అపాంగైః= తన కటాక్షాలతో, ఏనమ్ = ఈ శ్రీరాముని, మే = నాకోసం, పశ్యతు = చూడాలి. (పురుషకారం చేయాలి), రఘూణాం భాగధేయం = రఘుకులంలో

ఉదయించినవారి భాగ్యఫలమైన శ్రీరాముడు, మే = లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించిన దాసుని, ప్రారబ్ధాని = దేవరవారిని సేవించడానికి అడ్డుగా ఉండే పాపాలను, ప్రశమయతు = పూర్తిగా నశింపజేయాలి, (ఉపాయం కావాలి), (దీనివల్ల), అమల కమల+ఉదగ్రం = నిర్మలమైన తామరపూవుకంటె ఉన్నతమైనది, దివ్యం తేజః= అప్రాకృతతేజోమయమైనది, త్వదీయం = దేవరవారికి సంబంధించినదైన, పదం = శ్రీచరణం, మే = దాసుని యొక్క, అక్ష్ణోః పదం = దాహాన్ని (ఆర్తిని) పొందిన దాసుని నేత్రాలను లక్ష్యంగా, ఆవిర్భూయాత్ = ఆవిర్భవించాలి.

శ్రీవరవరమునుల శ్రీచరణపద్మాలను తాము కన్నులారా దర్శించి, సేవించడమనే పురుషార్థసిద్ధికోసం వారినే ఆశ్రయించవలసి ఉండగా, అది చాలా త్వరగా నెఱవేరాలి- అనే త్వరాతిశయంచేత మనస్సులో కలత చెందిన, తమ చరమపర్వనిష్ఠకు విరుద్ధంగా సీతాదేవిని పురస్కరించుకొని శ్రీరాముని అనిష్టమైన ప్రారబ్ధపాపాల నివృత్తిని చేసే ఉపాయంగా ఎఱుమ్బియప్పా ఇందులో ఆశ్రయించారు. చరమపర్వంలో అనన్యభక్తిని "గురురేవ పరా గతిః" (గురునే గొప్ప గతి) అని కల్గినవారికి భగవత్సమాశ్రయణం సైతం కామదేవసమాశ్రయనా తుల్యమే కదా!

**వ్యాఖ్యానమ్ : (దేవదేవ)** - నిత్యసూరులకు శేషిభూతులైన,

**(వరవరమునే)** - ఓమణవాళమహామునీ!,

**(జనకతనయా)** - **"తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్"** (సమానమైన శీలాన్ని, వయస్సును, వర్తనాన్ని కల్గినది, సమానమైన ఆభిజాత్యాన్ని కల్గినది) అనే రీతిలో శ్రీరాముని పరమప్రేమకు కారణమైన ఆభిజాత్య విశేషాన్ని కల్గిన జనకులసుందరి,

**(పద్మగర్భైః)** - ఎండ, గాలి మొదలైనవి సోకనందున అతిశయించిన సౌందర్యం, సౌకుమార్యం కల్గిన తామరపూవులలోని మధ్యభాగాలవంటివి అయిన,

**(అపాంగైః)** - కటాక్షాలతో,

**(ఏనమ్)** - పూర్వశ్లోకాలలో ప్రస్తుతింపబడిన శ్రీరాముని,

**(మే పశ్యతు)** - **"మే"** అనే అస్మచ్ఛబ్దరూపం చతుర్థీవిభక్త్యంతర **"మహ్యం మే"** అని. నాకోసం కటాక్షించాలి - అని అర్థం. లక్ష్మీదేవి నేత్రాలను పద్మగర్భాలతో పోల్చడంలోని ఆంతర్యమేమి? అంటే, లక్ష్మీదేవి పురుషకారత్వానికి మిక్కిలి ఉపయోగించేది -ఆమెకు భగవానుని విషయంలోగల ప్రీత్యతిశయం. ఆ అనురాగాతిశయం కారణంగా భగవానుని మనస్సులో క్షోభాన్ని కల్గించి, తద్ద్వారా అతడు రక్షణోన్ముఖుడు అయేటట్లు చేసే సౌందర్య - సౌకుమార్యాలను లక్ష్మీదేవి నేత్రాలు కల్గి ఉన్నవి- అనే భావాన్ని స్ఫురింపజేయడం కోసమే. లేక, ఇటువంటి దుర్గతిని కల్గిన జీవుని రక్షణ విషయంలో భగవానుడు చూపించే ఉదాసీనత కారణంగా లక్ష్మీదేవికి ప్రణయరోషం కలుగగా, దానివల్ల ఆమె పద్మగర్భాలవంటి నేత్రాలు ఎఱ్ఱబడినవి- అని సూచించడంకోసం ఈ విధంగా ప్రయోగింపబడింది - అని కూడా చెప్పవచ్చు.

**(రఘూణాం భాగధేయమ్)** - **"యో మంత్రం తపసా లేభే"** అనే రీతిలో శరణాగతరక్షణదీక్షను కలవాడు, రఘుకులం యొక్క అదృష్టఫలం అయిన శ్రీరాముడు,

**(మే)**- జానకీదేవిని పురుషకారంగా పొందిన నాయొక్క,

**(ప్రారబ్ధాని)**- దేవరవారిని అనుభవించడంలో నాకు అడ్డుగా ఉండే విరోధులైన పాపాలను, అనుభవిస్తే తప్ప తీరని పాపాలను- అని అర్థం. ప్రారబ్ధం, సంచితం, ఆగామి- అనే మూడు కర్మలలో ప్రారబ్ధం ధనుస్సునుండి వదిలిన బాణంవంటిది. కనుక అనుభవైకవినాశ్యం. ఇది కూడా **"సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** (ఆ సాధ్య భక్తి గొప్పదైన ప్రారబ్ధాన్ని కూడా నశింపజేస్తుంది) అనే రీతిలో సాధ్యభక్తిరూపమైన ప్రపత్తిని ఆచరించినవాని ప్రారబ్ధకర్మలు సైతం తీరిపోతాయి. దీనికి కారణం భగవానుని శరణాగతరక్షణ లోని అప్రతిహత సంకల్పమే. సముద్రునిపై గురిపెట్టిన బాణానికి శ్రీరాముడు సముద్రంలోని దైత్యులను లక్ష్యంగా చేయడం, భగదత్తుడు అర్జునుని పై వదలిన బాణాన్ని **"ఉరసా ధారయామాస"** అని తానే తన వక్షస్సులో భరించడం దీనికి ఉదాహరణాలుగా గ్రహించవచ్చు.

**(ప్రశమయతు)**- సవాసనగా నశింపజేయాలి.

**(అమలకమలోదగ్రమ్)**- నిర్మలమైన పుండరీకం - తెల్లతామరకంటె మించినది - అని అర్థం. **"చంద్రకాంతాననమ్"** అనే శ్రీరామాయణ ప్రయోగాన్ని **"చంద్రాత్ కాంతమ్ ఆననమ్ యస్య తమ్"** (చంద్రుని కంటే అందమైన ముఖాన్ని కలవానిని) అని వివరించిన క్రమంలో ఈ అర్థం గ్రహింపబడింది.

**(దివ్యం తేజః)** - అప్రాకృతమైన తేజస్సు - అని అర్థం. తేజస్సుయొక్క ప్రాచుర్యాన్ని బట్టి తేజస్సును కల్గినది - అనికాక, తేజస్సు -అని నిర్దేశింపబడింది. తిరుప్పావైలోని **"మాలే"** అనే ప్రయోగంవంటిదే ఇది కూడా.

**(త్వదీయం పదమ్)**- దేవరవారి శ్రీచరణాలు,

**(మే అక్ష్ణోః ఆవిర్భూయాత్)**- చిరకాలంగా ఎంతో ఉత్కంఠతో ఎదురు చూచే నాకళ్ళకు సాక్షాత్కరించాలి- అని అర్థం. లేక, **"అమలకమలోదగ్రం త్వదీయం దివ్యం తేజః"**- తెల్ల తామరను మించిన దేవరవారి దివ్యతేజోరూపం- దేవరవారి దివ్యమంగళవిగ్రహ దివ్యలావణ్యంయొక్క ప్రకాశం- **"మే అక్ష్ణోః పద మావిర్భూయాత్"** - నా కళ్ళకు గోచరించాలి- అని అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు.

**95.** అవ :- **"సోఢుమ్ తాదృక్"** అనే (80వ) శ్లోకం నుండి పలు శ్లోకాలలో శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు- ఈ ముగ్గురు ఒకరినొకరు విశ్లేషించిన విషయాన్ని ప్రస్తావించినందువల్ల, మనస్సులో కలత చెందినవారైన ఎఱుమ్బియప్పా, ఇక ఏనాడు ఆ ముగ్గురికి విశ్లేషం ఏర్పడకూడదని మంగళాశాసనాన్ని చేస్తూ లక్ష్మణునకు, శ్రీవరవరమునులకు మధ్య ఉండే అభేదాన్ని తెలుపుతున్నారు.

**రామః శ్రీమాన్ రవిసుతసఖో వర్ధతాం యూథపాలైః**
**దేవీ తస్మై దిశతు కుశలం మైథిలీ నిత్యయోగాత్ ।**

సానుక్రోశో జయతు జనయన్ సర్వత స్తత్ప్రసాదం
సౌమిత్రే ర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ ॥

శ్రీమాన్ = ఉభయవిభూతులను ఐశ్వర్యంగా కల్గినవాడు, రవిసుతసఖః = సూర్య పుత్రుడైన సుగ్రీవునకు సఖుడైన శ్రీరాముడు, యూథపాలైః సహ = వానరసేనల నాయకులైన హనుమానుడు మొదలైనవారితో కూడి, వర్ధతాం = ఇతోధికంగా వృద్ధి చెందాలి, దేవీ = అంతు లేని కాంతిని కల, మైథిలీ = జనకరాజపుత్రి సీతాదేవి, నిత్యయోగాత్ = తన నిత్యసంశ్లేషం వల్ల, తస్మై = ఆ శ్రీరామునకు, కుశలం దిశతు = క్షేమాన్ని ఇవ్వాలి, సానుక్రోశః= ఆ ఇరువురికంటె ఎక్కువ దయను కల్గినవారు, సౌమిత్రిః= సుమిత్రాదేవి కుమారుడు అయిన లక్ష్మణుడు, మే = దాసుడనైన నాకు, సర్వతః= అన్ని విధాలైన, తత్ ప్రసాదమ్ = ఆ దివ్యదంపతుల అనుగ్రహాన్ని, జనయన్ = కల్గించేవారై, జయతు = సర్వోత్కర్షతో వర్ధిల్లాలి, సః = ఆ లక్ష్మణుడు, భగవాన్ = ఏదోషం లేని, అన్ని కల్యాణగుణాలు నిండుగా ఉండే, సౌమ్యజామాతృయోగీ ఖలు = మణవాళమహామునులే కదా!

ఈ శ్లోకంలో, సీతాదేవి నిత్యసంబంధంవల్ల శ్రీరామునకు క్షేమం కల్గి, ఆ స్వామి తన భక్తులతో కూడి వెలగాలి- అని ప్రార్థించినందున ఆస్వామికి, సీతాదేవికి విశ్లేషరాహిత్యం ప్రార్థింపబడింది. ఆ ఇరువురి అనుగ్రహాన్ని తమపట్ల కల్గించాలి -అని ప్రార్థించడం ద్వారా ఆ ఇరువురుని విడచి లక్ష్మణుడు విశ్లేషించకూడదని ప్రార్థించినట్లయింది. ఈ విధంగా ఆ ముగ్గురికి మంగళాశాసనం చేయబడింది. శ్రీరాముడు, సీతాదేవి- అనే ఈ ఇద్దఱి అనుగ్రహం మీపట్ల కల్గించేటట్లుగా లక్ష్మణునకు మీకు మధ్య ప్రత్యేకమైన సంబంధం ఏమి? ఉన్నది? అనే ప్రశ్నించేవారికి "ఆ లక్ష్మణస్వామియే కదా దాసుని ఆచార్యులైన శ్రీవరవరమునులుగా అవతరించారు'' అని అంటూ సమాధానం పల్కినట్లయింది.

వ్యాఖ్యానమ్ : **(శ్రీమాన్)** - ఉభయవిభూతుల నిర్వాహకత్వమనే సంపదను కలవారు. "శ్రీః" అంటే భోగ్యవస్తువుల సమృద్ధి, దానిని కలవాడని భావం.

**(రవిసుతసఖః)**- సుగ్రీవసఖుడు- అని అర్థం. **"శ్రీమాన్", "రవిసుతసఖః"** అనే ఈ రెండు విశేషణాలద్వారా **"లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి"** అనే శ్రీరామాయణ శ్లోకార్థం అభివ్యక్తమవుతున్నది. దీనివల్ల శ్రీరాముని పరత్వ-సౌలభ్యాలు వ్యక్తమవుతున్నది. ఈ శ్రీరామాయణ శ్లోకంలో- **"లోకనాథః"** అని పరత్వం, **"సుగ్రీవం నాథమిచ్ఛతి"** అని సౌలభ్యం వ్యక్తమవుతున్నాయి. ఈ విశేషణం శ్రీరాముని అభిప్రాయద్యోతకం. **"సమానం ఖ్యాయతే"** ఇతి సఖా అనే వ్యుత్పత్తి స్మరణీయం. **"దాసః సఖా"** అని శ్రీయామునులు గరుడుని భగవానునకు సఖునిగా పలికారు కదా!

**(రామః)** - **"రమతే, రమయతీతి వా రామః"** అనే రెండు వ్యుత్పత్తులు ఇక్కడ వివక్షితాలు. ఆనందించేవాడు- అనే అర్థం పరత్వద్యోతకం. **"ఆనందో బ్రహ్మ"** అని ఆనందమే మూర్తీభవించినవాడుకదా పరమాత్మ. ఇక, ఆనందింపజేసేవాడనే అర్థం- **"ఏష హ్యేవానందయాతి"** అనే శ్రుత్యర్థస్మారకం, సౌలభ్యద్యోతకం. **"రామో రమయతాం వరః"** (ఆనందింపజేసేవారిలో గొప్పవాడు రాముడు) ఇత్యాది

శ్లోకార్థాలు దీనికి అనుగుణంగా భావ్యాలు. దీనిద్వారా ప్రకృతంలో చేసే మంగళాశాసనానికి ప్రయోజనాలైన దివ్యమంగళవిగ్రహవత్త్వం, సమస్త కల్యాణగుణాకరత్వం- మొదలైన వైలక్షణ్యాలు చెప్పబడ్డాయి.

**(యూథపాలైః)** -అంగదుడు మొదలైనవారితోపాటు,

**(వర్ధతామ్)** - ఉత్తరోత్తరాభివృద్ధిని పొందాలి - అని అర్థం. ఇచటి లోట్ మంగళాశాసనార్థకం. **"త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ?"** (నీకు కొంచెం అయినా ఆపద కల్గితే ఇక నాకు సీతతో ఏమి పని?) అని పల్కిన శ్రీరాముని స్వభావవిశేషాన్ని పర్యాలోచన చేసి, సుగ్రీవాదులు కూడా మంగళాశాసనం చేయదగిన వారిలో చేర్చబడ్డారు.

**(మైథిలీ)** - జనకరాజపుత్రి,

**(దేవీ)** - నిరతిశయమైన కాంతితో ప్రకాశించే సీతాదేవి- అని భావం. లేక, **"దేవ్యా కారుణ్యరూపయా"** (కారుణ్య గుణంతో నిరూపింపబడే సీతాదేవి) అనే రీతిలో ప్రధానగుణమైన నిర్హేతుక కృపతో ప్రకాశించేదని భావం.

**(నిత్యయోగాత్)** - క్షణం కూడా విశ్లేషించకుండా నిత్యసంశ్లేషాన్ని కల్గి ఉన్నందున,

**(తస్మై)** - పూర్వం **"శ్రీమాన్, రవిసుతసఖః"** అనే విశేషణాలతో విశేషింపబడిన శ్రీరామునికోసం,

**(కుశలమ్)** - యోగక్షేమరూపమైన శుభాన్ని- అని అర్థం.

**(దిశతు)** - ఇవ్వాలి. **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** (సీతాదేవి ఎవరి భార్యయో, అటువంటి శ్రీరాముని తేజస్సు అంతులేనిది) అనే రీతిలో జనక కుల సుందరిసంబంధం వల్లనే కదా శ్రీరామునకు సర్వవిధమైన ఉత్కర్షకల్గుతుంది.

**(సానుక్రోశః)** - దివ్యదంపతులకంటే మించిన కృపను కలవాడైన - అని అర్థం.

**(సౌమిత్రిః)** - ఆ విధమైన కృపాప్రాచుర్యాన్ని కల్గి ఉండడానికి కారణమైన జన్మవిశేషాన్ని కల్గినవాడు- గొప్ప కరుణను కల సుమిత్రాదేవి కుమారుడని భావం. ఆ శ్రీరాముని సేవ చేయడం కోసమే అవతరించిన లక్ష్మణుడని తాత్పర్యం. **"శోభనం మిత్రం యస్యాః స్యా సుమిత్రా, తస్యా అపత్యం పుమాన్ సౌమిత్రిః"** అనే విగ్రహం వల్ల ఈ అర్థం సిద్ధిస్తుంది. **"సృష్ట స్త్వం వనవాసాయ"** (నీవు వనవాసంలో శ్రీరామునకు సేవచేయడం కోసమే పుట్టావు) అని సుమిత్ర అన్నది కదా.

**(మే)** - నాకోసం - అని అర్థం, ఇది చతుర్థీవిభక్తిరూపం.

**(సర్వతః)** - అన్ని విధాలైన,

**(తత్ప్రసాదమ్)** - ఆ దివ్యదంపతుల అనుగ్రహాన్ని - ఉపాయోపేయ రూపంలోని ప్రీతివిశేషాన్ని - అని అర్థం.

**(జనయన్)** - కల్గించేవారై,

**(జయతు)** - సర్వోత్కర్షతో వర్ధిల్లాలి.

ఇక, చరమపర్వనిష్ఠులైన తాము భగవన్మంగళాశాసనం చేయడంలో కలిగే శంకను పరిహరిస్తున్నారు.

**(సః)** - ఆ సౌమిత్రి,

**(భగవాన్ సౌమ్యజామాతృయోగీ ఖలు)** - నిర్దోషకల్యాణగుణాకరులు, శ్రీరంగనాథుని తిరునామమైన **"అழகియ మణవాళన్"** (అందమైన వరుడు) అనే ద్రావిడనామాన్ని కల్గి ఉన్నందున ఆ నామాన్నే నిరూపకంగా కలవారు (సౌమ్యజామాతృశబ్దం **"అழகియమణవాళన్"** అనే పేరుకు ద్రావిడీకృతరూపం. **"యోగీ"** అనే పదం జీయర్ అనే అర్థాన్ని తెలిపేపదం) **"యోగీ"** అనే పదం ద్వారా జ్ఞానభక్తికైంకర్యాదులను సూచించే సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని చేసినవారనే అర్థాన్ని ఇస్తుంది. **"ఖలు"** అనే పదం సౌమిత్రి-శ్రీవరవరమునుల అభేదంలోని ప్రసిద్ధిని స్ఫురింపజేస్తుంది.

ప్రమాణాలు - ప్రత్యక్ష, అనుమాన, ఆప్తవాక్యరూప శబ్దాలని మూడు. సౌమిత్రి-వరవరమునుల అభేదానికి ప్రత్యక్షప్రమాణం **"శేషః శ్రీమాన్"** అనే శ్రీశైలాష్టకమనే ఎఱుమ్బియప్పా రచించిన స్తోత్రంలోని **"శేషః శ్రీమానజని హి పురా సౌమ్యజామాతృయోగీ, భోగీభూత స్తదను భగవాన్ రాఘవస్యామజన్మా"** మొదటి శ్లోకంలో తెలుపబడింది. అనుమానం, ఆప్తవాక్యరూప శబ్దం- అనే రెండు ప్రమాణాలు - **"నిత్యం పత్యుః పరిచరణతః"** అనే శ్లోకంలో వ్యక్తమయ్యాయి- అని గ్రహించాలి. ఈ విధంగా త్రివిధప్రమాణసిద్ధమైన అభేదంయొక్క ప్రసిద్ధి **"ఖలు"** అనే ఇచటి అవ్యయం ద్వారా ధ్వనిస్తున్నది.

**96.** అవ :- శ్రీవరవరమునుల రూపంలో అవతరించిన లక్ష్మణుడు, సీతాదేవిని, శ్రీరాముని విశ్లేషించకుండా వారితోనే ఉండి, వారి అనుగ్రహం తమపట్ల కలిగేట్లు చేస్తూ వర్ధిల్లాలని గడచిన శ్లోకంలో మంగళాశాసనం చేశారు - ఎఱుమ్బియప్పా. అంతటితో నిలుపకుండా, భావనాప్రకర్షవల్ల (మాటిమాటికి భావించే భావనయొక్క ఆధిక్యంచేత) **"మత్కృతే కాకమాత్రే తు బ్రహ్మాస్త్రం సముదీరితమ్, కస్మాత్ యో మాஉహరత్ త్వత్తః క్షమసే తం మహీపతే!"** (రామా-సుందర-38-39) (ఓ రాజా! నాకోసం అల్పప్రాణి అయిన కాకాసురుని పట్లనే నీవు బ్రహ్మాస్త్రాన్ని సంధించావు కదా! ఎవడు, నీవద్దనుండి నన్ను అపహరించాడో, అతనిని వధించకుండా ఎందుకు సహిస్తున్నావు?) అని చాలా దూరంలో ఉన్నా ఎదురుగానే ఉన్నట్లుగానే **"మహీపతే!"** అని సంబోధించి సీతాదేవి పల్కినట్లే, ఈ స్తుతికర్తకూడా శ్రీరంగంలో వేంచేసి ఉండే శ్రీవరవరమునులను భావనాప్రకర్షకారణంగా సాక్షాత్తు సమక్షంలో ఉన్నట్లే భావించి, **"వరవరమునే!"** అని సంబోధించి, తమ చరమపర్వనిష్ఠకు తగినట్లుగా - తమకు ఉపాయమైన శ్రీవరవరమునులకు, పురుషకారంగా కోయిల్‌కన్దాడై అణ్ణన్‌కు మంగళాశాసనం చేస్తున్నారు. ఈ సూక్తి అనుగుణంగా పెరియతిరుమొழிలోని. **"వాళాయకణ్ పనిప్ప"** (3-6-5) అనేపాశుర వ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై **"భావనాప్రకర్షత్తాలే అవన్‌మున్నే నిన్రానాక క్కొణ్డుఅవన్‌తనక్కు వార్తైశొల్లి చ్చొల్లుకిఱదు మేలిల్ పాట్టుక్కళ్. శ్రీరామాయణత్తిలే ఇరుక్కిఱ**

దాయ్త్తిరువుమ్. దూతర్క్కు వార్త్తైచ్చొల్లా నిఱ్కుచ్చెయ్దే భావనాప్రకర్షత్తాలే అవన్తాన్ సన్నిహితనాకక్కొణ్డు అవనుక్కు వార్త్తై చ్చొల్లుకిఱాళితే! "క్షమసే తం మహీపతే - ఎన్నుమాపోలే" (భావనా ప్రకర్షవల్ల శ్రీరాముడే తనముందున్నట్లుగా భావించి, అతని సంబోధిస్తూ పల్కినట్లుగా ఇకపై గల పాశురాలున్నాయి. శ్రీరామాయణంలోని సందర్భం వంటిదే ఇదికూడా. దూత అయిన హనుమంతునితో పలికేటపుడు సీతాదేవి భావనా విశేషంవల్ల ఆ శ్రీరాముడు తన సమక్షంలో ఉన్నట్లు తలచి, "క్షమసే తం మహీపతే!" అని అతనిని ఉద్దేశిస్తూ పల్కింది కదా) అనే వ్యాఖ్యాన పంక్తులు గమనించదగినవి.

యస్మాదేతద్యుపనిషదా మప్రమేయం ప్రమేయం
కుర్వాణ స్తత్ సకలసులభం కోమలై రేవ వాక్యైః ।
నీరోగ స్త్వం వరదగురుణా నిత్యయుక్తో ధరిత్రీం
పాహి శ్రీమన్! వరవరమునే! పద్మయోనే ర్దినాని ॥

శ్రీమన్ వరవరమునే = జ్ఞానశక్త్యాది గుణసంపదను నిండుగా కల్గిన ఓ వరవరమునీ!, ఏతత్ = విచిత్రంగా కన్పించే ఈ లోకం, యస్మాత్ = తనకు ఉపాదానం, నిమిత్తం- అనే మొదటి కారణం, కర్త అయిన ఏ భగవానుని నుండి పుడుతున్నదో, యత్ = ఏ భగవానుడనే పరబ్రహ్మం, ఉపనిషదాం = బ్రహ్మవిద్య అనబడే ఉపనిషత్తులయొక్క, అప్రమేయం = ఏదో కొంచమే తప్ప, పూర్ణంగా తెలియడానికి సాధ్యం కానిదో, తత్ = ఆ పరబ్రహ్మను, కోమలైః= కఠినమైనవి కాకుండా, సులభంగా తెలిసేటట్లుగాఉండే, వాక్యైః ఏవ = మాటలతోనే, సకలసులభమ్ = అందటికి సులభమైనదిగా, ప్రమేయం = తెలియదగినదిగా, కుర్వాణః= చేస్తున్నవారై, వరదగురుణా = దాసునకు పురుషకారభూతులైన కోయిల్‌కన్దాడై అణ్ణన్‌తోపాటు, నిత్యయుక్తః =ఎల్లప్పుడు కూడి ఉండే వారైన, త్వం = దేవరవారు, పద్మయోనేః= భగవానుని నాభీకమలం నుండి ఉద్భవించిన బ్రహ్మదేవునియొక్క, దినాని =అన్ని దినాల పాటు (బ్రహ్మ ఆయుఃకాల పర్యంతం) నిరంతరంగా, ధరిత్రీం = విశాలమైన భూమిని, నీరోగః సన్ = నిత్యంగా ఆరోగ్యాన్ని కలవారై, పాహి = సంరక్షించాలి.

పరబ్రహ్మ ఈ జగత్తుకు ప్రథమకారణం, (ఉపాదానకారణం), కర్త (నిమిత్తకారణం) కూడా అతని మహిమలు అంతు లేనివి. వాటిలో ఒకటిని కూడా, పరబ్రహ్మను గూర్చి తెలియజేయడంకోసమే ప్రవర్తిల్లిన ఉపనిషత్తులు సైతం "ఏతావన్మాత్రం" - అని తెలియలేవు. ఆ విధంగా, తెలియడానికి సాధ్యం కాని పరబ్రహ్మమనే భగవానుడైన - శ్రీమన్నారాయణుని గూర్చి శ్రీవరవరమునులు తామ అలవోకగా, వేడుకగా పలికే సులభమైన మాటలతో అందటికి తెలిసేటట్లుగా చేస్తున్నారు. అటువంటి శ్రీవరవరమునులకు శిష్యులై, ఈ ఎఱుమ్బియప్పా, ఆ వరవరమునులను తాము ఆశ్రయించేటపుడు పురుషకారం చేసినవారైన వరదనారాయణ గురువు అనబడే కోయిల్‌కన్దాడై అణ్ణన్‌తో శ్రీవరవరమునులు ఎల్లప్పుడు కూడి ఉండి, ఆరోగ్యాన్ని కలవారై, దృఢగాత్రులై బ్రహ్మకల్పాలు అన్నీ వేంచేసి ఉండి, అజ్ఞానం- అన్యథాజ్ఞానం- అనే వీటిచే నిండినదై జ్ఞానభక్తి వైరాగ్యాలను కొంచెం కూడా లేని ఈ లోకులను, అజ్ఞానాదులను పోగొట్టి,

జ్ఞానం మొదలైన వానిని కల్గించి రక్షించాలి - అని అంటూ శ్రీవరవరమునులను ఈ శ్లోకంలో ఎఱుమ్బి యప్పా ప్రార్థించారు. **"అడియోమోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్ఱి ఆయిరమ్ పల్లాణ్డు"** (నీ దాసులతో నీకు ఏ సమయంలోని విశ్లేషం లేకుండా చిరకాలం వర్ధిల్లాలి) అనే పెరియాழ్వార్లు చేసిన ప్రథమపర్వాత్మక మంగళాశాసన క్రమం చరమపర్వంలో అనుసంధింపబడింది. బ్రహ్మదేవుని ఆయుష్కాలం నూఱేండ్లు. అందులో ఒకదినం అంటే- మానవుల గణనుబట్టి వేయి చతుర్యుగాలు పరిమితిని కల కాలం. మానవుల లెక్కలో ఒక చతుర్యుగమంటే- నలభై మూడు లక్షల ఇరవై వేల సంవత్సరాల కాలం.

**వ్యాఖ్యానమ్ : (వరవరమునే)** - ఓమణవాళమహామునీ!,

**(ఏతత్)** - ధర్మిగ్రాహక ప్రమాణమైన ప్రత్యక్షప్రమాణంద్వారా తెలియబడే- అంటే- సాక్షాత్తుగా కంటికి గోచరించే అనేక విధాలైన వైచిత్ర్యాలతో కూడిన **"అఙ్గణ్మాఞాలమ్"** అయిన ఈ జగత్తును- అని ఈ సర్వనామశబ్ద తాత్పర్యం. **"మాయాం తు ప్రకృతిం విద్యాత్"** (మాయ అంటే ప్రకృతి) అనే రీతిలో ఈ ప్రకృతి మాయాశబ్దవాచ్యమైనది. మాయ అంటే - ఆశ్చర్యాన్ని కల్గించే వైచిత్రీవిశేషాలతో కూడినది. **"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీమ్"** అనే రీతిలో విభిన్నవర్ణాలను గుణాలను కల్గినందున విచిత్రమైనది ఈ జగత్తు. అంతేకాక **"గచ్ఛతీతి జగత్"** అనే రీతిలో సతత పరిణామి కనుక ఎప్పటికప్పుడు ఆశ్చర్యావహంగా ఉంటుంది- అనే ఈ విశేషాలనన్నిటినీ ఈ సర్వనాశబ్దం ప్రకృత ప్రకరణానుగుణంగా వ్యక్తీకరిస్తుంది.

**(యస్మాత్)** - ఎవనివలన - అయితే - అని అర్థం. అంటే - ఏ భగవానుడు ఉపాదానకారణంగాను, నిమిత్తకారణంగాను అవుతున్నాడో, ఆ భగవానుని వలన - అని తాత్పర్యం. **"యతో వా ఇమాని భూతాని జాయంతే"** (ఎవరివల్ల ఈ ప్రాణులు జనిస్తున్నాయో) అనే శ్రుతిని బట్టి **"జన్మాద్యస్య యతః"** అనే బ్రహ్మసూత్రాన్నిబట్టి ఈవిధంగా ప్రయోగింపబడింది. శ్రుతిలో, సూత్రంలో పంచమ్యర్థంలో తసిల్ ప్రత్యయం వచ్చింది.

**(ఉపనిషదామ్)** - సమస్త వేదాంతాలయొక్క,

**(యత్)**- శ్రీమన్నారాయణుని రూపంలోని, ఏ,

**(అప్రమేయమ్)** - పూర్తిగా ఇదమిత్థంగా తెలియరానిదైన- అని అర్థం. పరబ్రహ్మం అప్రమేయం- అంటే - ప్రమేయత్వం సుతరాం లేనిది - అని అర్థం కాదు. ఆ విధంగా అయితే దానికి తుచ్ఛత్వమనే దోషం సంక్రమిస్తుంది. **"ఆణల్లన్ పెణ్ణల్లన్"** - అనే తిరువాయ్మొழிసూక్తి ప్రమేయత్వాన్ని కల్గి ఉన్నా, దానిని తెలియడం ఎవరికీ సాధ్యంకాదనే అర్థంలో **"నఞ్"** ప్రయోగింపబడింది. అందువల్ల, నిఖిలజగత్తుయొక్క జన్మాదికారణం, వాక్కుకు మనస్సుకు అందని నిరవధికమహిమను కల్గినది, **"శాస్త్రయోనిత్వాత్"** అనే రీతిలో నిత్యనిర్దోషమైన వేదరూపశాస్త్రంద్వారా మాత్రమే తెలియవీలయినది, పరమపురుషరూపంలో ఉండేది అయిన పరంబ్రహ్మను - అని భావం. **"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"** అనే సూక్తిలోని **"వేదై రేవ వేద్యః"** అనే సావధారణాత్మకమైన అన్వయం ఇక్కడ వివక్షితం.

**(కోమలైరేవ వాక్యైః)** - అతిసుకుమారాలైన పదాలతో, చాలా గొప్ప అర్థాలతోకూడిన, వేడుకగా పలికే వాక్యాలతోనే - అని అర్థం. **"ఏవ"** కారం చేత పదప్రయోగంలో గౌరవం, కాఠిన్యం ఏమీ లేదని సూచింపబడింది.

**(సకలసులభమ్ ప్రమేయమ్)** - అందఱికి సులభమైన-అజ్ఞుడు, సర్వజ్ఞుడు- అనే భేదం లేకుండా అందఱికి తెలిసేటట్లుగా,

**(కుర్వాణః)**- చేసేవారై -అని అర్థం. "సకలసులభ"మనే పదం క్రియావిశేషణం. ప్రమేయ పదాంతర్గతమైన **"ప్రమా"** (జ్ఞాన) క్రియకు అన్వయిస్తుంది. **"కుర్వాణః"** అనే ఆత్మనే పదప్రయోగంద్వారా స్వప్రయోజనాన్ని ఉద్దేశించి చేయడం కాకుండా, పరార్థంకోసం చేస్తున్నారని స్ఫురిస్తుంది.

**(వరదగురుణా నిత్యయుక్తః)**- నాకు పురుషకారభూతులు, మీకు మిక్కిలి ప్రియమైన వారైన వరదనారాయణ గురువర్యులతో ఎల్లప్పుడు కూడినవారై,

**(త్వమ్)**- దేవరవారు,

**(పద్మయోనేర్దినాని)**- **"చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే"** అని నిర్వచింపబడిన బ్రహ్మ దినాలు అన్నిటిలోను - అని అర్థం. శాశ్వతంగా- అని తాత్పర్యం.

**(ధరిత్రీమ్)**- అన్యథాజ్ఞానం మొదలైన దోషాలతో నిండిన ఈ మహాపృథివిని,

**(నీరోగః సన్)** - నిత్యం ఆరోగ్యాన్ని కలవారై- అని అర్థం. **"ఆయు రాశాస్తే"**, **"పల్లాణ్డు పల్లాణ్డు"** అనే వైదికమైన మంగళాశాసనం, ఇది.

**(పాహి)**- అన్యథాజ్ఞానాది అనిష్టాన్ని నివారించడంతో పాటుగా, జ్ఞానభక్తి వైరాగ్యాదిరూపంలోని ఇష్టప్రాప్తిని కల్గించి పాలించండి- అని భావం.

**97.** అవ :- పూర్వం పల్కిన భావనాప్రకర్షకారణంగానే శ్రీవరవరమునుల వద్దకు చేరినపుడు కలిగే సంతోషంవంటి సంతోషాన్ని నాట్యం చేసి వ్యక్తం చేస్తూ, ఆ నాట్యానికి తగిన తాళంవలె అమరిన వృత్తంతో కొన్ని శ్లోకాలను ఎఱుమ్బియప్పా పల్కుతున్నారు. కావ్యంలోని సర్గ చివరలో **"సర్గాంతే భిన్నవృత్తైశ్చ"** అని తెల్పిన రీతిలో అంతకుముందు గల వృత్తం కంటే భిన్నమైన వృత్తంలో కొన్ని శ్లోకాలు రచించడం కవుల పరిపాటి, కావ్యానికి శోభాకరం. ఆక్రమం ఇక్కడ పాటింపబడింది. ప్రకృతశ్లోకం **"సింహవిక్రీడిత"** మనే వృత్తంలో రచింపబడింది. **"ననరరరర"** అనే గణాలను కల్గి ఉంటుంది. వరవరముని పాత్రులైన జీయర్ నాయనార్ (అభిరామవరులు) నమ్మాళ్వార్ల విషయంలో రచించిన నక్షత్ర మాలికాస్తోత్రంలోని 11వ, 17వ శ్లోకాలు ఈ వృత్తంలోనే కూర్పబడ్డాయి.

**వరవరమునివర్య! చింతా మహంతాముషం తావకీం**
**ఆవిరత మనువర్తమానా నమానావమానా నిమాన్ ।**

నిరుపధిపదభక్తినిష్ఠా ననుష్ఠాననిష్ఠానహం
ప్రతిదిన మనుభూయ భూయో న భూయాస మాయాసభూః ॥

వరవరమునివర్య! = ఓ మణవాళమహామునివర్యా!, తావకీం = దేవరవారిని గూర్చినది, అహంతా ముషం = "నేను నాకు శేషి'' అనే అహంకారాన్ని పోగొట్టేది అయిన, చింతాం = భావనను, అవిరతం = ఎడతెగకుండా, అనువర్తమానాన్ = అనుసంధించేవారై, (దానివల్ల), అమాన+అవమానాన్ = మానావ మానాలను తాము ఇతరుల విషయంలో చేయడం, ఇతరులు తమ విషయంలో చేయడం- అనే వీటిని లేనివారైన, ఇమాన్ =ఈ (కంటికి కన్పించే), నిరుపధిపదభక్తినిష్ఠాన్ = వేఱు ప్రయోజనాలను ఆశించకుండా చేసే, దేవరవారి శ్రీచరణాల విషయంలో సహజంగా చేసే భక్తిలో నిలకడను - నిష్ఠను కలవారై, అనుష్ఠాన నిష్ఠాన్= ఆ భక్తి కారణంగా చేయబడే కైంకర్యంలో నిష్ఠను కలవారిని, ప్రతిదినం = ప్రతిదినం, అనుభూయ = దర్శించి, ఆనందించి, అహం = చరమపర్వ విషయంలో ప్రీతిని కల్గిన నేను, భూయః = మళ్ళీ, ఆయాసభూః= తగని వస్తువులలో ఆశను పొందడమనే దుఃఖానికి ఆశ్రయంగా, న భూయాసమ్ = కాబోను.

పూర్వం శ్రీరంగంలో శ్రీవరవరమునులను, వారి శిష్యులు, ఆ శ్రీవరవరమునుల శ్రీచరణాలలో భక్తితో కైంకర్యాలను చేస్తూ ఉజ్జీవించడం కళ్ళారా దర్శించినవారు కనుక, దానినే ఎల్లప్పుడు భావించినందున కల్గిన భావనా ప్రకర్షం, ఆదృశ్యాన్ని తమకంటి ఎదురుగా దర్శించే రీతిలోని ఒక గొప్ప దశను కల్గించగా, ఎఱుమ్బియప్పా, "ఓవరవరమునీ! దేవరవారి భక్తులను, దేవరవారిని ఈ రీతిలో ఎల్లపుపడూ సేవిస్తూ, ఆనందించాలి. మళ్ళీ తిరిగి స్వరూపానికి తగని విషయాలలో ఆశనుపొంది, ఈ లోకంలోని తగని సుఖాలను ఆశపడి క్లేశాలను పొందకుండా ఉండాలి''- అని భావం.

ఈ శ్లోకంలో, తిరుమంత్రం (అష్టాక్షరీ మహామంత్రం) లోని మూడు పదాలచే తెలియబడే మూడు అర్థాలు చరమపర్వపర్యంతంగా అనుసంధింపబడడం గమనార్హం.

**"అహంతాముషమ్"** అనే పదం ద్వారా శ్రీవరవరమునులనుగూర్చిన ధ్యానం- వారి శిష్యులకు "నేను నాకు శేషి'' అంటే - "నేను స్వతంత్రుడను'' అనే అహంకారాన్ని పోగొడుతున్నది- అని పల్కినందున, ప్రణవార్థమైన అనన్యార్హశేషత్వం- శ్రీవరవరమునులకే శేషమై ఉండడం- అనేది వారికి ఉన్నదని తెలుపబడింది. **"పదభక్తినిష్ఠాన్"** అనడం ద్వారా వేఱు ప్రయోజనాన్ని ఆశించకుండా- అంటే- స్వయం ప్రయోజనంగా - అంటే- శ్రీవరవరమునుల శ్రీచరణాలలో భక్తిని కల్గి ఉండడమే ప్రయోజనంగా భావించి, దానిని చేయడంలోనే ఊనికనుకల్గి ఉండేవారు, శ్రీ వరవరమునుల శిష్యులు- అని పల్కినందునవారు, తమ పురుషార్థమైన ఆచార్యకైంకర్యానికి ఆ వరవరమునులను తప్ప, వేఱు దేనినీ ఉపాయంగా గ్రహించకపోవడం -అనే అనన్యశరణ్యత్వమనే నమశ్శబ్దార్థం తెలుపబడింది- అని, **"భూయో న భూయస మాయాసభూః"** అనడం ద్వారా మళ్ళీ శబ్దాది విషయాలలో ఆశపడి, అవి లభించనందున కలిగే దుః ఖాలకు లక్ష్యం కాకుండా, తమ ఆనందంకోసం శబ్దాదివిషయాలను అనుభవించడంలో కలిగే ఆశకు పూర్తిగా వ్యతిరేకమైన- శ్రీవరవరమునుల ఆనందంకోసం వారికి చేసే కైంకర్యంలోని ఆశను కల్గి ఉండడం స్ఫురించడం ద్వారా అనన్యభోగ్యత్వమనే **"నారాయణాయ"** అనే పదం యొక్క అర్థం తెలుపబడింది.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునివర్య!)** మణవాళమహామునీ!,

**(తావకీమ్)-** దేవరవారిని విషయంగా కల్గినది,

**(అహంతాముషమ్)-** స్వస్వాతంత్ర్యజ్ఞానం (నేను స్వతంత్రుడను - నేను నాకు శేషిని అనే రూపంలోని జ్ఞానం) అనే అహంకారాన్ని దొంగిలించేది అయిన -అని అర్థం. దొంగిలించడమంటే- తెలియని రీతిలో నివర్తింపజేయడమే.

**(చింతామ్)-** స్మృతిని,

**(అవిరతమ్)-** క్షణమాత్రం అయినా విచ్ఛేదం లేకుండా,

**(అనువర్తమానాన్)-** అనుసరించేవారు- అని అర్థం. దీనివల్ల, శ్రీవరవరమునివర్యులకు సంబంధించిన, భావనపట్ల శేషత్వాన్ని కలవారు- అని అర్థం కనుక, భావనావిషయంలో వీరికి గల అత్యంత పారతంత్ర్యం స్ఫురిస్తున్నది. లేక **"చింతా మనువర్తమానాన్"** అనే ప్రయోగానికి **"చింతా మను"** - చింతను గూర్చి, **"వర్తమానాన్"** వృత్తిని కలవారై- దానినే శరీరధారణోపాయంగా కలవారై - అని చెప్పవచ్చు. దీనివల్ల, శ్రీవరవరమునుల విషయంలోని అనుస్మృతి చేతనే వీరు తమ శరీరధారణను చేయగల్గుతున్నారని తెలిసేటట్లుగా ఉండడం- అని అర్థం. దీనిద్వారా లౌకికమైన అన్నపానాదులలోని అపేక్షారాహిత్యం స్ఫురిస్తుంది. అందువల్లనే,

**(అమానావమానాన్)-** మానం అంటే -గౌరవం, అవమానం అంటే- తిరస్కారం. **"అర్థకామానపేక్షైః"** అని అర్థకామాదులను అపేక్షించనివారు కనుక, ఆ అర్థకామాదుల కారణంగా కలిగే మానావమానాలను తమ విషయంలోను, ఇతరుల విషయంలోను లేనివారని భావం. అంటే - అర్థకామాదుల కారణంగా ఇతరులవల్ల మానావమానాలను పొందడంగాని, ఇతరులకు మానావమానాలను కల్గించడం గాని లేనివారని తాత్పర్యం. **"ఉళదెన్ఱిఱుమావార్, ఉణ్డిల్లై యెన్ఱు తళర్‌తల - తనరుకుమ్ శారార్.... అళవరియ వేదత్తాన్ వేఙ్గడత్తాన్ విణ్ణోర్‌ముడి తోయుమ్ పాదమ్ పణిన్దు"** (అపరిమితాలైన వేదాలచే ప్రతిపాదింపబడేవాడు, తిరుమలలో ఉన్నవాడు, నిత్యసూరులు నమస్కరించే శ్రీచరణాలను కలవాడైన శ్రీనివాసుని పాదాలను గౌరవించేవారు సంపద వస్తే పొంగిపోరు. అదిపోతే కుంగిపోరు) అనే పూదత్తాళ్వార్ల ఇరణ్డామ్ తిరువన్దాది (45) సూక్తి ప్రథమపర్వాత్మకం కాగా ఇది చరమపర్వాత్మకం. ఇటువంటి,

**(ఇమాన్)-** కంటికి ప్రత్యక్షంగా కన్పించే వీరిని,

**(నిరుపధిపదభక్తి నిష్ఠాన్)-** సహజమైన - స్వప్రయోజనం ఉద్దేశ్యంగా కల్గి ఉండడం మొదలైన ఏ హేతువులను కల్గి ఉండనిది, దేవరవారి శ్రీచరణాలను విషయంగా కల్గినది అయిన భక్తిలో - అత్యర్థమైన ప్రీతిలో- నిష్ఠను కలవారు.

**(అనుష్ఠాననిష్ఠాన్)-** అటువంటి నిరుపాధికమైన భక్తి ప్రేరేపించగా దేవరవారికి చేసే సకల విధకైంకర్యాలను కలవారైన దేవరవారి భృత్యులను,

**(ప్రతిదినమ్)**- కాలం ఉన్నంతవరకు,

**(అనుభూయ)**- నిరతిశయమైన దేవరవారి ప్రీతికి విషయంగా చేసికొని- వారిపట్ల అత్యంతమైన ప్రీతిని కలవాడనై -అని భావం.

**(అహమ్)**- పూర్వం తెలుపబడిన రీతిలో చరమపర్వవిషయంలో ప్రావణ్యాన్ని కల్గిన నేను,

**(భూయః)**- మళ్ళీ తిరిగి,

**(ఆయాసభూః)**- తగని విషయాలలో ప్రావణ్యాన్ని కల్గి ఉండడమనే దుఃఖానికి ఆశ్రయమై ఉండడం,

**(న భూయాసమ్)**- కావాలని కోరుకోవడం లేదు. **"అపగతమదమానై రంతిమోపాయనిష్ఠైః, అధిగత పరమార్థై రర్థకామానపేక్షైః నిఖిల జనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః వరవరముని భృత్యైః"** అనే దినచర్యాసూక్తి ప్రకృతంలో అనుసంధేయం.

**98.** అవ :- భగవద్రామానుజమునులపట్ల వైముఖ్యాన్ని కల్గినవారి విషయంలో వైముఖ్యాన్ని చూపడం- అనే ముఖ్యధర్మాన్ని అనువర్తించేవారై, శ్రీవరవరమునుల సంబంధాన్ని పొందిన కొందఱు మహానుభావులను గూర్చి ఇందులో పల్కుతూ, ఆనందిస్తున్నారు.

**వరవరమునివర్యపాదా వుపాదాయ సౌదామనీ -**
**విలసితవిభవేషు విత్తేషు పుత్రేషు ముక్తేషణాః ।**
**కతిచన యతివర్యగోష్ఠీబహిష్ఠీకృతష్ఠీవనా**
**విజహతి జనిమృత్యునిత్యానువృత్త్యా యదత్యాహితమ్ ॥**

వరవరమునివర్యపాదౌ = **"అழகియ మణవాళన్"** అనే వరవరమునివర్యుల శ్రీచరణాలను, ఉపాదాయ = పురుషార్థం గాను, దానికి తగిన ఉపాయంగాను స్వీకరించి, (దానివల్ల), సౌదామనీ విలసిత విభవేషు = మెఱుపువంటి చంచలమైన కాంతిని కల గృహక్షేత్ర వాహనాది సొత్తులలోను, విత్తేషు = బంగారు మొదలైన సంపదలలో, పుత్రేషు = సుతులు మొదలైనవారిలోను, ముక్త+ఈషణాః = ఆశను విడిచినవారు, యతివర్యగోష్ఠీ బహిష్ఠీకృతష్ఠీవనాః = శ్రీరామానుజుల శిష్యగోష్ఠులచే బహిష్కరింపబడినవారికి దూరంగా ఉండేవారైన, కతిచన = ఇద్దఱు, ముగ్గురు - అనే రీతిలో స్వల్పంగా ఉండే, కొందఱు మహాను భావులు, జనిమృత్యు = జననమరణాలు, నిత్య+అనువృత్తి = ఎల్లప్పుడు అనువర్తించడం వల్ల, ఆయత్= కలిగే, అత్యాహితం = మహాపదను, విజహతి = పూర్తిగా విడచిపెడుతున్నాడు.

శ్రీవరవరమునుల శ్రీచరణాలను ఆశపడి, వాటినే సర్వస్వంగా భావించినందున, అస్థిరాలైన గృహక్షేత్రాదులలోను, బంగారంవంటి సంపదలలోను, పుత్ర భార్యాదులలోను ఆశ తీరినవారై, ఆ వరవరమునుల పూర్వావతారమైన శ్రీరామానుజుల శ్రీచరణసంబంధాన్ని పొందిన కూరేశులు, ముదలియాణ్డాన్, పిళ్ళాన్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, అనన్తాழ்వాన్, కిడాంబియాచ్చాన్

మొదలైనవారికే ముక్తి లభిస్తుంది. కనుక, వారిచే తిరస్కరింపబడిన మతాంతరాలకు చెందినవారిపట్ల వైముఖ్యాన్ని చూపే కొందఱు మహానుభావులు- ఈ లోకంలో జన్మమరణాలను పొందుతూ అనుభవించే క్లేశాలను తాము అనుభవించరు- అని తాత్పర్యం. దీనిద్వారా **"మన్నుయిర్కాళ్! ఇజ్గే మణవాళమామునివన్ పొన్నడియామ్ శెజ్గమలప్పోదుకళై, ఉన్ని చ్చిరత్తాలే తీణ్డిల్ అమానవనుమ్ నమ్మై క్కరత్తాలే తీణ్డల్ కడన్"** (స్థిరంగా నిలచి ఉండే ఓ చేతనులారా! ఈ లోకంలో మాకు శ్రీవరవరమునుల బంగారువలె ఆశపడదగిన పాదపద్మాలని శిరస్సుతో తాకితే, అమానవ పురుషుడు మనలను తన చేతులతో తప్పక స్పృశిస్తాడు) అని అంటూ వరవరమునులనుగూర్చి ఈ స్తుతికర్త ఎఱుమ్బియప్పాయే అనుగ్రహించిన పాశురార్థం ఈ శ్లోకానికి అనుగుణంగా అనుసంధేయం.

వ్యాఖ్యానమ్ : **(వరవరమునివర్యపాదౌ)**- చరమశేషి అయిన భగవద్వరవరముని శ్రీచరణాలను,

**(ఉపాదాయ)**- ఉపాయంగా, ఉపేయంగా భావించి, ఆశ్రయించి,

**(సౌదామనీవిలసితవిభవేషు)**- మెఱుపువలె అస్థిరాలైన గృహక్షేత్రాది వైభవాలలో- అని అర్థం. సౌదామనీశబ్దానికి **"సుదామ"**- అనే పర్వత విశేషం ఉండే దిక్కులో పుట్టినది మెఱుపు- అని అర్థం. దీనివల్ల వీటి కాదాచిత్కం (కొంతకాలం మాత్రం ఉండే స్వభావం) సూచింపబడింది. **"మిన్నిన్ నిలైయిల మన్నుయిరాక్కళ్"** (మెఱుపు ఉన్నంతసేపు కూడా ఈ శరీరాలు నిలచి ఉండవు) అనే తిరువాయ్మొழி సూక్తిభావ్యం.

**(విత్తేషు)** - ధనాలలో- బంగారం మొదలైన సంపదలలో,

**(పుత్రేషు)** - కుమారులు, కుమార్తెలపట్ల- అని అర్థం. **"అర్థో హి కన్యా పరకీయ ఏవ"** (కన్య అంటే ఇతరుల సొత్తు కదా!) అని **"కన్యాపితృత్వం దుఃఖాయ"** (కన్యకు తండ్రి కావడం దుఃఖాన్నే కల్గిస్తుంది) అనే సూక్తులు లోకంలో ఉన్నా, **"పుత్రాత్ శతగుణా పుత్రీ యది పాత్రే ప్రదీయతే"** (తగిన వరునకు ఇవ్వగల్గితే పుత్రునికంటే కూతురే మేలు) అనే సూక్తికూడా ఉన్నందున, ఇక్కడ పుత్రులతోపాటు పుత్రికలను కూడా చెప్పడంలో అడ్డులేదు. మెఱుపు మెఱిసినంత సమయంకూడా స్థిరంగా విత్తం నిలచి ఉండదు- అనే ఉద్దేశ్యంతో అది నిర్విశేషంగా ప్రయోగింపబడింది. **"పుత్రేషు విత్తేషు"** అనే ఈ రెండు పదాల సాహచర్యం వల్ల (ఒకదాని తర్వాత ఇంకొకటి కలిపి ప్రయోగించడం వల్ల) విభవశబ్దం క్షేత్రగృహవాహనాదుల విషయంగా అన్వయించాలి. లేకపోతే పునరుక్తి దోషం వస్తుంది.

**(ముక్తేషణాః)** - పూర్వం తెలుపబడిన విభవ-విత్త- పుత్రులనే మూడు విషయాలలో అభిలాషను లేనివారై - అని అర్థం. **"వరవరమునివర్యపాదౌ ఉపాదాయ ముక్తేషణాః"** అనే రెండు ప్రయోగాలద్వారా **"పరమాత్మని యో రక్తః విరక్తో పరమాత్మని"** (పరమాత్మ విషయంలో అనురాగాన్ని కలవాడు, తనపట్ల పూర్తిగా విరక్తుడు) అని, **"సా తం సమాసాద్య విశుద్ధసత్త్వా"** ఇత్యాది రీత్యా శ్రీవరవరమునులతో గల సంబంధంయొక్క ఫలం - వైరాగ్యాదిప్రాప్తి - అని తెలుపబడింది.

**(యతివర్యస్య)** - భగవద్రామానుజుల,

**(గోష్ఠీ)** - దివ్యపరిషత్తులచే - అని అర్థం. **"గావోఽనేకా వాచః తిష్ఠంత్యస్యామ్ ఇతి గోష్ఠీ"** అని గోష్ఠీశబ్దవ్యుత్పత్తి. పలు సూక్తులతో నిండిన సభగోష్ఠి. అటువంటి గోష్ఠులచే- గోష్ఠులలోని సత్పురుషులచే- అని అర్థం. లేక, తమ యోగక్షేమాలకు భగవానునిపైననే ఆధారపడే గోవులవలె శ్రీరామానుజులే ప్రాప్యప్రాపకాలనే నిష్ఠుల సభ - అని అర్థం.

**(బహిష్ఠీకృత)** - బహిష్కరింపడిన పురుషాధములపట్ల,

**(ష్ఠీవనమ్)** - జుగుప్సను, వైముఖ్యాన్ని వ్యక్తం చేస్తూ -లాలాజల నిరసనం చేసేవారు- ఉమ్మివేసేవారు- అని అర్థం. సత్పురుషులచే బహిష్కరింపబడిన పురుషాధములను చూచి జుగుప్సాభావాన్ని ప్రదర్శించేవారని తాత్పర్యం.

**(కతిచన)** - **"స మహాత్మా సుదుర్లభః"** అని, **"న లభ్యతేఽధికారీ వా"** అని చెప్పబడిన రీతిలో, ఇద్దఱు ముగ్గురు అంతే - అనే రీతిలో చాలా కొద్దిమంది మహాపురుషులు,

**(జనిమృత్యునిత్యానువృత్త్యా యదత్యాహితమ్)**- జననమరణాల నిత్యానువృత్తివల్ల పొందే, చాలా దీర్ఘమైన మహాభయాన్ని - అని అర్థం. **"ఆయత్"** అనే పదానికి- కారణదైర్ఘ్యాన్నిబట్టి వాటివల్ల కలిగే ఆపదలు కూడా దీర్ఘంగానే ఉంటాయి కనుక, దీర్ఘమనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(విజహతి)** - విడచిపెడుతున్నాడు. 'వి'అనే ఉపసర్గ ప్రయోగంద్వారా తనకేకాక, తనతో సంబంధాన్ని కలవారికికూడా ఈ భయత్యాగం సంభవిస్తుందని ధ్వనిస్తుంది. అందువల్ల, తమకు, తమకు సంబంధించిన వారికి గల సంసారభీతి పూర్తిగా తొలగిపోతుంది - అని తాత్పర్యం. **"కేశవన్ తమర్ కీ*ழ్*మేల్ ఎమరేళె*ழు* పిఱప్పుమ్... నమ్మడై వా*ழு*వ్వు వాయ్క్కిన్ఱ వా"** అనేరీతిలోని భగవద్భక్తులతో ఏడేడు తమ సంబంధం కలవారికి కూడా శ్రేయస్సు కల్గుతుందని పలికే సూక్త్యర్థం చరమపర్వంలో నివక్షింపబడింది.

**99.** అవ :- పురుషకారం చేసినందువల్ల తమకు ఉద్దేశ్యభూతులైన కోయిల్ కన్దాడై అణ్ణన్ గూర్చి పల్కడం ద్వారా, వారివంటి శ్రీవరవరముని శిష్యులను గూర్చి ఈ శ్లోకంలో ఎఱుమ్బియప్పా పల్కి ఆనందిస్తున్నారు.

నిరవధినిగమాంతవిద్యానిషద్యానవద్యాశయాన్
యతిపతిపదపద్మబంధానుబంధానుసంధాయినః ।
వరవరమునివర్యసంబంధిసంబంధిసంబంధినః
ప్రతిదిన మనుభూయ భూయో న భూయాస మాయాసభూః ॥

నిరవధి = అంతు లేని, నిగమాంతవిద్యా = వేదాంత విద్యలకు, నిషద్యా = వేదికయై, అనవద్య = దోషం లేని, ఆశయాన్ = మనస్సును కలవారు, యతిపతిపదపద్మ = యతిరాజులైన భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలతో గల, బంధ = సంబంధాన్ని, అనుబంధ = అనుసరించిన సంబంధాన్ని, అనుసంధాయినః= (తమకు మోక్షహేతువుగా) అనుసంధించేవారు, వరవరమునివర్య = వరవరమునుల, సంబంధి =

సంబంధాన్ని కలవారితో, సంబంధి = సంబంధాన్ని కలవారియొక్క, సంబంధినః= సంబంధాన్ని కలవారిని, ప్రతిదినం =నిత్యం, అనుభూయ = దర్శించి, ఆనందించి, భూయః= తిరిగి, అహం = నేను, ఆయాస భూః = తగని విషయాలలో ఆశపడి, పొందే దుఃఖాలకు ఆశ్రయంగా, న భూయాసమ్ = కాబోను.

ఎవరి నిరవద్యమైన మనస్సు లెక్కలేనన్ని వేదాంతవిద్యలకు వేదికయైనదో, ఎవరు తమకు మోక్షహేతువుగా భగవద్రామానుజుల పరంపరాసంబంధాన్ని విశ్వసిస్తున్నారో, అటువంటివారైన-శ్రీవరవరమునుల దాసుల దాసులకు దాసులైన మహాత్ములను ఎల్లప్పుడు గౌరవించాలి. అందువల్ల నేను అప్రాప్తమైన లౌకిక విషయాలలో ఆశపడి దుఃఖపడకుండా ఉండాలి- అని తాత్పర్యం.

ఈ శ్లోకంలో మొదటి పాదంలో కోయిల్ అణ్ణన్ తనియన్‌లోని మొదటి పాదమైన **"సకలవేదాంత సారార్థపూర్ణాశయమ్"**- అన్ని వేదాంతాల సారార్థాలలో నిండిన హృదయాన్ని కలవారైన అణ్ణన్- అనే అర్థం సూచింపబడడం గమనార్హం. అందువల్లనే ఈ శ్లోకంలో శ్రీవరదనారాయణ గురువుల ప్రస్తావన ముఖ్యంగా చేయబడిందని భావించడం యుక్తం. (ఈ తనియన్‌ను సాక్షాత్తు వరవరమునులే అనుగ్రహించారని కూడా పెద్దల సాంప్రదాయిక కథనం)

**వ్యాఖ్యానమ్ : (నిరవధి... ఆశయాన్)** అవధి లేని వేదాంతవిద్యలకు వేదికవంటిది, తమ శిష్యుల ప్రయోజనాల విషయంలో ప్రతిపత్తి విపర్యాసం (విరుద్ధ ప్రతిపత్తి) కల్గడానికి కారణమైన మిశ్రసత్త్వమనే దోషాన్ని లేనిది-అంటే-పరమసాత్త్వికమైనది అయిన హృదయాన్ని కలవారు-అని భావం. **"అనంతా వై వేదాః"** (పాదచ్ఛాయ, పాదుక అయినాము) కనుక వేదాంతవిద్యలు కూడా అనంతాలు. అర్థంలో కూడా అనంతాలే-అని అర్థం. **"నిషీదంత్యత్ర"** అనే నిషద్యాపదవ్యుత్పత్తిచే నిగమాంత విద్యలన్నీ వరవరమునుల శిష్యుల హృదయాలలో ఆదరంతో వేంచేసి ఉంటాయని భాసిస్తున్నది. ఆవిద్య చరమపర్వమే.

**(యతిపతి.... సంధాయినః)** - భగవద్రామానుజ శ్రీచరణపద్మాలే తమకు ఉజ్జీవనహేతువు -అనే నిశ్చయాన్ని కలవారైన,

**(వరవర... సంబంధినః)**- శ్రీవరవరమునివర్యుల దాసుల దాసుల దాసులను,

**(ప్రతిదిన మనుభూయ)**- ప్రతిదినం దర్శించి ఆనందించి, వారిని **"నిழలు మడితాఋ మానోమ్"** అనే రీతిలో ఛాయవలె, పాదుకవలె అనుసరించి, కైంకర్యం చేసి - అని హార్దభావం.

**(ఆయాసభూః భూయో న భూయాసమ్)**- మళ్ళీ తిరిగి క్లేశాలకు ఆశ్రయం కాబోను- అని అర్థం.

**100.** అవ :- శ్రీవరవరమునుల సంబంధాన్ని కలవారినిగూర్చిన ప్రస్తావం గత శ్లోకంలో రాగానే, వారు కోలాహలంతో అనుష్ఠించదగిన శ్రీవరవరమునుల అవతారనక్షత్రమైన అల్పిశి (ఆశ్వయుజ) మాసంలోని మూలానక్షత్రం స్మరణకు వచ్చింది. వెంటనే దాని వైలక్షణ్యాన్ని స్తుతిస్తూ ఆనందిస్తున్నారు- ఈ శ్లోకంద్వారా.

**యన్మూల మాశ్వయుజమాస్యవతారమూలం**
**కాంతోపయంత్ర్యయమినః కరుణైకసింధోః ।**

**ఆసీదసత్సు గణితస్య మమాపి సత్తా**
**మూలం తదేవ జగదభ్యుదయైకమూలమ్ ॥**

ఆశ్వయుజమాసి = అల్పిశి మాసంలో, యత్ మూలం = ఏ మూలనక్షత్రం, కరుణా+ఏకసింధోః= దయకు సాటి లేని సముద్రంవంటివారైన, కాంతోపయంతృయమినః= శ్రీవరవరమునుల, అవతారమూలం = అవతారానికి కారణమైనదో, తత్+ఏవ = ఆ మూలనక్షత్రమే, అసత్సు= స్వరూపనాశాన్ని పొందినవారిలో, గణితస్య = మొదటివాడనుగా లెక్కింపబడ్డ, మమాపి = దాసుడనైన నాకు కూడా, సత్తామూలమ్ = స్వరూపజ్ఞానానికి కారణమైన, జగత్+అభ్యుదయైకమూలం = లోకంయొక్క శుభానికి కారణంగాను, ఆసీత్ = అయినదో,

ఆత్మ, భగవద్భాగవతులకు - ముఖ్యంగా ఆచార్యులకు, **"ఎమ్మై విక్కవుమ్ పెఱువార్కళే"** అనేరీతిలో శేషమైనది - అనే స్వరూపజ్ఞానం లేనందువల్ల, ప్రాణాలతో ఉన్నా, అసత్తుగానే భావింపబడిన వారు లోకంలో పలువురు ఉన్నారు. వారిలో మొదటివాడనుగా పెద్దలచే నేను లెక్కింపబడినవాడను, ఈవిధంగా అసత్తునై పడిఉండే నన్నుకూడ, శ్రీవరవరమునులు మూలనక్షత్రంలో అవతరించిన మహిమవల్ల "దయకు సాటి లేని సముద్రంవంటివారు వీరు'' అని అందఱు భావించే రీతిలో నన్ను సంస్కరించి, నాకు ఆత్మస్వరూపజ్ఞానం కలిగేటట్లు చేశారు - అంటే, అసత్తులలో దాసుడనైన నాకంటే తక్కువ అయిన ఈ లోకంలోనివారి స్వరూపజ్ఞానమనే అభ్యుదయాన్ని పొందారని ప్రత్యేకించి చెప్పవలసి ఉన్నదా- అనే భావాన్ని ఇందులో స్తుతికర్త ప్రకటించారు. **"తదేవ"** (ఆ మూల నక్షత్రమే) అని అనడంవల్ల మణవాళమహామునులు కూడా అక్కర లేదు. వారు అవతరించిన మూలనక్షత్రంవల్లనే దాసుడనైన నేను, ఈలోకం ఉజ్జీవించాము- అనే భావం స్ఫురిస్తుంది. **"ఆణ్మూలమ్ అరశాకుమ్"** (మూలానక్షత్రంలో పుట్టినవాడు ప్రభువు కాగలడు.) అనే ద్రావిడ సామెతను **"మమాపి సత్తామూలం, జగదభ్యుదయైకమూలమ్"** అనే ప్రయోగం వివరించడం ఇక్కడ గమనించదగినది.

**వ్యాఖ్యానమ్ : (ఆశ్వయుజమాసి)-** తులామాసంలోని,

**(యన్మూలమ్)** - ఎటువంటి మూలనక్షత్రం,

**(కరుణైకసింధోః)-** కరుణకు సాటిలేని నిలయులైన- అని అర్థం. **"స్యందంతే ఆపః అత్ర"** అనే సింధు శబ్దవ్యుత్పత్తిని బట్టి **"కరుణా కాకుత్స్థ"**డుగా పేరొందిన శ్రీరాముని కరుణకుకూడా లక్ష్మణుడు మూలమైనవాడు. **"లక్ష్మణ స్యచ ధీమతః"** అనే శ్రీరామాయణ సూక్తి **"సర్వేశ్వరాదప్యాశ్రిత సంరక్షణే సముద్యుక్తస్య"** అని గోవిందరాజీయ వ్యాఖ్యానంలో **"ధీమతః"** అనే పదం వివరింపబడడం దీనికి తార్కాణం.

**(కాంతోపయంతృయమినః)** - శ్రీవరవరమునులయొక్క,

**(అవతారమూలమ్ ఆసీత్)** - దివ్యావతార హేతువు అయినదో,

**(తదేవ)-** అటువంటి దివ్యమైన మూలనక్షత్రమే- అని అర్థం. **"ఏవ"** కారం చేత శ్రీవరవరమునులు కూడా అక్కరలేదు, వారు అవతరించిన మూల నక్షత్రమే చాలు- అనే భావం వ్యక్తమవుతున్నది.

**(అసత్సు గణితస్య)-** శ్రీవరవరముని సంబంధం లేని కారణంచేత స్వరూపనాశాన్ని పొందినవారిలో మొదటివాడుగా లెక్కించబడిన- అని అర్థం. **"అవస్తుప్రస్తావేష్వచరమమ్"** (సత్తలేని వారిలో ప్రథముడను) ఇత్యాది గోవిందభట్టర్ సూక్తి దీనికి అనుగుణంగా స్మరణీయం.

**(మమాపి)** - సర్వశక్తి అయిన ఈశ్వరుడుకూడా స్వరూపజ్ఞానాన్ని కల్గించలేని నాకు,

**(సత్తామూలమ్)** - **"సంత మేనం తతో విదుః"** అని శ్రుతిలో చెప్పబడిన విలక్షణమైన అస్తిత్వానికి కారణంగా,

**(జగదభ్యుదయైక మూలమ్)** - జగన్మంగళానికి ముఖ్యహేతువుగా,

**(ఆసీత్)** - అయినదో - అని అర్థం.

**101.** అవ :- మళ్ళీ ఇంకొక రీతిలో శ్రీవరవరమునుల అవతారనక్షత్రాన్నే ఇందులో స్తుతిస్తున్నారు.

**మూలం శఠారిముఖసూక్తి వివేచనాయాః**
**కూలం కవేరదుహితు స్సముపాగతస్య ।**
**ఆలంబనస్య మమ సౌమ్యవరస్య జన్మ-**
**మూలం విభాతి సతులం వితులం చ చిత్రమ్ ॥**

శఠారిముఖ = నమ్మాళ్వార్లు మొదలైన ఆళ్వార్ల యొక్క, సూక్తి = భక్తి బలాత్కారవశంచేత వెలువడిన సూక్తులనే దివ్యప్రబంధాల, వివేచనాయాః = పరిశీలన రూపమైన గొప్ప వ్యాఖ్యానానికి, మూలం= కారణమైన శ్రీరంగానికి, సముపాగతస్య = (శ్రీవైకుంఠం నుండి) వచ్చి చేరినవారు, మమ ఆలంబనస్య= దాసుని (సంసారసాగరంలో పడకుండా అడ్డుకొనే) ఆలంబనమైనవారు అయిన, సౌమ్యవరస్య = శ్రీవరవరమునుల, జన్మమూలం =అవతార నక్షత్రమైన మూలం, సతులం = తులామాసంతో కూడినది, వితులం చ సత్ = సాటి లేనిదిగా ఉంటూ, చిత్రం = ఆత్మలను కాపాడేదై, విభాతి = ప్రకాశిస్తున్నది.

తిరువాయ్‌మొళ్ళి మొదలైన ఆళ్వార్ల దివ్యప్రబంధాలకు వ్యాఖ్యానాలు ఈడు మొదలైనవి శ్రీవరవరమునులకు పూర్వమే అవతరించినా, వారు అవతరించిన అల్పిశి మాసంలోని మూలనక్షత్రాన్ని ఆ వ్యాఖ్యానాలకు మూలమని ఎఱుమ్బియప్పా పల్కడం- వీరు అవతరించడానికి ముందు అవి ఎక్కువగా ప్రచారాన్ని పొందలేదు, వీరు అవతరించిన పిమ్మటనే వాటిని కాలక్షేపంగా నిర్వహించి, మిక్కిలిగా ప్రచారంలోకి తీసికొని వచ్చారు- అనే కారణంవల్ల

తమను, సంసారసముద్రంలో పడకుండా అడ్డుకొనే ఆలంబనమై (ఉపాయమై) ఉండి శ్రీవరవర మునులు రక్షించినందున, **"మమ ఆలంబనస్య సౌమ్యవరస్య"** అని అన్నారు. **"న తులం వితులం చ**

సత్ చిత్రం విభాతి" సాటిని కల్గినది, సాటి లేనిది - అని పరస్పర విరుద్ధమైన రెండు స్వభావాలను కల్గినది కనుక, విచిత్రమై ఉన్నది- అని అనడం ఏవిధంగా పొసగుతుంది? సతులత్వ- వితులత్వాలు ఒకే మూలంలో ఉంటాయా? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతున్నందున, విరోధాభాసం- పైపైకి చూస్తే, అర్థంలో విరోధం - తోస్తుంది. లోపల గమనించిచూస్తే, **"సతులమ్"**- తులామాసంలో కూడినది అని, **"వితులమ్"**- సాటి లేనిది, **"చిత్రమ్"** - చిత్తులను రక్షించేది - అనే రీతిలో అర్థాలు స్ఫురిస్తున్నందున అర్థంలో ఏవిరోధం లేదు- అనేది ఇక్కడ పరిహారం.

ఇందులో, మొదటి పాదానికి **"మాఱ్ఱఱ్ఱ శెమ్బొన్ మణవాళమహాముని వన్దిలనేల్, అఱ్ఱిల్ కరైత్త పుళియల్లవో తమిళ్మూరణమే"** (మణవాళ మహామునులు అవతరించి ఉండకపోతే నమ్మాళ్వార్ల శ్రీసూక్తి చెఱువులోని చింతపండువలె వ్యర్థమై ఉండేది) అని అప్పిళ్ళార్ అనుగ్రహించిన సంప్రదాయ చంద్రిక గ్రంథంలోని పాశురభాగం సామ్యంగా అనుసంధేయం.

**వ్యాఖ్యానమ్ : (శఠారిముఖసూక్తివివేచనాయాః)**- పరాంకుశ పరకాల యతిపరాదుల సూక్తులైన ద్రవిడోపనిషత్తు (తిరువాయ్‌మొళ్ళి) మొదలైన నిర్దుష్టాలైన, గుణాలను కల సూక్తుల విలక్షణమైన వ్యాఖ్యానానికి,

**(మూలమ్)**- హేతువు. ఇది **"జన్మమూలమ్"** అనే పదంతో అన్వయిస్తుంది. **"కన్దమలర్ పొళ్ళిల్ శూళ్ కురుకాపతికలైకళ్ విళఙ్గిడునాళ్"** (పరిమళాన్ని కల తోటలను కల్గిన తిరునగరికి ప్రభువైన నమ్మాళ్వార్ల ప్రబంధాలు ప్రకాశించే దినం) అనే శ్రీమణవాళమాముని తిరునాళ్‌పాట్టు సూక్తిభావ్యం.

**(కవేరదుహితుః కూలమ్ సముపాగతస్య)**- కావేరీ తీరంలోని శ్రీరంగదివ్యక్షేత్రానికి శ్రీవైకుంఠంనుండి వచ్చినవారు,

**(మమ ఆలంబనస్య)**- సంసారసాగరంలో పడబోయే నాకు, అందులో పడకుండా అడ్డు పడేవారైన- అని అర్థం. **"ఆవిక్కోర్ పఱ్ఱు క్కొమ్బు"** (ఆత్మకు అద్వితీయమైన ఆలంబనం) అనే తిరువాయ్‌మొళ్ళి సూక్త్యర్థం వరవరమునివిషయంగా సంభావింపబడింది.

**(సౌమ్యవరస్య)**- శ్రీవరవరమునుల యొక్క,

**(జన్మమూలమ్)**- దివ్యావతార దివ్యనక్షత్రం - అని అర్థం. **"సముపాగతస్య"** అని అన్నందున ఇక్కడ జన్మశబ్దం అవతారమనే అర్థాన్ని ఇస్తుంది. **"సముపాగతస్య"** అనే పదం ద్వారా ఆగమనంలోని సమీచీనత తెలుపబడింది. అది ఏమంటే- చేతనులను అనుగ్రహించడంలో మూలమైనదని సిద్ధించినందున, అది అవతారమేనని సిద్ధించింది.

**(సతులం వితులం చ సత్ చిత్రమ్ విభాతి)**- తులాసాహిత్యరాహిత్యాలు తులతో కూడికొని ఉండడం- లేకుండా ఉండడం- అనే రెండు ఒకేచోట కూడి ఉండడంచేత విస్మయాన్ని కల్గించేదిగా ప్రకాశిస్తున్నది- అనే ఈ అర్థం వల్ల విరోధాభాసం. **"సతులమ్"** తులామాసంతో కూడినది- **వితులమ్-**

నిస్సమాభ్యధికం (ఒప్పు, మించినది ఏదీ లేనిది), చిత్రమ్ = చేతన సంరక్షకం- అనే అర్థాల వల్ల విరోధం పరిహరింపబడింది. **"చిత త్రాయత ఇతి చిత్రమ్"** అనేది చిత్రశబ్దవ్యుత్పత్తి. శ్లోకంలో పూర్వం తెలుపబడిన రీతిలో విరోధాభాస అనే అర్థాలంకారాన్ని, **"మూలమ్, కూలమ్, ఆలంబనస్య, మూలమ్"** అని, **"సతులమ్, వితులమ్"** అని గల ప్రయోగాలలోని పలుమార్లు ఒకే వర్ణాన్ని ప్రయోగించినందున అనుప్రాసరూపమైన శబ్దాలంకారాన్ని, ఈరెండిటి యొక్క తిరుతండులన్యాయంలోని సంసృష్టిని ఇందులో గమనించవచ్చు.

**102.** అవ :- ఈ రీతిలో శ్రీవరవరమునుల స్వరూపరూపాదులను వారి సంబంధిసంబంధుల పర్యంతంగా అనుసంధించిన తరువాత, వారి మహిమను నల్గురు తెలిసి పల్కినందున, దృష్టిదోషం వారిపై పడి, వారికి ఏదయినా ఆపద కల్గుతుందో? ఏమో! అని స్థానే భయశంకతో భయపడి, **'శ్రీమద్రంగం జయతు"** (7) అనే శ్లోకంలోవలె 'మంగళాశాసనాన్ని చేసి, **"యతివరతత్త్వవిదే" (2)** అనే శ్లోకంలో పల్కినట్లుగా భగవద్రామానుజులకు, శ్రీవరవరమునులకు మధ్యగల అభేదాన్ని ప్రస్తావించి, ఈ శ్రీవరవరముని శతకమనే స్తోత్రాన్ని కవి పరిసమాప్తి చేస్తున్నారు.

**జయతు యశసా తుంగం రంగం జగత్త్రయమంగళం**
**జయతు సుచిరం తస్మిన్ భూమారమామణిభూషణమ్ ।**
**వరదగురుణా సార్ధం తస్మై శుభాన్యభివర్ధయన్**
**వరవరమునిః శ్రీమాన్ రామానుజో జయతు క్షితౌ ॥**

యశసా తుంగం = కీర్తితో ఉన్నతమై, జగత్ త్రయ మంగళం = లోకాలు మూడిటికి మంగళాన్ని కల్గించిన, రంగం =శ్రీరంగనగరం, జయతు = ఏ కొఱత లేకుండా వెలగాలి, తస్మిన్ = ఆ దివ్యనగరంలో, రమామణి భూషణమ్ = శ్రీమహాలక్ష్మికి రత్నాభరణమై, భూమా = గొప్ప మహిమను కల శ్రీరంగనాథస్వామి, సుచిరం జయతు = చిరకాలం ఏకొఱత లేకుండా వర్ధిల్లాలి, తస్మై = అటువంటి స్వామికి, శుభాని = అనేకమంగళాలను, వరదగురుణా సార్ధం = కోయిలణ్ణన్‌ను కూడి, అభివర్ధయన్ = ఆశాసనం చేసి, వర్ధిల్లజేస్తూ, శ్రీమాన్ = మంగళాశాసనమనే సంపదను మిక్కిలిగా కల్గిన, రామానుజః= శ్రీరామానుజులకంటే వేఱుకాని, వరవరమునిః= శ్రీవరవరమునులు, క్షితౌ = భూమిలో, జయతు = ఏకొఱత లేకుండా వర్ధిల్లాలి.

ఈ శ్లోకంలోని **"భూమారమామణిభూషణమ్"** అనే ప్రయోగాన్ని **"భూమా'** అని, **"రమామణి భూషణమ్"** అని రెండు పదాలుగా విభజించి అర్థం తెలుపబడింది, ఆ రీతిలోనే కాకుండా, ఒకే సమాసంగా గ్రహించి అర్థాన్ని చెప్పవచ్చు. **"భూశ్చ మా చ రమా చ భూమా రమాః, తాసాం మణిభూషణమ్"** అనేది ఇక్కడ వివక్షితవిగ్రహవాక్యం. **"రమాః"** అంటే- **"రమంతే ఇతి రమాః"** అనే వ్యుత్పత్తి ద్వారా కేవలం యౌగికపదమై, భగవానుని పట్ల ప్రీతిని కల నీళాదేవి, గోదాదేవి మొదలైన అన్యదివ్యదేవేరులను తెల్పుతుంది. కనుక, భూదేవి, శ్రీదేవి, నీళాదేవి, గోదాదేవి మొదలైన మిగిలిన పత్నులు- అనే అందఱికి **"శ్రీస్తనాభరణమ్"** అనే రీతిలో రత్నాభరణంవంటివాడు, శ్రీరంగనాథుడు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"భూమారమామణి**

**భూషణమ్"** అనే పదానికి ఇంకా పలు రస్యాలైన అర్థాలు చెప్పే అవకాశం ఉన్నా, విస్తృతభీతిచేత ఏతావన్మా త్రంతో విడువబడ్డాయి.

నూట నాల్గు శ్లోకాలను కల ఈ శ్రీవరవరముని శతకస్తోత్రంలోని మొదటి ఆఱు శ్లోకాలు ఉపోద్ఘాతంగా రచింపబడ్డాయి. చిరవలో గల రెండు శ్లోకాలు ఫలశ్రుతిగా అమరి ఉన్నాయి. అందువల్ల ఈ స్తుతికి మొదటి శ్లోకం **"శ్రీమద్రంగమ్"** అని ఆరంభమవుతున్న ఏడవ శ్లోకం- అని, చివరి శ్లోకం నూట రెండవది అయిన **"జయతు మనసా తుఙ్గమ్"** అనే ఆరంభమవుతున్న ఈ శ్లోకం అని గమనించాలి. ఈ రెండు శ్లోకాలు శ్రీరంగానికి, శ్రీరంగనాథునకు, శ్రీవరవరమునులకు మంగళాశాసనరూపంగా రచింపబడ్డాయి. మొదటలో **"దేశికానాం దేశికః వరవరమునిః, తస్మై మంగళాని కల్పయన్ దివ్యం విభవం దిశతు"** -పలువురు ఆచార్యపీఠాధిపతులకు ఆచార్యులైన శ్రీవరవరమునులు ఆ శ్రీరంగనాథునకు మంగళాలను ఆశాసిస్తూ, ఆ స్వామికి గొప్పతనాన్ని కల్గించాలి'' అని ఆ శిష్యులలో ఒకరైన కోయిలణ్ణన్‌ను సామాన్యంగా నిర్దేశించారు. రెండవది అయిన ఈ శ్లోకంలో అయితే, **"వరదగురుణా సార్థం వరవరమునిః తస్మై శుభాని అభివర్ధయన్ జయతు"** అని కోయిలణ్ణన్‌తో పాటు కలసి ఉండి, శ్రీవరవరమునులు మంగళాశాసనం చేసేటట్లుగా, ఆ కోయిలణ్ణన్‌ను విశేషించి పల్కి స్పష్టంగానే దర్శింపజేశారు. ఇంతేకాక, ఉపోద్ఘాతరూపమైన ఆఱు శ్లోకాలలోని రెండవ శ్లోకంలో గల **"యతివరతత్త్వవిదే"** భగవద్రామానుజులతో అభేదాన్ని కల శ్రీవరవరమునులకు- అనే భాగంద్వారా చెప్పబడిన శ్రీరామానుజులతో శ్రీవరవరమునులకు గల అభేదాన్ని 102వ శ్లోకంలో **"శ్రీమాన్ రామానుజః వరవరమునిః"**- శ్రీరామానుజులే శ్రీవరవరమునులు- అని చాలా గొప్పగా సూచించారు.

ఇందువల్ల, వేదానికి ప్రణవంవలె, దివ్యప్రబంధాలకు తిరుప్పల్లాణ్డువలె, ఈ వరవరముని శతకస్తోత్రానికి ముందు వెనుకలలో **"శ్రీమద్రంగమ్" (7) "జయతు యశసా" (102)** అనే శ్లోకాలు శ్రీవరవరమునులకు, వారి శిష్యులకు మంగళాశాసన రూపంగా అనుసంధింపబడవలసినదిగా రచింపబడ్డాయి. శ్రీరంగవిమానం కూడా ప్రణవాత్మకమే కదా. **"ప్రపద్యే ప్రణవాకారం... రంగమందిరమ్"** అని కదా అభిజ్ఞులైన శ్రుతప్రకాశికాచార్యుల వారి సూక్తి.

**వ్యాఖ్యానమ్ : (యశసా)-** నిత్యసూరులలో ముఖ్యుడైన ఆదిశేషుని స్వరూపంతో, తన అవతారభేదాలతో నియతంగా భగవానునితో నిత్య ప్రణవాత్మకమైన శ్రీరంగమందిరాన్ని స్తుతించే ఈ రెండుశ్లోకాలు, వేదార్థతత్త్వయాథాత్మ్య ప్రతిపాదకమైన ఈ వరవరమునిశతక స్తుతి ముందు వెనుకలలో అనుసంధింపబడడం సముచితం. సాన్నిధ్యాన్ని కల్గి ఉన్నందున ఏర్పడిన కీర్తితో - అని భావం.

**(తుంగమ్)-** ఉన్నతమైన,

**(జగత్త్రయమంగళమ్)-** ఇచటి త్రయశబ్దానికి పలు అర్థాలు చెప్పవచ్చు. కృతకం, అకృతకం, కృతకాకృతకమనే మూడు విధాలైన లోకాలు- అని అర్థం. లేక, జగచ్ఛబ్దం చేత లోకంలోని చేతనులనే అర్థాన్ని లక్షణయా గ్రహించి, ప్రయోజనాంతరవరులు- అనన్యప్రయోజనులు- చరమాధికారులనే మూడు

విధాలైన అధికారులు- అని అర్థం. మంగళం అంటే- అలంకారంవంటిది, ఉపాదేయ పురుషార్థరూపమైనది- పొందదగిన పురుషార్థం- అని అర్థం. అటువంటి,

**(రంగమ్)- "రజ్యతే అస్మిన్ ఇతి రంగమ్"** అనే వ్యుత్పత్తిద్వారా శ్రీరంగనాథునకు అభిమత దివ్యదేశమని అర్థం. అటువంటి శ్రీరంగనగరం,

**(జయతు)-** ఎటువంటి ఉపప్లవాలు లేకుండా ఉండాలి- అని అర్థం. జయమంటే ఉత్కర్షాన్ని పొందడం. ఇక్కడ ఉత్కర్షమంటే -ఎటువంటి ఉపప్లవం లేకుండా ఉండడమే. ఈ ప్రయోగం ద్వారా స్తుతిప్రారంభంలోని **"శ్రీమద్రంగమ్"** ఇత్యాది ప్రయోగంయొక్క అర్థం అనుసంధింపబడింది.

**(తస్మిన్)** - అటువంటి శ్రీరంగనగరంలో,

**(రమామణిభూషణమ్)- "భర్తా నామ పరం నార్యా భూషణాదపి భూషణమ్"** (స్త్రీకి భర్త అన్నిభూషణాల కంటే గొప్ప నగ) అనే రీతిలో లక్ష్మీదేవికి మరకతమణితో చేసిన దివ్యభూషణం వంటివాడైన శ్రీరంగనాథుడు. **"శ్రీస్తనాభరణం తేజః"** ఇత్యాది ప్రయోగాల అర్థం ఇక్కడ భావ్యం.

**(భూమా)- "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"** (ఏ పరమాత్మను పొంది వేఱొక దానిని చూడడో, వేఱొకదానిని వినడో, వేఱొకదానిని తెలియడో, ఆ పరమాత్మ భూమాశబ్దవాచ్యుడు) అని వేదాంతాలలో చెప్పబడిన నిరతిశయస్వరూపుడైన శ్రీరంగనాథుడు.

**(సుచిరం)-** యావత్కాలం- కాలతత్త్వం ఉన్నంతవరకు,

**(జయతు)-** ఏ ఉపద్రవం లేకుండా వర్ధిల్లాలి. ఈ ప్రయోగం ద్వారా **"భూమా తస్మిన్"** ఇత్యాది స్తుతిప్రారంభంలోని ప్రయోగంయొక్క అర్థం అనుసంధింపబడింది. **"రమామణి భూషణమ్"** అనే ప్రయోగం ద్వారా భూదేవి మొదలైన దివ్యదేవేరులు ఉపలక్షింపబడతారు. **"కుழ்ల్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిழల్పోల్వనర్"** (గోపాల కన్య అయిన నీళాదేవి, భూదేవి - లక్ష్మీదేవికి నీడవంటి వారు), **"ఛాయా మివాభ్యుదయనీ మవనీం చ తస్యాః"** అని, **"పుష్పాంగరాగై స్సమం నిర్వృత్త ప్రణయాతివాహనవిధౌనీతాః పరీవాహతామ్, అనునీళయా సహ మహీదేవ్యః సహస్రమ్"** అని చెప్పబడిన రీతిలో లక్ష్మీదేవి ప్రధానం కాగా, ఆమెకు అంగభూతలు కదా, మిగిలిన దివ్యపత్నులు. లేక, **"భూమా"** శబ్దాన్ని **"భూః= భూమి, మా = లక్ష్మీ"**, రమా = భగవానునిపట్ల ప్రీతిని కల్గిన గోదానీళా ప్రభృతులు వీరికి మణిభూషణం వంటివాడు- అనే అర్థాన్ని **"భూమా, రమామణి భూషణమ్"** అనే ప్రయోగాలను ఏకపదంగా చేసి చెప్పవచ్చు. ఈ అన్వయంలో **"రమా"** శబ్దం లక్ష్మీవాచకం కాదు. **"రమంతే ఇతి రమాః"** అనే వ్యుత్పత్తిని కల యౌగిక పదం. **"రూఢిర్యోగ మపహరతి"** అనే న్యాయం ఇక్కడ వర్తించదు. ఆ విధంగా రూఢిని ప్రధానంగా చేసికొని రమాశబ్దానికి లక్ష్మీదేవి - అనే అర్థాన్ని గ్రహిస్తే, పునరుక్తి దోషం సంక్రమిస్తుంది. అందువల్ల యౌగికంగా గ్రహించడమే తగినది. లేక, **"మా చ సా రమా"** అనే విగ్రహాన్ని గ్రహించవచ్చు. **"మారమా"** శబ్దం లక్ష్మీపరం. **"పద్మాని యస్యాగ్రసరోరుహాణి ప్రబోధయంత్యూర్ధ్వముఖైః మయూఖైః"**

అనే ప్రయోగంలోవలె ఇక్కడకూడా రూఢి వర్తించదు. లేక, **"భూశ్చ మా చ భూమే, రమా చ మణిశ్చ భూషణం యః సః రమామణి భూషణమ్, భగవాన్, భూమే చ రమామణి భూషణాని చ రమామణి భూషణమ్"** అని కూడా వివరింపవచ్చునని వాధూలవీరరాఘవాచార్య స్వామివ్యాఖ్య. **"ప్రాప్యత్వ తుల్యత్వద్యోతనాయ ద్వంద్వనిర్దేశః ప్రాపకత్వగుణప్రధానభావేన వైషమ్యద్యోతనాయ విశేషణవిశేష్యభావేన నిర్దేశః భూమత్వనిగమనార్థమితి ద్రష్టవ్యమ్"** అని ఈ వివరణంలోని స్వారస్యం ఆ వ్యాఖ్యలో తెలుపబడింది.

**(తస్మై)** - శత్రువులు ప్రవేశించడానికి సాధ్యం కాని, దుర్గమమైన శ్రీరంగంలో నివసించేవాడు, **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** (ఆ సీత ఎవరి పత్నియో, ఆశ్రీరాముని తేజస్సు అంతులేనిది) అని చెప్పబడిన రీతిలో లక్ష్మీదేవి మొదలైన దివ్యదేవేరులతో కూడినవాడు, తనను ధరించేవానికి అన్ని అరిష్టాలను పోగొట్టడంలోను, అభీష్టాలను అన్నిటిని ఇవ్వడంలోను సమర్థమైన కౌస్తుభమణిని భూషణంగా కల్గినవాడైన భగవానునకు- అని అర్థం. (ఈ అర్థవిశేషాలు శ్లోకం పూర్వార్ధాన్ని దృష్టిలో పెట్టుకొని తెలుపబడ్డాయి. **"తుంగం రంగమ్"** అనే ప్రయోగం ప్రతికూలజనులకు శ్రీరంగం దుర్గమమైనదని, **"భూమా రమామణిభూషణమ్"** అనే ప్రయోగం లక్ష్మీప్రభృతి దివ్యదేవేరులను కలవాడని, **"రమామణిభూషణమ్"** అనే ప్రయోగంలోని **"మణ్యతే ఇతి మణిః"**- స్తుతింపబడేది - అనే మణిశబ్దవ్యుత్పత్తి స్వారస్యాన్నిబట్టి, ధరించేవానికి సర్వారిష్టాలను పరిహరించి, అన్ని అభీష్టాలను పొందించడంలో సమర్థమైన కౌస్తుభమణిని భూషణంగా కలవాడనే విశేషార్థాలను స్ఫురింపజేస్తున్నాయి)

**(శుభాని)** -శుభశబ్దంలోని బహువచనస్వారస్యాన్నిబట్టి అనేక విధాలైన మంగళాలను - అని అర్థం.

**(వరదగురుణా సార్ధమ్)** -వరదనారాయణ గురువులనే కోయిల్ కన్దాడై అణ్ణన్‌తో పాటుగా, అని అర్థం. భగవదాశ్రయణం లక్ష్మీపురుషకార పురస్సరంగా విభీషణుడు చేసినట్లు చేయాలి. లేకపోతే శూర్పణకు, రావణునకు వలె అనర్థమే కల్గుతుంది. ఆ రీతిలోనే ఇక్కడ కూడా శ్రీవరవరమునుల చరణ సమాశ్రయణాన్ని మావంటివారు వరదనారాయణ గురువులను పురస్కరించుకొని చేయాలి - అనే అభిప్రాయం ఈ ప్రయోగం ద్వారా ధ్వనిస్తున్నది.

**(అభివర్ధయన్)**- అంతటా మంగళాశాసనంద్వారా వర్ధిల్లజేసేవారై - అని అర్థం. **"మంగళాశాసనపరైః సర్వై శ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయ"** (మంగళాశాసన పరులైన పూర్వాచార్యులచే సత్తను కలిగి ఉండేటట్లు చేయబడినవాడు) అని కదా భగవానుడు మంగళాశాసనం చేయబడుతున్నాడు. ఆచార్యుల మంగళాశాసనమే అభివృద్ధికి మూలం.

**(శ్రీమాన్ రామానుజః)**- మంగళాశాసనరూపమైన శ్రీవైష్ణవ సిరితో పూర్ణులైన భగవద్రామానుజుల కంటే అన్యులుకాని - అని అర్థం. ఇది **"రామానుజః వరవరమునిః"** అనే సామానాధికరణ్యం ద్వారా స్పష్టం.

**(వరవరమునిః)** - శ్రీవరవరమునులు,

**(క్షితౌ జయతు)** - సత్త్వనిష్ఠులకు **"ఇరుళ్ తరు మాఞాలమ్"** (అజ్ఞానాన్ని కల్గించే విశాలమైన భూమి) అయిన ఈ భూమి త్యాజ్యమే అయినా, **"ఇని ప్పిఱవి యాన్ వేణ్డేన్"** (ఇక ఈ భూమితో జన్మవద్దు) అని దివ్యసూరులు అన్నా, శ్రీవరవరమునుల సంబంధాన్ని కల్గి ఉన్నందున **"అస్తు మే నిత్యయోగః"** అనే రీతిలో నివాసయోగ్యతను కల ఈ భూమిలో వర్ధిల్లాలి - అని ఇచటి తాత్పర్యం. సంబంధాన్ని బట్టి కదా ప్రాప్యత్వం కాని, ప్రాప్యం కాకపోవడం కాని ఉంటాయి. **"క్షయంతి నివసంతి అస్యామితి క్షితిః, క్షి - నివాస, గత్యోః"** అనే వ్యుత్పత్తి క్షితిశబ్దానికి ఇక్కడ గ్రాహ్యం. **"అడియార్‌కళ్ వాழ అరజ్గనకర్ వాழ.... మణవాళమామునియే ఇన్నుమొరు నూఱ్ఱాణ్డిరుమ్"** (దాసులు వర్ధిల్లేటట్లు, శ్రీరంగం వర్ధిల్లేటట్లు, శఠకోపుల ద్రావిడవేదం వర్ధిల్లేటట్లు, సముద్ర పరివేష్ఠితమైన స్థిరమైన లోకం వర్ధిల్లేటట్లు, ఓ వరవరమునీ! దేవర వారు ఇంకా నూఱేండ్లు వర్ధిల్లాలి) అనే సూక్త్యర్థం భావ్యం.

గత్యర్థాన్ని అనుసరించి చెప్పే వ్యుత్పత్తి కాని, **"క్షి-క్షయే"** అనే ధాతువునుండి **"క్షీయంతేஉస్యామితి క్షితిః"** అని నిష్పన్నమైన ఆ వ్యుత్పత్తిగాని ప్రకృతంలో క్షితిశబ్దానికి సందర్భాన్నిబట్టి వివక్షితం కాదు. **"తస్మై శుభాని అభివర్ధయన్"** అనే ప్రయోగంద్వారా స్తుతిప్రారంభంలోని **"దివ్యం తస్మై దిశతు"** అనే ప్రయోగంయొక్క అర్థం స్మరింపబడింది. **"వరదగురుణా సార్ధమ్"** అనే ప్రయోగం ద్వారా **"దేశికో దేశికానామ్"** అనే అర్థం స్మరింపబడింది. ఈవిధంగా ఈ స్తుతిలోని ఉపక్రమ-ఉపసంహారాల అర్థైక్యం నిర్వహింపబడింది. ఇది మహాకావ్యలక్షణాలలో ఒకటిగా లక్షణకర్తలు నిర్ణయించారు. (Unity of plot, Unity of Place, Unity of Action) అనే త్రివిధైక్యాన్ని పాశ్చాత్యసాహిత్యలక్షణకర్తలుకూడా నిర్వచించారు. **"శ్రీమాన్ రామానుజః"** అని అనడం ద్వారా స్తుతిప్రారంభంలో చేయబడిన **"యతివరతత్త్వవిదే"** అనే ప్రయోగం నిగమింపబడింది. యతివరతత్త్వం ఏమంటే- అనారోపిత రూపమైన శ్రీరామానుతత్త్వం, దానిని కలవారు **"యతివరతత్త్వవిత్"**, **"విద-సత్తాయామ్"** అనే ధాతువునుండి పుట్టిన శబ్దమే **"విత్"** అనే శబ్దం. యతివరవర స్వరూపులని దీని తాత్పర్యం. **"శ్రీమాన్ రామానుజో వరవరమునిః"** అని స్తోత్రంలో చేయబడిన నిగమనసూక్తి స్వారస్యాన్ని బట్టి **"యతివరతత్త్వవిత్"** అనే స్తోత్రప్రారంభ ప్రయోగం లోని అర్థం అనుసంధింపబడింది.

**103.** అవ :- ఇటువంటి శ్రీవరవరముని శతకస్తుతిని అర్థజ్ఞానంతో పాటు ఎవరు అనుసంధిస్తారో, వారు స్వరూపానురూపమైన అన్ని సంపదలను తాము పొందడమేకాక, తమకు ఇష్టులైనవారి అభీష్టాలు నెఱవేరడానికి, అనిష్టం తీరడానికి కారణం కాగలరు - అని అంటున్నారు.

**పఠతి శతకమేతత్ ప్రత్యహం యః సుజానన్**
**స హి భవతి నిధానం సంపదా మీప్సితానామ్ ।**
**ప్రశమయతి విపాకం పాతకానాం గురూణామ్**
**ప్రథయతి చ నిదానం పారమాప్తుం భవాబ్ధేః ॥**

యః = గొప్ప భాగ్యశాలి అయిన ఏ వ్యక్తి, ఏతత్ శతకం = నూఱు శ్లోకాలను కల ఈ స్తోత్రాన్ని, సుజానన్ = శబ్దాలయొక్క, అర్థాలయొక్క మాధుర్యాన్ని చక్కగా తెలిసినవాడై, ప్రత్యహం పఠతి =

ప్రతిదినం స్వయం ప్రయోజనంగా పారాయణం చేస్తున్నాడో, సః= అటువంటి వాడు, ఈప్సితానాం సంపదాం = ఆశింపబడిన సంపదలకు, నిధానం = తరగని నిధిగా, భవతి హి = అవుతున్నాడు కదా! (ఈ శతకం ఆవిధంగా కావడమే కాక), (జనానాం = తనకు చెందినవారియొక్క) గురూణాం పాతకానాం= మహాపరాధాల, విపాకం = దుఃఖాలను కల్గించే పరిణామదశను, ప్రశమయతి = సవాసనగా పోగొడు తున్నాడు, భవాబ్ధేః పారం = సంసారమనే సముద్రంయొక్క ఆవలి తీరమైన మోక్షలోకాన్ని, ఆప్తుం= చేరడానికి, నిధానం = మూలకారణమైన భగవానుని, ప్రథయతి = స్పష్టంగా తెలుపుతున్నాడు.

ఈ స్తోత్రానికి అర్థానుసంధానంతో పాటు, ప్రతిదినం, సత్కాలక్షేపం కోసం, ఆనందించడం కోసం హేతువుగా ఎవరు పారాయణం చేస్తారో, వారికి చరమపర్వమైన ఆచార్యానుభవకైంకర్యాల పర్యంతంగా, భాగవతాను భవకైంకర్యమధ్యమంగా, భగవదనుభవ కైంకర్య ప్రారంభంగా ఉండే సంపదలు నిండుగా సిద్ధిస్తాయి. **"దర్శనాదేవ సాధవః పునంతి"** (సత్పురుషులు కేవలం దర్శనంతోనే అందరినీ పావనం చేస్తారు) అనే రీతిలో తమ కటాక్షం పొందినందున తమకు చెందినవారికికూడా మహాపాతకాలతోపాటు అన్ని పాపాలను సవాసనగా నశింపజేస్తారు. అంతేకాక, వీరు, ఈ సంసార లోకానికి ఆవలి తీరమైన పరమపదాన్ని పొందడానికి ఉపాయమైన ప్రథమమధ్యమ చరమపర్వాలను ఉపదేశించి తెలిపి, తన్మూలంగా వారు మోక్షాన్ని పొందడానికి కారణమవుతున్నారు - అని భావం.

**"బ్రహ్మవిదాప్నోతి పరమ్"** అనే శ్రుతి బ్రహ్మజ్ఞానం కలవాడు పరమాత్మ ప్రాప్తిని పొందుతున్నాడని తెల్పుతున్నది. అదేరీతిలో ఇక్కడ కూడా **"యః శతకమేతత్ సుజానన్ పఠతి సః భవాబ్ధేః పారమాప్తుం ప్రథయతి"** అని తెలుపబడింది. ఉదాహృతశ్రుతి ప్రథమపర్వాత్మకం కాగా, ఇది చరమపర్వాత్మకం. **"తత్త్వజ్ఞానాన్మోక్షః"** అనికదా వేదాంత సిద్ధాంతం.

శ్లోకంలోని **"గురూణామ్"** అనే పదాన్ని **"పాతకానామ్"** అనే పదానికి విశేషణంగా అన్వయించకుండా, ప్రత్యేక విశేష్యపదంగా చేసి, **"గురూణాం భవాబ్ధేః పారమ్ ఆప్తుం నిధానం ప్రథయంతి"** అని అన్వయించి, ఆచార్యులు మోక్షాన్ని పొందడానికి మూలకారణమైన భగవద్రామానుజులను ప్రకాశింపజేస్తున్నారు- అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. శ్రీరామానుజులు తమ శిష్యులకువలె, స్వాచార్యులకుకూడా తమ సంబంధంవల్ల మోక్షాన్ని పొందించగల్గినారు - అనే విషయం **"అర్వాంచో యత్పదసరసిజ ద్వంద్వ మాశ్రిత్య, పూర్వే"** ఇత్యాది పూర్వాచార్యకృత శ్లోకంలోను, **"పత్యుః సంయమినాం ప్రణమ్య చరణౌ"** అని శ్రీవేదాంతదేశికకృత శ్లోకంలోను తెలుపబడడం జగత్ప్రసిద్ధం కదా.

వ్యాఖ్యానమ్ : **(యః)** - మహాభాగ్యవంతుడైనవాడు ఎవడు,

**(ఏతత్ శతకమ్)** - నూటు శ్లోకాలను కల ఈ ప్రబంధాన్ని,

**(సుజానన్ సన్)** - శబ్దార్థాల మాధుర్యాన్ని చక్కగా గ్రహించి, భక్తితో అనుసంధించేవాడై,

**(ప్రత్యహమ్)** - ప్రతిదినం,

**(పఠతి)** - కాలక్షేపానికి, భోగానికి (ఆనందానికి) హేతువుగా క్షణం కూడా విడువలేక అభినివేశంలో అనుసంధిస్తున్నాడో, స్వయంప్రయోజనంగా భావించి, పఠిస్తాడో -అని భావం.

**(ఈప్సితామ్)** - తాను పొందగోరిన,

**(సంపదామ్)**- ప్రథమ-మధ్యమ- చరమ పర్వాత్మకమైన కైంకర్యానుభవ రూప సంపదలకు - అని అర్థం. పదంలోని బహువచనాన్నిబట్టి ప్రపన్న స్వరూపాన్ని బట్టి మూడు కైంకర్య సంపదలు అనుసంధేయాలు. చరమపర్వంలోని పర్వత్రయం కూడా అనుసంధేయమ్.

**(నిధానమ్)** - తఱుగని నిధి. నిధి అంటే- నిత్యం దానం చేస్తున్నా తఱుగనిది కదా. ఇచట **"లిజ్, లోట్"** క్రియలను ప్రయోగించకుండా **"భవతి"** అని లడ్రూపాన్ని ప్రయోగించడం- ఈ శతకానుసంధానం స్వయంప్రయోజనరూపమైనదని, దీనివల్ల కలిగే ఈప్సిత సంపదలకు నిధానం కావడం లోకరీతినిబట్టి ఆనుషంగిక ఫలమని తెలుపడంకోసం. దీనివల్ల ఇష్టప్రాప్తి తెలుపబడింది. ఇంతేకాక,

**(గురూణాం పాతకానామ్)** - గొప్ప తీవ్రమైన పాపాలయొక్క,

**(విపాకమ్ అపి)** - ఫలాన్ని ఇవ్వడానికి సిద్ధంగా ఉండే పరిణామాన్ని కూడా,

**(ప్రశమయతి)** - సవాసనగా నశింపజేస్తుంది. దీనివల్ల అనిష్టనివృత్తి తెలుపబడింది. ఇంతేకాక,

**(భవాబ్ధేః పారమ్ ఆప్తుమ్)** - జననమరణాల పరంపరారూపమైన సంసార సముద్రానికి ఆవలి తీరమైన మోక్షాన్ని పొందడంలో,

**(నిదానమ్)** - మూలమైన ఉపాయాన్ని,

**(ప్రథయతి)** - ప్రకాశింపజేస్తుంది. ఆచార్యుడే ఉపాయమనే నిశ్చయాన్ని కల్గిస్తుంది.

**104.** అవ :- గడచిన శ్లోకంలో ఈ శ్లోకాన్ని స్వయంప్రయోజనంగా అనుసంధించేవాడు కోరిన సంపదలు అన్నిటికి నిధి కాగలడు - అని తెలుపబడింది. ఆ సంపదలను ఇచ్చేవాడు శ్రీరంగనాథుడే -అని, పొందేవాడు వాటిని **"పోదువీర్ పోదుమినో"** (ఆశ ఉండే వారు రండి) అని ఆశపడం తప్ప, పొందడానికి ఉపాయంగా మఱి దేనినీ అనుష్ఠించవలసిన అక్కరలేదని ఈ శ్లోకంలో పల్కుతున్నారు.

**అనుదిన మనవద్యైః పద్యబంధై రమీభిః**
**వరవరమునితత్త్వం వ్యక్త మధ్యోయంతమ్ ।**
**అనుపద మనుగచ్ఛన్ అప్రమేయః శ్రుతీనామ్**
**అభిలషిత మశేషం సూయతే రంగశాయీ ॥**

శ్రుతీనాం = వేదాలకు కూడా, అప్రమేయం = పూర్తిగా తెలియరాని వాడైన, రంగశాయీ = ఆదిశేషునిపై శయనించి ఉండే శ్రీరంగనాథుడు, అనవద్యైః = శబ్దదోషాలు, అర్థదోషాలు మొదలైన ఏ దోషాలను లేని, అమీభిః= ఈ, పద్యబంధైః = ప్రబంధీకరింపబడిన శ్లోకాలతో, అనుదినం = ప్రతిదినం,

వరవరవమునితత్త్వం = శ్రీవరవరమునుల ఉపేయత్వం, ఉపాయత్వం- అనే యథార్థమైన స్వరూపాన్ని, వ్యక్తం = స్పష్టంగా, ఉద్ఘోషయంతం (పురుషం) - ఉచ్చైః స్వరంతో అనుసంధించేవానిని, అనుపదం = అతడుపెట్టే ప్రతి అడుగులోను, అనుగచ్ఛన్ సన్ = ప్రేమతో వెంబడించేవాడై, అశేషమ్ అభిలషితమ్ = అన్ని అభీష్టాలను, సూయతే = కల్గిస్తాడు.

**"అశేషమ్"** అనే పదాన్ని **"అభిలషితమ్"** అనే పదానికి విశేషణంగా చేయకుండా, **"అనుగచ్ఛన్"** అనే అనుగమన క్రియకు విశేషణంగా చేసి, అవ్యయంగా గ్రహించి **"అశేష మనుగచ్ఛన్ రంగశాయీ అభిలషితం సూయతే"** అని అన్వయించి, తమకు మిక్కిలి ప్రియమైన ఆదిశేషుడనే పడుకను విడచిపెట్టి, ఈ స్తోత్రాన్ని పఠించేవానిని వెంబడించి, ఇతని అభీష్టాలను నెరవేరుస్తాడు - అనే అర్థాన్ని చెప్పవచ్చు. అయితే, ఈ అర్థం కంటే పూర్వం తెల్పిన అర్థమే సరసతరం.

తనను తీయని ద్రావిడభాషలో కీర్తించిన తిరుమழிశైయాழ்వార్ ముందుగా వెడలిపోగా, వారిని తిరువెఃకా (యథోక్తకారి) క్షేత్రంలోని పాన్దన్‌పాళిలో శయనించి ఉండే స్వామి అనుసరించాడు. **"తిరువరఙ్గప్పెరునకరుళ్ అరవరశ ప్పెరుఞ్జోది అనన్ద నెన్నుమ్ అణైయ మేవి"** అనే రీతిలో శ్రీరంగనాథుడు ఆదిశేషుడనే పడుకను మిక్కిలి ఆదరించి, అందులో శయనించి, **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్‌కిన్ఱ ఎమ్బెరుమాన్"** (పొంగే సముద్రాన్ని చుట్టూ కల భూమిని, పరమపదాన్ని - అనే వీటిలో ఏమీ చెదఱిపోకుండా పాలించే స్వామి) అయిన **"శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్"** (ఆజ్ఞాదండాన్ని కల శ్రీరంగనాథుడు) తమ ఆచార్యులైన శ్రీవరవరమునుల యథార్థ తత్త్వాన్ని, తెలియజేస్తూ వారి శిష్యులు, అష్టదిగ్గజాలనే ఎనిమిదిమందిలో ఒకరు, **"వరవరయోగినో వరదరాజకవిః"** అని పొగడబడినవారైన ఈ ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన ఈ శతకాన్ని అభిమానించి అనుసంధించే వానిని **"అవశాః ప్రతిపేదిరే"** అనే రీతిలో నిత్యం వెంబడించి పోయి, అతని సర్వాభీష్టాలను అనుగ్రహిస్తాడు- అనే విషయాన్ని ప్రత్యేకంగా చెప్పవలసి ఉన్నదా? అది కైముతికన్యాయ సిద్ధం కదా! - అని భావం.

వ్యాఖ్యానమ్ : **(శ్రుతీనామ్)- "శ్రూయతే ఇతి శ్రుతిః"**- నిత్యం శ్రవణం చేయబడేది కనుక శ్రుతి- అని చెప్పబడే వేదాలకు కూడా,

**(అప్రమేయమ్) - "ఇదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్"** (ఇతడు, ఇటువంటి వాడని పరిచ్ఛేదించి పలుకడానికి వీలుకాని వాడు) అనే రీతిలో ఇదమిత్థంగా తెలియరాని వాడైన- అని అర్థం. **"యతో వాచో నివర్తంతే"** అని, **"నాన్మఱైకళ్ తేడియోడుమ్ శెల్వన్"** (నాల్గువేదాలు అన్వేషించే సంపద్రూపుడు) అని భగవద్వైభవం వేదాలకు సైతం అందనిది కదా.

**(శేషశాయీ)-** సంసారులు తనను ఆశ్రయించడంకోసం శ్రీరంగనగరానికి వచ్చి సకలవిధకైంకర్య శ్రీమంతుడైన ఆదిశేషుడనే శయ్యపై **"ఉఱఙ్గువాన్ పోల్ యోగు శెయ్ద పెరుమాన్"** (నిద్రించే వానివలె

శయనించి లోకరక్షణచింతను చేసే స్వామి) అని, "నిద్రాపి జాగర్యయా" అని చెప్పబడిన రీతిలో యోగనిద్రారసికుడైన శ్రీరంగనాథుడు,

**(అనవద్యైః)** - స్వరూపానురూపమైన భావబంధం లేకపోవడమనే దోషాన్ని, భ్రమప్రమాదాది దోషాలను లేనివి శబ్దపుష్టి, అర్థగాంభీర్యం లేక పోవడమనే దోషాలను లేనివి అయిన,

**(పద్యబంధైః)** - శతక ప్రబంధంగా కూర్చబడిన పద్యాలతో- అని అర్థం. ఈ పద్యాల గ్రంథనంలో గల ఆర్థికమైన ఆనుపూర్విని శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామివారు తమ వ్యాఖ్యలో ఎంతో హృద్యంగా వివరించారు. ఈ వివరణవల్ల ఆళ్వార్ల అంతాది ప్రబంధాలలో కన్పించే అర్థానుపూర్వి ఈ శతక ప్రబంధంలో కూడా ఉన్నదని తెలుస్తున్నందున, ఈ స్తుతి కూడా ఒక విధమైన ఆర్థికమైన, అనుగతమైన బంధాన్ని కల, అంతాది నియమాన్ని కల్గిన దివ్యప్రబంధం.

పద్యశబ్దం ద్వారా **"శ్లోకః శ్లోకత్వ మాగతః"** అనే న్యాయంతో శ్రీవరవరమునుల విషయంలోని అనుభవపరీవాహంవల్ల వెలువడినది, ఈ ప్రబంధం, దైవవశంచేత వర్ణగణాదులలోని న్యూనాధిక్యాలు మొదలైన ఏ దోషాలు లేకుండా ఈ ప్రబంధం ఉద్భవించింది- అని వ్యక్తమవుతున్నది. దీనివల్ల ఈ ప్రబంధానికి శ్రీరామాయణం, తిరువాయ్‌మొழி ప్రబంధం వంటి దివ్యగ్రంథాలతో సామ్యం ధ్వనిస్తున్నది. **"అమీభిః"** అని అనడంవల్ల పరస్పర బంధాన్ని కల్గిన పద్యాల ప్రతిసంధానం స్ఫురిస్తున్నది.

**(అనుదినం వరవరమునితత్త్వమ్)** - **"పేఱొన్ఱు మற்றిల్లై నిన్ శరణన్ఱి అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱు మిల్లై మற்ற చ్చరణన్ఱి"** అనేరీతిలో శ్రీవరవరమునులే ఉపాయం, ఉపేయం- అనే స్వరూపయాథాత్మ్యాన్ని- అని అర్థం. **"ఉపాయోపేయత్వం తదిహ తత్త్వం, న తు గుణౌ"** (నీవే ఉపాయం, ఉపేయం కూడా అనేది తత్వం, అప్రధానం కాదు) అనే సూక్తి భావం చరమపర్వాత్మకంగా అనుసంధింపబడింది.

**(వ్యక్తమ్)**- పండితపామర విభాగం లేకుండా, ఆబాలగోపాలం అందటికి తెలిసేటట్లుగా,

**(ఉద్ఘోషయంతమ్)**- ఉచ్చైఃస్వరంతో ప్రతిపాదించేవానిని- అని అర్థం. **"తత్త్వమ్"** అనే పదప్రయోగం ద్వారా ఈ శతకం, లేని గుణాలను ఆరోపించి చేసే స్తుతి కాదు- యథార్థతత్త్వ ప్రతిపాదకమని స్ఫురిస్తున్నది. **"ఉద్ఘోషయంతమ్"** అనే పదంతో **"పురుషమ్"** అనే పదాన్ని చేర్చుకోవాలి. ఉద్ఘోషించేవానిని -అని అర్థం.

**(అనుపదమ్ అనుగచ్ఛన్)**- ప్రతిపదంలోను- అతడు వేసే ప్రతి అడుగులోను అనువర్తిస్తూ, **"యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి"** (పరమాత్మ ఏ దారిలో నెడుతున్నాడో ముక్తుడు ఆ దారిలో అతనిని అనుసరిస్తున్నాడు), **"ఛాయా వా సత్త్వ మనుగచ్ఛేత్"** (భగవానుని జీవుడు, ఛాయనువలె అనుసరించాలి) అనే సూక్తుల అర్థం భగవద్విషయంగా అనుసంధింపబడింది. భగవానుని విషయంలోని చేతనుని అనువర్తనం - స్వరూపానురూపం. వైధం. భగవానుడు తన భక్తుని విషయంలో చేసే అనువర్తనం అతని నిరంకుశ స్వాతంత్ర్యప్రయుక్తం, అత్యర్థప్రీతిహేతుకం.

**(అశేష మభిలషితం సూయతే)** - సకలాభీష్టాలను కలుగజేస్తాడు - అని అర్థం.

లేక, **"శేషశాయీ ఉద్ఘోషయంతం పురుషమ్ అశేషం యథా తథా అనుగచ్ఛన్ అభిలషితం సూయతే"** అని అన్వయించవచ్చు. అపుడు ఉత్తమశయ్యకు ఉండవలసిన సౌగంధ్య సౌకుమార్యాదులను కల్గిన కారణంగా క్షణంకూడా నాగపర్యంకాన్ని విడువలేని భగవానుడు శ్రీవరవరమునిశతకాన్ని అనుసంధించేవానిని చూచి, ఆ శేషశయ్యను కూడా విడచిపెట్టి, అతనిని అనుసరిస్తూ, అతని అభీష్టాలను తీరుస్తాడు- అని భావం. అపుడు **"అశేషమ్"** అనేది క్రియావిశేషణం. **"న విద్యతే శేషో యస్మిన్ కర్మణి తత్ యథా భవతి తథా"** అనే విగ్రహం దానికి వివక్షితం. అతని అనుసరించే పనిలో చేయవలసినదానిని అంతటిని పూర్తిగా చేసి, అనుసరిస్తాడని తాత్పర్యం. ఆ విధంగా అనుసరిస్తూ అతని అభీష్టాలను తీరుస్తాడు. **"నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** (నాగశయనాన్ని వీడి భగవంతుడు మధురాపురికి వచ్చాడు) అనే సూక్తి స్మరణీయం. ఈరెండు అర్థాలలో మొదటి అర్థమే సరసతరం.

**"శేషశాయీ తత్త్వ ముద్ఘోషయంతమ్ అనుగచ్ఛన్ అభిలషితం సూయతే"** అనే ప్రయోగం ద్వారా తిరుమழிశైప్పిరాన్ వృత్తాంతం ధ్వనిస్తున్నది - అని వాధూల వీరరాఘవాచార్య స్వామివ్యాఖ్య.

ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన శ్రీవరవరముని శతకానికి
ఆంధ్రవ్యాఖ్యానం సంపూర్ణమ్.

శ్రీవరవరమునిశతకం కలితం శ్రీదేవరాజగురుమణినా ।
వాచక్రే గురుభక్త్యా దాసః శ్రీశింగరాచార్యః ॥
ఆచార్యవరివస్యేయం వాచికీ భక్తిపూర్వకమ్ ।
అర్ప్యతే చరణాంభోజయుగ్మే వరమునీశితుః ॥



# శ్లోక అకారాది సూచి

శ్రీమతే రామానుజాయ నమః  శ్రీలోకగురవే నమః

# శ్రీవరవరమునిశతకమ్

మహీసార పురాధిష్ఠిత సకలశాస్త్రవిదగ్రేసరైః
శ్రీమద్భిః వాధూలవీరరాఘవాచార్యస్వామిభిః ప్రణీతయా సంస్కృతవ్యాఖ్యయా సహితమ్

---

మహీసారపురాధీశో మహనీయగుణార్ణవః ।
భక్తిసారో విజయతే భుక్తి ముక్తిప్రదో నృణామ్ ॥

శ్రీదేవరాజ గురువరవిరచితమిదం వ్యాకరోతి సత్ప్రీత్యై ।
వరవరమునివరశతకం వాధూలో వీరరాఘవో దాసః ॥

---

*శ్రీదేవరాజగురువర్యవిషయోయం శ్లోకః*

సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజ షట్పదమ్ ।
దేవరాజగురుం వందే దివ్యజ్ఞానప్రదం శుభమ్ ॥

---

**1.** అవతారికా : ఇహ ఖలు చరమపర్వనిష్ఠానా మగ్రణీః దేవరాజగురుః "గురురేవ పరం బ్రహ్మ", "ఉపాయోపేయభావేన తమేవ శరణం వ్రజేత్", "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తమమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా "ఇత్యాదిప్రమాణై రాచార్యరూపస్య భగవతః పరతంత్రశేషిత్వ విలక్షణజీవాధిష్ఠితత్వాభ్యా మవ్యభిచరితోపాయత్వం ఖండశర్కరాక్షీరవత్ మిలితానుభావ్యత్వరూప పర మోపేయత్వం చ నిర్ణీయ, తాదృశాచార్యత్వపూర్తేః "విష్ణుః శేషీ తదీయః శుభగుణనిలయో విగ్రహః శ్రీశఠారిః" ఇత్యాద్యుక్త ప్రకారేణ భగవతి రామానుజార్యే సంప్రతిపన్నత్వేన తమేవ చరమోపాయోపేయ మభిసంధాయ, తన్నిష్ఠాపూర్ణత్వేన, తత్తాదాత్మ్యేన వా భగవతః సౌమ్యజామాతృమునేస్తు శేషిత్వశరణ్యత్వప్రాప్యత్వ రూపా కారత్రయ మనుసంధాయ, తాదృశానుసంధానజనిత తద్విషయకపరమభక్తిప్రేరితో మాదృశజనానర్థ పరిజిహీర్షయా చ వరవరమునిశతక మేతత్ ప్రణేతుకామో మంగళ మాచరతి.

వ్యాఖ్యా : (వరవరేతి). 'వృఙ్- సంభక్తౌ' - వ్రియతే ప్రార్థ్యత ఇతి వరో, రమ్యః జామాతా, వరశ్చాసౌ వర ఇతి కర్మధారయః. రమ్యజామాతేత్యర్థః. మునయః - మననశీలాః. మననం చేహ విషయస్వాభావ్యాత్ చరమస్వరూపోపాయోపేయవిషయకం జ్ఞేయమ్. తేషాం వర్యః శ్రేష్ఠః. వరశ్చాసౌ మునివర్యశ్చేతి విగ్రహః.

తస్య, [1]పాదురత్నం-పాదుకాశ్రేష్ఠమ్. అయమేవ చాస్య వరదనారాయణగురోః స్వరూపప్రాప్తత్వాత్ ఆద్యో వ్యపదేశ ఇతి సూచనాయాస్య విశేషణస్య ప్రథమం నివేశః. స్వనికటం ప్రతి వరవరముని సన్నిధాపనారూప-మహోపకారకకర్తృస్వాచార్యనిష్ఠతత్పాదుకాత్వవిషయక కృతజ్ఞతాయా వా పూర్వం తదుక్తిః. రత్నమ్ ఇతి పాదేనాస్య వరవరమునేః భగవద్రామానుజస్య దివ్యపాదుకాభూతదాశరథిః వ్యావర్త్యతే; తత్పాదుకాపేక్షయా తదీయపాదుకాయా అభ్యర్హితత్వాత్. [2]గురూణాం - సకలజగద్ధితోప దేష్టౄణాం, గురుం - హితతమోప దేష్టారమ్. "గృణాతేః కుగ్రోరశ్చ" ఇతి ఉపప్రత్యయః. వరదగురుం - వరదనారాయణ గురుమ్. అత్రత్య గురుశబ్దః స్వాపేక్షయా గురుత్వాభిప్రాయకః. ఆశ్రయే-సేవే, తద్విషయకానుకూలవృత్తిం కరోమి. తత్-ప్రసిద్ధమ్, ఉపనిషద్భి రవ్యవధానేన భగవత్ప్రతిపాదకవేదభాగైః, ఉపగీతమ్- ఉపదిష్టమ్. గీతపదేన ఉపనిషదశ్ఛాందోగ్యాదికా ఇతి సూచ్యతే. ఛాందోగ్యసమత్వేన ప్రసిద్ధసహస్ర గాథోపనిషదితి చ గీతోపనిషదితి చ సూచ్యతే. అర్థస్యాభిధేయస్య, తత్త్వం-యాథాత్మ్యం తాత్పర్యమ్. అర్థస్య-ప్రయోజనస్య, తత్త్వం 'యాథాత్మ్యం చరమపర్వాత్మకం వా. ఇహ- అన్యథాజ్ఞానాదిపూర్ణే సంసార మండలే, యదీయవశంవదం సత్-యదీయానాం-యాదృశ వరదనారాయణాభిమాన విషయాణాం, వశంవదం సత్- తదధీనం సత్. "ప్రియవశే వదఖచ్". సమిన్ద్దే - సమ్యక్ప్రకాశతే. ఉపసర్గవర్తమాననిర్దేశాభ్యాం దీప్తేరద్యతనాస్మదాదిపర్యన్తాతి విషయత్వాపాదకా విచ్ఛేదవిచాల్యత్వాపాదకస్ఫోర్యత్వే ఉచ్యేతే. తత్త్వపదం చ అభిధానవృత్త్యా ఉపనిషదా మర్థాంతరమపి గమయతి. తం చ ప్రథమపర్వాదికమ్. యదీయ వశంవదం సమిన్ద్దే తం వరదగురు మాశ్రయే - ఇత్యన్వయః.

2. అవ : ఇత్థం స్వాచార్యం ప్రణమ్య, "భగవద్వందనం స్వాద్యం గురువందనపూర్వక"మితి ప్రాపకాచార్యప్రణామపూర్వక ప్రాప్యేష్టదేవతాప్రణామస్య స్వాదుతాతిశయావగమేన "పాదురత్నమ్" ఇతి ప్రాపక ప్రణామానంతరం ప్రాప్యం ప్రణమతి.

వ్యాఖ్యా : (గుణమణినిధయ ఇతి). అయం చ మూలమన్త్రార్థచ్ఛాయానుకారిశ్లోకః. తథా హి. వాక్యైకత్వ-ద్విత్వ-త్రిత్వభేదై రనేకథా భిన్నానాం మూలమన్త్రయోజనానాం మధ్యే సారభూతం స్వరూప-స్వరూపానురూప పురుషార్థపరత్వ - స్వరూపోపాయఫలపరత్వాత్మకయోజనాద్వయం చరమవిషయేఽ ప్యవశిష్టమ్. ఏవం చాస్య శ్లోకస్య పూర్వార్ధే ప్రథమపాదే నమఃశబ్దస్య ద్విరావృత్తిః. ప్రథమయోజనాయాం స్వరూప-పురుషార్థరూపస్థానద్వయాన్వయతాత్పర్యేణ, ద్వితీయపాదే తస్య త్రిఃప్రయోగో ద్వితీయయోజనాయాం స్వరూపోపాయఫలాత్మకస్థానత్రయ తాత్పర్యేణ. అత్ర చ నమ ఇతి నిషేధ్యమ్ అహం మదీయం చేతి ప్రసంజనమప్యనిష్టమితి వ్యంజయితుం తయో రనురుక్తిః. ప్రకరణాదేవ తయోరవగతి రిత్యాశయః. తత్ర స్వారసికప్రేమాస్పదగుణవిశేషవైశిష్ట్య - తదుపపాదితాచార్యత్వ పూర్తివైశిష్ట్య-తదుభయాశ్రయదివ్య మంగళవిగ్రహదివ్యాత్మస్వరూపాణా ముద్దేశ్యతాసూచనాయ పాదత్రయాత్మకవాక్యత్రయేణ తేషాం క్రమేణ

---

1. పాదురత్నమ్ - అత్ర పాదుఇతి "ఇకో హ్రస్వో ఙ్యో గాలవస్య" ఇతి హ్రస్వేన సాధు. అత ఏవ పాదుయుగ్మమితి.
2. గురూణాం - సకల జగద్ధితోపదేష్టౄణాం వరవరమునివర్యాణామ్. పూజాయాం బహువచనమ్ గురుమ్ ఆచార్యవర్యమ్, మద్గురుం సంశ్రయ ఇతి వరవరమునివర్యేణ స్వేనైవోక్తేః. అయమర్థః సంప్రదాయతోఽ వగంతవ్యః.

సారార్థపూర్ణాశయమ్" ఇత్యుక్తవరదనారాయణ గురువిషయకాభిప్రాయః [1]కవేర్వ్యంజితః. యతిపతిపదపద్మ బంధాను బంధానుసంధాయినః - భగవద్రామానుజచరణకమలమేవ స్వోజ్జీవనహేతు-తాధ్యవసాయయుక్తాన్, వరవరమునివర్య సంబంధసంబంధ సంబంధసంబంధినః - వరవరమునివర్యదాస దాసదాసాన్, ప్రతిదినమ్ అనుభూయ, అయాసభూః - భూయో న భూయాసం - పునరపి ఆయాసభూర్న భవితు మాశంసే.

**100.** అవ : తత్సంబంధిప్రస్తావా త్తదీయదివ్యనక్షత్రవైలక్షణ్యా మనుభవతి.

వ్యాఖ్యా : (యన్మూలమితి) ఆశ్వయుజమాసి-తులామాసి, యన్మూలం యాదృశం మూలనక్షత్రం, కరుణైకసింధోః - కృపాయాః అద్వితీయనిలయస్య, కాంతోపయంత్ర్యయమినః- వరవరమునివర్యస్య, అవతారమూలమ్ ఆసీత్- దివ్యావతారహేతు రాసీత్, తదేవ - తాదృశదివ్యమూలనక్షత్రమేవ, ఏవకారేణ వరవరమునే రపి అనపేక్షా గమ్యతే. అసత్సు గణితస్య - వరవరమునివరసంబంధ విరహేణ నష్టస్వరూపేషు గణితస్య ప్రథమోద్దిష్టస్య, మమాపి - సర్వశక్తినాపీశ్వరేణ దుశ్శకస్వరూపనిష్పత్తికస్య మమ, సత్తామూలం- సంత మేనం తతో విదుః" ఇత్యుక్త విలక్షణాస్తిత్వకారణం, జగదభ్యుదయైకమూలం - జగన్మంగలస్య ముఖ్యహేతుభూతమ్, ఆసీత్ - అభవత్. స్వదృష్టాంతేన జగతోఽప్యభ్యుదయ హేతుత్వముక్తమ్. పురుషమూలస్య రాజ్యపరిపాలనహేతుత్వ మిత్యేతత్సమానార్థకద్రవిడోక్తి స్స్మర్యతే.

**101.** అవ : పునరపి ధ్వన్యంతరేణ తదేవానుసంధత్తే.

వ్యాఖ్యా : (మూలమితి) [2]శఠారిముఖానాం- పరాంకుశపరకాలయతివరాదీనాం, సూక్తీనాం, ద్రవిడోపనిషత్ప్రభృతిరూపాణాం నిర్దోషగుణయుక్తవచనానాం, వివేచనాయాః - విలక్షణవ్యాఖ్యానస్య, మూలం - హేతుభూతమ్. ఇదం "జన్మమూల'మిత్యత్రాన్వేతి. కవేరదుహితుః కూలం సముపాగతస్య - కావేర్యా స్తటం శ్రీరంగనగరభూతం శ్రీవైకుంఠాత్ప్రాప్తస్య, మమ ఆలంబనస్య - ప్రపత్తిష్యతో మమ పతనప్రతిబంధక సంబంధవతః, సౌమ్యవరస్య - కాంతోయంతుః, జన్మమూలం - దివ్యావతార దివ్యనక్షత్రమ్. సముపాగత స్యేత్యుక్తేః జన్మశబ్దోఽవతారపరః. 'సముపాగతస్యే'త్యనేన ఉపాగతస్య సామీచీన్యముచ్యతే. తచ్చ చేతనాను గ్రహమూలకత్వరూపమ్. అతః కర్మమూలకత్వవ్యుదాసాత్ అవతారత్వసిద్ధిః. సతులం వితులం చ సత్, చిత్రం విభాతి-తులాసాహిత్యరాహిత్యయో రేకత్ర సమావేశాత్ విస్మయజనకత్వేన భాతీతి విరోధాభాసః. సతులం - తులామాససహితం, వితులం - నిస్సమాభ్యధికం, చిత్రం - చేతనసంరక్షకమితి విరోధపరిహారః. చిత్రత త్రాయత ఇతి చిత్రమ్. 'అతోఽనుపసర్గే' ఇతి కప్రత్యయః. అత్ర ప్రాసాలంకారస్య, విరోధాభాసస్య చ సంసృష్టిః.

---

1. కవిః - దేవరాజగురుః. "శఠరిపురేక ఏవ కమలాపతిదివ్యకవిః మధురకవిర్యథా చ శఠజిన్మునిముఖ్యకవిః, యతికులపుంగవస్య భువి రంగసుధాకవిరాట్, వరవరయోగినో వరదరాజకవిశ్చ తథా'' ఇతి శ్రీవాదిభయంకరార్యసూక్తిదర్శనేన కవేరిత్యుక్తమ్. అత ఏవ అన్యప్రణీత గ్రంథాంతరానాదరపూర్వకం శ్రీదేవరాజగురు ప్రబంధానేవ సర్వేఽస్వాచార్యాః సర్వదివ్యదేశేషు స్వస్వగృహేషు చ పఠంతి.

2. పాంచరాత్రే - పౌష్కరసంహితాయా మేకోనవింశపరిచ్ఛేదే శఠారిః ఇతి నామధేయస్య హేతుత్వం ప్రపంచితమ్. తత్రద్రష్టవ్యమ్. వైఖానసకారికాయాంచ "కోపాగ్నినా శఠం దగ్ధ్వా వైష్ణవీపాదుకాఽసురమ్, శఠకోప ఇతి వ్యాఖ్యాం ప్రాప్తో మునిగణైః భువి'' ఇత్యాది.

**102.** అవ : ఏవం సంబంధసంబంధిపర్యంతం వరవరమునేః స్వరూపరూపాదిక మనుసంధాయ, తద్వై లక్షణ్యానుసంధాన జనితతదనర్థాతిశంకయా మంగళాశాసనం 'శ్రీమద్రంగం యతు పరమం ధామ తేజోనిధానమ్" ఇత్యాది స్తోత్రోపక్రమానుసారేణ 'యతివరతత్త్వవిదే నమో నమస్తే' ఇతి స్తోత్రోపోద్ఘాతోప క్రమాను సారేణ చ స్తోత్రం నిగమయతి.

వ్యాఖ్యా : **(జయత్వితి)** యశసా - నిత్యసూరిషు ప్రధానభూతస్య శేషస్య స్వరూపేణ స్వావతారభేదైశ్చ నియతసన్నిధానప్రయుక్తగుణవత్తాప్రథయా, తుంగమ్ - ఉత్కృష్టం, జగత్త్రయస్య - కృతక - అకృతక - కృతకాకృతక రూపత్రివిధస్య భువనస్య, అథవా, ప్రయోజనాంతరపరానన్యప్రయోజన చరమాధికారిరూప త్రివిధచేతనస్య, మంగళమ్ - అలంకారభూతమ్, ఉపాదేయపురుషార్థభూతం వా, రంగం - శ్రీరంగరాజాభి మతి విషయీభూతం శ్రీరంగనగరం, జయతు - అనుపప్లవేన వర్తతామ్. జి-జయే. జయః - ఉత్కర్షప్రాప్తిః. సా చేహానుపప్లవరూపా వివక్షితా. అనేన "శ్రీమద్రంగ"మిత్యాదేరర్థ ఉక్తః తస్మిన్ - తాదృశశ్రీరంగనగరే, రమామణిభూషణం - "భర్తా నామ నార్యా భూషణాదపి భూషణమ్" ఇత్యుక్తరీత్యా శ్రియో మరకత భూషణభూతం, "శ్రీస్తనాభరణం తేజః" ఇతివత్. భూమా - "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజా నాతి స భూమా" ఇత్యుక్త నిరతిశయస్వరూపః, శ్రీరంగనాథః, సుచిరం - యావత్కాలతత్త్వం, జయతు - అనుపప్లవేన వర్తతామ్. అనేన "భూమా తస్మిన్ భవ'త్విత్యాదే రర్థ ఉక్తః. "రమామణిభూషణ" మిత్యుక్తి ర్భూమేరప్యుపలక్షణార్థా. అథవా, భూర్భూమిః, మా - లక్ష్మీః, రమా భగవతీ రతిమత్యో నీలాగోదాప్రభృతయః, తాసాం మణిభూషణం - రమంత ఇతి రవమాః, యోగికోఽయం శబ్దః. పునరుక్తి మహిమ్నా రూఢ్యనున్మేషః, మా చ సా రమేతి వా. మారమాశబ్దో లక్ష్మీపరః "పద్మాని యస్యాగ్రసరోరుహాణి ప్రబోధయన్నూర్ధ్వముఖైః మయూఖైః" ఇత్యత్రేవాత్రాపి రూఢ్యనున్మేషో ద్రష్టవ్యః. యద్వా, భూశ్చ మా చ భూమే, రమా చ కౌస్తుభమణిశ్చ భూషణం యస్య స రమామణిభూషణం భగవాన్, భూమే చ రమామణిభూషణాని చ భూమారమామణి భూషణమ్. సమాహారే ద్వంద్వః. ప్రాప్యతుల్యత్వద్యోతనాయ ద్వంద్వనిర్దేశః. ప్రాపకత్వ గుణప్రధానాభావేన వైషమ్యద్యోతనాయ విశేషణవిశేష్యభావేన నిర్దేశః. అతో న భూమే రప్యుప లక్ష్యత్వం. మణిభూషణత్వం చ భూమత్వనిగమనార్థమితి ద్రష్టవ్యమ్. తస్మై - ప్రతికూలజనదుర్గమ శ్రీరంగవాసినే, "అప్రమేయం హి తత్తేజః" ఇత్యుక్తశ్రీప్రభృతిదివ్యమహిషీయుక్తాయ, స్వధారకస్య సర్వానిష్టపరిహారసకలేష్ట ప్రాపణక్షమ కౌస్తుభమణిభూషణాయాఽపి భగవతే, శుభాని - అనేకవిధాని మంగళాని, [1]వరదగురుణా సహ, అభివర్ధయన్ - సర్వత ఆశాసానః, శ్రీమాన్ - రామానుజః - మంగళాశాసనరూప శ్రీవైష్ణవ పరిపూర్ణ

1. భగవదాశ్రయణే శ్రియం పురస్కృత్యైవాశ్రయణం కార్యం, విభీషణవత్. అన్యథా శూర్పణఖారావణాదివత్ అనర్థక్యమేవ పర్యవస్యతి. తథా శ్రీవరవరమునిచరణసమాశ్రయణ వేలాయా మస్మదాదీనాం తన్నిత్యసంయుక్త వరదనారాయణగురు పురస్కరణం కార్యమితి వరద గురుణా సార్ధమిత్యనేన లభ్యతే. యథా గురుపరంపరానుసంధానసమయే యో నిత్యమితిశ్లోకేన సహ పాదుకే, శ్రీవత్సేతి శ్లోకద్వయం పఠంతి. తథా శ్రీశైలేత్యనేన "సకలవేదాంతసారార్థపూర్ణాశయం విపులవాధూల గోత్రోద్భవానాం వరమ్, రుచిరజామాతృయోగీంద్రపాదాశ్రయం వరదనారాయణం మద్గురుం సంశ్రయే - ఇతి శ్లోకశ్చాను సంధేయ ఇత్యవగమ్యతే. సారవిద్భిరాదరణీయోయం సదా ఇతి శమ్.

భగవద్రామానుజాభిన్నః వరవరమునిః, క్షితౌ - సత్త్వనిష్ఠై స్స్వయం త్యాజ్యాయామపి స్వసంబంధవశేన నివాసయోగ్యాయాం భూమౌ, జయతు - అనుపప్లవేన వర్తతామ్. క్షయంతి - నివసంతి అస్యామితి క్షితిః. క్షి-నివాసగత్యోః. "తస్మై శుభాని అభివర్ధయన్" - ఇత్యనేన "దివ్యం తస్మై దిశతు విభవ"మిత్యస్యార్థ ఉక్తః "వరదగురుణా సార్ధ"మిత్యనేన "దేశికో దేశికానా"మిత్యస్యార్థ ఉక్తః. ఏవం స్తోత్రోపక్రమానుసారే నిగమనం కృతమ్. "శ్రీమాన్రామానుజ" ఇత్యనేన "యతివరతత్త్వవిదే" ఇతి స్తోత్రోపోద్ఘాతోపక్రాంతస్య నిగమనం కృతమ్. యతివరతత్త్వమ్ - అనారోపితరూపం రామానుజత్వం తేన విద్యత ఇతి. యతి వరతత్త్వవిత్. విద-సత్తాయాం. 'శ్రీమాన్రామానుజో వరవరమునిః" ఇతి నిగమనస్వారస్యపర్యాలోచనాయాం తత్రోక్త లాభః.

**103.** అవ : ఏవంవిధస్య వరవరమునిశతకస్యార్థానుసంధానపురస్సరపఠనేన స్వరూపాను రూపసంపత్ప్రాప్తి స్వసంబంధినా మిష్టానిష్టప్రాప్తిపరిహార హేతుత్వం పురుషస్య భవతీత్యాహ.

వ్యాఖ్యా : (పఠతీతి) భాగ్యాతిశయవాన్-యాదృశజనః, ఏతత్ శతకం - శతశ్లోకపరిమితం ప్రబంధం, [1]సుజానన్సన్- శబ్దార్థయో ర్మాధుర్యం సమ్యగనుసంధానస్సన్, ప్రత్యహం - ప్రతిదినం, పఠతి - కాలక్షేప భోగయోః హేతుతయా క్షణమపి విహాతు మశక్నువానస్సన్ అనుసంధత్తే, స్వయం ప్రయోజనతయా పఠనశీలః పురుషః, ఈప్సితానామ్ - ఆప్తుమిష్టానాం సంపదాం, చరమపర్వప్రాప్తిపర్యంతానాం, నిధానమ్ - అక్షయాధికరణం, నిధిర్వ్యనవరతదానేఽప్యక్షయో భవతి. నిధానం భవతి - నిధిర్భవతీత్యర్థః. స్వయం ప్రయోజనశతకపఠనం ప్రతి సంపదాం నిధానీభవనస్యాఽఽనుషంగికత్వ ద్యోతనాయ హేతుమతోర్లిజః ప్రయోగాభావ ఇతి ధ్యేయమ్. కించ - గురూణాం పాతకానాం - మహతా మపి పాతకానాం, విపాకం - ఫలప్రదానౌన్ముఖ్యం, ప్రశమయతి - వాసనయా సహ నాశయతి. కించ - భవాబ్ధేః పారమ్ అప్తుం- జనన మరణపరంపరారూపసంసార సముద్రస్యోత్తరావధిభూతం మోక్షం ప్రాప్తుం, నిదానం - మూలోపాయం, ప్రథయతి - ప్రకాశయతి, జనానా మితి శేషః. యద్వా, గురూణాం, భవాబ్ధేః, పరమాప్తుం నిదానం ప్రథయతి- ఆచార్యాణాం మోక్షమూలోపాయం భగవద్రామానుజాచార్యం జనానాం ప్రకాశయతీత్యర్థః. స్వాచార్యాణా మపి భగవద్రామానుజః ఉత్తారక ఇతి ప్రసిద్ధమ్. తదుక్తం వేదాంతాచార్యైః "పత్యుః సంయమినాం ప్రణమ్య చరణౌ తత్పాదకోటీరయో స్సంబంధేన సమేధమానవిభవాన్ ధన్యాన్ స్తథాఽన్యాన్ గురూన్" ఇతి.

**104.** అవ : "స హి భవతి నిధానమ్" ఇత్యత్ర వక్తవ్య మేతచ్ఛతకపఠనసంతుష్టేన భగవతా స్వయం ప్రయోజనపఠనశీలైః పురుషైః పఠనకృతా వనుద్దిష్టానామపి సంపదాం ప్రదానం తదిచ్ఛామాత్రప్రతీక్షయా క్రియత ఇత్యాహ.

వ్యాఖ్యా : (అనుదిన మితి) శ్రుతీనాం - నిత్యం శ్రూయమాణానాం, వేదానామ్, అప్రమేయః - ఇదంతయా జ్ఞాతుమశక్యః, శేషశాయీ - సంసారిభిరాశ్రయణీయత్వాయ శ్రీరంగదివ్యనగరే శ్రీమత్యనంతే

1. సుజన్మేతి పుస్తకద్వయేఽపి ముద్రితమూలకోశే చ.

యోగనిద్రారసికః శ్రీరంగనాథః, అనవద్యైః - స్వరూపానురూపభావ వృత్తమూలకత్వవిరహరూపదోషేణ భ్రమాప్రమాదాదిదోషైశ్చ రహితైః, పద్యబంధైః - నిబంధపద్యైః. పద్యశబ్దేన "శోకః శ్లోకత్వ మాగతః" ఇతి న్యాయేన వరవరమునివిషయానుభవపరివాహోద్గతస్యాస్య గ్రంథస్య దైవాద్వర్ణగణనాతిసంఖ్యాన్ న్యూనాధిక భావవిరహేణ ప్రవృత్తి రితి వ్యజ్యతే. "అమీభిః" ఇత్యనేన బంధవత్త్వప్రతిసంధానం వ్యజ్యతే. అనుదినం, వరవరమునితత్త్వం - వరవరమునే రుపాయోపేయత్వరూపం స్వరూపయాథాత్మ్యం, వ్యక్తం - పండిత పామర సాధారణ్యేన స్ఫుటప్రత్యేయం (ప్రత్యయం) యథా భవతి తథా, ఉద్ఘోషయంతమ్ - ఉచ్చైరుచ్చా రణేన ప్రతిపాదయంతమ్, తత్త్వపదేనాస్య శతకస్య ప్రశంసాపరత్వం వ్యావర్త్యతే. ఉద్ఘోషయంత మిత్యత్ర పురుషమితి శేషః. అనుపదం - పదే పదే, అనుగచ్ఛన్సన్ - తద్విషయకాత్యర్థప్రీత్యా తమనుసరన్ సన్, అశేష మభిలషితం సర్వమభీష్టం, సూయతే - ఉత్పాదయతి. సుధాతోః దివాదిత్వాత్ శ్యన్ప్రత్యయః. యద్వా, శేషశాయీ ఉద్ఘోషయంతం పురుషం అశేషం యథా తథా, అనుగచ్ఛన్. అభిలషితం సూయతే ఇత్యన్వయః. సౌగంధ్యసౌకుమార్యాదిభిః క్షణమపి నాగపర్యంక ముత్స్రష్టు మశక్తో భగవాన్ వరవరముని శతకపఠితారం పురుషమ్ శేషశయ్యాప్రహాణేనానానుగచ్ఛన్, తస్యాభిలషితం విదధాతీత్యర్థః. న విద్యతే శేషో యస్మిన్ కర్మణి తద్యతా భవతి తథేత్యశేషం. తథావిధ మనుగమనం కుర్వన్నిత్యర్థః. "నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతః" ఇతివత్. అస్యా యోజనాయాః పూర్వోక్తైవ గరీయసీ. అత్ర "శేషశాయీ తత్త్వ ముద్ఘోషయంతం మనుగచ్ఛన్ అభిలషితం సూయతే" ఇత్యనేన దివ్యప్రబంధగాథాగానశీల భక్తిసాగరానుగంతృశేషశాయి యథోక్తకారివృత్తాంతః ప్రతీయత ఇతి మంతవ్యమ్.

యోఽయం తత్త్వత్రితయ మఖిలం స్వాయుతాంశాంశకేన
సాక్షాత్కర్తుం ప్రభవతి కవేః భావబంధో మునీంద్రే ।
తేనానేన ద్రుతగతిమతా దత్తహస్తావలంబః
సోఽయం గ్రంథః కిమపి తు మయా వ్యాకృతః స్తోకవాచా ॥

అతిగంభీరభావస్య దేవరాజగురోఽర్గిరామ్ ।
యథామతి వ్యాక్రియాతో వ్యక్తా మద్గాథచిత్తతా ॥

ఇతి శ్రీమహీసారపురాధిష్ఠిత సకలశాస్త్రవాదాగ్రేసర శ్రీవాధూలకులతిలక శ్రీవీరరాఘవాచార్యప్రసాదితం శ్రీవరవరమునిశతక వ్యాఖ్యానం సమాప్తమ్.

శ్రీమానేష చిరం జీయాత్ సీమాతీతగుణాంబుధిః ।
రామానుజసదాసేవీ భూమౌ శ్రీవీరరాఘవః ॥

## ఐతిహ్యవిశేషః

అత్ర కేచిదాచార్య ఐతిహ్యవిశేష మామనంతి. ద్రవిడోపనిషత్ప్రతిపాద్యార్థవిశేషాన్ శ్రీవరవరముని వర్యః పరాంకుశార్య విషయతయా "తిరువాయ్మొழி నూఱ్ఱన్దాది" దివ్యప్రబంధేన ప్రకటీచకార.

శ్రీరామాయణం లక్ష్మణపరతయా శ్రీవరవరమునిశతకవ్యాఖ్య ప్రబంధరూపేణాఽయం దేవరాజగురువర్యః ప్రకాశయామాసేతి.

ఇదం రహస్యం పరయా కృపయా కృష్ణసూరిణా ।
మమోపదిష్టం తోతాద్రిమఠే తేన మహాత్మనా ॥

ఇదం 82 (తమం) శ్లోకమారభ్య 92 తమశ్లోకపర్యంత (భాగ) వ్యాఖ్యానేషు స్పష్ట మవగమ్యతే. తత్ర "చరమప్రధానేఽస్మిన్ శతకే తదనుసంధానచరమపర్వనిష్ఠైః శ్రీరామాయణస్యోపాదేయతాయా నిబంధనం చరమశేషిరూపవరవరమునిభిన్న సౌమిత్రిప్రతిపాదకత్వమితి వ్యంజనార్థమ్. అన్యథా చరమ పర్వప్రవణస్య కర్తుః తదనుసంధానానుగతేః ఇతి ప్రపంచితం చ (92 తమ శ్లోకావతారికాయామ్).



శ్రీమతే రామానుజాయ నమః



శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# శ్రీవరవరముని శతకము

## శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణన్ తనియన్

**వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధం**
**కాంతోపయంతృయమినః కరుణైకపాత్రమ్ ।**
**వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం**
**భక్త్యా భజామి పరవాదిభయంకరార్యమ్ ॥**

వేదాంతదేశిక కటాక్షవివృద్ధబోధం = శ్రీవేదాంతదేశికుల కటాక్షంవల్ల మిక్కిలిగా వృద్ధి అయిన జ్ఞానాన్ని కలవారు, కాంతోపయంతృయమినః = శ్రీమణవాళ మహామునుల యొక్క, కరుణా+ఏకపాత్రం=కరుణకు అద్వితీయమైన పాత్రం,వత్స+అన్వవాయం = శ్రీవత్సగోత్రంలో అవతరించినవారు, అనవద్యగుణైః + ఉపేతం = ఏదోషం లేని గుణాలతో కూడినవారు అయిన, పరవాది భయంకరార్యం = ప్రతివాది భయంకరం అణ్ణన్‌ను, భక్త్యా భజామి = భక్తితో సేవిస్తున్నాను.

శ్రీమణవాళమామునుల శ్రీపాదములను భగవదాజ్ఞామూలముగా ఆశ్రయించి, శ్రీవరవరమునులచే శ్రీభాష్యసింహాసనములో అభిషిక్తులై, వరవరమునులకు శ్రీభాష్యాదు లలో సహాయకులైయుండి, వారి కరుణాకటాక్షవిశేషమునకు లక్ష్యభూతులై, యతీంద్ర ప్రవణులగు మామునులయందు ప్రావణ్యాతిశయమును కలవారైన శ్రీప్రతివాది భయంకరం అణ్ణన్, మామునుల స్వరూపగుణవిభవములను, శ్రీసూక్త్యాదులను అనుభవించి, ఆ అనుభవజనితప్రీతికి వ్యక్తీకరణరూపముగా శతముఖముగా మామునుల వైభవమును శ్రీవరవరమునిశతకమను స్తోత్రగ్రంథమూలమున వెల్లడించిరి. **"గురుం ప్రకాశయేద్ధీమాన్", "ప్రత్యక్షే గురవః స్తుత్యాః", "వక్తవ్యమాచార్యవైభవమ్"** అనునట్లు ఆచార్యవైభవ కీర్తనము సచ్ఛిష్యునకు కర్తవ్యము. కాలక్షేపమునకు, భోగమునకును హేతువు. మామునుల దాసులగు శ్రీవైష్ణవుల ముఖోల్లాసమునకును, ఉజ్జీవనమునకును ఈ శతకము హేతువై యుండును. ఈ తనియన్ శ్లోకము అణ్ణన్ శిష్యులలో ఎవరో ఒకరు రచించియుందురు. శ్రీవైష్ణవసంప్రదాయంలోని తెన్‌కలై సంప్రదాయమునకు చెందిన గొప్ప ఆచార్యులైన శ్రీవరవరమునుల సంబంధాన్ని, వడకలై సంప్రదాయమునకు చెందిన మహాచార్యులైన శ్రీవేదాంతదేశికుల సంబంధాన్ని, వారి కుమారులైన నయనవరదాచార్య సంబంధాన్ని పొందడం అణ్ణన్‌కు గల వైలక్షణ్యాలలో ఒకటి.

1. **మూలేఽవతీర్య మిహ మూలమనూదితార్థ-**
   **తత్త్వావబోధసుఖితాం వసుధాం విధాతుమ్ ।**
   **రామానుజార్యచరణాంబుజచంచరీకం**
   **రమ్యోపయంతృయమినం శరణం ప్రపద్యే ॥**

వసుధాం = భూమిని, మూలమను + ఉదిత + అర్థతత్త్వ + అవబోధ సుఖితాం= అష్టాక్షరి మహామంత్రంలో చెప్పబడ్డ అర్థాలలోని తత్త్వాన్ని తెలిసి సంతోషించినదానినిగా, విధాతుం = చేయడానికి, ఇహ = ఈ లోకంలో, మూలే = మూల అనే నక్షత్రంలో, అవతీర్ణం = అవతరించినవారు, రామానుజార్యచరణ + అంబుజచంచరీకం = భగవ ద్రామానుజుల శ్రీచరణాలనే పద్మాలలో తుమ్మెదలవలె నిత్యం ఆశ్రయించి ఆనందించే వారైన, రమ్యోపయంతృయమినం = వరవరమునులను, శరణం ప్రపద్యే = శరణంగా ఆశ్రయిస్తున్నాను.

ఈ భూలోకములోనున్నవారిని మూలమంత్రమగు అష్టాక్షరియొక్క అర్థములను యథార్థముగా తెలిసికొనుటచే విలక్షణమైన సుఖమును కల్గినవారినిగా చేయుట కొఱకు (సాధారణసంవత్సరము అల్పిశి నెలలో) మూలానక్షత్రమున ఈ లోకములో అవతరించిన వారు, భగవద్రామానుజుల పద్మములవంటి శ్రీపాదములలో తుమ్మెదవలె అభినివేశమును పొందినవారును, శ్రీవరవరమునులు అను పేరుతో ప్రసిద్ధులగు పెరియ జీయర్‌ను ఆశ్రయింతును – అని భావము.

**2. యదవతరణమూలం ముక్తిమూలం ప్రజానాం**
**శఠరిపుమునిదృష్టామ్నాయసామ్రాజ్యమూలమ్ ।**
**కలికలుషసమూలోన్మూలనే మూల మింధే**
**స భవతు వరయోగీ నః సమస్తార్థమూలమ్ ॥**

యత్ అవతరణమూలమ్ = ఏ మణవాళమహామునుల అవతారదినం అయిన మూలానక్షత్రం, ప్రజానాం = సకలజనులయొక్క, ముక్తిమూలమ్ = ముక్తికి మూలంగా, శఠరిపుమునిదృష్ట = శఠకోపమునులనబడే నమ్మాళ్వార్లచేత దర్శింపబడ్డ, ఆమ్నాయ సామ్రాజ్యమూలమ్ = ద్రావిడబ్రహ్మసంహిత (తిరువాయ్‌మొళ్ళిఅనే ప్రబంధం) యొక్క సర్వతోముఖం అయిన విజయానికి మూలంగాను, కలికలుషసమూల +ఉన్మూలనే = కలికల్మషాన్ని సమూలంగా పెక లించడంలో, మూలమ్ = మూలం గాను, ఇంధే = ప్రకాశిస్తున్నదో, సః వరయోగీ = ఆ (కారణం) మణవాళమహామునులు, నః = మన, సమస్త+ అర్థమూలం భవతు = సకలార్థసిద్ధికి మూలం కావాలి.

ఏ వరవరమునుల అవతారహేతువైన మూలానక్షత్రం లోకుల మోక్షమునకు మూలకారణమైయున్నదో, మఱియు, శ్రీశఠకోపులనబడు నమ్మాళ్వార్లచే సాక్షాత్కరింపబడిన ద్రావిడవేదమును ప్రమాణసామ్రాజ్యములో (పరమప్రమాణముగా) అభిషిక్తము చేయుటకు హేతువగుచున్నదో, కలిదోషమును సమూలముగా పెకలించుటలో కారణమై ప్రకాశించు చున్నదో, అట్టి శ్రీ మణవాళమహామునులు దాసభూతులమగు మనయొక్క సకలపురుషార్థ సిద్ధికొఱకు కారణభూతులు అగుగాక! (మనకు సకలార్థములను ప్రసాదింతురు గాక !)

**3. జనివిపదపవాదౌ యస్య పాదౌ విదంతః**
**సతత మపి మహాంతః స్వాంత ఏవోద్వహంతి ।**
**స జయతి భజదంతర్ధ్వాంతకల్పాంతభానుః**
**నిరవధిగుణకాంతో హంత! కాంతోపయంతా ॥**

మహాంతః = మహనీయులు, యస్య పాదౌ = ఏ మణవాళమహామునుల శ్రీచర ణాలను, జనివిపత్ +అపవాదౌ = సంసారంవల్ల ఏర్పడే ఆపదలను అన్నిటినీ పోగొట్ట గల్గినవిగా, విదంతః = తెలిసికొన్నవారై, సతతమ్ = ఎల్లప్పుడు, స్వాంతే ఏవ = తమ హృదయంలోనే, ఉద్వహంతి = ధరిస్తున్నారో, భజత్ + అంతర్ధ్వాంత కల్పాంతభానుః= భక్తుల మనస్సులలో ఉండే అజ్ఞానమనే చీకటిని పోగొట్టే విలక్షణుడైన సూర్యుడై, గుణ కాంతః=కల్యాణగుణాలతో అభిరాముడై ఉండే, సః = ఆ, కాంతోపయంతా= వరవర మునులు, జయతి = వర్ధిల్లుతున్నారు, హంత = ఆహా !

పెద్దలు ఏ శ్రీవరవరమునుల శ్రీపాదములను సంసారమునందు పుట్టుక మొదలగు ఆపదలకు అపవాదముగా భావించి, ఎల్లప్పుడు ఆ శ్రీపాదములనే ఆదరముతో ప్రేమించి, ధరింతురో (శ్రీవరవరమునుల శ్రీచరణములనే ధ్యానింతురో),

ఏ వరవరమునులుతమను ఆశ్రయించినవారి ఆంతరమైన అజ్ఞానాంధకారమును నిరసించుటలో (మనస్సులో గల అజ్ఞానమనెడి చీకటిని పోగొట్టుటలో) ప్రళయకాలసూర్యుడై వెల్గుచున్నారో, అట్లున్నను అంతు లేని తమ శమదమాది కల్యాణగుణములతో ఆకర్షణీయులై, అతిమనోహరులై యున్నారో, అట్టి శ్రీవరవరమునులు సర్వోత్కృష్టులై వెలుగుచున్నారు.

**4. ఇంధే వాక్యవిభూషణస్య మహతో యద్భాషణం భూషణం**
**యత్పాదాంబురుహద్వయం సుమనసాం మూర్ధ్న స్సదా భూషణమ్ ।**
**యద్భక్తాంఘ్రిరజఃకణో వితనుతే దుఃఖోదధేః శోషణం**
**వందే కాంతవరం మునిం తమనఘం నిత్యం కలే ర్భీషణమ్॥**

మహతః వాక్యవిభూషణస్య = గొప్పదైన శ్రీవచనభూషణానికి, యద్భాషణం = ఏ మణవాళ మహా మునుల వ్యాఖ్యానం, భూషణం = గొప్ప అలంకారమో, యత్పాదాంబురు హద్వయం = ఏ మణవాళమహామునుల శ్రీచరణద్వయం, సుమనసాం = విద్వాంసుల, మూర్ధ్నః = శిరస్సుకు, సదా భూషణమ్ = ఎల్లప్పుడు భూషణంగా, ఇంధే = ప్రకాశిస్తున్నదో, యద్భక్తాంఘ్రిరజః కణః = ఏమణవాళమహామునుల భక్తుల శ్రీచరణరజస్సుయొక్క లేశం, దుఃఖ+ఉదధేః = సాంసారిక దుఃఖాలనే సముద్రాన్ని, శోషణం వితనుతే = ఇంకింప జేస్తున్నదో, కలేః భీషణం = కలిపురుషునకు భయంకరులు, అనఘం = పాపరహితులు (హేయప్రతిభటులు) అయిన, తం కాంతవరం మునిం = ఆ వరవరమునులను, నిత్యం వందే = నిత్యం నమస్కరిస్తున్నాను.

**5. యత్పాదాంబుజసంశ్రయేణ విమలాః యల్లబ్ధబోధోజ్జ్వలాః**
**యత్సూక్త్యైకరసా స్స్వశిష్యనివహవ్యాప్తాఖిలాశాంతరాః ।**
**ప్రఖ్యాతా హి వరప్రదప్రభృతయ స్తే నిత్యసిద్ధోపమాః**
**తస్మాత్కాంతవరా న్మునే రనుపమాత్ దైవం పరం నాద్రియే ॥**

నిత్యసిద్ధోపమాః = నిత్యులతో, ముక్తులతో సమానులైన, వరప్రదప్రభృతయః = కోయిలణ్ణన్ మొదలైన, తే = ఆ మహనీయులు, యత్పాదాంబుజ సంశ్రయేణ = ఏ మణవాళమహామునుల శ్రీచరణపద్మాలను ఆశ్రయించడంచేత, విమలాః = దోష రహితు లయ్యారో, యల్లబ్ధబోధ + ఉజ్జ్వలాః = ఏ మణవాళమహామునుల వద్ద పొందిన జ్ఞానంతో వెలుగుతున్నారో, యత్ సూక్తి +ఏకరసాః = ఏ మణవాళమహామునుల శ్రీసూక్తులలోనే రసికులై, స్వశిష్యనివహవ్యాప్త + అఖిల +ఆశాంతరాః = తమ శిష్యుల సమూహాలతో సకలదిఙ్మండలాలలో వ్యాపించి ఉన్నారో, తస్మాత్ అనుపమాత్ కాంతవరాత్ మునేః= అటువంటి సాటిలేని మణవాళమహామునులకంటే, పరం దైవం = గొప్ప దైవాన్ని దేనినీ, న+ ఆద్రియే = ఆదరించను.

ఏ మణవాళమహామునుల శ్రీపాదములను ఆశ్రయించిన కారణముచే నిర్మలురై, ఏ మణవాళమహామునుల కృపచే లభించిన రహస్యత్రయాదుల అర్థజ్ఞానముచే గొప్పగా వెల్గుచున్నవారై, ఏ మణవాళమహామునుల శ్రీపాదములందు కైంకర్యమును చేయుటయే ఆనందముగా కలవారై, పది దిక్కులలో వ్యాపించిన శిష్యులను కలవారైయున్న శ్రీవరద నారాయణగురువగు కోయిలణ్ణన్ మొదలగు మహాత్ములు నిత్యసూరులతో, శ్వేతద్వీప వాసులతో సమానులై వెల్గుచున్నారో, తమకు ఏసాటి లేని ఆ శ్రీమణవాళమహామును లను తప్ప వేఱొక దైవమును నేను ఆదరింపను. చరమపర్వమగు శ్రీమణవాళమహామునులే పరదైవమని శ్లోకతాత్పర్యము.

**6. యత్సూక్త్యైకరసా యదంఘ్రియుగళీసేవైకహేవాకినో**
**యద్వాత్సల్యదయాదిసద్గుణగణాకూపారమగ్నాశయాః ।**
**మన్యంతే న పరం విముక్తికరణం సంతో యదాలోకనాత్**
**తన్మాన్న స్స శుభాన్యవేలమహిమా కాంతోపయంతా మునిః ॥**

యత్సూక్తి +ఏకరసాః = ఏ మణవాళమహామునుల సూక్తిలోనే ఆనందించేవారు, యత్ +అంఘ్రియుగళీసేవా + ఏకహేవాకినః = ఏ మణవాళమహామునుల శ్రీచరణాలలో సేవచేయడంలోనే మిక్కిలి కుతూహలాన్ని కలవారు, యత్ వాత్సల్యదయాదిసద్గుణగణ+ అకూపారమగ్నాశయాః = ఏ మణవాళమహామునులయొక్క వాత్సల్యం, దయ మొదలైన

సద్గుణసమూహాల సాగరంలో మునిగిన మనస్సులను కలవారు అయిన, సంతః = సత్పురుషులు, యత్ ఆలోకనాత్ = ఏ మణవాళమహామునుల కటాక్షానికి మించిన, పరం విముక్తికరణం = ఇంకొక గొప్పదైన ముక్తి సాధనం ఉన్నదని, న మన్యతే = భావించడంలేదో, సః అవేలమహిమా = అటువంటి అంతులేని వైభవాన్ని కల్గిన, కాంతోప యంతా మునిః = మణవాళమహామునులు, నః = మనకు, శుభాని తన్యాత్ = మంగళాలను వృద్ధిచేయాలి.

సత్పురుషులుఏ శ్రీ మణవాళమహామునుల శ్రీసూక్తిని వినుటయు, అనుసంధించుట యును అతిమధురమైయుండుటచే ఎల్లప్పుడు ఆనందించుచున్నారో, ఏ శ్రీమణవాళమహా మునుల శ్రీపాదయుగమును సేవించుటలో (శ్రీపాదములందు కైంకర్యమును చేయుటలో) కుతూహలమును కలవారైయున్నారో, ఏ మణవాళ మహామునుల వాత్సల్యము, కృప మొదలగు సద్గుణముల సాగరములో మగ్నమైన మనస్సును కలవారైయున్నారో, ఏ మణవాళమహామునుల కృపాకటాక్షమును తప్ప వేఱొక దానిని మోక్షమునకు శ్రేష్ఠకారణముగా భావింపరో, అంతులేని మహిమను కల ఆ శ్రీ మణవాళ మహామునులు మనకు అన్ని శుభములను మిక్కిలిగా అనుగ్రహింతురుగాక !

**7. యద్వాణీ శఠవైరిసూక్తితరుణీమాంగల్యదీపావలిః**
**యద్వీక్షా స్వశరవ్యసర్వజనతాసర్వార్థచింతామణిః ।**
**యన్మూర్తి ర్భజదార్తిభంజనచణాం సూక్తిం వివక్త్యంజసా**
**భూయా న్న స్సతతం స మే హృది గురుః కాంతోపయంతా మునిః॥**

యద్వాణీ = ఏ మణవాళ మహామునుల శ్రీసూక్తి, శఠరిపుసూక్తితరుణీ = శఠకోపుల శ్రీసూక్తి అనే తరుణియొక్క మాంగల్యదీపావళిః = మాంగల్యాన్ని ప్రకాశింపజేసే దీపమాలిక, యద్వీక్షా = ఏమణవాళమహామునుల కటాక్షం, స్వశరవ్యసర్వజనతా = తనకు లక్ష్యభూతులైన జనులందరియొక్క, సర్వార్థ = సమస్తవిషయాలను ప్రదానం చేయడంలో, చింతామణిః = చింతామణివంటిదో, యన్మూర్తిః= ఏమణవాళమహామునుల తిరుమేని, భజదార్తిభంజనచణాం = భక్తుల ఆర్తిని పోగొట్టడంలో సమర్థం అయిన, సూక్తిం = సూక్తియొక్క ఆవిర్భావాన్ని, అంజసా = వేగంగా, వివక్తి = వ్యక్తం చేస్తున్నదో, మే గురుః = నాకు ఆచార్యులైన, సః కాంతోపయంతా మునిః =ఆ మణవాళమహామునులు, మే హృది = నా హృదయంలో, సతతం = ఎల్లప్పుడు, భూయాత్ = ఉండాలి (ప్రకాశించాలి)

ఏ మణవాళమహామునుల శ్రీసూక్తి, శ్రీశఠకోపుల శ్రీసూక్తి అను తరుణియొక్క సౌభాగ్యమునకు ప్రకాశకమై, మంగళావహమైన (మంగళకరమైన) దీపపంక్తిగా వెలుగుచున్నదో, ఏ శ్రీమణవాళ మహామునుల కటాక్షము తనకు లక్ష్యమైన సర్వజనుల సర్వమనోరథార్థసిద్ధికిని చింతామణిగా ప్రకాశించుచున్నదో, ఏ శ్రీమణవాళమహామునుల దివ్యమంగళవిగ్రహము తనను ఆశ్రయించిన సర్వజనుల సమస్తదుఃఖములను పోగొట్టుటకు సమర్థమైన శ్రీసూక్తిని యథార్థముగానే నోరు తెఱచి పల్కుచున్నదో, (మణవాళమహామునులు తమ మృదుమధురమైన శ్రీసూక్తులతో తనను ఆశ్రయించినవారి దుఃఖములను అప్పటికప్పుడు పోగొట్టుచున్నారో) అట్టి ప్రభావమును కల, మనకు ఆచార్యులగు మహామునులు ఎల్లప్పుడు దాసుని చిత్తములో కృపతో వేంచేసి యుండ వలెను.

**8. అవాగ్భూషాజుష్టై రభువనగురుప్రేమభరితైః**
**అమూలర్క్షోద్భూతై రవరదగురూపాసితపదైః ।**
**కృతం తై స్తై స్సర్వైః గురుభి రమహాయోగిభి రితి**
**వ్యవస్యంత స్సంతో హృది మమ లసంతు ప్రతికలమ్ ॥**

అవాగ్భూషాజుష్టైః = శ్రీవచనభూషణగ్రంథంలో అన్వయం లేనివారు, అభువనగురు ప్రేమభరితైః = శ్రీపిళ్ళైలోకాచార్యులవారిపట్ల భక్తి లేనివారు, అమూలర్క్ష+ఉద్భూతైః = మూల అనే నక్షత్రంలో అవతరించనివారు,

అవరదగురూపాసిత పదైః = కోయిలణ్ణన్‌చేత సేవ చేయబడనివారు, అమహాయోగిభిః = పెరియజీయర్ అనే తిరునామాన్ని పొందనివారు అయిన, తైః తైః సర్వైః గురుభిః = ఆయా ఆచార్యులందఱిచేత, కృతమ్ ఇతి వ్యవస్యంతః= ప్రయోజనం లేదని నిశ్చయించుకొన్న, సంతః = సత్పురుషులు, మమ హృది = నా హృదయంలో, ప్రతికలం లసంతు = ప్రతిక్షణం భాసించాలి.

పూర్వశ్లోకములో శ్రీమణవాళమహామునులు నా మనస్సులో ఎల్లప్పుడు ప్రకాశింప వలెనని ప్రార్థింపబడినది. ఇందు ఆ వరవరముని భృత్యులు నా మనస్సులో ప్రతిక్షణము ప్రకాశింపవలెనని వేడబడుచున్నది.

శ్రీవచనభూషణమును ప్రీతితో సేవింపనివారై, శ్రీపిళ్ళైలోకాచార్యులవారిపట్ల పూర్ణ భక్తిని లేనివారై, మూలానక్షత్రమున అవతరింపనివారై, వరదనారాయణగురువుచే ఉపాసింపబడని శ్రీపాదములను కల్గినవారై, అవరయోగులైయున్న ఇతర ఆచార్యులతో సంబంధమును కలవారము కాము. అట్టివారిని ఉండ నిండు. శ్రీ మణవాళమహామునులే తమకు రక్షకులని నమ్మిన శ్రీ మణవాళమహామునుల శిష్యులగు సత్పురుషులు నా మనస్సులో ఎల్లప్పుడు వెలుగుదురుగాక! – అనుచు శ్రీవరవరముని వారు కానివారు భృత్యులపట్ల తమకు గల ప్రావణ్యమును ఇందులో అణ్ణన్ తెలిపిరి.

**9.** **న ఖల్వవరయోగినాం భజనతః ఫలస్యోద్భవః**
**తదన్యవిముఖా స్సదా వరమునిం భజధ్వం జనాః ! ।**
**తదంఘ్రిభజనం సకృత్కృత మశేషతో దుష్కృతం**
**నివారయతి భూయసీం శ్రియ మనుత్తమాం పుష్యతి ॥**

అవరయోగినాం భజనతః = మణవాళమహామునులు కాని యోగులను భజించడం వల్ల, ఫలస్య ఉద్భవః = ప్రయోజనంయొక్క ఉత్పత్తి, న ఖలు = లేదు కదా (సంభవించదు కదా), జనాః= ఓజనులారా!, తదన్యవిముఖాః = వరవరమునులు కాకుండా ఇతరులను సేవించకుండా ఉండేవారై, వరమునిం సదా భజధ్వం = మణవాళ మహామునులను నిత్యం సేవించండి, తదంఘ్రిభజనం = ఆ మణవాళ మహామునుల శ్రీచరణసేవ, సకృత్ కృతం(యది) = ఒక పర్యాయం చేయబడినది. (అయితే), దుష్కృతమ్ అశేషతః నివారయతి= (ఆ సేవ) దుష్కర్మను పూర్తిగా నివారిస్తుంది, అనుత్తమాం భూయసీం శ్రియం పుష్యతి = చాలా గొప్పదైన, అంతులేని సంపదను వృద్ధిచేస్తుంది.

జనులారా ! అధములగు యోగులు సేవించుటవలన ఫలము కలుగదు. అందుచే వారిని విడచి, వరయోగియగు శ్రీ మణవాళమహామునులనే ఎల్లప్పుడు సేవింపుడు. అవరయోగులను మాటిమాటికి సేవించినను ఆశించిన ఫలము లభింపదు. వరయోగియగు పెరియజీయర్ శ్రీపాదములను ఒకసారి సేవించినను, అదియే సమస్తపాపములను పోగొట్టి, మిక్కిలి గొప్ప సంపదను నిరంతరము అభివృద్ధియగునట్లు చేయును – అని లోకులనుగూర్చి అణ్ణన్ ఇందు ఉపదేశించిరి.

**10.** **సురాహారాసారీకరణచణయత్సూక్తిలహరీ–**
**గరీయస్త్వాం స్తోతుం ప్రభవతి న వాచస్పతి రపి ।**
**స న స్తన్యాదన్యాదృశమహిమశాలీ వరవరో**
**మునీంద్రో నిస్తంద్రః కుశల మనువేలం గురువరః ॥**

సుర+అహార+అసారీకరణ చణ = దేవతల ఆహారం అయిన అమృతాన్ని అసారంగా– విలువ లేనిదిగా చేయగల్గిన, యత్సూక్తిలహరీగరీయస్త్వాం = ఏ మణవాళ మహామునుల శ్రీసూక్తి ప్రవాహంయొక్క గాంభీర్యాన్ని, స్తోతుం = స్తుతించడానికి, వాచస్పతిః అపి = బృహస్పతికూడా, న ప్రభవతి = సమర్థుడు కావడం లేదో, సః = అన్యాదృశ మహిమశాలీ గురువరః = అటువంటి సాటి లేని మహిమను కల గొప్ప ఆచార్యులైన, వరవరః మునీంద్రః = మణవాళమహామునులు, నిస్తంద్రః = ఆలస్యమును చేయనివారై, అనువేలమ్= ప్రతిక్షణం, నః = మనకు, కుశలం తన్యాత్ = మంచిని అనుగ్రహించాలి.

మాధుర్యాది గుణయోగముచే దేవతల ఆహారమగు అమృతమును అసారముగా చేయగల ఏమణవాళ మహామునుల శ్రీసూక్తిప్రవాహముయొక్క గొప్ప మహిమను దేవగురువగు బృహస్పతికూడ స్తుతింప సమర్థుడు కాడో, లోకవిలక్షణమైన మహిమతో కూడిన, ఆచార్యశ్రేష్ఠులగు ఆ శ్రీమణవాళమహామునులు ఆలస్యమును చేయనివారై మనకు ప్రతిక్షణము అధికాధికముగా క్షేమమును కల్గింతురుగాక !

**11. కలానిధిశిరోమణి ర్జితమనోభవో యద్వచ**
**స్సుధాశనతరంగిణీ దధదనారతం మూర్ధని ।**
**శివోఽపి యదుపాశ్రితో విషమదృష్టితాదూరగః**
**స మే దిశతు మంగళం వరవరో మునీనాం వరః ॥**

యత్ ఉపాశ్రితః = ఏ మణవాళమహామునులను ఆశ్రయించిన శిష్యవర్గం, కలానిధిశిరోమణిః = విద్వాంసులలో శిరోమణి (చంద్రుని శిరోభూషణంగా కల్గినది), జితమనోభవః = కామవేదనకు వశం కానిది (మన్మథుని జయించినది), వచస్సుధాశన తరంగిణీ = శ్రీసూక్తులు అనే దేవగంగను, అనారతం మూర్ధని దధత్ = సదా శిరస్సుపై ధరించేది, శివః+ అపి = శివుడైనా, మంగళకరుడైనా, విషమదృష్టితాదూరగః = విషమదృష్టికి వైదేశికమై ఉన్నదో, సః = ఆ, మునీనాం వరః వరవరః = శ్రీవరవరమునులు, మే = నాకు, మంగళం దిశతు = మంగళమును ప్రసాదించాలి.

ఈ శ్లోకమునుండి అణ్ణన్ బహుముఖముగా శ్రీమణవాళ మహామునుల వైభవమును వర్ణించుచున్నారు.

ఇందు ఏ మణవాళమహామునులను ఆశ్రయించినవాడు శివుడైనను, విషమదృష్టి లేకుండుటచే శివునికంటెను గొప్పవాడై యున్నాడో, మునులలో శ్రేష్ఠులగు ఆ మణవాళ మహామునులు దాసుడనగు నాకు మంగళములను అనుగ్రహించునుగాక! అనుచున్నారు.

**12. కల్యాణాచలధర్మభాగసమగు ర్యత్సంశ్రితో భూతిమాన్**
**బిభ్రచ్ఛుభ్రకలానిధేః కిల కలాం మూర్ధ్నా భృశం నిర్మలామ్ ।**
**క్లృప్తాహీనవిభూషణః స్మరజిత స్సాయుజ్య మాటీకతే**
**సోఽవ్యా న్న స్సతతం ముని ర్వరవరోఽనన్యార్హతేజోనిధిః ॥**

యత్ సంశ్రితః = ఏ వరవరమునులను ఆశ్రయించిన శిష్యుడు, కల్యాణాచల ధర్మభాక్ = సత్యాదులలో ఏమాత్రం చలించని నిష్ఠను కల్గినవాడై (మేరుపర్వతంతో సాటి వచ్చే కాంతిని కల్గినవాడై), అసమగుః = సాటి లేని నందిని వాహనంగా కల్గినవాడై, (సాటి లేని సూక్తులను కల్గినవాడై), భూతిమాన్ = సంపదను కల్గినవాడై (భస్మాన్ని కల్గినవాడై), క్లృప్త + అహీనవిభూషణః = గొప్పవైన శమదమాది ఆత్మా లంకారాలను కల్గినవాడై (నాగభూషణభూషితుడై), శుభ్రకలానిధేః అవికలాం కలాం మూర్ధ్నా బిభ్రత్ = నిర్దుష్టమైన కళలకు నిధిగా ఉండే వరవరమునుల సూక్తిని శిరసావహించేవాడై (కలానిధి అయిన చంద్రుని యొక్క విమలమైన కళను తలతో ధరించేవాడై), గిరీశః = (వాక్కులలో సామర్థ్యాన్ని కల్గినవాడై) ( కైలాసపతియై), స్మరజితః సాయుజ్యం = శివునితో సామ్యాన్ని, ఆటీకతే = కల్గి ఉన్నాడో, అనన్యార్హతేజోనిధిః = తమకే స్వంతం అయిన తేజస్సుకు నిధి అయిన, సః = ఆ, వరవర మునిః= వరవరమునులు, నః = మనలను, సతతం అవ్యాత్= ఎల్లప్పుడు రక్షించుగాక !

ఏ మణవాళమహామునులను ఆశ్రయించినవాడు శివసాయుజ్యమును కలవాడై యున్నాడో, ఇతరదుర్లభమగు విలక్షణతేజోనిధియైన మణవాళమహామునులు మనలను ఎల్లప్పుడు రక్షించునుగాక ! అనుచున్నారు.

**13. యద్భుక్తో నాభిభూతః మదనమథనకృద్వాగ్విలాసైకభూమిః**
**నాళీకస్థోఽకృతోక్తి వ్యవహృతిచతురాస్యత్వసంప్రాప్తభూమా ।**

**సంప్రాప్యానన్యలభ్యాం కమలభవతులా మేధతే సత్యధామా**
**సోఽవ్యా న్నః క్షాంతిసింధు ర్నిరవధిమహిమా సౌమ్యజామాతృయోగీ॥**

యద్భక్తః = ఏ వరవరమునుల శిష్యవర్గం, నాభిభూతః = న + అభిభూతః – ఎక్కడా అవమానాన్ని పొందనిది (నాభినుండి పుట్టినవాడు), మదనమథనకృత్ = కామాది దోషహారి (మన్మథుని సంహరించిన శివుని జన్మింపజేసినవాడు), వాగ్విలాస+ఏకభూమిః = వాక్కుల విలాసానికి సాటిలేని చోటు (సరస్వతీ విలాసానికి ముఖ్యమైన ఆస్పదం) నాళీకస్థః = అసత్యమైన వచనం లేనిది (తామరపూవులో ఉన్నవాడు), అకృత+ఉక్తి వ్యవహృతి చతురాస్యత్వసంప్రాప్తభూమా= వేదవ్యవహారచతురం అయిన నాల్గు ముఖాలను కల్గినది (అపౌరుషేయాలైన నాల్గు వేదాలను ఉచ్చరించడంకోసం నాల్గు ముఖాలను కల్గినవాడు), సత్యధామా (సన్) = సత్యమైన గొప్పతనాన్ని, తేజస్సును– కల్గినది, సత్యానికి నివాసభూమి (సత్య లోకాన్ని వాసస్థానంగా కల్గినవాడు), కనుక, అనన్యలభ్యాం = (ఈరీతులలో) ఇతరులకు లభ్యం కానిది అయిన, కమలభవతులాం=బ్రహ్మదేవునితో సామ్యాన్ని, సంప్రాప్య = పొంది, ఏధతే= ప్రకాశిస్తున్నదో, సః=ఆ, క్షాంతిసింధుః = సహనమనే గుణానికి సముద్రం వంటివారై, నిరవధిమహిమా= గొప్ప మహిమను కలవారైన, సౌమ్యజా మాతృయోగీ=శ్రీవరవరమునులు, నః=మనలను, అవ్యాత్ = రక్షించుగాక!

**14. శిరసి వహతాం యత్పాదాంభః కలానిధిమౌళితా**
**జయతి వరదాచార్యాదీనా మనన్యసమాశ్రయా ।**
**స హి వరముని స్సాక్షా న్నారాయణ స్తత ఏవ తత్**
**చరణవరణా స్సర్వేఽప్యుర్వ్యాం తరంతి భవార్ణవమ్ ॥**

యత్పాద+అంభః = ఏ మణవాళమహామునుల శ్రీపాదతీర్థాన్ని, శిరసి వహతాం= శిరసా వహించే (మిక్కిలి గౌరవించే), వరదాచార్యాదీనాం = కోయిలణ్ణన్ మొదలైనవారికి, అనన్యసమాశ్రయా = ఇతరులను ఎవ్వరినీ ఆశ్రయంగా లేని, కలానిధిమౌళితా = కలానిధిమౌళి– అనే గొప్పతనం, (చంద్రశేఖరుడై ఉండే గొప్పతనం, సమస్త కళలకు నిధులుగా ఉండే వారిలో గొప్పవారుగా ఉండే స్థితి) జయతి = సర్వోత్కర్షతో వెల్గుతున్నదో, స హి వరవరమునిః = ఆ వరవరమునులు, సాక్షాత్ నారాయణః = సాక్షాత్తు నారాయణుడే, తతః ఏవ = అందువల్లనే, ఉర్వ్యాం = ఈ లోకంలో, తత్ చరణవరణాః సర్వే అపి = ఆ వరవరమునుల శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయించినవారందరు కూడా, భవ+అర్ణవం తరంతి = సంసారసముద్రాన్ని దాటుతున్నారు.

**15. జలజనిలయాకాంతోఽనంతద్విజోత్తమసేవితో**
**జలజవిలసత్పాణిః నిత్యం కరస్థసుదర్శనః ।**
**సకలసుమనోవైరివ్రాతావలేపవిలోపకృత్**
**మధురిపుతులాకాంతః కాంతోపయంతృమునీశ్వరః ॥**

జలజనిలయా+కాంతః = తామరపూవులో నివసించే లక్ష్మీదేవికి అసాధారణుడై (భర్తయై), (జడ–జని–లయా+ఏకాంతః = మూఢజన్మను పోగొట్టడంలో చాలా సమర్థుడై) అనంతద్విజోత్తమసేవితః = అనంతునిచేత, పక్షిరాజు అయిన గరుడునిచేత సేవింపబడేవాడై (అసంఖ్యాకులైన బ్రాహ్మణోత్తములచే సేవింపబడేవాడై), జలజల విలసత్పాణిః = (పాంచజన్యమనే) శంఖంచేత ప్రకాశించే శ్రీహస్తాన్ని కలవాడై (తామరలవలె విలసిల్లే శ్రీహస్తాన్ని కలవాడై), నిత్యం కరస్థ సుదర్శనః=ఎల్లప్పుడు చేతిలో వర్తించే సుదర్శనాన్ని కలవాడై, (భగవద్రామానుజుల దర్శనార్థాలను కైవశం చేసికొన్నవాడై), సకలసుమనో వైరివ్రాతావలేపవిలోపకృత్ = సకలరాక్షసుల సమూహంయొక్క గర్వాన్ని లేకుండా చేసిన వాడైన, (ఆసురప్రకృతిని కల వేదవిరుద్ధంగా వాదించే అందఱియొక్క గర్వాన్ని హరించిన వాడైన), కాంతోపయంతృ మునీశ్వరః = శ్రీవరవరమునులు, మధురిపు తులాకాంతః = మధుసూధనుడనబడే భగవానునితో గల సామ్యంవల్ల ఆకర్షణీయులు.

**16. యద్వాగ్జాలం మధుజిదతనుచ్ఛేదినాళీకవాసో-**
**త్కృత్తోద్వృత్తాసురసురవరైః సాదరం సేవ్యమానమ్ ।**
**పద్మావాసాక్షితిధరసుతావాక్ఛచీకాంతభూతైః**
**కాంత్యా కాంతం స జయతు మహాయోగికాంతోపయంతా ॥**

కాంత్యా = కాంతి అనుగుణముచే, కాంతం = ఆకర్షణీయమైనది (మనోహరమైనది) అయిన, యద్వాగ్జాలం = ఏ మణవాళమహామునుల శ్రీసూక్తి సమూహం, మధుజిత్ = మధువు అను రాక్షసుని సంహరించినవాడు (విష్ణువు), అతనుచ్ఛేది= శరీరరహితుడైన మన్మథుని దహించినవాడు (రుద్రుడు), నాళీకవాస = నాభీ పద్మాన్ని నివాసంగా కల్గినవాడు (బ్రహ్మ), ఉత్కృత్త+ఉద్వృత్త+అసుర = గర్వించిన వృత్రాసురుని సంహరించినవాడు (ఇంద్రుడు) అనే, సురవరైః = దేవతా శ్రేష్ఠులైన, పద్మావాస (కాంత) = లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు, క్షితిధరాసుతా (కాంత)= పార్వతికి భర్త అయిన రుద్రుడు, వాక్ (కాంత)= సరస్వతికి పతి అయిన బ్రహ్మ, శచీకాంత భూతైః = శచీదేవికి పతి అయిన ఇంద్రుడు అనువారిచే

**17. హృద్యా యస్య సరస్వతీ సువిమలా తాపా నశేషానపి**
**ద్రాగున్మూలయతి శ్రుతాఽపి భవినాం శుద్ధిం విధత్తే పరామ్ ।**
**భంగం నైతి కదాపి కుత్రచిదపి ప్రాప్తాఽపి గంభీరతాం**
**సోఽవ్యాన్మామతివేలవైభవనిధిః కాంతోపయంతా మునిః ॥**

యస్య = ఏ మణవాళమహామునుల, హృద్యా = హృదయంగమమైన, సువిమలా = మిక్కిలి నిర్మలమైన, సరస్వతీ = సూక్తి, (సరస్వతి) శ్రుతా అపి = వినబడిన మాత్రంలోనే, భవినాం = సంసారుల, తాపాన్ అశేషాన్ అపి = సమస్తతాపాలను, ద్రాక్ ఉన్మూలయతి = వేగంగా పోగొడుతున్నదో, పరాం శుద్ధిం = గొప్ప శుద్ధిని, విధత్తే = కల్గిస్తున్నదో, గంభీరతాం ప్రాప్తా అపి = అర్థంలో గాంభీర్యాన్ని కల్గినది అయినా, (చాలా లోతైనది అయినా) కుత్రచిత్ అపి = ఎక్కడ కూడా, కదా అపి = ఎప్పుడు కూడా, భంగం న ఏతి = అన్యవాదులవల్ల పరాజయాన్ని పొందదో (కెఱటాలను కల్గినది కాదో), సః = ఆ, అతివేల వైభవనిధిః= (అపరిమితమైన వైభవాలకు నిధి అయిన), (తీరాన్ని ముంచెత్తే నీటిని కల్గిఉండే వైభవానికి నిధి అయిన) – కాంతోపయంతా మునిః = శ్రీవరవర మునులు, మామ్ అవ్యాత్ = నన్ను రక్షించాలి.

**18. సమింధే యత్సూక్తి స్సకలసుమనోమౌళివిధృతా**
**శివత్వం సర్వేషా మపి విదధతీ స్వాన్వయవతామ్ ।**
**విధో రత్యాసన్నా నిరవధికపూర్త్యా విలసత**
**స్సదా గంగోత్తుంగా జయతి స ముని స్సుందరవరః ॥**

సకలసుమనోమౌళి విధృతా = అందఱు పండితులచేత శిరోభూషణంగా ధరింప బడినదై, స్వాన్వయవతాం సర్వేషామ్ అపి = తనతో సంబంధాన్ని కలవారికి అందఱికి, శివత్వం విదధతీ = (పరమపావనత్వాన్ని), శివుని స్వభావాన్ని కల్గించేదై, సదా నిరవధిక పూర్త్యా = ఎల్లప్పుడు అంతులేని పరిపూర్తితో, విలసతః = ప్రకాశించే, విధోః అత్యాసన్నా= చంద్రునివలె చల్లనిదైన (చంద్రునకు చాలా సన్నిహితంగా ఉన్నదైన), యత్ సూక్తిః = ఏ మణవాళమహామునుల శ్రీసూక్తి అనే, ఉత్తుంగా గంగా = గొప్ప గంగ, (గంగకంటే – గొప్పదిగా), సమింధే = వెలుగుతున్నదో, సః సుందరవరః మునిః జయతి = ఆ వరవర మునులు సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

**19. సూర్యానందవిధాయినీతి యమునా కాంతోపయంతుః మునేః**
**వాణీవ వ్యవహారభాక్ భవతు సా కిం తావతా స్యాత్ సమా ।**

**శుద్ధేయం న హి సా స్వకం శ్రితవతాం తాపా నశేషా నియం**
**సర్వేషాం వినివార్య కర్తు మమితం శ్రేయః క్షమా నైవ సా ॥**

యమునా = యమునానది, సూర్యానందవిధాయినీ ఇతి =సూర్యునకు ఆనందాన్ని కల్గిస్తున్నదనే కారణంచేత (సూరులకు– అంటే –పండితులకు– ఆనందాన్ని కల్గిస్తున్నదనే కారణంచేత), కాంతోపయంతుః మునేః = శ్రీవరవరమునుల, వాణీ ఇవ = శ్రీసూక్తితో సాటి వచ్చేటట్లుగా, వ్యవహారభాక్ భవతు = వ్యవహరింపబడేదిగా కావచ్చు, తావతా కిం సా సమా స్యాత్ = అంతమాత్రంతో సమం అవుతుందా ఏమి?, ఇయం = ఈ (శ్రీవరవరమునుల) సూక్తి, శుద్ధా = పరిశుద్ధమైనది (స్వచ్ఛమైనది), సా న హి = ఆ యమున = శుద్ధమైనది కాదుకదా (నల్లని వర్ణాన్ని కల్గినదికదా), ఇయం స్వకం శ్రితవతాం= ఈ సూక్తి తన సంబంధాన్ని పొందిన, సర్వేషాం = అందఱికి, తాపాన్ అశేషాన్ = అన్ని తాపాలను, వినివార్య = పూర్తిగా పోగొట్టి, అమితం శ్రేయః = అంతు లేని శ్రేయస్సును, కర్తుం = చేయడానికి (కల్గించడానికి) క్షమా = సమర్థురాలు, సా తు న ఏవ = ఆ యమున అయితే అటువంటిది కానే కాదు.

**20. విహరతి యమునాయాః స్రోతసీవాతిహృద్యే**
**వచసి మనసి చ శ్రీమాధవో యస్య నిత్యమ్ ।**
**నిరుపమమహిమానం యోగినం తం మహాంతం**
**నిరుపధిగుణకాంతం చింతయ స్వాంత ! నిత్యమ్ ॥**

స్వాంత = ఓ మనసా !, శ్రీమాధవః = శ్రీమాధవుడు, యమునాయాః = యమున యొక్క స్రోతసి ఇవ = ప్రవాహంలోవలె, యస్య =ఏ మణవాళమహామునుల యొక్క, అతిహృద్యే = అత్యంతభోగ్యమైన, వచసి = సూక్తిలో, మనసి చ = మనస్సులోను, నిత్యం = సదా, విహరతి = విహరిస్తూ ఉన్నాడో, తం = ఆ, నిరుపమ = సాటిలేని, మహిమానం = మహిమను కలవారు, నిరుపధిగుణకాంతం = సహజమైన కల్యాణగుణాలతో ఆకర్షణీయులు అయిన, మహాంతం యోగినం = పెరియజీయర్‌ను (వరవరమునులను), నిత్యం చింతయ = ఎల్లప్పుడు చింతించు.

మాధవుడైన శ్రీకృష్ణుడు అతిమనోహరమగు యమునానదీ ప్రవాహములోవలె మణవాళమహామునుల వాక్కులో, మనస్సులో నిత్యము క్రీడించుచున్నాడు. (శ్రీవరవర మునుల శ్రీసూక్తియు, మనస్సును యమునవలె శ్రియఃపతికి విహారస్థలములు), గొప్ప మహిమను కలవారు, స్వాభావికములగు గుణములచే అతిమనోహరులై యున్నవారు, మహాత్ములగు ఆ మణవాళ మహామునులను, ఓ మనసా! నీవు నిత్యము అనుసంధింపుము.

**21. కృతావగాహా జనతా యదీయసారస్వతస్రోతసి తుంగభద్రా।**
**సంసేవ్యమానా కవిభి స్సమింధే పాయా త్స నః కాంతవరో మునీంద్రః ॥**

యదీయ సారస్వతస్రోతసి = ఏ మణవాళమహామునుల శ్రీసూక్తి ప్రవాహంలో, కృతావగాహా = అవగాహనాన్ని చేసిన (స్నాన మాడిన), జనతా = శిష్యజనసమూహం, తుంగభద్రా (సతీ) = మంచిని – మంగళాన్ని కల్గినదై (గొప్ప తుంగభద్రయై), కవిభిః = విద్వాంసులచే (సారసపక్షులచే), సంసేవ్యమానా సమింధే = సేవింపబడేదై ప్రకాశిస్తున్నదో, సః కాంతవరః మునీంద్రః = ఆ రమ్యజామాతృమునీంద్రులు, నః పాయాత్ = మనలను రక్షించాలి.

**22. యద్వాణీం మధురా మవాప్య సుధియః సాకేతధామత్యజో**
**మాయాసంగవిదూరగాశ్చ సుతరాం సంత్యక్తకాశ్యాశ్రయాః ।**
**కాంచ్యాదిష్వపి నిస్పృహాశ్చ సతతం రామానుజైకాంతినో**
**రాజంతే స తనోతు సుందరవరో యోగీశ్వరో న శ్శుభమ్ ॥**

సుధియః = విద్వాంసులు, మధురాం యద్వాణీమ్ అవాప్య = ఏ మణవాళమహా మునుల మధురమైన శ్రీసూక్తిని పొంది (ఏ మణవాళ మహామునులయొక్క శ్రీసూక్తి అనే మధురను పొంది), సాకేతధామత్యజః = శ్రీరాముని ఉపేక్షించినవారై (అయోధ్యను విడచినవారై), మాయా సంగవిదూరగాః చ = ప్రాకృతిక సంగంలో అభినివేశాన్ని లేనివారై (మాయాఅనే హరిద్వారలో అభినివేశాన్ని లేనివారై), సుతరాం సంత్యక్తకాశీ+ఆశ్రయాః = కాశిని ఆశ్రయంగా కలవాడైన శివుని విడచినవారై (కాశీనగరంలో ఆశ్రయాన్ని పూర్తిగా విడచిపెట్టినవారై), కాంచ్యాదిషు అపి నిస్పృహాః చ = స్త్రీ భూషణాలలో వ్యామోహాన్ని లేనివారై (కాంచీ మొదలైన నగరాలలో ఆసక్తిని లేనివారై), సతతం రామానుజ+ ఏకాంతినః= ఎల్లప్పుడు భగవద్రామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని కలవారై (ఎల్లప్పుడు శ్రీకృష్ణుని పట్ల అనన్యభక్తిని కలవారై) రాజంతే = ప్రకాశిస్తున్నారో, సః సుందరవరః యోగీశ్వరః= ఆ రమ్యజామాతృయోగీశ్వరులు, నః శుభం = మనకు శుభాన్ని, తనోతు = విస్తరింప జేయాలి.

**23. యద్వాణీ మపరాజితాం మధుజిదుల్లాసాస్పదం సంతతం**
**శేషాహీనబలద్విజేంద్రమహితాం ముక్తావళీబంధురామ్ ।**
**శుద్ధ స్సంప్రతిపద్య హృష్యతి జనో నోపైతి పాపోత్తరః**
**తస్మాత్కాంతవరా న్మునే రనుపమా ద్దైవం పరం నాద్రియే ॥**

జనః = శిష్యజనం, మధుజిత్+ఉల్లాస+ఆస్పదం = మధువు కంటే తీయని గొప్పతనానికి ఆస్పదము (మధుజిత్ అనబడే భగవానుని ఆనందానికి ఆస్పదము), సతతం= ఎల్లప్పుడు, శేష+అహీనబలిద్విజేంద్రమహితాం = శేషభూతులై, ఏకొఅత లేని సత్కారాన్ని కలవారైన శ్రీవైష్ణవులచే సేవింపబడినది (ఆదిశేషుడనే సర్పరాజు, గొప్ప బలాన్ని కల విష్వక్సేనుడు, గరుడుడు – అనే వీరిచే సేవింపబడినది), ముక్తావలీబంధురామ్ = ముత్యాల మాలవలె అందమైనది (ముక్తుల సమూహంతో నిండినది) అయిన, యద్వాణీం = ఏమణ వాళమహామునుల శ్రీసూక్తి అనే, అపరాజితాం = పరమపదాన్ని, సంప్రతిపద్య = పొంది, శుద్ధః = పవిత్రమైనదై, నిర్ధూతపాప+ఉత్కరః = పాపసమూహాలను విదలించు కొన్నదై, హృష్యతి = సంతోషిస్తున్నదో, తస్మాత్ = ఆ, కాంతవరాత్ మునేః = రమ్యజా మాతృమునులకంటే, పరం దైవం = వేఱొక దైవాన్ని, న+ఆద్రియే = ఆదరించను.

**24. యద్వాణీవిరజావగాహనకలాధౌతాత్మనా మాత్మనాం**
**ప్రజ్ఞాతర్జితనిర్జరేశ్వరగురుప్రౌఢిం సమాఢౌకతే ।**
**భక్తిః శ్రీశతదీయదేశికపదాధారా జరీజృంభతే**
**ముక్తి ర్యాతి కరాపచేయఫలతాం సోఽవ్యాద్వరోఽస్మాన్మునిః ॥**

యద్వాణీ = ఏమణవాళమహామునుల శ్రీసూక్తి అనే, విరజా + అవగాహన కలాధౌతాత్మనాం = విరజానదిలో స్వల్పంగా అవగాహించడంచేత పవిత్రమైన స్వరూపాన్ని కలవారి, ఆత్మనాం = ఆత్మలయొక్క (మహాత్ములయొక్క), ప్రజ్ఞా = బుద్ధి, తర్జితనిర్జరేశ్వర గురుప్రౌఢిం = బృహస్పతియొక్క గొప్పతనాన్ని సైతం జయించిన గొప్పతనాన్ని, సమాఢీకతే = పొందుతున్నదో, భక్తిః = భక్తి, శ్రీశతదీయదేశికపద+ఆధారా= శ్రియఃపతియొక్క, ఆ స్వామి భక్తులయొక్క, ఆచార్యులయొక్క, శ్రీచరణాలను ఆధారంగా కల్గినదై, జరీజృంభతే = వృద్ధి అవుతున్నదో, ముక్తిః = ముక్తి, కరాపచేయఫలతాం = చేతితో కోసుకోదగిన ఫలం యొక్క స్థితిని, యాతి = పొందుతున్నదో, సః వరమునిః అస్మాన్ అవ్యాత్ = ఆ సుందర జామాతృముని మలను రక్షించాలి.

**25. యచ్ఛిష్యా స్తిష్యడింభప్రతిమకుమతిదుస్తర్కసంపర్కజాత-**
**త్రయ్యంతస్వాపరూపాప్రతిమనిరవధిధ్వాంతకల్పాంతసూర్యాః।**
**శ్రీమద్రామానుజార్యోదితమతమమతామూర్తయః కీర్తిమంతో**
**జాగ్రత్యస్మై నమస్తాత్ వరవరమునయేఽనంతనిస్తుల్యభూమ్నే ॥**

యచ్ఛిష్యాః = ఏ మణవాళమహామునుల శిష్యులు, తిష్యడింభప్రతిమకుమతి = కలిపురుషుని కుమారులతో సమానులైన దృష్టుల, దుస్తర్కసంపర్కజాత = దుస్తర్కాల సంబంధంవల్ల కల్గిన, త్రయ్యంతస్వాపరూప = వేదాంతాల నిద్రరూపంలోని, అప్రతిమ = సాటిలేని, నిరవధి = అంతు లేని, ధ్వాంత = చీకటిని పోగొట్టే, సూర్యాః= సూర్యుని వంటివారు, శ్రీమద్రామానుజార్య +ఉదితమత = భగవద్రామానుజాచార్యుల వారివల్ల ఉదయించిన దర్శనంపట్ల, మమతా = భక్తియే, మూర్తయః = మూర్తయః = మూర్తీభ వించినవారుగా, కీర్తిమంతః = యశస్సును కలవారుగా, జాగ్రతి = వెలుగుతున్నారో, అనంతనిస్తుల్యభూమ్నే = అంతు లేని, సాటి లేని గొప్పతనాన్ని కల్గిన, అస్మై వరవరమునయే = ఈ శ్రీవరవరమునులకు, నమః స్యాత్ = నమస్కారం అగుగాక !

**26. అనిమిషతను బ్రహ్మో నిర్వేదభావనిబంధనం**
**భజతి కిల య శ్శ్రీమన్మత్స్యావతారతులాం హరేః ।**
**స జయతి సతాం సంఘ స్సౌమ్యోపయంతృసమాశ్రయః**
**తమిహ సతతం చేత! స్సేవస్వ సద్గుణశేవధిమ్ ॥**

సౌమ్యోపయంతృసమాశ్రయః = శ్రీవరవరమునులను ఆశ్రయంగా కల, యః సతాం సంఘః = ఏ సత్పురుషుల సమూహం, బ్రహ్మో నిర్వేద భావ నిబంధనం = వేదములకు, బాహ్య–కుదృష్టి వాదులు పల్కు అపార్థములవలన కల్గిన నిర్వేదమును కారణముగా పరిగ్రహించినది (బ్రహ్మకు కల్గిన నిర్వేదమును కారణముగా కల్గినది), అనిమిషతనుః = సదాజాగరూకమై యుండునది (రెప్పపాటు లేని తనువును కల్గినది) అయిన, హరేః శ్రీమత్ మత్స్యావతారతులాం = భగవానుని మత్స్యావతారముతో సామ్యమును, భజతి కిల = పొందుచున్నది కదా, సః = ఆ సత్పు రుషుల సంఘం, జయతి=వర్ధిల్లుతున్నది, చేతః=ఓ మనసా!, సద్గుణ శేవధిమ్= సద్గుణనిలయులైన, తం = ఆ వరవరమునులను, ఇహ సేవస్వ = ఈ లోకంలో ఆరాధింపుమా!

ఇచట ఈ క్రింది పాఠభేదము కానవచ్చుచున్నది.

**వేదరాశి మనఘం సరోజజం ప్రాపయన్నితి విషణ్ణమాశ్రితమ్ ।**
**మత్స్యదేవసదృశో విభాతి యః తం భజేయ వరయోగిశేఖరమ్॥**

యః = ఏ మణవాళమహామునులు, అతివిషణ్ణం = చాలా దుఃఖితుడై (సంసార క్లేశముల వలన మిక్కిలి విషణ్ణులైన), ఆశ్రితం = తనను ఆశ్రయించినవాడైన, సరోజజమ్ = నాభీపద్మం నుండి పుట్టిన బ్రహ్మకు (సరస్సు నుండి అవతరించిన పొయ్కై ఆళ్వార్లనుండి ఉద్భవించిన), అనఘం వేదరాశిం = అనవద్యమైన వేదరాశిని, ప్రాపయన్ = పొందిస్తూ (ఉపదేశిస్తూ), (ఆర్తితో కూడిన ఆశ్రితజనానికి పొయ్కై ఆళ్వార్లనుండి ఉద్భవించిన **"ముదల్ తిరువన్దాది"** అనే దివ్యప్రబంధాన్ని కాలక్షేపంగా ఉపదేశిస్తూ), మత్స్యదేవసదృశః = మత్స్యావతార సదృశులై, విభాతి = వెలుగుతున్నారో, తం = ఆ, వరయోగిశేఖరం భజేయ = రమ్యజామాతృమునిని భజించగలను.

**27. ప్రాపయన్నమృతకాంక్షిణోఽమృతం మందరాగభరణేఽపి సాదరః ।**
**దివ్యకూర్మసదృశో యదాశ్రితః సద్గుణోఽవతు మాం సరోమునిః ॥**

యదాశ్రితః=ఏ మణవాళమహామునులను ఆశ్రయించిన శిష్యులు, అమృతకాంక్షిణః = మోక్షాన్ని పొందగోరేవారికి (అమృతాన్ని పొందగోరే వారికి), అమృతం ప్రాపయన్ = మోక్షాన్ని పొందించేవారై (అమృతాన్ని పొందించేవారై), మందరాగభరణే అపి సాదరః = మంద–రాగ–భరణే అపి = స్వల్పభక్తిని కలవారిని సైతం పోషించడంలో అభినివేశాన్ని కలవారై (మందరపర్వతాన్ని ధరించడంలో శ్రద్ధను కలవారై), దివ్యకూర్మసదృశః = దివ్యకూర్మరూపునితో పోలినవారై, విరాజతే = విశేషంగా ప్రకాశిస్తున్నారో, సః = ఆ, సుందరః మునిః = రమ్యజామాతృముని, మామ్ అవతు = నన్ను రక్షించుగాక !

**28. సౌకర్యవాన్ యత్పదభక్తిశాలీ భవాబ్ధిమగ్నోద్ధరణప్రవీణః ।**
**ఆటీకతే హ్యాద్యకిటే రభిఖ్యాంముని స్స నః పాతు వరోపయంతా ॥**

యత్పదభక్తిశాలీ = ఏ శ్రీమణవాళమహామునుల శ్రీచరణాలలో భక్తితో వెలిగే శిష్యుడు, సౌకర్యవాన్ = సౌకర్యాన్ని కల్గినవాడై, (సూకరత్వాన్ని కల్గినదై), భవ+అబ్ధిమగ్న + ఉద్ధరణ ప్రవీణః సన్ = సంసారసముద్రంలో మునిగినవారికి ఉద్ధరించడంలో సమర్థుడై, ఆద్యకిటేః = ఆదివరాహంయొక్క, అభిఖ్యాం = సామ్యాన్ని (పేరును), ఆటీకతే = పొందుతున్నాడో, సః వరోపయంతా మునిః నః పాతు = ఆ శ్రీవరవరమునులు మనలను రక్షించాలి.

**29. హిరణ్యజిద్యత్పదభక్తిశాలీ నృసింహభావం ప్రకటీకరోతి ।**
**స మే విధత్తా మతులానుభావో వరోపయంతా కుశలాన్యజస్రమ్ ॥**

యత్పదభక్తిశాలీ = ఏ మణవాళమహామునుల శ్రీచరణాలను భక్తితో ప్రకాశించే శిష్యసమూహం, హిరణ్యజిత్ = హిరణ్యాసురుని జయించినదై, (బంగారంలోని వ్యామోహాన్ని జయించినదై), నృసింహభావం = నృసింహమూర్తితో సాటివచ్చే భావాన్ని (గొప్ప మానవుని యొక్క స్వభావాన్ని), ప్రకటీకరోతి = వ్యక్తం చేస్తున్నదో, సః అతులానుభావః = ఆ అంతులేని మహిమను కల, సః వరోపయంతా = ఆ మణవాళమహామునులు, మే = నాకు, అజస్రం = సంతతం, కుశలాని =శుభాలను, విధత్తామ్ = కలుగజేయాలి.

**30. భజతే కిల వామనోపమాం సుమనోవైరిబలిస్మయం హరన్ ।**
**శుభవిక్రమభృద్యదాశ్రితః త ముపాసే వరయోగిశేఖరమ్ ॥**

యత్ ఆశ్రితః = ఏ మణవాళమహామునులను ఆశ్రయించిన శిష్యవర్గం, సుమనోవైరి బలిస్మయం = పండితులకు విరోధులై, బలిష్ఠులైన కుదృష్టుల గర్వాన్ని (దేవతలకు విరోధి అయిన మహాబలియొక్క గర్వాన్ని), హరన్ = హరిస్తున్నదై, శుభవిక్రమభృత్ = పుణ్యతీర్థసంచారాన్ని చేసేదై (మంగళకరమైన త్రివిక్రమక్రమణాన్ని కల్గినదై), వామన+ ఉపమాం భజతే = వామనమూర్తితో సామ్యాన్ని, భజతే = పొందుతున్నదో, తం వరయోగిశేఖరం = ఆ సౌమ్యజామాతృమునిని, ఉపాసే = ఉపాసిస్తున్నారు.

**31. మహీభరకుదృగ్బలక్షపణదక్షిణౌజోభృతో**
**యదంఘ్రిసముపాశ్రయా పరశురామసాధర్మ్యగాః ।**
**జయంత్యఖిలపాపభీమహితవిష్ణుధర్మాన్వితాః**
**స నో వరవరో ముని ర్వితరతు శ్రియం సంతతమ్ ॥**

యత్+అంఘ్రిసముపాశ్రయాః = ఏ మణవాళమహామునుల శ్రీచరణాలను ఆశ్రయించినవారు, మహీభరకుదృక్ బలక్షపణదక్షిణ+ఓజోభృతః = భూమికి భారమైన కుదృష్టిసిద్ధాంతాన్ని చేసేవారి బలాన్ని పోగొట్టడంలో సమర్థమైన మహిమను కలవారై (భూమికి భారం అయిన కుదృష్టిబలాలను– క్షత్రియాధమబలాలను నశింపజేయడంలో సామర్థ్యాన్ని కల తేజస్సును కలవారై), అఖిల = అన్నివిధాలైన, పాప= పాపాలపట్ల, భీ= పాపులందఱికి భీతిని కల్గించే గొప్పవిష్ణు స్వరూపంతో కూడినవారై (భీతిని కలవారై వైష్ణవ ధర్మాన్ని అవలంబించేవారై, లేక, విష్ణుధర్మంలో చెప్పబడిన ధర్మాలను అనుష్ఠించే వారై), అందువల్లనే, పరశురామ సాధర్మ్యగాః = పరశురామునితో సామ్యాన్ని పొందినవారై, జయంతి = సర్వోత్కర్షతో వెల్గుతున్నారో, సః వరవరమునిః = ఆ రమ్యజామాతృముని, నః సంతతం శ్రియం వితరతు = మనకు ఎల్లప్పుడు సంపదను విశేషంగా ఇవ్వాలి.

**32. సహజానఘలక్ష్మణాన్వితా వసుమత్యుద్భవయా శ్రియోజ్జ్వలా ।**
**రఘువర్యసమా యదాశ్రితాః వరయోగీ స శుభం తనోతు నః ॥**

యత్ ఆశ్రితాః = ఏ శ్రీవరవరమునుల శిష్యులు, సహజ + అనఘలక్ష్మణ + అన్వితాః = భరతునితో, శత్రుఘ్నునితో, లక్ష్మణునితో కూడినవారై (సహజంగానే ఏ దోషం లేని లక్షణాలతో కూడినవారై, వసుమత్యుద్భవయా శ్రియా = భూమినుండి ఆవిర్భ వించిన లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవితో, (ధనంతో, బుద్ధితో కల్గిన కీర్తితో), ఉజ్జ్వలాః = గొప్పగా ప్రకాశించేవారై (అందువల్లనే), రఘువీరసమాః =శ్రీరామచంద్రునితో సమానులై ఉన్నారో, సః వరయోగీ నః శుభం తనోతు = ఆ శ్రీవరవరముని మనకు మంచిని విస్తరింపచేయాలి.

ఇందు శ్రీవరవరమునులను ఆశ్రయించినవారు రాఘవుడను దశరథపుత్రునకు సమానమైన వారు అనుచు రెండు శ్లిష్టవిశేషణములద్వారా నిరూపింపబడుచున్నది.

**33. అధిగతబలభద్రాభిఖ్యయా యత్పదాబ్జ-**
**ప్రవణజనసమష్ట్యా వాసుదేవాగ్రజస్య ।**
**అనితరజనలభ్యా లభ్యతే సౌమ్యలక్ష్మీః**
**స జయతు వరయోగీ నిస్తులావేలభూమా ॥**

యత్పదాబ్జ ప్రవణజనసమష్ట్యా = ఏమణవాళ మహామునుల తామరలవంటి పాదాలలో ప్రావణ్యాన్ని కల్గిన శిష్యవర్గంచేత, అధిగతబలభద్రాభిఖ్యయా = బలభద్ర నామాన్ని పొందినదై, (బలం, మంగళం, కీర్తి – అనే వీటిని పొందినదై), అనితరజనలభ్యా = వేఱు ఎవరివల్ల పొందడానికి వీలులేనిదై, వాసుదేవాగ్రజస్య = బలభద్రునియొక్క, సౌమ్యలక్ష్మీః = సౌమ్యశ్రీ, లభ్యతే = పొందబడుతున్నదో, నిస్తుల+అవేలభూమా = సాటి లేని, అంతు లేని అతిశయాన్ని కల్గిన, సః వరయోగీ జయతు = ఆ వరవరముని సర్వోత్కర్షతో వెలగాలి.

**34. సధర్మజాతార్జునచిత్తహర్షప్రధ్వంసిపక్షక్షపణప్రవీణః ।**
**యదాశ్రయాః కృష్ణతులాం భజంతే పాయాత్స నః కాంతవరో మునీంద్రః ॥**

యత్ ఆశ్రయాః = ఏ మణవాళమహామునుల శిష్యులు, సధర్మజాత+ అర్జున చిత్తహర్షప్రధ్వంసి పక్ష క్షపణ ప్రవీణాః సంతః = ధర్మసమూహాలతో, శుభ్రమైన స్వచ్ఛమైన హృదయంతోకూడిన పరమసాత్త్వికులైన వారి హర్షాన్ని ధ్వంసం చేసే అసురప్రకృతుల మతాన్ని నిరసించడంలో సమర్థులై (ధర్మపుత్రునితోకూడిన అర్జునుని యొక్క ఆనందాన్ని పోగొట్టిన కౌరవపక్షాన్ని నశింపజేయడంలో సమర్థులై), కృష్ణతులాం = శ్రీకృష్ణునితో సామ్యాన్ని, భజంతే = పొందుతున్నారో, సః కాంతవరః మునీంద్రః = ఆ శ్రీమణవాళ మహామునులు, నః పాయాత్ = మనలను రక్షించాలి.

**35. కలిదోష మశేషతః క్షితౌ క్షపయన్ కల్కితులా ముపేయివాన్।**
**యదుపాశ్రితసజ్జనః స నః సతతం సౌమ్యవరోఽభిరక్షతు ॥**

యత్ ఉపాశ్రితసజ్జనః = ఏ శ్రీమణవాళమహామునులను ఆశ్రయించిన సజ్జనుడు, క్షితౌ = భూమిలో, కలిదోషం = కలిదోషాన్ని, అశేషతః= పూర్తిగా, క్షపయన్ = పోగొట్టే వాడై (అందువల్ల), కల్కితులాం = కల్కిభగవానునితో సామ్యాన్ని, ఉపేయివాన్ = పొందిన వాడయ్యాడో, సః = ఆ, సౌమ్యవరః = మణవాళమహాముని, నః = మనలను, సతతం = సదా, అభిరక్షతు = రక్షించుగాక !

**36. అహీనభోగప్రవణ స్సమింధే శ్రీరంగధామా కిల రంగభర్తుః।**
**సాధర్మ్య మాస్థాయ యదంఘ్రిభక్తః పాయాత్స నః సౌమ్యవరో మునీంద్రః॥**

యత్ అంఘ్రిభక్తః = ఏ మణవాళమహామునుల శ్రీచరణాలలో భక్తిని కలవాడు. అహీనభోగప్రవణః=శేషభోగంలో – ఆదిశేషుని శరీరంలో ప్రావణ్యాన్ని కల్గినవాడై, (చాలా గొప్ప ముక్తభోగాలలో ఆసక్తిని కల్గినవాడై), శ్రీరంగధామా సన్ =

శ్రీరంగనివాస రసికుడై (శ్రీరంగాన్ని నివాసంగా కలవాడై), రంగభర్తుః సాధర్మ్యం = శ్రీరంగనాథునితో సామ్యాన్ని, ఆస్థాయ= పొంది, సమింధే = ప్రకాశిస్తున్నదో, సః సౌమ్యవరః మునీంద్రః = ఆ వరవరమునులు, నః పాయాత్ = మనలను రక్షించాలి.

**37. వృషాచలస్థితిం భజన్ వహన్ననారతం శ్రియం**
**సుదుర్లభాగమాఖిలార్థదానకేళికీర్తిమాన్ ।**
**విభాతి వేంకటేశవద్యదంఘ్రిసేవినాం గణః**
**స న స్తనోతు మంగళం వరోపయంతృదేశికః ॥**

యత్ అంఘ్రిసేవినాం గణః = ఏ శ్రీమణవాళమహామునుల శ్రీచరణాలను సేవించే శిష్య సమూహం, వృషాచలస్థితిం భజన్ = సిద్ధ ధర్మంలో స్థిరమైన నిష్ఠను కల్గినదై (వృషాచలంలో నివాసాన్ని పొందుతూ), అనారతం = ఎల్లప్పుడు, శ్రియం వహన్ = కైంకర్యసిద్ధిని కలవారై (లక్ష్మిని వక్షస్సులో వహించేవాడై), సుదుర్లభ+ఆగమ+అఖిల+ అర్థదాన కేళికీర్తిమాన్ = మనకు పొందడానికి వీలుకాని పురుషార్థాలను అనుగ్రహించడమనే లీలతో కీర్తిని పొందినవాడై (దుర్లభాలైన, ఆగమాలలో ఉండే అన్ని అర్థాలను సులభంగా ఉపదేశించడం అనే లీలతో కీర్తిని కల్గినదై) వేంకటేశవత్ = శ్రీవేంకటేశ్వరునివలె, విభాతి= ప్రకాశిస్తున్నదో, సః వరోపయం తృయోగిరాట్ = ఆ శ్రీమణవాళమహామునులు, నః మంగళం తనోతు = మనకు మంగళాన్ని విస్తరింపజేయాలి.

**38. భక్తాఖిలార్థాధిగమైకహేతుం శ్రీపుణ్యకోట్యాయతనం యదీయమ్ ।**
**విదంతి సంతో వరదేన తుల్యం వరోముని ర్న స్స తనోతు భద్రమ్ ॥**

యదీయం = ఏ శ్రీమణవాళమహామునులకు చెందినవానిని, (శిష్యవర్గాన్ని), సంతః = సత్పురుషులు, భక్తాఖిలార్థ+ అధిగమ+ ఏకహేతుం = భక్తులకు సకల విషయాలను గ్రహించడంలో కారణమై ఉన్నారో, భక్తుల సకలార్థాల ప్రాప్తికి ముఖ్య హేతువుగా, శ్రీపుణ్యకోట్యాయతనం = శ్రీపుణ్యకోటి అనే విమానాన్ని నివాసస్థానంగా కలవానినిగా, (కోట్ల లెక్కలోని పుణ్యాలకు ఆస్పదంగా ఉండేవానినిగా) అందువల్లనే, వరదేన తుల్యం = వరదరాజస్వామితో సమానంగా, విదంతి = తెలిసికొంటున్నారో, సః = ఆ, వరః మునిః = మణవాళమహామునులు, నః భద్రం తనోతు = మనకు మంగ ళాలను అనుగ్రహించాలి.

**39. కాంతం వరం ప్రాప్య సతీ మదీయా మతిః పరస్మిన్ పురుషే విరక్తా ।**
**తత్సద్గుణాస్వాదరసైకలోలా పతివ్రతోదాహరణత్వ మేతు ॥**

మదీయా = నాయొక్క, మతిః = బుద్ధిః, కాంతం వరం ప్రాప్య = అందమైన వరుని పొంది (శ్రీమణవాళమహామునులనే వరుని పొంది), పరస్మిన్ పురుషే విరక్తా = ఇతరపురుషుల పట్ల విరక్తిని పొందినదై (భగవానుని విషయంలోకూడా విరక్తిని పొందినదై), తద్గుణ+ఆస్వాదరసైకలోలా సతీ = ఆ వరుని గుణాల అనుభవరసంలో మాత్రమే ఆసక్తిని కల్గినదై, పతివ్రతయై (ఆ మణవాళమహామునుల కల్యాణగుణాల అనుభవంలో మాత్రమే ఆసక్తిని కల్గినదై), పతివ్రతా +ఉదాహరణత్వం = పతివ్రతకు ఉదాహరణంగా ఉండే స్థితిని, ఏతు = పొందాలి.

**40. సరసి కృతవిహారం ధ్యానమాత్రేణ పుంసాం**
**శమితసకలతాపే హంససంసేవ్యమానే ।**
**భజతి ముద మవేలాం సంతతం యస్య చేతః**
**స భవతు వరయోగీ మానసే మామకీనే ॥**

యస్య చేతః = ఏ వరవరమునుల చిత్తం, ధ్యానమాత్రేణ = ధ్యానించుట మాత్రముతోనే, పుంసాం = మానవులయొక్క శమితసకలతాపే = సకలతాపాలను ఉపశమింపచేసే, హంససంసేవ్యమానే = హంసలచేత సేవింపబడే (పరమహంసలుగా

చెప్పబడే నాథయామునయతివరాదులచే సేవింపబడే), సరసి = సరస్సులో (సరోయోగివిషయంలో), కృతవిహారం = చేయబడిన విహారాన్ని కల్గినదై (విహరించినదై), సంతతం =ఎల్లప్పుడు, అవేలాం ముదం భజతి = అంతు లేని ఆనందాన్ని పొందుతున్నదో, సః వరయోగీ = ఆ శ్రీమణవాళమహామునులు, మామకీనే మానసే భవతు = నా మనస్సులో నిలచి ఉండాలి.

**41. సారాసారవివేచనైకరసికం సారస్వతం సారసం**
**సౌరాహారఝరీసహోదరపరీపాకేన లోకోత్తరమ్ ।**
**భక్త్యా శీలయత స్సుశీలజనతోత్తంసం పదాబ్జద్వయం**
**నిత్యం చింతయ చిత్త ! సాదరభరం సౌమ్యోపయంతు ర్మునేః ॥**

సారసారవివేచన+ఏకరసికం = ఇది మంచి, ఇది చెడు –అనే వివేచనలో అద్వితీయ మైన ఆసక్తిని కల్గినది, సౌరాహారఝరీసహోదర పరీపాకేన = దేవతల ఆహారం అయిన అమృతంయొక్క ప్రవాహానికి సహోదరం అయిన– సాటి వచ్చే ఆస్వాదంతో, లోకోత్తరం = అలౌకికమైనదైన, సారసం సారస్వతం = పొయ్కై ఆళ్వార్ల దివ్యప్రబంధాన్ని, భక్త్యా = భక్తితో, శీలయతః = అనుశీలనం చేసే, సౌమ్యోపయంతుః మునేః = శ్రీమణవాళ మహా మునులయొక్క, సుశీలజనతా +ఉత్తంసం = మంచి శీలాన్ని కల సత్పురుషుల సమూహానికి శిరోభూషణమైన, పదాబ్జద్వయం = తామరలవంటి పాదాల జంటను, చిత్త = ఓ మనసా !, సాదరభరం = పూర్ణమైన ఆదరంతో, నిత్యం చింతయ = నిత్యం చింతించు.

**42. భూతార్థస్వోక్తిసందర్శితనిగమశిఖాగూఢతత్త్వార్థజాతే**
**భూతాఖ్యే యోగివర్యే భగవతి సతతం భక్తితో లగ్నచిత్తమ్ ।**
**సేవస్వ స్వాంత ! కాంతం నిరవధికగుణైః క్షాంతికారుణ్యముఖ్యైః**
**కాంతం జామాతరం తం నిరవధికగుణాస్వాదముక్తాన్యసంగమ్॥**

భూతార్థస్వోక్తిసందర్శిత = యథార్థములైన తమ సూక్తులచే దర్శింపజేయబడ్డ, నిగమశిఖాగూఢతత్త్వార్థజాతే= వేదాంతాలలో గూఢంగా ఉండే తత్త్వార్థాల సమూహాన్ని కల్గినవారు, భగవతి =జ్ఞానాదిషాడ్గుణ్యపూర్తిని కలవారు అయిన, భూతాఖ్యే యోగివర్యే = పూదత్తాళ్వార్లపట్ల, సతతం = ఎల్లప్పుడు, భక్తితః = భక్తివల్ల, లగ్నచిత్తం = ఆసక్తమైన మనస్సును కలవారు, క్షాంతికారుణ్యముఖ్యైః = క్షమ, దయమొదలైన, నిరవధికగుణైః = అంతు లేని గుణాలతో, కాంతం = మనోహరులు, నిరవధికగుణ+ ఆస్వాదముక్త+ అన్యసంగం = (ఆ) పూదత్తాళ్వార్లయొక్క అంతులేని గుణాలను ఆస్వాదించడంచేత మిగిలిన విషయాలపట్ల ఆసక్తిని విడచినవారు అయిన, తం = ఆ, కాంతం జామాతరం = రమ్యజామాతృమునిని, స్వాంత= ఓ మనసా !, (సతతం) సేవస్వ = సదా సేవించు.

**43. మహదాహ్వయపాదపద్మయోః మహదుత్తంసితయో ర్మధువ్రతమ్।**
**వరయోగిన మేవ సాదరం మతి రాసీదతు మామికాఽన్వహమ్॥**

మహత్ +ఉత్తంసితయోః = మహాత్ములచే (తిరుమళిశై ఆళ్వార్లచే) శిరోభూష ణంగా చేసికొనబడినవి అయిన, మహదాహ్వయపాదపద్మయోః = మహాయోగి (పూదత్తాళ్వార్ల) యొక్క పాదపద్మాలలో, మధువ్రతమ్ = తుమ్మెదలవలె నిలకడగా ఆదరంతో వర్తించేవారైన, వరయోగినమ్ ఏవ = శ్రీవరవరమునుల విషయంలోనే, మామికా మతిః = నా బుద్ధి, సాదరం = ప్రీతితో, అన్వహం = ప్రతిదినం, ఆసీదతు = పొందుగాక !

**44. శ్రీవిష్ణుచిత్తపదపద్మరజోఽనుషంగాత్**
**చిత్తం యదీయ మరజస్కతయా సమింధే ।**

**అవ్యాజవత్సలతయా ప్రథిత స్సదాఽస్మాన్**
**అవ్యా త్స సుందరవరో మునిసార్వభౌమః ॥**

యదీయం చిత్తం = ఏ మణవాళమహామునుల చిత్తం, శ్రీవిష్ణుచిత్తపద పద్మరజః+ అనుషంగాత్ = శ్రీవిష్ణుచిత్తుల (పెరియాழ్వార్ల) పాదాలనే పద్మాలయొక్క రజస్సు (పుప్పొడి) యొక్క సంబంధంవల్ల, అరజస్కతయా = రజోగుణం (తమోగుణం) లేనిదానిదై, అందు చేత, సమింధే = ప్రకాశిస్తున్నదో, అవ్యాజవత్సలతయా = సహజమైన వాత్సల్యగుణంచేత, ప్రథితః = ప్రసిద్ధులైన, సః సుందరవరః మునిసార్వభౌమః = ఆ రమ్యజామాతృముని సార్వభౌములు, సదా = ఎల్లప్పుడు, అస్మాన్ = మనలను, అవ్యాత్ = రక్షించుగాక !

**45. క్షీరం శర్కరయేవ యద్విహితయా స్వాభిఖ్యయా వ్యాఖ్యయా**
**శ్రీగోదాగురుభారతీ సుమహితా పుష్ణాతి సా మాధురీమ్ ।**
**తస్య శ్రీపదపద్మయుగ్మ మనిశం కాంతోపయంతు ర్మునేః**
**స్మారం స్మార మహం విధూతదురితో యాయా మనాయాసతః ॥**

యద్విహితయా = ఏ శ్రీమణవాళమహామునులచే చేయబడ్డ (రచింపబడ్డ), స్వ+అభిఖ్యయా వ్యాఖ్యయా = తన పేరును కల్గిన వ్యాఖ్యానముతో, శ్రీగోదాగురుభారతీ= గోదాదేవికి తండ్రి, ఆచార్యులు అయిన పెరియాழ్వార్లయొక్క ఆ శ్రీసూక్తి, సుమహితా = మిక్కిలి గొప్పదై, క్షీరం శర్కరయా ఇవ = చక్కెరతో కూడిన పాలవలె, మాధురీం పుష్ణాతి= మాధుర్యాన్ని నిండుగా కల్గి ఉన్నదో, తస్య కాంతోపయంతుః మునేః = ఆ శ్రీమణవాళ మహామునులయొక్క, శ్రీపదపద్మయుగ్మమ్ = శ్రీచరణాలనే పద్మాల జంటను, అనిశం= నిత్యం, స్మారంస్మారం = మాటిమాటికి స్మరించి, అహం = నేను, విధూతదురితః = పాపాలను విదల్చుకొన్నవాడనై, అనాయాసతః = సులభంగా, యాయామ్ = కాగలను.

**46. యత్కృతా న్మంగళాశాసనా దన్వహం మంగళాని శ్రియో వల్లభో విందతి ।**
**తస్య గోదాగురో ర్మంగళాశాసనం కుర్వతే స్యాన్మహాయోగినే మంగళమ్ ॥**

యత్కృతాత్ = ఏ పెరియాழ్వార్లు అనుగ్రహించిన, మంగళాశాసనాత్ = మంగళాశాసనంవల్ల, అన్వహం = ప్రతిదినం, శ్రియః వల్లభః = శ్రియఃపతి, మంగళాని = మంగళాలను, విందతి = పొందుతున్నాడో, తస్య =ఆ, గోదాగురోః = గోదాదేవికి తండ్రి అయిన పెరియాழ్వార్లకు, మంగళాశాసనం = మంగళాశాసనాన్ని, కుర్వతే = చేసే, మహాయోగినే = పెరియజీయర్‌కు, మంగళం = మంగళం.

**47. క్షోణీసారపురీకృతావతరణే స్వీయోక్తిసందర్శితా-**
**శేషామ్నాయశిరోరహస్యనికరే శ్రీభక్తిసారే మునౌ ।**
**భక్త్యా భూషితమానసే వరమునౌ భక్తిం పరాం బిభ్రతో**
**భక్త్యా నిత్య ముపాసిషీయ విలసత్తద్భక్తిధన్యానహమ్ ॥**

క్షోణీసారపురీకృతావతరణే = మహీసారక్షేత్రంలో అవతరించినవారు, స్వీయోక్తి సందర్శిత+అశేష+ఆమ్నాయ శిరోరహస్యనికరే = తమ సూక్తులతో సమస్త వేదాంత రహస్యార్థాలను దర్శింపజేసినవారు అయిన, శ్రీభక్తిసారే మునౌ = శ్రీభక్తిసారమునుల (తిరుమழிశై ఆழ்వార్ల) విషయంలో, భక్త్యా భూషితమానసే = భక్తిచే అలంకరింపబడ్డ మనస్సును కల, వరమునేః = మణవాళ మహామునులయందు, పరాం భక్తిం బిభ్రతః = గొప్ప భక్తిని కల్గి ఉండేవారు, విలసత్ తత్ భక్తిధన్యాన్ = ఆ మణవాళమహామునుల విషయంలో ఉండే భక్తిచేత ధన్యులు అయినవారిని, అహం = నేను, భక్త్యా= భక్తితో, నిత్యం = నిత్యం, ఉపాసిషీయ = సేవించగలను.

**48. యచ్చిత్తం రఘుశేఖరాంఘ్రికమలద్వంద్వైకవందీకృతం**
**తస్య శ్రీకులశేఖరస్య పదయోః సూక్తౌ చ సక్తాశయమ్ ।**
**తద్వద్రంగభుజంగపుంగవగిరిప్రేమానువిద్ధాశయం**
**చేతః ! కాంతవరం విభావయ సదా యోగీశ్వరం సాదరమ్ ॥**

యత్ చిత్తం = ఏ కులశేఖరాళ్వార్ల చిత్తము, రఘుశేఖర+ అంఘ్రికమలద్వంద్వైక వందీకృతం = శ్రీరాముని చరణకమలాల జంటలో బందీగా చేయబడిందో, తస్య= ఆ, శ్రీకులశేఖరస్య = కులశేఖరాళ్వార్ల యొక్క, పదయోః = పాదాలలో, సూక్తౌ చ = సూక్తిలోను, సక్త+ ఆశయం = మిక్కిలిగా ప్రావణ్యాన్ని కల్గిన హృదయాన్ని కలవారు, తద్వత్ = అదే రీతిలో, రంగ = శ్రీరంగనాథునిలో, భుజంగపుంగవగిరి = వేంకటేశ్వరునిలో గల, ప్రేమ = భక్తిచేత, విద్ధ+ఆశయం= ఆర్తితో కూడిన హృదయాన్ని కలవారైన, కాంతవరం యోగీశ్వరం = శ్రీమణవాళ మహామునులను, చేతః = ఓ మనసా !, సదా = ఎల్లప్పుడు, సాదరం = భక్తితో, విభావయ = భావించుము.

**49. శ్రీరంగాధిపదివ్యమంగళవపుస్సౌందర్యసారామృత-**
**స్రోతోమగ్నమునీంద్రవాహనగుణోదన్వన్నిమగ్నాశయమ్ ।**
**చేతః ! కాంతవరం విచింతయ మునిం యచ్చింతనం సంతతమ్**
**కుర్వంతో హి విదంతి దైవ మపరం సంతో న యస్మాత్పరమ్ ॥**

శ్రీరంగ+అధిప = శ్రీరంగనాథునియొక్క, దివ్యమంగళ =దివ్యమైన, మంగళకరమైన, వపుః = విగ్రహంయొక్క, సౌందర్యసార = సౌందర్యసారమనే, అమృత =అమృతంయొక్క, స్రోతః= ప్రవాహంలో, మగ్న = మునిగిన (అవగాహించిన) వారైన, మునీంద్రవాహన = మునివాహనులనే పేరు కల తిరుప్పాణ్ ఆళ్వార్లయొక్క, గుణ+ఉదన్వత్ = గుణ సముద్రంలో, నిమగ్న = పూర్తిగా మునిగిన, ఆశయం = మనస్సును కలవారు, యత్ చింతనం = ఏ మణవాళమహామునులయొక్క చింతనం = ధ్యానమును, సతతం = సదా, కుర్వంతః = చేసేవారై, యస్మాత్ = ఏ శ్రీవరవరమునులకంటే, పరం = ఉత్కృష్ట మైన, అపరం = ఇంకొక, దైవం = దైవమును, సంతః = సత్పురుషులు, న హి విదంతి = తెలియరో, అటువంటి, కాంతవరం మునిం = రమ్యజామాతృమునిని, చేతః= ఓ మనసా , విచింతయ= చింతించుము.

**50. యత్పాదరేణువహనేన సుగంధిమౌళి**
**స్తం బ్రహ్మబం(గ్రం)ధ మధిగచ్ఛతి ముక్తి(క్త)బంధః ।**
**తద్విష్ణుభక్తపదరేణుమునీంద్రభక్తం**
**కాంతోపయంతృముని మన్వహ మాశ్రయేయమ్ ॥**

యత్ పాదరేణువహనేన = ఏ తొండరడిప్పొడి ఆళ్వార్ల పాదరజస్సును దాల్చడం చేత, సుగంధిమౌళిః = సుగంధాన్ని కల్గిన శిరస్సును కలవాడు, ముక్తబంధః= సంసార బంధంనుండి విడివడినవాడై, తం = ఆ, బ్రహ్మబంధం = పరమాత్మతో సంబంధాన్ని, అధిగచ్ఛతి = పొందుతున్నాడో, తత్ విష్ణుపదరేణుమునీంద్రభక్తం = ఆ తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల భక్తులు అయిన, కాంతోపయంతృమునిం = శ్రీమణవాళ మహామునులను, అన్వహం = ప్రతిదినం ఆశ్రయేయం = ఆశ్రయిస్తాను.

**51. యత్పాదుకాత్వ మధిగచ్ఛతి సంయమీంద్రః**
**తస్మిన్ మునౌ వకుళమాలిని బద్ధభావమ్ ।**
**తత్సూక్తిసాగరచతుష్టయపూర్ణచంద్రం**
**సౌమ్యోపయంతృయమినం శరణం వృణేఽహమ్ ॥**

సంయమీంద్రః = భగవద్రామానుజులు, యత్ పాదుకాత్వం = ఏ నమ్మాళ్వార్లకు పాదుకలై ఉండే స్థితిని, అధిగచ్ఛతి= పొందుతున్నాడో, తస్మిన్ వకుళమాలిని మునౌ = ఆ నమ్మాళ్వార్ల విషయంలో, బద్ధభావమ్ = భావబంధాన్ని కలవారు, తత్ సూక్తిసాగర చతుష్టయ = ఆ నమ్మాళ్వార్ల శ్రీసూక్తులనే నాల్గు సముద్రాలకు, పూర్ణచంద్రం = ఆనందాన్ని కల్గించే పూర్ణచంద్రులు అయిన, సౌమ్యోపయంతృయమినం = శ్రీమణవాళమహా మునులను, శరణం = ఉపాయంగా, అహం = నేను, వృణే = వరిస్తున్నాను.

**52. మూర్తో యో భక్తిభూమ్నా మురహరిపదయోః యన్మహిమ్నః కలాఽపి**
**వ్యాసాదీనా మలభ్యా భుజగవిహగరాట్సైన్యభృద్విస్మయాయ ।**
**యత్సూక్తీనాం గరిమ్ణే స్పృహయతి సకలోఽప్యాగమోఽపౌరుషేయః**
**తస్మిన్ న్యస్తాత్మభారః శఠజితి వరయోగ్యస్తు మే స్వస్తి భూమ్నే ॥**

మురహరి పదయోః = మురారి అయిన భగవానుని పదాలలో గల, భక్తిభూమ్నా= భక్తియొక్క అతిశయముతో, యః = ఏ నమ్మాళ్వార్లు, మూర్తః = మూర్తీభవించిన వారో (మురారి పదభక్తి మూర్తీభవించినట్లున్నవారో), యత్ మహిమ్నః = ఎవరి మహిమయొక్క, కలా అపి = ఏకదేశము అయినా, వ్యాసాదీనామ్ అపి అలభ్యా = వ్యాసాది మహర్షులకు సైతము దొరుకదో, భుజగవిహగరాట్ విస్మయాయ = ఆదిశేషునకు, గరుడునకు ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నదో, యత్ సూక్తీనాం = ఏ నమ్మాళ్వార్ల సూక్తుల యొక్క, గరిమ్ణే = గొప్పతనం కోసం, అపౌరుషేయః సకలః ఆగమః అపి = అపౌరుషేయమైన సమస్తవేదము, స్పృహయతి = ఆశపడుతున్నదో, తస్మిన్ శఠజితి = ఆ శఠకోపులలో, న్యస్త+ఆత్మభారః = తన రక్షణ భారాన్ని నిలిపిన, వరయోగీ = మణవాళమహామునులు, మే స్వస్తి భూమ్నే = గొప్ప మంచికోసం, అస్తు = అగుగాక !

**53. శఠారాతిశ్రీమద్వదనసరసీజాతమిహిరః**
**తదీయశ్రీపాదాంబుజమధుకర స్తస్య వచసామ్ ।**
**చతుర్ణాం సింధూనా మమృతకిరణో భక్తజనతా-**
**సురద్రుః పాయా న్మాం వరమునివరోఽవేలమహిమా ॥**

శఠారాతి = నమ్మాళ్వార్లయొక్క, శ్రీమద్వదన = అందమైన వదనమనెడి, సరసీజాత = పద్మానికి, మిహిరః = సూర్యునివంటివారు, తదీయ శ్రీపాదాంబుజ = ఆ నమ్మాళ్వార్ల శ్రీచరణపద్మాలలో, మధుకరః= తుమ్మెదవంటివారు, తస్య = ఆ నమ్మాళ్వార్లయొక్క, వచసాం చతుర్ణాం సింధూనాం = శ్రీసూక్తులనే నాల్గు సముద్రాలను ఉప్పొంగించే, అమృత కిరణః = చంద్రునివంటివారు, భక్తజనతాసురద్రుః = భక్తుల పాలిటి కల్పవృక్షము, అవేలమహిమా = అంతు లేని మహిమను కలవారు అయిన, వరమునివరః = శ్రీమణవాళమహామునులు, మాం = నన్ను, పాయాత్ = రక్షించాలి.

**54. శఠరిపుమునిదృష్టామ్నాయగూఢార్థతత్త్వ-**
**ప్రకటనపటులోకాచార్యసూక్త్యర్థజాతమ్ ।**
**వ్యవృణుత భవభాజాం గుప్తయే యః కృపావాన్**
**భవతు స వరయోగీ శ్రేయసే భూయసే నః ॥**

శఠరిపుముని = నమ్మాళ్వార్లచేత, దృష్ట = దర్శింపబడ్డ, ఆమ్నాయ = ద్రవిడవేదం యొక్క, గూఢార్థతత్త్వ = గూఢాలైన అర్థతత్త్వాలను, ప్రకటన = వ్యక్తం చేయడంలో, పటు = సమర్థాలైన, లోకాచార్య = నమ్బిళ్ళైయొక్క, సూక్తి+అర్థజాతం = శ్రీసూక్తులలోని అర్థాల సమూహాన్ని, భవభాజాం గుప్తయే = సంసారుల రక్షణకోసం, యః కృపావాన్ = కరుణాశాలి అయిన ఏ శ్రీమణవాళమహామునులు, వ్యవృణుత = వివరించారో, సః వరయోగీ = ఆ శ్రీమణవాళమహామునులు, నః శ్రేయసే భూయసే భవతు = మనకు గొప్ప శ్రేయస్సును కల్గించాలి.

**55. తాదృక్కేసరభూషదృష్టచతురామ్నాయాంగషట్కాత్మక-**
**స్వోక్త్యా నందితకేశవః కిల కలిప్రధ్వంసియోగీశ్వరః ।**
**నిత్యోద్బుద్ధయదీయహృత్సరసిజే పుష్ణాతి హంసశ్రియం**
**స శ్రేయాంసి తనోతు నః ప్రతికలం కాంతోపయంతా మునిః ॥**

తాదృక్ = అటువంటి, (అనిర్వచనీయ వైభవాన్ని కల), కేసరభూషదృష్ట = వకుళ భూషణులైన నమ్మాళ్వార్లచే దర్శింపబడ్డ, చతుః ఆమ్నాయ+అంగషట్క+ఆత్మక = నాల్గు వేదాలకు అంగభూతాలైన, ఆఱు ప్రబంధాలుగా ఉండే, స్వోక్త్యా=తన శ్రీసూక్తులతో, నందితకేశవః = కేశవుని ఆనందింపజేసినవారు, కలిప్రధ్వంసి యోగీశ్వరః కిల = కలివైరి సూరి అనబడే తిరుమంగైయాళ్వార్లు కదా! (ఆ ఆళ్వార్లు), నిత్య+ఉద్బుద్ధ = సదా ఉదయించిన – వికసించిన, యదీయ హృత్సరసిజే = ఏ శ్రీమణవాళమహామునుల హృదయమనే పద్మంలో, నిత్యనివాసం చేసే, హంసశ్రియం = హంసయొక్క శోభను, పుష్ణాతి=వర్ధిల్లజేస్తున్నారో, సః కాంతోపయంతా మునిః = ఆ శ్రీమణవాళమహామునులు, ప్రతికలం=ప్రతిక్షణం, నః=మనకు, శ్రేయాంసి = శుభాలను, తనోతు = విస్తరింప జేయాలి.

**56. స్వకరలసచ్ఛితాగ్రకరవాలజితాబ్ధిసుతా-**
**దయితహృతానపాయనిగమాంతనిగూఢధనమ్ ।**
**కలిరిపుయోగివర్య మనిశం హృదయే నిదధత్**
**మనసి విహార మేతు సతతం మమ కాంతవరః ॥**

స్వకర = తనచేతిలో, లసత్ = ప్రకాశించే, శిత+అగ్ర = పదునైన అంచును కల, కరవాలజిత = ఖడ్గంచే జయింపబడ్డ, అబ్ధిసుతాదయిత = శ్రియఃపతినుండి, హృత = హరించిన, అనపాయ = ఏనాడూ నశించని, నిగమాంత = వేదాంతాలోని, నిగూఢధనమ్ = గుప్తధనాన్ని కలవారు అయిన, కలిరిపుయోగివర్యం = కలివైరిసూరి అనబడే తిరుమంగై మన్నన్‌ను, హృదయే = హృదయంలో, అనిశం = సదా, నిదధత్ = భావిస్తున్న, కాంతవరః = శ్రీమణవాళమహామునులు, మమ మనసి = నా మనస్సులో, సతతం = ఎల్లప్పుడు, విహారమ్ ఏతు = విహరించాలి.

**57. యద్ధస్తన్యస్తశస్త్రం శకలయతి కలిం యస్య సారస్వతం తు**
**స్రోతః శ్రోతౄ నశేషానపి సపది హృతాశేషతాపాన్ విధత్తే ।**
**తస్మిన్ నిర్ధూతతిష్యే జగదధిపధనస్తేయనిస్తుల్యభూమ్ని**
**న్యస్తాత్మా స్వస్తి విస్తారయతు మమ సదా సౌమ్యజామాతృయోగీ ॥**

యత్ హస్తన్యస్తశస్త్రం = ఏ తిరుమంగైమన్నన్ చేతిలో ధరించిన ఆయుధం, కలిం = కలిపురుషుని, శకలయతి = ఖండఖండాలుగా చేస్తున్నదో, యస్య = ఏ తిరుమంగైమన్నన్ యొక్క, సారస్వతం స్రోతః తు = ప్రబంధాలనే ప్రవాహం, అశేషాన్ = అందఱిని, హృత+ అశేషపాపాన్ = హరింపబడ్డ సకలపాపాలను కలవారినిగా, సపది = వెంటనే, విధత్తే = చేస్తున్నదో, జగదధిప = లోకేశుడైన భగవానునియొక్క, ధన= ధనాన్ని, (ఆభరణాన్ని), స్తేయ = అపహరించడంలో, నిస్తుల్యభూమ్ని = సాటి లేని వైభవాన్ని కల్గిన, తస్మిన్ నిర్ధూతతిష్యే = కలిని పూర్తిగా నశింపజేసిన ఆ తిరుమంగై మన్నన్‌యొక్క విషయంలో, న్యస్తాత్మా = నిలిపిన, సమర్పించిన, ఆత్మను కలవారైన, సౌమ్యజామాతృయోగీ = శ్రీవరవరమునులు, మమ స్వస్తి = నాకు మంచిని, సదా విస్తారయతు = ఎల్లప్పుడు వర్ధిల్లజేయాలి.

**58. యద్వాణీ రసభూమదారితసుధావేణీ ముదా సంయమి-**
**క్షోణీపాలముఖై స్తదన్యవిముఖై రాస్వాద్యతే సాదరమ్ ।**

**వేదాంతస్పృహణీయవైభవవతీ ఖేదాంతకృద్దేహినాం**
**గోదాం తాం శరణం వ్రజన్ వరవరో మోదాయ నః కల్పతామ్ ॥**

యద్వాణీ = ఏ గోదాదేవియొక్క సూక్తి, రసభూమదారిత = మాధుర్యంచేత చీల్చబడ్డ, సుధావేణీ = అమృతప్రవాహాన్ని కల్గినదై, ముదా = సంతోషంతో, తదన్యవిముఖైః = ఆ గోదాదేవి సూక్తులనుతప్ప మిగిలినవాటిని విడచిపెట్టిన, సంయమిక్షోణీపాలముఖైః = భగవద్రామానుజులు మొదలైన ఆచార్యులచే, సాదరం = ఆదరంతో, ఆస్వాద్యతే = ఆస్వాదింపబడుతున్నదో, వేదాంతస్పృహణీయవైభవవతీ = వేదాంతాలచేతకూడా ఆశ పడతగిన వైభవాన్ని కల్గినది, దేహినాం వేదాంతకృత్ = సంసారుల దుఃఖాలను తీర్చేది అయిన, తాం గోదాం = ఆ గోదాదేవిని, శరణం = శరణంగా, వ్రజన్ = పొందే, వరవరః= శ్రీవరవరమునులు, నః మోదాయ కల్పతామ్ = మనకు ఆనందాన్ని కల్గించాలి.

**59. యత్సూక్తి ర్ముక్తిహేతుం ప్రకటయతి తరా మాగమాంతాధిరూఢం**
**లక్ష్మీకాంతానువాదం స్ఫురదమితగుణాచార్యవర్యాభిధానమ్ ।**
**గోదాం తా మాదరేణ ప్రణిదధతి వరే యోగిని న్యస్తచిత్తాః**
**సంత స్సంతోషవంతో విదధతి భజతాం స్వాంతసంతాపశాంతిమ్ ॥**

యత్ సూక్తిః = ఏ గోదాదేవిసూక్తి, ఆగమాంత+అధిరూఢం = వేదాంతాలలో మిక్కిలి సుప్రసిద్ధమైనది, లక్ష్మీకాంత+అనువాదం = శ్రియఃపతిచేత అనువదింపబడినది– అంగీకరింపబడినది, స్ఫురత్ + అమితగుణ =ప్రకాశించే అంతు లేని కల్యాణగుణాలను కల, ఆచార్యవర్య+ అభిధానం = సదాచార్యులనే పేరును కల్గినది (సదాచార్యుల రూప మైనది) అయిన, ముక్తిహేతుం = చరమపర్వరూపమోక్షసాధనాన్ని, ప్రకటయతి = వ్యక్తం చేస్తున్నదో, తాం గోదాం = ఆ గోదాదేవిని, ఆదరేణ = భక్తితో, ప్రణిదధతి = ధ్యానించే,వరే యోగిని= మణవాళమహామునులలో, సంతోషవంతః= ఆనందాన్ని కలవారై, భజతాం= తమను ఆశ్రయించేవారికి, స్వాంతసంతాపశాంతిం = వారి మనస్సులలోని సంతాపా లకు ఉపశమనాన్ని, విదధతి = కలుగజేస్తున్నారు.

**60. యన్మౌలిస్పర్శదీవ్యత్పరిమళభరితాం మాలికాం మూర్ధ్ని బిభ్రత్**
**ధన్యం స్వం మన్యతే శ్రీనిధి రపి పురుష స్తా మమేయానుభావామ్ ।**
**గోదాం భక్త్యా యతిక్ష్మాపతి మివ సతతం లాలయంతం మహాంతం**
**సేవంతే యోగినం యే హృదయ! కలయ తానన్వహం దేశికేంద్రాన్ ॥**

యత్ మౌలిస్పర్శ = ఏ గోదాదేవి శిరస్సుయొక్క కేశాల (కిరీట) స్పర్శచేత, దీవ్యత్= ప్రకాశించే, పరిమళభరితాం = సువాసనతో నిండిన, మాలికాం =పూమాలికను, మూర్ధ్ని= శిరస్సున, బిభ్రత్ = ధరిస్తూ, శ్రీనిధిః పురుషః అపి = శ్రియః పతి అయిన పరమపురుషుడు కూడా, స్వం ధన్యం మన్యతే = తనను ధన్యునిగా తలుస్తున్నాడో, అమేయ+ అనుభావామ్ = అంతు లేని మహిమను కల, తాం గోదాం = ఆ గోదాదేవిని, యతిపతిమ్ ఇవ = భగవ ద్రామానుజులనువలె, భక్త్యా = భక్తితో, సంతతం లాలయంతం = ఎల్లప్పుడు సంతోష పెట్టేవారైన, మహాంతం యోగినం = పెరియ జీయర్‌ను, యే = ఎవరు, సేవంతే = సేవిస్తున్నారో, తాన్ దేశికేంద్రాన్ = ఆ ఆచార్యవర్యులను, హృదయ = ఓ హృదయమా! అన్వహం = ప్రతిదినం, కలయ = భావించు.

**61. శఠారివైరిమునేః పరం న దైవం విదితం యేన తదేకదైవతేన ।**
**మధురం కవి మాశ్రిత స్తమీడ్యం వరయోగీ విదధాతు భావుకం నః ॥**

తదేకదైవతేన = నమ్మాఌ్వార్లనుమాత్రమే పరదైవంగా కల్గిన, యేన = ఏమధురకవి ఆఌ్వార్లచే, శఠారివైరిమునేః= నమ్మాఌ్వార్లకంటే, పరం =ఇంకొక గొప్ప, దైవం = దైవం, న విదితం = తెలియబడలేదో, ఈడ్యం = స్తుతింపదగినవారైన,

తం మధురం కవిం = ఆ మధురకవి ఆఴ్వార్లను, ఆశ్రితః = ఆశ్రయించిన, వరయోగీ = శ్రీమణవాళ మహామునులు, నః= మనకు, భావుకం = మంగళాలను, విదధాతు = కలుగజేస్తారుగాక!

**62. యత్పాదాబ్జానుబంధ స్సకలతనుభృతాం కల్పతే ముక్తిసిద్ధ్యై**
**యత్సంబంధా త్కరస్థా మమనుత స యతిక్ష్మాపతిః స్వస్య ముక్తిమ్ ।**
**తస్మిన్ కూరాధినాథే నిరవధికగుణే భక్తి మామ్రేడయంతం**
**ముక్త్యై భక్త్యా భజంతో వరముని మనఘాః దేశికా మే దయంతామ్ ॥**

యత్ పాద+అబ్జ+ అనుబంధః= ఏ రామానుజులయొక్క పాదపద్మాల పరంపరా సంబంధం, సకలతనుభృతాం = సమస్త శరీరులకు, ముక్తిసిద్ధ్యై = ముక్తిసిద్ధికోసం, కల్పతే = సమర్థమై ఉన్నదో, సః యతిక్ష్మాపతిః = ఆ భగవద్రామానుజులు, యత్ సంబంధాత్ = ఏ కూరేశుల సంబంధంవల్ల, స్వస్య ముక్తిం = తన ముక్తిని, కరస్థాం = చేతిలో ఉన్నదిగా, అమనుత= తలచారో, నిరవధికగుణే = అంతులేని కల్యాణగుణాలను కల, తస్మిన్ కూరాధినాథే = ఆ కూరత్తాఴ్వానుల విషయంలో, భక్తిమ్ ఆమ్రేడయంతం = భక్తిని ద్విగుణీకృతం చేసికొంటున్న, వరవరమునిం = శ్రీవరవరమునిని, ముక్త్యై = ముక్తికొఱకు, భక్త్యా = భక్తితో, భజంతః = ఆశ్రయించే, అనఘాః = దోషవిదూరులైన, దేశికాః = ఆచార్యులు, మే = నాకు, దయంతామ్= అనుగ్రహిస్తారు గాక !

**63. యతిపతిపదయుగ్మం దైవతం యస్య నాన్యత్**
**త మిహ వటుకపూర్ణం సాదరం భావయంతమ్ ।**
**సతత మభిలషంతం తస్య నిష్ఠాం గరిష్ఠాం**
**వరవరమునివర్యం సంతతం చింతయేయమ్ ॥**

యస్య = ఏ వడుగనంబికి, యతిపతిపదయుగ్మం = భగవద్రామానుజుల శ్రీచరణ యుగం, దైవతం = దైవమో, న+అన్యత్ = ఇంకొకటి కాదో, తం వటుకపూర్ణం = ఆ వడుగనంబిని, ఇహ = ఈ లోకంలో, సాదరం భావయంతం = ఆదరంతో అనుసంధించే వారు, తస్య = ఆ వడుగనంబియొక్క, గరిష్ఠాం నిష్ఠాం = గొప్పదైన, ఆచార్యులే పరదైవమనే నిష్ఠను, సతతమ్ అభిలషంతం = సదా కోరేవారైన, వరవరమునివర్యం = వరవరముని వర్యులను, సంతతం చింతయేయమ్= సదా భావిస్తున్నాను.

**64. శఠరిపుమునిదృష్టసామవేదం**
**వ్యవృణుత యో యతిరాజశాసనేన ।**
**త మిహ శఠజిదాహ్వయం శ్రయంతం**
**వరవరమునివర్య ముపాసిషీయ నిత్యమ్ ॥**

యః=ఏ తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అను ఆచార్యవర్యులు, యతిరాజశాసనేన = భగవద్రామానుజుల ఆజ్ఞతో, శఠరిపుమునిదృష్టసామవేదం = నమ్మాఴ్వార్లచేత దర్శింపబడ్డ సామవేదాన్ని, వ్యవృణుత = వివరించారో, తం శఠజిత్+ఆహ్వయం=శఠకోపులనే పేరును కల ఆ పిళ్ళాన్‌ను, ఇహ = ఈ లోకంలో, శ్రయంతం = ఆశ్రయించే, వరవర మునివర్యం = శ్రీమణవాళమహామునులను, నిత్యం = ప్రతిదినం, ఉపాసిషీయ = ఉపాసిస్తున్నాను.

**65. శఠారిదృష్టవేదమౌళిభావసంప్రకాశకృత్**
**కృతేతరోక్తిమౌళివేద్యయోగిశేఖరే సదా ।**
**శమాదిసద్గుణోదధౌ నిమజ్జతీవ యస్య ధీః**
**వరోపయంతృయోగినం నిరంతరం తమాశ్రయే ॥**

శమాదిసద్గుణ+ఉదధౌ=శమం మొదలైన కల్యాణగుణాలకు సముద్రం వంటివారైన, శఠారిదృష్ట = నమ్మాళ్వార్లచే దర్శింపబడ్డ, వేదమౌళి = ద్రావిడవేదాంతంయొక్క భావసంప్రకాశకృత్ = భావాన్ని వ్యక్తం చేసే, కృతేతరోక్తివేద్యయోగిశేఖరే= యతిశేఖరులైన (వేదాంతి అనబడే) నంజీయర్ విషయంలో, యస్య ధీః = ఏ మణవాళ మహామునుల బుద్ధి, నిమజ్జతీ ఇవ = మునుగుతున్నదివలె ఉన్నదో (అవగాహిస్తున్నదో), తం వరోపయంతృ యోగినం = ఆ శ్రీమణవాళమహామునులను, నిరంతరం సమాశ్రయే = నిత్యం ఆశ్రయిస్తాను.

**66. తతమధురగభీరద్రావిడామ్నాయభాష్యం**
**యదుదిత మిహ సంతః సంతతం శీలయంతి ।**
**స హి విహరతి కృష్ణో దేశికో యస్య చిత్తే**
**స దిశతు వరయోగీ భద్ర మవ్యాహతం నః ॥**

యత్ ఉదితం = ఏ పెరియవాచ్చాన్‌పిళ్ళైవల్ల ఉద్భవించినది, తత మధుర గభీర= విస్తృతమైనది, మధురమైనది, గంభీరమైనది అయిన, ద్రావిడ+ఆమ్నాయ భాష్యం = ద్రావిడవేదవ్యాఖ్యానాన్ని, ఇహ = ఈలోకంలో, సంతతం = నిత్యం, సంతః =సత్పురుషులు, శీలయంతి = అనుసంధిస్తున్నారో, సః కృష్ణః దేశికః = ఆపెరియవాచ్చాన్ పిళ్ళై అనే ఆచార్యులు, యస్య చిత్తే = ఏ మణవాళమహామునుల చిత్తంలో, విహరతి హి = విహరిస్తున్నారో, సః వరయోగీ = ఆ వరవరమునులు, నః = మనకు, అవ్యాహతం భద్రం = అడ్డులేని శుభాన్ని, దిశతు = అనుగ్రహించాలి.

**67. సుధాసింధో రిందో స్సుహృదతిగభీరం సుమధురం**
**యదుక్తం భాష్యం తచ్ఛఠజిదుదితామ్నాయశిరసః ।**
**స కృష్ణార్యః పుష్ణన్ హృది విహరణం యస్య జగతి**
**శ్రియం సంతన్యాన్మే వరమునివరః స ప్రతిదినమ్ ॥**

శఠజిత్+ఉదిత+ఆమ్నాయశిరసః = నమ్మాళ్వార్లవలన ఆవిర్భవించిన ద్రావిడ వేదాంతం అయిన తిరువాయ్‌మొழி ప్రబంధానికి, యదుక్తం భాష్యం = ఏపెరియ వాచ్చాన్‌పిళ్ళైచేత చెప్పబడ్డ వ్యాఖ్యానం (ఇరుపత్తునాలాయిరప్పడి) ఉన్నదో, తత్ = అది, సుధాసింధోః = అమృతసముద్రానికి, ఇందోః = చంద్రునకు, సుహృత్ = మిత్రమో, (వాటివలె ఆహ్లాదాన్ని కల్గించేదో), అతిగభీరం = చాలా గంభీరమైనదో, సుమధురం = చాలా భోగ్యమైనదో, సః కృష్ణార్యః = ఆ పెరియవాచ్చాన్‌పిళ్ళై, యస్య హృది = ఏ శ్రీమణవాళమహామునులయొక్క హృదయంలో, విహరణం పుష్ణన్ = విహారాన్ని చేస్తున్న వారై, జయతి = సర్వోత్కర్షతో వెలుగుతున్నారో, సః వరవరమునివరః = ఆ మణవాళ మహామునులు, ప్రతిదినం =ప్రతిదినం, మే = నాకు, శ్రియం = సంపదను, సంతన్యాత్= విస్తరింపజేయాలి.

**68. నిఖిలనిగమమౌళిసారసారం ప్రథయతి యద్ద్రావిడాగమాంతభాష్యమ్ ।**
**తదిహ జయతి యత్ప్రసాదశీతం హృదయ ! సదా వరయోగినం భజస్వ ॥**

యత్ ద్రావిడ+ఆగమాంతభాష్యం = ఏపెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన ద్రావిడ వేదాంతభాష్యం (తిరువాయ్‌మొழி వ్యాఖ్యానం), నిఖిలనిగమమౌళిసారసారం = సమస్త వేదాంతాల సారంలోని సారాన్ని, ప్రథయతి = ప్రకాశింపజేస్తున్నదో, తత్ = ఆ వ్యాఖ్యానం, యత్ ప్రసాదశీతం = ఏ మణవాళమహామునుల అనుగ్రహంవల్ల చల్లనిదై, జయతి = సర్వోత్కృష్టంగా ఉన్నదో, వరయోగినం = ఆ మణవాళమహానులను, హృదయ = ఓ హృదయమా, సదా భజస్వ = సదా భజించు.

**69. సుధాసారాకారం సకలనిగమాంతార్థముకురం**
**యదుక్తం తత్ పారాంకుశనిగమభాష్యం శరణయన్ ।**
**సమింధే యత్సంఘః స విహరతి కృష్ణో గురువరః**
**సదా యచ్చిత్తే తం వరవర ముపాసే మునివరమ్ ॥**

యత్ ఉక్తం = ఏ వడక్కుత్తిరువీథిపిళ్ళై అనుగ్రహించిన, సుధాసార+ ఆకారం = అమృతప్రవాహరూపమై, సకలనిగమాంతార్థముకురం = సమస్తవేదాంతార్థాలను ప్రతిఫలించే అద్దమై ఉండే, పారాంకుశనిగమభాష్యం = నమ్మాళ్వార్ల వేదం అయిన తిరువాయ్మొళ్రియొక్క వ్యాఖ్యానం ఉన్నదో, తత్ = ఆ భాష్యాన్ని, శరణయన్ = శరణంగా చేసికొంటూ, యత్ సంఘః = ఏ వడక్కుత్తిరువీథి ప్పిళ్ళై శిష్యసంఘం, సమింధే = ప్రకాశిస్తున్నదో, సః కృష్ణః గురువరః = ఆ వడక్కుత్తిరువీథిప్పిళ్ళై, యచ్చిత్తే = ఏ మణవాళ మహామునుల చిత్తంలో, సదా విహరతి = ఎల్లప్పుడు విహరిస్తున్నారో, తం వరవరం మునివరం = ఆ మణవాళమహామునులను, ఉపాసే = ఉపాసిస్తున్నాను.

**70. సర్వజ్ఞేన ధృతా హి యేన శిరసా సా కృష్ణపాదోద్భవా**
**శ్రీపారాంకుశవేదమౌళివివృతిః స్వర్వాహినీసోదరీ ।**
**తాపం సర్వ మపాకరోతి భవినాం ధత్తే పరాం నిర్వృతిం**
**సేవే తస్య పదాబ్జయుగ్మ మనిశం సౌమ్యోపయంతు ర్మునేః ॥**

సర్వజ్ఞేన యేన = సర్వజ్ఞులైన శ్రీమణవాళమహామునులచే, కృష్ణపాదోద్భవా = వడక్కుత్తిరువీథిప్పిళ్ళైవల్ల ఉద్భవించిన (కృష్ణశబ్దవాచ్యుడైన భగవానుని పాదాలనుండి పుట్టిన), సా= అనిర్వాచ్యమైన ఆ, స్వర్వాహినీసోదరీ = గంగానదికి సహోదరి అయిన, (గంగానదితో సమానమైన), శ్రీపారాంకుశవేదమౌళివివృతిః = నమ్మాళ్వార్ల వేదం అయిన తిరువాయ్ మొళ్రియొక్క వ్యాఖ్య, శిరసా ధృతా = శిరసా వహింపబడినదో, సా = ఆ వ్యాఖ్య, భవినాం = సంసారుల, తాపం సర్వం = తాపాన్ని అంతటినీ, అపాకరోతి = తొలగిస్తున్నదో, పరాం నిర్వృతిం ధత్తే = బ్రహ్మానందాన్ని కల్గిస్తున్నదో, తస్య సౌమ్యోపయంతుః మునేః = ఆ మణవాళమహామునులయొక్క, పదాబ్జయుగ్మం = పదపద్మాల జంటను, అనిశం సేవే = నిత్యం సేవిస్తున్నాను.

**71. శఠరిపునిగమార్థతత్త్వబోధం జనయతి యః కిల వాదిసింహఘోషః ।**
**వరవరమునివర్య మాశ్రయే తత్ ప్రవణధియం ప్రశమాదిసద్గుణాఢ్యమ్ ॥**

యః వాదిసింహఘోషః = ఏ అళ్రకియమణవాళ చ్చీయర్ అనే ఆచార్యులయొక్క నాదం (వ్యాఖ్య), శఠరిపునిగమార్థ తత్త్వబోధం = నమ్మాళ్వార్ల తిరువాయ్మొళ్రి ప్రబంధంలోని తత్త్వం యొక్క జ్ఞానాన్ని, జనయతి కిల = కల్గిస్తున్నదో, తత్ ప్రవణధియం = ఆ జీయర్ విషయంలో ప్రావణ్యాన్ని కల్గిన బుద్ధిని కలవారు, ప్రశమ+ఆది సద్గుణ + ఆఢ్యం = శమాది సద్గుణాలతో గొప్పవారు అయిన, వరవరమునివర్యం = వరవర మునులను, ఆశ్రయే =ఆశ్రయిస్తున్నాను.

**72. సరఃప్రభృతిదివ్యసూర్యుదితదివ్యసూక్త్యాశయ-**
**ప్రకాశనసముద్భవానితరాలభ్యకీర్త్యుజ్జ్వలమ్ ।**
**గురుం హృది విభావయన్ వరముని ర్హి కృష్ణాహ్వయం**
**మదీయహృదయే సదా సకరుణం విధత్తాం స్థితిమ్ ॥**

సరఃప్రభృతి = సరోయోగి మొదలుగా గల, దివ్యసూరి = ఆళ్వార్ల వలన, ఉదిత = ఉదయించిన, దివ్యసూక్తి = దివ్యప్రబంధాల, ఆశయ = తాత్పర్యాన్ని, ప్రకాశన = వ్యక్తం చేయడం వల్ల, సముద్భవ = పుట్టిన, అనితరకీర్తి+ఉజ్జ్వలమ్= అసాధారణమైన కీర్తితో ప్రకాశించేవారు అయిన, కృష్ణాహ్వయం గురుం = పెరియవాచ్చాన్పిళ్ళై అనే ఆచార్యులను, హృది విభావయన్ = హృదయంలో మిక్కిలిగా భావిస్తూ ఉండేవారైన, వరమునిః = శ్రీవరవరమునులు, సకరుణం = దయతో, మదీయ హృదయే = నా హృదయంలో, స్థితిం విధత్తామ్ = స్థితిని చేయుదురు గాక! (నిత్యనివాసం కల్గి ఉందురు గాక !)

**73. రహస్యత్రయాఖ్యం జగద్దేశికోక్తం రహస్యత్రయాంతర్గతార్థప్రదీపమ్ ।**
**వివవ్రే జగద్గుప్తయే యః కృపాబ్ధిః స నః పాతు రమ్యోపయంతా మునీంద్రః ॥**

జగద్దేశిక+ఉక్తం = శ్రీపిళ్ళైలోకాచార్యులవారిచేత చెప్పబడినది, రహస్యత్రయ+ అంతర్గత + అర్థప్రదీపం = మూడు రహస్యాలు అయిన అష్టాక్షరి, ద్వయ, చరమ శ్లోకాలలోని అర్థాలను విశేషంగా ప్రకాశింపజేసేది అయిన, రహస్యత్రయ + అఖ్యం = రహస్యత్రయమనే పేరును కల ముముక్షుప్పడిని, జగద్గుప్తయే = లోకరక్షణార్థం, యః కృపాబ్ధిః = కరుణాసముద్రులైన ఏమణవాళమహామునులు, వివవ్రే = వివరించారో, సః రమ్యోపయంతా మునిః = ఆ మణవాళమహామునులు, నః పాతు = మనలను రక్షించాలి.

**74. శ్రీమల్లోకగురూదితా శ్రుతిశిరస్సిద్ధాంతసంజీవినీ**
**సా తత్త్వత్రితయాహ్వయా కిల కృతిః యద్వ్యాఖ్యయాఽలంకృతా ।**
**శ్లాఘాలోలఫణీంద్రమౌళివిలసద్రత్నాంశునీరాజితా**
**పాయా న్న స్సతతం స సుందరవరో యోగీ గుణై స్సుందరః ॥**

యద్వ్యాఖ్యయా = ఏ మణవాళమహామునుల వ్యాఖ్యారూపమైన శ్రీసూక్తిచే, అలంకృతా = అలంకరింపబడినది, శ్రీమల్లోకగురు+ ఉదితా = శ్రీపిళ్ళైలోకాచార్యుల వారిచేత ఉదయించినది, శ్రుతి శిరఃసిద్ధాంతసంజీవనీ = వేదాంతసిద్ధాంతానికి సంజీవిని అయిన, తత్త్వత్రితయి+ఆహ్వయా = తత్త్వత్రయమనే పేరును కల్గినది అయిన, సా కృతిః = ఆ గొప్ప కృతి, శ్లాఘాలోల = మాధుర్యంచేత, ప్రశంసించడంలో ఆసక్తుడైన, ఫణీంద్ర = ఆదిశేషునియొక్క, మౌళి = శిరస్సులలో (పడగలతో), విలసత్ = విశేషంగా ప్రకాశించే, రత్న+అంశు = రత్నాల కిరణాలచేత, నీరాజితా = హారతి ఇవ్వబడినది, గుణైః సుందరః = కల్యాణగుణాలతో ఆకర్షణీయులైన, సః సుందరవరః యోగీ = ఆ మణవాళ మహామునులు, నః సతతం పాయాత్ = మనలను సదా రక్షించాలి.

**75. శ్రుతిస్మృతిసరోమునిప్రభృతిసూరిసూక్తిస్ఫురత్-**
**ప్రసూనరచితాతులానఘవరార్యసూక్తిస్రజః ।**
**బిభర్తి శుభసౌరభశ్రియ ముదార యద్భారతీ**
**స మే దిశతు సుందరో వరముని శ్శుభం శాశ్వతమ్ ॥**

శ్రుతి = శ్రుతులలో, స్మృతి = స్మృతులలో, సరోముని ప్రభృతి సూరి సూక్తి = పొయ్‌కై ఆళ్వార్లు మొదలైన దివ్యసూరుల సూక్తులలో, స్ఫురత్ = ప్రకాశించే, ప్రసూన= పూలచేత (పూలవంటి వాక్యాలచేత), రచిత = రచింపబడ్డ, అతుల = సాటి లేని, అనఘ= పాపరహితులైన, వరార్య = శ్రీ పిళ్ళైలోకాచార్యులవారియొక్క, సూక్తి =సూక్తులనే, స్రజః = పూమాలికకు, శుభసౌరభశ్రియం = మంగళకరమైన పరిమళ సంపదను, ఉదార = ఉదారులైన, యద్భారతీ = ఏమణవాళమహామునుల, బిభర్తి =భరిస్తున్నదో, సః సుందరమునిః = ఆ రమ్యజామాతృముని, శాశ్వతం శుభం = శాశ్వతమైన మంగళాన్ని, మే = నాకు, దిశతు = కల్గించాలి.

**76. జగద్గురువరానుజగ్రథితచిత్రగుర్వాశయా-**
**భిధానకృతిసంప్రకాశనపటీయసే యత్కృతిః ।**
**అనన్యసులభాం వ్యనక్త్యనఘశేముషీనైపుణీం**
**స మే వరవరో ముని ర్వితరతు శ్రియం భూయసీమ్ ॥**

యత్ కృతిః = ఏ మణవాళమహామునుల వ్యాఖ్య, జగద్గురువర+అనుజ = శ్రీపిళ్ళై లోకాచార్యులవారి అనుజులైన అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్‌చే, గ్రథిత = కూర్చబడ్డ, చిత్ర = ఆశ్చర్యకరమైన, గురు+ఆశయ + అభిధానకృతి = ఆచార్య హృదయమనే గ్రంథాన్ని, సంప్రకాశనపటీయసీ = ప్రకాశింపజేయడంలో సమర్థమైనదో, అనన్యసులభాం = ఇతరులకు సులభం కాని, అనఘశేముషీనైపుణీం = ఏ దోషం లేని, బుద్ధినైపుణ్యాన్ని, వ్యనక్తి = వ్యక్తం చేస్తున్నదో, సః వరవరమునిః = ఆ వరవరముని, మే = నాకు, భూయసీం శ్రియః = అధికమైన జ్ఞానసంపదను, వితరతు = అనుగ్రహించాలి.

**77. కృత్వానేకాన్యహాన్యప్రతిమనయమహాశాస్త్రసంపాతఘోరం**
**తత్తాదృగ్వాదయుద్ధం యతిపతి రనయద్యం విజిత్య స్వపక్షమ్ ।**
**తత్ప్రోక్తం మానసారం వ్యవృణుత కిల యో మేయసారం చ గమ్యమ్**
**తస్మై నిత్యం నమస్తాత్ వరవరమునయే నిస్తులోదారభూమ్నే ॥**

అనేకాని అహాని = పలు దినాలు, అప్రతిమ = సాటి లేని, నయ = న్యాయాలతో కూడిన, మహాశాస్త్ర = గొప్ప శాస్త్రాలయొక్క, సంపాత = ప్రయోగంచేత, ఘోరం = భయంకరమైనది అయిన, తత్తాదృక్ = అనిర్వచనీయం అయిన, వాదయుద్ధ = వాదమనే యుద్ధాన్ని, విజిత్య = జయించి, యం = ఏ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే ఆచార్యులను, యతిపతిః = భగవద్రామానుజులు, స్వపక్షం = తన పక్షంలోకి, అనయత్ = తీసికొనివచ్చారో, తత్ ప్రోక్తం = ఆ అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్లచే రచింపబడ్డ, గమ్యం మానసారం = తెలియదగిన జ్ఞానసారం అనే గ్రంథాన్ని, మేయసారం చ = ప్రమేయసారమనే గ్రంథాన్ని, యః = ఏ మణవాళ మహామునులు, వ్యవృణుత = వ్యాఖ్యానించారో, నిస్తుల+ఉదారభూమ్నే= సాటి లేని గొప్ప వైభవాన్ని కల్గిన, తస్మై వరవరమునయే = ఆ మణవాళమహామునులకొఱకు, నిత్యం నమః స్తాత్ = నిత్యం నమస్కారం ఉండాలి.

**78. ప్రపన్నానాం గాయత్ర్యమృతకవిదృష్టా యతిపతిం**
**స్తుతి ర్యద్వ్యాఖ్యాతా ప్రజనయతి సత్త్వోత్తరముదమ్ ।**
**అజస్రం నః పాయా ద్వరమునివరః శీలకరుణా-**
**క్షమావాత్సల్యాద్యై రనవధికగుణౌఘై స్స మధురః ॥**

అమృతకవిదృష్టా = శ్రీరంగామృతకవి అనబడే తిరువరఙ్గత్తముదనార్‌చేత దర్శింప బడినది, యతిపతిస్తుతిః = భగవద్రామానుజుల స్తుతిరూపమైనది అయిన, ప్రపన్నానాం గాయత్రీ = ప్రపన్నగాయత్రి అనబడే ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది ప్రబంధం, యద్వ్యాఖ్యాతా = ఏ మణవాళమహామునులచేత వ్యాఖ్యానింపబడినదై, సత్త్వోత్తర ముదమ్ ప్రజనయతి = పరమసాత్త్వికులైన శ్రీవైష్ణవులకు ఆనందాన్ని కల్గిస్తున్నదో, శీలకరుణాక్షమావాత్సల్యాద్యైః = సౌశీల్యం దయ, క్షమ, వాత్సల్యం మొదలైన, అనవధికగుణ+ ఓఘైః = అంతు లేని గుణాల సమూహంతో, మధురః = భోగ్యులైన, సః వరమునివరః = ఆ శ్రీమణవాళ మహామునులు, నః పాయాత్ = మనలను రక్షించుగాక!

**79. విష్ణో ర్యద్దర్శనార్చాసరణి మనుసరన్ అర్చనం సత్త్వభాజాం**
**సంఘః సర్వోఽపి కుర్వన్ జయతి గుణనిధిః తత్కటాక్షైకపాత్రమ్ ।**
**తస్మాత్కాంతోపయంతుః ప్రణతజననిధేః శ్రీమతో దేశికేంద్రాత్**
**నాహం నాహం న జానే పర మిహ శరణం దైవతం నైవ జానే ॥**

యత్ దర్శన + అర్చాసరణిం = ఏమణవాళమహామునులచేత రచింపబడినది, మన దర్శనానికి అనుగుణమైనది అయిన, **"జీయర్ పడి"** అనే తిరువారాధనక్రమాన్ని, అనుసరన్ = అనుసరిస్తూ, విష్ణోః అర్చనం = విష్ణువుయొక్క ఆరాధనను, కుర్వన్ = చేస్తూ, గుణనిధిః = సద్గుణాలకు నిధి అయిన, సత్త్వభాజాం సంఘః= సాత్త్వికులైన శ్రీవైష్ణవసమూహం, తత్కటాక్ష+ఏకపాత్రం = ఆ మణవాళమహామునుల కటాక్షానికి అద్వితీయ లక్ష్యభూతమై, జయతి = సర్వోత్కర్షతో వెలుగుతున్నదో, ప్రణతజననిధేః = భక్తజనానికి నిధివంటివారు, దేశికేంద్రాత్ = గొప్ప ఆచార్యులు, శ్రీమతః = భగవత్కైంకర్యనిష్ఠులు అయిన, తస్మాత్ కాంతోపయంతుః = ఆ శ్రీమణవాళమహామునుల కంటే, పరం దైవతం = ఇంకొక దైవాన్ని, శరణం = శరణంగా, ఇహ = ఈ లోకంలో, న అహం జానే = నేను తెలియను, న అహం జానే = ఏను తెలియను, నైవ అహం జానే= నేను తెలియనే తెలియను.

**80. శ్రీమత్కాంతవరస్య దేశికవరస్యాంఘ్రీ సరోజోపమౌ**
**సంసారార్ణవమగ్నసర్వజనతాసంతారణైకవ్రతౌ ।**
**యే ధ్యాయంతి సదా తదన్యవిముఖా స్తద్దర్శితే సత్పథే**
**నిష్ఠాం బిభ్రతి సద్గుణై స్సురభితా స్తేభ్యో మహద్భ్యో నమః ॥**

సంసార+అర్ణవమగ్న = సంసారమనే సముద్రంలో మునిగిన, సర్వజనతా = సమస్త జనసమూహాన్ని, సంతారణ = దాటించి తీరాన్ని చేర్చడమనే, ఏకవ్రతౌ = అద్వితీయ వ్రతాన్ని కల్గినవి, సరోజ+ ఉపమౌ = పద్మాలకు సాటి వచ్చేవి అయిన, కాంతవరస్య దేశికవరస్య = శ్రీమణవాళమహామునులనే ఆచార్యవర్యులయొక్క, అంఘ్రీ = శ్రీచరణాలను, యే = ఎవరు, సదా = ఎల్లప్పుడు, ధ్యాయంతి = ధ్యానిస్తున్నారో, తదన్యవిముఖాః = ఆ మణవాళమహామునుల కంటే అన్యుల విషయంలో వైముఖ్యాన్ని కలవారో, తత్ దర్శితే = ఆ మణవాళమహామునులచేత దర్శింపజేయబడ్డ (ఉపదేశింపబడ్డ), సత్పథే = మంచి దారిలో, నిష్ఠాం = నిష్ఠను, బిభ్రతి = కల్గి ఉన్నారో, సద్గుణైః సురభితాః = సద్గుణాలచేత పరిమళించేవారై ఉండే, తేభ్యః మహద్భ్యః = ఆ మహనీయులకు (పూజనీయులకు), నమః = నమస్కారం.

**81. యదుదితా యతిభూపతివింశతి స్సమవధీరితశీధుసుధారసా ।**
**విశదయత్యఖిలం భవినాం హితం వరముని స్స తనోతు శుభాని నః ॥**

యదుదితా = ఏ మణవాళమహామునులవల్ల అవతరించిన, యతిభూపతి వింశతిః = యతిరాజవింశతి అనే స్తోత్రం, సమవధీరిత శీధుసుధారసా = మాధుర్యంలో తేనెను, అమృతరసాన్ని తక్కువజేసేదై ఉన్నదో, భవినాం = సంసారులకు, అఖిలం హితం = మంచిని అంతటిని, విశదయతి = విశదీకరిస్తున్నారో, సః వరమునిః = ఆ మణవాళ మహామునులు, నః = మనలకు, శుభాని =మంగళాలను, తనోతు = విస్తరింపజేయాలి.

**82. మహాయోగీ వక్తాఽనితరగుణసామాన్యమహిమా**
**స తు స్తుత్యః శ్రీమా నమితగుణభూమా యతిపతిః ।**
**అతో నిస్తుల్యా సా యతినరపతే ర్వింశతి రితి**
**వ్యవస్యంత స్సంతః కలి మిహ జయంత్యుజ్జ్వలధియః ॥**

అనితరగుణసామాన్యమహిమా = ఇతరులలో లేని, అసాధారణాలైన సద్గుణాలను కల్గి ఉండడమనే అతిశయాన్ని కలవారైన, మహాయోగీ = పెరియజీయర్, వక్తా = వక్త (స్తుతించేవారు), శ్రీమాన్ = భగవద్భక్తి, కైంకర్యాలనే సంపదను కలవారు, అమితగుణ భూమా = అంతు లేని కల్యాణగుణాలను కల్గిన గొప్పతనాన్ని కలవారైన, సః యతిపతిః తు = ఆ భగవద్రామానుజులు, స్తుత్యః= స్తుతింపబడేవారు, అతః= అందువల్ల, (వక్త గొప్పవారు, స్తుతింపబడేవారు గొప్పవారు కావడంవల్ల), సా యతినరపతేః వింశతిః = ఆ యతిరాజవింశతి, నిస్తుల్యా ఇతి = సాటి లేనిది అని, వ్యవస్యంతః = నిశ్చయాన్ని చేసికొనే, సంతః = సత్పురుషులు, ఇహ = ఈ లోకంలో, ఉజ్జ్వలధియః = గొప్పగా ప్రకాశించే బుద్ధిని కలవారై, కలిం జయంతి = కలిని జయిస్తున్నారు.

**83. ద్రాక్షా మధిక్షిపతి నిందతిమాకరంద-**
**ధారాం సుధారసఝరీ మధరీకరోతి ।**
**యత్సంప్రణీత మతులం యతిసార్వభౌమ-**
**స్తోత్రం స మే వరముని ర్వితనోతు భద్రమ్ ॥**

యత్ సంప్రణీతం = ఏ మణవాళమహామునులచేత చక్కగా రచింపబడినది, అతులం = సాటి లేనిది అయిన, యతిసార్వభౌమస్తోత్రం = యతిరాజవింశతి, (మాధుర్యం లో) ద్రాక్షాం = ద్రాక్షను, అధిక్షిపతి = నిందిస్తున్నదో, మాకరంద

ధారాం = తేనెల సోనను, నిందతి = నిందిస్తున్నదో, సుధారసఝరీం = అమృతరసప్రవాహాన్ని, అధరీకరోతి = తక్కువ చేస్తున్నదో, సః వరమునిః = ఆ మణవాళమహామునులు, మే = నాకు, భద్రం వితనోతు = మంగళాలను ఇవ్వాలి.

**84. శ్రీమద్రంగసుధాభిధానకవిసూక్త్యర్థానుసంధానోజ్జ్వలా**
**గోదోదారవచఃప్రదర్శితగురూపాయత్వనిష్ఠాశ్రయా ।**
**యత్సూక్తి ర్యతిరాజవింశతినుతి ర్వేదాంతసింధో స్సుధా**
**శ్రీమద్రమ్యవరాయ సంయమవతాం నాథాయ తస్మై నమః ॥**

శ్రీమద్రంగసుధాభిధానకవిసూక్తి = తిరువరంగత్తముదనార్ అనే కవులయొక్క సూక్తి అయిన ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాదియొక్క, అర్థ+అనుసంధాన = అర్థాన్ని అనుసంధానం చేయడంవల్ల, ఉజ్జ్వలా = గొప్పగా ప్రకాశించేది, గోదా+ఉదారవచః ప్రదర్శిత = గోదాదేవి యొక్క గొప్ప సూక్తులచేత, ప్రదర్శిత = వ్యక్తం చేయబడిన, గురు+ఉపాయత్వ = ఆచార్యులే ఉపాయమనే, నిష్ఠా+ఆశ్రయా = నిష్ఠను ఆశ్రయంగా కల్గినది, వేదాంతసింధోః = వేదాంతాలనే సముద్రంలో పుట్టినది, సుధా = అమృతంవంటిది అయిన, యతిరాజ వింశతినుతిః = యతిరాజవింశతి అనే స్తుతి, యత్ సూక్తిః = మణవాళమహామునుల యొక్క సూక్తియో, తస్మై సంయమవతాం నాథాయ శ్రీమద్రమ్యవరాయ = యతులలో శ్రేష్ఠులైన శ్రీమణవాళమునులకు, నమః = నమస్కారం.

**85. యతివరభక్తిపూర్తికలితార్తిసమాహ్వయవత్**
**కృతిరసవేదినః కిల తరంతి భవార్త్యుదధిమ్ ।**
**త మనుదినం యతీంద్రపదపంకజభృంగవరం**
**వరముని మాశ్రయాశయ ! విహాయ తదన్యరుచిమ్ ॥**

(ఏ మణవాళమహామునులచే రచింపబడ్డ) యతివరభక్తిపూర్తికలిత = శ్రీరామానుజుల విషయంలోని పరిపూర్ణభక్తితో కూడినది, ఆర్తిసమాహ్వయత్ = ఆర్తి ప్రబంధమనే పేరును కల్గినది అయిన, కృతి = స్తుతియొక్క, రసవేదినః= రసాన్ని తెలిసినవారు, భవ+ఆర్తి+ ఉదధిమ్ = సంసారదుఃఖమనే సముద్రాన్ని, తరంతి కిల = దాటుతున్నారో కదా, యతీంద్ర పదపంకజభృంగవరం = భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలలో గొప్ప తుమ్మెదవంటి వారు అయిన, వరమునిం = శ్రీమణవాళమహామునులను, అనుదినం = ప్రతిదినం, ఆశయ = ఓ హృదయమా!, తదన్యరుచిం విహాయ = ఆ మణవాళమహామునులకంటే ఇంకొక విషయంలో రుచిని కల్గి ఉండడాన్ని విడచి, ఆశ్రయ = ఆశ్రయించు.

**86. శఠారిదృష్టసామవేదభాష్యదర్శితాఖిల -**
**ప్రమాణసంగ్రహో మహోపకారకో మనీషిణామ్ ।**
**ముదం కరోతి యత్కృతి స్సమాశ్రయస్వ సాదరం**
**మనోహరోపయంతృయోగినం త మన్వహం మనః ॥**

యత్ కృతిః = ఏ మణవాళమహామునులయొక్క ప్రమాణత్తిరట్టు అనే కృతి, శఠారిదృష్ట = నమ్మా*ఴ్వా*ర్లచే దర్శింపబడ్డ, సామవేద = సామవేదరూపమైన తిరువాయ్ మొ*ఴ్ఴి*యొక్క, భాష్య = వ్యాఖ్య అయిన ఈడు ముప్పత్తాఱాయిరప్పడిలో, దర్శిత = చూపింపబడ్డ, అఖిలప్రమాణసంగ్రహః= సకల ప్రమాణాల సంగ్రహరూపమైనది, మహోప కారకః = గొప్ప ఉపకారకమై, మనీషిణామ్ ముదం కరోతి = బుద్ధిమంతులకు ఆనందాన్ని కల్గిస్తున్నదో, తం మనోహర+ ఉపయంతృయోగినం= ఆ మణవాళ మహామునులను, మనః = ఓ మనసా!, సాదరం = భక్తితో, అన్వహం = ప్రతిదినం సమాశ్రయస్వ = ఆశ్రయించు.

**87. స్వకృతజగద్గురుతత్త్వత్రితయవ్యాఖ్యానమానసంగ్రహతః ।**
**భవినాం కృతోపకారః వరయోగీ పాతు నః సతతమ్ ॥**

స్వకృత = తనచే (మణవాళమహామునులచే) రచింపబడ్డ, జగద్గురుతత్త్వత్రితయ = శ్రీపిళ్లైలోకాచార్యులవారి తత్త్వత్రయమనే రహస్యగ్రంథంయొక్క, వ్యాఖ్యాన = వ్యాఖ్యానం లోని, మాన = ప్రమాణాల, సంగ్రహతః = సంగ్రహంద్వారా (ప్రమాణాలకు ఆకరాలను తెలిపే ప్రమాణత్తిరట్టును కూర్చడంద్వారా), భవినాం = సంసారులకు, కృత+ఉపకారః = ఉపకారాన్ని చేసినవారైన, వరయోగీ = శ్రీమణవాళమహామునులు, నః సతతం పాతు = మనలను సదా రక్షించుగాక !

**88. యదీయోపదేశరత్నమాలయా పరిష్కృతాః**
**యదంఘ్రిపద్మశేఖరా జయంతి దేశికోత్తమాః ।**
**త మాశ్రితస్య సుందరోపయంతృయోగిశేఖరం**
**భవార్ణవోఽపి గోష్పదత్వ మేతి తత్ప్రభావతః ॥**

యదీయ = ఏ మణవాళమహామునులకు చెందిన (మణవాళమహామునులచే రచింపబడిన), ఉపదేశరత్నమాలయా= ఉపదేశరత్తినమాలై అనే ప్రబంధంచేత, పరిష్కృతాః = అలంకరింపబడినవారు (సంస్కరింపబడినవారు), యత్ + అంఘ్రిపద్మ శేఖరాః = ఏ మణవాళమహామునుల శ్రీచరణాలను శిరోభూషణంగా కలవారైన, దేశిక+ ఉత్తమాః = సదాచార్యులు, జయంతి = సర్వోత్కర్షతో వెల్గుతున్నారో, తం సుందరోప యంతృ–యోగిశేఖరం = ఆ శ్రీమణవాళమహామునులను, ఆశ్రితస్య = ఆశ్రయించిన వానికి, భవ+అర్ణవః అపి = సంసారసముద్రం కూడా, తత్ ప్రభావతః = ఆ మణవాళ మహామునుల ప్రభావంవల్ల, గోష్పదత్వమ్ ఏతి = గోష్పాదంవలె చాలా చిన్నది అవుతున్నది.

**89. శఠారిదృష్టసామవేదమౌళిసంగ్రహాత్మికాం**
**యదుక్తి మన్వహం గృణన్ విముక్తిసంపదాస్పదామ్ ।**
**సమేధతే సతాం గణః స న శ్శుభాని సాదరం**
**వరోపయంతృయోగిరాట్ తరంగయత్వనారతమ్ ॥**

శఠారిదృష్ట = నమ్మాళ్వార్లచే దర్శింపబడ్డ, సామవేదమౌళి =సామవేదశిరస్సు అయిన తిరువాయ్‌మొళియొక్క, సంగ్రహాత్మికాం = సంగ్రహరూపమై, విముక్తిసంపత్+ ఆస్పదామ్ = మోక్షమనే సంపదకు నిలయమైన, యత్ ఉక్తిం = ఏ శ్రీమణవాళ మహామునుల ఉక్తి అయిన తిరువాయ్‌మొళి నూఱ్ఱన్దాదిని, అన్వహం గృణన్ = ప్రతిదినం అనుసంధించు, సతాం గణః = సత్పురుషుల సమూహం, సమేధతే = మిక్కిలి వర్ధిల్లుతున్నదో, సః వరోపయంతృయోగిరాట్ = ఆ మణవాళమహామునులు, నః శుభాని = మనకు శుభాలను, సాదరం = ఆదరంతో, అనాతరతం = నిత్యం, తరంగయతు= విస్తరింపజేయాలి.

**90. దుగ్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం**
**రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్ ।**
**ధ్యాయంత స్తం వరవరమునిం కేఽపి ధన్యా మహాంతః**
**కాలం సర్వం కలుషరహితా హృష్టచిత్తా హరంతి ॥**

యస్య = ఏ మణవాళమహామునులయొక్క రూపం = రూపం, దుగ్ధ+ఉదన్వత్ ధవళమధురం = పాలసముద్రంవలె తెల్లనిది, మధురమైనదై, శుద్ధసత్త్వ+ఏకరూపం = శుద్ధసత్త్వాన్ని మాత్రమే రూపముగా కల్గినదై, యం = ఏ శ్రీమణవాళమహామునులను, ఫణీంద్ర+అవతారం =ఆదిశేషుల అవతారమని, స్ఫుటయతి తరాం = మిక్కిలిగా స్పష్టం చేస్తున్నదో, తం వరవరమునిం = ఆ శ్రీమణవాళమహామునులను, కే అపి ధన్యాః మహాంతః = ఎవరో కొందఱు ధన్యులైన మహాత్ములు, ధ్యాయంతః = ధ్యానిస్తున్నవారై, కలుషరహితాః = దోషం లేనివారై, హృష్టచిత్తాః = ఆనందించిన మనస్సును కలవారై, సర్వం కాలం హరంతి = కాలాన్ని అంతటిని గడుపుతున్నారు.

**91. రాజచ్ఛీతమయూఖమండలశరజ్జ్యోత్స్నాసమానద్యుతిః**
**కాషాయాంబరధారిణీ కరలసద్దండత్రయీమండితా ।**
**ఫాలాద్యంగసముల్లసత్సువిమలస్నిగ్ధోర్ధ్వపుండ్రోజ్జ్వలా**
**దీవ్యంత్యాత్మగుణై స్సదా వరవరాకారాఽ స్తు మే భావనా ॥**

రాజత్ = ప్రకాశిస్తున్న, శీతమయూఖమండల = చంద్రమండలంనుండి పుట్టిన, శరత్జ్యోత్స్నా = శరత్కాల వెన్నెలతో, సమానద్యుతిః =సమానమైన కాంతిని కల్గినది, కాషాయాంబరధారిణీ = కాషాయవస్త్రాన్ని ధరించినది, కర = శ్రీహస్తంలో గల, లసత్ = ప్రకాశిస్తున్న, దండత్రయీమండితా = త్రిదండంచేత అలంకరింపబడినది, ఫాల+ఆది+ అంగ = ఫాలం మొదలైన అంగాలలో, సముల్లసత్ = స్పష్టంగా వెలిగే, సువిమల = స్వచ్ఛమైన, స్నిగ్ధ = మనోహరమైన, పుండ్ర = ద్వాదశోర్ధ్వపుండ్రాలతో, ఉజ్జ్వలాం = మిక్కిలిగా ప్రకాశించేది, ఆత్మగుణైః దీవ్యంతీ = దయావాత్సల్యాది ఆత్మగుణాలతో ప్రకాశించేది, వరవర+ఆకారా = శ్రీమణవాళ మహామునుల రూపంలో ఉండేది అయిన, భావనా = భావన, మే = నాకు, సదా అస్తు = సదా ఉండాలి.

**92. చింతా మే యతిసార్వభౌమచరణప్రేమాత్మికా ప్రోల్లసత్-**
**శాంతిక్షాంతిదయాదిసద్గుణమయీ రాకేందుభాసాం నిధిః ।**
**శ్రీమత్స్వాంఘ్రిసరోజభక్తజనతామోక్షప్రదానోద్యతా**
**భూయాత్ సర్వజగద్ధితావతరణా సౌమ్యోపయంత్రాత్మికా ॥**

యతిసార్వభౌమచరణప్రేమాత్మికా = భగవద్రామానుజుల శ్రీచరణాలలోని ప్రేమే మూర్తీభవించినట్లున్నది, ప్రోల్లసత్ = మిక్కిలిగా వ్యక్తం అవుతున్న, శాంతిక్షాంతిదయా+ ఆదిసద్గుణమయీ = శాంతి, క్షమ, దయ మొదలైన కల్యాణగుణాలతో నిండినది, రాకా+ఇందుభాసాం నిధిః = పున్నమి చంద్రుని వెన్నెలకు నిధివంటిది, శ్రీమత్ = శోభను కల్గిన, స్వ = తనయొక్క, అంఘ్రిసరోజ = పాదపద్మాలలో, భక్తజనతా = తన విషయంలో భక్తిని కలవారి సమూహానికి, మోక్షప్రదాన = మోక్షాన్ని అనుగ్రహించడంలో, ఉద్యతా = ఉద్యమించినది, సర్వజగత్ హిత + అవతరణా = సమస్తలోకంయొక్క హితంకోసం అవతరించినది, సౌమ్యోపయంతృ + ఆత్మికా = శ్రీమణవాళమహామునుల రూపంలో ఉన్నది అయిన, చింతా = భావన, మే = నాకు, భూయాత్ = కలగాలి.

**93. అంఘ్రీ శృంఖలితాబ్జకీర్తివిభవౌ తన్నాలదంభచ్ఛిదౌ**
**జంఘే హస్తికరప్రశస్తిహరణోన్నిద్రం తదూరుద్వయమ్ ।**
**మధ్యం తానవహృద్య మాయతభుజామధ్యం కవాటోపమం**
**బాహుద్వంద్వ మమర్త్యభూజవిటపాహంకారపాటచ్చరమ్ ॥**

**94. కంఠం కుంఠితకంబుడంబరభరం వక్త్రం శరచ్చంద్రమ**
**స్సౌందర్యోదితగర్వచర్వణకలాపాండిత్యనిత్యోజ్జ్వలమ్ ।**
**మౌళిం నిస్తుల మప్యపాస్తభజదాతంకం వపు స్సాదరం**
**తత్క్షీరోదసహోదరం వరమునే శ్చేత ! స్సదా భావయ ॥**

చేతః = ఓ మనసా! వరమునేః = శ్రీమణవాళమహామునులయొక్క, శృంఖలిత+ అబ్జకీర్తివిభవే = పద్మాల కీర్తికి సంకెళ్ళు వేసి బంధించిన కీర్తివైభవాన్ని కల్గిన, అంఘ్రీ = శ్రీచరణాలను, తత్ నాలదంభచ్ఛిదౌ = ఆ పద్మాల తూడుల గర్వాన్ని ఛేదించిన, జంఘే = వరవరమునుల పిక్కలను రెండిటిని, హస్తికర = ఏనుగుతొండంయొక్క, ప్రశస్తి = కీర్తిని, హరణ = హరించడంలో, ఉన్నిద్రం = జాగరూకంగా ఉండే, తత్+ఊరుద్వయం = ఆ మణవాళమహామునుల రెండు ఊరువులను,

తానవహృద్యం = సన్నగా ఉండడం వల్ల అందమైన, మధ్యం = నడుమును, కవాట+ఉపమం = కవాటాలవలె ఉండే, ఆయతభుజా మధ్యం = విశాలమైన వక్షఃస్థలాన్ని, అమర్త్యభూజ = దేవతావృక్షమైన కల్పవృక్షంయొక్క విటప+అహంకార= శాఖల గర్వాన్ని, పాటచ్చరం = అపహరించే, బాహుద్వంద్వం = రెండు బాహువులను, కుంఠిత కంబుడంబరభరం = శంఖంయొక్క గర్వాన్ని అడ్డుకొన్న కంఠాన్ని, శరచ్చంద్రమస్ = శరత్కాలచంద్రునకు, సౌందర్య = అందంచేత కల్గిన, గర్వ = గర్వాన్ని, చర్వణకళా = ఆస్వాదించే (గ్రసించే) కళలోని, పాండిత్య = వైదుష్యంచేత, నిత్య+ఉజ్జ్వలమ్ = ఎల్లప్పుడు ఉజ్జ్వలమైన, వక్త్రం = వదనాన్ని, నిస్తులం = సాటి లేని, మౌళిమ్ అపి = శిరస్సును, అపాస్తభజత్+ ఆతంకం = భక్తుల భయాన్ని తీర్చేది, క్షీరోదసహోదరం = పాలసముద్రంతో సమానం అయిన, తత్ వపుః = ఆ దివ్యమంగళ విగ్రహాన్ని, సదా భావయ = ఎల్లప్పుడు భావించు.

ఈ శ్లోకములు రెండును చేరి యుగ్మక మనబడును. రెండవ శ్లోకములోనున్న **"భావయ"** అనెడి క్రియాపదముతో అన్నిటికిని అన్వయము. వరవరమునుల అవయవశోభ, తిరుమేని శోభయు అమలనాదిపిరాన్ ప్రబంధములోని రీతిలో ఇందు అనుభవింప బడుచున్నది.

తామరపూవుయొక్క కీర్తివైభవమును దండింపగల్గిన శ్రీవరవరమునుల శ్రీచరణము లును, తామరతూడుల దంభమును ఛేదించు వారి మోకాళ్ళను, ఏనుగు తొండము కీర్తిని అపహరించుటలో జాగరూకమైన ఊరువులను, సన్నగా ఉండుటచే మనోహరమైన నడుమును, కవాటముతో సమానమైన విశాలవక్షఃస్థలమును, దేవలోకములోనున్న కల్పకవృక్షముయొక్క "నేనే కోరికలనన్నిటిని ఇవ్వగలదానను" అనెడి అహంకారమును కొల్లగొట్టు రెండు దీర్ఘహస్తములును, శంఖముయొక్క ఆడంబరమును వంచునట్టి కంఠమును, శరత్కాలచంద్రునకు సౌందర్యముచే కల్గిన గర్వమును కబళీకరించు కళలో పాండిత్యమును పొంది, నిత్యము వెలుగునట్టి తిరుముఖ మండలమును, నిస్సమాభ్యధిక మైనదై, తనను ఆశ్రయించువారి మనఃక్లేశమును పోగొట్టునట్టి కిరీటమును, పాలకడలికి సమానమైన తెల్లగానున్న తిరుమేనిని, ఓ మనసా ! నీవు ఎల్లప్పుడు ప్రేమతో భావింపుము.

**95. పుండ్రైః ద్వాదశభిః యథావిధి ధృతైః శుభ్రై రదభ్రచ్ఛవిః**
**తత్తాదృక్ శరదంబువాహపటలీసౌందర్యసంపన్నిధిః ।**
**ధీభక్త్యాదిగుణౌఘసంభృతయశస్సందోహసందేహదా**
**మూర్తి స్సా వరయోగినః ప్రతికలం జాగర్తు చిత్తే మమ ॥**

యథావిధిధృతైః= విధిప్రకారం ధరించబడ్డ, శుభ్రైః = స్వచ్ఛమైన (తెల్లని), ద్వాదశభిః పుండ్రైః = ద్వాదశోర్ధ్వపుండ్రాలలో, అదభ్రచ్ఛవిః= స్వచ్ఛమైన మనోహరమైన కాంతిని కల్గినది, తత్ తాదృక్ = అనిర్వచనీయమైన, శరత్+అంబువాహపటలీ= శరత్కాలంలోని మేఘసమూహాల, సౌందర్యసంపత్ = సౌందర్యమనే సంపదకు, నిధిః = నిధి, ధీభక్త్యాది గుణౌఘసంభృత= జ్ఞానం, భక్తి మొదలైన గుణాల సమూహాలవల్ల ఏర్పడిన, యశః సందోహసందేహదా = కీర్తియొక్క సందోహమే మూర్తీభవించిందా! అనే సందేహాన్ని కల్గించే, వరయోగినః = వరవరమునుల, సా మూర్తిః = ఆ అద్వితీయ రూపం, ప్రతికలం= ప్రతిక్షణం, మమ చిత్తే = నా మనస్సులో, జాగర్తు = ప్రకాశించాలి.

**96. యన్మూర్తిః ధ్యానమూర్తిం శమయతి భవినాం జ్ఞప్తిపూర్వం విధత్తే**
**భక్తిం పుష్ణాతి విష్ణౌ విషయవిషయిణీ మాశు ముష్ణాతి తృష్ణామ్ ।**
**సోఽయం కాంతోపయంతా నిరవధికగుణస్తోమవిస్తారకీర్తిం**
**సర్వాంగోత్తుంగవీచిప్రశమితజగతీవిశ్వతాపోఽవతాన్నః ॥**

యత్ మూర్తేః ధ్యానం = ఏ మణవాళమహామునులయొక్క ధ్యానం = ధ్యానం, భవినాం = సంసారుల, ఆర్తిం = దుః ఖాన్ని, శమయతి = ఉపశమింపజేస్తున్నదో, జ్ఞప్తి పూర్వం = జ్ఞానంమొదలైనవానిని, విధత్తే = కల్గిస్తున్నదో, విష్ణౌ = విష్ణువుయందు, భక్తిం = భక్తిని, పుష్ణాతి = వృద్ధిచేస్తున్నదో, విషయవిషయిణీమ్ = లౌకికసుఖాలను విషయాలుగా కల్గిన, తృష్ణాం = కోరికను, ఆశు ముష్ణాతి = వెంటనే హరిస్తున్నదో, నిరవధిక గుణస్తోమ = అంతు లేని కల్యాణగుణాల సమూహంచేత, విస్తార = విస్తృతమైన, అంతటా వ్యాపించిన, కీర్తిః = కీర్తిని కలవారు, సర్వాంగ = సమస్తదివ్యాంగాలనుండి వీచే, ఉత్తుంగ = ఉన్నతాలైన, వీచి = సౌందర్యకెరటాలచేత, ప్రశమిత = ఉపశమింప జేయబడిన, జగతీ = లోకంయొక్క, విశ్వతాపః = సమస్తమైన తాపాన్ని కలవారు అయిన, సః అయం కాంతోపయంతా = ఆ ఈ మణవాళమహామునులు, నః అవతాత్ = మనలను రక్షించాలి.

**97. మాత ర్వాణి ! నిరంతరం కలయ తాన్ కాంతోపయంతు ర్గుణాన్**
**అంతర్వాణివరై ర్వరప్రదరమావాసార్యముఖ్యై ర్నుతాన్ ।**
**పాదౌ తస్య కరద్వయార్చయ భవాతంకాపవాదౌ సదా**
**తద్భక్తా ననుచింతయాశయ ! తమోవైదేశికాన్ దేశికాన్ ॥**

మాతః వాణి = తల్లీ ! సరస్వతీ !, అంతర్వాణివరైః = గొప్ప శాస్త్రజ్ఞులైన, వరప్రద రమావాసార్యముఖ్యైః = వరదనారాయణగురువు, శ్రీనివాసగురువు మొదలైనవారిచే, నుతాన్ =కీర్తింపబడ్డ, కాంతోపయంతుః తాన్ గుణాన్ = వరవరముసుల ఆ సద్గుణాలను, కలయ = భావించు, కరద్వయ = ఓ కరద్వయమా !, భవ+అతంక+ అపవాదౌ = సంసారభీతిని తీర్చే, తస్య పాదౌ = ఆ వరవరమునుల పాదాలను రెండిటిని, సదా = ఎల్లప్పుడు, అర్చయ = అర్చించు, ఆశయ = ఓ హృదయమా!, తమోవైదేశికాన్ = అజ్ఞానానికి దూరంగా ఉండేవారు, దేశికాన్ = సదాచార్యులు అయిన, తద్భక్తాన్ = ఆ మణవాళమహామునుల భక్తులను, అనుచింతయ = సదా భావించు.

**98. అజ్ఞానా మహ మగ్రణీ రథ చ మాం మన్యే భృశం పండితం**
**పాపీయానపి పాపలేశరహితం హా ! నిశ్చినోమి స్వయమ్ ।**
**భాస్వత్సత్కర్మవిదేశగోఽపి కలయే సత్కర్మనిష్ఠం హృదా**
**ధిఙ్మాం నాథ ! మహామునే ! తదధునా త్రాతుం త్వమేవ క్షమః ॥**

అహం = నేను, అజ్ఞానామ్ అగ్రణీః = అజ్ఞులలో మొదటివాడను, అథ చ = మఱి అయితే,మాం =నన్ను, పండితం= పండితునిగా, భృశం మన్యే = ఎక్కువగా భావిస్తున్నాను, పాపీయాన్ అపి = పాపిష్ఠివాడను అయినా, పాపలేశరహితం = పాపాన్ని కొంచమయినా లేనివాడనని, స్వయం = స్వయంగానే, నిశ్చినోమి హా! = నిశ్చయించుకుంటున్నానే అయ్యో!, భాస్వత్ = వెలిగే, సత్కర్మవిదేశగః +అపి = సత్కర్మకు దూరంలో ఉండేవాడను అయినా, హృదా = మనస్సుతో, సత్కర్మనిష్ఠం= సత్కర్మలలో స్థిరంగా ఉండేవాడనుగా, కలయే = భావిస్తున్నాను, ధిక్ = ఛీ !, నాథ = స్వామీ !, మహామునే = ఓ పెరియ జీయర్‌స్వామీ !, తత్ = అందువల్ల, అధునా = ఇపుడు, మాం = నన్ను, త్రాతుం = రక్షించడానికి, త్వమ్ ఏవ క్షమః= నీవే సమర్థుడవు.

**99. నాహం సత్కర్మ కర్తుం పటు రపటుతర స్సాంఖ్యయోగం విధాతుం**
**నైవ ధ్యాతుం పరస్మాత్పర మనుపమం ధామ భూమానిధానమ్ ।**
**నైవ న్యస్యామి తస్మిన్ భర మనధిగమాత్ తత్ర విశ్వాసభూమ్నో**
**ముక్తే స్తస్మాదుపాయో వరమునివర ! మే త్వత్కృపైవానపాయా ॥**

అహం = నేను, సత్కర్మ = మంచి కర్మలను, కర్తుం = చేయడానికి, న పటుః = సమర్థుడను కాను, సాంఖ్యయోగం విధాతుం = సాంఖ్యయోగమనేబడే జ్ఞానయోగాన్ని అనుష్ఠించడానికి, అపటుతరః = అంతకంటేకూడా అసమర్థుడను,

పరస్మాత్ పరం = అన్యులందరికంటే గొప్పవాడు, అనుపమం = సాటి లేనివాడు, భూమానిధానమ్ = లక్ష్మీదేవికి, భూదేవికి నాయకుడు, ధామ = తేజోరూపుడైన భగవానుని, ధ్యాతుం = ధ్యానం చేయడానికి, న ఏవ = సమర్థుడను కానేకాను, (భక్తియోగ రహితుడను) తత్ర = ఆ భగవానునియందు, విశ్వాసభూమ్నః అనధిగమాత్ = మహావిశ్వాసాన్ని పొందలేనందు వల్ల, తస్మిన్ =ఆ పరమపురుషునిలో, భరం న ఏవ న్యస్యామి = నా రక్షణభారాన్ని సమర్పించడమనే శరణాగతిని చేయలేను, తస్మాత్ = అందువల్ల, వరమునివర = ఓ మణవాళ మహామునీ!, మే = నాయొక్క, ముక్తేః = ముక్తికి, త్వత్కృపా ఏవ = నీ దయయే, అనపాయా = నిరుపద్రవం అయిన, ఉపాయః =శరణం.

**100. త్వత్సూక్త్యైకరసాన్ త్వదంఘ్రియుగళన్యస్తాత్మరక్షాభరాన్**
**త్వత్సేవైకవరాన్ త్వదీయకరుణాస్రోతస్వినీసాగరాన్ ।**
**ఆచార్యాన్ మమ వీక్ష్య మయ్యపి భృశం నిస్సీమదోషాస్పదే**
**శ్రీమన్! రమ్యవర ! ప్రసీద యమినాం రాజన్! నమస్తే నమః ॥**

త్వత్ సూక్తి+ఏకరసాన్ = తమ శ్రీసూక్తులను మాత్రమే ఆస్వాదించేవారు, త్వత్ + అంఘ్రియుగళ = కేవలం తమ పాదాల జంటలో, న్యస్త+ ఆత్మరక్షాభరాన్ = సమర్పించిన తమ రక్షణభారాన్ని కలవారు, త్వత్ + సేవా+ ఏకవరాన్ = మీ సేవను ఒక్కటినే వరంగా కలవారు, త్వదీయ = నీయొక్క, కరుణాస్రోతస్వినీ = కరుణ అనే నది చేరే, సాగరాన్ = సముద్రంవంటివారు అయిన, మమ ఆచార్యాన్ = నా ఆచార్యులను, వీక్ష్య = చూచి, నిస్సీమదోష+ ఆస్పదే = అవధి లేని దోషాలకు స్థానం అయిన, మయి అపి = నా విషయంలో కూడా, శ్రీమన్ రమ్యవర = ఓ మణవాళమహామునీ!, భృశం ప్రసీద = మిక్కిలిగా అనుగ్రహించండి, యమినాం రాజన్ = యతులకు ప్రభువైన మణవాళమహామునీ !, తే = మీకు, నమః నమః = మాటిమాటికి నమస్కారం.

---

**శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।**
**శ్రీరంగవాసినే భూయా న్నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥**

మహాత్మనే = మహానుభావులు, శ్రీరంగవాసినే = శ్రీరంగంలో నివసించేవారు, శ్రీమతే = కైంకర్యలక్ష్మిని కలవారు అయిన, రమ్యజామాతృమునీంద్రాయ = శ్రీమణవాళ మహామునులకు, నిత్యశ్రీః = నిత్యమైన సంపద, నిత్యమంగళం = నిత్యమైన, మంగళం = భూయాత్ = కలగాలి.

ఇది ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్‌చే అనుగ్రహింపబడిన వరవరమునుల మంగళశ్లోకము.

శ్రీ రంగనాథుని దివ్యాజ్ఞచే శ్రీరంగమును నిత్యవాసముగ గొని, శ్రీవైష్ణవసిరిచే వెల్గువారై, మిక్కిలి గొప్పతనమును కలవారై, తమ మంగళాశాసనబలముచే ఎల్లప్పుడు శ్రీరంగనాథుని సంపదను వర్ధిల్లజేయు మణవాళమహామునులకు నిత్యశ్రీః నిత్యమంగళము అగుగాక !

---

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునే నమః

దేవరాజగురువు (ఎఱుమ్బియప్పా) అనుగ్రహించిన

# శ్రీశైలాష్టకమ్ - సవ్యాఖ్యానం

## ఎఱుమ్బియప్పా తనియన్

సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజషట్పదమ్ ।
దేవరాజగురుం వందే దివ్యజ్ఞాన ప్రదం శుభమ్ ॥



1. శేషః శ్రీమానజని హి పురా సౌమ్యజామాతృయోగీ
భోగీభూత స్తదను భగవాన్ రాఘవస్యానుజన్మా ।
భూత్వా భవ్యో వరవరముని ర్భూయసా భాసమానో
రక్షత్వస్మాన్ రఘుకులపతే రాశ్రితో భద్రపీఠమ్ ॥

సౌమ్యజామాతృయోగీ = మణవాళమహాములు, పురా = పూర్వం, శ్రీమాన్= కైంకర్యలక్ష్మితో కూడిన, శేషః = ఆదిశేషులుగా, అజని హి = పుట్టారు కదా, భోగీ = (ఆ) ఆదిశేషులే, తదను = తరువాత, భగవాన్ = కైంకర్య శ్రీతో కూడిన, రాఘవస్య = శ్రీరాముని, అనుజన్మా = అనుజుడైన లక్ష్మణునిగా, (ఇళైయపెరుమాళ్‌గా), భూతః = అవతరించాడు, తరువాత, భవ్యః = ఆశ్రితసులభులైన, వరవరమునిః = మణవాళమహామునులుగా, భూత్వా = అవతరించి, రఘుకులపతేః = శ్రీరాముని, భద్రపీఠం = భద్రాసనాన్ని, ఆశ్రితః = ఆశ్రయించినవారై, భూయసా = మిక్కిలి, భాసమానః = వెలుగుతున్నవారై, అస్మాన్= మనలను, రక్షతు = రక్షించాలి.

ఈ మణవాళమహామునులే పూర్వం కృతయుగంలో ఆదిశేషులుగా అవతరించి భగవానునకు సకలవిధకైంకర్యాలను చేశారు. ఆ తరువాత శ్రీరామచంద్ర కైంకర్యలక్ష్మితో కూడిన లక్ష్మణునిగా అవతరించారు. ఆ పిమ్మట ఆశ్రితసులభులైన శ్రీవరవరమునులుగా అవతరించారు. అటువంటి శ్రీవరవరమునులు మా ఇంటిలోని ఆరాధనామూర్తి అయిన శ్రీరామచంద్రుడు వేంచేసి ఉండే భద్రాసనాన్ని ఆశ్రయించి, గొప్పగా ప్రకాశిస్తూ మమ్మలను రక్షించాలి - అని భావం.

ఈ శ్లోకంలో ప్రస్తావింపబడిన ఐతిహ్యం శ్రీమణవాళమహామునుల అవతార వైభవాన్ని తెలిపే యతీంద్ర ప్రవణప్రభావమనే సంప్రదాయగ్రంథంలో ఈవిధంగా ఉన్నది.

శ్రీవరవరమునులు ఉత్తమాశ్రమాన్ని స్వీకరించి, శ్రీరంగంలో శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచార నిర్వహణను చేస్తున్న సమయంలో, ఘటికాచలక్షేత్రానికి (షోళింగర్) దగ్గరలో ఉండే “ఎఱుమ్బి” అనే గ్రామంలో నివసించే గొప్ప విద్వాంసులైన దేవరాజగురువు (ఎఱుమ్బియప్పా) ఒకసారి శ్రీరంగనాథుని సేవించాలనే ఉద్దేశ్యంతో శ్రీరంగానికి

విచ్చేశారు. శ్రీరంగనాథుని దర్శనం చేసికొన్న తరువాత, అక్కడనే ఉండే పెరియ కన్దాడై అణ్ణన్ అనే ఆచార్యులు తమకు ఆప్తబంధువు అయినందువల్ల, వారి ఇంటికి వెళ్ళి భుజించారు. అప్పటికే దేవరాజగురువు శ్రీవరవరమునుల గొప్పతనాన్ని కర్ణాకర్ణిగా విని ఉన్నందున, వారిని సేవించాలని వారి సన్నిధికి వెళ్ళారు. శ్రీమణవాళమహాములు కూడా దేవరాజగురువు గొప్ప విద్వాంసులని తెలిసి తిరువాయ్మొழிప్రబంధంలోని **"ఉయర్వఱ ఉయర్నలమ్"** అనే మొదటి దశక ప్రవేశాన్ని (అవతారికను) చాలా మధురంగా వారిముందు ఉపన్యసించారు. వారి శ్రీసూక్తివైభవాన్ని ఆలకించిన దేవరాజగురువు చాలా ఆశ్చర్యపడి "జీయర్‌కు తమిళంలో తప్ప సంస్కృతంలో పరిచయం లేదు"- అని పూర్వం విన్నాను. కాని, వీరు ఉభయవేదాంతాలలో చాలా నిపుణులుగా ఉన్నారే!'' అని చాలా సంతోషించారు. అపుడు శ్రీవరవరమునులు తమ మఠంలో భుజించవలసినదిగా దేవరాజగురువును ప్రార్థించగా, దేవరాజగురువు **"యత్యన్నం యతిపాత్రస్థం యతినా ప్రేషితం చ యత్, అన్నత్రయం న భోక్తవ్యం భుక్త్వా చాంద్రాయణం చరేత్"** (యతి పెట్టిన అన్నం, యతిపాత్రలో ఉండే అన్నం, యతి పంపిన అన్నం - అనే ఈ మూడు భుజించ రానివి. ఒకవేళ వాటిని భుజిస్తే ప్రాయశ్చిత్తంగా చాంద్రాయణ వ్రతాన్ని అనుష్ఠించాలి) అనే సామాన్యశాస్త్రంలోని నిషేధాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని, శ్రీవరవరమునుల విషయంలో విశిష్టధర్మం పాటించడం తగినది- అని గుర్తించలేక, **"పోనకమ్ శెయ్ద శేదమ్ తరువరేల్ పునిదమన్డే"** (భాగవతులు తాము భుజించిన ప్రసాదశేషాన్ని అనుగ్రహించడం అలభ్యలాభమే. దానిని వారు ఒకవేళ అనుగ్రహిస్తే అది చాలా పావనం) అనే విశేష శాస్త్రాన్ని తెలియకపోవడంచేత జీయర్ శ్రీపాదాలను ఆశ్రయించకుండా, వారి మాటను తిరస్కరించి, తమ ఊరికి తిరిగి వెళ్ళిపోయారు.

మరునాడు యథాప్రాతఃకాల నిత్యానుష్ఠానాన్ని ముగించుకొని తాము ఆరాధించే శ్రీరామచంద్రమూర్తి అర్చారూపం వేంచేసి ఉండే కోవెల తలుపులను తెరవాలని చూడగా, ఏవిధంగా ఎంతగా ప్రయత్నించినా ఆ తలుపులు తెరచుకోలేదు. అపుడు దేవరాజగురువు చాలా దుఃఖించి, భగవదారాధనను చేయలేక పోయినందువల్ల భుజించకుండా, ఉపవసించి, కన్నులు మూసికొని ఉండిపోయారు. ఆనాటిరాత్రి శ్రీరామచంద్రమూర్తి ఆ దేవరాజగురువుల ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రుడు దేవరాజగురువులతో శ్రీవరవరమునుల శ్రీపాదాలలో మీరు అపచారం చేసి వచ్చారు. శ్రీనారదభగవానుల ఉత్పత్తిని గూర్చి మీరు వినలేదా! శ్రీవరవరమునుల శ్రీపాదాలను ఆశ్రయించి, ఆపరాధక్షామణాన్ని చేసికొంటే తప్ప మీ చేతులద్వారా మేము తిరువారాధనను స్వీకరించబోము. వెంటనే వెళ్ళండి'' అని ఆజ్ఞాపించాడు. ఎఱుమ్బియప్పా తటాలున మేలుకొని, చాలా ఆశ్చర్యపడి, తమకు వచ్చిన స్వప్నాన్ని నమ్ముతూ, అపుడే శ్రీరంగానికి బయలుదేరారు. **"అంకే కవేరకన్యాయాః తుంగే భువనమంగళే, రంగే ధామ్ని సుఖాసీనం వందే వరవరం మునిమ్"** (కావేరీనదిమధ్యలో, ఉన్నతం అయినది, లోకాలకు శుభాలను కల్గించేది అయిన శ్రీరంగమనే దివ్యదేశంలో సుఖంగా వేంచేసి ఉండే శ్రీవరవరమునులను సేవిస్తున్నాను) అని తమ మనస్సులో అనుసంధించుకొంటూ వెళ్ళారు. శ్రీరంగానికి దేవరాజగురువులు చేరేటప్పటికి శ్రీవరవరమునులు శ్రీరంగనాథుని ఆలయానికి వేంచేసే సమయం. దేవరాజగురువు శ్రీవరవరమునులను సేవించి, అత్యాదరంతో **"దండవత్ ప్రణమేద్భూమౌ ఉపేత్య గురు మన్వహమ్"** (ప్రతిదినం ఆచార్యుని దగ్గరకుపోయి భూమిపై పడి సాష్టాంగదండప్రణామాన్ని చేయాలి) అనే నియమాన్ని పాటిస్తూ సాష్టాంగపడి, నిలువగా, వరవరమునులుకూడా **"లోచనాభ్యాం పిబన్నివ"** (రెండు నేత్రాలలో పానం చేస్తున్నట్లు) అనే రీతిలో వీరిని చల్లగా కటాక్షించారు. ఆ తరువాత దేవరాజగురువుల ప్రార్థనపై **"ఆత్మలాభాత్ పరం కించిదన్యన్నాస్తి"** అని తలచి, వారిని తమ శిష్యులుగా స్వీకరించారు.

యతీంద్రప్రవణ ప్రభావమనే శ్రీవరవరమునుల చరిత్రను తెలిపే గ్రంథంలో ఈ సందర్భాన్ని సూచించే ఈక్రింది శ్లోకంకూడా ఉన్నది.- **"భూత్వా భవ్యోవరవర మునిః భోగినాం సార్వభౌమః శ్రీమద్రంగే వసతి విజయీ విశ్వసంరక్షణార్థమ్, తత్త్వం గంతుం వ్రజ శరణ మిత్యాదిశ ద్రాఘవోఽయం స్వప్నే సోఽయం వరవరగురుః సంశ్రయో మాదృశానామ్"** (సర్పాల సార్వభౌముడైన ఆదిశేషులు (తిరువనన్దాళ్వాన్) ఆశ్రితసులభులైన వరవరమునులుగా అవతరించి, లోకాలను రక్షించడంకోసం నిత్యశ్రీతో కూడిన శ్రీరంగంలో వర్ధిల్లుతూ వేంచేసి ఉన్నారు. అటువంటి శ్రీవరవరమునులను తత్త్వార్థాలను తెలిసికోవడంకోసం శరణంగా ఆశ్రయించు- అని నన్ను శ్రీరామచంద్రుడు స్వప్నంలో నియమించాడు. అటువంటి ఈ మణవాళ మహామునులు మావంటివారికి ప్రాప్యభూతులు.)

శ్రీవాధూల వీరరాఘవాచార్య ప్రణీతమైన శ్రీవరవరముని సుచరిత చషకమనే కృతిలో ఈ ఉదంతం **"వాత్స్యే దేవాధిరాజే వరదగురువరై స్సాక మాగత్య దృష్ట్వా స్మేరస్వాంతేఽపి భాగ్యవ్యతికర విరహాత్ క్షేమ మప్రాప్య యాతే, స్వార్చ్యశ్రీజానకీశప్రబలనియమనేనాభిముఖ్యాదుపేతే, స్ఫీతైః స్వైః దృష్టి పాతైః ఘనతరకరుణాసారవర్షం వవర్ష"** అనే శ్లోకంలో ప్రస్తుతింపబడింది.

ఇక, శ్లోకంలోని కొన్ని విశేషార్థాలు సంగ్రహంగా విన్నవింపబడుతున్నాయి.

**(శేషః శ్రీమాన్) - "శ్రీమాన్"** అంటే సంపద కలవాడని అర్థం. ప్రకృతంలోని సంపద -ధనధాన్యాది లౌకిక సంపద కాదు. భగవత్కైంకర్యాన్ని సర్వకాల-సర్వదేశ- సర్వావస్థలలోను చేయగల్గడమనే సంపద మాత్రమే. భగవత్కైంకర్యం ఒక గొప్ప సంపద -అనే విషయం **"అంతరిక్షగతః శ్రీమాన్"** (అంతరిక్షంలో నిలచి ఉండే కైంకర్య శ్రీమంతుడైన విభీషణుడు) అని, **"స తు నాగవరః శ్రీమాన్"** (కైంకర్యం అనే లక్ష్మిని కల ఆ గజేంద్రుడు) అని, **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** (కైంకర్య సంపదలో కూడుకొన్న లక్ష్మణుడు) అని మొదలైన ప్రయోగాలవల్ల స్పష్టం. ఆదిశేషులకు ఉండే ఈ కైంకర్యలక్ష్మిని **"శెన్ఱాల్ కుడైయామ్, ఇరున్దాల్ శిఙ్గాశనమామ్, నిన్ఱాల్ మరవడియామ్, నీళ్ కడలుళ్ ఎన్ఱుమ్ అణైయామ్ పూమ్ పట్టామ్ పుల్కు మణైయామ్ తిరుమాఱ్కరవు"** (ప్రయాణం చేసేటపుడు గొడుగుగా, కూర్చుంటే సింహాసనంగా, నిలచి ఉండేటపుడు పాదుకలుగా, విశాలసముద్రంలో నిత్యంగా శయ్యగా, పీతాంబరంగా, తలదిండుగా మాఱి ఆదిశేషులు భగవానునకు కైంకర్యం చేస్తారు) అనే సరోయోగి పాశురంవల్ల, దీని వివరణరూపమైన **"నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపకారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాం గతైః యథోచితం శేష ఇతీరితే జనైః"** (నివాసం, శయ్య, ఆసనం, పాదుకలు, వస్త్రం, తలదిండు, ఎండవానల నుండి కాపాడే గొడుగు మొదలైన వాని వివిధ రూపాలలో నీకు కైంకర్యం యథోచితంగా చేసినందున శేషుడని పిలువబడేవాడు) అనే ఆళవన్దార్ స్తోత్రరత్నంలోని శ్లోకరత్నంవల్ల గ్రహించవచ్చు.

**(భగవాన్ రాఘవస్యానుజన్మా)**- కైంకర్యలక్ష్మితో కూడిన లక్ష్మణుడు- అనే విషయం- శ్రీరామాయణంలోని **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి, జాగ్రతః స్వపత శ్చ తే"** (నీవు సీతతోపాటు పర్వతసానువు లలో విహరిస్తావు. అపుడు, నీవు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు అన్ని కైంకర్యాలను చేస్తాను) అనే లక్ష్మణుని మాటవల్ల స్పష్టపడుతున్నది. ఈ కైంకర్యంకూడా భగవదభిమతానుసారమే చేయాలని ఆశపడిన వైనం **"పరవానస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే, స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద"** (శ్రీరామా!

నూఱు సంవత్సరాలుకు అయినా నేను నీకు పరతంత్రుడనే. నీవే స్వయంగా నీకు ఇష్టమైన చోట పర్ణశాలను నిర్మించమని నన్ను ఆజ్ఞాపించు) అనే లక్ష్మణ సూక్తివల్ల బోధపడుతుంది.

ఈవిధంగా తిరువనన్దాழ்వాన్‌గా (ఆదిశేషులుగా), లక్ష్మణస్వామిగా అవతరించినవారే ఇపుడు శ్రీవరవర మునులుగా ప్రకాశిస్తున్నారు. ఆ ఆచార్యవర్యులు అర్చామూర్తిగా నా ఆరాధనలోని శ్రీరామచంద్రుడు వేంచేసి ఉండే భద్రపీఠాన్ని అలంకరించి, మమ్ములను రక్షించాలి- అని దేవరాజగురువులు ఆశపడిన వృత్తాంతం ఈశ్లోకంలో అనుసంధింపబడింది.

దేవరాజగురుప్రణీతమైన శ్రీవరవరముని శతకం అంతా మందాక్రాంతావృత్త నిబద్ధం. ప్రకృతశ్లోకం కూడా ఆ వృత్తంలోనే రచింపబడడం గమనించాలి.

2. **శ్రోతం ద్రావిడవేదభూరివివృతిం సౌమ్యోపయంతు ర్మునేః**
**ఉత్కంఠాఽస్తి మమైన మానయత తం తార్క్ష్యాశ్రయం మండపమ్।**
**ఆవిశ్యార్చక మూచివానితి ముదా నిశ్శేషలోకాన్వితః**
**రంగీ వత్సర మేకమేవ మశ్రుణోత్ వ్యక్తం యథోక్తక్రమాత్ ॥**

సౌమ్యోపయంతుః మునేః = శ్రీవరవరమునుల వల్ల, ద్రావిడవేద = ద్రావిడవేదంగా చెప్పబడే తిరువాయ్‌మొழி ప్రబంధానికి కల ఆఱాయిరప్పడి, ఒన్పదినాయిరప్పడి, ఇరుపత్తునాలాయిరప్పడి, ఈడు ముప్పత్తాయిఱాయిరప్పడి, పన్నీరాయిరప్పడి- అనే అయిదు వ్యాఖ్యలలో, భూరివివృతిం = పెద్ద వ్యాఖ్యానం అయిన ఈడు ముప్పత్తాఱాయిరప్పడిని, శ్రోతుం = వినడానికి, మమ =నాకు, ఉత్కంఠా+అస్తి = ఉత్సుకత ఉన్నది, తమ్ ఏనమ్ = ఆ ఈ శ్రీవరవరమునులను, తార్క్ష్యాశ్రయం మండపమ్ = గరుడమండపానికి, ఆనయత = తీసికొనిరండి, ఇతి = అని, అర్చకమ్ ఆవిశ్య = అర్చకుని ఆవేశించి, రంగీ = శ్రీరంగనాథుడు, ఊచివాన్ = పలికాడు, యథోక్తక్రమాత్ = తాను చెప్పిన రీతిలోనే, ముదా = ఆనందంతో, నిశ్శేషలోకాన్వితః = అందఱు జనులతో కూడినవాడై, ఏకం వత్సర ఏవ = ఒక సంవత్సరకాలం, వ్యక్తం = వివరంగా, అశ్రుణోత్ = విన్నాడు.

ఈశ్లోకంలో "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్ శ్లోకావతరణకు సంబంధించిన ఐతిహ్యం ప్రస్తావింప బడుతున్నది. ఈ వృత్తాంతం యతీంద్రప్రవణ ప్రభావంతో ఈక్రింది విధంగా తెలుపబడింది.

**"తతః కదాచిదానూయ తమేనం మునిపుంగవమ్, కృపయా సాధు సత్కృత్య చరణాబ్జసమర్పణాత్, దర్శయన్ దుర్గ్రహానర్థాన్ ద్రమిడోపనిషద్గిరామ్, సన్నిధౌ వ్యాకురుష్వేతి శశాస్యామరశాసనః"** (తరువాత, ఒకానొక సమయంలో నిత్యసూరి పరిషన్నిర్వాహకుడైన శ్రీరంగనాథుడు సుప్రసిద్ధులైన శ్రీవరవరమునులను పిలిపించి, కృపతో తన శ్రీశఠారిని సమర్పించడం ద్వారా గౌరవించి, "మా సన్నిధిలో తిరువాయ్‌మొழி శ్రీసూక్తులలోని దుర్గ్రహాలైన అర్థాలను వివరించి, వ్యాఖ్యానించండి" అని నియమించాడు) -అనే రీతిలో శ్రీరంగనాథునకు పవిత్రోత్సవాలు జరిగే సమయంలో ఒకనాడు అక్కడ ఉన్నవారు అంతా పెద్ద సమూహంగా కూడి ఉండి, దర్శిస్తూ ఉండగా, మణవాళమహామునులు, వారి శిష్యులైన పూర్వాచార్యబృందం శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేయడంకోసం వేంచేసినపుడు **"పలరడియార్ మున్బు అరుళిన పామ్బణైయప్పన్"** (తిరువాయ్-7-10-5) (పలువురు భక్తుల సమక్షంలో అనుగ్రహించిన

ఆదిశేషశాయి అయిన స్వామి) అనే రీతిలో శ్రీరంగనాథుడు తన పరమకృపవల్ల, భగవద్రామానుజుల వైభవాన్ని తిరుక్కుఱుఙ్గుడి నమ్బి వ్యక్తం చేసినట్లే, శ్రీవరవరమునుల మహిమను ప్రకాశింపజేయాలని నిశ్చయించుకొన్నాడు. తానుకూడ శ్రీవరవరమునులకు శిష్యుడు కావడంకోసం, శ్రీవరవరమునులను ప్రత్యేకంగా ఆహ్వానించాడు. శ్రీశఠకోపాన్ని ప్రసాదించి, "రేపటినుండి మా పెరియ తిరుమండపంలో **"పెరియ వణ్కురుకూర్ నమ్బి"** (గొప్ప ఉదారులైన, కురుకూర్‌లోని గుణపూర్ణులైన) నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్‌మొళ్ళి - ఈడు ముప్పత్తాఱాయిరప్పడిని మొదటినుండి నిర్వహించండి"- అని నియమించాడు. **"మంగళాయతనే రమ్యే రమ్యజామాతృయోగిరాట్, యుగపద్ద్రావిడామ్నాయవ్యాఖ్యానధ్యానకౌతుకీ"** (మంగళాలకు నిలయం అయిన శ్రీరంగంలో శ్రీమణవాళమహాముని ఒక్కసారి తిరువాయ్‌మొళ్ళి దివ్యప్రబంధ వ్యాఖ్యానాన్ని ప్రవచించడం కోసం, దాని అర్థధ్యానంలో సంతోషాన్ని కల్గిన వారయ్యారు) అని తలచి, శ్రీవరవరమునులు "ఈ విధంగా నన్ను శ్రీరంగనాథుడు ఆజ్ఞాపించాడు కదా!" అని చాలా సంతోషించి, **"మహాన్ ప్రసాద ఇత్యస్య శాసనం శిరసా వహన్, తథైవ తత్ర వ్యాఖ్యాతుం తత్క్షణాదుపచక్రమే, శ్రీమతి శ్రీపతిః స్వామిమండపే మహతి స్వయమ్, తత్త్వం తస్య ప్రబంధస్య వ్యక్తం తేనైవ దర్శితమ్, శఠవైరిముఖైః శృణ్వన్ దేశికైః దివ్యదర్శనైః, అథ దివ్యమునే స్తస్య మహిమాన మమానుషమ్, అనుభూయేమ మాబాలగోపాల మఖిలో జనః, అమన్యత పరం ధన్య మాత్మానం తత్ర నిక్షిపన్"** (శ్రీరంగనాథుని దివ్యశాసనాన్ని మహాప్రసాదంగా శిరసా వహించి, ఆ నియమనానుసారం అక్కడ గరుడమండపంలో ఆ క్షణంలోనే, ఈడువ్యాఖ్యను ప్రవచించడానికి శ్రీవరవరమునులు ఉపక్రమించారు. శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు చాలా విశాలమైనది, అందమైనది అయిన ఆ పెరియ తిరుమండపంలో తాను, తనతోపాటు నమ్మాళ్వార్ మొదలైన దివ్యసూరులతో పాటు, పూర్వాచార్య బృందంతో పాటు గొప్ప సభ చేసి, ఆ ప్రబంధానికి శ్రీవరవరమునులచేత సుస్పష్టంగా అనుగ్రహింపబడే తత్త్వార్థాలను వింటూ సంతోషించాడు. ఆ తరువాత ఆ బాలగోపాలం జనులంతా ఆ దివ్యముని అయిన శ్రీవరవరమునుల అతిమానుష మహిమను అనుభవించి, ఆగోష్ఠిలో అభినివేశాన్ని కలవారై, తమను ధన్యులుగా భావించారు) అని వర్ణించిన రీతిలో ఈడునుండి అయిదు వ్యాఖ్యానాలతో తిరువాయ్‌మొళ్ళి ప్రబంధానికి విశేషంగా అర్థాన్ని వివరించే రీతిని ఆనందం వెల్లివిరిసేటట్లుగా ఆలకించాలని దివ్యదేవేరులతో కలసి దివ్యసింహాసనంలో వేంచేసి ఉండి, ఆ చేరికను దర్శించి అనుభవించే **"అయర్వఱు అమరర్‌కళ్"** అయిన తిరువనన్తాళ్వాన్, గరుడాళ్వాన్, శ్రీవిష్వక్సేనులు మొదలైన నిత్యసూరులతో, **"వైకున్దత్తు మునివర్"** అయిన నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులతో, శ్రీరంగంలోని వేదవిదులైన సమస్త ఆలయ పరివారంతో, **"అణి యరఙ్గన్ తిరుముఱ్ఱత్తు అడియార్"** (అందమైన శ్రీరంగంలోని ఆలయద్వారం దగ్గర ఉండే దాసుల) తోపాటు గొప్ప సభగా వేంచేసి ఉండి, **"రంగీ వత్సరమేక మేవ మశృణోత్ వ్యక్తం యథోక్తక్రమాత్"** అనే రీతిలో ఒక సంవత్సరకాలం పాటు ఆలకించాడు.

3. శ్రీభూభ్యాం రంగనాథే శఠజిదుపనిషద్వ్యాక్రియాం శ్రోతుకామే
**శేషః సంతోషయిష్యన్ వరవరమునితాం ప్రాప్య యో వర్తతేఽగ్రే ।**
**కాషాయశ్రీతులస్యంబుజమణిసుశిఖాయజ్ఞసూత్రత్రిదండైః**
**భాంతం శుభ్రోర్ధ్వపుండ్రం స్మర హృదయ! సదా కోశముద్రాంక హస్తమ్ ॥**

శ్రీభూభ్యాం = శ్రీదేవి, భూదేవులనే ఇద్దఱు దేవేరులతో, రంగనాథే = శ్రీరంగనాథుడు, శఠజిత్+ఉపనిషత్ వ్యాక్రియాం = తిరువాయ్‌మొழி వ్యాఖ్యను, శ్రోతృకామే (సతి) = వినగోరినవాడు కాగా,యః =ఏ ఆదిశేషుడు, వరవరమునితాం= వరవరమునిరూపాన్ని, ప్రాప్య =పొంది, అగే = ముందు, వర్తతే= వేంచేసి ఉన్నారో, అటువంటివారు, కాషాయ = కాషాయాంబరం, శ్రీతులసి = తులసీపూసల మాల, అంబుజమణి = తామరపూసల మాల, సుశిఖా= చక్కని శిఖ, యజ్ఞసూత్ర = యజ్ఞోపవీతం, త్రిదండైః = త్రిదండం- అనే వీటితో, భాంతం= ప్రకాశిస్తున్నవారు, శుభ్ర=+ఊర్ధ్వపుండ్రం = తెల్లని ఊర్ధ్వపుండ్రాలను కల్గినవారు, కోశముద్ర+అంకహస్తం = ఒక చేతిలో శ్రీకోశాన్ని, వేఱొక చేతిలో వ్యాఖ్యాన ముద్రను గుర్తుగా కలవారైన శ్రీవరవరమునులను, హృదయ = ఓ హృదయమా! సదా = ఎల్లప్పుడు, స్మర = ధ్యానించు.

ఈడు వ్యాఖ్యానప్రవచనాన్ని అనుగ్రహించే శ్రీవరవరమునుల దివ్యమంగళ విగ్రహాన్ని భావికాలంకార, ఉదాత్తాలంకార ప్రక్రియలో మన కంటి ముందు దేవరాజగురువు సాక్షాత్కరింపచేస్తూ, ఆ రూపాన్ని ధ్యానించమని తమన మనస్సును ఉద్బోధించడం ద్వారా మనకు కూడా ఉపదేశాన్ని చేస్తున్నారు. **"వర్తతేஉగ్రే"** అనే ప్రయోగస్వారస్యాన్నిబట్టి శ్రీవరవరమునులు ఈడుకాలక్షేపాన్ని చేసే సందర్భాన్ని సేవిస్తూ దేవరాజగురువులు ఈ శ్లోకాన్ని ఆశువుగా చెప్పారని స్ఫురిస్తుంది.

**(శ్రీభూభ్యామ్)** - శ్రీరంగనాథుడు తన ఉభయదేవేరులతో కలసి తిరువాయ్‌మొழி ఈడు కాలక్షేపాన్ని ఆలకించడం ఆ గ్రంథవైలక్షణ్యానికి ప్రతీక. **"ఇన్బమ్ పయక్క"** (తిరువాయ్-7-10-1) అనే దశకప్రవేశంలో నమ్పిళ్ళై- "వాల్మీకి భగవానుడు పాడిన శ్రీరామాయణాన్ని వినడంకోసం అయోధ్యలో శ్రీరాముడు తాను, తన సోదరులతో కలసి గొప్ప సభ చేసినట్లు, సర్వేశ్వరుడు తిరువాయ్‌మొழிని ఆలకించడంకోసం తిరువాఱన్‌విళై అనే దివ్యదేశంలో పర్యంక విద్యలో చెప్పిన రీతిలో ఆదిశేషునిపై శయనించి, దివ్యదేవేరితో, నిత్యపరిజనంతో కలసి వేంచేసి ఉన్నాడు'' అనే సూక్తి గమనార్హం. అంతేకాక వివరణం చివరలో కన్పించే **"శ్రీరామాయణత్తిల్కాట్టిల్ ఇదుక్కు వాశి-పాడినారే కేట్పిక్కైయుమ్, పాట్టుణ్డారే కేట్కైయుమాయిఱ్ఱు. "సీతాయా శ్చరితం మహత్" ఎన్నానిఱ్కచ్చెయ్‌దే, "కవిపాట్టుణ్డవళై ఒழிయ త్తనియే ఇరున్దిఱే కేట్టదు". పాడినాన్ వాల్మీకి భగవాన్; కేట్పిత్తారుమ్ కుశలవర్‌కళిఱే"** (శ్రీరామాయణం కంటే దీనికి వైలక్షణ్యం ఏమంటే - పాడినవారే వినిపించడం- పాశురాలకు విషభూతులైనవారు వినడం. **"సీతాయా శ్చరితం మహత్"** (సీతయొక్క గొప్ప చరిత్ర- అని అన్నా, ఆకథకు విషయ భూతురాలైన సీతను విడచి ఒంటరిగా ఉండి కదా శ్రీరాముడు శ్రీరామాయణాన్ని విన్నాడు. పాడినవాడు వాల్మీకి భగవానుడు. వినిపించిన వారు కుశలవులు కదా!) అనే సూక్తి కూడా భావ్యం. తిరువాయ్‌మొழிని ఆలకించిన సన్నివేశంకంటే ఈ ఈడును ఆలకించిన సన్నివేశం ఇంకా విలక్షణమైనది. తిరువాయ్‌మొழிని లక్ష్మీదేవితో మాత్రం కలిసి వినగా, దాని వ్యాఖ్యను ఇద్దఱు దేవేరులతో కలిసి **"శ్రీభూభ్యామ్"** అని అన్నట్లు అవధరించాడు కదా! ఈడు వ్యాఖ్యను వినాలి అనే భగవానుని మనోరథాన్ని ఈడేర్చడంకోసం సకల విధకైంకర్యాలను చేసి, శేషుడనే అన్వర్థనామాన్ని పొందిన ఆదిశేషుడే శ్రీవరవరమునులుగా అవతరించారు. ఆ రీతిలో ఈడు కాలక్షేపాన్ని అనుగ్రహించే సమయంలోని శ్రీవరవరమునుల మధురమైన రూపాన్ని ధ్యానించమని తమమనస్సుతో దేవరాజగురువు అంటున్నారు. **"తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్‌వడివై పేణుమవన్"** (తేజస్సు నిండుగా కల శిష్యుడు ఆచార్యుని దివ్యమంగళరూపాన్ని ఆదరించాలి) అనికదా ఉపదేశరత్తిన మాలైలోని శ్రీవరవరమునుల సూక్తి కూడా.

**(కాషాయ... త్రిదండైః)** -కాషాయవస్త్రం, శిఖాయజ్ఞోపవీతాలు, త్రిదండం, ద్వాదశోర్ధ్వపుండ్రాలు- ఇవన్నీ శ్రీవైష్ణవయతికి అసాధారణ చిహ్నాలు. **"ఉపవీతిన మూర్ధ్వపుండ్రవంతమ్, త్రిదండహస్తం.. శిఖయా శేఖరిణమ్"** (యజ్ఞోపవీతాన్ని, ద్వాదశ, ఊర్ధ్వపుండ్రాలను కలవారు చేతిలో త్రిదండాన్ని కలవారు, శిఖతో విరాజిల్లేవారు) ఇత్యాదిగా గల శ్రీదేశికుల యతిరాజసప్తతిలోని సూక్తి స్మరణీయం. పూర్వదినచర్యలో దేవరాజగురువు శ్రీవరవరమునుల రూపాన్ని కీర్తిస్తూ- **"మృణాల తంతుసంతాన సంస్థానధవళత్విషా, శోభితం యజ్ఞసూత్రేణ నాభిబింబసనాభినా, అంభోజ బీజమాలాభిర భిజాతభుజాంతరమ్, ఊర్ధ్వపుండ్రై రుపశ్లిష్ట ముచితస్థాన లక్షణైః, కాశ్మీరకేసరస్తోమకడారస్నిగ్ధరోచిషా, కాశేయేన సమింధానం స్కంధమూలావలంబినా"** (తెల్లని తామరతూడుల దారాల సమూహంవలె తెల్లని కాంతిని కల్గిన, నాభివరకువేలాడే యజ్ఞోపవీతంతో ప్రకాశించేవారు, తామరపూసల మాలలచే అలంకరింపబడ్డ అందమైన భుజాలతో, ఆ భుజాలమధ్య భాగం అయిన వక్షఃస్థలంతో అందమైన, లలాటాదిగా గల తగిన పన్నెండు స్థలాలలో శాస్త్రోక్తంగా ధరించిన ఊర్ధ్వపుండ్రాలతో వెలిగేవారు, కాశ్మీరకుంకుమపూల సమూహంవలె ఎఱ్ఱగా మెఱిసే, బాహువులలో ధరింపబడ్డ ఎఱ్ఱని పట్టు ఉత్తరీయాన్ని కలవారైన శ్రీవరవరమునులను). ఇత్యాదిగా పల్కిన సూక్తుల భావం అనుభావ్యం.

**(కోశముద్రాంకహస్తమ్)** - ఒక చేతిలో శ్రీకోశాన్ని, మఱొక చేతిలో **"ఉన్నిద్రపద్మసుభగా ముపదేశముద్రామ్"** (వికసించిన తామరవలె అందమైన ఉపదేశముద్రను) అని కీర్తించదగిన వ్యాఖ్యానముద్రతో ప్రకాశించే రూపాన్ని- అనిభావం.

**4.** **కృపయా పరయా స రంగరాణ్మహిమానం మహతాం ప్రకాశయన్ ।**
**లులుభే స్వయమేవ చేతసా వరయోగిప్రవరస్య శిష్యతామ్ ॥**

స రంగరాట్ = ఆ శ్రీరంగనాథుడు, కృపయా పరయా = పరమకృపతో, మహతాం = మహానుభావులకు, ప్రకాశయన్ = ప్రకాశింపజేస్తూ, స్వయమ్ ఏవ= స్వయంగానే, చేతసా = మనస్సుతో, వరయోగిప్రవరస్య = మణవాళమహా మునులకు, శిష్యతామ్ = తాను శిష్యుడై ఉండే స్థితిలో, లులుభే = గొప్ప లోభాన్ని (కోరికను) పొందాడు.

శ్రీవరవరమునుల మహిమను మహానుభావులకు అందఱికీ వ్యక్తం చేయదలచిన శ్రీరంగనాథుడు తాను స్వయంగా ఆ ఆచార్యవర్యులకు శిష్యుడు కావాలని గాఢంగా ఆశించాడు.

ఈ విషయాన్ని యతీంద్రప్రవణప్రభావం ఈక్రిందివిధంగా తెలుపుతున్నది-

"ఈవిధంగా ప్రారంభించిన ఈడు కాలక్షేపం ఒక సంవత్సరకాలం అక్కడ శ్రీరంగంలో ఈ నిర్విఘ్నంగా గడచింది ఆ కాలక్షేపం. పూర్తి కావచ్చే సమయంలో, ముందువలె అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులతో, శ్రీపరాంకుశ పరకాల యతివరాదిముక్తులతో పాటు వేంచేసి ఉండి, పెద్ద సభ చేసి, కాలక్షేపాన్ని విని **"పణ్ణార్ పాడల్"** (రాగాలతో పూర్ణమైన పాశురాలు) అని, **"శెవిక్కినియ శెఞ్జొల్"** (చెవులకు ఇంపైన తీయని పలుకులు) అని కీర్తింపబడే తిరువాయ్మొழிని చాలా ఆదరించాడు. శ్రీమణవాళమహామునులకు తీర్థాన్ని, ప్రసాదాన్ని, నిర్మాల్యాన్ని పరివట్టాన్ని, శ్రీశఠకోపాన్ని అనుగ్రహించిన తరువాత, అయిదు వ్యాఖ్యానాలతో తిరువాయ్మొழி ప్రబంధంలోని అపూర్వార్థాలను ప్రవచించిన రీతిని చూచి చాలా సంతోషించి, ఆ ఆనందాతిశయంచేత ఆ దివ్యప్రబంధ వ్యాఖ్యానవైభవాన్ని, శ్రీమణవాళమహామునుల వైభవాన్ని ప్రకాశింపజేయాలని తలచాడు. ఆ పనిని స్వయంగా తానే నిర్వహించాలని కూడా భావించాడు.

5. సమాప్తౌ గ్రంథస్య ప్రథితవివిధోపాయనచయే
పరం సజ్జీభూతే వరవరమునే రంఘ్రిసవిధే ।
హఠాద్బాలః కశ్చిత్ కుత ఇతి నిరస్తోఽప్యుపగతః
జగౌ రంగేశాఖ్యః పరిణతచతుర్హాయన ఇదమ్ ॥

గ్రంథస్య = తిరువాయ్‌మొழி ప్రబంధంయొక్క, సమాప్తౌ = పరిసమాప్తిలో, ప్రథిత = ప్రసిద్ధం అయిన, వివిధ =అనేక విధాలైన, ఉపాయనచయే = ఉపహారాల సమూహం, పరం = గొప్పగా, సజ్జీభూతే = సిద్ధం చేయబడినది కాగా, వరవరమునేః= శ్రీమణవాళమహామునుల, అంఘ్రిసవిధే = శ్రీపాదాల సమీపంలో, హఠాత్ = తటాలున, పరిణత చతుర్హాయనః =నాలుగేండ్ల వయస్సు నిండినవాడు, రంగేశాఖ్యః = రంగేశుడనే పేరును కలవాడైన, కశ్చిత్ బాలః = ఒకానొక బాలుడు, కుత ఇతి = ఎక్కడనుండో, నిరస్తః ఉపగతః అపి = సభలోనుండి బయటకు వచ్చి, దగ్గరకు సమీపించినవాడై, ఇదమ్ =దీనిని (శ్రీశైలేశదయాపాత్రమ్" అనే పద్యాన్ని), జగౌ = గానం చేశాడు.

కాలక్షేపం పూర్తి అయిన సమయంలో ఆచార్యసంభావన సమర్పించడం కోసం గొప్ప మంగళకర ద్రవ్యాలు సిద్ధం చేయబడినపుడు, ఆ సభలో హఠాత్తుగా రంగేశుడనే పేరును కల నాలుగేండ్ల కుఱ్ఱవాడు ఎక్కడినుండో బయటకు వచ్చి, మణవాళమహామునులను సమీపించి "శ్రీశైలేశ" ఇత్యాది తనియన్ శ్లోకాన్ని గానం చేశాడు.

6. శ్రీమాన్ రంగేశ్వరో యద్వకుళధరవచోభాష్యసారార్థజాతం
శ్రుత్వా సౌమ్యోపయం తుః నివరచరణే చ్ఛాత్రభావం ప్రపన్నః ।
శ్రీశైలేశేతి పద్యం ఖగపతినిలయే మంటపే తత్సమాప్తౌ
ఉక్త్వాఽధ్యేతవ్యమేతన్నిఖిల నిజగృహేష్వాదిశ త్తత్తదాదౌ ॥

యత్ = ఏకారణంవల్ల, శ్రీమాన్ = లక్ష్మీసహితుడైన, రంగేశ్వరః = శ్రీరంగనాథుడు, వకుళధరవచోభాష్య = తిరువాయ్‌మొழி వ్యాఖ్యానాలయొక్క, సార+అర్థజాతం = సారరూపంగా చెప్పదగిన అర్థసమూహాన్ని, శ్రుత్వా = ఆలకించి, తత్ సమాప్తౌ = ఆ కాలక్షేపం పూర్తి అయినపుడు, సౌమ్యోపయంతా మునివర చరణే= శ్రీమణవాళమహామునుల శ్రీపాదాలలో, ఛాత్రభావం=శిష్యత్వాన్ని, ప్రపన్నః= పొందినవాడై, ఖగపతినిలయే = గరుడాழ்వాన్ సన్నిధిలోని, మంటపే = మంటపంలో, శ్రీశైలేశేతిపద్యం = "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే శ్లోకాన్ని ఉక్త్వా = పల్కి, ఏతత్ = ఇతి, నిఖిలనిజగృహేషు = అందఱిచేత తమ తమ ఇండ్లలో, తత్+తత్+ఆదౌ = ఆయా శుభకార్యాల ఆరంభంలో, అధ్యేతవ్యం = అధ్యయనం చేయాలని, ఆదిశత్= ఆజ్ఞాపించాడు.

శఠకోపుల తిరువాయ్‌మొழிప్రబంధానికి గల వ్యాఖ్యలలోని సారార్థాలను విన్న శ్రీరంగనాథుడు, చివరలో శ్రీవరవరమునులకు శిష్యుడై, గరుడమంటపంలో "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్ శ్లోకాన్ని పఠించి, ఆ శ్లోకాన్ని అందఱు తమ తమ ఇండ్లలో ఆయా కార్యాల ఆరంభంలో అనుసంధించాలనే కట్టడి చేశాడు. ముందు శ్లోకంలో, ఈ శ్లోకంలో చెప్పబడ్డ వృత్తాంతాన్ని యతీంద్రప్రవణప్రభావ గ్రంథం ఈవిధంగా ప్రస్తావించింది.

"ఆచార్యసంభావనను, ఏలాలవంగకర్పూరాదులను, తిరుప్పరివట్టాలను, ఫలాలను, వక్కతమలపాకులను పళ్ళాలలో సిద్ధం చేసినపుడు, అழகియమణవాళ భట్టర్ అనే అర్చకుల కుమారుడు, అయిదు సంవత్సరాల వయస్సును

కల రంగనాయకుడనే తిరునామాన్ని కల ఒక చిన్న కుఱ్ఱవాడు పళ్ళాలకు, పెరుమాళ్‌కు మధ్యగా వచ్చి నిలిచాడు. అతనిని అందఱు ఆశ్చర్యంగా చూస్తూ, "నీవు వచ్చిన పని ఏమి?" అని ప్రశ్నించారు. అప్పుడాబాలుడు చేతులను జోడిస్తూ మొదటగా **"శ్రీశైలేశదయాపాత్రమ్"** అని అన్నాడు. తరువాత ఏమి? అని అడిగినపుడు **"ధీభక్త్యాదిగుణార్ణవమ్"** అని అన్నాడు. "ఇంకా చెప్పు" అని అనగా, **"యతీంద్ర ప్రవణమ్ వందే రమ్యజామాతరం మునిమ్"** అని పల్కి పరుగెత్తి పోయి అదృశ్య మయ్యాడు. సభలోని పెద్దలంతా ఆశ్చర్యపడ్డారు. శ్రీరంగనాథుడు అర్చక ముఖంగా ఆ శ్లోకాన్ని తాళపత్రంలో వ్రాయమని పల్కి, ఆ పత్రానికి పసుపునురాయించి, తన శ్రీపాదాల దగ్గర పెట్టమని ఆజ్ఞాపించాడు. ఆవిధంగానే చేసిన తరువాత ఆ తాళపత్రాన్ని ఆచార్యసంభావన సంభారాలున్న పళ్ళెంలో పెట్టించిన శ్రీరంగనాథుడు అప్పిళ్ళై అనే శ్రీవరవరమునుల శిష్యులను పిలిచి, మీరు శ్రీవరవరమునులకు వాழ்த్తిరునామాన్ని చెప్పండి- అని ఆజ్ఞాపించాడు. అపుడు అప్పిళ్ళై -**"వాழ் తిరువాయ్‌మొழிప్పిళ్ళై"** అని ప్రారంభించి, **"మణవాళమామునియే! ఇన్న మొరు నూற்ఱాణ్డిరుమ్"** అని పలుకగా, శ్రీరంగనాథుడు వారిని ఎంతో ఆదరించి, అనుగ్రహించి, సత్కరించాడు. శ్రీరంగం, తిరుమల, కాంచీపురం మొదలైన దివ్యక్షేత్రాలలో అంతటా శ్రీసేనైమొదలియార్ శ్రీముఖంగా- అనుసంధాన సమయాలలో ఎల్లప్పుడు శ్రీరంగనాథుడు అనుగ్రహించిన **"శ్రీశైలేశదయాపాత్రమ్"** అనే తనియన్‌తో ప్రబంధాధ్యయనాదులను ప్రారంభం చేయాలని, ప్రబంధాన్ని ముగించేటపుడు **"వాழ் తిరువాయ్‌మొழிప్పిళ్ళై"** అని ప్రారంభించి, **"మణవాళ మామునియే! ఇన్నమొరు నూற்ఱాణ్డిరుమ్"** అని అనుసంధించి పూర్తి చేయాలని- ఆజ్ఞాపించి పంపించాడు. ఆ తరువాత వానమామలై రామానుజజీయర్, కన్దాడై అణ్ణన్, ఎఱుమ్బి అప్పా, ప్రతివాది భయంకరమ్ అణ్ణా మొదలైన పెద్దలు తమ భక్త్యతిశయం వల్ల, తనియన్ శ్లోకాన్ని తిరుమంత్రార్థంగా యోజన చేసి, ఇది అందఱికీ ఉత్తారకం - అని సంతోషించారు.

ఈ శ్లోకంలో ప్రస్తుతమైన వృత్తాంతం శ్రీవాధూలవీరరాఘవాచార్య ప్రణీతమైన వరవరమని సుచరితచషకమనే లఘుకృతిలో **"ఏవంభూతం మునీంద్రం ధరణిజలధిజానాయకో రంగనాథః స్వస్మై భాష్యం శ్రుతీనాం వకుళధరమునేః వక్తు మాజ్ఞాపయత్ తమ్, సోఽయం సంవత్సరేణ ద్రమిడమయసుధాం రంగనాథాయ వర్షన్, శ్రీశైలేత్యాదిపద్య ప్రవచనముఖతః తేన సంపూజితోఽభూత్"** అనే శ్లోకంలో ప్రస్తావింపబడింది.

7. **వేదాదౌ పూర్వ ముక్త్వా హరిరితి సుజనో వక్తి పశ్చాద్యథోమి-**
   **త్యేవం వక్తవ్య మేతత్ వకుళధరవచోనుశ్రవారంభకాలే ।**
   **శ్రీశైలేశేతి పద్యం ప్రథమ మథ సతాం సంప్రదాయైకనిష్ఠైః**
   **లక్ష్మీనాథేతి పద్యం స్వయమితి భగవానాదిశద్రంగనాథః ॥**

వేదాదౌ = వేదాధ్యయన ప్రారంభంలో, పూర్వం =ముందుగా, యథా = ఏవిధంగా, సుజనః = సత్పురుషుడు, హరిః ఇతి = హరిః అని, ఉక్త్వా = పల్కి, పశ్చాత్ = పిమ్మట, ఓమ్ ఇతి = ఓమ్ అని, వక్తి = పల్కుతున్నాడో, ఏవం= ఈ రీతిలోనే, వకుళధరవచోనుశ్రవారంభకాలే = నమ్మాழ்వార్ల దివ్యప్రబంధాను సంధానప్రారంభకాలంలో, ఏతత్= ఈ, **"శ్రీశైలేశే"**తిపద్యం = **"శ్రీశైలేశదయా పాత్రమ్"** అనే పద్యం, ప్రథమం = మొదటగా, సతాం సంప్రదాయైకనిష్ఠైః= సత్సంప్రదాయైకనిష్ఠులచేత, వక్తవ్యం = అనుసంధింపదగినది, అథ= తరువాత, **"లక్ష్మీనాథ"** ఇతి పద్యం = **"లక్ష్మీనాథసమారంభామ్"** అనేపద్యం వక్తవ్యం, ఇతి = అని, స్వయం =స్వయంగా, భగవాన్ రంగనాథః = భగవానుడైన శ్రీరంగనాథుడు, ఆదిశత్ = ఆదేశించాడు.

వేదాధ్యయన ప్రారంభంలో ముందుగా **"హరిః"** అనే పదాన్ని ఉచ్చరించి, తరువాత **"ఓమ్"** అని ఉచ్చరించడం వైదికసంప్రదాయం. అదే రీతిలో, సత్సంప్రదాయనిష్ఠులు ద్రావిడవేదంగా కీర్తింపబడే నమ్మాళ్వార్ల ప్రబంధాధ్యయన ప్రారంభంలో ముందుగా ఈ **"శ్రీశైలేశదయాపాత్రమ్"** ఇత్యాది తనియన్‌ను అనుసంధించి, తరువాత **"లక్ష్మీనాథసమారంభమ్"** అనే పద్యాన్ని అనుసంధించాలని భగవానుడైన శ్రీరంగనాథుడు స్వయంగా ఆదేశించాడు.

**8. యద్వద్వక్తుం న యుక్తం ప్రణవహరిపదాభ్యంతరేఽ న్యత్ పదం తత్**
**కృష్ణేత్యేతత్కదాచిన్మునిశతవచనైః వైదికైః బ్రహ్మనిష్ఠైః ।**
**తద్వద్రంగేశభక్తైః శమదమనియతైః సాధుభి స్తత్త్వవిద్భిః**
**వక్తుం యుక్తం కమధ్యే కపది నియతయోరేతయోః పద్య మన్యత్ ॥**

యద్వత్ = ఏవిధంగా అయితే, ప్రణవహరిపద+అభ్యంతరే = ప్రణవానికి, ఓంకారానికి మధ్యలో, కృష్ణ ఇతి తత్ అన్యత్ పదం = "కృష్ణ ఇత్యాది వేఱొక పదం, మునిశతవచనైః = వందలాది మునుల వచనాలను ప్రమాణంగా కలవారు, బ్రహ్మనిష్ఠైః = బ్రహ్మశబ్దవాచ్యం అయిన వేదాన్ని ప్రమాణంగాకల, వైదికైః = వైదికులచేత, వక్తుం = పల్కడం, న యుక్తం = తగినది కాదో, తద్వత్ = అదే రీతిలో, శమదమనియతైః = శమదమాదులచేత ఇంద్రియనిగ్రహాన్ని కలవారు, తత్త్వవిద్భిః = తత్త్వజ్ఞులైన, రంగేశభక్తైః = శ్రీరంగనాథుని భక్తులచేత, ఏతయోః పద్యయోః మధ్యే = "శ్రీశైలేశ" -"లక్ష్మీనాథ"ఇత్యాది రెండు తనియన్‌శ్లోకాల మధ్య, అన్యత్ పద్యం = వేఱొక శ్లోకాన్ని, వక్తుం = పల్కడం, న యుక్తం = తగినది కాదు.

ఏవిధంగా అయితే ఓంకారం -హరిపదాల ఉచ్చారణమధ్యలో వేఱొక పదాన్ని ఉచ్చరించడం వైదిక సంప్రదాయనిష్ఠులకు తగినది కాదో, ఆవిధంగానే శమదమాదిసద్గుణ పూర్ణులు, తత్త్వజ్ఞులు అయిన శ్రీరంగనాథుని భక్తులు "శ్రీశైలేశ" అని, "లక్ష్మీనాథ" అని ప్రారంభం అయే రెండు తనియన్ శ్లోకాల అనుసంధానం మధ్యలో వేఱు ఏ శ్లోకాన్ని అనుసంధించడం ఉచితం కాదు.

శ్రీశైలేశేతి తనియన్ పద్యం ప్రణవార్థప్రకాశకం అనే అంశాన్ని శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యలో గమనించవచ్చు.

**9. శఠరిపు రేకఏవ కమలాపతిదివ్యకవిః**
**మధురకవి ర్యథా చ శఠజిన్మునిముఖ్యకవిః ।**
**యతికులపుంగవస్య భువి రంగసుధాకవిరాట్**
**వరవరయోగినో వరదరాజకవి శ్చ తథా ॥**

యథా= ఏవిధంగా, భువి = ఈలోకంలో, కమలాపతిదివ్యకవిః =శ్రియఃపతియొక్క దివ్యకవి, శఠరిపుః ఏకః ఏవ = నమ్మాళ్వార్లు ఒక్కరే, మధుకవిః చ= మధుర కవికూడా, శఠజిన్మునిముఖ్యకవిః = నమ్మాళ్వార్లకు ముఖ్యకవియో, యతికులపుంగవస్య = భగవద్రామానుజులకు, రంగసుధాకవిరాట్ = తిరువరంగత్తముదనార్ ముఖ్యకవియో, తథా =ఆ విధంగానే, వరవరయోగినః = వరవరమునులకు, వరదరాజకవిః చ = దేవరాజగురువులనే కవికూడా, తథా = ఆ విధంగానే ముఖ్యకవి.

లోకంలో ఎంతోమంది కవులు భగవత్కీర్తనం చేసినా, భగవానుడైన శ్రియఃపతియొక్క దివ్యకవిగా నమ్మాళ్వార్లు మాత్రమే ప్రసిద్ధిచెందారు. **"తిరుమాలవన్ కవి"** అని తమను తామే నిర్దేశించుకొన్నారు కదా ! ఆచార్య పారమ్యాన్ని అనుష్ఠించి, తమ ప్రబంధం అయిన కణ్ణినుణ్శిఱుత్తాంబు ద్వారా వ్యక్తం చేసిన మధురకవులు నమ్మాళ్వార్లను స్తుతించిన కవులలో ప్రముఖులు. **"మధురకవి శొన్న శొల్"** అని వీరుకూడా తమను మధురకవిగా నిర్దేశించుకున్నారు. శ్రీరామానుజుల కవులలో మొట్టమొదటివారైన తిరువరంగత్తముదనార్ ముఖ్యులు. అందువల్లనే వీరికి **"అముదనార్"** అనే పేరు సార్థకం అయినది. ఈమూడు తిరునామాలు ప్రకృతానికి ఉదాహరణాలు. ఇక, ప్రస్తుత విషయం ఏమంటే - శ్రీవరవరమునులను స్తుతించినవారు ఎంతోమంది ఉన్నా, వారిలో దేవరాజగురువు అనబడే ఎఱుమ్బి యప్పా ముఖ్యులు. వీరు శ్రీవరవరమునుల విషయంగా శతకం, చంపూకావ్యం, నాటకం, దినచర్యాస్తోత్రం మొదలైన పలు కృతులను రచించి స్వాచార్యుల విషయంలో తమ ప్రావణ్యాతిశయాన్ని ప్రకటించుకొన్నారు. వీరి కవిత్వం వైదర్భీరీతిలో, ద్రాక్షాపాకాన్ని, శబ్ద మాధుర్యాన్ని, అర్థగాంభీర్యాన్ని కల్గి ఉంటుంది. శైలి చిన్న చిన్న పదాలతో, దీర్ఘసమాసాలు లేకుండా శ్రోతృజనాహ్లాద కరంగా ఉంటుంది.

శ్రీశైలాష్టకవివృతిః క్లుప్తా దాసేన శింగరార్యేణ ।
సారాసారజ్ఞానాం సేయం భవతాత్ ప్రమోదాయ ॥



శ్రీమణవాళమహామునులవిషయంగా
కోయిల్‌కన్దాడై అణ్ణన్ అనుగ్రహించిన

# కణ్ణినుణ్ శిఋత్తామ్బు

( మణవాళమహామునులు అనుగ్రహించిన తనియన్ )

ఎక్కుణత్తోర్ ఎక్కులత్తోర్ ఎవ్వియల్‌వోర్ ఆయిడినుమ్
అక్కణత్తే నమ్మిఱైయవరావరే - మిక్క పుకఝ్
క్కారార్‌పొఝిల్ కోయిల్ కన్దాడై యణ్ణనెనుమ్
పేరాళనై యడైన్ద పేర్

మిక్క పుకఝ్ =మిక్కిలి (పూర్ణం అయిన) కీర్తిని కలవారై, కార్ ఆర్ పొఝిల్= మేఘాలు సంచరించే (నిలచి ఉండే) తోటలచేత పరివేష్ఠితం అయిన, కోయిల్ = శ్రీరంగాన్ని నిరూపకంగా కలవారై, కన్దాడై = కన్దాడైకులంలో అవతరించినవారై, అణ్ణన్ ఎనుమ్ = అణ్ణన్ అని ప్రసిద్ధిని పొందినవారైన, పేరాళనై= మహానుభావులను, ఎక్కుణత్తోర్ ఆయినుమ్ = ఎటువంటి చెడ్డగుణాలను కలవారై ఉన్నా, ఎక్కులత్తోర్ ఆయినుమ్ = ఏవిధమైన తక్కువ కులంలో జన్మించినవారైనా, ఎవ్వియల్‌వోర్ ఆయిడినుమ్ = ఎటువంటి తగని స్వభావాన్ని కలవారై ఉన్నా, అక్కణత్తే =అణ్ణన్‌ను ఆశ్రయించిన ఆ క్షణంలోనే, నమ్ ఇఱైయవర్= మాకు స్వాములుగా, ఆవర్ ఏ = కాగలరు అన్నది నిశ్చయం. (ఏకారం నిశ్చయార్థకం)

ఉన్నతవంశంలో పుట్టుక, దానికి తగిన జ్ఞానభక్తివైరాగ్యాది సద్గుణాలు, వాటితో చేరిన మంచి ప్రవర్తన - అనే వీటిచేత మిక్కిలి కీర్తిని సంపాదించినవారు, కోయిఅ్కన్దాడై అణ్ణన్ అనే విశిష్టనామంతో వ్యవహరింపబడే మహనీయులు. వీరిని శరణంగా ఆశ్రయించిన ఒక వ్యక్తి తక్కువ కులంలో జన్మ, దుర్గుణాలు, తగని ప్రవర్తన - అనే వీటిని కల్గినవాడైనా, అణ్ణన్‌కు ఆశ్రయించిన ఆ క్షణంలోనే వారి మధురమైన కృపచేత దోషం అంతా తీరి ఔన్నత్యాన్ని పొందుతాడు. కాబట్టి, మణవాళమహామునులు అణ్ణన్‌ను తమ దాసులుగా చేసుకొన్నారు.

భగవత్సమాశ్రయణాన్ని చేసినవారినే ఆఝ్వార్లు **"పరమనై ప్పయిలుమ్ తిరువుడైయార్ యవరేలుమ్ అవర్ కణ్డీర్ ఎమ్మై యాళుమ్ పరమర్"** (పరమాత్మను కీర్తించే సిరిని కలవారు ఎవరైనా వారేసుమా, మమ్ములను పాలించే గొప్పవారు), **"ఆఝిప్పిరాన్ తన్నై పణియుమవర్ కణ్డీర్ ఎమ్మై యాళుడై నాదర్"** (శ్రీసుదర్శన దారిని సేవించేవారే సుమా మమ్ములను పాలించే నాథులు.) ఇత్యాదిగాను, **"కడల్ మల్లైత్తలైశయనత్తుఱైకిన్ఱ ఞానత్తినొళియురువై నినైవార్ ఎన్ నాయకర్"** (కడల్ మల్లైత్తలైశయనం అనే దివ్యదేశంలో నివసించే జ్ఞానస్వరూపుడైన పరమాత్మను ధ్యానించేవారు మా నాయకులు.), **"కడల్‌మల్లై త్తలైశయనత్తుఱైవారై క్కొణ్డాడుమ్ నెఞ్జుడైయార్ అవర్ ఎజ్గళ్ కులదెయ్‌వమ్"** (కడల్ మల్లైత్తలైశయనమ్ అనే క్షేత్రంలో నిత్యవాసం చేసే స్వామిని కీర్తించే మనసు కలవారు మా కులదైవం) ఇత్యాదిగాను తమకు స్వాములు అని అనుగ్రహించగా, పరమభాగవతులైన అణ్ణన్‌ను ఆశ్రయించినవారిని మామునులు తమకు

స్వాములుగా అనుగ్రహించడం కింపునఃన్యాయసిద్ధంకదా! ఈ తనియన్ యతీంద్రప్రవణప్రభావంలో కన్పిస్తున్నది.

ఈ తనియన్‌ను ఆచార్యులైన మణవాళమహామునులు తమ శిష్యులైన కోయిల్అణ్ణన్‌నుగూర్చి అనుగ్రహించారు. మణవాళమహామునుల దృష్టిని బట్టి చూస్తే మామునులు తమకు తమకు సబ్రహ్మచారి అయిన అణ్ణన్‌కు తనియన్‌ను అనుగ్రహించారనికూడా చెప్పవచ్చు. **"తాన్ హితోపదేశమ్ పణ్ణుమ్బోదు తన్నైయుమ్, శిష్యనైయుమ్, ఫలత్తైయుమ్ మాఱాడి నినైక్కై క్రూరనిషిద్ధమ్"** (శ్రీవచన-308) (తాను హితోపదేశం చేసేటప్పుడు తనను, శిష్యుని, ప్రయోజనాన్ని వేరేవిధంగా భావించడం చాలా నిషిద్ధం) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన తీరులోనే, ఆచార్యుడు తన శిష్యుని తనకు శిష్యునిగా తలచకుండా తన ఆచార్యుని శిష్యునిగానే - అంటే తనకు సబ్రహ్మచారిగానే భావించాలి. కాబట్టి శ్రీవచనభూషణంలోని గంభీరార్థాలను అన్నిటినీ గ్రహించి, ఆ సూక్తి క్రమంలో అనుష్ఠించేవారిలో మామునులు ఒకరు కనుక, అణ్ణన్‌ను తమకు సబ్రహ్మచారిగా భావించడం తగినదే కదా!

**"తన్నాశిరియన్ తన్నోడు క*ఱ్ఱో*న్ తన్మాణాక్కళ్ తకు ముఱైకారన్ ఎన్ఱిన్నోర్ పాయిర మియమ్బుదల్ కడనే"** (తన ఆచార్యులు, తనతో కలసి అధ్యయనం చేసిన సబ్రహ్మచారి, తన శిష్యులు - అని వీరు తనియన్‌ను రచించడానికి అర్హులు) (నన్నూల్-51) అని చెప్పబడ్డ రీతిలో ఆచార్యుడు తన శిష్యునకు తనియన్ అనుగ్రహించడం, సబ్రహ్మచారులిద్దఱిలో ఒకరు ఇంకొకరికి తనియన్ వ్రాయడం యుక్తమే. **"తన్నోడు క*ఱ్ఱో*న్"** అంటే సబ్రహ్మచారి.

---

శ్రీమణవాళమహామునులవిషయంగా

కోయిల్‌కన్దాడై అణ్ణన్ అనుగ్రహించిన

# కణ్ణినుణ్ శిఋుత్తాम्బు

**1.** అవ :- కోయిలణ్ణన్ ఈ మొదటి పాశురంలో సదాచార్యసంబంధాన్ని పొందిన మణవాళమహామునులను తాము అగతికులై ఆశ్రయించిన వైనాన్నిగూర్చి అనుగ్ర హిస్తున్నారు.

**శీరు*ఱ్ఱ* శెళ్ఞొల్ తిరువాయ్‌మొ*ళ్ళి*ప్పిళ్ళై శెమ్ముకముమ్**
**తారు*ఱ్ఱ* మార్బుమ్ తళిరేయ్ పదజ్గళుమ్ తమ్మనత్తు**
**పూరిత్తు వా*ళ్ళు*మ్ మణవాళ మాముని పొన్నడికళ్**
**పారిల్ తనిత్త అడియేన్ శరణెన్ఱు ప*ఱ్ఱి*ననే**

శీర్ ఉ***ఱ్ఱ*** = గొప్పతనాన్ని కల్గిన, శెమ్ శొల్ = సత్యమైన శ్రీసూక్తులను అనుగ్రహిస్తున్న, తిరువాయ్‌మొ*ళ్ళి*ప్పిళ్ళై = తిరువాయ్‌మొ*ళ్ళి*ప్పిళ్ళై అనే తమ ఆచార్యుల, శెమ్ ముకమ్ = ఎఱ్ఱని (అందమైన) తిరుముఖమండలాన్ని, తార్ ఉ*ఱ్ఱ* = తామరపూసల, తులసిపూసల దండలను పొందికగా కల, మార్బుమ్ = వక్షః స్థలాన్ని, తళిర్ ఏయ్ పదజ్గళుమ్ = చిగురుతో సాటి వచ్చే వారి శ్రీపాదాలను, తమ్

మనత్తు = శిష్యులైన తమ మనస్సులో, పూరిత్తు = నిండిస్తూ(ధ్యానిస్తూ), వాழ்ழும் = ఆనందిస్తున్న, మణవాళమాముని పొన్ అడికళ్ = మణవాళ మహామునుల బంగారంవలె అభిలషించతగిన శ్రీపాదాలను, పారిల్ = ఈలోకం లో, తనిత్త = వేఱు ఉపాయం, గతి లేకుండా అనన్యగతికునిగా ఉన్న, అడియేన్= దాసుడనైన నేను, శరణ్ ఎన్ఱు = ఇవే మనకు రక్షకం అని, పற்றினేన్ = స్థిరమైన నమ్మకంతో ఆశ్రయించాను.

తిరువాయ్మొழிప్పిళ్ళై శ్రీసూక్తులు గొప్పవి, సత్యమైనవి. **"శెమ్మై"** అంటే భవిష్యత్తులో మంచినికల్గించే స్వభావం. యథార్థాన్ని తెలిపే స్వభావం. **"శీర్"** అంటే వినేటపుడు మధురంగా ఉండేవి. **"శీరుற்ற"** అనే విశేషణాన్ని తిరువాయ్మొழிప్పిళ్ళైకు విశేషణంగా చేసి "కల్యాణగుణాలతో పూర్ణులైన'' అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**2.** అవ :- తాము మణవాళమహామునులను ఆశ్రయించడానికి గల కారణాన్ని ఇందులో అణ్ణన్ తెలుపుతున్నారు. వారి ముఖోల్లాసంకోసం తిరువాయ్మొழிప్పిళ్ళై శ్రీచరణాలను శరణాగతి చేస్తున్నారు.

. **పற்றినన్ శెమ్మై త్తిరువాయ్మొழிప్పిళ్ళై ప్పాదఙ్గళ్**
**ఉற்றనన్ శెమ్ మఱైయుళ్ళ దెల్లా మివై యుణ్మై యెన్ఱే**
**కற்றనన్ కోయిల్ మణవాళమాముని క్కార్ముకిలై**
**ప్పెற்றనన్ ఇఙ్గడియేన్ ఇనిమేల్ పిఱవామలుక్కే**

అడియేన్ = దాసుడను అయిన నేను, శెమ్మై = ఎఱ్ఱుని, తిరువాయ్ మొழிప్పిళ్ళై పాదఙ్గళ్ = తిరువాయ్మొழிప్పిళ్ళై శ్రీచరణాలను, పற்றినన్ = శరణంగా ఆశ్రయించాను. శెమ్ మఱై = ఋజువైన వేదాలలో, ఉళ్ళదు ఎల్లామ్= ఇపుడు అధ్యయనం చేయబడుతున్న శాఖలు అన్నిటిని, ఉవై ఉణ్మై ఎన్ఱు ఏ = ఇవి అన్నీ యథార్థాన్ని ప్రతిపాదించేవి అని భావించే, ఉற்றనన్ = ఊనికను కల్గినవాడనై, కற்றనన్ = అభ్యసించాను, ఇని మేల్ = ఇకపై వచ్చే దినాలలో, ఇఙ్గు పిఱవామలుక్కు = ఈ లోకంలో పుట్టకుండా, పరమపదాన్ని పొందడానికి, కోయిల్ మణవాళమాముని కళ్ = శ్రీరంగంలో నిత్యవాసం చేసే మణవాళమహామునులు అనే, కార్ ముకిలై = జలపూర్ణం అయిన మేఘాన్ని, పెற்றనన్ = ఆచార్యునిగా ఆశ్రయించాను.

**3.** అవ :- తాము ఆశ్రయించిన మణవాళమామునులకు తిరువాయ్మొழிప్పిళ్ళై మధురమైన కృపచేత లభించిన భగవద్రామానుజుల శ్రీచరణాలలోని ప్రావణ్యాన్ని గూర్చి చెప్పి, అటువంటి యతీంద్రప్రవణులైన మామునులను అందరూ మంగళా శాసనం చేయవలసి ఉండగా, ఆ రీతిలో చేయనివారిని ఇందులో నిందిస్తున్నారు.

**పిఱవామల్ వాழ்విక్కుమ్ పేరరుళాళర్ పెరుమై యెన్ఱుమ్**
**తుఱవాద శిన్దై యెతిరాశన్ తుయ్యపదఙ్గళ్ నెఞ్జిల్**
**మఱవాద శీలన్ మణవాళమాముని మామలర్త్తాళ్**
**పఱైయాద వాశకర్ యార్ అవర్ పఞ్జమాపాతకరే**

పిఱవామల్ = ఈ భూమిలో జన్మించి, దుఃఖించకుండా ఉండేటట్లు, వాழ்విక్కుమ్ = మోక్షానందాన్ని అనుగ్రహించడానికి కారణం అయిన, పేరరుళాళర్ = పూర్ణమైన కృపను కలవాడైన శ్రీకాంచీ వరదరాజ

స్వామి యొక్క, పెరుమై = మహిమలను, ఎన్నుమ్ తుఱవాద = ఎల్లప్పుడూ విడవకుండా అనుసంధించే, శిన్దై= మనస్సును గల, ఎతిరాశన్ = భగవద్రామానుజుల, తుయ్య పదజ్గళ్ = పరిశుద్ధాలైన శ్రీపాదాలను, నెఞ్జిల్ మఱవాద = తమ మనస్సులో మఱువకుండా ఉండే, శీలన్= స్వభావాన్ని కల, మణవాళమాముని= శ్రీమణవాళమహామునులయొక్క, మా మలర్= ఎఱ్ఱని తామరలవంటి, తాళ్ = శ్రీచరణాలను, పత్రైయాద= స్తుతించని (చాటింపు వేయని), వాశకర్ = పలుకులను కలవారు, యార్ = ఎవరో, అవర్ = వారు, పఞ్జ మా పాతకరే = అయిదు గొప్ప పాపాలను చేసినవారే కాగలరు.

**4.** అవ :- మణవాళమహామునులకు అనుకూలురు కానివారిని నిందించిన తరువాత, అనుకూలురైన వారికి మణవాలమామునులు మోక్షోపాయభూతులై ఉండే స్వభావాన్నిగూర్చి తెలుపుతున్నారు.

**పాతక ముళ్ళవై తామే యొழிత్తు ప్పరిన్దవర్క్కు**
**శ్శాతక మానదుమ్ ఈదెన్ఱు కొణ్డు చరణ్ కొడుక్కుమ్**
**మాతకవోన్ మణవాళమాముని ప్పరన్ మామలర్త్తాళ్**
**పాదుకైయై చ్చరణాయ్ ముడిమేఱ్కొణ్డు పఱ్ఱినర్క్కే**

మా తకవోన్ = గొప్ప కరుణను కల, మణవాళమాముని పరన్ = మణవాళ మహామునులు అనే మహాపురుషులు, మా మలర్ తాళ్ పాదుకైయై = ఎఱ్ఱని తామరపూలవంటి తమ శ్రీపాదాలలో సమర్పింపబడ్డ శ్రీపాదాలను, శరణ్ ఆయ్ = మోక్షోపాయంగా భావించి, ముడిమేల్ కొణ్డు = శిరస్సుపై దాల్చి (శిరసా వహించి), పఱ్ఱినర్క్కు = వానిని ఆశ్రయించినవారికి, పాతకమ్ = మోక్షానికి అవరోధాలై, ఉళ్ళవై = ఉన్న కర్మలను అన్నిటినీ, తామే పరిన్దు = (వారు కోరకపోయినా) తామే కోరి, ఒழிత్తు = పోగొట్టి, శాతకమానదు = (సాధకం) మోక్షోపాయం అనేది, ఈదు ఎన్ఱు = ఈ మా పాదాలే అని, కొణ్డు = నిశ్చయించి, చరణ్ = తమ చరణాలను, అవర్క్కు = వారికి, కొడుక్కుమ్ = (మోక్షోపాయంగా) అనుగ్రహిస్తారు.

**5.** అవ :- పాపాన్ని పోగొట్టి, పరమపదాన్ని పొందించే మామునుల పావనత్వాన్ని తెలిపిన తరువాత, భోగత్వాన్ని (అనుభవించదగిన సౌందర్యాన్ని కల్గి ఉండడాన్ని) గూర్చి ఇందులో ప్రస్తావిస్తున్నారు. లేక, మనకు మోక్షం అనుగ్రహించ కుండా పడరాని పాట్లు పెట్టినా, విడువడానికి వీలులేనట్లు కన్నులకు, మనస్సునకు మాధుర్యాన్ని కల్గించే తిరుమేని అందాన్ని మామునులు కల్గి ఉండడాన్ని ప్రస్తుతిస్తున్నారు- అని కూడా చెప్పవచ్చు.

**నఱ్కేశవన్తమర్ నఱ్ఱవత్తోర్ నయనజ్గళుక్కు**
**పొఱ్కోలమేనియన్ పూతలత్తోర్ శెయ్ద పుణ్ణియమామ్**
**ముక్కోల్ తరిత్త మణవాళమాముని మూర్త్తితనై**
**ఎక్కోడికాలముమ్ శిన్దై శెయ్వార్తమక్కు ఈడిలైయే**

నల్ కేశవన్ తమర్ = దాసులకు హితాన్నే చేసే కేశవునకు దాసులై, నల్ తవత్తోర్ నయనజ్గళుక్కు =గొప్ప తపస్సు అయిన ఆచార్యాభిమానాన్ని కల్గినవారి కన్నులకు (విందుగా), పొన్ కోల మేనియన్ =

మిక్కిలి అందమైన తిరుమేనిని కలవారు, పూ తలత్తోర్ = ఈ భూమిలో జన్మించినవారు అందఱు, శెయ్‌ద = చేసిన, పుణ్ణియమ్ ఆమ్ = పుణ్యంగా అవతరించినవారు, ముక్కోల్ తరిత్త = త్రిదండాన్ని ధరించినవారు అయిన, మణవాళ మా ముని= మణవాళమహామునుల, మూర్‌త్తితన్నై = తిరుమేనిని, ఎక్కోడి కాలముమ్ = ఎన్ని కోట్ల యుగాల కాలం అయినా, శిన్దై శెయ్‌వార్‌క్కు = ధ్యానించి, ఆనందించేవారికి, ఈడు ఇల్లై = సాటివచ్చే వారెవరు లేదు. ఇది తథ్యం.

**6.** అవ :- ముందు శ్లోకంలో అణ్ణన్ మామునుల మూర్తి యొక్క ధ్యానాన్ని గూర్చి ప్రస్తావించారు. ఇందులో వారు చేసే ఉపకారాలను, వాటికి తాము జితులైన వైనాన్ని, తాము వారిని మంగళాశాసనాన్ని చేసే రీతినిగూర్చి పల్కుతున్నారు.

> ఇల్లై యెన్టే యెణ్ణి యెన్‌పవక్కాట్టై యెరియిలిట్టు
> నల్లరుణ్‌మారి పెయ్‌దెన్నై త్తళిర్ప్పిత్తు నన్గు తన్పాల్
> తొల్లరుణ్ ఞానమ్ విళై త్తాళ్న్ద పోకత్తై త్తుయ్‌ప్పిక్కవే
> వల్లవన్ కోయిల్ మణవాళయోకియై వాళ్‌త్తువనే

ఎన్ పవ క్కాట్టై = నా జన్మ అనే అడవిని, ఇల్లై ఎన్టే ఎణ్ణి = ఇక మాకు పాపం అనేది లేదు అని భావించేటట్లు, ఎరియిల్ ఇట్టు = తమ కోపాగ్నికి ఎర చేసి, దహించి వేసి, ఎన్నై = దుష్కర్మ అనే నిప్పులో బాధపడే నాపై, నల్ అరుళ్= నిర్హేతుక కృపాకటాక్షం అనే, మారి పెయ్‌దు = చల్లని వానను కురిపించి, తళిర్ప్పిత్తు = (బాధను తీర్చి) ఉపశమింపజేసి, తన్‌పాల్ = తమ పట్ల, తొల్ అరుళ్ = పూర్వం ఆచార్యులచేత అనుగ్రహింపబడ్డ, ఞానమ్ విళై = తత్త్వ- హిత-పురుషార్థజ్ఞానాన్ని, నన్గు తళిర్ప్పిత్తు = చక్కగా ఉపదేశాదులతో కల్గించి, ఆళ్న్ద పోకత్తై = మిక్కిలి గాఢమైన పరమపదసుఖాన్ని, తుయ్‌ప్పిక్కవే= దాసుడు అనుభవించేటట్లు చేయడానికే, వల్లవన్ = సమర్థులైన, కోయిల్ మణవాళ యోకియై = శ్రీరంగాన్ని నిరూపకంగాకల మణవాళ మామునులను, వాళ్‌త్తువన్= స్తుతిస్తాను.

**7.** అవ :- అయిదవ పాశురంలో మానసికమైన ధ్యానాన్ని, ఆఱవ పాశురంలో వాచికమైన స్తోత్రాన్ని తెలిపి, ఇందులో కాయిక ప్రణామాన్నిగూర్చి పలుకుతున్నారు. **"యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి"** (దేనిని మనస్సుతో ధ్యానిస్తున్నాడో దానిని మాటతో పల్కుతున్నాడు, దానిని చేతలతో చేస్తున్నాడు) అనే రీతిలో ఆర్జవాన్నికల మహాత్ములు భావించేది, స్తుతించేది, నమస్కరించేది ఒక్కరినేకదా!

> వాళ్‌త్తువ నెన్దై మణవాళమాముని మామలర్‌త్తాళ్
> తాళ్‌త్తువన్ యానవన్ తాళిణైక్కీళ్ చ్చిరమ్ తారణియిల్
> కాళ్‌త్తిడుమ్ శెల్వముదల్ ముక్కుఱుమ్బుమ్ కరిశఱవే
> పాళ్‌త్తిడు మెన్‌తనతికోర పావఙ్గళ్ పఱ్ఱఱవే

కాళ్‌త్తిడుమ్ = బాగా ముదిరి, చేవను కల్గి ఉండే, శెల్వమ్ ముదల్ = సంపద మొదలైనవానివల్ల కలిగే, ముక్కుఱుమ్బు = మూడు మదాలు అనే, కరిశు= దోషాలను అన్నిటినీ, అఱ = తొలగించడంకోసం,

పా౯ఴ్త్తిడుమ్ = దాసుడనైన నన్ను పాడుచేస్తున్న, ఎన్తన్ = నా, అతి కోర పావఙ్గళ్ = మిక్కిలి భయంకరం అయిన దుష్కర్మలను, ప౯్ఱు అఱ = నిరాలంబనంగా నశింపజేయడంకోసం, యాన్ = నేను, ఎన్దై = దాసుని (జ్ఞానపిత) ఆచార్యులైన, మణవాళమాముని మా మలర్ తాళ్= మణవాళమహామునులగొప్ప, తామరపూలవంటి శ్రీచరణాలను, వా౯ఴ్త్తువన్= స్తుతించేవాడనై, అవన్ తాళిణై క్కీ౯ఴ్ =ఆస్వామి శ్రీపాదాలజంట కిందగల, తారణియిల్ =భూమిపై, శిరమ్ తా౯ఴ్త్తువన్ =తలను తాకించి, మొక్కుతాను.

అవ :- కొందరు కోయిలణ్ణన్ దగ్గఱకు వచ్చి - "చాలామంది మామునులు పాపాలను పోగొట్టి, రక్షించడంకోసం వారి పాదుకలను శిరసా వహించాలని అనుకుంటున్నారు. జ్ఞానాన్ని పొంది, దృఢమైన యోగాన్ని సాధించడంకోసం వారిని స్తుతించాలని అనుకుంటున్నారు. విద్యా-ధన- అభిజన మదాలనే మూడు మదాలు తీరడంకోసం, అతిఘోరపాపాలు నిర్మూలం కావడంకోసం వారి శ్రీపాదద్వంద్వం క్రింద శిరస్సు తాకించి, ప్రణామం చేయాలని అనుకుంటున్నారు. కాని, మేము మాత్రం మమ్ములనే గొప్పవారని భావిస్తున్నాము. ఇతరులుకూడా కొందఱు మమ్ములను ఆ విధంగానే పల్కి గౌరవిస్తున్నారు. ఈ విధంగా ప్రసిద్ధమైన గౌరవాన్ని కల్గిన మేము నలుగురు చూచే రీతిలో మామునుల పాదుకలను మా తలపై ధరించడానికి, వారిని స్తుతించడానికి, వారి శ్రీపాదాలలో శిరస్సును పెట్టి, నమస్కరించడానికి సిగ్గుపడుతున్నాము. ఉజ్జీవించాలనే ఆశ అయితే మాకు చాలా ఎక్కువగానే ఉన్నది. మామునుల గొప్పతనం కూడా మామనస్సులో తోచకపోలేదు. ఇటువంటి క్లిష్టదశలో మీరే మాకు ఉజ్జీవించే ఉపాయాన్ని రహస్యంగా ఉపదేశించాలి" అని ప్రార్థించగా, "మీరు నల్గురికి తెలిసే రీతిలో ఏమీ చేయవద్దు. మామునులను మనస్సులో చింతిస్తేనే చాలు. మీ దుష్కర్మలు అన్నీ పోయి, మోక్షం సిద్ధిస్తుంది. ఆ పనిని చేయండి" అని వారికి ఈపాశురంలో అణ్ణన్ ఉపదేశిస్తున్నారు.

8. **పావఙ్గళ్ ప౯్ఱుఅఱుమ్ పాశఙ్గళ్ ప౯్ఱుఅఱుమ్ ప౯్ఱి వైక్కుమ్**
**కోపఙ్గళ్ ప౯్ఱుఅఱుమ్ కు౯్ఱఙ్గళ్ ప౯్ఱుఅఱుమ్ కోటిశన్మ**
**త్తాపఙ్గళ్ ప౯్ఱుఅఱుమ్ తణ్ణరఙ్గన్ పుక౯ఴ్ శాన్తగుణ**
**తీపన్ కరుణై మణవాళయోకియై చ్చిన్దిక్కవే**

తణ్ అరఙ్గన్ పుక౯ఴ్ = చల్లని శ్రీరంగంలో నివాసం ఉన్న "అ౯ఴకియ మణవాళన్"గా పొగడబడేవారై, శాన్తగుణ తీపన్ = శాంతమనే గుణంతో (క్షమ అనే గుణంతో) ప్రకాశించేవారై, కరుణై = కృపాగుణమే మూర్తీభవించినవారైన, మణవాళ యోకియై = మణవాళమామునులను, శిన్దిక్కవే = భావించినమాత్రం లోనే, పాశఙ్గళ్ =విషయాంతరాలలో ఉండే ఆశలు, ప౯్ఱు అఱుమ్ = పట్టుసడలి, తొలగిపోతాయి, ప౯్ఱి వైక్కుమ్ = మనలను ఆశ్రయించి, నిలచి ఉండే, కోపఙ్గళ్ = కోపాలు, ప౯్ఱు అఱుమ్ =పట్టుసడలి, నశిస్తాయి, కు౯్ఱఙ్గళ్ = మిగిలిన లోభం మొదలైన దోషాలు, ప౯్ఱు అఱుమ్ = పట్టువీడి నశిస్తాయి, పావఙ్గళ్ = పూర్వం తెల్పిన ఆశ, కోపం మొదలైన దోషాలచేత సంభవించే పాపాలు, ప౯్ఱు అఱుమ్= పట్టు వదలి, రూపుమాసిపోతాయి. కోటి శన్మ త్తాపఙ్గళ్ = ఆ పాపాల పర్యవసానంగా కోటిసంఖ్యలోని జన్మలలో మనం అనుభవించే దుఃఖాలు, ప౯్ఱు అఱుమ్ = పట్టుసడలి, నశిస్తాయి.

**9.** అవ :- "యథార్థాన్ని గమనిస్తే, మామునులు తమ మహిమను భావించే వారినే కాదు, అసూయను పొంది, తమను నిందించేవారినికూడా విడువకుండా మామునులు ఉజ్జీవింపజేస్తారు. ఈ నిజాన్ని నీవు ఓ మనసా! తెలిసికో'' అని అంటూ తమ మనస్సుకు అణ్ణన్ రహస్యంగా ఇందులో ఉపదేశిస్తున్నారు.

శిన్దిత్తరఙ్గరై చ్చిన్దై ప్పయఙ్కెడ చ్చెన్నితన్నాల్
వన్దిత్తు నిచ్చలుమ్ వాయార వాழ్త్తు మెయ్మ్మా మఱైయోర్
పున్దిక్కుళ్ మేవుమ్ వరయోకి తమ్మై ప్పుకైన్దు శిలర్
నిన్దిక్కినుమే వీడారిదుకాణవర్ నీర్మై నెఞ్జే

నెఞ్జమే = నాకు అనుకూలమైన, భవ్యమైన మనసా!, శిన్దై = తమ మనస్సు, పయమ్ కెడ = ఐహికంగా, ఆముష్మికంగా ఏర్పడే భయం తీరి, నిర్భయంగా ఉండడంకోసం, నిచ్చలుమ్ =నిత్యం, అరఙ్గరై = శ్రీరంగనాథుణ్ణి, శిన్దిత్తు = ధ్యానించి, శెన్నితన్నాల్ = శిరస్సుతో, వన్దిత్తు = నమస్కరించి, వాయ్ ఆర = నోరార, వాழ్త్తుమ్= మంగళాశాసనాన్ని చేసే, మెయ్ మా మఱైయోర్ = నిజమైన, గొప్ప బ్రాహ్మణుల, పున్దిక్కుళ్ = మనస్సులో, మేవుమ్ = (ధ్యానింపబడి) పొందికగా ఉన్న, వరయోకి తమ్మై= మామునులు తమను, శిలర్ = వారి మహిమను తెలియని కొందఱు, పుకైన్దు = ఓర్వలేక, అసూయపడి, నిన్దిక్కిలుమ్ = నిందించినప్పటికీ, విడార్ =వారినికూడా విడువకుండా, తరింపజేస్తారు, అవర్ నీర్మై = ఆ మణవాళమామునుల గొప్పతనం, ఇదు కాణ్ = ఇటువంటిది అని గ్రహించు.

**10.** అవ :- ఎనిమిదవ పాశురంలో పల్కినట్లు మామునులను స్తుతించడమో, ప్రణమిల్లడమో చేయనక్కఱలేదు, భావిస్తేనే చాలు, వారికి ఉజ్జీవనం లభించడం తథ్యం- అనే సూక్తిని విన్న కొందఱు, తొమ్మిదవ పాశురంలో తెలిపిన తమను నిందించేవారినిసైతం మామునులు విడువకుండా తరింపజేస్తారు- అనే వారి సౌలభ్యాన్ని విన్న తమ మనస్సు "ఇటువంటి మామునుల సేవను అందఱూ కీర్తిస్తున్నారా? వారిని అందఱు ప్రేమిస్తున్నారా? ఆ రీతిలో కనపడడంలేదే! దీనికి ఏం కారణం? అని ప్రశ్నించగా, "మన సంప్రదాయానికే చెందిన కొందఱు తమ పాపఫలంగా వారిని నిందిస్తున్నారు. మిగిలిన సంప్రదాయాలకు చెందిన మఱి కొందఱు అయితే - అనాదిపాపవాసనాఫలంగా బుద్ధి చెడి, భగవానుడనేవాడు లేడు; ఉన్నా అతనికి రూపం లేదు, గుణాలు లేవు, విభూతి లేదు- అని వాదించి, చివరకు మామునులవద్ద ఓడిపోయి, వారిని నిందిస్తున్నారు. వారిని ఆ రీతిలోనే ఉండనీయండి. పెక్కుమంది శ్రీరంగనాథునకు ఆచార్యులై, ఆ స్వామిని భావించి, నమస్కరించి స్తుతించే వైదికులైన మహనీయులచేత సదా ధ్యానింపబడే ఆ మామునులు అనుగ్రహించే సేవను "ఇది పావనం, పరమభోగ్యం'' అని కీర్తించి, వారిని అభిమానిస్తున్నారు'' అని అంటూ తమను ప్రశ్నించినవారికి, తమ మనస్సుకు అణ్ణన్ సమాధానం పలుకుతున్నారు.

నెఞ్జే యనైయ వడియార్ నిఱమ్ కొణ్డ నిచ్చయమామ్
మఞ్జేఱు శోలై యరఙ్గప్పదితనిల్ వాదియర్క్కు

**నఞ్జే యనైయ మణవాళయోకి యిన్నాళళిక్కుమ్**
**తఞ్జేవైతన్ని యికళ్ర్వార్క్కల్లాల్ అవర్ తామిట్టరే**

మఞ్జు ఏఱు శోలై = మేఘాలు అధిరోహించి, చేరిఉండే తోటలచేత చుట్టబడిన, అరఙ్గమ్ పదితనిల్ = శ్రీరంగం అనే నగరంలో, వాదియర్క్కు = వ్యర్థవాదాలను చేసేవారికి, నఞ్జే యనైయ = విషంవంటివారైన, మణవాళ యోకి= మణవాళమామునులు, ఇన్నాళ్ = (మనం జీవించే భాగ్యాన్ని పొందిన) ఈ కాలంలో, అళిక్కుమ్ = సర్వస్వదానంగా అనుగ్రహించే, తమ్‌సేవై తన్ని= పావనం, భోగ్యం అయిన తమ దర్శనాన్ని, ఇకళ్ర్వార్క్కు అల్లార్ = నిందించే కొందఱు భాగ్యహీనులకు తప్ప మిగిలిన అందఱికీ, అవర్‌తామ్ = ఆ మామునులు, ఇట్టరే = ఇష్టులే. (ఇది), నెఞ్జే అనైయ = మామునుల మనస్సువలె వారికి అంతరంగులైన, అడియార్ = దాసులు, నిఱమ్ కొణ్డ = తమ మనస్సులో విడువకుండా గ్రహించిన, నిచ్చయమ్ ఆమ్ = యథార్థం.

**11.** అవ :- ఈ భూలోకంలోని వారందఱూ కీర్తించినపుడేకదా ఎవరి గొప్పతనం అయినా పరిపూర్ణం అవుతుంది, ప్రకాశిస్తుంది. కొంతమంది నిందించినందువల్ల మామునుల గొప్పతనానికి లోటు రాదా? అని అంటే, మహామునుల అవతారం భగవదవతారంవలె దుష్టనిగ్రహ - శిష్టపరిపాలనార్థం కనుక, యథార్థాన్ని గ్రహించ లేని మూర్ఖులు నిందిస్తే దానికి ఏ కొఱత రాదని అణ్ణన్ ఇందులో తెలుపుతున్నారు.

**ఇట్టర్కళ్ వాళ్ర ఎతిరాశర్ వాళ్ర ఇరునిలత్తే**
**శిట్టర్కళ్ వాళ్ర నన్దేశికర్ వాళ్ర చ్చెకత్తినుళ్ళ**
**తుట్టర్కళ్ మాళ మణవాళమాముని తోన్రిననే**
**ఎట్టు మిరణ్డు మఱియార్ ఇఙ్గేశినుమ్ యా వరుమే**

మణవాళమాముని= మణవాళమహామునులు, ఇరు నిలత్తే = విశాలమైన భూమిలోఉండే, ఇట్టర్కళ్ వాళ్ర = భగవద్భక్తులు తరించేటట్లు, ఎతిరాశర్ వాళ్ర = భగవద్రామానుజుల ఉజ్జీవించేటట్లు, శిట్టర్కళ్ వాళ్ర = సదాచారసంపన్నులు తరించే టట్లు,శెకత్తిల్ ఉళ్ళ = భూమిలో ఉండే, తుట్టర్కళ్ మాళ = దుష్టులు నశించేటట్లు, తోన్రినన్ ఏ = అవతరించారు అన్నది నిశ్చయం, ఎట్టుమ్ ఇరణ్డుమ్ అఱియార్ = ఎనిమిది, రెండు కలిపితే పది అవుతుందని తెలియనివారు, ఇఙ్గు= ఈలోకంలో, ఏశినుమ్ = నిందిస్తే, యా వరుమ్ = ఏ కొఱత కల్గుతుంది? (ఏదీ కలుగదు)

**12.** అవ :- ముందు పాశురంలో అవతారవిషయంలో అణ్ణన్ భగవానునకు - భగవద్రామానుజులకుమధ్య సామ్యాన్నిగూర్చి అనుగ్రహించారు. ఇందులో ద్రావిడవేదాంతప్రవర్తకత్వం అనే భగవానునకు లేని, మామునులకుండే అతిశయాన్ని గూర్చి అనుగ్రహిస్తున్నారు.

**యూవరు ముయ్య మణవాళయోకి దయాళు వెన్న**
**పూమకళ్ మణ్మకళ్ పుణ్ణియమా యిన్ద ప్పూతలత్తే**

**తా మవతారమ్ శెయాదిరున్దాల్ శడకోపర్ తిరు**
**వాయ్మొழிయోడు కడలోశైయోడెన్న వాశి యుణ్డే !**

మణవాళ యోకి = మణవాళమహామునులు, యావరుమ్ = నిందించే వారు, అన్యులు అనే అందఱు, ఉయ్య = ఉజ్జీవించడానికి అనువైన, దయాళు = దయాస్వభావులు, ఎన్న = అని లోకులు పలికేటట్లు, పూ మకళ్ మణ్ మకళ్ పుణ్ణియమాయ్ = లక్ష్మీదేవియొక్క, భూదేవియొక్క పుణ్యఫలంగా, ఇన్ద ప్పూతలత్తు = ఈ భూమిలో, తామ్ = మణవాళమహామునులు తాము, అవతారమ్ శెయాదిరున్దాల్ = అవతరించి ఉండకపోతే, శడకోపర్ తిరువాయ్మొழி యోడు = నమ్మాழ்వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొழிకి, కడలోశైయోడు = సముద్రఘోషకు మధ్య, ఎన్న వాశి ఉణ్డు = ఏమి తారతమ్యం ఉంటుంది?

**13** అవ :- చివరిగా - ఇంతవరకుగల పన్నెండు పాశురాలలో అనుగ్రహించిన మామునుల మహిమలకు అన్నిటికీ శిఖరాయమాణమై, సాక్షాత్తు శ్రీమన్నారా యణుడే తనియన్ అనుగ్రహించేటట్లు ఏర్పడిన వారి విలక్షణమైన అతిశయాన్ని ఇందులో కీర్తిస్తూ అణ్ణన్ తనివి తీర తృప్తిచెందుతున్నారు. ద్రావిడవేదాంత ప్రవర్తకాచార్యత్వాన్ని విషయంగాకల మొదటిపాశురంతో ఈ పాశురాన్ని చేర్చడంవల్ల (అన్దాది కాబట్టి) ఇందులో చెప్పబడే భగవత్మంత్ర (తనియన్) రూపకైంకర్య ప్రతిసంబంధిత్వం అనే వైభవం ద్రావిడవేదాంత ప్రవర్తకాచార్యత్వమూలంగా ఏర్పడినదని తెలియజేయ బడింది.

**వాశి యఱిన్ద వదరియిల్ నారణనార్ మనజ్కొళ్**
**తేశుడై యెన్దై మణవాళమాముని శీర్ తழைప్ప**
**చ్చీశయిలేశ దయాపాత్తిర మెనుమ్ శీర్ మన్దిరమ్**
**దేశికనాయ్ క్కణ్డురైత్తార్ ఇవ్వైయకజ్జీర్ ఉఱవే**

వాశి అఱిన్ద = ఇతరులకంటె మణవాళమహామునులకు గల వైలక్షణ్యాన్ని తెలిసినవారైన, వదరియిల్ నారణనార్ = బదరికాశ్రమంలో వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుడు, మనమ్ కొళ్ తేశుడై ఎన్దై = తమ మనస్సులో మాఱకుండా గ్రహించిన గొప్పతనాన్ని కలవారైన దాసుని ఆచార్యులైన, మణవాళమాముని శీర్ = మణవాళమామునుల కల్యాణగుణాలు, తழைప్ప = (లోకులచేత చక్కగా గ్రహింపబడి) మిక్కిలి వ్యాప్తి చెందేటట్లు, శీశయిలేశ దయా పాత్తిరమ్ ఎనుమ్ = "శ్రీశైలేశదయాపాత్రమ్" అని ప్రారంభమయే, శీర్ మన్దిరమ్ = శబ్దసందర్భంచేత, అర్థగాంభీర్యంచేత అందమైన మంత్రాన్ని, దేశికనాయ్ కణ్డు = మంత్రప్రదుడైన ఆచార్యుడై, పరిశీలించి, రచించి, ఇవ్వైయమ్ శీర్ ఉఱ = ఈలోకంలోని వారు అనుసరించి, గొప్పతనాన్ని చక్కగా పొందడంకోసం, ఉరైత్తార్ = అనుగ్రహించారు. (చెప్పారు)

జీయర్ తిరువడికళే శరణమ్
కోయిల్ కన్దాడై అణ్ణన్ తిరువడికళే శరణమ్



శ్రీమణవాళమహాముగుల విషయంగా
ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# అమలనాదిపిరాన్ ( పాదాది కేశమాలై )

## సవ్యాఖ్యానము

1. పోద చ్చివన్దు పరిమళమ్ వీశి పుదుక్కణిత్త
శీదక్కమలత్తై నీరేఱ వోట్టి చ్చిఱన్దడియేన్
ఏదత్తై మాఱ్ఱు మణవాళయోకి యినిమై తరుమ్
పాదక్కమలఙ్గళ్ కణ్డే నెనక్కు ప్పయమిల్లైయే

పోద చ్చివన్దు = చాలా ఎఱ్ఱనిదై, పరిమళమ్ = సువాసనను, వీశి = వీచి, పుదుక్కణిత్త= అపుడే వికసించడంచేత నూతనత్వాన్ని కల్గి, శీదమ్ = శైత్యాన్ని కల్గిన, కమలత్తై = కమలాన్ని, నీర్ ఏఱ = నీటిలో ప్రవేశించేటట్లు, ఓట్టి =తఱిమి కొట్టి, శిఱన్దు = గొప్పతనాన్ని కల్గి, అడియేన్ = దాసుని, ఏదత్తై = దోషాన్ని, మాఱ్ఱుమ్ = లేకుండా చేసే, మణవాళయోకి = మణవాళమహాముగుల, ఇనిమై తరుమ్ = సేవించినంతనే మాధుర్యాన్ని, ఆనందాన్ని కల్గించే, పాద క్కమలఙ్గళ్ = శ్రీపాదాలు అనే తామరపూలను, కణ్డేన్ =దర్శించిన, ఎనక్కు =(ఇక) నాకు, పయమ్ = ఏ భయం, ఇల్లై = లేదు (ఏకారం నిశ్చయార్థకం)

చాలా ఎఱ్ఱనిదై, సువాసనను వెదజల్లుతూ అపుడే వికసించడంచేత నూతనత్వాన్ని, చల్లదనాన్ని కల కమలాన్ని దానికంటే తనకు ఉన్న సకలవిధ వైలక్షణ్యంతో నీటిలోనికి తఱిమికొట్టినవి, దాసుని దోషాలను అన్నిటినీ దర్శనమాత్రంచేతనే పోగొట్టేవి, మనస్సులో తీయదనాన్ని కల్గించేవి అయిన మణవాళమహాముగుల శ్రీపాదపద్మాలను దర్శించిన నాకు ఇక ఏ భయం లేదు.

2. వేழక్కురుత్తి నழకై ప్పழిత్తు విరై మరువు
వాழైప్పురువత్తి నాకారఙ్కొణ్డు వళమ్పునైన్ద
ఏழైక్కిరఙ్గు మణవాళయోకి యిరు కుఱఙ్కై
క్కేழఱ్ఱ నెఞ్జిల్ వైప్పేఱ్కొరు కాలముమ్ కేడిల్లైయే

వేழ క్కురుత్తిన్ = ఏనుగుతొండంయొక్క, అழకై = అందాన్ని, పழిత్తు = నిందించి, (దానిని మించి), విరై = సువాసనను, మరువు = కల్గిన, వాழైప్పురువత్తిన్ = అరటిబోదెల, ఆకారమ్ = రూపాన్ని, కొణ్డు =గ్రహించి, ఏழైక్కు= జ్ఞానంలో దరిద్రుణ్ణి అయిన నాకు, ఇరఙ్గుమ్ = కరుణను చూపే, మణవాళ యోకి = మణవాళ మహాముగుల, వళమ్ పునైన్ద = బాగా బలిసిన, ఇరు కుఱఙ్కై = రెండు ఊరువులను, కేழ్ అఱ్ఱ = స్వరూపప్రకాశంలేని, నెఞ్జిల్ = మనస్సులో, వైప్పేఱ్కు = నిలిపేవారికి, ఒరు కాలముమ్ = ఏసమయంలోను, కేడు ఇల్లై = చెడ్డ లేదు (ఏకారం నిశ్చయార్థకం)

3. తేనమర్ మాలై మణవాళయోకి తిరుమరుఙ్గుల్
ఈన మిలాద విళమైయినారు మెఴ్రిచ్చకనమ్
వానిలై యుయ్త్త తువరాడై యిన్టెన్ మనత్తై విట్టు
త్తానకలామ లెన్నై యూళ్రికాలముమ్ తాఙ్గియవే

తేన్ అమర్ మాలై = మధువు పొందికగా ఉండే (స్రవించే) పూమాలికలను ధరించిన, మణవాళ యోకి = మణవాళ మహామునుల, తిరు మరుఙ్గుల్ = అందమైన పార్శ్వభాగాలు, ఈనమ్ ఇల్లాద = తక్కువ కాని, ఇళమైయిన్= లేత వయస్సుతో, అరుమ్ = స్థిరంగా ఉండే, ఎఴ్రిల్ = ప్రకాశించే, శకనమ్ = జఘనప్రదేశం, వాన్ = ఉన్నతం అయిన, నిలై = స్థానంలోనికి, ఉయ్త్త = ఉద్ధరించిన, తువర్ ఆడై = ఎఱ్ఱని కాషాయం - అనే ఇవి, ఇన్టు = ఇపుడు, ఎన్ మనత్తై విట్టు = నా మనస్సును వీడి, తాన్ = తాను, అకలామల్ = విడువకుండా, ఎన్నై = నన్ను, ఊఴ్రికాలముమ్ = యుగకాలం అంతా, (బ్రహ్మకల్పం అంతా), తాఙ్గియ = తమ శక్తితో ధరిస్తున్నవి. (ఏ-ఆశ్చర్యార్థకం, లేక ఆనందార్థకం)

4. వన్దిక్క వాళ్ఴ్విత్తరుళ్ మణవాళమాముని వడివై
చ్చిన్దిక్కవుమ్ అరిదా మఴ్లకాన్ఱ్రిల్ తికఴ్ ళుఴ్రిపోల్
ఉన్దిచ్చుఴ్రి యెనదుళ్ళమ్ శూఱైకొణ్డాయదెన్టుమ్
శన్దిత్తవర్ కణ్ణు నెఞ్జుమ్ కొళ్ళానిఱ్కుమ్ తామిరున్దే

వన్దిక్క = (దాసులు) స్తుతించినంతనే (నమస్కరించినంతనే), వాఴ్విత్తు అరుళ్ = (వారిని) ఉజ్జీవింపజేసి, పరమపదాన్ని చేర్చి అనుగ్రహించే, మణవాళ మా ముని = మణవాళమహామునుల, వడివై = దివ్యమంగళవిగ్రహాన్ని, శిన్దిక్కవుమ్ = చింతించడానికికూడా, అరిదు ఆమ్ = దుర్లభమే అయేటట్లున్న, అఴ్లకు ఆఱ్ఱ్రిల్ = సౌందర్యప్రవాహంలోని, శుఴ్రిపోల్ = సుడివలె, ఉన్ది చ్చుఴ్రి= గుండ్రని వారి నాభి, ఎనదు ఉళ్ళమ్ = నా మనస్సును, శూఱై కొణ్డు = తెలియకుండా కొల్లగొట్టి (చూఱగొని), ఆయదు = దానిని కల్గిఉన్నది, ఎన్టుమ్ = ఎల్లప్పుడూ, తామ్ ఇరున్దు = తాము ఉన్న రీతిలోనే (తామున్నచోటనే ఉంటూ), శన్దిత్తవర్ = తనను చేరిన వారియొక్క, కణ్ణుమ్ = కన్నులను, నెఞ్జుమ్ = మనస్సును, కొళ్ళా నిఱ్కుమ్ = కొల్లగొడుతుంది. (ఏ- ఆశ్చర్యార్థకం!)

5. ఆరుమ్ వణఙ్గుమ్ మణవాళమాముని యమ్బుయముమ్
కారుమ్ శురబియుమ్ పోలే వఴ్లఙ్గుమ్ కైత్తామరైయిల్
శేరు న్దిరుత్తణ్డుమ్ శేవిత్త మానిడర్ తీవినైయాల్
ఈరుమ్బడి ప్పిఱవార్ తిరునాట్టిన్బమెయ్దువరే

ఆరుమ్ = ఎవరైనా (అందఱు), వణఙ్గుమ్ = నమస్కరించే, మణవాళ మా ముని= మణవాళమహామునుల, అమ్ = అందమైన, పుయముమ్ = భుజములను, కారుమ్= మేఘము, శురబియుమ్ పోలే = కామధేనువువలె,

వళ్ఙ్గుమ్ = ప్రత్యుపకారాన్ని ఆశించకుండా అనుగ్రహించే, కై త్తామరైయిల్ = శ్రీహస్తమనే తామరపూవులో, శేరుమ్= చేరి ఉండే, తిరు త్తణ్డుమ్ = త్రిదండాన్ని, శేవిత్త = సేవించిన (దర్శించిన), మానిడర్= మానవులు, తీ వినైయాల్ = దుష్కర్మవల్ల, ఈరుమ్ = హింసించే, పడి = భూమిలో, పిఱవార్ = జన్మించరు, తిరు నాట్టు = పరమపదంలోని, ఇన్బమ్ = ఆనందాన్ని, ఎయ్దువర్= పొందుతారు, (ఏ -నిశ్చయార్థకం, లేక, ఆశ్చర్యార్థకం)

6. తడఙ్కోణ్డ కోయిన్ మణవాళమాముని తామరైత్తార్
వడఙ్కోణ్డ మార్బినిల్ వణ్ పురినూలు మెనదు నెఞ్జిల్
ఇడఙ్కోణ్డడఙ్గ ఎళ్ళుదివైత్తే నిని వల్వినైకాళ్ !
తిడఙ్కోణ్డ నీశర్ తన్దేయత్తిలేకిడుమ్ తీదఱవే

తడమ్ కొణ్డ = తటాకాలను నిండుగా కల, కోయిల్ మణవాళ మా ముని= శ్రీరంగంలోని మణవాళమహామునులయొక్క, తామరై త్తార్ వడమ్ కొణ్డ = తామరపూసలతో చేసిన మాలికలను కల్గిన, మార్బినిల్ = వక్షఃస్థలంలోని, వణ్ పురి నూలుమ్ = ఉదారమైన (గొప్ప) యజ్ఞోపవీతాన్ని, ఎనదు నెఞ్జిల్ = నా మనస్సులో, ఇడమ్ కొణ్డు = వాసస్థానంగా గ్రహించి, అడఙ్గ = అణగి ఉండేటట్లు, ఎళ్ళుదివైత్తేన్ = లిఖించివేశాను (నిలుకడగా ఉండేటట్లు చేశాను), ఇని = ఇక, వల్ వినైకాళ్ = ఓ నా ప్రబలదుష్కర్మలారా!, తీదు అఱ = మీకు ఏ కీడు లేకుండేటట్లు, తిడమ్ కొణ్డు = మనస్సులో దార్ఢ్యాన్ని పొంది, నీశర్తమ్ = నీచుల, తేయత్తిల్ = దేశంలోనికి, ఏకిడుమ్= పోయి చేరండి.

7. మఙ్గాదులకై యరుళ్ మణవాళముని మరువార్
శిఙ్గారమాలై త్తిరుత్తోళ్కళుమ్ అవర్ఱ్రే తికళ్ళుమ్
శఙ్గాళ్ళియుమ్ తొళ్ళుదేత్తినేనాల్ తమియేనుడైయ
పఙ్గాళుమ్ వల్వినై యెఙ్గో కణత్తినిల్పాఱియవే

మఙ్గాదు = చెడకుండా ఉండేటట్లు, ఉలకై = లోకాన్ని, అరుళ్ = కటాక్షించే, మణవాళ ముని = మణవాళమునుల, మరు ఆర్ = సువాసన నిండిన, శిఙ్గారమాలై = అందమైన మాలికను ధరించిన, తిరు త్తోళ్కళుమ్ = అందమైన రెండు భుజాలు, అవర్ఱ్రే = వాటిలో తికళ్ళుమ్ = ప్రకాశించే, శఙ్గు ఆళ్ళియుమ్ = శంఖాన్ని, చక్రాన్ని, తొళ్ళుదు= నమస్కరించి, ఏత్తినేన్ = స్తుతించాను, ఆల్ = ఆశ్చర్యం, తమియేనుడైయ పఙ్గు = అనన్యగతికుడను అయిన దాసుని పక్షాన్ని, ఆళుమ్ = శాసించే, వల్ వినై = బలమైన దుష్కర్మలు, కణత్తిల్ = క్షణంలో, ఎఙ్గో = ఎచటికో, పాఱియ = పరుగెత్తివి. (ఏ - ఆశ్చర్యం !)

8. మొళ్ళియున్తమిళ్ళ్ పునైయుమ్ మణవాళముని కరుణై
పొళ్ళియు న్తిరువిళ్ళియు న్తిరుమూక్కుమ్ పోలి ముత్తైకళ్

**శెழ்ழியన్బుకొణ్డురైక్కు న్దిరునావు న్దిరుముకముమ్**
**వழ்ழి యన్బుకొణ్డు వழ்ழిత్తినేన్ పేఱిని మఱ్ఱిలైయే**

మొழ்ழియుమ్ = పెద్దల, పూర్వాచార్యుల శ్రీసూక్తులను, తమిழ் = ద్రావిడ వేదసూక్తులను, పునైయ = ధరించిన, మణవాళముని = మణవాళమహామునుల యొక్క, కరుణై పొழ்ழி = దయను వర్షించే, తిరు విழ்ழியుమ్ = అందమైన రెండు నేత్రాలను, తిరు మూక్కుమ్ = శ్లాఘ్యమైన నాసికను, పొలి = వర్ధిల్లే, మఱైకళ్ = ఉభయవేదాంతాలను, శెழ்ழి = (చేతనులపట్ల) సమృద్ధమైన, అన్బు కొణ్డు = వాత్సల్యాన్ని కల్గి, ఉరైక్కుమ్= పలికే, తిరు నావుమ్ = అందమైన జిహ్వ, తిరు ముకముమ్ = అందమైన ముఖము- అనే వీటిని, వழ்ழి = విశేషమైన, అన్బు కొణ్డు = భక్తిని కల్గి, వழ்ழిత్తినేన్ = స్తుతించాను, ఇని= ఇక, పేఱు = పరమపురుషార్థం, మఱ్ఱు ఇలై= వేఱొకటి లేదు.

9. **పొరునఱ్ఱుఱైయిలరుళాలిరున్ద నమ్పుఙ్గవర్కోన్**
   **అరుణఱ్ఱమిழுరై మా మణవాళమామునివన్**
   **తిరునెఱ్ఱియు న్దిరునామము న్దాలున్దిరుచ్చిగైయుమ్**
   **వరుణత్తెழிలు మనత్తినుళ్ళే నిన్ఱు వాழ்విక్కుమ్**

పొరు నల్ తుఱైయిల్ = తామ్రపర్ణీనదీయొక్క రేవు అయిన ఆழ்వార్ తిరునగరిలో, అరుళాల్ = తమ నిర్హేతుకకృపతో, ఇరున్ద = వేంచేసి ఉన్న, నమ్ = మన, పుఙ్గవర్= నిత్యసూరులకు, కోన్ = నాయకులైన సేనైముదలియార్ అంశమైన నమ్మాழ்వార్లు, అరుళ్ = అనుగ్రహించిన, నల్ = మంచి, తమిழ் = ద్రావిడ వేదాన్ని, ఉరై = వివరించే, అరుమ్ = అరుదైన, మా= గొప్ప, మణవాళమామునివన్ = మణవాళమహామునుల, తిరు నెఱ్ఱియుమ్ = అందమైన ఫాలభాగం, తిరు నామమ్= ఆ లలాటంలో అలంకరించుకొన్న ఊర్ధ్వపుండ్రం, తాలుమ్ = నాలుక, తిరు చ్చిగైయుమ్ = అందమైన శిఖ, వరుణత్తు= తిరుమేనిచ్ఛాయయొక్క, ఎழிలుమ్ = కాంతి, మనత్తిన్ ఉళ్ళే నిన్ఱు = మనస్సులోపల స్థిరంగా నిలచి, వాழ்విక్కుమ్ = నన్ను ఉజ్జీవింపజేస్తున్నాయి.

10. **వాழ்ழி శెన్దామరైత్తాళ్ తువరాడై మరుఙ్గు కొప్పూழ்**
    **వాழ்ழி మున్నూలుఱై మార్బు ముక్కోలుఙ్గై వాழ்ழி తిణ్డోళ్**
    **వాழ்ழி శెవ్వాయ్ విழ்ழి వాழ்ழి పొన్నామ మరువు నుదల్**
    **వాழ்ழி పొఱ్కోయిన్ మణవాళమాముని వాழ் ముడియే**

పొన్ కోయిల్ = బంగారుమయంగా ఉండే శ్రీరంగంలో వేంచేసి ఉన్న, మణవాళ మా ముని = మణవాళమహామునుల, శెమ్ తామరై త్తాళ్ = అందమైన, తామరలవంటి శ్రీపాదాలు, వాழ்ழி =క్షేమంగా ఉండాలి, తువర్ ఆడై = కాషాయ వస్త్రం, మరుఙ్గు = మధ్యప్రదేశం, కొప్పూழ் = తిరునాభి, వాழ்ழி = క్షేమంగా ఉండాలి, మున్నూల్ =యజ్ఞోపవీతం, ఉఱై = నివసించే (ఉండే), మార్బుమ్ = వక్షఃస్థలం, ముక్కోల్ అమ్ కై = త్రిదండాన్ని ధరించిన శ్రీహస్తం, వాழ்ழி = మంగళంగా ఉండాలి, తిణ్ = (భక్తులను విడువని)

బలాన్ని కల, తోళ్ = భుజాలు, వాழ்ి = క్షేమంగా ఉండాలి, శెవ్వాయ్ = ఎఱ్ఱని అధరం, విழ్ి = నేత్రాలు, వాழ்ి= మంగళం, పొన్ =బంగారంవలె శ్లాఘ్యమైన, నామమ్ = తిరునామం, మరువు = పొందికగా ఉండే, నుదల్ = నొసలు (ఫాలభాగం), వాழ்ి = మంగళం, వాழ்్ = వర్ధిల్లే, ముడి= దివ్యశిరస్సు, వాழ்ి = మంగళంగా ఉండాలి.

ఈ చివరిపాశురం ప్రబంధంలో మిగిలిన తొమ్మిది పాశురాలకు సంగ్రహరూపం. **“ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్”** అన్నట్లు వక్తవ్యాంశంయొక్క సంగ్రహ విస్తరాలు విద్వాంసులకు అభిమతంకదా. శ్రీపాదాల స్తుతితో ప్రారంభం అయిన ఈ ప్రబంధం చూడాపీడవర్ణనతో తొమ్మిదవ పాశురంలో ముగియగా, ఉపసంహారరూపం అయిన ఈ పదవపాశురంలో పై దివ్యాంగాలకు నిత్యమంగళం ఆశాసింపబడింది. ఆచార్యుల తిరుమేనికి నిత్యమంగళం ఆశాసించడమే కదా శిష్యుని కర్తవ్యం. **“గురుం ప్రకాశయేద్ధీమాన్”** (బుద్ధిమంతుడను ప్రకాశింపజేయాలి) కదా **“తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్వడివై పేణు మవన్”** (తేజస్సును నిండుగా కల్గిన శిష్యుడు గురువుయొక్క దివ్యమంగళ విగ్రహాన్ని ఆదరించాలి) అనే ఉపదేశరత్తిన మాలైలోని వరవరమునుల శ్రీ సూక్తి భావ్యం.



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీనివాససూరి రచించిన

# శ్రీవరవరముని నక్షత్రమాలాస్తవం

## ప్రవేశిక

సంస్కృతభాషలో పలు విధాలై ప్రబంధాలు కవులచే, శాస్త్రవిద్వాంసులచే రచింపబడి అసంఖ్యాకులైన రసికులకు మహానందాన్ని అందిస్తున్నాయి. ఒక విషయాన్నిగూర్చి తెలిపే గ్రంథానికి ప్రబంధం అనే పేరు సామాన్యనామం. అది స్తుతి గ్రంథం గాని, కావ్యం గాని, నాటకం కాని, చంపువు గాని కావచ్చు. పురాణేతిహాసశాస్త్రాలలో కన్పించే లెక్కలేనన్ని విషయాలలో ఏదో ఒక విషయాన్నిగూర్చి వివరించే గ్రంథాలలో పలు ప్రక్రియలున్నాయి. ఒక్కొక్క ప్రక్రియలో ప్రబంధీకరించడానికి భిన్న భిన్న లక్షణాలు ఆలంకారికులచే నిర్వచింపబడ్డాయి. ఈ విధంగా నిర్వచింపబడిన లక్షణానుసారంగా ఆ యా ప్రబంధాలు రచింపబడాలి- అనేది శాస్త్రనియమం. నిర్వచించబడిన లక్షణాలలో ఒకటి, రెండు తక్కువగా, విభిన్నంగా గోచరించే ప్రబంధాలు కూడా అక్కడక్కడ గోచరించకపోవు.

ఈవిధమైన ప్రబంధాలలో స్తుతిప్రబంధప్రక్రియ ముఖ్యస్థానాన్ని అలంకరిస్తున్నది. సాధారణంగా భగవానునిగూర్చి, లేక, పరవ్యూహవిభవాది రూపాలలో ఏదో ఒక రూపాన్ని, లేక, పలు రూపాలను గూర్చి, లేక, మిగిలినదేవతలు, ఆచార్యులు మొదలైనవారినిగూర్చి రచింపబడినదై ఈ కృతి ఉంటుంది. స్తోత్రం, స్తవం, స్తుతి మొదలైన పదాలు ఒకే అర్థాన్ని ఇస్తాయి. వీటిలో ఏదో ఒక పదాన్ని ప్రయోగించి స్తుతిగ్రంథానికి పేరు పెట్టవచ్చు. శ్రీస్తుతి, వరదరాజస్తవం, దశావతారస్తోత్రం మొదలైనవి ఇందుకు ఉదాహరణాలు. గ్రంథకర్తల అభిప్రాయానుసారం గ్రంథం పెద్దది కావచ్చు. లేక, చిన్నదిగా ఉండవచ్చు. కొన్ని స్తుతి గ్రంథాలలో పేర్లు వాటిలో కీర్తింపబడే దైవం, లేక, ఆచార్యుల, నామానికి తరువాత, ఆ గ్రంథంలో ఉండే శ్లోకసంఖ్యను తెలిపే పదాన్ని చేర్చి పేరును పెట్టవచ్చు. దేవరాజాష్టకం, యతిరాజసప్తతి, వరదరాజపంచాశత్, శ్రీసుదర్శనశతకం, పాదుకాసహస్రం మొదలైనవి దీనికి ఉదాహరణాలు.

ఈ విధంగా విభిన్నంగా గోచరించే స్తుతిగ్రంథాలలో నక్షత్రమాలికా స్తవమనే ఒక ప్రక్రియ ఉన్నది. అది కనీసం 27 శ్లోకాలను కల్గినదై ఉండాలి. ఎందుకు ? అంటే, 27 నక్షత్రాల పేర్లు ఆ స్తుతిలోని శ్లోకాలలో సూచింపబడాలి కనుక. అంతేకాక, ప్రార్థనామంగళాశాసనం, స్తుతిఫలం- అనే వానిని తెలిపే కొన్ని శ్లోకాలుండవచ్చు. నక్షత్రాల పేర్లు ప్రతిశ్లోకంలోను కన్పిస్తాయి కనుక, ఇది ముద్రాలంకారమయం. అయితే, నక్షత్రాల నామాలకు, గ్రంథంలోని ప్రమేయానికి ఏవిధమైన సంబంధం ఉండనక్కరలేదు.

ఇక, రెండవ విషయమేమంటే, నక్షత్రమాల- అనే పేరుకు తగినట్లుగా మాలవలె మధ్యలో లావుగా, క్రిందపైన సన్నగా ఉండాలి. అందువల్ల కవులు ఆరంభశ్లోకాన్ని ఒక పాదానికి ఎనిమిది అక్షరాలను కల చిన్న వృత్తంతోకూర్చి, తరువాత వరుసగా ఒక్కొక్క శ్లోకానికి పాదాక్షరాలను ఒక్కొక్కటిగా పెంచి, వేటు

వేఱు వృత్తాలద్వారా శ్లోకాలను పెంచి, మధ్యశ్లోకాన్ని నాయకరత్నంగా ఒక్కొక్కపాదంలో 21అక్షరాలను కల పెద్దవృత్తంతో కూర్చి, తరువాత వచ్చే శ్లోకాలను ప్రతిపాదం ఒక్కొక్క అక్షరాన్ని క్రమంగా తగ్గించి, 27వ శ్లోకాన్ని తిరిగి ప్రతిపాదంలో అక్షరాలను కల చిన్న శ్లోకంగా అనుష్టుప్ఛందస్సులో కూర్చి ప్రబంధ, సన్నివేశాన్ని ఒక మాలరీతిలో రచిస్తారు. ఈ రెండు నియమాలు అన్ని నక్షత్రమాలికాస్తుతులకు సమానం.

మూడవ అంశం- ప్రబంధం అన్దాదిప్రక్రియలో రచింపబడడం కూడా కన్పిస్తుంది. ఒక్కొక్క శ్లోకంలోని చివరి పాదం, లేక, చివరి అక్షరం తరువాతి శ్లోకం ఆరంభపదంగా, ఆరంభాక్షరంగా ఉండడమే అన్దాది ప్రక్రియ. సాధారణంగా ఈ విధమైన స్తుతులలో ఈ నియమం పాటింపబడింది. ఉదాహరణకు- ప్రసిద్ధి చెందిన పరాంకుశ నక్షత్రమాలికను చెప్పవచ్చు. కొన్ని స్తుతులలో ఈ విధి కన్పించదు. వేంకటాధ్వరి రచించిన లక్ష్మీసహస్రంలో కన్పించే నక్షత్రమాలికా స్తబకంలో ఈ అందాది ప్రక్రియ కన్పించదు. ఇంకా పలువురు కవులు రచించిన నక్షత్రమాలికాస్తుతులలో సైతం ఈ నియమం పాటింపబడలేదు.

ఇంతేకాక, కవులు ఇంకా కొన్ని నియమాలను తాము స్వయంగా కల్పించుకొని పాటించడంకూడా కన్పిస్తుంది. ఇది వారి అద్భుత కవనాపటిమకు నిదర్శనం. వరదనారాయణనక్షత్రమాలై- అనే స్తుతిలో మణవాళమహామునుల ప్రియశిష్యులైన వరదనారాయణులనబడే కోయిల్కన్దాడై అణ్ణన్ స్తుతింపబడ్డారు. ఆ స్తుతిలో పూర్వం తెల్పిన నియమాలతోపాటు, ఒక్కొక్క శ్లోకంలోను ఆ శ్లోకవృత్తనామం, ఆ వృత్తలక్షణం- అనే అంశాలు కూడా చేర్చబడ పాటింపబడడం ఆ స్తుతికర్తకు పాండిత్యాన్ని, ఛందోవ్యాకణాలంకారాది శాస్త్ర చాతుర్యాన్ని నిరూపిస్తున్నాయి.

శ్రీమద్వరవరముని నక్షత్రమాలాస్తవమనే ప్రకృతగ్రంథంలో కవి ఒక నూతనమైన, విలక్షణమైన నియమాన్ని ఏర్పరచుకొని పాటించారు. అది ఏమంటే- క అనే అక్షరంతో ఆరంభమవుతున్న ఈ కృతి వరుసక్రమంలో శ్లోకాక్షరాలు తరువాత తరువాత అక్షరాలతో ఆరంభమై హ-అనే అక్షరంతో ముగిసి అన్దాది ప్రక్రియానియమాన్ని అనుసరిస్తున్నాయి. చివరి శ్లోకం హ- అనే అక్షరంతో ఆరంభమై, క -అనే అక్షరంతో ముగుస్తున్నది. ఙ, ఞ, ణ, థ- అనే అక్షరాలతో ఆరంభమయే శబ్దాలు లేనందున ఈనాల్గింటిని విడచి, క- నుండి - హ వరకు శ్లోకాలు వరుసక్రమంలో రచింపబడ్డాయి.

ఈ గ్రంథం ఆచార్యసార్వభౌములైన శ్రీమణవాళమహామునులను గూర్చిన అరుదైన స్తుతిగా ప్రకాశిస్తున్నది. అర్థస్వారస్యం, శబ్దమాధుర్యం నిండిన రస్యమైన ఈ కృతి ద్రాక్షాపాకంలో రచింపబడింది. ఇందులో శ్రీవరవరమునుల సౌందర్యం, లావణ్యం, జ్ఞానం, భక్తి, వైరాగ్యం మొదలైన ఆత్మగుణపూర్తి, గ్రంథరచనాపటిమ, శిష్యవాత్సల్యం, అనుష్ఠానం, ఆచార్యత్వపూర్తి మొదలైన అన్నీ చక్కగా స్తుతింపబడ్డాయి. ఈ స్తతిలో ఆచార్యనిష్ఠ, దానికి మించినదైన ఆచార్యాభిమానం -అనేవి తాత్పర్యాంశాలు. ఈ కవి మధురకవులవలె చరమపర్వనిష్ఠను కలవారనే విషయం వారు ఈ కృతిహార్దంగా పల్కిన పలు సూక్తుల ద్వారా కరతలామలకం.

అతిగంభీరమైన ఈ స్తుతిని ప్రతిదినం పారాయణ చేస్తే అన్ని శుభాలు కల్గుతాయి- అనేది నిస్సందేహం. దీనిని రచించినవారు శ్రీనివాససూరి అనే పేరును కల దొడ్డయాచార్యులనే ప్రసిద్ధిపొందిన

చోళసింహపురం చండమారుతం దొడ్డయాచార్యస్వామివారి శిష్యులని తెలుస్తున్నది. ఇంతకంటే మించిన వివరాలు ఏమీ స్తుతికర్తను గూర్చి తెలియలేదు.

ఈ స్తుతికి సంగ్రమైన సంస్కృతవ్యాఖ్య ఒకటి సుమారు 50 సం॥లకు పూర్వం గ్రంథలిపిలో ముద్రింపబడింది. అది ఇపుడు దుర్లభం. ఇపుడు సంగ్రహంగా తెలుగులో వివరణం విన్నపింపబడుతున్నది.

## తనియన్

**మహనీయమహార్యాంఘ్రి మంజులాబ్జమహచ్ఛటా ।**
**మందా మిమాం మనీషాం మే మంక్షు సంధుక్షయేదిహ ॥**

మహనీయ = మిక్కిలి పూజించదగిన, మహార్య+అంఘ్రి= దొడ్డయాచార్యులవారి, మంజుల = అందమైన, అబ్జ = తామరలవంటి శ్రీచరణాలలో ఉండే, మహచ్ఛటా = (వారి శిష్యులైన శ్రీనివాసాచార్యులనే) కాంతిసమూహం, మందాం = మందమైన, ఇమాం = ఈ, మే= నాయొక్క, మనీషాం = బుద్ధిని, ఇహ= ఈలోకంలో, మంక్షు = వేగంగా, సంధుక్షయేత్ = వెలిగేటట్లు చేయాలి.

మహనీయులై - దొడ్డయాచార్యులవారి శిష్యులు శ్రీనివాసాచార్యులవారు. వారు ఆచార్యుల శ్రీచరణాలలోని గొప్ప కాంతిసమూహం వంటివారు. ఆ కాంతిసమూహం నా మందబుద్ధిని ప్రకాశం పొందేటట్లుచేయాలి.



1. **కరుణావారిధి ర్జీయాత్ కాంతజామాతృసంయమీ ।**
**ఆసీద్యేనాశ్వినీలోకః తమోఘ్నేనేచ్ఛతా సుఖమ్ ॥**

ఆశు =వేగంగా, (శిష్యులు భావించిన తక్షణం ఏమాత్రం ఆలస్యం లేకుండా), తమోఘ్నేన = వారి అజ్ఞానమనే చీకటిని పోగొట్టేవారు, సుఖమ్ = వారికి పరమసుఖాన్ని (మోక్షాన్ని), ఇచ్ఛతా = (కలగాలని) కోరేవారైన, యేన = ఏ వరవరమునులచే, లోకః= లోకం, ఇనీ = సూర్యుని కల్గినదిగా, ఆసీత్ = అయినదో, కరుణావారిధిః= కరుణసముద్రం వంటివారైన, (సః) కాంతజామాతృసంయమీ = (ఆ) వరవరమునులు, జీయాత్ = సర్వోత్కర్షతో వర్ధిల్లాలి.

తనను ఆశ్రయించినవారి అజ్ఞానం తీర్చి, వారికి మోక్షమనే పరమానందం కలగాలని ఎల్లప్పుడు ప్రయత్నించే కరుణను కలవారైన శ్రీవరవరమునులనే ఆచార్యశ్రేష్ఠులు గొప్పవైభవంతో ప్రకాశించాలి- అని వారికి మంగళాశాసనాన్ని ఈ శ్లోకంద్వారా చేస్తున్నారు.

అశ్వినీ- అనే మొదటి నక్షత్రంయొక్క పేరు ఈ శ్లోకంలో ముద్రాలంకార క్రమంలో సూచింప బడింది. ఇదే క్రమంలో అన్నిశ్లోకాలలో వరుసగా అన్ని నక్షత్రాల నామాలు సూచింపబడతాయని గ్రహించాలి. శ్రీవరవరమునుల పరంగా అర్థాన్ని చెప్పేటపుడు - **"ఆశు+ఇనీః"**- అని పదవిభాగం చేయాలి. **"ఇనః సూర్యే"** అనే నిఘంటువచన ప్రకారం ఇనశబ్దం సూర్యవాచి. సూర్యుని కల్గినది **"ఇనీ"** అనబడుతుంది

(చక్రాన్ని కల్గినవాడు "చక్రీ" అన్నట్లు). ఈ "ఇనీ" అనే పదం లోకానికి విశేషణం. "ఇనీ లోకః" -అంటే లోకం సూర్యుని కల్గినదిగా అయినది - అని తాత్పర్యం. "లోక్యతే ఇతి లోకః, లోకయతీతి లోకః" అనే రెండు కర్తరి, కర్మణి వ్యుత్పత్తులనుబట్టి లోకమంటే జగత్తు, లేక, మానవలోకం. లోకంలోని చీకటిని పోగొట్టడానికి, ఆనందాన్ని, చైతన్యాన్ని ప్రసాదించడానికి సూర్యుడు అవశ్యకం అయినట్లే, ఆశ్రితజనుల అజ్ఞానాంధకారాన్ని పారదోలడానికి, వారికి యథార్థజ్ఞానాన్ని ప్రసాదించి, తత్త్వవివేకాన్ని కల్గించడానికి, మోక్షానందాన్ని పొందించడానికి ఆచార్యుడనే సూర్యుని కటాక్షం అత్యావశ్యకం- అని భావం.

ఈ శ్లోకం "క" అనే అక్షరంతో ప్రారంభమై, "ఖ" అనే అక్షరంతో పూర్తి అవుతున్నది. ఇటువంటి అక్షరసరణినే ఒక్కొక్క శ్లోకంలో గమనించవచ్చు. ప్రతిపాదంలో ఎనిమిది అక్షరాలను కల్గిన అనుష్టుప్ ఛందస్సులో ఈ శ్లోకం రచింపబడింది. నమ్మాళ్వార్ల విషయంగా జీయర్ నాయనార్ - అనుగ్రహించిన నక్షత్రమాలికాస్తోత్రం కూడా ఈ అనుష్టుప్ఛందస్సుతోనే ఆరంభం కావడం గమనార్హం. గ్రంథారంభంలో గ్రంథప్రమేయభూతులైన వరవరమునులకు మంగళాశాసనం చేయబడింది. **"ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి"** ఇత్యాదిగా చెప్పబడిన రీతిలో గ్రంథారంభంలో మంగళాచరణం చేయబడింది. **"కం బ్రహ్మ ఖం బ్రహ్మ"** అనే శ్రుతివాక్యానుసారం పరబ్రహ్మవాచకమైన "క" కారాన్ని మొదట కూర్చడంద్వారాకూడా కావ్యంలో మంగళారంభం చేయబడినదని చెప్పవచ్చు.

**"కరుణావారిధిః"** అని అన్నందున, నీరు ఇంకిపోని చోటు సముద్రమైనట్లే, కరుణ అనే జలానికి ఇంకిపోని చోటు శ్రీవరవరమునులనే తాత్పర్యం వివక్షితం. **"సిద్ధిర్భవతి వా నేతి సంశయోఽచ్యుత సేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్"** అనికదా సూక్తి. **"దయైకసింధో"** అని కీర్తింపబడినవారు శ్రీరామానుజులు. వారి పునరవతారభూతులైన శ్రీవరవరమునులకు **"కరుణావారిధిః"** అని నిర్దేశింపబడం చాలా యుక్తం. అలంకారం రూపకం.

2. **ఖండయతీయం నేతు రిదం కాంక్షితదాత్రీ చింతయతామ్ ।**
   **సంతతభక్తిశ్రీభరణీ సౌమ్యవరాఖ్యా తే సుభగా ॥**

సౌమ్యవర = ఓ శ్రీవరవరమునీ!, తే = దేవరవారి, ఇయం = ఈ, సుభగా = మంగళకరమైన, ఆఖ్యా = తిరునామం, చింతయతామ్ = దేవరవారిపట్ల తైలధారవలె అవిచ్ఛిన్నస్మృతి సంతానరూపమైన భక్తిని కల, నః= దాసులమైన మాయొక్క, దురితం = పాపాన్ని, ఖండయతి = పోగొడుతున్నది, కాంక్షితదాత్రీ = కోరినవానిని అన్నిటిని ఇచ్చేది, సంతతభక్తిశ్రీభరణీ = ఎల్లప్పుడు నిరంతరమైన భక్తిని ఇంకా ఇంకా వృద్ధి చేస్తున్నది. (పరభక్తి -పరజ్ఞాన - పరమభక్తి పర్యంతం వృద్ధిచేస్తున్నది)

ఇందులో శ్రీరంగనాథుని తిరునామాన్ని కల శ్రీవరవరమునులను సంబోధిస్తూ వారి నామప్రభావాన్ని వివరిస్తున్నారు.

శ్రీ వరవరమునీ! దేవరవారి దివ్యనామం ఆశ్రితుల పాపాలను పోగొట్టి, వారి అభీష్టాలను ఇచ్చి, భగవద్భక్తిని ఇంకా ఇంకా అభివృద్ధి చేస్తుంది. నామికి వలెనే నామానికి కూడా భక్తుల అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని కల్గించే శక్తి ఉన్నదని భావం.

"భరణీ" - అంటే భరించేది, ధరించేది - అని అర్థం. అభివృద్ధిని కల్గించేదని తాత్పర్యం. ఈ పదం ద్వారా భరణీనక్షత్రం సూచింపబడింది. శ్లోకం "భ" అనే అక్షరంతో ఆరంభమై, "గ" అనే అక్షరంతో ముగిసింది. భగవత్ భక్తిని సంపదగా రూపించడంవల్ల రూపకాలంకారం ఉన్నది. "అంతరిక్షగతః శ్రీమాన్", "లక్ష్మణో లక్ష్మి సంపన్నః", "స తు నాగవరః శ్రీమాన్" ఇత్యాది ప్రయోగాలలో ఈ విధంగా ప్రయోగింపబడడం గమనించవచ్చు. తిరుమాలై ప్రబంధంలో భగవన్నామ సంకీర్తనవైభవం తెలుపబడింది. "కులమ్ తరుమ్ శెల్వమ్ తన్దిడుమ్" ఇత్యాదిగా తిరుమంగై ఆళ్వార్లు పల్కిన భగవన్నామ వైభవం స్మరణీయం. "వైకుంఠనామగ్రహణ మశేషా ఘనాశకమ్" అయినట్లే వరవరమునుల నామగ్రహణంకూడా అటువంటిదే. దివ్యసూరిసూక్తి ప్రథమపర్వాత్మకం, ఇది చరమపర్వాత్మకం. ప్రతిపాదంలో తొమ్మిది అక్షరాలను కల "మణిమధ్యమా" ఛందస్సులో ఈ శ్లోకం రచింపబడింది.

3. గాయంస్త్వాం మనుజః కలేబరం క్రవ్యాసృఙ్మలకృత్తికారణమ్ ।
సంత్యజ్య త్వరితం స మోదతే వైకుంఠే హరిణా సహానఘః ॥

సః మనుజః= దేవరవారిపట్ల భక్తిని కల్గిన ఆ మానవుడు, త్వాం = దేవరవారిని, గాయన్ = కీర్తిస్తూ, క్రవ్య = మాంసం, అసృక్ = రక్తం, మల = మలం, కృత్తి = చర్మం, అనే వీటిని, కారణం = కారణంగా కల్గిన (వీటితో ఏర్పడే) కళేబరం= కళేబరాన్ని, త్వరితం = శీఘ్రంగా, (ఈ జన్మలోనే), సంత్యజ్య= విడచిపెట్టి, అనఘః = పాపరహితుడై, వైకుంఠే = పరమపదంలో, హరిణా సహ = భగవానునితో కూడ, మోదతే = ఆనందిస్తున్నాడు.

తాను పూర్వం చేసిన కర్మల ఫలంగా ఈ భూమిలో రక్తమాంసచర్మాత్మకమైన హేయమైన శరీరంతో జన్మించి ప్రతిజీవుడు, శ్రీవరవరమునులనే ఆచార్యుని ఆశ్రయించి, ఆ ఆచార్యుల పరమకృపవల్ల ఈ జన్మలోనే చివర సంసారాన్ని (శరీరాన్ని) విడచి, మోక్షాన్ని పొందుతున్నాడు.

"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజః పరమం సామ్యముపైతి", "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణావిపశ్చితా" ఇత్యాది శ్రుత్యర్థం వరవరమునిపరంగా అన్వయింపబడడం గమనించదగినది. "ఆచార్య సంబంధం విందతి ప్రాప్నోతీతి విద్వాన్" అనే వ్యుత్పత్తిని ప్రకృతంలో "విద్వాన్" అనే పదానికి చెప్పడంలో అర్థస్వారస్యం ఉన్నది.

ఈ శ్లోకంలో "కృత్తికా" అనే నక్షత్రం సూచింపబడింది. శుద్ధవిరాట్ అనే వృత్తంలో ఈ శ్లోకం కూర్చబడింది. ఈ వృత్తంలోని ప్రతిపాదంలో 10 అక్షరాలుంటాయి.

4. ఘంటాపథో లోకగురోః కృతీనాం వ్యాఖ్యానరూపో భృశదుర్గమాణామ్ ।
ఆరోహిణీనాం నిగమాంతభూమేః యేనారచిడే తమిమం సువాచమ్ ॥

యేన = ఏ శ్రీవరవరమునులచే, లోకగురోః = శ్రీపిళ్ళైలోకాచార్యుల వారి, భృశదుర్గమాణాం = సులభంగా అర్థంకానివైన, నిగమాంతభూమేః = వేదాంతస్థానాలకు, ఆరోహిణీనాం = నిచ్చెనవలె సులభంగా ఎక్కించగల్గిన, (వేదాంతార్థాలను అన్నిటిని స్పష్టం చేయగల్గిన), కృతీనాం = ముముక్షుప్పడి, తత్త్వత్రయం,

శ్రీవచనభూషణం - మొదలైన గ్రంథాల, వ్యాఖ్యానరూపః = వ్యాఖ్యానరూపాన్ని పొందిన, ఘంటాపథః = రాచబాట అనదగినట్లు సులభమైన మార్గాన్ని (సులభంగా గ్రహించదగిన మార్గాన్ని) అరచి = రచింపబడినదో (ఏర్పాటు చేయబడినదో), తమ్ = ఆ, సువాచం = విశదవాక్ శిఖామణి అనే పేరును పొందిన, ఇమం= ఈ వరవరమునులను, ఈడే = స్తుతిస్తున్నాను.

అష్టాదశరహస్యాలనే పేరుతో ప్రసిద్ధినిపొందిన పద్దెనిమిది రహస్యగ్రంథాలను పరమాచార్యులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు రచించారు. వాటిలో గొప్ప వేదాంతార్థాలను తమకే స్వంతమైన రీతిలో అందంగా పలికారు. వాటిని సులభంగా గ్రహించడం సాధ్యం కాదు. అందువల్ల మన శ్రీవరవరమునులు వాటిలో ముఖ్యాలైన కొన్ని గ్రంథాలకు మధురమైన శైలిలో వ్యాఖ్యానాలను రచించి, అందఱు లాభపడేటట్లుగా గొప్ప ఉపకారాన్ని చేశారు.

రాజు నడిచే మార్గం (రాచబాట) చక్కగా నిర్మింపబడి, అందఱు సుఖంగా నడిచేటట్లుంటుంది. అదే రీతిలో, శ్రీపిళ్ళైలోకాచార్యులవారి వేదాంతస్థానీయాలైన రహస్య గ్రంథాలలో ప్రవేశించి, వాటిని చక్కగా అభ్యసించి గ్రహించడానికి శ్రీవరవరమునులు రాజవీథి అనదగిన, అరుదైన వ్యాఖ్యానాలను అనుగ్రహించిన విషయం శ్లోకంలో ప్రస్తావింపబడింది.

ఇందులో రోహిణీనక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలోను 11 అక్షరాలను కల ఇంద్రవజ్రా వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది. శ్లోకం **"ఘ"** అనే అక్షరంతో ప్రారంభమై, **"చ"** అనే అక్షరంతో ముగిసింది.

5. **చంద్రే మృగశీర్షాకారం మలమాస్తే తస్మిన్న చ శోభా కాచిత్ దివసేఽ స్తి ।
నిత్యం వరయోగిన్ ! నైజే వదనాబ్జే జాగ్రత్యతిశోభా నూత్నా భృశమచ్ఛా ॥**

వరయోగిన్ = ఓ వరవరమునీ !, చంద్రే = చంద్రునిలో, మృగశీర్ష+ఆకారం = లేడి తలరూపంలో, మలం = మచ్చ, ఆస్తే = ఉన్నది, చ = మఱియు, తస్మిన్ = ఆ చంద్రునిలో, దివసే = పగటివేళ, కాచిత్ శోభా = కొంచెంకూడా శోభ, నాస్తి = లేదు, దేవరవారి, వదనాబ్జే = ముఖమనే చంద్రునిలో, నిత్యం = ఎల్లప్పుడు, భృశం = మిక్కిలి, నూత్నా = నూతనమైన, అచ్ఛా = స్వచ్ఛమైన, అతిశోభా = అధికమైన కాంతి, జాగ్రతి = ప్రకాశిస్తున్నది. ఈ శ్లోకంలోని మూడవ పాదంలో **"నిత్యం కమనీయోద్వోఢుర్వదనేందౌ"** అనే పాఠాంతరం ఉన్నది. దానికి అనుగుణంగా **"కమనీయోద్వోఢుః** - అందమైన మణవాళమహాముునుల, **వదనేందౌ** - ముఖమనే చంద్రునిలో" అనే అర్థాన్ని చెప్పాలి.

ఇందులో వరవరమునుల ముఖానికి చంద్రునితో సాటి పల్కి, వెంటనే ఆ చంద్రునికంటె ఆధిక్యాన్ని పలికారు. ఏ రీతిలో అంటే, చంద్రబింబం నడుమ జింక, లేక, కుందేలు రూపంలోని మచ్చ ఉన్నది. అందువల్లనే చంద్రునకు మృగాంకుడు, శశాంకుడనే పేర్లు వ్యవహరింపబడుతున్నాయి. శ్రీవరవరమునుల ముఖమండలంలో ఆ విధంగా ఏ కళంకం లేదు. అంతేకాక, ఆ కళంకంతో కూడిన చంద్రబింబం కూడా పగటి కాలంలో ప్రకాశించడం లేదు. కృష్ణపక్షంలో పూర్తిగా ప్రకాశించడంలేదు ఆ రీతిలో కాకుండా

శ్రీవరవరమునుల ముఖం పగలు, రాత్రి, శుక్లపక్షం, కృష్ణపక్షం- అనే తేడా లేకుండా అన్ని సమయాలలో పూర్ణమైన ప్రకాశంతో అందంగా వెల్గుతున్నది.

ఈ శ్లోకంలో మృగశీర్ష నక్షత్రం సూచితం. వృత్తం పేరు మణిమాల. శ్లోకం "చ" అనే అక్షరంతో ఆరంభమై, "ఛ" అనే అక్షరంతో ముగిసింది.

6. **ఛాత్రేభ్యాం శఠమథనార్యలోకగుర్వా - ద్యాచార్యప్రథితతమప్రబంధభావాన్ ।**
**వ్యాకుర్వత్యమృతమయీ స్త్వయి స్వసూక్తీః స్నేహార్ద్రాః పపు రిహ యే సుజన్మభాజః ॥**

త్వయి = దేవరవారు, ఛాత్రేభ్యః = శిష్యులకు, శఠమథనార్య = నమ్మాళ్వార్లు, లోకగురు+ఆది+ ఆచార్య = నమ్పిళ్ళై, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు మొదలైన మహాచార్యుల, ప్రథితతమ= మిక్కిలి ప్రసిద్ధి చెందిన, ప్రబంధభావాన్ = గ్రంథాలలోని అర్థవిశేషాలను, వ్యాకుర్వతి = వ్యాఖ్యానం చేసేటపుడు, అమృతమయీః = అమృతంవలె ఆనందాన్ని, ఉజ్జీవనాన్ని కల్గించే, స్నేహార్ద్రాః = భక్తితో నిండిన, స్వసూక్తేః= దేవరవారి సూక్తులను, యే = ఎవరు, పపుః = పానం చేశారో, (విని ఆనందించారో), వారు, ఇహ = ఈ లోకంలో, సుజన్మభాజః = మంచి జన్మను పొందినవారు.

శ్రీవరవరమునుల అమృతంవలె ఆనందాన్ని కల్గించే శ్రీసూక్తులను అనుభవించేవారు గొప్ప భాగ్యశాలురు. పఠించేటపుడే ఆనందాన్ని కల్గించే శ్రీవరవరమునుల శ్రీసూక్తులను సాక్షాత్తు ఆలకించినవారు చాలా అదృష్టవంతులని అంటున్నారు. ఆచార్యుల గ్రంథరచనాచాతుర్యం దీనిద్వారా తెలుపబడింది. శ్రీవరవరముని శతకంలోని **"వ్యాఖ్యాగర్భం వరవరమునే ! త్వన్ముఖం వీక్షమాణాం కోణే లీనః క్వచిదణురసౌ సంసదం తాముపాస్తామ్"** అనే సూక్తి స్మరణీయం.

ఈ శ్లోకంలో "స్వసూక్తీః" అనే పదానికి బదులు "త్వదుక్తీః" అనే పాఠభేదం కన్పిస్తున్నది -అర్థంలో మార్పు లేదు. ఈ శ్లోకంలో ఆర్ద్రానక్షత్రం సూచింపబడింది. వృత్తం- ప్రతిపాదంలోను 13 అక్షరాలు కల ప్రహర్షిణి.

7. **జజ్ఞే భవాన్ ప్రథమ మచ్యుత తల్పరూపే శేష స్తతో రఘుపతే రనుజోఽథ సీరీ ।**
**శ్రీభాష్యకృత్త్వథ పునర్వసుధాతలే త్వం ప్రాప్యైవ సౌమ్యవరతాం భవితాం సమౌజ్ఝః ॥**

ప్రథమం = మునుముందు, అచ్యుత = భగవానుని, తల్పరూపే = పడుక అయిన, శేషః = ఆదిశేషుడైన, భవాన్ = దేవరవారు, తతః = తరువాత, రఘుపతేః = శ్రీరాముని, అనుజః = తమ్ముడైన లక్ష్మణునిగా, అథ = ఆ తరువాత, సీరీ = బలరామునిగా, అథ పునః= ఆ పిమ్మట, శ్రీభాష్యకృత్ = భగవద్రామానుజులుగా, జజ్ఞే = అవతరించారు, అథ పునః= ఆ తరువాత, త్వం = దేవరవారు, వసుధాతలే= భూమిలో, సౌమ్యవరతాం = శ్రీవరవరమునుల రూపాన్ని, ప్రాప్య+ఏవ = పొందినతరువాతనే, భవతాం = మానవజన్మను, సమౌజ్ఝః = త్యజించారు.

భగవానుని **"మెత్తెన్న పఞ్జశయనమ్"** అయిన ఆదిశేషుడే లక్ష్మణునిగా, బలరామునిగా, శ్రీభాష్య కారులుగా, చివరగా, మణవాళమహామునులుగా అవతరించారు. అయినా, మణవాళమహామునులకు,

తరువాత వారు తిరిగి అవతరించ లేదు కనుక **"న చ పునరావర్తతే, న చ పునరావర్తతే"** అనే రీతిలో తిరిగి జన్మను ఎత్తని మోక్షసామ్రాజ్యాన్ని పొందారు. పూర్వం ప్రస్తావించిన మిగిలిన అవతారాలకు తరువాత జన్మను ఎత్తినందున, శ్రీవరవరమునుల అవతారానికి పిమ్మట జన్మను ఎత్తనందున పరమపదాన్ని పొందారని భావం. అందువల్ల అన్యావతారాలకంటే శ్రీవరవరమునుల అవతారం చాలా గొప్పది- అని చమత్కారంగా కవి ఇందులో పలికారు.

దీని తాత్పర్యమేమంటే- ఈలోకంలోని అజ్ఞులను సైతం తరింపజేసి పరమపదానికి తీసికొని పోవడంకోసం పరంపరగా ఆదిశేషుడు పలుమార్లు అవతరించినా, ఆశించిన ప్రయోజనం పూర్తిగా నెరవేఱలేదు. శ్రీవరవరమునులుగా అవతరించిన తరువాత పరమపదం అందరికీ కరతలామలకం అయినది కనుక, మళ్ళీ తిరిగి ఈలోకంలో అవతరించవలసిన ఆదిశేషునకు లేకపోయింది- అని.

**"శ్రీభాష్యకృత్"** అనే దానికి బదులుగా **"రామానుజః"** అని, **"భవితామ్"** అనే దానికి బదులుగా **"అవనీమ్"** అని పాఠభేదాలు కన్పిస్తున్నాయి. ఈ శ్లోకంలో పునర్వసు అనే నక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదం 14 అక్షరాలను కల వసంత తిలక అనే వృత్తంలో ఈ శ్లోకం కూర్చబడింది.

8. **ఝటితి యది భవాబ్ధేః స్యాత్తితీర్షా నృణాం తే వరవరపదభక్తిం తర్హి పుష్యంతు చిత్తే ।**
**న ఖలు నిఖిలబంధవ్రాతరక్షైకదీక్షః సకలగుణమణీనాం కాఽపి నిక్షేపపేటీ ॥**

నృణాం = మానవులకు, ఝటిత = త్వరగా, భవాబ్ధేః తితీర్షా= జన్మసముద్రాన్ని దాటే ఓపిక, యది = ఒకవేళ ఉంటే, వారు, వరవరపదభక్తిం = శ్రీవరవరమునుల శ్రీచరణాలలోభక్తిని, చిత్తే = (తమ) మనస్సులో, పుష్యంతు = వర్ధిల్లజేయాలి, సః= ఆవరవరముని, నిఖిల భక్తవ్రాత = సమస్తభక్తసమూహాన్ని, రక్షైకదీక్షః= రక్షించడమనే అద్వితీయమైన దీక్షను కలవారు, కా+అపి = సాటి లేని, సకలగుణమణీనాం = సమస్తకల్యాణ గుణాలనే మణులను, నిక్షేపపేటి = రక్షించే పేటికగా ఉన్నారు, ఖలు = ఇది నిశ్చయం.

భక్తులనందఱిని రక్షించడమనే అద్వితీయమైన వ్రతాన్ని కల్గినవారు, సమస్తకల్యాణగుణాలకు నివాసస్థానంగా ప్రకాశించేవారైన శ్రీవరవరమునుల శ్రీచరణాలలో గొప్ప భక్తిని కలవారికి సులభంగా మోక్షం సిద్ధిస్తుంది. జన్మసముద్రాన్ని దాటి మోక్షాన్ని పొందడానికి అది ఒక్కటే దారి- అని భావం. ఆచార్యాభిమానమే పరమోపాయమని హృదయం.

ఝటితి =శీఘ్రంగా- అంటే - మఱు జన్మను ఎత్తనక్కరలేని రీతిలో ఈ జన్మ చివరలోనే- అని భావం. ఇందులో నక్షత్రం సూచితం. మాలినీవృత్తం. దీనికి ప్రతిపాదంలో 15 అక్షరాలుంటాయి.

9. **టీకతే మన స్సదైవ మామకీన మాదరాత్ త్వత్ పాపద్మయుగ్మ మేవ సద్మభూతమాశ్రితానామ్ ।**
**అంజసాఽ ర్పయాద్యమయ్యపాంగదృష్టి మిష్టదాం త్వం సుందరోపయంతృభోగిరాడభక్తిమత్తవిష్ట ॥**

సుందరోయంతృయోగిరాట్ = ఓ వరవరమునిరూపంలోని యతిసార్వభౌమా!, అభక్తిమత్తవిష్ట = భక్తి లేనివారికి అందని స్వామీ!, ఆశ్రితానాం = భక్తులకు, సద్మభూతం = నివాసమైన, త్వత్పాదపద్మయుగ్మ

మేవ = దేవరవారి శ్రీచరణాలనే రెండు తామర పూలనే, మామకీనం = నాకు చెందిన, మనః= మనస్సు, సదా+ఏవ = ఎల్లప్పుడు, ఆదరాత్ = ప్రేమతో, టీకతే = పరుగుతీస్తున్నది, త్వమ్ = దేవరవారు, మయి = దాసుడనైన నాపట్ల, ఇష్టదామ్ = కోరిన ఫలాన్ని ఇచ్చే, అపాంగదృష్టిం = నీ కటాక్షాన్ని, అద్య = ఇపుడు, అంజసా = వేగంగా, అర్పయ = అర్పించు (ప్రసరింపజేయాలి).

యతులలో శ్రేష్ఠులు, భక్తులకు పరమసులభులు, అన్యులకు (భక్తులు కానివారికి) అందనివారు అయిన మణవాళమహామునుల యొక్క, ఆశ్రితులకు శరణమైన శ్రీచరణపద్మాలలోనే ఎల్లప్పుడు మనస్సు భక్తితో అభినివేశాన్ని పొందుతున్నది. ఆ చరణాలనే శరణంగా భావించి ఎల్లప్పుడు ధ్యానిస్తున్నది- అని అంటున్నారు. తమ భక్తిని స్వీకరించి, అన్నిటిని ఇవ్వగల్గిన దివ్యకటాక్షాన్ని తమపై ప్రసరింపజేయాలి. తమను చల్లబఊచాలి- అని ఇందులో ప్రార్థిస్తున్నారు, కవి. ఆచార్యకటాక్షమహిమనుగూర్చి పల్కడం ప్రకృతంలో కవికి వివక్షితం.

> "ఏకయైవ గురోః దృష్ట్యా ద్వాభ్యాం వాపి లభేత యత్ ।
> న తత్ తిసృభి రష్టాభిః సహస్రేణాపి కర్హి చిత్ ॥

(ఆచార్యుల (ప్రకృతంలో శ్రీవరవరమునుల) ఒక కటాక్షం వల్ల, లేక రెండు కటాక్షాలవల్ల లభించే ఫలం ముగ్గురు బ్రహ్మవల్లగాని, వేయి కన్నులను కల భగవానుని వల్లగాని పొందడం సాధ్యం కాదు) అనే వేదాంతదేశికుల సుభాషితనీవీశ్లోకం ఇక్కడ అనుసంధేయం.

సర్పదేవతాకమైన ఆశ్లేషానక్షత్రం ఈ శ్లోకంలో "సార్ప" అనే పదంతో లక్షితలక్షణా ప్రక్రియలో సూచితం. వృత్తం చిత్రమనే పేరును కల్గినది. దీనికి ప్రతిపాదంలో 16 అక్షరాలుంటాయి.

**10. తకార ఇవ దృశ్యతే యదిహ వస్తు నిశ్యంబరే దివా విపణికందువత్ యదపాం దరీదృశ్యతే ।**
**జన స్తదుభయం ముధా వదతి పుష్పవంతావితి స్థితౌ వరవరాభిధే త్వయి నృణా మఘఘ్నే జడః ॥**

నృణాం = మానవులయొక్క, అఘఘ్నే = అజ్ఞానమనే చీకటిని పోగొట్టగల్గినవారై, వరవరాభిధే = వరవరమునులనే తిరునామాన్ని కల్గిన, త్వయి స్థితే = దేవరవారు ఉండగా, ఇహ = ఈ లోకంలో (ఉండే), జడః జనః= మూఢజనుడు, (వస్తువుల యథార్థతత్త్వాన్ని గ్రహించలేని జనుడు), అంబరే = ఆకశంలో, నిశి =రాత్రివేళ, యత్ = ఏ, వస్తు = చంద్రుడనే వస్తువు, దృశ్యతే = కన్పిస్తున్నదో, దివా = పగటివేళ, విపణికందువత్ = అంగడిలో అమ్మబడే దోశె పెనంవలె గుండ్రంగా ఉండే, యత్ = ఏ, అపాం వస్తు = వేఱొక వస్తువు (సూర్యుడు), దరీదృశ్యతే = చక్కగా కన్పిస్తున్నదో, తత్+ఉభయం = ఆ రెండిటిని, పుష్పవంతౌ ఇతి = (లోకులు) సూర్యుడని, చంద్రుడని, ముధా = వ్యర్థంగా, వదతి = పల్కుతున్నారు.

రాత్రివేళలో మాత్రం ప్రకాశించే చంద్రుడు, పగటివేళ మాత్రం వెలిగే సూర్యుడు బాహ్యాంధకారాన్ని మాత్రమే పోగొట్టగలరు. ఎల్లప్పుడు రాత్రి, పగలు తేడా లేకుండా గొప్ప తేజస్సును కలవారై ప్రకాశించేవారు అజ్ఞానమనే ఆంతరతమస్సును, సకలపాపాలను పోగొట్టగల్గినవారై శ్రీవరవరమునులను విడచి పెట్టి చంద్రసూర్యులను స్తుతించడం అజ్ఞానకార్యమే సుమా ! అని అంటున్నారు.

"కందు" - అంటే దోశను తయారు చేసేటపుడు ఉపయోగించే పెనం. "స్వేదనీ" అని - దీనికి ఇంకొక పేరు. "నా కందుర్వా స్వేదనీ స్త్రియామ్" అని అమరం. "స్కందిర్- గతిశోషణయోః" అనే ధాతువునుండి పుట్టిన పదం ఇది. "స్కందేః సలోపశ్చ" అనే ఉణాదిసూత్రం ద్వారా సకారలోపం వచ్చింది. మూడవ పాదంలో "పుష్పవంతౌ" -అనే పదానికి బదులు "చంద్రసూర్యౌ" అనే ప్రయోగం ఉన్నది. అర్థం ఒకటే. "ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకరనిశాకరౌ" అని అమరం. పుష్పమంటే వికాసం, ప్రకాశం. పుష్పవంతౌ - అంటే వానిని కల్గినవారని అర్థం. ఈ అర్థంలో "పుష్పవాన్" అనే ఏకవచన ప్రయోగం లేదు. పుష్పవచ్ఛబ్దంవలె "పుష్పవంతః" అనే అకారాంతశబ్దం కూడా ఒకటి ఉన్నది. "రవిశశినౌ పుష్పవంతాభ్యామ్" అని నామమాలానిఘంటువచనం. "పుష్పదంతౌ" అనే ప్రయోగంకూడా ఈ అర్థంలో ఉన్నది- అని అమరసుధావ్యాఖ్యానంలో తెలుపబడింది.

నాల్గవ పాదంలో "స్థితే భృశ మఘాపహే త్వయి వరోపయంతః౽ర్జడః" అనే పాఠభేదం ఉన్నది. అపుడు "వరోపయంతః = ఓ మణవాళమహామునీ!, భృశం = మిక్కిలిగా (పూర్తిగా), అఘాపహే = పాపాన్ని (అజ్ఞానాన్ని) పోగొట్టే, త్వయి = దేవరవారు, స్థితే = వేంచేసి ఉండగా - అని అర్థం.

"నృణా మఘఘ్నే" అనే ప్రయోగంలో ఉండే "మఘ" అనే రెండక్షరాలు "మఘా" నక్షత్రాన్ని సూచిస్తున్నాయి. ప్రతిపాదంలోను 17 అక్షరాలను కల పృథ్వీవృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

11. డయనసరణి మన్వయాత్ వాయసశ్చేత్ కదాచిత్ క్షితౌ
హరిపదకిణచిహ్నితస్వాంతసదేశస్య పక్షీశితుః ।
తదిహ సరసపూర్వకా ఫల్గునీరంధ్రసందర్భకృత్
వరవరమునిబుద్ధిచాతుర్యమన్యైఽ న్వియుర్వై దృఢమ్ ॥

క్షితౌ = ఈ భూమిలో, కదాచిత్ = ఒకానొక సమయంలో, వాయసః= కాకి, హరిపద = మహావిష్ణువుయొక్క శ్రీచరణాలవల్ల ఏర్పడిన, కిణ = కాయలచే, చిహ్నిత = చిహ్నాన్ని కల్గినదిగా చేయబడిన, స్వాంశదేశస్య = తన బాహుస్కంధప్రదేశాలను కల, పక్షీశితుః= గరుడుని, డయనసరణిం = ఎగిరే రీతిని, అన్వియాత్ చేత్= అనుసరించినట్లయితే, తత్ = అపుడు, ఇహ = ఈ లోకంలో, అన్యే వై = మిగిలిన సామాన్యజనులు కూడ, సరస = సరసమైన, పూర్వకా = మార్గదర్శనం చేసే, (గొప్పవైన), అఫల్గు = మిక్కిలి రసవంతమైన, నీరంధ్ర = సమృద్ధియైన, సందర్భకృత్ = గ్రంథాలను రచించిన, వరవరముని = శ్రీవరవరమునుల, బుద్ధిచాతురీం = బుద్ధిచాతుర్యాన్ని, అన్వియుః= అనుసరించగలరు, దృఢమ్ = ఇది నిశ్చయం.

ఇతరులకు ఎవ్వరికీ లేని మేధావిలాసాన్ని కల మణవాళమహామునులు అనుగ్రహించిన గొప్ప రసపూర్తిని కల పలు గ్రంథాలను వేఱు సాధారణవ్యక్తులు రచించడం సాధ్యమా? అది ఎటువంటిది అంటే- కాకిని గరుడునివలె ఎగిరే స్థితిని కల్గడంతో సమానం. సాక్షాత్తు భగవానునకు వాహనమైనవాడు, నిరంతరం భగవానుని పాదప్రహారాల వల్ల గట్టిపడి కాయలు కాచి, అందువల్ల అందంగా ప్రకాశించే భుజస్కంధప్రదేశాలను కల్గినవాడైన గరుడుడు ఎక్కడ? భూమిపై ఎగిరే అల్పమైన ఒకకాకి, దాని ఎగిరే శక్తి ఎక్కడ?

ఈ దృష్టాంతం ద్వారా శ్రీవరవరమునుల గ్రంథరచనాసామర్థ్యం తెలుపబడింది. పూర్వఫల్గునీ నక్షత్రం **"పూర్వకా ఫల్గునీ"** అనే పదాలద్వారా సూచింపబడింది. ప్రతిపాదంలో 18 అక్షరాలను కల **"నారాచమ్"** అనే వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది. ఈ వృత్తానికే **"నిశా"** అనే పేరు కూడా ఉన్నది.

**12.** **ఢక్కావేణుమృదంగకాహళముఖైః వాద్యైః సదా నాదితే**
**సౌధాగ్ర్యే వరసుందరీశతవృతః సానంద మద్య ప్రభుః ।**
**శ్వో నగ్నః సకపాలపాణి రవశో భిక్షా మటన్ దృశ్యతే**
**తన్మర్త్యోత్తరఫల్గునీరసభవం కాంతోపయంత్రాశ్రితః ॥**

మర్త్య = ఓ మానవా!, అద్య = అపుడు, ఢక్కావేణు మృదంగకాహళ ముఖైః = డప్పు, వేణువు, మద్దెల, బాకా మొదలైన, వాద్యైః= వాద్యాలతో, సదా = ఎల్లప్పుడు, నాదితే = మంగళనాదం చేయబడిన, సౌధాగ్ర్యే = గొప్ప సౌధంలో, (**"సౌధాగ్రే"** అనే పాఠాంతరంలో -సౌధం పైభాగంలో- అని అర్థం.) సానందం= మిక్కిలి ఆనందంతో, వరసుందరీశతవృతః= అందమైన తరుణులు పలువురితో కలసినవాడైన, ప్రభు= ధనికుడు ఒకడు, శ్వః = రేపటి దినం, నగ్నః= దిగంబరుడై, సకపాలపాణిః= చేతిలో భిక్షకోసం కపాలాన్ని ధరించినవాడై, అవశః = దిక్కులేనివాడై, భిక్షామ్ అటన్ = బిచ్చమెత్తేవాడుగా, దృశ్యతే = గోచరించుచున్నాడు, తత్ = అందువలన, ఫల్గునీరసభవం = సారహీనమైనది, దుఃఖపూర్ణమైనది అయిన సంసారాన్ని, కాంతోపయంతృ + ఆశ్రితః (భూత్వా) = శ్రీవరవరమునులను ఆశ్రయించినవాడవై, ఉత్తర = దాటించుము.

ఐశ్వర్యం అశాశ్వతం. ఒకనాడు సార్వభౌమాధికారాన్ని అనుభవించినవాడే చాలా శీఘ్రంగా అన్ని సంపదలను కోల్పోయి, బిచ్చగాడు అవుతున్నాడు. ఈ జన్మలో పరమదరిద్రుడవుతున్నాడు. ఈ మానవజీవితం నిలుక లేనిది. సారహీనమైనది. దుఃఖం నిండినది. అందువల్ల శ్రీవరవరమునుల శ్రీచరణాలను శరణంగా ఆశ్రయించి సదాచార్యకటాక్షాన్ని పొంది తద్వారా సముద్రాన్ని దాటగలవు- అని తాత్పర్యం.

చివరిపాదంలో **కాంతోపయంత్రావితః-** అనే పాఠభేదం ఉన్నది అపుడు, కాంతోపయంత్రా = మణవాళమహాఉనులచేత, అవితః = కాపాడబడినవాడై, అని అర్థం. **"ఒరు నాయకమాయ్ ఓడ ఉలకుడన్ అణ్డవర్"** ఇత్యాది తిరువాయ్మొழி (4-1-1) సూక్త్యర్థం. ప్రకృతంలో సంవాదంగా స్మరణీయం.

**"ఉత్తరఫల్గునీ"** అనే ప్రయోగం ద్వారా ఉత్తరానక్షత్రం సూచించింది. ప్రతిపాదంలో 19 అక్షరాలను కల శార్దూలవిక్రీడితమనే వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**13.** **తం నమామి సుందరోపయంతృనామమూర్తిమన్మహస్తమోఘ్నం**
**ఇందిరాధవార్హతల్పభూతశేషపన్నగాధిపాంశ మద్య ।**
**శిష్యతాం విడంబయన్ స సూరిసూక్త్యుపక్రమార్హపద్య మత్ర**
**రంగరాట్స్ఫుటీచికీర్షు రస్య వైభవమ్ పురా ముదా జగాద ॥**

అద్య = ఇపుడు, తత్ = ప్రసిద్ధి పొందినది, ఇందిరాధవ = మాధవునకు, అర్హ= తగిన, తల్పభూత =శయనమైన, శేషపన్నగాధిపాంశం = ఆదిశేషుడనే సర్పంయొక్క అంశభూతమైనది, తమోఘ్నం =

అజ్ఞానమనే చీకటిని పోగొట్టగల్గినది అయిన, సుందరోపయంతృనామ = శ్రీవరవరమునులనే పేరును కల్గిన, మూర్తిమత్ = రూపాన్ని కల్గిన, మహః = తేజస్సును, నమామి = నమస్కరిస్తున్నాను, సః రంగరాట్= ప్రసిద్ధిని పొందిన ఆ శ్రీరంగనాథుడు, అస్య = ఈ వరవరమునుల, వైభవం = వైభవాన్ని, స్ఫుటీచికీర్షు= వ్యక్తం చేయగోరినవాడై, శిష్యతాం విడంబయన్ = వారిశిష్యత్వాన్ని అభినయిస్తూ, సూరిసూక్తి+ఉపక్రమ+ అర్హపద్యం = ద్రావిడ వేదాధ్యయనారంభం చేసేటపుడు పఠించవలసిన "శ్రీశైలేశ" ఇత్యాది తనియన్ శ్లోకాన్ని, అత్ర = ఈ భూమిలోనే, పురా = పూర్వం, ముదా = ఆనందంగా, జగాద= పలికాడు

ఆదిశేషాంభూతులుగా, జ్ఞానసూర్యునిగా వెలిగే శ్రీవరవరమునులను నమస్కరిస్తున్నాను. వారి వైభవాన్ని లోకానికి ప్రకాశింపజేయదలచిన శ్రీరంగనాథుడు శ్రీవరవరమునులను ఆచార్యునిగా స్వీకరించి, ఒక సంవత్సరకాలం పాటు తన ఉత్సవాలను అన్నిటిని నిలిపివేసి, శ్రీవరవరమునుల సన్నిధిలో ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యను కాలక్షేపంగా ఆలకించాడు. ఆ కాలక్షేపం పూర్తి అయే సమయంలో ఒక చిన్న (నాలుగేండ్ల) బాలుడుగా గోష్ఠినడుమకు వచ్చి **"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్"** అనే ప్రసిద్ధమైన తనియన్ ఒక తాళపత్రంలో వ్రాసి సమర్పించి అదృశ్యమయ్యాడు. అన్ని దివ్యప్రబంధపారాయణలను ఆరంభించే సమయంలో ముందుగా ఈ తనియన్ శ్లోకాన్ని విధిగా అనుసంధించి తీరాలనే నియమాన్ని విధించినట్లు పూర్వులైన పెద్దలచే నిశ్చయింపబడడం శ్రీవరవరమునుల సాటి లేని మేటి వైభవానికి తార్కాణం.

ఈ శ్లోకంలోని **"మహస్తమోఘ్నమ్"** అనే ప్రయోగంలో **"హస్త"** అనే నక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలోను 20 అక్షరాలను కల **"వృత్తం"** అనే పేరునుకల వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**14.** దద్యు ర్నిఃశ్రేయసం నో వరవరయమిరాట్ సత్కటాక్షాదయార్ద్రా
చిత్రా యేషాం ప్రభావా జగతి సుబహుపూర్వై ర్న స్సుదృష్టా ।
కృత్వాఘః కించిదస్మిన్ ద్విజలకులతిలకః కోఽపి పశ్చాత్తదీయం
దృష్ట్వా భోగీంద్రభావం చకితమతి రభూదిత్యుపాఖ్యాంతి వృద్ధాః ॥

యేషాం = లేనియొక్క, ప్రభావాః= గొప్పదనాలు, జగతి = లోకంలో, సుబహుశః= పలు రీతులలో, పూర్వైః= పూర్వులచే, సుదృష్టాః= చక్కగా దర్శింపబడినవో (దర్శింపజేయబడినవో), ఆ, చిత్రాః=ఆశ్చర్యాన్ని కల్గించేవి, దయా+ఆర్ద్రాః = దయారసంచేత తడుపబడినవి, (పూర్ణమైన కృపతో కూడినవి) అయిన, వరవరమునిరాట్ = శ్రీవరవరమునుల, సత్కటాక్షాః = దివ్యకటాక్షాలు, నః = మనకు, నిః - శ్రేయసం = మోక్షాన్ని, దద్యుః= ఇవ్వాలి, అస్మిన్ = ఈ వరవరమునిలో, కః అపి = ఒక, ద్విజకులతిలకః= బ్రాహ్మణకులానికి చెందినవారైన ఉత్తమనంబి, కించిత్ = చిన్నదైన, అఘః= పాపాన్ని, (అపచారాన్ని), కృత్వా = చేసి, పశ్చాత్ = తరువాత, తదీయం = వారి, భోగీంద్రభావం = ఆదిశేషులై ఉండే స్థితిని, దృష్ట్వా = చూచి (తెలిసికొని), చకితమతిః = ఆశ్చర్యాన్ని పొందిన మనస్సును కలవారు, అభూత్ = అయ్యారు, ఇతి = అని, వృద్ధాః= పెద్దలు, సమాఖ్యాంతి = పల్కుతున్నారు.

"నః సుదృష్టాః" అనే ప్రయోగానికి బదులు **"దృష్టపూర్వాః"** అనే పాఠభేదం ఉన్నది. దానికి- "ముందు దర్శింపబడిన" అని అర్థం. నాల్గవ పాదంలో **"చకితమతిః"** అనే దానికి బదులుగా **"ప్రవణమతిః"** అనే పాఠభేదం ఉన్నది. గొప్ప భక్తిని కల మనస్సును కలవారై - అని దానికి అర్థం.

ఇక్కడ ఒక ఐతిహ్యం ప్రస్తావింపబడడం గమనించదగినది. ఒకానొక సమయంలో శ్రీవరవర మునులు ఏకాంతంలో శ్రీరంగనాథుని భక్తిపరవశులై సేవిస్తూ ఉండగా, ఉత్తమనంబి అనే శ్రీరంగనాథుని అంతరంగ సేవకులు శ్రీవరవరమునుల దేహం పాలవలె తెల్లగా ఉండడం గమనించి, ఆ వర్ణం వ్యాధిహేతుకంగా భ్రమించి, శ్రీవరవరమునులను వెంటనే ఆలయాన్ని విడచివెళ్ళి పొమ్మన్నారు. శ్రీవరవరమునులు సాత్త్వికాగ్రేసరులైనందున, ఉత్తనంబిమాటలకు ఏవిధమైన మనోవికారాన్ని పొందకుండా, వెంటనే ఆలయాన్ని వీడి వెళ్ళిపోయారు. ఆనాటి రాత్రి శ్రీరంగనాథుడు ఉత్తమనంబికి కలలో సాక్షాత్కరించి, "మణవాళమహామునులు సాక్షాత్తు ఆదిశేషుల అవతారమే సుమా ! వారి పట్ల అపచారపడవద్దు. వెంటనే మీరు వారి వద్దకుపోయి అపరాధక్షామణాన్ని ప్రార్థించండి'' అని ఆజ్ఞాపించాడు. ఉత్తమనంబి చాలా ఆశ్చర్యపడి, మఱునాడు శ్రీవరవరమునుల మఠానికి పోయి, వారికళ్ళపై పడి, తాము చేసిన అపచారాన్ని మన్నించమని వేడారు.

ఈ ఐతిహ్యం ప్రస్తుతశ్లోకంలో ప్రస్తావింపబడింది. శ్లోకంలోని ఉత్తరార్ధానికి వేఱొక పాఠం ఈ క్రింది విధంగా కన్పిస్తున్నది.

**అధ్వశ్రాంతస్య తస్య శ్రమహరణవశాత్ తింత్రిణీవృక్ష ఏకః**
**స్పృష్ట స్తత్పాణినా ద్రాగముచదగమతా మిత్యుపాఖ్యాంతి వృద్ధాః ॥**

ఈ పాఠాంతరానికి అర్థాన్ని ఈక్రింది విధంగా చెప్పవచ్చు.

అధ్వశ్రాంతస్య = మార్గాయాసంవల్ల అలసిన, తస్య = ఆ వరవరమునులయొక్క, శ్రమహరణవశాత్ = అలసటను పోగొట్టినందున, ఏకః= ఒక, తింత్రిణీవృక్షః= చింతచెట్టు, తత్ పాణినా = ఆ వరవరమునుల శ్రీహస్తంతో, స్పృష్టః= తాకబడినదై, అగమతాం = వృక్షంగా ఉండే స్థితిని, ద్రాక్ = వేగంగా, అముచత్ = విడిచి పెట్టింది. (మోక్షాన్ని పొందింది), ఇతి = అని, వృద్ధాః= పెద్దలు, ఉపాఖ్యాంతి = ఐతిహ్యంగా పల్కుతున్నారు.

ఈ పాఠాంతరంద్వారా ఇంకొక ఐతిహ్యం చెప్పబడుతున్నది. ఒకానొక సమయంలో శ్రీవరవర మునులు సేతువు యాత్రను ముగించుకొని శిష్యులతో కలసి తిరిగి వచ్చేటపుడు, ఎండలో అందఱు చాలా అలసిపోయారు. విశ్రాంతిని తీసికోవడంకోసం అందఱు నీడకోసం వెదకగా, ఒకమూల ఒక పెద్ద చింతచెట్టు కన్పించింది. ఆ చెట్టు మొదట శ్రీవరవరమునులు విశ్రమించి, అలసటను తీర్చుకొని, తిరిగి తమ ప్రయాణాన్ని కొనసాగించేటపుడు, పలువురు శిష్యులు వారితో "స్వామీ! మా అందఱికి ఇంతసేపు అరుదైన నీడను ఇచ్చి ఉపకారం చేసిన ఈ చింతచెట్టుకు ప్రత్యుపకారంగా దేవరవారు ఏదయినా మంచి

చేయవచ్చుకదా!'' అని అన్నారు. వెంటనే శ్రీవరవరమునులు తమ శ్రీహస్తంతో ఆ చింతచెట్టును స్పృశించారు. అందఱు చూస్తూ ఉండగానే ఆ చెట్టు కూలిపోయింది. తన వృక్షస్థితిని వీడి మోక్షాన్నిపొందింది.

ఈ స్తుతికి నాయకమణి అయిన ఈ శ్లోకంలో నక్షత్రాలలో మధ్య నక్షత్రమైన చిత్రానక్షత్రం సూచింపబడింది. శ్రీవరవరమునుల కల్యాణగుణాలను, వారి చరిత్రలో ఒక గొప్ప సంఘటనలను ప్రస్తావించడం ద్వారా తెలుపుతున్నారు. సామాన్యంగా ఈ రీతిలోని గ్రంథాలలో మధ్యమశ్లోకంలో కొందఱు అష్టప్రాసాదిశబ్దాలంకారాలు, యమకం, చిత్ర మొదలైనవానిని ప్రయోగించడం కన్పిస్తుంది. దానికి అన్నిటికి మించి, ఈ స్తుతిలో ముఖ్యపాత్రమైన శ్రీవరవరమునుల గుణాతిశయం విస్తృతంగా ప్రతిపాదింపబడడం గమనార్హం. ప్రతిపాదంలో 21 అక్షరాలను కల స్రగ్ధరావృత్తంలో ఈ శ్లోకం కూర్పబడతాయి.

ఇకపై రాబోయే శ్లోకాలలో వరుసగా ఒక్కొక్క శ్లోకంలో ఒక్కొక్క అక్షరం చొప్పున తగ్గుతూ ఉండే వృత్తాలు ప్రయోగింపబడ్డాయి.

**14.** **ధారయన్ కరాంబుజే త్రిదండ మంసశోభితోపవీత ఏష**
**భాసయన్ కషాయరక్తదివ్యవస్త్రరోచిషా హరిన్ముఖాని ।**
**స్వాతిహృద్యసూక్తిభిః ప్రహర్షయన్ సుహృద్గణాంశ్చ సంసదీహ**
**వర్ధతాం సదైవ సుందరోపయంతృయోగిభూపతిః సుఖేన ॥**

అంసశోభిత = భుజస్కంధంలో ప్రకాశించే, ఉపవీత = యజ్ఞోపవీతాన్ని కల, ఏషః= ఈ, సుందరోపయతృయోగిభూపతిః = వరవరముని సార్వభౌములు, కరాంబుజే = తామరపూవువంటి (తమ) శ్రీహస్తంలో, త్రిదండం = త్రిదండాన్ని, ధారయన్ = ధరిస్తూ ఉన్నవారై, కషాయరక్తదివ్యవస్త్ర = కాషాయం రంగును కల, గొప్పవస్త్రంయొక్క, రోచిషా = కాంతితో, హరిన్ముఖాని = దిక్కుల ముఖాలను, భాసయన్ = ప్రకాశింపజేస్తూ ఉన్నవారై, స్వాతిహృద్యసూక్తిభిః = తమ మధురమైన సూక్తులతో, సంసది = సభలో, సుహృద్గణాన్ = మిత్రగణాన్ని, ప్రహర్షయన్ చ = ఆనందింపజేస్తూ, ఇహ = ఈ లోకంలో, సదా ఏవ = ఎల్లప్పుడు, సుఖేన వర్ధతామ్ = సుఖంగా వర్ధిల్లాలి.

అందమైన తిరుమేనిని కలవారు, ఆ సుందరమైన మేనిపై అందంగా కదలాడే యజ్ఞోపవీతాన్ని కల- శ్రీవరవరమునులు. చేతిలో ప్రకాశించే త్రిదండంతో, నడుమన ధరించిన, చూపును ఆకర్షించే కాషాయాంబరంతో, తమ మధురమైన శ్రీసూక్తులతో తమను సేవించే మిత్రులను అవధి లేని ఆనందాన్ని అనుగ్రహిస్తూ చిరకాలం వర్ధిల్లాలి.

ఇందులో "స్వాతిహృద్య" అనే ప్రయోగంద్వారా స్వాతినక్షత్రం సూచింపబడింది. వృత్తమనే పేరు గల వృత్తవిశేషంలో ఈ శ్లోకం కూర్పబడింది.

**15.** న త్వం హ్యంబ! కదర్థితాన కవిభిః వాగ్దేవి! శాఖామృగీ -
హస్తప్రాపితమల్లికాస్రగివ హా! నింద్యాన్ స్తువద్భిర్నరాన్ ।

తత్తే దుఃఖ మపాకరోమ్యహ మిహ స్తుత్యం స్తువన్ మద్గురుం
దివ్యానందగుణాకరం వరవరం సూరిం సుదుర్వాగపి ॥

అంబ! వాగ్దేవి! = ఓతల్లీ ! సరస్వతీదేవీ!, త్వం = నీవు, నింద్యాన్ = నిందించదగిన, నరాన్ = మానవులను, స్తువద్భిః= స్తుతించే, కవిభిః= కవులచే, శాఖామృగీ = ఆడు కోతియొక్క, హస్తప్రాపిత = చేతిలో చిక్కుకొన్న, మల్లికాస్రగివ = మల్లెపూల దండవలె, న కదర్థితా = పాడయిపోకుండా ఉండడం అనేది లేదు (తప్పక పాడవుతున్నది), హి = (ఇది) నిశ్చయం, హా! = అయ్యో!, తే = నీయొక్క, తత్ = ఆ, దుఃఖం = దుఃఖాన్ని, అహం = నేను, సుదుర్వాక్ అపి = చాలా తక్కువ వాక్కును కలవాడనైనా, ఇహ = ఇపుడు, స్తుత్యం = స్తుతించదగినవారు, దివ్యానంద గుణాకరం = గొప్పవైన కల్యాణగుణాలకు నివాసస్థానమైనవారైన, మద్గురుం = నా ఆచార్యులైన, వరవరంసూరిం = వరవరమునులనే విద్వత్తల్లజులను, స్తువన్ = స్తుతించేవాడనై, అపాకరోమి = తొలగించుకుంటున్నాను.

స్తుతించదగనివారిని స్తుతించే క్షుద్రకవులను కవి ఇందులో నిందిస్తున్నారు. వారిచే స్తుతింపబడడమే వాగ్దేవికి కల్గిన దోషం. ఈ కవులకు కల కవితాశక్తి కోతి చేతిలో చిక్కిన మల్లెపూలవలె ఛిన్నాభిన్నం అవుతున్నది- అని అంటున్నారు. ఆ రీతిలో కాకుండా, **"నీశనేన్ నిఱై ఒన్ఱు మిలేన్"** (నీచుడనై, ఏ గుణం లేని వాడనైనా), అనే రీతిలో నేను చాలా తక్కువ వాక్కును కల్గినవాడనైనా స్తుతించదగినవారైన శ్రీవరవరమునులను కీర్తించి, తన్మూలంగా విషయవైలక్షణ్యాన్ని నిండిన ఈ గ్రంథాన్ని రచించి, వాగ్దేవి అయిన సరస్వతికి నీచకవులవల్ల కల్గిన దుఃఖాన్ని కొంతవరకైనా తీరుస్తాను.

ఈ శ్లోకంలోని **"వాగ్దేవిశాఖామృగీ"** అనే ప్రయోగంలో విశాఖానక్షత్రం సూచితం. వృత్తం- ప్రతిపాదంలోను 19 అక్షరాలను కల శార్దూలవిక్రీడితం.

**17.** పిబ నయనయుగేహ రమ్యోపయంతు ర్వపుఃసౌష్ఠవం
శ్రవణయుగ సదైవ తత్సదుక్తిపీయూష మాసేవ్యతామ్ ।
సతతమపి సుజానూరాధార్యతాం హే! శిరోంఘ్రిద్వయీం
వరవరయితు రేతి మాం యత్పురాకంఠరోధీ కఫః ॥

నయనయుగ= ఓ నేత్రద్వయమా!, ఇహ = ఇక్కడ, (ఇపుడే), రమ్యోపయంతుః= మణవాళ మహామునుల, వపుఃసౌష్ఠవం = తిరుమేని అందాన్ని, పిబ = పానం చేయి, శ్రవణయుగ = ఓ రెండు చెవులారా!, సదా ఏవ = ఎల్లప్పుడు, తత్సూక్తిపీయూషం = వారి శ్రీసూక్తులనే అమృతాన్ని, ఆసేవ్యతామ్ = విని, ఆనందించాలి, హే శిరః = ఓ నా శిరమా!, వరవరయితుః = మణవాళమహామునుల, సుజానుః = అందమైన మోకాలును తాకి ఉండే, అంఘ్రిద్వయీం = పాదాలను రెండిటిని, సతతమపి = ఎల్లప్పుడు, ఆధార్యతాం = (భూషణంగా) అలంకరించుకోవాలి. యత్ = ఎందుకంటే, కంఠరోధీకఫః= కంఠాన్ని అడ్డగించే కఫం, మామ్ = నా వద్దకు, పురా ఏతి = వస్తున్నది (నేను మరణించగలను)

ఇందులో కవి శ్రీవరవరమునుల తిరుమేని సౌందర్యాన్ని, దివ్యాంగాల పొందికను, వారి శ్రీసూక్తి వైభవాన్ని స్తుతిస్తున్నారు. తమ నేత్రాలను సంబోధిస్తూ శ్రీవరవరమునుల సౌందర్యాన్ని దర్శించి అనుభవించమని, చెవులను సంబోధించి, వారి శ్రీసూక్త్యమృతాన్ని పానం చేయమని, తలను ఉద్దేశించి వారి శ్రీచరణాలను ధరించమని, తమకు మరణం త్వరలో కలుగబోతున్నది కనుక, అంతవరకు వీటిని చేయమని ఉపదేశిస్తున్నారు.

**"సుజానూరాధార్యతామ్"** అనే ప్రయోగంలో ఉండే **"అనూరాధా"** అనే పదం అనూరాధానక్షత్రాన్ని సూచిస్తున్నది. **"నిశా"** - అనే నారాచవృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**18. ఫణామణిగణప్రభాపటలపాటితాశేషదిక్ ప్రసృత్వరతమచ్చయః ప్రథిత ఏష శేషః పురా ।**
**బలిష్ఠకలికాటవత్రుటన పాటవజ్యేష్ఠయా శ్రియాఽద్య భువి రాజతే నయనయుగ్మ! మే తం పిబ॥**

ఫణామణిగణ = పడగలలోని మణుల సమూహాల, ప్రభావపటల = కాంతిసమూహాలతో, పాటిత = పోగొట్టబడిన, అశేష = సమస్తమైన, దిక్ప్రసృత్వర = దిక్కులలో వ్యాపించే, తమచ్చయః= చీకటి సమూహాన్ని (అజ్ఞానరాశిని) కల్గినవారైన, ఏషః= ఈ వరవరమునులు, పురా = పూర్వం, శేషః= ఆదిశేషుడని, ప్రథితః= ప్రసిద్ధిని పొందినవారు, అద్య = ఇపుడు, బలిష్ఠ= బలాన్ని కల, కలికాటవ = కలియొక్క, కాఠిన్యాన్ని, త్రుటన = తుంచడంలోని (పోగొట్టడంలోని), పాటవ = సామర్థ్యం చేత, జ్యేష్ఠయా = గొప్పదైన, శ్రియా = శోభతో, ("ధియా"- అనే పాఠభేదానికి- బుద్ధితో- అని అర్థం), భువి = భూమిలో, రాజతే = వెల్గుతున్నారు, మే = నాయొక్క, నయనయుగ్మ = నేత్రద్వయమా, తం = ఆ వరవరమునులను, పిబ = పానం చేయి (వారి సౌందర్యాన్ని దర్శించి ఆనందించు).

తమ పడగలలోని రత్నాల రాసుల కాంతులతో అన్ని దిక్కులలో వ్యాపించిన చీకటిని పోగొట్టగల్గిన సామర్థ్యాన్ని కల్గిన ఆదిశేషులే శ్రీవరవరమునులు. వీరు తమ తిరుమేని శోభతో, జ్ఞానంతో జనులందఱి అజ్ఞానమనే చీకటిని పోగొట్టగల్గినవారు. అంతేకాక, కలిక్రూరత్వాన్ని పోగొట్టగల్గిన దివ్యతేజస్సుతో శ్రీవరవరమునులై అవతరించి ఈ లోకంలో ప్రకాశిస్తున్నారు. ఓ నా నేత్రద్వయమా ! వారి అందాన్ని నీవు పానం చేయి.

ఈ శ్లోకంలో "పాటవజ్యేష్ఠయా" అనే ప్రయోగంద్వారా జ్యేష్ఠానక్షత్రం సూచింపబడింది. ఈ శ్లోకవృత్తం పృథ్వీ అనే పేరును కల్గినది.

**19. బహి స్పదాఽభినీయతే సుచ్చరిత్రవన్మయా నిరంతరం మదంతరంగ మీహతే హ్యసత్పదమ్ ।**
**సుసుందరోపయంతృయోగివర్య ! తే పదద్వయే నిబద్ధమూల మస్తు తద్దయానిధే ! శశిప్రభ ! ॥**

సుసుందరోపయంతృయోగివర్య = మహాయోగి అయిన ఓ మణవాళమహామునీ!, మయా = నాచే, బహిః = బయట, సుచ్చరిత్రవత్ = చక్కని ప్రవర్తనాన్ని కల్గినవాడనువలె, అభినీయతే = అభినయింపబడుతున్నది, మదంతరంగమ్ = నా మనస్సు అయితే, నిరంతరం = ఎల్లప్పుడు, అసత్పదం = చెడ్డదారినే, ఈహతే = కోరుతున్నది, తత్ = అందువల్ల, దయానిధే = దయాసముద్రమా!, శశిప్రభ =

చంద్రునివలె తెల్లని శోభను కలవాడా!, తే = దేవరవారి, పదద్వయే = శ్రీచరణాలలో, (నామనస్సు), నిబద్ధమూలమ్ = స్థిరమైన అభినివేశాన్ని కల్గినదిగా, అస్తు = ఉండాలి.

మహాయోగి అయిన మణవాళమహామునీ! దాసుడనైన నేను సత్ప్రవర్తనను పూర్ణంగా కల్గినవాడను వలె బయట లోకుల ముందు కపటాన్ని ప్రదర్శిస్తున్నాను. నిజానికి చెడ్డ ప్రవర్తనను కలవాడనైనా, మంచి తనాన్ని అభినయిస్తున్నాను. చంద్రుని వలె తెల్లని కాంతిని కల ఓదయాసముద్రమా! దేవరవారు దాసునిపై కృపజూపి, మీపట్ల స్థిరమైన భక్తిని కల్గి ఉండేటట్లుగా నన్ను సంస్కరించాలి.

ఈ శ్లోకంలో కవి తన మిథ్యాచార్యాన్ని ప్రస్తావించడం ద్వారా ఆకించన్యాన్ని సూచించారు. యతిరాజవింశతిలో శ్రీవరవరమునులు **"మిథ్యా చరామి యతిరాజ! తతోఽస్మి మూర్ఖః"** అని పలుమార్లు వివిధంగా అనుసంధించిన ఆకించన్యాన్ని కవి శ్రీవరవరమునుల విషయంగా అనుసంధించారు. చరమపర్వంలో చరమపర్వనిష్ఠ ఇది.

శ్లోకంలో **"నిబద్ధమూలమస్తు"** అనే ప్రయోగంలో మూలనక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలో 16 అక్షరాలుండే పంచచామరవృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**20.** **భక్తిశ్రద్ధాపూర్వాఽఽషాఢాక్షస్రక్ సీరాదీన్ ధృత్వా**
**శీర్ణైః పర్ణైః వన్యైరన్యైః కాయక్లేశం కృత్వేహ ।**
**యోగే నిష్ఠా నో తే శస్తా మోక్షాపేక్షా స్యాచ్చేత్ ద్రాక్**
**సౌమ్యోద్వోఢుః పాదద్వంద్వం చిత్తే కుర్యా స్సప్రేమ ॥**

భక్తిశ్రద్ధాపూర్వా = భక్తి, శ్రద్ధలతో కూడిన, యోగే నిష్ఠా = చక్కని భక్తియోగంలో నిష్ఠ, తే = నీకు, న శస్తా = గొప్పది కాదు, ఆషాఢ = పాలాశదండం, అక్షస్రక్ = జపమాల, సీరాదీన్ = జింకతోలు మొదలైన దానిని, ధృత్వా = ధరించి, శీర్ణైః = ఎండినవి, వన్యైః= అరణ్యంలో ఉండేవి అయిన, పర్ణైః= ఆకులతో, అన్యైః= ఇంకా మిగిలిన అడవిలో ఉండే ఎండుటాకులతోను, కాయక్లేశం కృత్వా = (ఆహారాన్ని స్వీకరించడం ద్వారా) కాయక్లేశాన్ని చేసి, (దానివల్ల ఏర్పడే), యోగనిష్ఠా = కర్మయోగనిష్ఠకూడా, తే = నీకు, న శస్తా = గొప్పది కదా!, ఇహ = ఇపుడ (నీకు), మోక్షాపేక్షా స్యాత్ చేత్ = మోక్షంలో ఆశ ఉంటే, ద్రాక్ = వెంటనే, సౌమ్యోద్వోఢుః= శ్రీవరవరమునుల, పాదద్వంద్వం = శ్రీచరణద్వయిని, స ప్రేమ = గొప్పభక్తితో, చిత్తే కుర్యాః= మనస్సులో నిలుపుకో.

ముముక్షువును ఉద్దేశించి కవి ఉపదేశిస్తున్నారు, ఈ శ్లోకంలో.

ఓ ముముక్షువూ! **"కాయోడు నీడు కని యుణ్డు... తవమ్ శెయ్య వేణ్డా"** అనే రీతిలో కఠినమైన శాస్త్రాలలో విధింపబడిన శ్రమతో కూడిన కర్మానుష్ఠానాలను చేసి మోక్షాన్ని పొందే సామర్థ్యం నీకుండనక్కఱలేదు. (భక్తి, యోగ, కర్మయోగాలు అక్కఱలేదని తెలుపబడినందున ఉపలక్షణ ప్రక్రియలో జ్ఞానయోగానుష్ఠానావశ్యకతకూడా లేదని సూచితం) అందువల్ల ఆచార్యనిష్ఠామూలంగా ఏర్పడే

ఆచార్యాభిమానమే నీకు ఉత్తారకం. అదే నీకు మోక్షాన్ని సిద్ధింపజేస్తుంది. కనుక, ఆచార్యసార్వభౌములైన శ్రీవరవరమునుల శ్రీచరణాలనే రక్షకంగా ఆశ్రయించి, దానివల్ల కలిగే ఆచార్యభిమానమే నిన్ను సద్గతిని పొందిస్తుంది. కర్మయోగ-జ్ఞానయోగ, భక్తియోగాలనే ఈ ఉపాయాలను విడచి, ఆచార్యాభిమానాన్ని కలవాడవై మోక్షసామ్రాజ్యాన్ని చేజిక్కించుకో-అని భావం.

ఈ శ్లోకంలో మొదటి పాదంలో పూర్వాషాఢానక్షత్రం సూచితం. ప్రతిపాదంలో 15 అక్షరాలను కల లీలాఖేలమనే వృత్తంలో ఈ శ్లోకం రచింపబడినది.

**21.** **మన్యే శ్రీమత్ సౌమ్యవరమునేః సూక్తే సామ్యం నాన్యాభాషా ఢౌకత ఇతి లోకేఽస్మిన్ సత్యమ్ ।**
**ధన్యా స్తే యే తన్ముఖనళినస్యందిక్షౌద్రం నాన్యాదృశ్యం తృప్తి ముపయయుః పాయంపాయమ్ ॥**

శ్రీమత్ = గొప్పతనాన్ని (మహిమను) కల, సౌమ్యవరమునేః= మణవాళమహామునుల, సూక్తేః= శ్రీసూక్తులకు, సామ్యం = సాటివచ్చే స్వభావాన్ని, అన్యా భాషా = వేఱు ఏ వాఙ్మయాలు (వేఱెవ్వరి భాష), న ఢౌకతే = పొందడంలేదు, ఇతి = అనే విషయం, అస్మిన్ లోకే = ఈ లోకంలో, సత్యం= నిజం, యే = ఎవరు (శిష్యుల), తన్ముఖనళినస్యంది = వారి ముఖమనే తామరపూవునుండి స్రవించే, అన్యాదృశం = సాటి మేటి లేని, క్షౌద్రం = తేనెను (అమృతాన్ని), పాయంపాయం = మాటిమాటికి పానం చేసి, తృప్తిం = తృప్తిని, న ఉపయయుః= పొందలేదో, (తే=వారు), ధన్యాః= భాగ్యవంతులు (అని), మన్యే = భావిస్తాను.

మణవాళమహామునుల విశదవాక్శిఖామణిత్వం ఈ శ్లోకంలో ప్రస్తుతింపబడింది. శ్రీవరవర మునుల శ్రీసూక్తుల సాటి లేనివి. వేఱెవ్వరి గ్రంథాలలోను దర్శించడానికి సాధ్యం కానివి. "వాటి సాటి ఏమీ రావు'' అని లోకంలో వ్యవహరించే మాట పరమయథార్థం. వారుపదేశించిన శ్రీసూక్తులే ఇంత విలక్షణంగా ఉంటే, వారు సాక్షాత్తు అనుగ్రహించిన కాలక్షేప శ్రీసూక్తులు ఎంత మధురంగా ఉండి ఉంటాయి? వాటిని విని ఆనందించి శిష్యుల అనుభవం ఎంత విలక్షణంగా ఉండి ఉంటుంది? అని కవి ఆశ్చర్యపడుతున్నారు. ఇక్కడ ఒక విషయం గమనించవలసినది ఉన్నది.

శ్రీవరవరమునుల అనుగ్రహించిన సంస్కృత శ్లోకాలు, ద్రావిడపాశురాలు ఒకవైపు ఉండగా, వారి మణిప్రవాళశైలి చాలా విలక్షణమైనది. ఉభయవేదాంతసంప్రదాయం - అని అందఱిచేత స్తుతింపబడేమన శ్రీవైష్ణవసంప్రదాయంలో సంస్కృత గ్రంథాలనుండి, ద్రావిడగ్రంథాలనుండి ప్రమాణాలను సులభంగా విరివిగా ఉట్టంకించడానికి వీలుగా ఈ రెండు భాషల నుండి పదాలను అక్కడక్కడ ఉపయోగించి మణిప్రవాళమనే ఒక అపూర్వమైన అందమైన శైలిని మన పూర్వాచార్యులు ప్రయోగించారు. మణి - అంటే రత్నం. ప్రవాళమంటే పగడం. వీటితో ముత్యాన్ని కూడా చేర్చుకోవచ్చు. అందువల్ల రత్నం, ముత్యం, పగడం- అనే ఈ మూడిటితో కూర్చబడిన ఒక మాలిక ఎంత మనోహరంగా ప్రకాశిస్తుందో, ఆ రీతిలోనే ఈ మణిప్రవాళశైలి భాసిస్తున్నది. మణిప్రవాళశైలి అనే ఈ పేరు. సంస్కృతం, ద్రావిడం అందంగా కలిసి, అరుదైన విషయాలను అద్భుతంగా, స్పష్టంగా వివరించే శైలి- అనే అర్థాన్ని ఇస్తుంది. భగవద్రామానుజుల శిష్యులైన తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అనుగ్రహించిన ఆఱాయిరప్పడి- అనే

తిరువాయ్‌మొழி ప్రబంధంయొక్క ప్రప్రథమవ్యాఖ్యానం ఈ మణిప్రవాళశైలిలోనే అవతరించింది. పిళ్ళాన్‌కు తరువాత పూర్వాచార్యులు పలువురు ఈ శైలిలో వ్యాఖ్యానాలు, సూత్రాలు, చూర్ణికలు, ప్రకరణాలు - అనే పలు విధాలైన గ్రంథాలను రచించారు ఒక్కొక్క ఆచార్యుల మణిప్రవాళశైలిలో ఒక్కొక్క విధమైన సొబగు కన్పిస్తుంది. అయినా, శ్రీవరవరమునుల మణిప్రవాళశైలి అన్యాదృశమైనది, అనన్యసాధ్యమైనది. ఈ మాటనే ప్రకృతశ్లోకంలో గమనించగలం. సౌలభ్యం, మాధుర్యం, స్పష్టత, సంగ్రహంగా పల్కడం, గాంభీర్యం, ఔచిత్యం, రెండు భాషలలోని పదాల అసాధారణమైన కలయిక- ఇత్యాది వైలక్షణాలన్నిటిలో శ్రీమణవాళమహామునుల మణిప్రవాళవాక్ఝరి వెల్లుతున్నది. ముముక్షుప్పడి, తత్త్వత్రయం, శ్రీవచనభూషణం, ఆచార్యహృదయం, ఇరామానుశనూற్றన్దాది, పెరియాழ்వార్ తిరుమొழி మొదలైన గ్రంథాల వ్యాఖ్యానాలలో శ్రీవరవరమునులను సాటి లేని మణిప్రవాళశైలిని భోగ్యంగా అనుభవించవచ్చు. ఉదాహరణకు- ఇరామానుశనూற్றన్దాది వ్యాఖ్యానం పరమరస్యంగా అమరింది. సంగ్రహంగానే పల్కుతూ అర్థాన్ని స్పష్టం చేయడమనే వ్యాఖ్యాతలక్షణం ఈ గ్రంథంలో విస్తృతంగా గమనించవచ్చు. పలు పంక్తులలో వివరించవలసిన ఒక అరుదైన అర్థాన్ని ఒక తగిన సంస్కృత పదాన్ని తగిన చోట ఔచిత్యం చెడకుండా ప్రయోగించి, సులభంగా అర్థాన్ని స్పష్టం చేసే సామర్థ్యం ఈ మహాచార్యులకే స్వంతం. ఒక విషయాన్ని అధికంగా పెంచకుండా, మరీ క్లుప్తం చేయకుండా యథాతథంగా సరిగా పలికే రీతిని అన్యూనాతిరిక్తంగా పల్కడమని సంస్కృతంలో అంటారు. ఈ లక్షణం శ్రీవరవరమునులలో గొప్పగా కన్పిస్తుంది. మణిప్రవాళశైలిలో ఒక విస్తృత విషయాన్ని సంగ్రహంగా పలికే సామర్థ్యం వీరికే తప్ప వేఱెవ్వరి దగ్గర చూడలేము. ఈడును వివరించి కాలక్షేపాన్ని అనుగ్రహించిన ఈ మహాచార్యులు తమ వ్యాఖ్యానాలను సంగ్రహంగా పల్కడం మిక్కిలి ఆశ్చర్యకరం. సరసం. సంస్కృతరచనా శైలికి శ్రీరామానుజులు, ద్రావిడవచనరీతికి మణవాళమహామునులు ఆదర్శపురుషులని పెద్దలంటారు. విశదవాక్శిఖామణి- అనే బిరుదం ఈ ఆచార్యులొక్కరికే తగినది. శ్రీరంగనాథుడు సంతోషంతో వీరికి తనియన్ శ్లోకం పల్కడం ఇక్కడ స్మరణీయం. ఏమి శ్రీవరవరమునుల పాండిత్యం. ఆహా !

ఇందులో ఉత్తరాషాఢానక్షత్రం **"నాన్యా భాషాఢాకత"** అనే ప్రయోగంలో ఇక్కడ సూచితం. వృత్తం వాసంతి. ఇందులో ప్రతిపాదంలో 14 అక్షరాలుంటాయి.

**22. యంతారం శ్రవణదృగాదిమేంద్రియాణాం హంతారం శ్రితజనదుఃఖసంతతే స్తమ్ ।**
**మంతారం సతత మిహ ద్వయస్య వందే గంతారం నిగమయుగాంతసింధుపారమ్ ॥**

శ్రవణదృగాదిమ + ఇంద్రియాణామ్ = చెవి, కన్ను మొదలైన విషయేంద్రియాలను, యంతారం = నియమించేవారు, శ్రితజన = తన భక్తుల, దుఃఖసంతతేః= క్లేశసమూహాలను, హంతారం = నశింపజేసేవారు, సతతం = ఎల్లప్పుడు, ఇహ = ఈ లోకంలో, ద్వయస్య మంతారమ్ = ద్వయమంత్రానుసంధానాన్ని చేసేవారు, నిగమయుగాంతసింధుపారం = ఉభయవేదాంతాలనే సముద్రాల తీరాన్ని, గంతారం = పొందేవారైన (ఉభయవేదాంతాల పూర్తిగా గ్రహించినవారైన), తం = ఆ వరవరమునులను, వందే = నమస్కరిస్తున్నాను.

ఇందులో, శ్రీవరవరమునుల జ్ఞానం, భక్తి, వైరాగ్యం శిష్యాభిమానం, పాండిత్యం - అనే వీటిని వర్ణిస్తున్నారు. మొదటి పాదంలో వారు ఇంద్రియాలను నియంత్రించి, జితేంద్రియులే వెలిగే స్థితిని గూర్చి పలికారు. దీనివల్ల వైరాగ్యగుణం తెలుపబడింది. రెండవ పాదంలో భక్తుల కష్టాలను తీరుస్తారని పల్కడం ద్వారా వారి కరుణ, శిష్యాభిమానం- అనే గుణాలు తెలుపబడ్డాయి. మూడవ పాదంలో ప్రస్తావింపబడి ద్వయానుసంధానం శ్రీవరవరమునుల భక్తికి గొప్ప నిదర్శనం. పూర్వదినచర్యాస్తుతిలో **"మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరమ్, తదర్థతత్త్వనిధ్యానసన్నద్ధపులకోద్గమమ్"** అని శ్రీవరవరమునుల ద్వయానుసంధానాన్ని, దానివల్ల వారికి కలిగే ఆనందాతిశయాన్ని వ్యక్తంచేసే రోమాంచాన్ని తెలిపే శ్లోకం ఇక్కడ అనుసంధేయం. నాల్గవ పాదంలో వారి ఉభయవేదాంతజ్ఞానం కీర్తింపబడింది. వీటి అన్నిటివల్ల శ్రీవరవరమునుల ఆచార్యత్వపూర్తి స్పష్టీకరింపబడింది.

ఈ శ్లోకంలో నాల్గు పాదాలలో ప్రయోగింపబడ్డ మొదటి పదాల ద్వారా అనుప్రాసమనే శబ్దాలంకారం ప్రయోగింపబడింది. **"శ్రవణదృగాది"** అనే ప్రయోగంలో శ్రవణమనబడే నక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలోను 14 అక్షరాలను కల ప్రహర్షిణీ వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**23.** **రమాకాంతనిష్ఠాః శమర్ధ్యా ధనిష్ఠాః యమాజ్ఞాదవిష్ఠాః ప్రమాణే గరిష్ఠాః ।**
**భవేయుః క్షితౌ తే హి రమ్యోపయంతుః పదాంభోజయుగ్మం శ్రితా యే నరోఽలమ్ ॥**

యే = ఏ, నరః = మానవుడు, రమ్యోపయంతుః = శ్రీవరవరమునుల, పదాంభోజయుగ్మం = శ్రీచరణపద్మాలను రెండిటిని, శ్రితాః = ఆశ్రయించారో, తే = వారు, క్షితౌ = భూమండలంలో, రమాకాంతనిష్ఠాః = శ్రియఃపతి అయిన సర్వేశ్వరునిపట్ల, గొప్ప భక్తిని కలవారై, శమర్ధ్యా = శమమనబడే అధికమైన వినయంతో, ధనిష్ఠాః = (గుణమనే) గొప్ప ధనాన్ని కలవారై, ప్రమాణే = సకల శాస్త్రాలలోను, అలంగరిష్ఠాః = పూర్తి సమర్థ్యాన్ని కలవారై (శాస్త్ర)నిపుణులై, భవేయుః హి = కాగలరుకదా!

శ్రీవరవరమునుల శ్రీచరణాలలో ఆశ్రయించినవారు భగవన్నిష్ఠను కలవారుగాను, శమమనబడే గుణాన్ని ధనంగా కలవారుగాను, యముడుసైతం వారిని చూచి భయపడవలసినట్లుగాను, సకలశాస్త్ర పారంగతులు గాను కాగలరనేది నిశ్చయం. అనేది ఈ శ్లోకంలోని తాత్పర్యం. ఆచార్యకటాక్షం సోకితే జ్ఞానం, భక్తి, గుణపూర్తి -అనేవి ఏర్పడడంతో పాటు సంసారభయం కూడా తీరిపోతుంది.

ఈ శ్లోకంలో **"ధనిష్ఠా"** అనే నక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలో 12 అక్షరాలను కల భుజంగప్రయాతమనే వృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది. శ్లోకంలోని **"నరః"** అనే పదం నృశబ్దంయొక్క బహువచనరూపం. **"నా నరౌ నరః"** అనేవి ప్రథమావిభక్తి రూపాలు.

**24.** **లంపటం భవభుజంగదంశనో - చ్ఛేదకర్మణి తమాశ్రయే గురుమ్ ।**
**కర్తు మైశత భిషగ్వరాః పరే పూర్వతో యదుదయాన్న తత్ భువి ॥**

భవభుజంగ = సంసారమనే సర్పంయొక్క, దంశన = కాటును, ఉచ్ఛేదకర్మణి = పోగొట్టే (నయం చేసే కార్యంలో), లంపటం = సామర్థ్యాన్నికల, తమ్= ఆ, గురుం = వరవరమునులనే గురువును, ఆశ్రయే = ఆశ్రయిస్తున్నాను, తత్ = ఆ సంసారనివృత్తి అనే కార్యాన్ని యదుదయాత్ = ఎవరి అవతారానికి, పూర్వతో = ముందు, కర్తుం = చయడానికి, పరే భిష్వగ్వరాః= అన్యవైద్యనిపుణులు, న ఐశత = సమర్థులు కాలేదో.

సంసారాన్ని అగ్నిగా, సముద్రంగా, సర్పంగా ఆచార్యులు రూపించడం పరిపాటి. ఇక్కడ సంసారం క్రూరవిషసర్పంగా కవి రూపిస్తున్నారు. ఈ సంసారమనే సర్పంయొక్క కాటును- అంటే- సంసారబంధాన్ని- తీర్చే గొప్ప వైద్యులు శ్రీవరవరమునులొక్కరే. వారు అవతరించడానికి ముందు ఎంతో మంది విషవైద్యులు ఆ పనిని చేయలేని వారయ్యారు. సదాచార్యసంబంధంలో ప్రాప్యసిద్ధి సులభంగా ఏర్పడుతుందనే విషయం ఇక్కడ వివక్షితం. భుజంగరూపులైన వరవరమునులు భుజంగదశనం నుండి రక్షిస్తారని అనడం ఒక చమత్కృతి.

ఈ శ్లోకంలో శతభిషక్ నక్షత్రం సూచింపబడింది. ప్రతిపదంలోను 11 అక్షరాలను కల రథోద్ధతా వృత్తంలో రచింపబడింది.

**25. విస్మర మా త్వం సౌమ్యవరోక్తీః ఆహితతత్త్వజ్ఞానవిపాకాః ।**
**చింతితపూర్వా భాద్రపదాప్త్యై నిత్య మిహ స్యు ర్యా ఖలపాశాః ॥**

ఇహ = ఈలోకంలో, నిత్యం = ఎల్లప్పుడు, ఆహిత= పొందింపబడిన, తత్త్వజ్ఞానవిపాకాః= పరిపక్వమైన తత్త్వజ్ఞానాన్ని కల్గినవి (పరిపూర్ణతత్త్వజ్ఞానాన్ని కల్గించేవి), ఖలపాశాః= దుర్వాదులను, కుదృష్టులు మొదలైనవారికి కాలపాశంవంటివి అయిన, యాః= ఏ శ్రీ వరవరమునుల శ్రీసూక్తులు, చింతితపూర్వా = అనుసంధింపబడినంతనే, భాద్రపదాప్త్యై = పరమానందాన్ని పొందడానికి, స్యుః= సాధనంగా అవుతున్నాయో, (ఆ) సౌమ్యవరోక్తీః= శ్రీవరవరమునుల శ్రీసూక్తులను, త్వం = నీవు, మావిస్మర = మఱువవద్దు.

ఈ శ్లోకంలోకూడా ముముక్షువును ఉద్దేశించి ఉపదేశం చేయబడింది. ఈ కవి శ్రీవరవరమునుల శ్రీసూక్తుల గొప్పతనాన్ని వివరిస్తున్నారు. ఆ సూక్తులను అనుసంధిస్తే చాలు, మోక్షం సిద్ధించే రీతిలోని పరిపక్వతను కల్గిన తత్త్వజ్ఞానాన్ని కల్గిస్తాయి. కుదృష్టిసిద్ధాంతాలను పలికేవారిని నిరసించి, సత్సంప్రదాయాన్ని నిలబెడుతున్నాయి. వాటిని మఱువకుండా సదా మనస్సులో అనుసంధించు. అన్ని శుభాలు కల్గుతాయి- అని అంటున్నారు.

శ్లోకంలో “పూర్వాభాద్రా” నక్షత్రం సూచితం. ప్రతిపాదంలో 10 అక్షరాలను రుక్మవతీవృత్తంలో ఈ శ్లోకం రచింపబడింది.

**26. శాంకరసాంఖ్యాద్వైతమతాన్యుత్తరభూతైః భాద్రపదైః ।**
**యో నిజసూక్తైః ఖండితవాన్ సౌమ్యవరో త్యేన్నః కలుషమ్ ॥**

సౌమ్యవరః= ఏ వరవరమునులు, శాంకరశాక్యద్వైతమతాని = అద్వైత, బౌద్ధ, ద్వైతం- మొదలైన ఆ మత గ్రంథాలకు), ఉత్తరభూతైః= సమాధానాలైన, భాద్రపదైః= మంగళాలను కల్గించగల్గిన, నిజసూక్తైః= తమ శ్రీసూక్తులద్వారా, ఖండితవాన్ = ఖండించారో వారు, నః= మన, కలుషం = పాపాన్ని, తైత్ = పోగొట్టుగాక !

బాహ్యకుదృష్టిమతాలను తమ గ్రంథాలద్వారా ఖండించి, వాటికి సమాధానం పల్కడం మాత్రమేకాక, తమ మతాన్ని స్థాపించిన శ్రీవరవరమునులనే ఆచార్యసార్వభౌములు మన పాపాలను పోగొట్టాలి.- అని అంటూ కవి మంగళాశాసనాత్మకంగా పల్కుతున్నారు.

ఈ శ్లోకంలోని **"ఉత్తరభూతైః భాద్రపదైః"** అనే పదాలద్వారా ఉత్తరాభాద్రా నక్షత్రం సూచింపబడింది. ప్రతిపాదంలో 9 అక్షరాలనుకల మణిమధ్యమనే వృత్తంలో ఈ శ్లోకం కూర్పబడింది.

**27. షడ్దర్శనమహావృక్షషండాఖండనపండితః ।**
**త్వం సూక్తిక్రకచైరేవ తీవ్రకోటిభి రీడ్యసే ॥**

తీవ్రకోటిభిః= తిరిగి సమాధానం పల్కడానికి సాధ్యంకాని బలమైన ప్రమాణవాదాలను కల (పదునైన అంచులను కల), సూక్తిక్రకచైః = సూక్తులనే ఱంపాలతోనే, (పరుల పక్షాలను- వాదాలను- ఖండించే వేసే స్వభావాన్ని కల శ్రీసూక్తులనే ఱంపాలతోనే), షడ్దర్శన మహావృక్షషండాఖండన పండితః = షడ్దర్శనాలు- అనే గొప్ప ఆఱు నాస్తిక మతాలనే గొప్ప వృక్షసమూహాలను నఱికివేసే సామర్థ్యాన్ని కల్గిన మహాపండితులైన, త్వం = దేవరవారు, ఈడ్యసే = అందఱి స్తుతింపబడుతున్నారు.

ఈ శ్లోకం శ్లేషాలంకారప్రక్రియలో రచింపబడింది. పండితప్రకాండులైన శ్రీవరవరమునులను కవి ఒక గొప్ప అరణ్యాన్ని నఱికి మహా నగరంగా చేయగల్గిన సమర్థునితో పోలుస్తున్నారు. అరణ్యాన్ని ఛేదించడానికి గొడ్డలి, ఱంపం మొదలైన ఆయుధాలు ఆవశ్యకాలు. అవి పదునైన అంచులను కల్గినవిగా ఉండాలి. అపుడే వాటిలో అరణ్యాలు ఖండించడం సాధ్య మవుతుంది. అదే రీతిలో వరవరమునులకు ఆయుధం వారి శ్రీసూక్తులే. అవి సులభంగా ప్రతివాదం చేసి సమాధానం పల్కడానికి సాధ్యం కానట్లుగా, అంతటి బుద్ధితీక్ష్ణతతో గమనించి పలుకబడినవి. (ప్రయోగింపబడినవి). వాటితో శ్రీవరవరమునులు చార్వాక, బౌద్ధ, జైన, వైశేషిక, సాంఖ్య, యోగాలనే ఆఱు నాస్తికమతాలనే అరణ్యాలను వాదించి ఖండించి వేశారు. శ్రీభాష్యకారులు, వేదార్థసంగ్రహమే గ్రంథంలో. శాక్య-ఉలూక్య- అక్షపాద- క్షపణ- కపిల-పతంజలి మతాలనే ఆఱు మతాలను ప్రస్తావించారు. శ్రీవరవరమునులు- అరణ్యాలను ఛేదించేవానితో, వారి శ్రీసూక్తులు- ఱంపం, గొడ్డలి మొదలైన ఆయుధాలతోను, శ్రీసూక్తులలోని తీక్ష్ణత -ఆ ఆయుధాల పదునుతోను, షణ్మతాలు- గొప్ప అరణ్యంతోను ఉపమించి పలకబడ్డాయి. ఆ మహాచార్యులు అందఱిచే సేవింపబడుతున్నారు- అని ఈ శ్లోకంలో తెలుపబడడం గమనించాలి.

**"క్రకచై రేవ తీవ్రకోటిభిః"** అనే ప్రయోగాలద్వారా **"రేవతీ"** అనే నక్షత్రనామం సూచింపబడింది. ప్రతి పాదంలో అక్షరాలు కల అనుష్టుప్ ఛందస్సులో ఈ శ్లోకం రచింపబడింది.

ఇంతటితో నక్షత్రమాలికాస్తవంయొక్క స్తుతిభాగం పూర్తి అయినవి. ఈ శ్లోకం "స" అనే అక్షరంతో ముగుస్తున్నది. దీనికి పిమ్మట "హ" అనే అక్షరం ఒకటి ఉన్నది. దానితో పూర్తి అయే ఇంకొక శ్లోకం ఈ స్తుతిలో అక్షరక్రమాన్నిబట్టి ఆవశ్యకమై ఉన్నది. ఈ స్తోత్రగ్రంథం అక్షరఅన్దాది అయినందున కవర్గం మొదలు వరుస క్రమంలో ఉండే అక్షరాలతో శ్లోకాలు ఆరంభమవుతున్నందున, క మొదలు హవరకు గల 28 అక్షరాలలో (వర్గపంచమాక్షరాలు తీసి వేస్తే 18 అక్షరాలు), మొదటి 27 అక్షరాలతో 27 శ్లోకాలు రచింపబడగా, ఇక హకారంతో ప్రారంభం కావలసిన శ్లోకం ఒకటి అక్కఱ ఉన్నది. అంతేకాక ముందున్న శ్లోకం చివరి అక్షరంతో తరువాత శ్లోకం ఆరంభమయే అన్దాది క్రమంలో, చివరి శ్లోకంలోని చివరి అక్షరం మొదటి శ్లోకం లోని మొదటి అక్షరమైన కకారమై ఉండిఉండాలి. కనుక, అపుడే మండల అన్దాది ప్రక్రియపూర్తి అవుతుంది. కనుక, హకారంతో ప్రారంభమై కకారంతో పూర్తి అయే శ్లోకం ఆవశ్యకమై ఉన్నది. అందువల్ల ఈ స్తుతిలో మఱి రెండు శ్లోకాలు రచింపబడుతన్నాయి. ఈ రెండు శ్లోకాలలో, 28వ శ్లోకంలో నైచ్యానుసంధానం, 29 శ్లోకంలో మంగళాశాసనం చేయబడుతున్నాయి.

**28. సేయం నక్షత్రమాలాఽద్య గ్రథితా నిర్గుణాఽపి మే ।**
**భూయస్యై రమ్యజామాతుః ప్రీతయే భవతాదిహ ॥**

మే = నాయొక్క, సా ఇయం = ఇంతకు చెప్పబడిన ఈ, నక్షత్రమాలా = నక్షత్రమాలికాస్తోత్రం, (మాలికాపక్షంలో నక్షత్రాలనే మాల- అని అర్థం), అద్య= ఇపుడు, గ్రథితా = రచింపబడినదై (కట్టబడినదై), నిర్గుణా అపి = అలంకారం, రసం, ధ్వని, ఔచిత్యం మొదలైన కావ్యగుణాలు ఏమీ లేనిది అయినా, (దారం లేనిది అయినా), ఇహ = ఇక్కడ, రమ్యజామాతుః= మణవాళమహామునులకు, భూయస్యై = అధికమైన, ప్రీతయే = ప్రీతికోసం (ప్రీతిని కల్గించేదిగా), భవతాత్ = అగుగాక !

ఈకవి తన నైచ్యానుసంధానాన్ని చేసే శ్లోకం ఇది. అలంకారం, రసం, ధ్వని మొదలైన కావ్యగుణాలు ఏమీ లేకపోయినా, దాసునిచే బుద్ధిపూర్వకంగా రచింపబడిన ఈ నక్షత్రమాలికాస్తోత్రం మణవాళమహా మునులకు మిక్కిలి తృప్తిని కల్గిస్తుంది- అని నమ్మి, అందుకోసం వారిని కవి ప్రార్థిస్తున్నారు.

నక్షత్రమాలికాస్తుతికి నక్షత్రాలనే ఒక మాలను ఉపమానంగా శ్లేషభంగితో పల్కుతున్నారు. స్తుతిపక్షంలో- గుణమంటే కావ్యగుణాలైన అలంకారం, రసం, ధ్వని, ఔచిత్యం, మొదలైనవి. మాలాపక్షంలో - గుణమంటే దారం. లేక, పూలను కట్టే నార. ఒక మాలను కట్టడానికి నూలు, లేక, నార ఆవశ్యకం. అయినా, మాలగా కట్టబడని పూలసమూహానికి కూడా ఒక విధంగామాలని చెప్పడంలో ఔచిత్యం ఉన్నది. భగవానుని శ్రీచరణాలలో పూలసమూహాన్ని సమర్పించవచ్చు. ఇవి, అర్చనను చేసే విడిపూల వంటివి. ఈవిధంగా దాసుని స్తుతి గ్రంథంలో- నారస్థానంలో ఉండే కావ్యగుణాలు లేకపోయినా, శ్రీవరవరమునుపట్ల దాసునకు ఉండే భక్తి, తన్మూలంగా రచింపబడిన ఈ గ్రంథం భగవానుని శ్రీచరణాలలో ఉండే విడిపూలతో పోలుతుంది. కనుక, శ్రీవరవరమునులకు ఇది తృప్తికరంగా ఉంటుంది- అని అంటున్నారు.

ఈ శ్లోకం పరమవిలక్షణమైనది. నక్షత్రాలలోని పేర్లు పూర్వశ్లోకంతో పూర్తి అయినందున, ఇందులో దాని ప్రసక్తి లేదు. కవర్గం మొదలు హవరకు అందాది రీతిలో స్తుతిని రచించాలని ఆరంభించిన ఈ కవి

ఈ శ్లోకాన్ని "స" అనే అక్షరంతో ఆరంభించి "హ" అనే అక్షరంతో పూర్తిచేస్తున్నారు. అందాది క్రమంలోని గ్రంథంలో ఆరంభాక్షరంగా ఉండాలి కనుక, ఆ నియమాన్ని అనంతర శ్లోకంతో పూర్తి చేస్తున్నారు.

**29.** హరిభక్తిసుధాజస్రపానపీనస్వమానసః ।
మంగళం తనుతా న్నిత్యం రమ్యజామాతృదేశికః ॥

హరిభక్తి = విష్ణుభక్తి అనే, సుధా = అమృతాన్ని, అజస్ర = ఎల్లప్పుడు, పాన = పానం చేయడంవల్ల, పీన = దృఢమై (బలిసిన), స్వమానసః = తన మనస్సును కల్గినవారైన, రమ్యజామాతృదేశికః = మణవాళమహామునులనే ఆచార్యులు, నిత్యం = ఎల్లప్పుడు, మంగళం = శుభాన్ని, తనుతాత్ = విస్తరింప జేయుగాక !

ఇది మంగళాశాసనశ్లోకం. విష్ణుభక్తి అనే అమృతాన్ని సదా పానం చేసి, అందువల్ల, ఉత్సాహం ఆనందం- అనే వీటితో నిండి ఉండే మనస్సును కల ఆ ఆచార్యసార్వభౌములు మణవాళమహామునులు అన్ని వేళల అన్ని శుభాలను ఏలోటు లేకుండా అనుగ్రహించుగాక- అని అంటూ మంగళాశాసనాన్ని చేసి స్తుతిని పూర్తిచేశారు.

ఈ శ్లోకం "హ" అనే అక్షరంతో ఆరంభమై ఈస్తుతి ఆరంభాక్షరమైన "క" అనే అక్షరంతో ముగిసినందున అందాది గ్రంథక్రమాన్ని పూర్తిగా కల్గి ఉన్నది.



శ్రీపరవాదికేసరి అనుగ్రహించిన

# శ్రీశైలవైభవము

ఇది "శ్రీశైలేశదయాపాత్రమ్" తనియన్ వైభవాన్ని కీర్తించే అన్ద్రాదిద్రావిడ ప్రబంధం. ప్రాచీన నిత్యానుసంధాన శ్రీకోశాలలో ముద్రింపబడిన ఈ కృతి తొలుదొల్తగా తాత్పర్యసహితంగా ముద్రింప బడుతున్నది.

1. కూఱుగేన్ ఉలగీరే కుఙ్గుమత్తోళరఙ్గేశర్,
మాఱన్ మఱైప్పొరుళ్ కేట్క మణవాళమామునియై
ఏఱు మణైదనిలిరుత్తి యిరునిలత్తిల్ తామిరున్దు
వీఱుడనే శెవి శాత్తి విరైయడి పూశనై యాన్ఱ్ఱి.

లోకంలోని జనులారా! చెబుతున్నాను వినండి. (శ్రీరంగనాయకి స్తనతటం లోని) కుంకుమతో అలంకరింపబడ్డ బాహువులను కల శ్రీరంగనాథుడు నమ్మాళ్వార్ల తిరువాయ్మొళి ప్రబంధం అనే వేదాన్ని ఆలకించాలని ఆశపడి మణవాళమహా మునులను ఉన్నతమైన ఆసనంలో నిలిపి, తాను భూమిపై ఉండి, చాలా కుతూ హలంతో, ఆలకించి, చివరలో మణవాళమహామునులయొక్క, సువాసనను కల తామరపూలవంటి శ్రీపాదాలకు అర్చనచేశాడు.

2. ఆఱిరణ్డు పురళ్ళూళ్ అరఙ్గముదల్ నూన్ఱ్రెట్టుమ్
కూఱియశీర్ శయిలత్తై క్కొణ్డాడి యురైక్క వెనా
ఊఱియ తేన్పెరుక్కెన్న యున్ని యదై యుగన్దురైత్తాన్
శేఱు వళర్ కమలైమైన్దన్ చిన్దైమగిళ్న్దు ఒరుప్పట్టే

ఉభయకావేరుల నడుమన గల శ్రీరంగం మొదలైన దివ్యతిరుపతులు నూట ఎనిమిదిలోను తాను చెప్పిన గొప్ప శ్రీశైలదయాపాత్రం అనే తనియన్‌ను ఆదరించి, అనుసంధించాలని, ఊఱిన తేనెల ప్రవాహం అనేటట్లుగా ఆ తనియన్‌ను భావించి, పంకజవాసిని నాథుడైన శ్రీరంగనాథుడు మనస్సులో అంగీకరించి, ఆనందించి చెప్పాడు.

3. పట్టర్‌పిరాన్ ముదలాయ పదిన్మర్‌కలై పళ్గిచ్చలిలుమ్
శిట్టర్‌గళాయ్ ద్దినన్దోఱుమ్ తిరుమణిడు వేళైయిలుమ్,
ఇట్ట ముఱ వుణుమ్బొళ్దత్తోణ్‌కర నీర్‌ట్రైయినుమ్,
అట్టదిక్కుమ్ విళఙ్గురైత్తార్ ఆరియర్‌కళనైవరుమే

భట్టనాథులు మొదలైన పదిమంది ఆళ్వార్లు భగవానుని కీర్తిస్తూ పాడిన ప్రబంధాల అనుసంధానం లోను, శిష్టులైనవారు నిత్యం తిరుమణ్‌ను అలంకరించుకొనే సమయంలోను, ఇష్టంగా భుజించేటపుడు

పరిషేచనవేళలోను ఈ తనియన్‌ను అనుసంధించాలని ఎనిమిది దిక్కులలోని ఆచార్యులందఱు స్పష్టంగా తెలిపారు.

**4.** అరియర్‌కళ్ కొణ్డాడి యాచరిత్త తనియనైత్తాన్
పేరియలుమ్ తొణ్డర్‌కుళ్ళామ్ పెరుమ్ పేఱా క్కొణ్డనరాల్
శీరియరాయ్ వాళ్ల వెణ్ణి చ్చేగతలత్తీర్ కర్రుణర్‌మిన్,
తారియలు మరఙ్గరుక్కు న్తమిళ్ళ్‌మఱైక్కుమ్ మణమామే

పూర్వాచార్యులందఱు కొనియాడి ఆచరించే తనియన్‌ను దాసవర్గం అంతా ప్రాప్యాలన్నిటిలోకి పరమప్రాప్యంగా స్వీకరించారు. కనుక ఓ లోకులారా! గొప్పవారుగా లోకంలో ఉజ్జీవించాలని భావిస్తే మీరు దానిని అభ్యసించి తెలిసికోండి. పూమాలెలను నిత్యం ధరించే శ్రీరంగనాథునకు, ద్రావిడవేదానికి మంగళం కల్గుతుంది.

**5.** మణవాళమామునియై వళ్ళుత్తుఱవోర్ పయన్ పెఱువర్
కుణమాగ క్కొణ్మినిదై క్కొడుమ్ పిఱవి ప్పిణి యగల్వీర్
పణవాళరా వివరామ్ పగైత్తారేయుయ్‌దలిలర్
మణ ముడైయ మన్దిరమా మదిక్కొళ్ళీర్ తనియనైయే

మణవాళమహామునులను స్తుతించేవారు ప్రాప్యాన్ని పొందుతారు. దీనిని హితమని గ్రహించండి. క్రూరజన్మ అనే వ్యాధినుండి వారు విడివడుతారు. ఫణామణు లను కల ఆదిశేషుడే ఈ వరవరమునిగా అవతరించాడు. వీరిని విరోధించినవారు ఉజ్జీవించేవారే కారు. శుభాన్ని కల మంత్రం ఇది. ఈ తనియన్‌ను మీరు స్వీకరించండి.

**6.** తనియ నెన్ఱు పేర్ శార్ర్రి త్తణ్ణరఙ్గర్ మున్నర్
ఇనియ తిరుప్పవళత్తాలే- మునివరనార్
మాఱన్ మఱై ముప్పత్తాఱాయిరత్తిన్ మాణ్‌పొరుళై
క్కూఱ వుపదేశిత్తార్ కొణ్డు.

మునివరులైన వరవరమునులు నమ్మాళ్వార్ల వేదం అయి తిరువాయ్‌మొళ్ళి వ్యాఖ్యానం ఈడు ముప్పత్తాయిరప్పడియొక్క అందమైన దివ్యార్థాలను చెప్పగా చల్లని శ్రీరంగంలోని స్వామి పూర్వం తన తీయని పెదవితో, తనియన్ అనే పేరును పెట్టి దీనిని ఉపదేశించాడు.

**7.** దేశ మెఙ్గు మిదు తిరుప్పదిగళ్‌దోఱుమఱైక్క
నేశ ముఱ వరఙ్గర్ నేమిత్తార్ - ఏశుమవర్
పాదగరా యెరివాయ్ పాళ్ళ్ నరగిల్ తుయ్‌ప్పర్,
వేదనారుళ్లమట్టుమ్ మెయ్‌త్తు.

దేశంలో ఉండే దివ్యక్షేత్రాలలో అంతటా భక్తితో ఈ తనియన్ అనుసంధించా లని శ్రీరంగనాథుడు ఆదేశించాడు. దీనిని నిందించేవారు పాతకులై అగ్నిముఖాన్ని కల పాడు నరకంలో పడి బ్రహ్మకల్పం పూర్తి అయేవరకు బాధపడతారు.

8. ఎయ్య త్తుణియ ఇరావణియై క్కొన్దవన్కాణ్

శెయ్య నెఱి విళఙ్గ క్ష్మేడనవన్- వైయ

న్దనై వళర్క్కు మాఱు వరయోగి తానాయ్

వినై యఱుత్తు వీడరుళుమ్ వేన్దు

తనను వధించాలనే వ్యర్థప్రయత్నం చేసిన ఇంద్రజిత్తును సంహరించిన లక్ష్మణుడే కదా ఎఱ్ఱని ప్రకాశించే ఆదిశేషుడు. భూమిలోనివారంతా ఉజ్జీవించేటట్లుగా అతడు వరవరమునిగా అవతరించి, మన కర్మలను ఛేదించి, పరమపదాన్ని అనుగ్ర హించే దైవం.

9. వేన్దరాయ్ మణ్ణాణ్డు విణ్ణేఱలా మెళిదాయ్

తోయ్న్ద వుఱవా యిరుక్కిల్ తొల్లులగీర్- ఓర్న్దుయ్య

ఎతికొడు కాల నిழన్దమర్ మేవాన్ విణ్ణోర్

నాదనుమ్ వన్దే వణఙ్గ నన్గు

ఓ లోకులారా ! ఆవరవరమునులతో గాఢమైన సంబంధాన్ని కల్గి ఉంటే జీవించినసమయంలో ఈ లోకానికి ప్రభువులై, తరువాత సులభంగా పరమపదాన్ని చేరవచ్చు. బాగా పరిశీలించగా, ఉజ్జీవించాలంటే చివరకు ఆయుధధారి అయిన యముడు కూడ యుద్ధం చేయడు. పరమపదనాథుడైనా వచ్చి చక్కగా నమస్కరిస్తాడు.

10. వణఙ్గినార్ శీర్ పెற்றார் వరన్ ముఱైయాల్ వీడణర్పోల్

ఇణఙ్గినారోరువ రిరునిలత్తిల్ శిఱప్పுற்றార్

పిణఙ్గినార్ పేయ్ పిఱవి ప్పేదైయర్ కడమై క్కణ్డే

ఉణఙ్గినార్ తామదరాయుట్చనన్దార్తెన్దమరే

వరవరమునులను నమస్కరించినవారు విభీషణునివలె శ్రేష్ఠమైన రీతిలో శుభాన్ని పొందారు. కలసి ఉన్నవారు ఇహలోకంలో, పరమలోకంలో మంచిని అనుభవించారు. కలహించినవారు పిశాచిజన్మను పొందారు. మూఢులయ్యారు. వరవరమునుల పట్ల భక్తి లేనివారు తామసులై ఆత్మీయులు లేనివారు అవుతారు.

11. తెన్కలైయామ్ తమిழ் వేద చ్చీర్శైలత్తనియ నెనుమ్

నన్కలైయై యుట్కొశిన్దు నవిற்ற பెరున్తకై మాన్దర్

మిన్ కలైయుమ్ పురినూలుమ్ మేనోక్కు పుణ్డరముమ్
తెన్‌కలైయుమ్ వడకలైయుమ్ తిగ*ళ్*న్ద నావరాగువరే

అందమైన శాస్త్రం అయిన ద్రావిడవేదానికి చెందిన, శ్రీశైలేశదయాపాత్రం అనే గొప్ప శాస్త్రాన్ని మనస్సులో ఆర్ద్రతను కల్గి అభ్యసించిన మహానుభావులు ప్రకాశించే శరీరాన్ని, యజ్ఞోపవీతాన్ని, శరీరానికి తగిని ఊర్ధ్వ పుండ్రాలను, సంస్కృతద్రావిడవేదాలు ప్రకాశించే జిహ్వను కలవారు కాగలరు.

**12.** ఆగుదలెన్నిని యెనక్కోరారావముదా యెన్
శోక మఱ వుళత్తడత్తు త్తులఙ్గువర వరయోగి
శేకఱు శెమ్మలర్‌త్తాళుశ్శీర్‌శైలత్తనియను మిన్ఱు
ఓకై యుఱ పెఱ్ఱనెనాలొలి కడఱ్ఱారణియారే

ఇక అయితే ఏమి! శబ్దించే సముద్రాన్ని కల భూమిలోని జనులారా! శోకం తీరేటట్లు ప్రకాశించే వరవరమునియొక్క, దుఃఖాన్ని తీర్చే ఎఱ్ఱని తామరలవంటి పాదాలను, శ్రీశైలదయాపాత్రం అనే తనియన్‌ను పొందిన నేను ఇపుడు ఆనందాన్ని పొందాను.

**13.** తారణియోర్ వా*ళ్* వెణ్ణి త్తానే తిరువనన్దన్
పేరణియుమ్ కురుకైనగర్ పిఱఙ్గనని ప్పేరరుళాల్
శీరణియుమ్ మణవాళమామునియాయ్ చ్చెనిత్తనాల్
తారణియు మరఙ్గరుక్కు త్తమి*ళ్*మఱై త్తేశిక నెనవే

భూమిలోనివారు ఉజ్జీవించాలని తలచి ఆదిశేషుడు స్వయంగా గొప్ప కీర్తిని కల తిరుక్కురుకూర్ ప్రకాశించేటట్లుగా పరమకృపతో గొప్ప కల్యాణగుణాలను అలంకారంగా కల మణవాళమహామునులై పూమాలికలను అలంకరించుకొనే రంగనాథునకు ద్రావిడవేదాచార్యులు అనేటట్లుగా అవతరించాడు. ఆహా!

**14.** తమి*ళ్*మఱై యోదువరేల్ తనియ నదు మఱ్ఱిల్లై
తిమిర మఱ మెయ్‌జ్ఞాన చ్చె*ళ్*ుమ్ శుడర్ శేర్ మనముడైయీర్
అమి*ళ్*ామల్ శముశారత్తా*ళ్*కడలై క్కడత్తి యొరు
నిమిడత్తిల్ నిత్తియరాయ్ నిఱుత్తుమ్ పేరిన్బత్తే

ద్రావిడవేదాన్ని అనుసంధించేటపుడు మొదట తనియన్ ఇది తప్ప ఇంకొకటి లేదు. అజ్ఞానాంధకారం నశించేటట్లు నిబిడమైన జ్ఞానాన్ని కల్గిన మనస్సును కల జనులారా! సంసారమహాసముద్రంలో మునిగిపోకుండా మనలను దాటించి ఒక నిముషంలోని నిత్యులై, మహానందాన్ని పొందేటట్లు ఇది చేస్తుంది.

**15.** పత్తు త్తిశైగళినుమ్ పణమణిగళ్ శుడరెఱిప్ప
ముత్తి దరు మరఙ్గరుక్కు మూవణైయాయ్ శూ*ళ్*న్దిలఙ్గుమ్

**ఎత్తిశైయుమ్ పణిన్దేత్తుమ్ ఎమ్బెరియ మునియాగుమ్**
**అత్త నెఱ్ఱిల్ వరయోగి యాయిరవా యరవరశే**

దశ దిశలలోను ఫణామణుల కాంతులు ప్రకాశించగా, ముక్తిని ఇచ్చే శ్రీరంగ నాథునకు అనాదగా పర్యంకమై చుట్టుకొని ఉండి వెలిగే వేయి నోళ్ళను కల ఆదిశేషుడే, అన్ని దిక్కులలోనివారు నమస్కరించి కీర్తించే గొప్ప ముని, స్వామి అయిన వరవరమునులు.

**16. అర వేఱు మేవి యఱి తుయిల్ కొళ్ల మరఙ్గరురై**
**వరయోగి శీర్శైలత్తిన్ పెరుమ్ పుగఴ్ వైబవత్తై**
**విరగాల్ ఇశైమఱైయోర్ తిలకన్ తమిఴ్విఱుడైయ**
**పరవాది కేశరి పా ప్పదినైన్దు పణిత్తననే**

సర్పరాజు అయిన ఆదిశేషుని పర్యకంగా ఆదరించి యోగనిద్రను పొందే శ్రీరంగనాథుడు పల్కిన శ్రీవరవరమునుల శ్రీశైలేశదయాపాత్రతనియన్ వైభవాన్ని గూర్చి చాతుర్యంగా స్వరాత్మకం అయిన వేదాన్ని తెలిసినవారిలో గొప్పవారు, ద్రావిడభాషాపాండిత్యాన్ని కల పరవాదికేసరి పదిహేను పాశురాలను రచించారు.

శ్రీశైలవైభవమ్ సంపూర్ణం



శ్రీఅప్పిళ్లాన్ అనుగ్రహించిన

# సంప్రదాయచంద్రికై

శ్రీ వరవరమునుల శిష్యులలో ఒకరైన అప్పిళ్ళాన్ "శ్రీశైలేశ దయాపాత్రమ్" తనియన్ వైభవాన్ని కీర్తిస్తూ రచించిన కృతి ఇది. ఈ ప్రబంధంలోని 3వ పాశురంలో ప్రస్తావింపబడ్డ ఐతిహ్యం వివరం స్పష్టంకాలేదు. బహుశః తిరుమాలిరుమ్ శోలైలోని వృత్తాంతమే (25వ పేజీ చూడండి) శ్రీరంగంలో జరిగినట్లు చెప్పబడి ఉండవచ్చు అని తోస్తుంది. ఈ విషయంలో పెద్దల సూక్తి ప్రమాణం.

1 ఆదియిలే యరవరశై యుళ్లైత్తు అరఙ్గర్
అవనియిలే యిరు నూఱాణ్డిరు నీరెన్న
ప్పాదియిలే యుడైయవరాయ్ వన్దు తోన్టి
ప్పరమపదమ్ నాడి యవర్ పోవే నెన్న
నీదియాయ్ మున్పోల నిఱ్క నాడి
నిలువైదనై నిఱైవేఱ్ఱివారు మెన్న
శాదారణ మ్మేను మావరుడన్దన్నిల్
తనిత్తులా మూలనాళ్ తాన్ వన్దారే.

పూర్వం ఆదిశేషుని పిలచి శ్రీరంగనాథుడు "భూమిపై మీరు రెండువందల ఏండ్లు వేంచేసి ఉండండి" అని అనగా, అందులో కొంత భాగం శ్రీరామానుజులై భూమికి వచ్చి అవతరించి, 120 సం॥ల తర్వాత పరమపదానికి తిరిగి వెళ్ళాలని అనుకొన్నపుడు, భగవానుడు "ముందు రీతిలోనే అవతరించి మిగిలిన భాగాన్ని (కాలాన్ని) భూమిపై గడపి రండి"- అని అనగా సాధారణం అనే గొప్ప సంవత్సరంలో అద్వితీయం అయిన తులామాసంలోని మూలనక్షత్రంలో మణవాళమహామునులుగా ఆదిశేషుడు అవతరించారు.

2) నఱ్కురోదనవరుడ మకరమాద
నలమాగ క్కన్నికైయై మణమ్ పుణర్న్దు
విక్కిరమవఱ్బురత్తిల్ వీట్టిరున్దు
వేదాన్తమఱైప్పొరుళై చ్చిన్దై శెయ్దు
పుక్కగత్తిల్ పెణ్పిళ్లైపోలే శెన్టు
పువనియుళ్ల తలజ్గళెల్లామ్ వణఙ్గి వన్దు
తుక్క మఱ వైణవర్కళ్ తొణ్డు శెయ్య
తురియనిలై పెఱ్ఱులగై యుయక్కొణ్డారే.

చక్కని క్రోధనవర్షం మకరమాసంలో (తైమాసంలో) చక్కగా ఒక కన్యకను వివాహం చేసికొని, ఇంటిలో ఉండి వేదాంతార్థాలను అనుసంధిస్తూ, విక్రమవర్షంలో అత్తవారింటికి పోయే వధువువలె భూమిలో ఉండే దివ్యతిరుపతులను అన్నిటినీ సేవించి వచ్చి, శ్రీవైష్ణవుల దుఃఖం తీరేటట్లుగా వారు సేవించగా చతుర్థాశ్రమం అయిన సన్న్యాసాశ్రమాన్ని లోకోజ్జీవనార్థం వరవరమునులు స్వీకరించారు.

**3)** శెయనామమాన తిరువాణ్డుతన్నిల్

శీరఙ్గరాశరుడై త్తిరునాళ్ తన్నిల్

శెయ మాగ త్తిరువీది వారానిఱ్క

త్తెన్నాట్టు వైణవరెన్ఱొరువర్ వన్దు.

దయైయుడైయ మణవాళప్పెరుమాళ్

నైనార్ తమ్ముశ్బే యోరరుత్త మియమ్బ చ్చొల్లి

శయనఙ్ఞశెయ్దెழுన్దిరున్దు చిన్దిత్తాఙ్గే

శన్దిత్తు క్కోయిల్ కాత్తరుళినారే.

జయనామసంవత్సరంలో శ్రీరంగనాథుని ఉత్సవసమయంలో తిరువీథిలో విజయం చేసేటపుడు "తెన్నాట్టు వైణవర్" అనే భక్తులు ఒకరు వచ్చి,దయను కల మణవాళప్పెరుమాళ్ సన్నిధిలో ఒక అర్థాన్ని అనుగ్రహించవలసినదిగా ప్రార్థించారు. తరువాత ఇంటికి వచ్చి నిద్రించి, స్వప్నంలో తాము పొందిన "శ్రీశైలశదయాపాత్రమ్" తనియన్‌ను చింతిస్తూ, శ్రీరంగంలోనే వేచి ఉన్నారు.

**4)** వదరియాచ్చిరమత్తి లిరు మెయ్త్తొణ్డర్

వకైయాగ నారణనై యడి వణఙ్గి

క్కదియాగ వోర్ పొరుళై యళిక్కవేణ్డు

ఙ్కణ్ణే యడియోఙ్గళ్ తేఱ వెన్న

చ్చదిరాగ చ్చీర్‌శైలమన్దిరత్తిన్

శయమాన పాదియై యాఙ్గరుళిచ్చెయ్దు

పదియాన కోయిలుక్కు చ్చెన్‌మిన్ నీవిర్

పాదియైయుఙ్గొల్లుదుమ్ యాన్ తేఱ వెన్ఱార్.

బదరికాశ్రమంలో ఇద్దఱు భక్తులు క్రమానుసారంగా శ్రీమన్నారాయణుని శ్రీపాదాలకు నమస్కరించి "స్వామీ! దాసులమైన మేము ఉజ్జీవించేటట్లు గతి అయిన ఒక అర్థాన్ని అనుగ్రహించాలని ప్రార్థించగా, అందంగా "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్‌లోని సగాన్ని అక్కడ బదరికాశ్రమంలో స్వామి అనుగ్రహించి "నా దివ్యదేశం అయిన శ్రీరంగానికి మీరు వెళ్ళండి, మిగిలిన సగాన్ని నేనక్కడ చెబుతాను'' అని అన్నాడు.

5) శెన్దవర్‌గళ్ ఇరువరుమే శేర వన్దు
తిరువరఙ్గన్ దినచరిమై కేళానిఱ్ప.
చ్చన్నిదిమున్ కరుడాళ్వార్‌మణ్డపత్తిల్
తామీడు శాత్‌ఱుగిన్ఱ శమయన్తన్నిల్.
పొన్నిదనిల్ నీరాడి పుగళ్‌న్దు వన్దు
పుగళరఙ్గర్ శన్నిదిమున్ వణఙ్గి నిఱ్ప.
చ్చన్నిదియిన్దు అరఙ్గర్‌తామే యన్ద
త్తనియనురై శెయ్‌దు తలైక్కట్టినారే.

ఆ విధంగానే ఆ భక్తులు శ్రీరంగానికి వెళ్ళి, అక్కడ శ్రీరంగనాథుడు పంచాంగ శ్రవణాన్ని ఆలకిస్తూ ఉండగా సన్నిధిముందు గరుడాళ్వార్ మండపంలో ఈడు కాలక్షేపం పూర్తి అయే సమయంలో కావేరీనదిలో స్నానం చేసి, స్తుతించి, కీర్తిని కల శ్రీరంగనాథుని సన్నిధికి ముందుకు వచ్చి నిలువగా, ఆలయంలోని శ్రీరంగనాథుడు స్వయంగా (బాలునిరూపంలో) ఆ తనియన్‌లోని మిగిలిన సగాన్ని చెప్పి పూర్తిచేశాడు.

6) నల్లదోర్ పరిదాబివరుడన్దన్నిల్
నలమాన ఆవణియిన్ ముప్పత్తొన్ఱిల్
శొల్లరియ శోదియుడన్ విళఙ్గు వెళ్లి
త్తొల్‌కిళమై వళర్‌పక్క నాలానాళిల్
శెల్వ మిగు పెరియ తిరుమణ్డపత్తిల్
శెళున్తిరువాయ్‌మొళిప్పొరుళై చ్చెప్పు మెన్ఱే
వల్లియుఱై మణవాళర్ అరఙ్గర్ నఙ్గణ్
మణవాళమామునిక్కు వళఙ్గినారే.

చక్కని పరీధావి సంవత్సరంలో మంచిది అయిన ఆవణిమాసం ముప్పై ఒకటవ దినంలో వాక్కును అందని గొప్ప తనాన్ని కల జ్యోతిస్సుతో వెలిగే మొదటి శుక్రవారం శుక్లపక్షచతుర్థిలో గొప్ప అందాన్ని కల పెరియతిరుమండపంలో గొప్పదైన తిరువాయ్‌మొళి ప్రబంధంయొక్క అర్థాన్ని చెప్పవలసినదిగా లతవంటి లక్ష్మీదేవి నిత్యవాసం చేసే శ్రీరంగనాథుడు మాముందు వరవరమునులను అనుగ్రహించాడు.

7) ఆనన్దవరుడత్తిల్ కీళ్‌మైయాణ్డిల్
అళగాన ఆణిదనిల్ మూలనాళిల్,
బానువారఙ్కొణ్డ పగలిల్ శెయ్య
పొరనైయిల్ నాళిట్టు ప్పొరున్ది వైత్తే,

ఆనన్దమయమాన మణ్డపత్తిల్

అ*ழ*గాగ మణవాళరీడు శా*ற்ற*,

వానవరుమ్ నీరిట్ట వ*ழ*క్కే యెన్న

మణవాళమామునిగళ్ కళిత్తిట్టారే.

ఆనందనామ సంవత్సరంలో అందమైన ఆణిమాసం మూల నక్షత్రంలో ఆదివారంనాడు పగలు పౌర్ణమితిథిలో ఆనందమయం అయిన మండపంలో అందంగా పరమపదవాసులు సైతం **"మేము మీ అధీనులమే"** అని అనగా మణవాళమహాములు ఈడు పూర్తిచేసి ఆనందించారు.

**8)** దేవియర్గళిరువరుడన్ శీరరఙ్గేశర్

తిగ*ழ்* తిరుమామణిమణ్డపత్తిల్ వన్దు.

తావిదమా యిన్ద ఉలకోర్గళ్ వా*ழ*

త్తమి*ழ்* మఱైయై వరమునివన్ ఉరైక్క క్కేట్టే.

ఆవణిమాశన్దొడఙ్గి నడక్కుమ్ నాళ్

అద్దియన త్తిరునాళ్ అరఙ్గనాదర్.

తావ మఱ వీ*ற்ற*ిరున్దు తరువాయ్ ఎన్ఱు

తామ్ నోక్కి శీయర్తమక్కరుళినారే.

దేవేరులు ఇద్దఱితో శ్రీరంగనాథుడు ప్రకాశించే తిరుమామణిమండపానికి వచ్చి, ఈ లోకులకు ఆలంబనంగా వారు ఉజ్జీవించేటట్లుగా ద్రావిడవేదాన్ని వివరించమని అనగా విన్నాను. ఆవణిమాసంనుండి జరిగే దినాలలో అధ్యయనోత్సవం లో శ్రీరంగనాథుడు తాపం పోయేటట్లుగా వేంచేసి ఉండి కాలక్షేపాన్ని అనుగ్రహించమని జీయర్ను ఉద్దేశించి అనుగ్రహించాడు.

అరుళినదే ముదలాగ అరఙ్గరుక్కుమ్

అన్ఱు ముదల్ అరున్తమి*ழై* యమైత్తుక్కొణ్డు.

తెరుళుడైయ వియాక్కియై యైన్దడనే కూట్టి

త్తిగ*ழ்* తిరుమామణిమణ్డపత్తిల్ వన్దు.

పొరుళురైక్కుమ్ పోదెల్లామ్ పెరుమాళుక్కు

పున్శిరిప్పుమ్ పావనైయుమ్ మగి*ழ்*వుమ్ కొళ్ల.

అరుళుడైయ శడకోపరురైత్త వేద

మదు కేట్టు చ్చా*ற்ற*ియదు ఇత్తనియన్డానే.

ఆదేశించినది మొదలుకొని శ్రీరంగనాథునకు ఆనాటినుండి అరుదైన ద్రావిడవేదానికి గల అయిదు వ్యాఖ్యానాలతో కలిపి, తిరుమామణి మంటపానికి వచ్చి మణవాళమహామునులు అర్థాన్ని వివరించేటపుడు అంతా శ్రీరంగనాథునకు ఆనందదరహాసం, మధురభావన, ఆనందం కలిగాయి. కరుణను కల నమ్మాళ్వార్లు అనుగ్రహించిన వేదార్థాన్ని విని శ్రీరంగనాథుడు అనుగ్రహించినది శ్రీశైలేశదయాపాత్ర తనియనే.

**10)** **నామార్ పెరుఙ్జీర్కొళ్ మణ్డపత్తు నమ్బెరుమాళ్**
**తామాగ వన్దు తనిత్తళైత్తు- నీ మాఱన్**
**శెన్దమిళ్ వేదత్తిన్ శెళ్ళుమ్బొరుళై నాడోఱుమ్**
**వన్దురైయా యెన్నురైయాల్ వాయ్న్దు**

అందం నిండిన మిక్కిలి గొప్పతనాన్ని కల మండపంలో శ్రీరంగనాథుడు తానుగా వచ్చి, వరవర మునులను ప్రత్యేకంగా ఆహ్వానించి, 'నీవు నమ్మాళ్వార్ల అందమైన ద్రావిడవేదం యొక్క గంభీరమైన అర్థాలను ప్రతిదినం వచ్చి వివరించు - అని అన్నాడు.

**శేఱ్ఱుక్కమల వయల్ శూళరఙ్గర్ తఙ్జీర్ తళైప్ప**
**పోఱ్ఱి త్తొళుమ్ నల్ల అన్దణర్ వాళ విప్పూదలత్తే**
**మాఱ్ఱఱ్ఱ శెమ్బొన్ మణవాళమాముని వన్దిలనేల్**
**ఆఱ్ఱిల్కరైత్త పుళియల్లవో తమిళారణమే**

పంకంతో, కమలాలతో నిండిన పొలాలు చుట్టి ఉండే శ్రీరంగనాథుని గొప్పతనం వృద్ధిచెందేటట్లు కీర్తించి నమస్కరించే సద్బ్రాహ్మణులు ఈలోకంలో ఉజ్జీవించేటట్లుగా సాటిలేని, అందమైన, బంగారు మయమైన శ్రీరంగంలో మణవాళమహామునుల అవతరించి ఉండకపోతే ద్రావిడవేదం నీటిలో కరిగిన చింతపండువలె వ్యర్థమైపోయేది కదా!

సంప్రదాయచంద్రికై సంపూర్ణమ్



### ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన

### (శ్రీ వరవరమునుల)

# పూర్వదినచర్య - తాత్పర్యంతో

## తనియన్ శ్లోకం

**సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజషట్పదమ్ ।**
**దేవరాజగురుం వందే దివ్యజ్ఞానప్రదం శుభమ్ ॥**

శ్రీమణవాళమహామునులయొక్క శ్రీపాదపద్మాలలో తుమ్మెదవంటివారు(తుమ్మెద పద్మాలను సర్వదా ఆశ్రయించి ఉండేటట్లు శ్రీమణవాళ మహామునుల శ్రీ పాదాలను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండేవారు) ఆచార్యులే ఉపాయోపేయాలనే దివ్యజ్ఞానాన్ని తమ ఉపదేశానుష్ఠానాలద్వారా అనుగ్రహించేవారు (కావుననే) శుభప్రదులును అయిన, దేవరాజగురువులనబడే ఎఱుమ్బియప్పా అనే ఆచార్యవర్యులను నమస్కరిస్తున్నాను.



1. **అంకే కవేరకన్యాయా స్తుంగే భువనమంగళే ।**
   **రంగేధామ్ని సుఖాసీనం వందే వరవరం మునిమ్ ॥**

శ్రీరంగక్షేత్రం కావేరినదిమధ్యలో ఉన్నది. అది చాలా గొప్పది. భూలోకం మొదలైన అన్న లోకాలలో ఉండేవారి అభీష్టాలు సిద్ధించడానికి కారణమైనది. స్వయం ప్రయోజనమైనది. సర్వేశ్వరుడైన శ్రీరంగనాథుడు స్వయంగా కోరి తన నివాసంగా ఎంచుకొన్న క్షేత్రం అది. ఇటువంటి శ్రీరంగక్షేత్రంలో సుఖంగా శ్రీవరవరమునులు నిత్యవాసాన్ని చేస్తున్నారు. వారు రూపం, ఔదార్యం మొదలైన గుణాలలో శ్రీరంగనాథు నకు సాటి వచ్చేవారు. అందువల్ల ఆ స్వామి తిరునామం అయిన **"అఴగియమణ వాళన్"** (రమ్యజా మాత) అనే పేరును కల్గినవారు. తత్త్వయాథాత్మ్యజ్ఞానాన్ని ఎల్లప్పుడు మననం చేసేవారు. ఇటువంటి శ్రీవరవరమునులకు నేను భక్తిపూర్వకంగా స్తోత్ర ప్రణామాలను చేస్తున్నాను.

దేవరాజగురువు అనే ఎఱుమ్బియప్పా స్తోత్ర ప్రారంభంలో మొట్టమొదటిది అయిన ఈ శ్లోకంలో స్తోత్రం నిర్విఘ్నంగా పూర్తికావడంకోసం తమకు ఇష్టదైవం, ఆచార్యులైన శ్రీమణవాళ మహామునులకు నమస్కారం చేయడమనే మంగళాచరణాన్ని చేశారు.

ఇకపై ఎఱుమ్బియప్పా తమను మణవాళ మహామునులు అనుగ్రహించిన సందర్భాన్ని మనస్సులో తలచుకొంటూ ఆ సన్నివేశాన్ని కొన్ని శ్లోకాలలో శ్రీవరవర మునులతో విన్నవిస్తున్నారు. (ఈ రెండవ శ్లోకంనుండి 12వ శ్లోకం వరకు అన్నీ కలిపి ఒకే వాక్యంగా అన్వయించుకోవాలి.)

2. **మయి ప్రవిశతి శ్రీమన్మందిరం రంగశాయినః ।**
   **పత్యుః పదాంబుజం ద్రష్టు మాయాంత మవిదూరతః ॥**

శ్రీరంగమందిరం కైంకర్యసంపదకు నిలయం. శ్రీరంగనాథుడుని శయనించిన ఆ మందిరాన్ని నేను ప్రవేశించిన సమయంలో దేవరవారు సర్వశేషి అయిన ఆ శ్రీరంగనాథుని శ్రీచరణాలను సేవించడంకోసం అల్లంతదూరంలో మందిరం వైపుగా వేంచేస్తూ దర్శనమిచ్చారు.

**3. సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్రవిగ్రహమ్ ।
ప్రసన్నార్కప్రతీకాశప్రకాశపరివేష్టితమ్ ॥**

దేవరవారి తిరుమేని స్వేచ్ఛతో అపూర్వంగా పరిగ్రహింపబడింది. చాలా అందమైనది. తెల్లని వర్ణాన్ని కల్గినదై, పాలసముద్రంవలె ఉన్నది. అందువల్ల కంటికి ఏ శ్రమ లేకుండా దర్శించడానికి వీలుగా, సౌమ్యంగా, చల్లగా ఉండే అపూర్వమైన సూర్యుని తేజస్సు అనేది ఒకటి ఉంటే, అటువంటి తేజస్సును నాల్గువైపుల కల్గి ఉన్నారు. (అంటే, లోకవిలక్షణమైన తేజస్సుతో దేవరవారు ప్రకాశిస్తున్నారు).

**4. పార్శ్వతః పాణిపద్మాభ్యాం పరిగృహ్య భవత్ప్రియౌ ।
విన్యస్యంతం శనై రంఘ్రీ మృదులౌ మేదినీతలే ॥**

దేవరవారు అన్ని లౌకికవిషయాలలో విరక్తులు. వాధూల వరద నారాయణులు (కోయిలణ్ణన్), ఆ అణ్ణన్ తమ్ములు తమకుగల శిష్యులలో అత్యంతం ప్రియమైనవారు, భోగ్యతాది గుణాలతో పద్మాల వంటివి, సుకుమారాలు అయిన తమ శ్రీహస్తాలతో ఈ ఇద్దఱిని చెఱి ఒకవైపు పట్టుకొని చాలా మృదువైన తమ శ్రీచరణాలను భూమిపై మెల్లమెల్లగా మోపి వస్తూ దేవరవారు దర్శనమిచ్చారు.

**5. ఆమ్లానకోమలాకార మాతామ్రవిమలాంబరమ్ ।
ఆపీనవిపులోరస్క మాజానుభుజభూషణమ్ ॥**

దేవరవారి తిరుమేని శిరీషకుసుమంవలె చాలా సుకుమారమైనది. ఏ మాత్రం శ్రమను సహించలేనిది. అందువల్ల దేవరవారు అపుడు కొంచెం అలసిన తిరుమేనిని కల్గి ఉన్నారు. చాలా ఎఱ్ఱగా ఉండే, శుద్ధమైన కాషాయ వస్త్రాన్ని ధరించి ఉన్నారు. దేవర వారి వక్షస్సు విశాలమైనది, ఉన్నతమైనది. భుజాలు రెండు మోకాళ్ళ వరకు విస్తరించిన పొడుగును కల్గి చాలా అందంగా ఉన్నవి. అవి దేవరవారికి ఒక అలంకారంవలె శోభను కల్గిస్తున్నవి.

**6. మృణాలతంతుసంతాన సంస్థానధవళత్విషా ।
శోభితం యజ్ఞసూత్రేణ నాభిబింబసనాభినా ॥**

తమరు ధరించి ఉండే తెల్లని యజ్ఞోపవీతాన్ని దర్శించినపుడు అది తామర కాడలనుండి తీసిన తెల్లని దారాల సమూహంతో చేసినట్లుగా భాసించింది. అది మీ నాభిపర్యంతం వేలాడుతూ తమకు ప్రకాశాన్ని కల్గిస్తున్నది.

**7. అంభోజబీజమాలాభి రభిజాతభుజాంతరమ్ ।
ఊర్ధ్వపుండ్రై రుపశ్లిష్ట ముచితస్థానలక్షణైః ॥**

తామర పూసలతో చేయబడిన మాలికలతో దేవరవారి అందమైన బాహువులు, ఆ బాహువుల మధ్య ప్రదేశం అయిన వక్షస్సు అలంకరింపబడి ఉన్నవి. ఫాలం (నుదురు) మొదలైన శాస్త్రంలో విధింపబడిన స్థానాలలో దేవరవారు ద్వాదశోర్ధ్వ పుండ్రాలను ధరించారు. అవి తగిన నిడివి, వెడల్పు మొదలైన లక్షణాలను కల్గి ఉన్నాయి. ఆ ఊర్ధ్వ పుండ్రాలను దర్శిస్తే, అవి దేవరవారి తిరుమేనిలో పూచిన పూలవలె భాసిస్తూ చక్కగా పొందికగా, అందంగా ఉన్నాయి.

**8. కాశ్మీరకేసరస్తోమ కడారస్నిగ్ధరోచిషా ।
కౌశేయేన సమింధానం స్కంధమూలావలంబినా ॥**

తమరు ధరించిన పట్టు ఉత్తరీయం కుంకుమ ఫలాల సముదాయంవలె ఎఱ్ఱని రంగును కల్గినది. ధగధగమని ప్రకాశిస్తున్నది. అటువంటి ఉత్తరీయాన్ని దేవర వారు బాహువులలో ధరించారు. ఆ ఉత్తరీయంయొక్క ఎఱ్ఱని రంగు,

దేవరవారి తిరుమేని యొక్క తెల్లని రంగు – అనే ఈ రెండు వేర్వేరు వర్ణాల కలయికవల్ల కల్గిన పరభాగ శోభతో దేవరవారు చాలా గొప్పగా ప్రకాశిస్తూ దర్శనమిచ్చారు.

**9. మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరమ్ ।
తదర్థతత్త్వనిధ్యాన సన్నద్ధపులకోద్గమమ్ ॥**

మంత్రరత్నమనబడే ద్వయమంత్రాన్ని సదా అనుసంధానం చేయడంవల్ల దేవరవారి అధరం ఎల్లప్పుడూ కొంచెంగా కదలుతున్నది. ఆ మంత్రంయొక్క తత్త్వార్థాన్ని మనస్సులో సదా భావించడంవల్ల ఏర్పడిన సంతోషాతిశయంతో దేవర వారి తిరుమేనిలో కల్గిన పులకలు (రోమాంచం) సువ్యక్తం అవుతున్నవి.

**"తదర్థతత్త్వమ్"** – అంటే – ద్వయమంత్రార్థంయొక్క పర్యవసితమైన యథార్థ తత్త్వం. అది ఏమంటే – **"విష్ణుశ్శేషీ తదీయశ్శుభగుణనిలయో విగ్రహః శ్రీశఠారిః, శ్రీమాన్ రామానుజార్యః పదకమలయుగం భాతి రమ్యం తదీయమ్"** (విష్ణువు అందఱికి శేషి, ఆ విష్ణువుయొక్క సమస్త కల్యాణగుణాలకు నిలయమైన విగ్రహం శ్రీశఠకోపులు. ఆ శఠకోపుల అందమైన శ్రీచరణాల స్థానీయులు శ్రీరామానుజులు) అనే పెరియ వాచ్చాన్ పిళ్ళైసూక్తి ప్రకారం **"శ్రీమన్నారాయణచరణౌ"** అనే పదానికి శ్రీమన్నారాయణుని దివ్యమంగళ విగ్రహస్థానీయులైన శ్రీశఠకోపుల శ్రీచరణాలుగా భావించదగినవారు శ్రీరామానుజులు" – అనేది. ఇదే ద్వయమంత్రంలోని తత్త్వార్థం.

**10. స్మయమానముఖాంభోజం దయమానదృగంచలమ్ ।
మయి ప్రసాదప్రవణం మధురోదారభాషణమ్ ॥**

దేవరవారి తిరుముఖం పద్మంవలె అందంగా మనోహరంగా ఉన్నది. ఆ తిరుముఖంలో మందహాసం ఎల్లప్పుడూ తొణికిసలాడుతున్నది. తమ కటాక్షాలు దేవరవారి నిర్హేతుకకృపను సూచిస్తున్నవి. "అయ్యో! ఇంతకాలంగా ఇతడు నన్ను ఆశ్రయించకుండా వైముఖ్యాన్ని కల్గి ఉన్నాడే" అని నాపట్ల విశేషమైన అనుగ్రహాన్ని చూపిస్తూ దర్శనమిచ్చారు. అటువంటి సహజమైన అనుగ్రహాన్ని కల్గి ఉన్నందువల్ల దేవరవారు పలికే సూక్తులు చాలా మధురమై, అర్థగాంభీర్యాన్ని కల్గినవై ఉన్నాయి.

**11. ఆత్మలాభాత్పరం కించి దన్య న్నాస్తీతి నిశ్చయాత్ ।
అంగీకర్తు మివ ప్రాప్త మకించన మిమం జనమ్ ॥**

"భగవానుడైన శ్రీమన్నారాయణునకు (అలంకారమైన) కౌస్తుభంవంటిది అయిన ఒక జీవాత్మయొక్క లాభం కంటే ఇంకొక ఏ వస్తువు ఉత్కృష్టమైన పరమార్థం  కాదు. అందువల్ల జీవాత్మలలో ఒకడైన ఇతనిని సంస్కరించి, భగవానుని మంగళాశాసన పరునిగా చేయాలి" అనే నిశ్చయంలో మాత్రమే ఏ ఆత్మగుణాన్ని కొంచెంకూడా లేనివాడను, ఏవిధంగా చూచినా విడువవలసినవాడనైన నన్ను స్వీకరించడంకోసం నిశ్చయించుకొని, నావైపుగా దేవరవారు వేంచేస్తున్నట్లుగా దాసునకు తోచారు.

**12. భవంత మేవ నీరంధ్రం పశ్యన్ వశ్యేన చేతసా ।
మునే వరవరస్వామిన్! ముహుః త్వా మేవ కీర్తయన్ ॥**

**13. త్వదన్యవిషయస్పర్శవిముఖై రఖిలేంద్రియైః ।
భవేయం భవదుఃఖానా మసహ్యానాం మనాస్పదమ్ ॥**

తమ సొత్తు అయిన నన్ను అభిమానించే స్వామిత్వసంబంధాన్ని కల్గిన ఓ మహానుభావా! నన్ను అనుగ్రహించడంకోసం తగిన ఉపాయం ఏది? అనే చింతన చేసే ఓ వరవరమునీ! సౌందర్యం – సౌలభ్యం మొదలైన కల్యాణగుణాలను పూర్ణంగా కల్గి ఉండే మిమ్ములనే విడువకుండా సదా దర్శిస్తూ, తమ కటాక్షవిశేషంవల్ల నా అధీనంలో ఉండే మనస్సుతో కీర్తించదగిన తమనే మాటి మాటికీ కీర్తిస్తూ ఉన్నాను. దేవరవారి విషయంలో తప్ప, మిగిలిన విషయాలతో సంబంధాన్ని కల్గి ఉండడంలో వైముఖ్యాన్ని కల నా వాక్కు మొదలైన కర్మేంద్రియాలతో, చక్షుస్సు (నేత్రాలు) మొదలైన జ్ఞానేంద్రియాలతో నేను ఏవిధంగాను భరించడానికి సాధ్యం కానివి, శరీరసంబంధం వల్ల కలిగేవి అయిన దుఃఖాలను పొందకుండా ఉండేటట్లు నన్ను మీరు అనుగ్రహించాలి.

స్తోత్రంలో ఇంతవరకు గల భాగం ఉపోద్ఘాతం.

**14. పరేద్యుః పశ్చిమే యామే యామిన్యాః సముపస్థితే ।**
**ప్రబుధ్య శరణం గత్వా పరాం గురుపరంపరామ్ ॥**

తమతో యాదృచ్ఛికంగా సమాగమం కల్గిన మఱునాటి రాత్రిలో చివరి జాములో తమరు నిద్రలేచి గొప్పదైన (శ్రియఃపతిమొదలు స్వాచార్యపర్యంతంగల) గురు పరంపరను శరణు వేడారు.

**15. ధ్యాత్వా రహస్యత్రితయం తత్త్వయాథాత్మ్యదర్పణమ్ ।**
**పరవ్యూహాదికాన్ పత్యుః ప్రకారాన్ ప్రణిధాయ చ ॥**

ఆత్మస్వరూపంయొక్క యాథాత్మ్యాన్ని – అంటే – భాగవతపర్యంతమైన అనన్యార్హశేషత్వ – అనన్యశరణత్వ – అనన్యభోగ్యత్వరూపమైన ఆకారత్రయాన్ని స్ఫుటంగా అద్దంలో కన్పించేటట్లు చేసే రహస్యత్రయాన్ని (అష్టాక్షరి – ద్వయం – చరమ శ్లోకం – అనే రహస్యత్రయాన్ని) వాటి అర్థంలో పాటుగా అనుసంధించి, భగవానుని పర – వ్యూహ – విభవ – అంతర్యామి – అర్చారూపాలనే పంచ ప్రకారాలను గూర్చి తమరు ధ్యానించారు.

**16. తతః ప్రత్యుషసి స్నాత్వా కృత్వా పౌర్వాహ్ణికీః క్రియాః ।**
**యతీంద్రచరణద్వంద్వ ప్రవణేనైవ చేతసా ॥**

తరువాత, శౌచం, దంతధావనంవంటి కార్యాలను ముగించి, కావేరినదిలో గాని చంద్రపుష్కరిణిలోగాని అరుణోదయకాలంలో స్నానాన్ని చేసి, ప్రాతఃకాలంలో చేయవలసిన శుద్ధ వస్త్రధారణం, తులసీమాల, తామరపూసల ధారణం, సంధ్యావందనం మొదలైన కర్మలను శ్రీరామానుజుల శ్రీచరణాలలో పరమభక్తిని కల మనస్సుతో తమరు ఆచరించారు.

**17. అథ రంగనిధిం సమ్య గభిగమ్య నిజం ప్రభుమ్ ।**
**శ్రీనిధానం శనై స్తస్య శోధయిత్వా పదద్వయమ్ ॥**

ఈ విధంగా స్నానం, సంధ్యావందనాది ప్రాతఃకాలిక కర్తవ్యాలను పూర్తిచేసి, మఠానికి వేంచేసి తరువాత, తమకు మఠంలో అర్చామూర్తి రూపంలో సన్నిహితుడై వేంచేసి ఉండే శ్రీరంగనాథునివద్దకు శాస్త్ర ప్రకారం భక్తితో వెళ్ళి, దండం సమర్పించి, సేవకు నిధానమైన (ఆశ్రయమైన) ఆ శ్రీరంగనాథుని శ్రీచరణాలకు మెల్లగా గొప్ప భక్తిపారవశ్యంతో ఏ తొందరలేకుండా శుద్ధతీర్థంతో తిరుమంజనాన్ని చేశారు. (ఆరాధించారు).

**18. తత స్తత్సన్నిధిస్తంభ మూలభూతలభూషణమ్ ।**
**ప్రాఙ్ముఖం సుఖ మాసీనం ప్రసాదమధురస్మితమ్ ॥**

ఈ విధంగా శ్రీరంగనాథుని ఆరాధన చేసిన తరువాత తమరు మంత్రరత్నాన్ని జపించారు. ఆ పిమ్మట శ్రీరంగనాథుని సన్నిధిలోని స్తంభం మూలప్రదేశంలో దేవర వారు తూర్పుముఖంగా సుఖాసీనులయ్యారు. ఆ విధంగా మీరు వేంచేసి ఉండడం స్తంభం మూలప్రదేశానికి అలంకారంగా భాసించింది. భగవదనుభవంవల్ల కల్గిన సంతోషాతిశయంచేత తమ మనస్సు నిర్మలమైనది. దానివల్ల ప్రియమైన మందహాసం తమ ముఖంలో తొణికిసలాడినది.

**19. భృత్యైః ప్రియహితైకాగ్రైః ప్రేమపూర్వ ముపాసితమ్ ।**
**తత్ప్రార్థనానుసారేణ సంస్కారాన్ సంవిధాయ మే ॥**

ఇష్టమైనవి, పథ్యమైనవి అయిన భగవదారాధనకు ఉపయుక్తాలైన వస్తువులను సంపాదించడంలో ఏకాగ్రతను కల కందాడై అణ్ణన్ మొదలైన శిష్యులు భక్తిపూర్వకంగా పరిచర్య చేస్తూ ఉండగా, వారి ప్రార్థనను అనుసరించి, అంతకు ముందు దినంలో ఆశ్రయించిన నాకు పంచసంస్కారాలను యథావిధిగా దేవరవారు ప్రసాదించారు.

**20. అనుకంపాపరీవాహై రభిషేచనపూర్వకమ్ ।**
**దివ్యం పదద్వయం దత్వా దీర్ఘం ప్రణమతో మమ ॥**

ఇతరులకు కల్గిన అనర్థాన్ని చూచి సహించలేకపోవడమనే తమ కృపాగుణం యొక్క ప్రవాహంతో నన్ను అభిషేకించారు. దేవరవారి దివ్యానుగ్రహాన్ని చూచి తన్మయుడైన దాసుడు భక్త్యతిశయంతో తమ సన్నిధిలో చిరకాలం సాగిలపడ్డాడు. అపుడు తమరు నాకు తమ శ్రీచరణ ద్వయిని అనుగ్రహించి, నా శిరస్సుపై ఉంచారు.

**21. సాక్షాత్ఫలైకలక్ష్యత్వ ప్రతిపత్తిపవిత్రితమ్ ।**
**మంత్రరత్నం ప్రయచ్ఛంతం వందే వరవరం మునిమ్ ॥**

ద్వయమంత్రాన్ని ఉపదేశంచేయడంలో ప్రధానమైన ఉద్దేశ్యం – భగవన్మంగళా శాసనరూపమైన ఫలమే. అటువంటి ఉద్దేశ్యంతో, అంటే – భగవానునకు మంగళా శాసనం చేసేవారిలో ఇతడు కూడా ఒకడు కాగలడు – అనే ఉద్దేశ్యంతో పవిత్రంగా చేయబడిన ద్వయమంత్రాన్ని తమకు నాకు ప్రసాదించారు. అటువంటి వరవర మునులైన తమకు నమస్కరిస్తున్నాను.

**22. తత స్సార్ధం వినిర్గత్య భృత్యై ర్నిత్యానపాయిభిః ।**
**శ్రీరంగమంగళం ద్రష్టుం పురుషం భుజగేశయమ్ ॥**

ఆవిధంగా ద్వయాన్ని నాకు ఉపదేశం చేసిన తరువాత శ్రీవరవరమునులు శ్రీరంగక్షేత్రానికి అలంకారంవంటివాడు, అనంతుడనే సర్పంపై శయనించి ఉన్నవాడు, సమస్త అభీష్టాలను అడిగినదాని కంటే విరివిగా అనుగ్రహించడంవల్ల పురుషుడనబడే వాడు అయిన శ్రీరంగనాథుని సేవించాలని తలచి, క్షణకాలం తమ ఎడబాటును కూడా సహించలేని కోయిలణ్ణన్ మొదలైన అంతరంగశిష్యులతో కలసి మఠంనుండి బయలుదేరారు. (క్రమంగా శ్రీరంగాలయగోపురాన్ని చేరారు).

**23. మహతి శ్రీమతి ద్వారే గోపురం చతురాననమ్ ।**
**ప్రణిపత్య శనై రంతః ప్రవిశంతం భజామి తమ్ ॥**

శ్రీరంగదివ్యాలయగోపురం గొప్ప ఐశ్వర్యాన్ని కల్గినది. బ్రహ్మాదులుసైతం ఒక్కసారి ప్రవేశిస్తే చాలు; సకలైశ్వర్యాలను వారికి అనుగ్రహిస్తుంది. చాలా విశాలమైనది. చతుర్ముఖ మనే పేరును కల్గినది. అటువంటి గోపురానికి శ్రీవరవరమునులు

నమస్కరించి (ఆ గోపురం అందంచేత ఆకర్షింపబడ్డ తమనే దృష్టి అతికష్టంపై తిప్పుకొని), ఆలయం లోపలకు ప్రవేశించారు. అటువంటి శ్రీవరవరమునులను సేవిస్తున్నాను.

**24. దేవీ గోదా యతిపతిశఠద్వేషిణౌ రంగశృంగమ్**
**సేనానాథో విహగవృషభ శ్శ్రీనిధి స్సింధుకన్యా ।**
**భూమానీళాగురుజనవృతః పూరుష శ్శేత్యమీషా**
**మగ్రే నిత్యం వరవరమునే రంఘ్రియుగ్మం ప్రపద్యే ॥**

(ఆవిధంగా ఆలయప్రాకారం లోపలకు ప్రవేశించిన శ్రీవరవరమునుల సేవా క్రమం ఈ శ్లోకంలో తెలుపబడుతున్నది)

తులసీవృక్షమూలంలో అవతరించినందువల్ల సుస్పష్టంగా ప్రకాశించే అప్రాకృత (దివ్యమైన) స్వభావాన్ని కల్గిన గోదాదేవి, భగవద్రామానుజులు, నమ్మాళ్వార్లు, శ్రీరంగ విమానం, విష్వక్సేనులు, గరుడుడు, శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి, భూదేవి - లక్ష్మీదేవి, నీళాదేవి, పరాంకుశులు మొదలైన ఆచార్యవర్గం - అనే వీరితో కూడిన పరమపదనాథుడు అనే వీరి సమక్షంలో శ్రీవరవరమునుల శ్రీచరణయుగ్మాన్ని శరణు పొందుతున్నాను.

**25. మంగళాశాసనం కృత్వా తత్ర తత్ర యథోచితమ్ ।**
**ధామ్న స్తస్మా ద్వినిష్క్రమ్య ప్రవిశ్య స్వం నికేతనమ్ ॥**

గోదాదేవి మొదలు పరమపదనాథుని వరకు గల ఆయా అర్చామూర్తులకు మంగళాశాసనాన్ని యథోచితంగా చేసి, ఆ సన్నిధుల నుండి బయలుదేరి, తమ నివాసమైన మఠానికి శ్రీవరవరమునులు తిరిగి చేరుకొన్నారు.

**26. అథ శ్రీశైలనాథార్యనామ్ని శ్రీమతి మండపే ।**
**తదంఘ్రిపంకజద్వంద్వ చ్ఛాయామధ్యనివాసినమ్ ॥**

**27. తత్త్వం దివ్యప్రబంధానాం సారం సంసారవైరిణామ్ ।**
**సరసం సరహస్యానాం వ్యాచక్షాణం నమామి తమ్ ॥**

మఠానికి తిరిగి చేరిన తరువాత, తమ ఆచార్యులైన శ్రీశైలనాథార్యుల (తిరువాయ్ మొழிప్పిళ్ళై యొక్క) తిరునామాన్ని కల్గినది, ఆ ఆచార్యుల తిరుమాళిగ (గృహం) యొక్క మన్నుతో చేయబడినందువల్ల నిరవధికమైన శోభను కల్గిన మండపంలో చిత్రరూపంలో వేంచేసి ఉండే తమ ఆచార్యులైన తిరువాయ్మొழி ప్పిళ్ళై యొక్క శ్రీచరణ పద్మాల నీడలో శ్రీవరవరమునులు వేంచేసి ఉండి, సంసారాన్ని తీర్చేవి, మూలమంత్రం (అష్టాక్షరి) మొదలైన రహస్యత్రయంయొక్క అర్థాన్ని ప్రతిపాదించేవి అయిన దివ్య ప్రబంధాల సారాన్ని స్వరూప యాథాత్మ్యరూపమైన తత్త్వాన్ని సరసంగా ఏ సందేహం, భ్రాంతి లేని రీతిలో అనుగ్రహించే ఆ వరవరమునులకు నమస్కరిస్తున్నాను.

**28. తత స్స్వచరణాంభోజ స్పర్శసంపన్నసౌరభైః ।**
**పావనై రర్థిన స్తీర్థై ర్భావయంతం భజామి తమ్ ॥**

దివ్య ప్రబంధాల అర్థాలను, తత్త్వాలను అనుగ్రహించిన తరువాత, తమను ఆచార్యులకు సాధనంగా భావించే వరవరమునులు తమయొక్క శ్రీచరణపద్మాల సంబంధంతో మిక్కిలి పరిమళాన్ని కల్గినది, పరమపావనమైనది అయిన శ్రీపాదతీర్థాన్ని ఆ శ్రీపాదతీర్థంకోసం ఎదురు చూచే శిష్యులకు అనుగ్రహించి, ఉజ్జీవింపజేశారు. అటువంటి మణవాళ మహామునులకు దండం సమర్పిస్తున్నాను.

**29 ఆరాధ్య శ్రీనిధిం పశ్చా దనుయాగం విధాయ చ ।**
**ప్రసాదపాత్రం మాం కృత్వా పశ్యంతం భావయామి తమ్ ॥**

మాధ్యాహ్నిక కృత్యాలను పూర్తిచేసిన తరువాత భగవానుడైన శ్రీరంగనాథుని పరమభక్తితో ఆరాధించి, అనుయాగాన్ని (ప్రసాద స్వీకారాన్ని) చేసి, ఇంతకాలంగా తమ శేషప్రసాదాన్ని స్వీకరించడంలో విముఖడనై ఉండే నాకు ఆ ప్రసాదాన్ని అనుగ్రహించి నన్ను కటాక్షించే ఆ మణవాళమహామునులను ధ్యానిస్తున్నాను.

**30. తత శ్శేత స్సమాధాయ పురుషే పుష్కరేక్షణే ।**
**ఉత్తంసితకరద్వంద్వ ముపవిష్ట ముపహ్వరే ॥**

ఆ తరువాత, పుండరీకాక్షుడు, పరమపురుషుడైన భగవానునిలో మనస్సును స్థిరంగా లగ్నం చేసి, తమ రెండు చేతులను ఎత్తి తలపై పెట్టుకొని అంజలిచేస్తూ నిర్జనమైన ప్రదేశంలో ఆసీనులైన ఆ వరవరమునులను సేవిస్తున్నాను.

**31. అబ్జాసనస్థ మవదాతసుజాతమూర్తి**
**మామీలితాక్ష మనుసంహితమంత్రరత్నమ్ ।**
**ఆనమ్రమౌళిభి రుపాసిత మంతరంగైః**
**నిత్యం మునిం వరవరం నిభృతో భజామి ॥**

యోగం చేయడంకోసం పద్మాసనాన్ని వేసికొని కూర్చున్నవారు, తెల్లని, అందమైన రూపాన్ని కలవారు, శుభాశ్రయమనబడే భగవానుని రూపాన్ని ధ్యానిస్తున్నందువల్ల కొంచెం మూసికొన్న కన్నులను కలవారు, రహస్యంగా ద్వయమంత్రాన్ని అనుసంధిస్తూ వేంచేసి ఉండే వారైన శ్రీవరవరమునులను కోయిలణ్ణన్ మొదలైన అంతరంగశిష్యులు శిరస్సును వంచి నమస్కరిస్తూ సదా దర్శిస్తూ సేవిస్తున్నారు. అటువంటి శ్రీవరవర మునులను నిత్యం జాగరూకతతో సేవిస్తున్నాను.

**32. తత శ్శుభాశ్రయే తస్మిన్ నిమగ్నం నిభృతం మనః ।**
**యతీంద్రప్రవణం కర్తుం యతమానం నమామి తమ్ ॥**

యోగాభ్యాసం చేసిన తరువాత అంతవరకు శుభాశ్రయమనబడే ఆ భగవానుని దివ్యరూపంలో నిమగ్నమైన తమ మనస్సును యతీంద్రులపట్ల అత్యంతం ప్రావణాన్ని కలిగి ఉండేటట్లుగా లగ్నం చేసే వరవరమునులకు నమస్కరిస్తున్నాను.



## ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన
## (శ్రీ వరవరమునుల)

# ఉత్తరదినచర్య - తాత్పర్యంతో

**1.** **ఇతి యతికులధుర్య మేధమానైః**
**శ్రుతిమధురై రుదితైః ప్రహర్షయంతమ్ ।**
**వరవరముని మేవ చింతయంతీ**
**మతి రియ మేతి నిరత్యయం ప్రసాదమ్ ॥**

శ్రీవిధంగా చెవులకు ఇంపైనది, శ్రీరామానుజుల మనస్సులో మిక్కిలి గొప్పగా భావింపబడినది అయిన యతిరాజవింశతి స్తోత్రరూపమైన సూక్తులతో యతిసార్వ భౌములైన భగవద్రామానుజులను ఆనందింపజేస్తున్న శ్రీవరవరమునులను ధ్యానం చేసే నా ఈ మనస్సు అంతు లేని ప్రసన్నతను పొందుతున్నది.

**2.** **అథ గోష్ఠీం గరిష్ఠానా మధిష్ఠాయ సుమేధసామ్ ।**
**వాక్యాలంకృతివాక్యాని వ్యాఖ్యాతారం నమామి తమ్ ॥**

యతిరాజవింశతిని అనుగ్రహించిన తరువాత స్వయంగా గ్రంథరచనను చేయ గల్గిన మహనీయులైన కోయిలణ్ణన్ మొదలైన వారుండే గోష్ఠికి తాము అంతవరకు ఏకాంతంగా యోగాభ్యాసాన్ని చేసిన చోటునుండి వేంచేసి వచ్చి, పూర్వాచార్యుల వాక్యాలతో నిండిన శ్రీవచన భూషణమనే రహస్య గ్రంథంలోని వాక్యాలను వ్యాఖ్యానం చేసే మణవాళ మహామునులను నమస్కరిస్తున్నాను.

**3.** **సాయంతనం తతః కృత్వా సమ్యగారాధనం హరేః ।**
**స్వైరాలాపైః శుభైః శ్రోతౄన్ నందయంతం నమామి తమ్ ॥**

ఆ తరువాత, శ్రీవరవరమునులు సాయంకాలసమయంలో అనుష్ఠించవలసిన సంధ్యావందనాన్ని చేసి, విరోధి నిరసనాన్ని చేస్తున్నందు వల్ల హరి అనబడే శ్రీరంగ నాథునకు సాయంసంధ్యా సమయంలో తిరువారాధనను చక్కగా పరమభక్తితో నిర్వర్తించారు. అనంతరం కొంతసేపు తాము స్వచ్ఛందంగా ముచ్చటించే శుభకరాలైన సూక్తుల ద్వారా, అతిసహనాలైన, అర్థం చేసికోవడానికి చాలా కఠినాలైన అర్థపంచకాది వేదాంతార్థాలను విడమఱచి విశదీకరిస్తూ, శ్రోతలైన కోయిలణ్ణన్ మొదలైన జ్ఞానాధికు లను సంతోషింపచేశారు. అటునుంచి శ్రీవరవరమునులను నేను నమస్కరిస్తున్నాను.

**4.** **తతః కనకపర్యంకే తరుణద్యుమణిద్యుతౌ ।**
**విశాలవిమలశ్లక్ష్ణ తుంగతూలాసనోజ్జ్వలే ॥**

**5.** **సమగ్రసౌరభోద్గార నిరంతరదిగంతరే ।**
**సోపధానే సుఖాసీనం సుకుమారే వరాసనే ॥**

ఆ తరువాత శ్రీవరవరమునులు సుకుమారమైన శయ్యపై కూర్చున్నారు. ఆ శయ్య ఉదయించే సూర్యుని కాంతివంటి ఎఱ్ఱని కాంతిని కల్గినది. విశాలమైనది, ఏ దోషం లేనిది, దృఢంగా చిక్కగా ఉన్నది, ఉన్నతమైనది, మెత్తని

దూదితో చేయబడిన ఆసనాన్ని కల్గి ప్రకాశిస్తున్నది. సంపూర్ణమైన, భగవత్ప్రసాదరూపమైన గంధం, నిర్మాల్యాలు మొదలైనవానియొక్క పరిమళాన్ని నాల్గు వైపుల కల్గి ఉన్నది. శ్రమ కల్గినపుడు కొంచెం వెనుకకు వాలి, విశ్రాంతిని తీసికోవడానికి వీలుగా తలదిండును కల్గి ఉన్నది. ఈ దివ్యమైన, దూదితో చేయబడిన ఆసనం బంగారు మయమైన మంచంపై పరుపబడి ఉన్నది. ఈ ఉత్తమాసనంపై **"చేలాజినకుశోత్తరమ్"** – అనే రీతిలో యోగానికి తగినట్లుగా దుర్భాసనం, అజినాసనాదులు జోడింపబడి ఉన్నాయి. అటువంటి ఉత్తమాసనంలో సుఖాసీనులై ఉండే శ్రీవరవరమునులను ధ్యానిస్తున్నాను.

**6. ఉన్మీలత్పద్మగర్భ ద్యుతితలముపరి క్షీరసంఘాతగౌరం**
**రాకాచంద్రప్రకాశ ప్రచురనఖమణిద్యోత విద్యోతమానమ్ ॥**
**అంగుళ్యగ్రేషు కించి న్నత మతిమృదులం రమ్యజామాతృయోగీ**
**దివ్యం తత్పాదయుగ్మం దిశతు శిరసి మే దేశికేంద్రో దయాళుః ॥**

శ్రీవరవరమునులు పరమదయాళువు. గొప్ప ఆచార్యులు. వారి శ్రీచరణాల కిందిభాగం (అరికాళ్ళు) వికసించే ఎఱ్ఱ తామరపూవుమధ్య ప్రదేశంలో ఎటువంటి కాంతి ఉంటుందో అటువంటి ఎఱ్ఱని కాంతిని కల్గి ఉన్నాయి. పైన పాలసమూహం వలె తెల్లని కాంతిని కల్గి ఉన్నాయి. పాదాల వేళ్ళలోన్ని గొప్ప గోళ్లు పున్నమిచంద్రుని కాంతివంటి కాంతిని దట్టంగా కల్గి ఉన్నాయి. ఇటువంటి గోళ్ళ కాంతితో వారి శ్రీచరణాలు గొప్పగా ప్రకాశిస్తున్నాయి. ఆసనంలో కూర్చున్న శ్రీవరవరమునుల అతి సుకుమారైన శ్రీచరణాలలోని వేళ్ళు కొంచెం వంగి ఉన్నాయి. ఇటువంటి రీతిలో అతివిలక్షణమైన తమ శ్రీపాదాలను శ్రీమణవాళ మహామునులు వాటి విషయంలో అభిలాషను కల దాసుని శిరస్సుపై శిరోభూషణంగా పెట్టి అనుగ్రహించాలి.

**7. త్వం మే బంధుః త్వమసి జనక స్త్వం సఖా దేశిక స్త్వం**
**విద్యా వృత్తం సుకృత మతులం విత్త మప్యుత్తమం త్వమ్ ।**
**ఆత్మా శేషీ భవసి భగవ న్నాంతర శ్శాసితా త్వం**
**యద్వా సర్వం వరవరమునే! యద్యదాత్మానురూపమ్ ॥**

ఓ శ్రీవరవరమునీ! దేవరవారే దాసునకు విడువడానికి సాధ్యం కాని గొప్ప బంధువు. తమరే (విద్యాప్రదాన – రక్షణ – భరణాదులను చేసే) తండ్రి. దేవరవారే భగవదనుభవాన్ని పొందడం మొదలైనవానిలో వృత్త కీర్తనాదులకు సహాయభూతులైన ఉపకారకులు. సఖులు. తెలియని విషయాలను తెలియజేయడం, సన్మార్గ నిర్దేశనం చేయడం మొదలైనవానిద్వారా ఆచార్యులు తమరే. **"మాతేవ రక్షతి"** అనే రీతిలో ఆత్మరక్షణను చేసే పరవిద్య తమరే. తెలిసిన జ్ఞానంయొక్క ఫలరూపంగా చెప్పదగిన సదనుష్ఠానంవలె హితపరులు తమరే అవుతున్నారు. దేవరవారే ఏశ్రమ లేకుండా లభించే, ఏనాటికీ తరగని ధనం. దేవరవారే పూర్వం తెలుపబడిన ధనం మొదలైన అన్నిటిని యథేచ్ఛంగా వినియోగం చేసికొనే ప్రధానభూతులైన ఆత్మ. తమరే దాసుని వల్ల కైంకర్యాన్ని స్వీకరించే శేషి. జ్ఞానం–శక్తి–బలం–ఐశ్వర్యం–వీర్యం–తేజస్సు– అనే ఆఱు గుణాలతో పూర్ణులైన ఓ భగవన్! దేవరవారే నాలో ఉంటూ నన్ను నియమించే ఆంతరమైన నియంతలు. ఇంతగా పల్కడం ఎందుకు స్వామీ! ఏది ఆత్మకు తగినదో నాకు అది అంతా తమరే సుమా! (విరోధి నిరసనం చేసి, ప్రాప్య సిద్ధిని పొందించేది వారు తమరే).

**8. అగ్రే పశ్చాదుపరి పరితో భూతలం పార్శ్వతో మే**
**మౌళౌ వక్త్రే వపుషి సకలే మానసాంభోరుహే చ ।**

**పశ్యన్ పశ్యన్ వరవరమునే! దివ్య మంఘ్రిద్వయం తే**
**నిత్యం మజ్జ న్నమృతజలధౌ నిస్తరేయం భవాబ్ధిమ్ ॥**

ఓ మణవాళ మహామునీ! అతివిలక్షణమైన దేవరవారి శ్రీచరణద్వయాన్ని ముందు, వెనుక, పైన, క్రింద, నాల్గు వైపుల, నా రెండు వైపుల, శిరస్సులో, ముఖంలో, ఇంకా నా అన్ని అంగాలలో, హృదయపుండరీకంలో, నేత్రాలు మొదలైన ఇంద్రియా లలో నేను భావనాప్రకర్షవల్ల సుస్పష్టంగా ప్రత్యక్షసమానాకారంగా మానసికమైన దర్శనాన్ని పొందుతూ, ఆనందామృతసాగరంలో నిత్యం మునిగినవాడనై సంసార సాగరాన్ని తప్పక దాటగలను.

**9. కర్మాధీనే వపుషి కుమతిః కల్పయన్ ఆత్మభావం**
**దుఃఖే మగ్నః కి మితి సుచిరం దూయతే జంతు రేషః ।**
**సర్వం త్యక్త్వా వరవరమునే! సంప్రతి త్వత్ప్రసాదాత్**
**దివ్యం ప్రాప్తుం తవ పదయుగం దేహి మే సుప్రభాతమ్ ॥**

ఓ వరవరమునీ! ఈ చేతనుడు (నేను) గతంలో చేసిన కర్మల ఫలంగా ప్రకృత శరీరాన్ని పొందాడు. శరీరమే ఆత్మ అనే తగని భావనను – అంటే – విపరీత జ్ఞానాన్ని ఆరోపించుకొన్నాడు (కల్గి ఉన్నాడు). అంతేకాదు, నేను కుమతిని. నాకు నేనే స్వామిని అని, తమరు స్వామి కాదు! ఇంకొకరు స్వామి – అనే అన్యథా జ్ఞానాన్ని కల్గ ఉన్నానే! ఇటువంటి నేను ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవికాలనే తాపత్రయాల వల్ల కల్గిన దుఖాలలో మునిగినవాడనై చిరకాలంగా పరితపిస్తున్నానే. "అయ్యో! ఈ విధంగా ఇతడు ఎందుకు భాదపడుతున్నాడు?" – అని తలచి, ఈ రీతిగా చిరకాలంగా బాధపడుతున్న నాకు ఇపుడే తమ గొప్పదైన, అప్రాకృతమైన శ్రీచరణయుగ్మాన్ని పొందదానికి, మీ అనుభవాన్ని పొందడానికి ఆరంభమైన సుప్రభాతాన్ని తమ అనుగ్రహంతో కల్గించండి.

**10. యా యా వృత్తి ర్మనసి మమ సా జాయతాం సంస్మృతి స్తే**
**యో యో జల్ప స్స భవతు విభో నామసంకీర్తనం తే ।**
**యా యా చేష్టా వపుషి భగవన్! సా భవే ద్వందనం తే**
**సర్వం భూయా ద్వరవరమునే! నైన సమ్య గారాధనం తే ॥**

ఓ వరవరమునీ! కర్మపరవశుడను అయిన నా చంచలమైన మనస్సులో ఏ జ్ఞానం కలిగే యోగ్యత ఉన్నదో, ఆ జ్ఞానం అంతా స్మరణ మాత్రంతోనే నిరతిశయ మైన సుఖాన్ని కల్గించే తమ స్మృతిగా కావాలి. (నా జ్ఞానం అంతా మీ స్మృతి రూపమైనది కావాలి) స్వామీ! కర్మవశంచేత నేను మాటలాడేవి అసంగతమైన మాటలు అయినా, అవి అన్నీ మీ నామసంకీర్తనాలుగా కావాలి. భగవన్! కర్మపరతంత్రుడనైన నా నాశరీరానికి చెందిన పనులన్నీ దేవరవారి విషయంలో ప్రణామరూపాలుగా కావాలి. ఈ విధంగా నాకు చెందిన వ్యాపారాలు అన్నీ మీ విషయంలో ప్రీతితో చేసే వ్యాపారాలుగా కావాలి (ఆ విధంగా నన్ను మీరు అనుగ్రహించాలి).

**11. అపగతమదమానై రంతిమోపాయనిష్ఠైః**
**అధిగతపరమార్థై రర్థకామానపేక్షైః ।**
**నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః**
**వరవరమునిభృత్యై రస్తు మే నిత్యయోగః ॥**

ఇంతకాలంగా దుష్టులతో సహవాసాన్ని చేసిన నాకు కోయిలణ్ణన్ మొదలైన శ్రీవరవరముని భృత్యులతో నిత్యసంశ్లేషం కలగాలి ఆ వరవరముని భృత్యులు ఎటువంటి రారు? అంటే – గర్వం అహంకారం మొదలైన దోషాలు ఏవీ లేనివారు. భాగవతాభి మానమనే చరమోపాయనిష్ఠను కలవారు. పరమపురుషార్థం భాగవత కైంకర్యమే – అనే విషయాన్ని చక్కగా అర్థం చేసికొని, అనుష్ఠించినవారు. అర్థకామాలను అపేక్షించని వారు. (అంటే – వేఱొక ఉపాయాన్ని, వేఱొక ఉపేయాన్ని అపేక్షించనివారు) అను కూలంగా ఉండేవారు – ప్రతికూలంగా ఉండేవారు – మధ్యస్థులు అనే భేదం లేకుండా అందఱి మంచిని కోరేవారు. క్రోధాన్ని, లోభాన్ని ఇంకా అటువంటి మనోదోషాలను లేనివారు.

**12. ఇతి స్తుతినిబంధేన సూచితస్వమనీషితాన్ ।**
**భృత్యాన్ ప్రేమార్ద్రయా దృష్ట్యా సించంతం చింతయామి తమ్ ॥**

ఈవిధంగా (5వ శ్లోకం నుండి 11వ శ్లోకం వరకు గల ఆఱు శ్లోకాలలో) విన్నవించిన రీతలో శ్రీవరవరమునుల విషయంగా ఉండే ఈ స్తుతిరూపప్రబంధం ద్వారా తమ తమ పురుషార్థాలను వ్యక్తం చేసిన కోయిలణ్ణన్ మొదలైన శిష్యులను ప్రీతితో చల్లగా కటాక్షిస్తూ, వారిని ఆహ్లాదపఱచే ఆ వరవరమునులను సదా ధ్యానిస్తున్నాను.

**13. అథ భృత్యా ననుజ్ఞాప్య కృత్వా చేత శ్శుభాశ్రయే ।**
**శయనీయం పరిష్కృత్య శయానం సంస్మరామి తమ్ ॥**

పూర్వం తెల్పిన రీతిలో శిష్యులకు తత్త్వార్థాలను బోధించడం ద్వారా రాత్రి రెండు జాముల పొద్దువరకు గడపి, ఆ తరువాత తమ శిష్యులకు అనుజ్ఞ ఇచ్చి, తమ మనస్సును శుభాశ్రయ మనబడే భగవానుని దివ్యమంగళ విగ్రహరూపంలో లగ్నం చేసి, తాము అంతవరకు కూర్చున్న, యోగానికి తగిన ఆసనంనుండి లేచి, శయనాన్ని చేరి, దానికి ఒక అలంకారం అనేరీతిలో అందులో శయనించి ఉండే వరవరమునులను ధ్యానిస్తున్నాను.

**14. దినచర్యా మిమాం దివ్యాం రమ్యజామాతృయోగినః ।**
**భక్త్యా నిత్య మనుధ్యాయన్ ప్రాప్నోతి పరమం పదమ్ ॥**

పూర్వదినచర్యలోని **"పరేద్యుః పశ్చిమే యామే"** అనే శ్లోకం నుండి ఆరంభించి ఉత్తరదినచర్యలోని **"శయానం సంస్మరామి తమ్"** అనే శ్లోకం వరకు తెలుపబడినది, దివ్యమైనది, శుద్ధసత్త్వస్వరూపులైన శ్రీవరవరమునుల అనుష్ఠానరూపమైనది అయిన ఈ దినచర్యా స్తుతిని ప్రతిదినం భక్తితో అనుసంధించేవాడు ఈ దేహావసానంలో పరమపదాన్ని పొందుతున్నాడు.

## అనుబంధం

ఉత్తరదినచర్యాస్తోత్రంలోని శ్లోకాలనుగూర్చి కొంత తేడా ముద్రితగ్రంథాల్లో కన్పిస్తున్నది. కొన్నిటిలో ఈ స్తుతి **"ఇతి యతికులధుర్యమ్"** అనే శ్లోకంలో ప్రారంభం కాగా, మఱికొన్ని ముద్రణలలో **"అథ గోష్ఠీమ్"** అనే శ్లోకంతో ఆరంభం అయింది. అణ్ణావప్పఙ్గార్ వ్యాఖ్యలో, కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివ్యాఖ్యలో రెండవ క్రమమే గోచరిస్తున్నది. **"యా యా వృత్తి ర్మనసి"** అనే శ్లోకం తర్వాత కొన్ని ప్రచురణలలో **"యదనుచరవిధేయైః"** అనే శ్లోకం మధ్యలో ఉన్నది. దీని తర్వాత **"అపగతమదమానై"** అనే శ్లోకం ఉన్నది. ఈ క్రమాన్నిబట్టి ఉత్తరదినచర్యలో మొత్తం 14శ్లోకాలు

కన్పిస్తున్నవి. **"యదనుచర"** ఇత్యాదిశ్లోకాన్ని అణ్ణావప్పఙ్గార్ గాని, కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు కాని వ్యాఖ్యానించలేదు. మరికొన్ని ముద్రిత గ్రంథాల్లో కూడా ఇది కన్పించడం లేదు. చాలా ప్రచురణలలో **"దినచర్యా మిమామ్"** అనే శ్లోకంతో ఉత్తరదినచర్య పూర్తికాగా, కొన్ని వ్యాఖ్యానాలలో **"ప్రపద్యే పదపద్మాని"** అనే శ్లోకం చివరిగా ఉండడం ఒక విశేషం. సుమారు 80-90 సం॥లక్రితం చెన్నైనగరంలో ఆనందాప్రెస్‌లో ముద్రింపబడ్డ స్తోత్రార్ణవగ్రంథం 3వ సంపుటంలో ఉత్తరదినచర్యా స్తోత్రంలో **"దినచర్యా"** అనే శ్లోకం తర్వాత **"సంపత్స్వరూపానుగుణైవ", "యన్మూలమ్", "శ్రీమద్రంగమ్"** అనే వరవరమునులకు చెందిన నాల్గు శ్లోకాలతోపాటు, **"న చేత్ రామానుజేత్యేషా", "పుణ్యాంభోజ", "తృణీకృత"** ఇత్యాది భగవద్రామానుజులకు చెందిన మూడు ముక్తకాలు కూడా చేర్చి ముద్రింపబడ్డాయి. అంటే, ఉత్తరదినచర్యా స్తోత్రం 21 శ్లోకాలతో ముద్రింపబడింది. అంతేకాక, మఱికొన్ని ప్రచురణలలో **"యదవతరణ మూలమ్"** అనే శ్లోకంకూడా **"యన్మూలమ్"** అనే శ్లోకానికి ముందు ఉన్నది. వీటిలో **"యన్మూలమ్", "యదవతరణమూలమ్", "శ్రీమద్రంగమ్"** అనే మూడు ఎఱుమ్బి యప్పా ప్రణీతమైన వరవరమునిశతకంలో కన్పిస్తున్నాయి. ఈ శ్లోకాలు, ఉత్తారదినచర్యా స్తోత్రం ఏకకర్తృకాలు కాబట్టి ఇవి ఉత్తర దినచర్యకు అనుబంధంగా తరువాతి కాలంలో చేర్చబడి ఉండవచ్చునేమోనని తోస్తుంది. శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యస్వామివారి శ్రీవైష్ణవస్తోత్రమాలలో **"యదవతరణమూలమ్"** అనే శ్లోకం తప్ప మిగిలిన ఏడు నిత్యానుసంధేయ శ్లోకవిశేషాలుగా చూపబడ్డాయి. **"యదనుచరవిధేయైః"**. అనే శ్లోకం ఎక్కడిదో స్పష్టపడలేదు. ప్రస్తుతం పైన తెలిపిన రీతిలో అధికంగా కన్పిస్తున్న ఎనిమిది శ్లోకాలు వాని తాత్పర్యాలతో పాటు అనుబంధంగా ప్రచురింపబడుతున్నాయి. పెద్దలను, సహృదయులైన పాఠకులను గమనించ గోరుతున్నాను. ఇవన్నీ వాస్తవానికి ఉత్తరదినచర్యాస్తోత్రంలో అంతర్భవించక పోయినా, కొన్ని వరవరమునులను, మఱికొన్ని భగవద్రామానుజులను స్తుతించేవి కాబట్టి ప్రపన్నులకు నిత్యానుసంధేయాలే కదా!

**యదనుచరవిధేయై ర్జాతు దృష్టోఽపి తస్మిన్**
**రుచిరవరమునీంద్రే రూఢభావో భవేయమ్ ।**
**దృఢతర మతియాతో దుస్త్యజా నర్థకామాన్**
**జనిజలధిగతానాం జాయతే కర్ణధారః ॥**

శ్రీవరవరమునుల భక్తులచేత ఒకసారి కటాక్షింపబడినవాడను అయితే, ఆ వరవరమునులపట్ల స్థిరమైన భక్తిని కలవాడను కాగలను. విడచిపెట్టడానికి వీలుకాని అర్థకామాలను దృఢంగా వదలిపెట్టినవాడు జన్మసముద్రంలో మునిగి ఉన్నవారిని ఒడ్డుకు చేర్చే ఓడ చుక్కానిని నడిపేవాడుకాగలడు.

## నిత్యానుసంధేయ శ్లోకాః

1. **ప్రపద్యే పదపద్మాని పరమప్రేమసంపదామ్ ।**
   **సౌమ్యజామాతృయోగీంద్ర చరణైకజుషాం సతామ్ ॥**

శ్రీవరవరమునుల శ్రీపాదాలను మాత్రమే ఉపాయోపేయాలుగా నిశ్చయించుకొని ఆరాధించేవారు, ఆ ఆచార్యవర్యులపట్ల పరమభక్తిని కలవారైన సత్పురుషుల పాద పద్మాలను ఆశ్రయిస్తున్నాను.

2. **సంపత్స్వరూపానుగుణైవ యస్మిన్**
   **సర్వోత్సవో యత్ర మనఃప్రసాదః ।**

**సద్భి స్సమం దైవతమేవ దేశం**
**ప్రాప్తం ప్రపద్యే భవదంఘ్రిమూలమ్ ॥**

ఓ వరవరమునీ! ఎవరి విషయంలో (కైంకర్యరూప) సంపద స్వరూపానికి తగినదో, ఎవరి విషయంలో కల్గిన మనఃప్రసాదం (వారే ఉపాయోపేయాలు అనే స్వచ్ఛమైన, నిలకడ అయిన నిశ్చయం) గొప్పదో, అటువంటి దివ్యమైన, ప్రాప్తమైన తమ పాదారవింద సన్నిధిని పెద్దలతోపాటు (వారి పురుషకారపూర్వకంగా) ఆశ్రయిస్తున్నాను.

**3. యన్మూల మాశ్వయుజమాస్యవతారమూలం**
**కాంతోపయంతృయమినః కరుణైకసింధోః ।**
**ఆసీదసత్సు గణితస్య మమాపి సత్తా**
**మూలం తదేవ జగదభ్యుదయైకమూలమ్ ॥**

దయాసముద్రులైన శ్రీమద్వరవరమునుల అవతారానికి మూలం అయిన ఆశ్వయుజ మాసంలోని మూలానక్షత్రం లోకశ్రేయస్సుకు అంతటికి మూలం అయింది. అసత్పురుషుల్లో ఒకడుగా ఇంతకాలం లెక్కింపబడ్డ నేనుకూడా సత్తను పొందడానికి అది మూలం అయింది.

**4. శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానం**
**భూమా తస్మిన్ భవతు కుశలీ కోఽపి భూమాసహాయః ।**
**దివ్యం తస్మై దిశతు విభవం దేశికో దేశికానాం**
**కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని ॥**

గొప్ప దివ్యక్షేత్రం, తేజస్సుకు స్థానం అయిన శ్రీరంగక్షేత్రం వర్ధిల్లుగాక! ఆ క్షేత్రంలో భూదేవి, లక్ష్మీదేవులలో కలసి అధివసించి ఉండే సర్వోత్కృష్టుడైన శ్రీరంగనాథుడు కుశలంగా ఉండుగాక! ఆచార్యులందఱికీ దేశికులయిన వరవర మునులు నిత్యం శుభాలను కలుగజేసేవారై శ్రీరంగనాథునకు దివ్యమైన వైభవాన్ని కల్గింతురుగాక!

**5. న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ!**
**కా మవస్థాం ప్రపద్యంతే జంతవో హంత! మాదృశః ॥**

మనలను రక్షించడంలో సమర్థవంతం అయిన **"రామానుజ"** అనే అయిన నాల్గు అక్షరాలను కల ఈ మంత్రమే లేకపోతే మనవంటి ప్రాణులు ఏ గతిని పొందేవారోకదా! అయ్యో!

**6. పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ ।**
**శ్రీమానావిరభూ ద్భూమౌ రామానుజదివాకరః ॥**

సత్పురుషులనే పద్మాలు వికసించడంకోసం, పాపులు అనే చీకటి తొలగడంకోసం శ్రీమద్రామానుజులు అనే సూర్యుడు భూమిలో అవతరించారు.

**7. తృణీకృతవిరించాది నిరంకుశవిభూతయః ।**
**రామానుజపదాంభోజ సమాశ్రయణశాలినః ॥**

భగవద్రామానుజుల పదపద్మాలను ఆశ్రయించినవారు బ్రహ్మ మొదలైనదేవతల యొక్క నిరంకుశం అయిన అధికారాన్నిసైతం తృణీకరిస్తారు.



# శెయ్యతామరైత్తాళిణై పాశుర వ్యాఖ్యానమ్

## ఉపోద్ఘాతము

"శెయ్యతామరై" పాశుర వ్యాఖ్యానమునుగూర్చి, దానికి మూలమగు వాழ்த்திతిరునామమునుగూర్చి కొంచెము విన్నపింపబడుచున్నది. ఈపాశురమును అణ్ణన్ ఏసందర్భమున రచించిరనునది స్పష్టముగా తెలియుటలేదు. కాని ఇది **"ఆశారియన్ శిచ్చనారుయిరై ప్పేణుమవన్, తేశారుమ్ శిచ్చ నవన్ శీర్వడివై "** అను ఉపదేశరత్తినమాలై లోని పాశురార్థమునకు లక్ష్యముగా వెలుగొందుచున్నది. మణవాళమహామునులు పరమపదించిన సందర్భమున ఈపాశురమును వారి శిష్యులు అనుసంధించిరని యతీంద్రప్రవణప్రభావమున కానవచ్చుటచే , ప్రాయశః ఈరచన మణవాళమహామునులు జీవించియుండగానే జరిగినదని చెప్పవచ్చును. కొన్ని నిత్యానుసంధాన శ్రీకోశములలో ఈ వాழ்த்திతిరునామము చోటు చేసికొనకున్నను, ఉత్తరశాంతి (శాత్తుముఱై) సందర్భమున శ్రీవైష్ణవుల గృహములలో, విష్ణ్వాలయములలో ఈపాశురము అనుసంధింపబడుటవలన దీనికిగల ఆదరము, ప్రచారమును ఎట్టిదో తెలియుచున్నది. ఈ పాశురముపిమ్మట అనుసంధింపబడు **"అడియార్గళ్ వాழ"**ఇత్యాది పాశురము కొన్ని నిత్యానుసంధాన కోశములలో **"మదత్తు ప్పిళ్ళై"** సాయించినట్లుండుటచే, ప్రస్తుతవాழ்த்தி తిరునామమును కూడ మదత్తుప్పిళ్ళైయే సాయించిరని కొందరు అభిప్రాయపడుచున్నను, అణ్ణన్ రచనగానే ఈ వాழ்த்தி తిరునామము సంప్రదాయమున ప్రసిద్ధిచెందుటచే తత్కర్తృకముగా పరిగణించుటయే భావ్యము.

ఇందు మణవాళమహామునుల దివ్యమంగళరూపము పాదములు మొదలు, నేత్రములవరకు స్తుతింపబడినది. అందుచే దివ్యుల రూపవర్ణనమును పాదాదికేశాంతము చేయవలెనను కవి సమయమిందు పాటింపబడినది. ఈ వాழ்த்திతిరునామమునకు, మణవాళమహామునులు రామానుజులను గూర్చి సాయించిన **"శీరారుమ్ ఎతిరాశర్ తిరువడిగళ్ వాழ்த்தியే"**అను వాழ்த்தி తిరునామమునకు గల అర్థసామ్యము మిగుల స్మరణీయము, రమణీయమును.

శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ కర్తృకముగా చెప్పబడు ప్రస్తుతవ్యాఖ్యానము ఇంతవరకును తెలుగు లిపిలో గాని, తెలుగు భాషలో అనువదింపబడిగాని ప్రచురింపబడలేదు. మద్రాస్ ప్రభుత్వమువారి హస్తలిఖిత గ్రంథాలయములో ఆర్. 354 వ నంబరు గల తాళపత్రగ్రంథప్రతినిబట్టి మద్రాస్, తిరువల్లిక్కేణినుండి ఉ.వే. శ్రీమాన్ యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి సంపాదకత్వమున తమిళభాషలో వెలువడు **"గీతాచార్యన్"** అను శ్రీవైష్ణవమాసపత్రికలో మొదటగా కొంతకాలము క్రితము మూలము మాత్రము ప్రచురించబడినది. రెండవమారుగా 1996 వ సంవత్సరమున **" తిరుక్కడల్ మల్లై"** (మహాబలిపురము) దివ్యదేవములోని ఆలయ పునరుద్ధరణ సందర్భమున పిళ్ళై లోకంజీయర్ట్రస్టు వారు ప్రచురించిన **"కడల్ మల్లైక్కరుమ్బు"**అను స్మారకసంచికలో మూలముతో పాటు, సరళమైన తమిళవివరణమును ప్రచురింపబడినది. తమిళవివరణమును డా. ఉ.వే. శ్రీమాన్ యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి (గీతాచార్యమాస పత్రికాసంపాదకులు) చేసిరి.

డా. యమ్.ఎ. వేంకటకృష్ణన్ స్వామి ఈ వ్యాఖ్యాన కర్తృత్వమును గూర్చి ఇట్లు అభిప్రాయపడిరి– "ఈ వ్యాఖ్యానమును ఎవరు రచించిరి అను అంశము స్పష్టము కాకున్నను, శైలిని బట్టి ఈ వ్యాఖ్య పిళ్ళైలోకం జీయర్చే రచింపబడినట్లు చెప్పవచ్చును. నాలాయిరదివ్య ప్రబంధ తనియన్లకు, ఇయల్శాற்றுకు, మణవాళమహామునుల గ్రంథములకు అన్నిటికిని వ్యాఖ్యను రచించిన పిళ్ళైలోకంజీయరే ఈ రచనను చేసిరని చెప్పుట యుక్తమని తోచును. అంతియేకాక, ఉ.వే. శ్రీమాన్ తిరునాంగూర్ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు **"పట్టోలై"** అను గ్రంథమును ప్రచురించిరి. ఆగ్రంథము వారి ఇంటిలోగల తాళ పత్ర గ్రంథప్రతిని బట్టి ప్రచురింపబడినది. అందు ఈ వ్యాఖ్యానముయొక్క ప్రసక్తి కలదని వారు తెలిపిరి. ఆ గ్రంథమున పూర్వాచార్యుల

నామములు, వారు రచించిన గ్రంథములపేర్ల వివరములును కలవు. వానిలోని వివరములనుబట్టికూడ ప్రస్తుత వ్యాఖ్యానమును పిళ్లైలోకంజీయర్ రచించినట్లు తెలియుచున్నది. అందువలన ఈ వ్యాఖ్యాకర్త పిళ్లై లోకంజీయరే అని భావించుటకు ఎక్కువ అవకాశముకలదు."

ఇందు అణ్ణరాయ చక్రవర్తికి, కూరత్తాழ்వాన్‌కు (పల్లవరాయలకు ?) సంబంధించిన ఐతిహ్యములు ఉట్టంకింపబడినవి. వానిలో అణ్ణరాయ చక్రవర్తి ఐతిహ్యము యతీంద్ర ప్రవణ ప్రభావమున, ఆచార్యసూక్తిముక్తావళి అను తెలుగు కావ్యమున కన్పించుచున్నది అణ్ణన్ రచించిన మణవాళమహామునుల స్తుతిపరమగు **"పాదాదికేశమాలై"**లోని పలుపాశురములు ఇందు ఉట్టంకింపబడినవి. దివ్యప్రబంధ పాశురములు సమయోచితముగా ఉదహరింపబడుట వ్యాఖ్యాతయొక్క గాఢమైన దివ్యప్రబంధార్థావగాహనమును నిరూపించుచున్నది. వ్యాఖ్యానము ఇంచు మించుగా పూర్ణము. చివరలో **"ఇవర్ పల్లవరాయరుక్కే"** అనుచోటమాత్రము వ్యాఖ్య కొంచెము అసంపూర్ణముగా తోచుచున్నది. అయినను అర్థపూర్తికి ఇది కొఱతను కల్గింపదు.

యతీంద్ర ప్రవణప్రభావమున, ఆచార్యముక్తి ముక్తావళిలో శ్రీమణవాళమహామునులు సన్న్యసించిన పిమ్మట తమకు తురీయాశ్రమమును అనుగ్రహించిన శఠకోపజీయర్ ఆజ్ఞానుసారము పల్లవరాయని మఠమున కొన్నాళ్ళు నివసించిరని కలదు. వ్యాఖ్యానమున ఉట్టంకింపబడిన పల్లవరాయ వృత్తాంతము ఇదియే అగునా? కాదా? అనుట స్పష్టముగా తెలియుటలేదు.

రస్యమైన ఈ వ్యాఖ్యానము పలుతావుల తిరువాయ్ మొழி ఈడు వ్యాఖ్యానమును తలపించును. **"కాల్ వాశియిలే నిల్లామల్ అరైవాశి తేడుమవతిరే"**, **"కణ్ కాణ కైవిట్టార్"**, **"ఇవర్ కణ్ణితే ఎల్లార్‌క్కుమ్ కళైకణ్"** వంటి పలు చాటూక్తులు ఇందు కన్పించుచున్నవి. పలుచోట్ల యోజనాంతరములు చూపబడినవి. వ్యాఖ్యానమున పలుచోట్ల మణవాళమహామునులకు సర్వేశ్వరునకు మధ్యగల సామ్యముతోపాటు, మణవాళమహామునుల ఆధిక్యముకూడ నిరూపింపబడినది. **"అమ్మావొరుత్తి క్కిడముడైత్తాయాయ్‌త్తు అమ్మార్బు , ఇమ్మార్బు ఇరువర్‌క్కుమ్ ఇడైముడైత్తా యిరుక్కుమ్ "** మొదలగునవి ఇందులకు ఉదాహరణములు. ఈసందర్భమున అణ్ణన్ రచించిన వరవరమునిశతకములో భగవానుని అవతారములకు, మణవాళమహామునులకు మధ్యగల సాదృశ్యము నిరూపింపబడుట స్మరింపతగినది.

ఈ వ్యాఖ్యానమున ఉదాహరింపబడిన ప్రమాణముల ఆకరములు లభించినంత వరకు చూపబడినవి. తమిళప్రచురణములో ఆకరము చూపబడని మరికొన్ని ప్రమాణములకును ఇందు ఆకరములు చూపబడినవి. **"వన్దరుళి"**, **"ఎన్నై ఎడుత్త"** ఇత్యాదులట్టివి.

పరమభోగ్యమైన ఈ వ్యాఖ్యానము మూలముతో పాటు, దీని ఆంధ్రానువాదమును ప్రచురించి భాగవతలోకమునకు సేవచేయవలెనను పేరాశయే నన్ను ఈ సాహసమునకు పురికొల్పినది. వస్తువుకాని నన్ను పరమకృపతో అనుగ్రహిచిన ఆచార్యులు,పితామహపాదులు, కీర్తిమూర్తులు ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణిశేషశింగరాచార్యస్వామి వారి సన్నిధిలో, వాత్సల్యముతో కాలక్షేపమును కృపచేయుటయేకాక,అడుగడుగున దాసుని ప్రోత్సహించుచు, తగుసూచనలను అనుగ్రహించుచున్న పితృపాదులు ఉ.వే. శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్, ఈయుణ్ణిరంగాచార్యస్వామివారి సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకముగా అంజలిని ఘటించుచున్నాను. శ్రీయతీంద్రప్రవణకైంకర్యసభ, హైదరాబాదు వారు మిక్కిలి అభిమానముతో అందించిన పవిత్రద్రవ్యముతో ఈ గ్రంథముద్రణ 2005వ సంవత్సరంలో చేయబడి ఇప్పుడు మరల ముద్రింపబడుచున్నది.



శ్రీమతే రామానుజాయ నమ:

శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన

# శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానమ్

**శెయ్యతామరైత్తాళిణై వాళ్ళియే శేలై వాళ్ళి తిరునాబి వాళ్ళియే ।**
**తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాళ్ళియే శున్దరత్తిరుత్తోళిణై వాళ్ళియే ।**
**కైయుమేన్దియ ముక్కోలుమ్ వాళ్ళియే కరుణైపొఙ్గియ కణ్ణిణై వాళ్ళియే ।**
**పొయ్యిలాద మణవాళమాముని పుంది వాళ్ళి పుకళ్ వాళ్ళి వాళ్ళియే ।**

**శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమ: ।**
**యత్స్మృతి: సర్వసిద్ధీనా మంతరాయనివారిణీ ॥**

“[1]శ్రీశైలేశదయాపాత్ర” మెన్ఱు తొడఙ్గి అరుళిచ్చెయ్ద సేనైముదలియార్‌నాయనార్ జీయరుడైయ కల్యాణగుణఙ్గళిలే తోర్ఱి అడిమైపుక్కపడియై ప్రకాశిక్కిప్పిఱారాయ్– నిన్ఱార్. అవర్‌తమ్మడియరాన ఇవరుమ్ అగ్గుణఙ్గళుక్కుమ్, సౌన్దర్యాదికళుక్కుమ్ ఆశ్రయమాన దివ్యమఙ్గళవిగ్రహత్తిలే ఈడుపట్టు, పాదాదికేశాంతమాక అనుభవిత్తు,తమ్ముడైయ పరివిన్ మికుతియాలే మఙ్గళాశాసనమ్

---

## శెయ్యతామరైత్తాళిణైవ్యాఖ్యానము - ఆంధ్రానువాదము

**శెయ్యతామరైత్తాళిణై వాళ్ళియే శేలై వాళ్ళి తిరునాబి వాళ్ళియే ।**
**తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాళ్ళియే శున్దరత్తిరుత్తోళిణై వాళ్ళియే ।**
**కైయుమేన్దియ ముక్కోలుమ్ వాళ్ళియే కరుణైపొఙ్గియ కణ్ణిణై వాళ్ళియే ।**
**పొయ్యిలాద మణవాళమాముని పుంది వాళ్ళి పుకళ్ వాళ్ళి వాళ్ళియే ।**

**శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమః ।**
**యత్స్మృతిః సర్వసిద్ధీనా మంతరాయనివారిణీ ॥**

ఎవరి స్మరణము సకలకార్యసిద్ధులలో కలుగు ఆటంకములను నివారించునో అట్టి, కైంకర్యలక్ష్మిని కల్గిన శ్రీరమ్యజామాతృమునికి నమస్కారమును చేయుచున్నాను.

శ్రీరంగమున ఒక సంవత్సరకాలముపాటు శ్రీరంగనాథుడు శ్రీమణవాళమహాము నులవలన భగవద్విషయము – ఈడు అను తిరువాయ్‌మొళ్ళి దివ్యప్రబంధ వ్యాఖ్యానమును ఆలకించెను. పిమ్మట శ్రీరంగనాథుడు శ్రీమణవాళమహామునుల శుభగుణములచే ఆకర్షింపబడినవాడై, వారికి శిష్యుడయ్యెను. శిష్యకృత్యముగా రంగనాథ స్వామి శ్రీమణవాళమహామునుల వైభవమును కీర్తించుచు **“శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్”** అను శ్లోకమును చివరిదినమున సభలో విజ్ఞాపన చేసెను. ఆ విధముగానే శ్రీమణవాళమహామునుల శిష్యులలో ఒకరు అగు శ్రీప్రతివాదిభయంకరం అణ్ణన్ అను ఆచార్యులు వారి (మణవాళమహామునుల) గుణములకు జితులై, ధీభక్త్యాదిగుణములకును, సౌందర్యాదులకును ఆశ్రయమగు దివ్యమంగళరూపమున మిక్కిలి అభినివేశమును కల్గినవారై, ఆ రూపమును పాదాదికేశాంతముగా సేవించి, ఆ రూపమునకు ఎట్టి లోపము కలుగరాదను అతిశయించిన భక్తి భావముతో మంగళాశాసనమును ఒక పాశుర రూపమున అనుగ్రహించిరి. ఆ పాశురమే **“శెయ్యతామరై త్తాళిణై”** అని ప్రారంభమగు పాశురము. కావుననే వీరికి (ప్రతివాది

---

1. మణవాళమహాముని ప్రార్థనాశ్లోకము (ముక్తకము)

పణ్ణినపడియై అద్దైవే అరుళిచ్చెయ్‌కిఱార్ ఇతిల్. "[2]శెయ్యతామరై పాడిన శీరణ్ణన్"ఎన్ఱిరే ఇవర్క్కు నిరూపకమ్. ఇప్పడి మఙ్గళాశాసనమ్ పణ్ణుకిఅవర్ తమ్ముడైయ శేషత్వానుగుణమాక "[3]ఉన్ పొన్నడి వాళ్గ" ఎన్నుమాపోలే "[4]పొన్నడియామ్ శెఙ్గమలప్పోదుకళుక్కు" మున్దుఱ మఙ్గళాశాసనమ్ పణ్ణుకైయిలే ప్రవృత్తరాకిఱార్.

**(శెయ్యతామరై త్తాళిణై వాళ్గియే)** ప్రజై ములైయిలే వాయ్‌వైక్కుమ్ "[5]నాణ్‌మలరామ్ అడిత్తామరై" ఇవైయాయ్‌ఱ్ఱు. "[6]ఉన్ ఇణైత్తామరైకట్కు అన్బురుకి నిఱ్కుమదు" ఎన్గిఅపడియే ఇదువుమ్ స్వరూపమాయిరుక్కుమ్. "[7]ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి యేఱ్ఱి వాళ్త్తు"కైయితే నిలైనిన్ఱ స్వరూపమ్.

(శెయ్యతామరై త్తాళిణై వాళ్గియే) – ఇవర్ "[8]అడియై త్తొడరుమ్పడి" రాగసౌమనస్యపదసౌభాగ్యజ్గళ్ ఉణ్డాయిఱ్ఱు. అదావదు, అళ్గుకియదాయ్, శివన్ద శెవ్వి త్తామరైప్పూప్పోలే దర్శనీయముమాయ్, భోగ్యముమాయ్,తామరైప్పూవై నిఱైత్తువైత్తాప్పోలే

---

భయంకరం అణ్ణన్‌కు) **"శెయ్యతామరై పాడిన శీరణ్ణన్" (శెయ్యతామరై** అను మణవాళమహామునుల మంగళాశాసనమును పాడిన కైంకర్యసమృద్ధిని కల్గిన అణ్ణన్) అను పేరు ప్రసిద్ధి చెందినది. వీరు ఇట్లు చేయు మంగళాశాసనమును తమ శేషత్వమను స్వరూపమునకు అనుగుణముగా పాదములనుండి ప్రారంభించుచున్నారు. **"ఉన్ పొన్నడి వాళ్గ"** అని పెరియాళ్వార్లు భగవానుని సువర్ణపాదములకు మంగళమును పాడినట్లు, అణ్ణన్ **"పొన్నడియామ్ శెఙ్గమలప్పోదు"** (బంగారమువలె స్పృహణీయములైన – అందమైనవగు ఎఱ్ఱని కమలముల జంట) అని ప్రసిద్ధి చెందిన శ్రీమణవాళమహామునుల పాదపద్మములకు మంగళమును ముందుగా పల్కుచున్నారు.

**(శెయ్యతామరైత్తాళిణై వాళ్గియే)** – శిశువు తల్లి స్తన్యమును సహజముగా ధారకముగా తలచి, నోటిలో పెట్టుకొనునట్లే, వీరును (అణ్ణన్) **"నాణ్‌మలరామ్ అడిత్తామరై"** అనునట్లు అపుడే వికసించిన పూవువలె సుకుమారములైన మణవాళ మహామునుల పాదపద్మములను ధారకముగా తలచి, వానిని స్తుతించుచున్నారు. (**"వాయ్‌వైక్కుమ్"** అను తమిళ ప్రయోగము శ్లిష్టము. నోటిలో పెట్టుకొనుట, స్తుతించుట అను రెండర్థములు ఈ ప్రయోగము వలన స్ఫురించును). **"ఉన్ ఇణైత్తామరైకట్కు అన్బురుకి నిఱ్కుమదు"** (నీ చరణారవింద యుగము నందు ప్రేమ (భక్తి) వలన ద్రవించి నిలచుట అనునది) అను విధముగా భగవానుని పాదముల విషయము నిరవధికమైన ప్రేమను కల్గియుండుట ప్రపన్నుని స్వరూపమగునట్లే, ఆచార్యుల చరణములయందు ప్రేమను కల్గి, వానికి మంగళమును పాడుటయు ప్రపన్నుని స్వరూపములోనికి చేరును. **"ఇన్బుఱుమ్ తొణ్డర్‌శేవడి యేఱ్ఱివాళ్త్తుమ్"** (భగవానుని నామమును కీర్తించి, నిరతిశయమైన ఆనందమును పొందు భక్తుల అందమైన పాదములను స్తుతించి, మంగళమును నా మనస్సు పాడును) అని కులశేఖరులు పల్కిన విధముగా భగవత్ భక్తులకు మంగళమును ఆశాసించుటయే కదా స్థిరమైన స్వరూపము (అనగా చరమపర్వము).

(శెయ్యతామరై త్తాళిణై వాళ్గియే) **"శెయ్య"** అనుటకు ఎఱ్ఱని, అందమైన, గొప్ప మొదలగు పలు అర్థములు కలవు. **"ఇణై"** అను పదము ద్వంద్వ వాచకమగుటచే సారూప్యమును తెలుపును. **"తామరై"** అనుటచే భోగ్యత, సౌమనస్యములు తెలుపబడినవి. **"తాళ్"** అను పదము చరణమును బోధించునది అగుటచే ఉపాయమగుటను తెలుపును. కావున **"శెయ్య తామరైత్తాళిణై వాళ్గియే"** అనుటకు అందమైన ఎఱ్ఱని రంగును కల్గిన, చక్కగా పూచిన తామరపూల జంటవలె చూడతగినదియై, భోగ్యములై, పరస్పర సాదృశ్యమువలన ఏర్పడిన సౌందర్యమును కల్గినదియై, ఉపాయపూర్తిని కల్గిన పాదద్వంద్వమని తాత్పర్యము.

---

2. ప్రతివాదిభయంకరం అణ్ణన్‌వాళ్గిత్తిరునామము
3. పెరియాళ్వార్‌తిరుమొళ్గి 5.2.8
4. ఉపదేశరత్తినమాలై
5. తిరువాయ్‌మొళ్గి –3.3.9
6. తిరువాయ్‌మొళ్గి 7.1.10
7. పెరుమాళ్‌తిరుమొళ్గి 2.4.5
8. ఇరామానుశనూఱ్ఱన్దాది.63

శేర్త్తియమ్లక్కైయుమ్ ఉణ్డైత్తాయ్, ఉపాయపూర్త్తియైయుమ్ ఉడైత్తాయ్త్తు త్తిరువడిగళిరుప్పదు. "[9]ఉన్మీలత్పద్మగర్భే" త్యాది."[10]పోదచ్చివన్దు పరిమళమ్ వీశి, పుదుక్కణిత్త శీదక్కమలత్తై నీరేఅ వాట్టి" ఎన్ఱుమ్, "[11]శీరారుమ్ శెఙ్గమలత్తిరువడిగళ్ వాళ్రియే"ఎన్ఱుమితే అడియతిలివార్ వార్తై. ఇప్పడి ఇదినుడైయ సౌన్దర్యత్తైయుమ్, భోగ్యతాప్రకర్షత్తైయుమ్ అనుభవిత్త ఇవర్ మఙ్గళాశాసనమ్ పణ్ణియల్లదు నిఱ్కమాట్టారే –"[12]ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు" ఎన్ఱుమాపోలే.

అన్ఱియే, "శెయ్య" ఎన్గిఱశబ్దత్తాల్ తిరువడిగళుడైయ శెవ్వియై చ్చొల్లిఱ్ఱాయ్, ఆశ్రితరళవుమ్ వన్దు శెల్లుకిఱ వాత్సల్యత్తైయుడైత్తు ఎన్గై. ఇదు అణ్ణరాయచక్రవర్త్తిక్కు ప్రత్యక్షమ్. ముదలడియిలేయితే ఎఴున్దు,రక్షిత్తు, అరుళిఱ్ఱు. "[13]వన్దరుళి ఎన్నై ఎడుత్త మలర్త్తాళ్కళ్ వాళ్రియే"ఎన్గిఱపడియే తమ్మైయుమ్ మున్దుఱ విషయీకరిత్తదు తిరువడిగళాయిఱ్ఱు. "[14]తిరుక్కమలపాదమ్

ఇట్లు కవి నమస్కరించుటకు తగిన రాగ (ఎఱ్ఱనితనము – అనురాగము), సౌమనస్య (సువాసన – మంచి హృదయము) సౌభ్రాత్రములను (సారూప్యమును, ఒకే మూలమును కల్గియుండుటను) శ్రీమణవాళమహామునుల చరణద్వంద్వము కల్గియున్నది. ఇందుల కనుగుణముగా పూర్వదినచర్య అను స్తోత్రములోని **"ఉన్మీలత్పద్మగర్భ .... దివ్యం తత్పాదయుగ్మమ్"** (వికసించిన తామరపూవుల గర్భముయొక్క ఎఱ్ఱని కాంతివంటి కాంతిని అడుగున కల్గిన దివ్యములగు మణవాళమహామునుల పాదయుగ్మము) అను మొదలగు ప్రమాణములు అనుసంధింపతగినవి. శ్రీమణవాళమహామునుల చరణములను (వాని స్వభావమును మూలమును) తెలిసినవారును **"పోదచ్చివన్దు, పరిమళమ్ వీశి, పుదుక్కణిత్త శీదక్కమలత్తై నీరేఅ వాట్టి"** (మిక్కిలి ఎఱ్ఱనిదై, పరిమళమును వెదజల్లునదియై, నూతనమై, చల్లనిదైన కమలమును జయించి) అని, **"శీరారుమ్ శెఙ్గమలత్తిరువడిగళ్ వాళ్రియే"** (సౌందర్యము నిండిన, ఎఱ్ఱని కమలములవంటి పాదములు వర్ధిల్లుగాక) అని వానియొక్క రాగమును, సౌమనస్యమును, నూతనత్వమును, సొబగును వర్ణించిరి కదా! **"ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు"** అని పెరియాళ్వార్లు భగవానుని ఎఱ్ఱని, అందమైన పాదములకు మంగళము పల్కినట్లు మామునులపాదముల సౌందర్యమును, గొప్ప భోగ్యతను దర్శించిన అణ్ణన్ వానికి మంగళాశాసనమును చేయకుండ నుండలేరు కదా!

లేక, **"శెయ్య"** అను పదమునకు ఋజుత్వమును కల్గియుండుటను తెలుపునని భావించినచో, ఆశ్రితులను అనుగ్రహించు వాత్సల్యమును పాదములు కల్గియుండుటను ఈ విశేషణము తెలుపును. ఈ ఋజుత్వము అణ్ణరాయచక్రవర్తి విషయమున అనుభూతము. (యతీంద్ర ప్రవణప్రభావమున ఈ వృత్తాంతము వర్ణింపబడినది. అణ్ణరాయచక్రవర్తి తిరుమలైనల్లాన్ వంశమునకు చెందినవారు. ఈ వంశము భగవద్రామానుజులచే అభిమానింపబడినది. అణ్ణరాయచక్రవర్తి శ్రీవైష్ణవమతప్రచారకులైయుండిరి. ఒక పర్యాయము ఆ చక్రవర్తి సకుటుంబముగా శ్రీరంగనాథుని సేవించుటకై శ్రీరంగమునకు వచ్చిరి. అప్పటికి శ్రీమణవాళ మహామునులు వార్ధకదశలో నుండిరి. అచటివారివలన ఆ మహనీయులను గూర్చి వినిన అణ్ణరాయచక్రవర్తి తల్లి, వారిని సేవింప ఆశపడెను. అణ్ణరాయ చక్రవర్తి అందఱిని పిలచుకొని శ్రీమణవాళ మహామునుల మఠమునకు పోయి, పట్టర్ పిరాన్ జీయర్ అను శిష్యుల ద్వారా, మణవాళమహామునులను చేరి, వారి పాదములకు సాష్టాంగ ప్రణామము లాచరించెను. అపుడు మణవాళ మహామునుల పాదములు తమకు తామే అణ్ణరాయ చక్రవర్తి శిరస్సును స్పృశించెను. ఇట్లు భక్తుల విషయమున మణవాళమహామునుల పాదములు చూపిన ఋజుత్వమును **'శెయ్య'** అను విశేషణము తెలుపుచున్నదని చెప్పవచ్చును). స్తుతికర్త (అగు అణ్ణన్) నుకూడ ముందుగా అనుగ్రహించినది మణవాళమహామునుల పాదములే. ఈ విషయమును వారే స్వయముగా మణవాళమహామునులనుగూర్చి తాము రచించిన వేరొక మంగళాశాసన పాశురమున **"వన్దరుళి ఎన్నై ఎడుత్త మలర్త్తాళ్గళ్ వాళ్రియే"** (నా వద్దకు వేంచేసి, నన్ను ఉద్ధరించిన, పూవువలె సుకుమారములైన పాదములు వర్ధిల్లుగాక) అనుచు తెలిపిరి కదా!

9. ఉత్తరదినచర్యా – 5
10. పాదాదికేశమాలై – 1
11. ?
12. తిరుప్పల్లాణ్డు – 1
13. మణవాళమాముని వాళ్రిత్తిరునామము
14. అమలనాదిపిరాన్ –1

వన్దు", "[15]అడియేనై అఙ్గే వన్దు తాఙ్గు తామరైయన్న పొన్నారడి"ఎన్నక్కడవదిఱే. ఇవరిప్పడి తమ్మై విషయీకరిత్త శెయ్యతామరై త్తాళ్‌కళై క్కొణ్డు "[16]శెన్నిత్తరిక్కు మళవాయిరుక్కిఱ పొఴ్కాలానదు నమ్ శెన్నిత్తిడరిలే ఏఱుమ్బడి అరుళాలే వైత్తరుళువదే" ఎన్ఱు అవఱ్ఱినుడైయ పావనత్వ–భోగత్వఙ్గళై యనుభవిత్తు, అవత్తుక్కు త్తమ్మోట్టై సమ్బన్ధత్తాలే ఓర్ అవద్యముమ్ వారాదొழிయ వేణుమ్ ఎన్ఱు మఙ్గళాశాసనమ్ పణ్ణుకిఱారాకవుమామ్. ఆకైయాల్ ఇవర్క్కు ప్రాప్యప్రాపకఙ్గళ్ ఇరణ్డుమ్ అడి తానేయాయిరుక్కై.

**(శేలై వాழ்ి)** – ఇని, ఇత్తిరువడిగళుక్కు ఇవ్వరుకు గన్తవ్యభూమి యిల్లామైయాలే (మేలే) తిరువరైయోడే శేర్న్దు, శివన్దు నిఱ్పదాన తిరుప్పరివట్టత్తిలழகిలే శెన్ఱు అచ్చేర్త్తిక్కు మఙ్గళత్తై ఆశాసిక్కిఱార్ "శేలైవాழ்ి" "ఎన్ఱు. కాల్‌వాశియిలే నిల్లానుల్ అరైవాశి తేడుమవరిఱే. "[17]తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాழ்ి" ఎన్ఱు తిరువరైయిల్ ఉడైయழகుమ్ పరభాగమాయిఱే యిరుప్పదు. చన్ద్రనై చ్చూழ்న్ద పరివేషమ్‌పోలే యాయిఱ్ఱి త్తిరువరైక్కు త్తిరుప్పరివట్టత్తోడే శేర్త్తి. "[18]సుధానిధి మివ

---

కావున ఆ వృత్తాంతమును **'శెయ్య'** అను విశేషణము తెలుపుచున్నదనవచ్చును. **"తిరుక్కమల పాదమ్ వన్దు"** (శ్రీదేవి ప్రీతితో సేవించు కమలములవంటి పాదములు వచ్చి) అను తిరుప్పాణ్ శ్రీసూక్తి, **"అడియేనై అఙ్గే వన్దు తాఙ్గు తామరైయన్న పొన్నారడి"** (అచటికి వచ్చి, భయపడవలదని పల్కి, దాసుని రక్షించిన తామరలవంటి పాదములు) అను తిరుమఙ్గైమన్నన్ సూక్తియు ఇచట స్మరింపనగును. వీరు భగవానుని విషయమున అనుసంధించిన భావమును అణ్ణన్ తమ ఆచార్యుల విషయమున ప్రకటించిరి. తమను అవ్యాజముగా అనుగ్రహించిన ఎఱ్ఱని తామరలవంటి పాదములను "నేనే స్వయముగా నా తలపై దాల్చతగిన ,అందమైన పాదములు తామే నా శిరస్సును అధిరోహించుటయా! ఇట్లు నన్ను అనుగ్రహించుటయా!" అని తలచుచు, వానియొక్క పావనత్వమును, భోగ్యత్వమును (తామరై అను పదముయొక్క స్వారస్యమును) అనుభవించి, వానికి తమ సంబంధమువలన ఎట్టి దోషము కలుగకుండవలెననుచు మంగళమును చేయుచున్నారనియు చెప్పవచ్చును. **"శెయ్య, తామరై"** అను పదములు రెండును ప్రాప్యత్వమును, చరణమను అర్థమిచ్చు **"తాళ్"** అను పదము ప్రాపకత్వమును సూచించుటచే, వీరికి ప్రాప్యప్రాపకములు రెండును శ్రీమణవాళమహామునుల పాదములే అయినవి.

**(శేలై వాழ்ి)** – శ్రీపాదములకు క్రింద దర్శింపతగినవి ఏమియు లేకుండుటచే, ఇక క్రమముగా దివ్యమంగళరూపము పైభాగములోని సొబగును కవి వర్ణించుచున్నారు. నడుమునకు తగినదియై, ఎఱ్ఱని రంగును కల్గినదైన కాషాయవస్త్రముయొక్క సౌందర్యమును దర్శించి, ఆ రెండిటియొక్క సౌసాదృశ్యమునకు మంగళమును **"శేలై వాழ்ి"** (వస్త్రము వర్ధిల్లుగాక) అనుచు అణ్ణన్ పల్కుచున్నారు. **"శేలై"** అను పదము **"చేల"** అను సంస్కృతపదముయొక్క వికృతి. వస్త్రము అని దీని అర్థము. అణ్ణన్ కేవలము పాదముల అందమును దర్శించినంతమాత్రమున తృప్తిపడువారు కాదు కదా! కావున నడుము, ఆ ప్రదేశమును అలంకరించు కాషాయాంబరముల చేరికను, దాని వలనకల్గిన శోభను దర్శించి,వానికి మంగళమును పల్కుచున్నారు. ఇచట **"కాల్‌వాశియిలే నిల్లామల్ అరైవాశి తేడుమవరిఱే"** అను తమిళ వ్యాఖ్యానసూక్తి స్వారస్యము గమనింపతగినది. **"కాల్"** అను పదమునకు పాదము అని, నాల్గవ భాగము అని, **"అరై"** అను పదమునకు నడుము అని, సగభాగము అని రెండర్థములు కలవు. కావున నాల్గవభాగమును పొందుట ద్వారా తృప్తిపడని వీరు సగభాగమును పొందుటకు వెదకుదురు కదా అను వేరొక చమత్కారమైన అర్థమిచట హృదయంగమముగా స్ఫురించుచున్నది.) **"తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వాழ்ి"** (తెల్లని నడుమున ధరించిన ఎఱ్ఱని కాషాయ వస్త్రము వర్ధిల్లుగాక) అను శ్రీరామానుజుల మంగళాశాసనసూక్తి స్మరణీయము. తెల్లని రంగు కల్గిన నడుముపై ఎఱ్ఱని కాషాయ వస్త్రమును ధరించుట వలన కల్గిన భిన్న వర్ణముల కలయిక మిక్కిలి శోభాదాయకము. తెల్లని కాంతినికల చంద్రుని చుట్టును వలయముగా చుట్టుకొనియుండు ఎఱ్ఱని పరివేషమువలె నడుమును చుట్టియున్న కాషాయవస్త్రము శోభిల్లుచున్నది.( మణవాళ మహామునుల దేహకాంతి తెల్లనిది. వారు ఆదిశేషుల అవతారము). **"సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్ర విగ్రహమ్"**

---

15. పెరియ తిరుమొழி –7.3.5
16. ఆర్తి ప్రబన్ధమ్ –30
17. శ్రీరామానుజ వాழிత్తిరునామము
18. – పూర్వదినచర్యా – 3

స్వైరస్వీకృతోదగ్రవిగ్రహమ్" ఎన్నక్కడవదిఱే."[19]ఈనమిలాద ఇళఞాయిఱారుమ్ ఎழிలుమ్ శెక్కర్వానముమొత్త తువరాడైయుమ్ "ఎన్లుమ్,"[20]ఆతామ్రవిమలామ్బరమ్"ఎన్లుమ్ అత్యాశ్చర్యమాయిఱే యిరుప్పదు. ఇత్తాల్"[21]పీతకవాడైపిరానార్ పిరమగురువాకి"వన్దమై తోற్ఱుకిఱదు.

అదుక్కుమేలే, కణ్డవర్కళై క్కాల్ తాழ పుణ్ణవఱ్ఱాన తిరునాబియழకిలే పోన్దు, అవ్వழకుక్కు ప్పోఱ్ఱి ఎన్గిఱార్ "తిరునాబి వాழி"ఎన్ఱు . తిరుప్పరియట్టత్తుడనే శేర్న్దిఱే తిరునాబి యిరుప్పదు. "[22]అన్దిపోల్ నిఱత్తాడై" ఎన్ఱ వనన్తరమ్"[23]ఉన్దిమేలదన్రో" ఎన్ఱరుళిచ్చెయ్కిఱార్. అదుదాన్ అల్లాద అవయవఙ్గళైకాట్టిల్ అழకియదాయ్ "[24]అழకాఱ్ఱిల్ తికழ் శుழி" పోలేయిఱే ఉన్దిచ్చుழி యిరుప్పదు. సౌన్దర్యసాగరమ్ ఇట్టళప్పట్టు, శుழிత్తాప్పోలే యిరుక్కిఱ ఇతినుడైయ వైలక్షణ్యమ్ కణ్డ ఇవర్క్కు వాழ்త్తి యల్లదు నిఱ్కప్పోకాదే. ఇదుదాన్ మడవార్కళ్ ఉన్దిచ్చుழிయిలే శుழలుకిఱ మనస్సై మీట్టు, తన్నిడత్తిలే అழுఙ్గాప్పదుత్తవఱ్ఱాయు మిరుక్కుమ్.

అనన్తరమ్,తిరునాబిక్కు మేలాయ్, విశాలమాయ్, సున్దరమాయిరుక్కిఱ తిరుమార్బైయుమ్, అత్తోడే శేర్న్ద తిరుయజ్ఞోపవీతత్తైయుమ్ కణ్డు కాప్పిడుకిఱార్ "తుయ్యమార్బుమ్ పురినూలుమ్" ఎన్ఱు. మార్బుక్కు త్తూయ్మైయావదు "[25]

---

(స్వయముగా) స్వీకరించిన, గొప్ప రూపమునుకల చంద్రునివలె అను పూర్వదినచర్యలోని సూక్తివలన శ్రీమణవాళమహాముసుల రూపము చంద్రుని వంటిదని తెలియుచున్నది కదా! **"ఈనమిలాద ఇళఞాయిఱారుమ్ ఎழிలుమ్ శెక్కర్ వానముమొత్త తువరాడైయుమ్"** (న్యూనతలేని, లేత్రాయముతో వెలుగొందు రమ్యమైన జఘన ప్రదేశము, ప్రకాశించు ఎఱ్ఱని ఆకాశమువలె (మేఘమువలె) నున్న కాషాయవస్త్రము), అనుచు ప్రస్తుతస్తుతికర్త మణవాళమహాముసుల విషయమున నుడివిన **"అమలనాదిపిరాన్"** అను ప్రబంధములోని సూక్తినిబట్టి, **"ఆతామ్రవిమలామ్బరమ్"** (ఎఱ్ఱని దోషరహితమైన వస్త్రమును కలవారిని) అను పూర్వదినచర్యలోని సూక్తిని బట్టియు నడుమునకు అలంకరింపబడిన వస్త్రముయొక్క శోభ మిక్కిలి ఆశ్చర్యకరముగా నుండును అని తెలియుచున్నది. దీనివలన **"పీతకవాడైపిరానార్ పిరమగురువాకి"** (పీతాంబరధారియగు ప్రభువు పరమాచార్యులై) అను పెరియాழ்వార్లు వచించినట్లు సాక్షాత్తు భగవానుడే ఈ రూపమున వచ్చినట్లు తోచును.

కాషాయాంబర శోభను వర్ణించిన పిదప, దానికి పైన ఉన్నదియు, చూచువారిని తడబడునట్లు చేయగల్గినదగు నాభీసౌందర్యమును దర్శించి, ఆ అందమునకు మంగళాశాసనమును **"తిరునాబి వాழிయే"** అనుచు కవి పల్కుచున్నారు. కాషాయవస్త్రముతో చేరి నాభియుండుటచే వెంటనే నాభిని పొగడుచున్నారు. తిరుప్పాణాழ்వార్లును అమలనాది పిరాన్ ప్రబంధమున **"అన్దిపోల్ నిఱత్తాడై"** (సంధ్య వలె ఎఱ్ఱని కాంతిని కల్గిన పీతాంబరము) అని స్తుతించిన పిమ్మట **"ఉన్దిమేలదన్రో"** (ఆ పిమ్మట నాభి) అనుచు నాభిని స్తుతించిరి కదా! నాభి మిగిలిన అవయవముల కంటే మిక్కిలి అందమైనది. **"అழకాఱ్ఱిల్ తికழ் శుழி"** (సౌందర్యప్రవాహములో వెలుగు సుడి) వలె నాభి అను సుడి కనుపించును. సౌందర్యసముద్రము ఇఱుకైన చోట బంధింపబడినచో అపుడు ఏర్పడు సుడివలెనున్న నాభిని దర్శించిన వీరు దానిని పొగడక ఉండలేరు కదా! మఱియు ఈ నాభి స్త్రీల నాభియందు పరిభ్రమించు మనస్సును మరలించి, తనయందు వ్యామోహపడునట్లు చేయగల్గినదైయుండును.

అనంతరము నాభికి పైభాగమున నున్నది, విశాలమై, సుందరమైయున్నదగు వక్షఃస్థలమును, దానితో చేరియున్న యజ్ఞోపవీతమును దర్శించి, వానికి మంగళాశాసనమును **"తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాழிయే"** అనుచు చేయుచున్నారు. **'తుయ్య'** అనగా పవిత్రమైనదని అర్థము. వక్షఃస్థలమునకు గల పవిత్రత ఏమనగా **"హృదయేనోద్వహన్ హరిమ్"** (వక్షఃస్థలముతో

---

19. పాదాదికేశమాలై -3
20. -పూర్వదినచర్యా-5
21. పెరియాழ்వార్తిరుమొழி -5-2-1
22. -అమలనాదిపిరాన్ -3
23. అమలనాదిపిరాన్ -3
24. పాదాదికేశమాలై -5
25. విష్ణుపురాణమ్ -1.19.12

హృదయేనోద్వహన్" ఎన్ఱు "[26]నెఞ్జత్తు ప్పేరాదు నిఱ్కుమ్ పెరుమానై"ఉడైత్తాకై. అత్తాలే అవర్కళ్హృదయమ్ సౌమ్యరూపమాయ్ ఇరుక్కుమ్. అవ్వళవుమన్ఱియిలే, "[27]మార్వమెన్బదోర్ కోయిలిలే మాదవనెన్ఱుమ్ దెయ్వమ్" ఎన్గిఱపడియే ఇవర్తిరువుళ్ళత్తై క్కోయిలాక క్కొణ్డు "[28]అరవిన్దప్పావైయుమ్ తానుమాక" శేర్త్తియుడనేయాయ్ఱ్ఱు అవన్ ఎழுన్దరుళి యిరుప్పదు. విశేషిత్తు, వక్షఃస్థలమ్ మాదవస్థానమాకైయాలే ఉళ్ళోడు పుఱమ్బోడు వాశియఱ మాదవన్ ఉఱైయుమిడమాయ్ఱ్ఱు. "[29]మఙ్గళమ్ మాధవారామమనఃపద్మాయ మఙ్గళమ్"ఎన్ఱుమ్, "[30]శ్రీమత్సున్దర జామాతృమునిమానసవాసినే ... శ్రీనివాసాయ" ఎన్ఱుమ్ శొల్లక్కడవదిఱే. అవన్దాన్ అనన్య ప్రయోజనరుడైయ హృదయఙ్గళిలుమ్, ఆచార్యపరతంత్రరుడైయ హృదయఙ్గళిలుమ్ ఆయ్ఱ్ఱు అత్యాదరత్తుడనే ఎழுన్దరుళియిరుప్పదు. "[31]విణ్ణాట్టిల్ శాలవిరుమ్బుమే వేఱొన్ఱై యెణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు.", "[32]తన్నారియన్ పొరుట్టా చ్చఙ్గఱ్పిత్తేయ్వర్ నెఞ్జన్నాళుమ్ మాలుక్కిడమ్" ఎన్నక్కడవదిఱే. అన్ద అనన్యప్రయోజనత్తైయుమ్, ఆచార్యపరతంత్రత్తైయుమ్ ఆయ్త్తు ఇఙ్గు తూయ్మైయాక చ్చొల్లుకిఱదు. అదుక్కుమేలే, "[33]అழకారు మెతిరాశర్ క్కన్బుడైయాన్" ఎన్నుమ్బడి ఇవర్తిరువుళ్ళమ్ ప్రావణ్యత్తై యుడైత్తాయిరుక్కైయాలే "[34]ఇన్ఱవన్ వన్దిరుప్పిడమ్ ఎన్ఱన్ ఇదయత్తుళ్ళే తనక్కిన్బుఱవే" ఎన్గిఱపడియే పరమహంసరాన

హరిని దాల్చువాడై) అను విధమున, **"నెఞ్జత్తు ప్పేరాదు నిఱ్కుమ్ పెరుమానై"** (భక్తుల హృదయమును విడువక నిలచియుండు స్వామిని) అని పొగడబడు స్వామిని కల్గియుండుటయే. అందువలన భక్తుల హృదయము సౌమ్యమైయుండును. అదియును కాక, **"మార్వమెన్బదోర్ కోయిలిలే మాదవనెన్ఱుమ్ దెయ్వమ్"** (హృదయమను అద్వితీయమైన ఆలయమున మాధవుడను దైవము) అని పెరియాழ்వార్లు పల్కినట్లు, మణవాళమహామునుల హృదయమును కోవెలగా చేసికొని భగవానుడు **"అరవిన్దప్పావైయుమ్ తానుమాన"** (లక్ష్మీదేవియు, తానును) అను విధముగా లక్ష్మీదేవితో కలసి నిత్యనివాసముండును. ద్వాదశోర్ధ్వ పుండ్రములలో హృదయస్థానమున పుండ్రము మాధవనామముతో ధరింపబడును. కావున మహామునుల హృదయము లోపల, బయటకూడ మాధవునకు నివాసస్థానము. ఇందులకనుగుణముగా **"మంగళం మాధవారామమనఃపద్మాయ మంగళమ్"** (మాధవునకు నివాసస్థానముగానున్న మనస్సు అను పద్మమును కల్గిన మణవాళమహామునులకు మంగళము), **"శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే... శ్రీనివాసాయ మంగళం"** (శ్రీమణవాళమహామునుల మనస్సును నివాసముగా కల్గిన శ్రీనివాసునకు మంగళము) వంటి సూక్తులు స్మరణీయములు. భగవత్కైంకర్యముకంటే వేరు ప్రాప్యమును కోరని అనన్యప్రయోజనపరుల హృదయమున, ఆచార్యపరతంత్రుల హృదయమున భగవానుడు మిక్కిలి ఆదరముతో నివసించును. ఈ విషయమును అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అను ఆచార్యులు జ్ఞానసారమను ప్రబంధమున **"విణ్ణాట్టిల్ శాలవిరుమ్బుమే వేఱొన్ఱై యెణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు"** (తనను తప్ప వేరు ప్రయోజనమును ఆశింపని వారి మనస్సుననుండుటను, పరమపదము నందుండుటకంటే మిక్కిలి కోరును కదా) అని, **"తన్నారియన్ పొరుట్టా చ్చఙ్గఱ్పిత్తేయ్వర్ నెఞ్జన్నాళుమ్ మాలుక్కిడమ్"** (తమ సర్వస్వము స్వాచార్యుల కొఱకేనని సంకల్పించువారి మనస్సు భగవానునకు ఎప్పటికిని నివాసస్థానము) అని పల్కుట ద్వారా తెలియజేసిరి. కావున **"తుయ్యమార్బమ్"** అనునపుడు **"తుయ్య"** అను పదముచే చెప్పబడిన పవిత్రత ఏమనగా- భగవానుని కంటే వేరొకటి ప్రాప్యము తలపకపోవుట, ఆచార్యులే ప్రధానముగా తలచుటయును. అంతియే కాక, **"అழகారుమ్ ఎతిరాశర్క్కన్బుడైయాన్ వాழ்యే"** (సౌందర్యము నిండిన యతీంద్రుల పట్ల ప్రేమను కల్గిన మణవాళ మహామునులకు మంగళము) అనునట్లు, భగవద్రామానుజులపట్ల వీరి మనస్సు ప్రావణ్యమును కల్గియున్నదగుటచే, **"ఇన్ఱవన్ వన్దిరుప్పిడమ్ ఎన్ఱన్ ఇదయత్తుళ్ళే తనక్కిన్బుఱవే"** (ఆ భగవద్రామానుజులు వచ్చి, తమకు సుఖము కల్గునట్లు నివసించు నెలవు నా హృదయమునందు కలదు) అను విధముగా పరమహంస అగు రామానుజులు వేంచేసియుండు మానసపద్మమును మణవాళమహామునుల హృదయము

26. మూన్ఱామ్తిరువన్దాది -81
27. పెరియాழ்వార్తిరుమొழி -4.5.3
28. పెరియాழ்వార్తిరుమొழி -5.2.10
29.
30. వేఙ్కటేశమఙ్గళమ్
31. జ్ఞానసారమ్ -9
32. జ్ఞానసారమ్ -9
33. మణవాళమామునివాழிత్తిరునామము
34. ఇరామానుశనూఱ్ఱన్దాది -106

ఎమ్బెరుమానార్ ఎழுన్దరుళి యిరుక్కిఱ మానసపద్మాసనత్తై యుడైయదా యిరుక్కుమ్. రాగాదిదూషితమాన చిత్తత్తిల్ అవన్ అనాస్పదియాయిరుక్కుమాపోలే, అంగరాగరంజితమాన ఇవరుడైయ హృదయత్తిలుమ్ ఆస్పదియాయన్డియిరానాయ్త్తు. ఇప్పడి యివన్ ఎழுన్దరుళి యిరుక్కైయాలే సౌమ్యజామాతృమునియుడైయ హృదయమ్ అత్యంత సౌమ్యరూపమాయిరుక్కుమ్ ఎన్రై. ఆకైయాల్, "[35]నిన్‌వలమార్బినిల్ వాழ్గిన్ఱ మఙ్గైయుమ్ పల్లాణ్డు "ఎన్గిఱపడియే ఇవరుమ్ ఇరువరుమాన శేర్త్తిక్కు ఇరుప్పిడమాన తిరుమార్బై "తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాழி" ఎన్ఱు మంగళాశాసనమ్ పణ్ణుకిఱారాకవుమామ్. ఇవర్ మానసవాసియాయిరుక్కిఱవనుమ్ "[36]పులమ్ పురి నూలవని" తే. "[37]అలర్‌మేల్‌మఙ్గై- యుఱైమార్బ" నెన్గైయాలే అమ్మావారుత్తిక్కిడముడైత్తాయాయ్త్తు అమ్మార్బు. ఇమ్మార్బు ఇరువర్క్కుమ్ ఇడైముడైత్తాయిరుక్కుమ్. "[38]తిరుమాఱ్కరవు" ఇత్యాది. "[39]మంగళం పన్నగేంద్రాయ", "[40]అనంతనామినంత్వేష(నం) మణవాళమహామునిమ్" ఎన్నక్కడవదితే.

అథవా, **(తుయ్యమార్బుమ్)** "[41]శుభేన మనసా ధ్యాతమ్" ఎన్గిఱపడియే ఆశ్రితరుడైయ అపరాధఙ్గళై పొఱుత్తు, అవర్‌కళుక్కెప్పోదుమొక్క నన్మైయై చ్చిన్దిక్కిఱ సౌహార్దత్తై ఉడైత్తాకై. "[42]ఉరసా ధారయామాస" ఎన్నుమ్, "[43]నన్నెఞ్జవణ్ణమ్" ఎన్నుమ్

---

కల్గియున్నది. లౌకికరాగములచే దూషితమైన చిత్తమున భగవానుడు ఉన్నను, విధిలేక ఉన్నట్లుండును. కాని అంగరాగరంజితమైన (మైపూతలచే శోభిల్లచేయబడిన అని, భగవానుని దివ్యావయవముల యందలి ప్రేమతో నిండియున్న అని రెండర్థములు ఈ సమాసమువలన కల్గును.) మణవాళమహామునుల మనస్సున నెలకొన్న స్వామి అనాస్పదిగా నుండడు. కావున భగవానునకు నివాసమగు మణవాళమహామునుల హృదయము మిక్కిలి సౌమ్యరూపమును కల్గియుండును. ఇందుచే **"నిన్ వలమార్బినిల్ వాழ்గిన్ఱ మఙ్గైయుమ్ పల్లాణ్డు"** (నీ వక్షస్సున కుడివైపున నెలకొన్న లక్ష్మికి మంగళము) అని పెరియాழ்వార్లు మంగళమును లక్ష్మీలక్ష్మీనాథుల కలయికకు పాడినట్లే, కవి ఇచట దివ్యదంపతుల కలయికకు స్థానమైన మణవాళమహామునుల వక్షఃస్థలమునకు **"తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాழி"** అని మంగళమును పల్కుచున్నారనియు చెప్పవచ్చును. మణవాళమహామునుల మనస్సున నివసించు స్వామికూడ **"పులమ్ పురినూలవన్"** (తమను దర్శించువారి ఇంద్రియములకు మైకమును కల్గించు యజ్ఞోపవీతమును కలవాడు) అని తిరుమఙ్గైమన్నన్ స్తుతించినట్లు గొప్ప యజ్ఞోపవీతమును దాల్చినవాడు కదా! భగవానుని వక్షఃస్థలమున **"అలర్‌మేల్ మఙ్గైయుఱైమార్బన్"** (పద్మనివాసిని నిత్యవాసము చేయు వక్షఃస్థలమును కలవాడు) అనునట్లు లక్ష్మీదేవికి ఒక్కతెకే స్థానము కలదు. కాని, మణవాళ మహామునుల వక్షఃస్థలము దివ్యదంపతుల కిద్దరికిని చోటిచ్చినది. **"శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్...తిరుమాఱ్కరవు"** (లక్ష్మీపతికి తాను వేంచేయునపుడు గొడుగుగా, నిలచియున్నపుడు సింహాసనముగా) అని భూతయోగి (పొయ్‌కై ఆழ்వార్లు) పల్కినట్లు ఆదిశేషులు దివ్యదంపతులకు అన్నివిధములైన కైంకర్యములను చేయునని పల్కిరి. శ్రీమణవాళ మహామునులు **"మంగళం పన్నగేంద్రాయ"** (పన్నగపతికి మంగళము) అని, **"అనంతనామినంత్వేనం మణవాళమహామునిమ్"** (అనంతుడను పేరుగల మణవాళమహామునులను) అని కీర్తింపబడుటచే ఆదిశేషుల అవతారము. కావున వారి హృదయము దివ్యదంపతులకు ఇద్దఱికి సింహాసనమగుటలో ఆశ్చర్యము లేదు.

లేక, **"తుయ్య మార్బు"** అనుటకు **"శుభేన మనసా ధ్యాతమ్"** (అక్లిష్టకర్ముడగు శ్రీకృష్ణునిచే బృందావనము మంగళకరమైన మనస్సుతో ధ్యానింపబడినది) అనువిధముగా భగవానుని హృదయము భక్తుల అపరాధములను సహించి, ఎల్లప్పుడును వారి హితమును గూర్చి చింతించు సౌహార్దమును కల్గియుండునట్లే, శ్రీమణవాళమహామునుల హృదయముకూడ అట్టి సౌహార్దమును కల్గియున్నదని చెప్పవచ్చును. భగవానుని హృదయము **"ఉరసా ధారయామాస"** (అర్జునునిపై భగదత్తుడు ప్రయోగించిన బాణమును శ్రీకృష్ణుడు తన వక్షఃస్థలమున ధరించెను ) అనునట్లు ఆశ్రితుల అనిష్టనివారణము, **"నన్నెఞ్జవణ్ణమ్"** (ఆశ్రితుల విషయమున సౌహార్దమును కల్గిన తల్లి) అనునట్లు ఇష్టప్రాపకత్వము అను రెండింటిని తాను స్వయముగా చేయునట్లే, సౌహార్దగుణ కార్యములగు

---

35. తిరుప్పల్లాణ్డు -2
36. పెరియతిరుమొழி -9.9.9
37. తిరువాయ్‌మొழி -6-10-10
38. ముదల్‌తిరువన్దాది -7
39.
40.
41. విష్ణుపురాణమ్ -5.6-28
42. మహాభారతమ్-
43. పెరియతిరుమొழி-7-2-7

శొల్లుకిఅపడియే ఇవైయిరణ్డుక్కుమ్ తానేయాయిరుక్కై. **(తుయ్యమార్బుమ్ పురినూలుమ్)** "[44]ఏరారుమ్ శెయ్యవడివు" ఎన్నుమాపోలే ఇజ్ఞుమ్ యావద్భోగత్తై పఱ్ఱి చ్చొల్లవుమామ్. "[45]మన్దరగిరిమథిత మహార్ణవోదీర్ణ ఫేనపాండరసుందరసుకుమారదివ్యవిగ్రహ" ఎన్గిఱే ఇరుప్పదు. ఆక, ఇవఱ్ఱాల్ శొల్లిఱ్ఱాయిత్తు బాహ్యాభ్యంతరశుచి ఎన్ఱై. ఇని, తిరుమార్పోడు శేర్న్దిఱే తిరుయజ్ఞోపవీత మిరుప్పదు. "[46]తామరైత్తారిడజ్గొణ్డమార్బుమ్ వణ్పురినూలుమ్", అప్పడియోడే శేర్న్ద తిరుయజ్ఞోపవీతమ్.(పడి=విగ్రహమ్).

**(తుయ్యమార్బుమ్ పురినూలుమ్)** "[47]తుషారకరకరనికరవిశదతరవిమలోపవీత పరిశోభితవిశాలవక్షఃస్థల"ఎన్గిఅపడియే చన్ద్రనుక్కు క్కిరణఙ్గళ్ తేజస్కరమానాప్పోలేయాయ్త్తు, తిరుమార్బుక్కు త్తిరుయజ్ఞోపవీత మిరుప్పదు. "[48]శోభితం యజ్ఞసూత్రేణ" ఎన్నక్కడవదిఱే.అన్ఱిక్కే, ఇమ్మున్నూలాన మెయ్నూలాలేయిఱే పొయ్నూల్కళైయుమ్, కళ్లనూల్కళైయుమ్ కరుమమన్దు కత్త్రిప్పదు.

అనిష్టనివారణమును, ఇష్టప్రాపణమును చేయునది మణవాళమహామునుల హృదయమని తాత్పర్యము, లేక, **"ఏరారుమ్ శెయ్యవడివు"** (లావణ్యముతో నిండిన ఎఱ్ఱని దేహము) అని మణవాళమహామునులు భగవద్రామానుజులపట్ల అనుసంధించిన భావమును కవి మణవాళమహామునుల లావణ్యశోభావిషయమున అనుసంధించిరని చెప్పవచ్చును. (ఈ అన్వయమున **"మార్బు"** అనుపదముచే దివ్యదేహము అంతయు లక్షింపబడినదని, **'తుయ్య'** అనుటచే లావణ్యమువలనకల్గిన శోభ లక్షింపబడినదని చెప్పవచ్చును) "**మందరగిరిమథిత మహార్ణవోద్గీర్ణఫేనపాండరసుందరసుకుమారదివ్యవిగ్రహ"** (మందర పర్వతముచే మథింపబడిన మహాసముద్రమునుండి బయటకువచ్చిన నుఱుగువలె తెల్లని, అందమైన, సుకుమారమైన, దివ్యమైన రూపమును కలవాడా) అని స్తుతింపబడిన విధముగా మణవాళమహామునుల రూపము మిక్కిలి రమణీయమైయుండును. కావున పైవివరణములవలన శ్రీమణవాళమహామునుల హృదయము బాహ్యమైన, అభ్యంతరమైన శుచిత్వమును కల్గియున్నదని చెప్పబడినది. యజ్ఞోపవీతము వక్షఃస్థలముతో కలసియుండుటచే, వక్షఃస్థలమునకు పిమ్మట యజ్ఞోపవీతమును కీర్తించుచున్నారు. **"తామరైత్తారిడజ్గొణ్డ మార్బుమ్ వణ్పురినూలుమ్"** (తామరపూసలమాల నెలకొన్నియున్న వక్షఃస్థలము, అందమైన యజ్ఞోపవీతము) అని మణవాళమహామునులనుగూర్చిన పాదాదికేశమాలలో ఈరెండింటియొక్క కలయిక స్తుతింపబడుట గమనింపతగినది.

**(తుయ్యమార్బుమ్ పురినూలుమ్) "తుషారకరకరనికర విశదతరవిమలోపవీత పరిశోభిత విశాలవక్షఃస్థల"** (చంద్రుని కిరణముల సమూహమువలె మిక్కిలి స్పష్టమైన, స్వచ్ఛమైన యజ్ఞోపవీతముచే శోభిల్లు, విశాలమైన వక్షఃస్థలమును కలవాడా) అనిస్తుతింపబడినవిధముగా చంద్రునకు కిరణములవలె మణవాళమహామునుల వక్షఃస్థలమునకు యజ్ఞోపవీతము తేజస్సును కల్గించునదియై యున్నవి. **"శోభితం యజ్ఞసూత్రేణ"** అని పూర్వదినచర్య స్తోత్రమున వక్షఃస్థలము యజ్ఞోపవీతముచే ప్రకాశింప చేయబడినదని వర్ణింపబడినదికదా ! లేక, మూడుపోగులనుకల యజ్ఞోపవీతమను నిజమైన సూత్రముతో అసత్యములైన సూత్రములును, చోరసూత్రములును సత్యములుకావని మణవాళమహామునులు నిరసించుటచే **'పురినూలుమ్ వాళ్రి'** అని మంగళాశాసనమును చేయుచున్నారనియు చెప్పనగును. **"ఇమ్మున్నూలాన మెయ్నూలాలేయిఱే పొయ్నూల్కళైయుమ్, కళ్లనూల్కళైయుమ్ కత్త్రిప్పదు"**- అను వ్యాఖ్యానపంక్తి మిక్కిలి రస్యము. **"మున్నూల్"** అనుటకు మూడు పోగులనుకల యజ్ఞోపవీతము అని,మూడువిధములైన- అనగా-భేద,అభేద,ఘటకశ్రుతులని అర్థము. **"నూల్"** అను తమిళపదమునకు నూలుపోగు,అనగా యజ్ఞోపవీతము అని, శాస్త్రమనియు అర్థములుకలవు. అట్లే, **"మెయ్నూల్"** అనుటకు శాస్త్రసమ్మతమైన యజ్ఞోపవీతములని, భ్రమవిప్రలంభాదిదోషములులేని శాస్త్రమనియు అర్థము. **"పొయ్నూల్"** అనుటకు శాస్త్రవిహితముకాని ఒకేనూలుపోగును కల్గిన యజ్ఞోపవీతము అని, బ్రహ్మతప్ప మిగిలినదంతయు మిథ్య అను అద్వైతశాస్త్రము అని, నాస్తికవాదమును ప్రతిపాదించు మతములు అనియు అర్థము.) కావున మణవాళమహామునులు మూడు పోగులను కల్గిన యజ్ఞోపవీతమును

44. ఆర్తిప్రబంధమ్ -30
45.
46. పాదాదికేశమాలై -5
47. ?
48. పూర్వదినచర్యా -6

"[49]వకుళధవళమాలావక్షఃసమ్ వేదబాహ్యప్రబలసమయవాదచ్ఛేదనమ్" ఎన్నక్కడవదిఱే. తమ్ముడైయ బ్రహ్మసూత్రత్తాలేయిఱే ఇవనుడైయ కామసూత్రఙ్గళై క్కళ్రిప్పదు. [49A]రాజేన్ద్రశోళ్గనిలే బాహ్యరుడైయ సఙ్గత్తాలే శిఖాయజ్ఞోపవీతఙ్గళై క్కళ్రిత్త బ్రాహ్మణపుత్రన్ ఆళ్గ్వానై క్కణ్డు, మీణ్డుమ్ అవఙ్గళై ధరిత్తువర, అవన్ పితావానవన్ "ఆళ్గ్వానై క్కణ్డాయాకాదే" ఎన్నారిఱే.

ఇని. త్తిరుమార్వోడు శేర్న్ద తిరుత్తోళ్కళుక్కు అరణ్ శెయ్కిఱార్. **(తిరుత్తోళ్గళిణై వాళ్గియే)** "[50]మల్లాణ్డ తిణ్డోళుక్కు" పల్లాణ్డు ఎన్నుమాపోలే. **(శున్దరత్తిరుత్తోళ్గళిణై)** "[51]భుజద్వయవిధృత విశదతరశంఖచక్రలాంఛన" ఙ్గళై ఉడైత్తాయాయ్త్తు త్తిరుత్తోళ్కళ్ ఇరుప్పదు. "[52]తోళార్ శుడర్ తికిరి శఙ్గుడైయ శున్దరని"ఱే అవన్దాన్. "[53]శిఙ్గారమాలై త్తిరుత్తోళ్కళుమ్,అదిలే తికళ్గుమ్ శఙ్గాళ్గియుమ్" ఎన్ను అనుభావ్యమాయిఱే ఇరుప్పదు. **(తోళిణై)** "[54]ఎప్పోదుమ్ కైకళ్గలా నేమియాన్" ఎన్గిఅపడియే ఇవర్క్కు

---

దాల్చుట ద్వారా యజ్ఞోపవీతమే ధరింపని నాస్తిక సన్న్యాసులను, ఒకే పోగును కల్గిన యజ్ఞోపవీతమును దాల్చు అద్వైత సన్న్యాసులను నిరసించిరని ప్రస్తుతార్థము. మూడువిధములైన శ్రుతులను సమర్థవంతముగా నిర్వహించుటద్వారా నాస్తికమతములను, అద్వైతమతమును నిరసించిరని హృదయము) **"వకుళధవళమాలావక్షసం వేదబాహ్యప్రబలసమయవాదచ్ఛేదనం పూజనీయమ్, విపులకురుకనాథం కారిసూనుం కవీశం శరణముపగతోఽహం చక్రహస్తేభచక్రమ్"**అనుచు పూర్వాచార్యులు పల్కినట్లు తెల్లని వకుళమాలికలను దాల్చు ఆళ్గ్వార్ల వక్షఃస్థలము ప్రబలములైన నాస్తికవాదములను నిరసించినట్లే, తెల్లని యజ్ఞోపవీతమును దాల్చు మణవాళమహామునుల వక్షస్థలము నాస్తికసన్న్యాసులను నిరసించినదని భావము. మణవాళమహామునులు బ్రహ్మసూత్రమను పేరుకల్గిన యజ్ఞోపవీతముతో భక్తుల కామసూత్రములను ఛేదింతురు. రాజేంద్రచోళపురమున నాస్తికవాదులతో స్నేహముచేసిన బ్రాహ్మణయువకుడొకడు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించెను. కొంతకాలమైన పిదప అతడు ఒకనాడు కూరత్తాళ్గ్వాన్ వైదికవేషసౌందర్యమును చూచి, ఆకర్షితుడై పూర్వమువలెనే శిఖను, యజ్ఞోపవీతమును ధరింపసాగెను. అపుడతని తండ్రి కుమారునితో "ఓయీ! నీవు కూరేశులను దర్శించితివా ఏమి! " అని అడిగెను. కూరేశులు దాల్చిన శిఖాయజ్ఞోపవీతముల సౌందర్యము బ్రాహ్మణయువకుని నాస్తికభావమును మార్చినట్లే, మణవాళమహామునుల యజ్ఞోపవీతసౌందర్యము నాస్తికుల భావమును నిరసించెను.

అనంతరము వక్షఃస్థలముతో సంబంధమును కల్గియున్న బాహువులకు మంగళాశాసనమును **"శుందర తిరుత్తోళ్గళిణై వాళ్గియే"** అనుచు చేయుచున్నారు.(**'అరణ్'** అనగా కోట. కోట రక్షకమైనట్లే, మంగళాశాసనమును రక్షకము కావున, అరణ్ అను పదముచే మంగళాశాసనము లక్షింపబడినది.) పెరియాళ్గ్వార్లు భగవానుని బాహువులకు **"మల్లాణ్డ తిణ్డోళ్"** (మల్లులను జయించిన బలిష్ఠములైన బాహువులను కల్గిన మణివర్ణా!నీకు మంగళము) అని మంగళమును పల్కినట్లే , కవి మణవాళమహామునుల బాహువులకు మంగళమును ఆశాసించుచున్నారు. బాహువులకు సౌందర్య మేమనగా – **''భుజద్వయ విధృతవిశదతరశంఖచక్రలాంఛన"** అనునట్లు రెండు భుజములయందు మిక్కిలి స్పష్టముగా కన్పించునట్లు శంఖచక్రముల లాంఛనములను కల్గియుండుటయే. భగవానుని భుజములు **"తోళార్ శుదర్ తికిరి శఙ్గుడైయ శున్దరన్ "**(ప్రకాశముకల సుదర్శనమును, పాంచజన్యమను శంఖమును ధరించిన భుజములనుకల సుందరుడు) అనునట్లు శంఖచక్రములచే సుందరములు. అట్లే, మణవాళమహామునుల భుజములును శంఖచక్రలాంఛనములచే సుందరములు. ఈవిషయము పాదాదికేశమాలై అను ప్రబంధమున **" శిఙ్గారమాలై త్తిరుత్తోళ్ కళుమ్, అదిలే తికళ్గుమ్ శఙ్గాళ్గియుమ్"** (అందమైన తులసిమాలను కల్గిన భుజములను, అందు ప్రకాశించు శంఖచక్రములను) అని వర్ణింపబడినది. **"ఎప్పోదుమ్ కైళ్గలా నేమియాన్"** (ఎల్లప్పుడును చేతిని వీడని

---

49. నమ్మాళ్గ్వార్ల ముక్తకము(ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావము)
49A. పెరియతిరుమొళ్గివ్యాఖ్యాన ప్రవేశము (8-1)
50. తిరుప్పల్లాణ్డు - 1
51.
52. జ్ఞానసారమ్ -7
53. పాదాదికేశమాలై -7
54. పెరియ తిరువన్దాది -87

త్తిరుత్తోళ్కళానవై ఎప్పొళుదుమ్ శఙ్గాళి ఇలఙ్గు పుయమాయిరుక్కైయాలే "[55]వలత్తుఱైయుమ్ శుదరాళియుమ్ పాఞ్జశన్నియముమ్" ఇఙ్గుమ్ ఉణ్డాయిరుక్కై . అన్ఱిక్కే, తిరుత్తోళ్కళ్తాన్ భగవల్లాంఛనత్తిల్ ప్రమాణముమాయ్, అపవిత్రరై సుపవిత్రరాక్కియుమ్, దుర్వృత్తరై శుద్ధిమాన్కళాక్కియుమ్ పోరుమదాయిరుక్కుమ్.

అనన్తరమ్, తిరుత్తోళ్కళిల్ ఏకదేశమాన తిరుక్కైయైయుమ్, అదిలే ధరిత్త త్రిదణ్డత్తైయుమ్ కణ్డు, అదుక్కు త్తామ్ కడగాక నిత్కిరార్. **(కైయుమేన్దియ ముక్కోలుమ్ వాళియే)** వెఱుమ్ కైదానే పోరుమాయ్త్తు ఆకర్షిక్కైక్కు. అదిలే తిదణ్డముమానాల్ అళకిరట్టిక్క చ్చొల్లవేణ్డావితే, "[56]అఙ్కైత్తలత్తిడై ఆళికొణ్డాన్" ఎన్నుమాపోలే. "[57]కారుమ్, శురబియుమ్పోలే విళఙ్గు క్కైత్తామరైయిలే శేర్న్దిరున్ద తణ్డుమ్ "ఎన్గిఱతే శేర్త్తి యిరుప్పదు. ఇక్కైకణ్డ ఇవరై క్కైవిట్టిరుక్కమాట్టారే. అన్ఱిక్కే , "[58]మున్నై మఱైత్తమిళ్ విళక్కుమ్ ముత్తిరక్కై వాళియే " ఎన్గిఅపడియే తనదు తొణ్డక్కులమ్ శూళవిరుక్క, అవర్కళుక్కు త్తమిళ్వేదమాన తిరువాయ్మొళియినుడైయ వర్థత్తై హస్తముద్రైయాలే ఉపదేశిత్తరుళువదుమ్ అనుభావ్యమాయితే ఇరుక్కు మివర్క్కు "[59]ఉన్నిద్రపద్మసుభగా ముపదేశముద్రామ్",

---

చక్రమును కల్గినవాడు) అనునట్లు భగవానుని భుజములలో నిత్యము శంఖచక్రములు ప్రకాశించునట్లే, మణవాళమహామునుల భుజములయందు నిత్యము శంఖచక్రములు ప్రకాశించుటచే, **"వలత్తుఱైయుమ్ శుదరాళియుమ్ పాఞ్జశన్నియముమ్ పల్లాణ్డు"** అను భగవానుని మంగళాశాసనము మణవాళ మహామునుల విషయమునను అర్థవంతమే.(లేక) మణవాళమహామునుల భుజములు భగవానుని చిహ్నములను కల్గియుండుటలో ప్రమాణమై, అపవిత్రులైనవారిని మిక్కిలి పవిత్రులను గావించి,దుష్టవర్తమును కలవారిని సద్వర్తనము కలవారినిగా చేయునవియైయుండును

పిమ్మట దివ్యభుజములో ఒక భాగమైన దివ్యహస్తమును, అందు దాల్చిన త్రిదండమును దర్శించి, దానికి**"కైయు మేన్దియ ముక్కోలుమ్ వాళియే"** అనుచు రక్షను చేయుచు న్నారు. (**"కడగ'** అను తమిళపదమునకు డాలు అని అర్థము. కావున **"కడకాక"** అనుటకు డాలు అగునట్లు అని అర్థము. అనగా డాలు ఏవిదముగా సైనికునకు రక్షఅగునో, అట్లే తాము మామునులకు రక్ష చేయుచున్నారని తాత్పర్యము) **(కైయు మేన్దియ ముక్కోలుమ్ వాళియే)** – (ఏఆభరణము లేకున్నను) కేవలము హస్తముద్ర చాలును ఆకర్షించుటకు, ఇక ఆహస్తమునందు త్రిదండమున్నచో అందము రెండింతలగుటను చెప్పనక్కరలేదుకదా **"అఙ్కైత్తలత్తిడై ఆళికొణ్డాన్"** (అందమైన కరతలమును స్థానముగా గ్రహించెను) అని (గోదాదేవి) అనునట్లు. **"కారుమ్, శురబియుమ్పోలే విళఙ్గు క్కైత్తామరైయిలే శేర్న్దిరున్ద తణ్డుమ్ "**(మేఘము, కామధేనువులవలె (ఔదార్యముచే) ప్రకాశించు, తామరవంటి శ్రీహస్తములో చేరియున్న దండము) అని (ఈపాశురకర్తయే కీర్తించినట్లు శ్రీహస్తము, త్రిదండముల) కలయిక (మిక్కిలి ఆకర్షణీయమై) యుండునుకదా. (తమిళమున **"కైకణ్డ"** అనుటకు ప్రత్యక్షానుభవసిద్ధమైన అని అర్థము ప్రత్యక్షానుభవసిద్ధమైన వీరిని (త్రిదండమును) వీరు (వరవరమునులు) చేయివిడువలేరుకదా. (విడచియుండలేరుకదా! లేక, త్రిదండము, శ్రీహస్తముల కలయికలోని శోభను ప్రత్యక్షముగా అనుభవించిన అణ్ణన్ వీరిని, అనగా త్రిదండమును చేయివిడువరుకదా) ఎల్లప్పుడు త్రిదండమును దాల్చియుందురుకదా) . లేక,**"మున్నై మఱైత్తమిళ్ విళక్కుమ్ ముత్తిరక్కై వాళియే "** (ప్రాచీన తమిళవేదమును వ్యాఖ్యానించు జ్ఞానముద్రను కల హస్తమునకు మంగళము) అనునట్లు తన దాసవర్గము (తనచుట్టును) పరివేష్టించియుండగా వారికి తమిళవేదమైన తిరువాయ్మొళియొక్క అర్థమును హస్తముద్రతో ఉపదేశించుటయు వీరికి (అణ్ణన్‌కు బుద్ధిస్థమగుటచే ఆముద్ర) భోగ్యమైయుండును కదా! **"ఉన్నిద్రపద్మసుభగా ముపదేశముద్రామ్"** (వికసించిన పద్మమువలెనున్న అందమైన ఉపదేశముద్రను) అని వేదాంతదేశికులచే), **"ఎళిల్ ఞానముత్తిరై వాళియే"** (వేదాంతార్థములను ప్రకాశింపచేయు జ్ఞానముద్ర వర్ధిల్లుగాక!) అని (వరవరమునులచే

---

55. తిరుప్పల్లాణ్డు -1
56. నాయ్చ్చియార్ తిరుమొళి -12-4
57. పాదాదికేశమాలై -5
58. మణవాళమహాముని వాళిత్తిరునామము
59. యతిరాజసప్తతి - 25

"[60]ఎ(ర్రిల్ ఞానముత్తిరై వాళ్రియే" ఎన్ఱు శొల్లక్కడవదిఱే. **(ఏన్దియ)** పూవేన్దినాప్పోలేయిరుక్కై.

**(కైయుమేన్దియ ముక్కోలుమ్ వాళ్రియే)** "[61]నిన్కైయిల్ వేల్ పోఱ్ఱి." ఎన్ఱుమాపోలే. అన్ఱిక్కే , "[62]కమల కరవిధృత(త్రిదండదర్శన(దుత సమస్తపాషండసుదూరపరిహృతనిజావసథ" ఎన్ఱు ఒరుకోలార్ తుదక్కమానారై యెల్లామ్ ఓట్టుమదాయిరుక్కుమ్.

**(కరుణై పొజ్గియ కణ్ణిణై వాళ్రియే)** కణ్ కాణ కైవిట్టార్. "[63]కార్పోలుమ్ శెజ్గైయుత్తై ముక్కోలుమ్ వాళ్రియే, "కరుణై కుడికొణ్డరుళుమ్ కణ్ణిణై వాళ్రియే" ఎన్ఱు తిరుక్కైక్కు అనన్తరభావియాయ్ ప్పేశువదు తిరుక్కణ్గళైయిఱే, తిరుక్కైకళాలే స్పర్శిత్తరుళిన పిన్బిఱే తిరుక్కణ్గళాలే కటాక్షిత్తు, రక్షిత్తరుళువదు.

**(కరుణై పొజ్గియ కణ్ణిణై)** కరుణైక్కడలాన ఇవరుడైయ కృపై పెరుకుమ్ ఆనైత్తాళ్ ఇరుక్కుమ్పడి. "[64]నిరన్తరకరుణామృతతరజ్గిణీ(ప్రార్థితాపాంగై రనుకూల మభిషించ" ఎన్ఱారిఱే. ఇవరైప్పోలే కణ్ణుడైయార్ ఒరువరుమ్ ఇల్లైయే! ఇవర్ కణ్ణిఱే ఎల్లార్క్కుమ్ కళైకణ్. కణ్ణరుళాలేయిఱే ఎల్లారైయుమ్ రక్షిత్తరుళువదు.

---

భగవద్రామానుజుల విషయమున) చెప్పబడుచున్నదికదా! **(ఏన్దియ)** (అను శబ్ద(ప్రయోగమునుబట్టి) చేతిలో దండమును దాల్చుట పూవు ధరించినట్లు (మిక్కిలి భోగ్యమైయుండుట) స్ఫురించుచున్నది.

**(కైయు మేన్దియ ముక్కోలుమ్ వాళ్రియే) – "నిన్కైయిల్ వేల్ పోఱ్ఱి."** (నీ చేతిలోని వేలాయుధమునకు మంగళము) అని గోదాదేవి శ్రీకృష్ణుని హస్తములోని వేలాయుధమునకు మంగళ మాశాసించినట్లే, వీరు వరవరముల శ్రీహస్తములోని (త్రిదండమునకు మంగళము పలుకుచున్నారు.). లేక, **"కమలకరవిధృత(త్రిదండదర్శన(దుత సమస్తపాషండసుదూర–పరిహృతనిజావసథ"** (కరకమలములందు చక్కగా ధరింపబడిన) (తిదండముయొక్క దర్శనముచే మిక్కిలి వేగముగా పాషండ (నాస్తిక) వాదులందఱు మిగుల దూరముగా వీడిన నివాసమును కలవాడా! "(వరవరమునుల చేతిలోని (త్రిదండమును చూచిన ఏకదండి(ప్రభృతి నాస్తికవాదులు భయముతో వరవరమునుల నివాసమును వీడి దూరముగా పోయిరి) అనునట్లు ఏకదండి సన్న్యాసులు మొదలగు( పాషండమతవాదులగు) వారిని అందఱిని పాఱదోలునదియై ఈ(త్రిదండమును దాల్చిన సన్నివేశముందును.

**(కరుణై పొజ్గియ కణ్ణిణై వాళ్రియే)** నే(త్రములను దర్శింపగానే హస్తమును విడచిరి. (కంటితో చూచుచుండగానే ఆశవదలిరి అని అర్థచమత్కారము) **"కార్పోలుమ్ శెజ్గైయుత్తై ముక్కోలుమ్ వాళ్రియే, "కరుణై కుడికొణ్డరుళుమ్ కణ్ణిణై వాళ్రియే"** (మేఘమువంటి ఉదారమైన, ఎ(రని, అందమైన చేతియందు నిత్యవాసముచేయు (త్రిదండమునకు మంగళము), (దయ నిత్యనివాసముచేయు నే(త్రద్వయమునకు మంగళము) అనుచు అభిజ్ఞులు శ్రీహస్తమునకు పిమ్మట నే(త్రద్వయమునకు మంగళమాసించినట్లే. వీరును **"కైయు మేన్దియ ముక్కోలుమ్ వాళ్రియే "** అని మణవాళమహామునుల హస్తమునకు మంగళము పల్కిన పిదప నే(త్రద్వయమునకు మంగళమును పలుకుచున్నారు. ఎందులకనగా, హస్తములతో స్పృశించిన పిదపనేకదా నే(త్రములతో కటాక్షించి రక్షించునది. (కావున ఈ(క్రమము ఉచితము).

**(కరుణై పొజ్గియ కణ్ణిణై)** కరుణకు సము(ద్రమైన వీరి కరుణ (ప్రవహించు కాలువలు ఉన్నవిధము ఇది. (అనగా– శ్రీవరవరమునుల కరుణ నీరు కాగా, ఆనీరు (ప్రవహించు తూములు రెండు కన్నులు). **"నిరంతరకరుణామృతతరంగిణీ(ప్రార్థితాపాంగై రనుకూల మభిషించ"** (ఎల్లప్పుడు కరుణ అను అమృతమును (ప్రవహించు, నాచే (ప్రార్థింపబడిన తమకటాక్షములతో అనుకూలుడనగు నన్ను తడపుము) అని అభియుక్తులు అట్లే (ప్రార్థించిరికదా. వీరివలె కన్నులను కలవారు ఎవరును లేరుకదా!

---

60. ఆర్తి (ప్రబంధమ్ – 30
61. తిరుప్పావై –24
62. – !
63.
64.

**(కణ్ణిణై)** అలర్న్ద శెవ్విత్తామరైప్పూవిలే ఇరణ్డు వణ్డుకళ్ పడిన్దిరుక్కుమా- పోలేయాయ్‌త్తు? త్తిరుక్కణ్‌గళానవై తిరుముకమణ్డలత్తుక్కుమ్ కణ్‌కాట్టికళా యిరుక్కిఱపడి. "[65]స్మయమానముఖాంభోజం దయమానదృగంచలమ్" ఎన్గిఱపడియితే శేర్‌త్తి యిరుప్పదు. తిరుక్కణ్‌గళై యరుళిచ్చెయ్‌దదు ఉత్తమాఙ్గత్తిల్ అఴగుక్కెల్లామ్ ఉపలక్షణమ్ . "[66]వాఴ్గి శెవ్వాయ్" ఎన్గుమ్, "[67]వార్‌కాదుమ్ తిరునామమణినుదలుమ్ వాఴ్గియే" ఎన్గుమ్ అవఙ్గళైయుమ్ తిరునామాంతరఙ్గళిలే కాణలాయిరుక్కుమ్. అత్తాలే అవై యిరణ్డైయుమ్ మఙ్గళాశాసనమ్ పణ్ణియరుళినార్. ఇవర్ జీయర్ తిరుక్కణ్‌మలరిలేయాయ్‌త్తు "[68]జితమ్" ఎన్ఱు తమ్మై ఎఴుది క్కొడుత్తదు.

ఇవ్వళవుమ్ సురూపవైలక్షణ్యత్తై అనుభవిత్తు, మంగళాశాసనమ్ పణ్ణిన ఇవర్, ఇని స్వరూపగుణమాన జ్ఞానవైలక్షణ్యత్తైయుమ్ అనుభవిత్తు, మంగళాశాసనమ్ పణ్ణువారాక అదిలే ఇఴిగిఱార్. "[69]కట్కణెన్ఱు"మ్, "[70]ఉట్కణ్ణె"న్ఱుమ్, "[71]నేత్రేణ జ్ఞానేన" ఎన్ఱుమ్ జ్ఞాన చక్షుస్సుక్కళ్ ఇరణ్డుక్కుమ్ దర్శనత్వమ్ ఒత్తిరుక్కైయాలే ఒరుశేర్‌త్తి యుణ్డిఱే. అత్తాలే **(పొయ్యిలాద**

---

**"కణ్"** అనగా దయ. వీరివలె అందమైన కన్నులను కలవారెవ్వరునులేరని, వీరివలె దయకలవారెవ్వరును లేరనియు భావము. రామానుజుల నేత్రసౌందర్యము చరిత్ర ప్రసిద్ధము. వరవరమునులు రామానుజుల అపరావతారమే కావున వారి కన్నులును అందమైనవే) వీరి నేత్రమేకదా అందరికిని రక్షకము. (వీరి కరుణయేకదా అందఱికిని రక్షకము) . కంటిదయతోకదా అందఱిని కాపాడి అనుగ్రహించుట.

**(కణ్ణిణై)** వికసించిన, ఎఱ్ఱని, రెండు తామరపూవులలో రెండు తుమ్మెదలు అమరియున్నట్లుగా నేత్రములు తిరుముఖమండలమునకు నిర్వాహకములైయున్నవి. **"స్మయమానముఖాంభోజం దయమానదృగంచలమ్ "** (చిఱునవ్వు నవ్వునట్టి, తామరపూవువంటి ముఖమును కలవానిని, దయను చూపు కడకంటి చూపులను కలవానిని) అనునట్లు ముఖమందలి నేత్రముల పొందిక(హృద్యమై) యుండునుకదా! (ఇచట) నేత్రములనుగూర్చి పల్కుట ముఖములోని నాసికాది మిగిలిన అంగముల అందమునకుకూడ ఉపలక్షణము. **"వాఴ్గి శెవ్వాయ్'** (ఎఱ్ఱని పెదవికి మంగళము) అని,**"వార్‌కాదుమ్ తిరునామమణినుదలుమ్ వాఴ్గియే"** (అందముగా వేలాడు చెవులు, తిరునామముచే అలంకరింపబడిన నుదురును వర్ధిల్లుగాక) అని మిగిలిన దివ్యావయవముల అందముకూడ మిగిలిన మంగళాశాసనస్తుతులలో కాననగును. కావున నిచట నేత్రద్వయమునకు మాత్రము మంగళాశాసనమును చేయుచున్నారు. (భక్తులు భగవానుని పుండరీకాక్షత్వమునకు జితులై **"జితం తే పుండరీకాక్ష"** అనుచు ఆ భగవానుని నేత్రసౌందర్యమునకు తమను వశముచేసికొన్నట్లే) వీరు మణవాళమహామునుల తామరపూల వంటి నేత్రముల అందమునకు వశులై , **"జితమ్"** అని తమను వశముచేసికొనిరి.

ఇంతవరకు అణ్ణన్ శ్రీవరవరమునుల దివ్యరూపవైలక్షణ్యమును దర్శించి, మంగళాశాసనము చేసి, ఇక స్వరూపగుణమగు జ్ఞానవైలక్షణ్యమును కూడ అనుభవించి, దానికి మంగళాశాసనమును చేయప్రయత్నించుచున్నారు. (ఇట్లు బాహ్యచక్షువునకు, పిమ్మట అంతరచక్షువగు జ్ఞానమునకు మంగళముపాడుట తగినదే. ఏల అన-) "కట్కణ్" (బాహ్యచక్షువు) "అని,**"ఉట్కణ్"** (అంతఃచక్షువు) అని, **"నేత్రేణ జ్ఞానేన "** (జ్ఞానరూపమైననేత్రముతో) అనియు జ్ఞానమునకు, నేత్రమునకు దర్శనరూపసామ్యము తగియుండుటచే, వానికి ఒక విధమైన పొందికకలదుకదా! అందుచే.

**(పొయ్యిలాద మణవాళమాముని పున్ది)** అనుచు శ్రీమణవాళమహామునుల జ్ఞానవైభవమును పల్కుచున్నారు. పున్ది అనగా బుద్ధి - అనగా జ్ఞానము అని అర్థము. **(పొయ్యిలాద)** వీరినిగూర్చి పల్కిన గొప్పతనమంతయు వీరియందు నిత్యమై

---

65. పూర్వదినచర్యా -10
66. పాదాదికేశమాలై - 10
67.
68. జితన్తేస్తోత్రమ్ -1
69. పెరియతిరువన్దాది - 28
70. పెరియతిరువన్దాది - 28
71.

**మణవాళమాముని పున్ది )** ఎన్ఱు జ్ఞానత్తై ప్పేశుకిఱార్. పులన్ – బుద్ధి. జ్ఞానమ్. **(పొయ్యిలాద)** ఇవర్విషయత్తిల్ శొన్న శొన్న ఏఱ్ఱమెల్లామ్ యథార్థమాక వుణ్డెన్గై. ఇని చొల్లమాట్టాదార్కుఱైయే యుళ్ళదు. అన్ఱిక్కే , ఆశ్రితరానవర్కళుక్కు అసత్యాది దోషఙ్గళ్ వారామల్ నోక్కిప్పోరుకిఅవర్ ఎన్నవుమామ్. "[72]కామాదిదోషహరమ్ ఆత్మపదాశ్రితానామ్" ఎన్గిఅపడియే "[73]శెటిన్దవర్తమేదత్తై మాఱ్ఱువరాయిరుప్పర్.

**(మణవాళమాముని )** రక్షకరన్ఱిక్కే యొఴిన్దాలుమ్ వడివిల్ భోగ్యత్తైయుమ్, తిరునామవైలక్షణ్యత్తైయుమ్ విడవొణ్ణాదాయిరుక్కై. పొయ్యిలామై పున్దిక్కు విశేషణమాకవుమామ్. అప్పోదు "[74]ఇరామానుశన్ మెయ్మ్మదిక్కడల్" ఎన్గిఅపడియే "[75]ఉణ్మైనన్ఞాన" మాన యథార్థజ్ఞానత్తై యుడైయవరెన్గై. అదావదు– "[76]మెయ్ఞానమిన్ఱి వినైయిల్ పిఱప్పఴున్ది " ఎన్గిఅ పడియే "[76ఎ]సంసారార్ణవమగ్న" రానవర్కళై "[77]ఞానక్కై"యాలే ఉద్ధరిత్తు ప్పోరుమవరెన్గై. చేతనర్ పడు మాపత్తై క్కణ్డాల్ కైయాలుమ్ కాలాలుమితే ఇవర్ ఎడుత్తు రక్షిప్పదు. "[78]ఞానక్కై తన్దు" "[79]వన్దరుళి" ఎడుత్త పున్దివాఴి. జ్ఞానప్రధానర్కళాయితే ఇవర్కళ్ ఇరుప్పదు. "[80]ధీభక్త్యాదిగుణార్ణవమ్ "ఎన్ఱుమ్, "[81]పున్ది వాఴి"ఎన్ఱుమ్ అరుళిచ్చెయ్దు పోకైయాలే, జ్ఞానమ్ సారభూతగుణమాకైయాలే

---

యుండునని భావము. ఇక పలుకనివారి లోపమే తప్ప ఎట్టి గొప్పతనము మణవాళమహాములనుగూర్చి పల్కినను అది అంతయు నిజమే అగును. లేక,ఆశ్రితులకు అసత్యవాదిత్వాదిదోషములు రాకుండునట్లు కాపాడువారు అనియు భావము. **"కామాదిదోషహర మాత్మపదాశ్రితానామ్"** (తనపాదముల నాశ్రయించినవారికి కామాదిదోషములను పోగొట్టువానిని) అని మణవాళమహాములు భగవద్రామానుజులను కీర్తించిన రీతిలో,వరవరమునులుకూడ ఆశ్రితుల దోషములను పోగొట్టువారై యుందురు.

**(మణవాళమాముని)** (వీరు పూర్వము తెల్పినరీతిలో) రక్షకములు ఒకవేళ కాకున్నను వీరి రూపములోని భోగ్యత, పేరులోని వైలక్షణ్యమును (అనగా **'మణవాళన్'** శబ్దముచే స్ఫురించు వీరి రూపవైభవము, **'మాముని'** అనుటచే వీరి నామవైభవము) అవర్జనీయములై యుండును. లేక, **"పొయ్యిలాద"** అను పదమును **"పున్ది"** అను వదమునకు విశేషణముగాకూడ చేయవచ్చును. అపుడు**"ఇరామానుశన్ మెయ్మ్మదిక్కడల్"** (శ్రీరామానుజులు తత్త్వజ్ఞానసముద్రులు) అని తిరువరఙ్గత్తముదనార్ ఇరామానుశనూ**ఱ్ఱ**న్దాదిలో పల్కిన రీతిలో శ్రీమణవాళమహాములు పారమార్థికమైన, విలక్షణమైన జ్ఞానమునుకలవారు అని అర్థము. అనగా,**"మెయ్ఞానమిన్ఱి వినైయిల్ పిఱప్పఴున్ది"** (తత్త్వజ్ఞానము లేక దుష్కర్మలను చేయుటలో ప్రయత్నమును చేయించు జన్మలయందు మునిగి) అని శఠకోపసూరిపల్కిన రీతిలో జన్మలు అను గొప్ప సముద్రమున మునిగినవారిని **"ఞానక్కై"** అనునట్లు జ్ఞానమను హస్తముతో ఉద్ధరించి, అనుగ్రహించువారు అనియు భావము. చేతనులు పడు కష్టములను చూచిన వీరు తన శ్రీహస్తములతో, శ్రీపాదములతోకదా ఉద్ధరించి రక్షింతురు. (అనగా–ఉపదేశములద్వారా యథార్థ జ్ఞానమును కల్గించి, తనపాదములను ఆశ్రయింపచేయుట ద్వారా చేతనులను రక్షింతురు అని భావము).**"ఞానక్కై తన్దు" , "వన్దరుళి"** (జ్ఞానహస్తము నిచ్చి, వేంచేసి ఉద్ధరించిన) అను ప్రమాణములు ఇచట అనుసంధేయములు. వీరు(ఆచార్యులు) జ్ఞానమును ప్రధానముగా కలవారై యుందురుకదా వీరు(ఆచార్యులు) .**"ధీభక్త్యాదిగుణార్ణవమ్"** (జ్ఞానము,భక్తి మొదలగు గుణములకు సముద్రునివంటి వానిని) అని, **"పున్ది వాఴి"** (జ్ఞానము వర్ధిల్లుగాక) అనిపల్కుటచే, జ్ఞానము (ఆచార్యుల)సారభూతమగు గుణమగుటనుబట్టి, మిగిలిన గుణములు అన్నింటికంటే దానిని ప్రధానముగాచెప్పనగును. (వీరు ఇట్లు జ్ఞానమును ప్రధానగుణముగా కల్గినవారని ఎట్లు తెలియును? అనినచో) **"తత్ర**

---

72. యతిరాజవింశతి –1
73. పాదాది కేశమాలై –1
74. ఇరామానుశనూఱ్ఱన్దాది –58
75. ఇరామానుశనూఱ్ఱన్దాది–73
76. తిరువాయ్మొఴి –3–2–7
76ఎ. విష్ణుధర్మమ్
77. తిరువాయ్మొఴి –2.9.2
78. తిరువాయ్మొఴి 2.9.2
79. తిరువాయ్మొఴి (5–7–7)
80. మణవాళ మామునితనియన్

అత్తై ప్రధానమాక చ్చొల్లక్కడవదు. "[82]తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్" ఎన్గిఱపడియే శుద్ధసత్వమయమాన విగ్రహమాకైయాలే ఉళ్లిల్ ప్రకాశిత్వమెన్న, **(ఉళ్లుళ్లవఱ్ఱై ప్రకాశిప్పిక్కడవదిఱే).** "పున్ది" ఎన్ఱు జ్ఞానమాత్రత్తైయుమ్ శొన్నదు భక్త్యాదిగళుక్కుమ్ ఉపలక్షణమ్. "[83]మఙ్గళం నిర్మలజ్ఞానభక్తివైరాగ్యరాశయే" ఎన్నక్కడవదిఱే.

**(వాఴ్త్రి)** మఙ్గళాశాసనమ్ పణ్ణియరుళినార్. జ్ఞానభక్త్యాదిగళిఱే ఆత్మాలంకారమా మెన్బదు; "[84]జ్ఞానభక్త్యాదిభూషితమ్" ఎన్నుమాపోలే. అన్ఱిక్కే, "[85]ఆచార్యనుక్కుడైయాళమ్ అఱివుమ్, అనుష్ఠానముమ్" ఎన్ఱుమ్, "[86]ఞాన మనుట్టాన మివై నన్గాకవే యుడైయనాన గురు" ఎన్ఱుమిఱే ఆచార్యలక్షణమరుళిచ్చెయ్‌దదు. ఆకైయాల్ ఆశ్రితరుడైయ అజ్ఞానత్తై ప్పోక్కి, సంబంధజ్ఞానత్తై విళైవిత్తు, కైంకర్యపర్యంతమాక నడత్తి క్కొణ్డు పోరువదెల్లామ్ తమ్ముడైయ జ్ఞానానుష్ఠానఙ్గళాలే ఎన్గై.

**(మణవాళమాముని పున్ది)** ఎన్గైయాల్ ఇవరుడైయ జ్ఞానమ్ అల్లాదారుడైయ జ్ఞానత్తిల్కాట్టిల్ అత్యంతవిలక్షణమాయ్, తత్త్వత్రయఙ్గళైయుమ్ అలకలకాక క్కాణవల్లదాయ్, "[87]తామరైయాళ్కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు" ఎన్గిఱపడియే శ్రియః పతియై విషయమాకవుడైత్తాయ్, అదుదాన్ తదీయశేషత్వమాకిఱ చరమావధియాన ఎల్లైనిలత్తిలే నిలైనిన్ఱు పోరుమదాయిరుక్కుమ్. తత్వత్రయఙ్గళోడు శ్రీవచనభూషణఙ్గణ్డ సకలశాస్త్రాచార్య రెన్నక్కడవదిఱే. ఆక, ఇవైయెల్లావఱ్ఱాలుమ్ గీతైయై యరుళియ

---

**సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్"** "(అందు సత్వగుణము నిర్మలమగుటచే ప్రకాశమును కల్గియుండును") అను గీతాసూక్తిని బట్టి, మణవాళమహాముసుల రూపము శుద్ధ సత్త్వమయగుటచే, అది తన లోపలగల జ్ఞానరూప ప్రకాశమును బయటకు గోచరింప చేయునదియై యుండును. **"పున్ది"** అనుచు ఇచట జ్ఞానమును మాత్రము చెప్పుట భక్త్యాదులకును ఉపలక్షణము. **" మంగళం నిర్మలజ్ఞానభక్తివైరాగ్యరాశయే"** (నిర్మలమైన జ్ఞానము,భక్తి, వైరాగ్యముల సమూహమునకు మంగళము") అనుచు అభిజ్ఞులు వీరిని మంగళము ఆశాసించిరికదా!

**(వాఴ్త్రి)** –(ఈవిధముగా) అణ్ణన్ శ్రీవరవరమునుల జ్ఞానభక్త్యాదులకు మంగళమాశాసించిరి. **"జ్ఞానభక్త్యాదిభూషితమ్"** (జ్ఞానము, భక్తి మొదలగు వానిచే అలంకరింపబడినవానిని) అనునట్లు జ్ఞానము,భక్తి మొదలగువానినికదా ఆత్మాలంకారములనుట.లేక, **"ఆచార్యనుక్కుడైయాళమ్ అఱివుమ్, అనుష్ఠానముమ్ "** (ఆచార్యులకు లక్షణము జ్ఞానము, అనుష్ఠానమును) అనియు, **"ఞాన మనుట్టాన మివై నన్గాకవే యుడైయనాన గురు"** (జ్ఞానము, అనుష్ఠానము అను వీనిని చక్కగా కల్గిన గురువు) అనియును ఆచార్యునకు నిరూపకములుగా జ్ఞానానుష్ఠానములు తెలుపబడినవికదా! అందుచే ఆశ్రితుల అజ్ఞానమును పోగొట్టి, శేషశేషిరూపసంబంధ జ్ఞానమును కల్గించి, భగవత్కైంకర్యపర్యంతము నిర్వహించుట అంతయు వరవరమునులు తన జ్ఞానానుష్ఠానములచే చేయుదురు. కావున ఇచట వానికి అణ్ణన్ మంగళమును పల్కినట్లును చెప్పనగును.

**(మణవాళమాముని పున్ది)** – అనుచు **"పున్ది"** శబ్దమును మణవాళమాముని శబ్దముచే విశేషింపచేయుటచే, శ్రీవరవరమునుల జ్ఞానము మిగిలినవారి జ్ఞానముకంటె విలక్షణమై, తత్త్వత్రయమును మిక్కిలి విశదముగా దర్శింపగల్గినదై, **"తామరైయాళ్కేళ్వన్ ఒరువనైయే నోక్కు ముణర్వు"** (పద్మనివాసినియగు లక్ష్మీదేవికి భర్తయగు భగవానుని, అనగా– శ్రీమన్నారాయణుని ఒక్కనినే లక్ష్యముగాకల జ్ఞానము) అని సరోయోగిసూక్తి ప్రకారము శ్రియః పతిని మాత్రమే విషయముగాకల్గినదై, ఆ శేషత్వ జ్ఞానమును తదీయ శేషత్వమను చరమావధియొక్క పర్యంతసీమలో నిలకడగా నుండునదియై యుండును–అని ధ్వనించుచున్నది. తత్త్వత్రయముతో పాటు, శ్రీవచనభూషణమును దర్శించిన (వ్యాఖ్యానించిన) సకల శాస్త్రాచార్యులుగా మణవాళమహాముసులు చెప్పబడుచున్నారు కదా! కావున వీని నన్నిటివలన **"కణ్ణనెన్గో"**(భగవద్గీతను అనుగ్రహించిన

---

81. మణవాళమామునివాఴ్త్రిత్తిరునామము
82. భగవద్గీతా –14-6
83.
84.
85.
86. ఉపదేశరత్తిన మాలై – 61
87. ముదల్‌తిరువన్దాది – 67

"[88]కణ్ణనెన్గో" ఎన్నుమ్బడి, "[89]నిఱైఞాన త్తొరుమూర్తి" యాన గీతోపనిషదాచార్యనోదు వికల్పిక్కలామ్బడి జ్ఞాననిధియాయిరుక్కిఱ ఇవరుడైయ జ్ఞానమావదు కలిదోషమ్ తట్టామల్ నిత్యమఙ్గళమాయ్ శెల్లవేణుమెన్ఱు వాళ్త్తి యరుళినా రెన్గై. కలిదోషత్తాలేయిఱే చేతనరుడైయ జ్ఞానమ్ అల్పీభవిత్తుప్పోవదు. "[90]ఇవర్ పల్లవరాయరుక్కే కలికడిత్త తిఱల్ వాళ్షియే" ఎన్నక్కడవదిఱే. "[91]కలికన్తియాన్ అరుళాల్ ఉయర్న్దవ" తిరే ఇవర్దాన్. ఇని, ఇవర్ ఇప్పడి తమ్ముడైయ జ్ఞానాను ష్ఠానఙ్గళాలే జ్ఞానవిపాక మఱ సకలచేతనరైయుమ్ రక్షిత్తు క్కొణ్డు పోరుకైయాల్ వన్ద పుకళ్లై చొల్లుకిఱదు. ఞాలముణ్డపుకళ్ పోలే యిరుప్పదొఱు పుకళ్లాయ్త్తు ఇదు. తన్ పుకళ్ నయ వారుడైయపుకళ్ పోఱ్ఱిరుక్కిఱపడి. అదావదు, జ్ఞానవైభవత్తాలే వన్ద పుకళ్లానదు "[92]తొల్ పుకళ్ శుడర్ మిక్కెళ్ణున్దదు" ఎన్గిఱపడియే నిరవధికతేజోరూపమాయ్, అప్రతిహతమాయ్ వాళ్గవేణు మెన్గై. "పుకళ్‌వాళ్షి"ఎన్ఱ అనన్తరమ్ "వాళ్షి" ఎన్ఱు ఇరట్టిప్పాయిరుక్కిఱదుక్కు ప్రయోజనమ్– "[93]పల్లాణ్డు " ఎన్గిఱారాకవుమామ్, అన్ఱిక్కే, "[94]నీళ్ పువియల్ తన్ పుకళ్లై నిఱుత్తమవన్ వాళ్షియే" ఎన్గిఱపడియే కీర్తి చ్చొన్న యశస్సుక్కు ఆధారమాయ్, అనుక్తమాన ఆత్మస్వరూపవైలక్షణ్యమ్ అనవరతభావియాయ్ శెల్లవేణుమెన్ఱు ఆశాసిక్కిఱారాకవుమామ్. అడియే తొడఙ్గి ఇదువేయిఱే ఇవర్క్కు యాత్తిరై. ఇత్తాల్–చరమపర్వమాన జీయర్‌విషయత్తిల్ మఙ్గళాశాసనమే అనుకూలరానవర్క్కు అనవరతకర్తవ్య మెన్ఱు అరుళిచ్చెయ్దు, తలైక్కట్టి అరుళినారాయ్‌ఱ్ఱు.

---

కృష్ణుడాఏమి)అనునట్లు **"నిఱైఞాన త్తొరుమూర్తి"** (జ్ఞానము నిండుగానున్న ఒక అద్వితీయమైన రూపము) అను గీతోపనిషదాచార్యుడగు శ్రీకృష్ణుని జ్ఞానముతో పోల్చదగినట్లున్న మణవాళమహామునుల జ్ఞానమునకు కలిదోషము కలుగకుండ నిత్యమంగళమై యుండవలెనని అణ్ణన్ ఆశాసించిరని తాత్పర్యము . ఎందులకనగా , కలిదోషమువలన చేతనుల జ్ఞానము అల్పమై పోవును కదా ! **"ఇవర్ పల్లవరాయరుక్కే కలికడిత్త తిఱల్ వాళ్షియే "** (వీరు..... పల్లవరాయనికి కలిదోషమును పోగొట్టిన బలిమికి మంగళము) అని అభిజ్ఞులు వీరి కలిహరణశక్తికి మంగళము పల్కిరికదా! (ఇట్లు కలిదోషమును పోగొట్టగల్గిన శక్తి వీరికి కలదా అనినచో) కలివైరి (తిరుమఙ్గైయాళ్వార్లు లేదా నమ్బిళ్లై) కరుణవలన వృద్ధిచెందినవారుకదా వీరు. కావున కలిదోషమును పోగొట్టగలరు. **(పుకళ్ వాళ్షి)** అను ప్రయోగములోని **"పుకళ్"**పదముచే వీరు ఇట్లు తమ జ్ఞానము, అనుష్ఠానములతో జ్ఞాని– అజ్ఞాని భేదములేక సకలచేతలను రక్షించుటవలన కల్గిన కీర్తి తెలుపబడినది. లోకములను అన్నిటిని గ్రహించిన (వ్యాపించిన) భగవానుని కీర్తి వలె నున్నదొక అద్వితీయమైన కీర్తి ఇది. ఇట్లు అణ్ణన్, పొగడ్తను ఇష్టపడని మణవాళమహామునుల కీర్తిని పొగడినట్లయినది. అనగా, శ్రీవరవరమునుల జ్ఞానవైభవముచే కల్గిన కీర్తి– **"తొల్ పుకళ్ శుడర్ మిక్కెళ్ణున్దదు"** (స్వాభావికమైన కీర్తి అంతులేని తేజస్సును కల్గినదై వర్ధిల్లినది) అని శ్రీరంగామృతకవి (అముదనార్) భగవద్రామానుజుల కీర్తిని స్తుతించినట్లు నిరవధికతేజోరూపమై , అప్రతిహతమై వర్ధిల్లవలెనని భావము. **"పుకళ్ వాళ్షి"** అనిన పిమ్మట మరల **"వాళ్షి"** అను ద్విరుక్తిని పల్కుటకు ప్రయోజనము ఏమనగా పెరియాళ్వార్లు భగవానుని విషయమున పలుమార్లు **"పల్లాణ్డు పల్లాణ్డు"** అని మంగళాశాసనమును చేసినట్లే, వీరును మణవాళమహామునుల విషయమున పలుమార్లు మంగళాశాసనమును చేయుట కొఱకే . లేక, **"నీళ్ పువియిల్ తన్ పుకళ్లై నిఱుత్తుమవన్ వాళ్షియే"** (విశాలమైనభూమి యందు తనకీర్తిని స్థిరముగా నిలుపువానికి మంగళము) అని అభియుక్తులు శ్రీవరవరమునులకు మంగళాశాసనము చేసినట్లు, పూర్వము వర్ణించిన యశస్సుకు ఆధారమై , ఇంతవరకు చెప్పబడని ఆత్మస్వరూపవైలక్షణ్యము భావికాలమునను అనవరతముగా వర్ధిల్లవలెనని రెండవ **"వాళ్షి "** పదముచే అణ్ణన్ సూచించుచున్నారనియు చెప్పవచ్చును. పాదములనుండి ప్రారంభించి (మొదటి నుండియే అని అర్థాంతరము) అణ్ణన్‌కు ఇదియేకదా పని ! (అణ్ణన్ శ్రీవరవరమునుల పాదముల నుండి ప్రారంభించి మంగళాశాసనమును చేసిరికదా). దీనివలన చరమపర్వమగు మణవాళమహామునివిషయక మంగళాశాసనమే భక్తులకు నిత్యకర్తవ్యమని అనుగ్రహించి అణ్ణన్ ఈమంగళస్తుతిని పరిసమాప్తిచేసిరి).

---

88. తిరువాయ్‌మొళ్షి –3–4–6
89. తిరువాయ్‌మొళ్షి –6–8–6
90.
91.
92. ఇరామానుశనూఱ్ఱన్దాది –61
93. తిరుప్పల్లాణ్డు –1
94. మణవాళమామునివాళ్షిత్తిరునామము

[95]వాళ్రి శెన్దామరైత్తాళ్ తువరాడై మరుఙ్గు కొప్పూళ్రి
వాళ్రి మున్నూలుత్తైమార్బు ముక్కోలఙ్గై వాళ్రి తిణ్డోళ్
వాళ్రి శెవ్వాయ్ విళ్రి వాళ్రి పొన్ నామమ్ మరువునుదల్
వాళ్రి పొఙ్కోయిల్ మణవాళమాముని వాళ్రి ముడియే.

జీయర్‌తిరువడిగళే శరణమ్.



స్వర్ణమయముగ నుందు కోవెల (శ్రీరంగములో) నిత్యవాసము చేయు శ్రీమణవాళమహామునుల ఎఱ్ఱని తామరపూలవంటి పాదములు, కాషాయ వస్త్రము, నడుము, నాభి, యజ్ఞోపవీతమునుకల వక్షఃస్థలము, త్రిదండమును దాల్చిన శ్రీహస్తము, బలిష్ఠములైన భుజములు, ఎఱ్ఱని పెదవి (అధరము), నేత్రములు, రమణీయమైన ఊర్ధ్వపుండ్రమును దాల్చిన లలాటము,దివ్యశిరము మొదలగు దివ్యావయవములన్నియు నిత్యమంగళముగా వర్ధిల్లవలెను.

జీయర్ తిరువడిగళే శరణము.



95. పాదాదికేశమాలై -10

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీశైలేశదయాపాత్ర శ్లోక వ్యాఖ్యానము

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥

## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానమ్

(శ్రీశైలేత్యాది)- "నమ శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే, ప్రసాదలబ్ధ ప్రాప్యకైఙ్కర్యశాలినే" (తనియన్) ఎన్గుమ్, "పరమప్రాప్యపరాఙ్కుశ చరణపఙ్కజవిషయ వివిధకైఙ్కర్యకరణ చాతుర్యధుర్యశ్రీశైలవరదేశికాధీశ" ఎన్గుమ్, "అనన్దన్ తిరుమలైయాழ్వానెన వన్దవతరిత్తు" (యతీంద్రప్రవణప్రభావమ్) ఎన్గు మవతారవిశేషమాక చ్చొల్లప్పడుమవరాయ్, చరమపర్వమాన ఆழ్వార్తిరువడికళిల్ కైఙ్కర్యత్తై యవరరుళాలే లభిత్తు వాழుమవరాయ్, అతిలు మవర్తిరువడికళాన ఎతిరాశర్ "శెమ్బొఱ్పాత"(ఇరామానుశ-13)మిరవు పకల్ మఱవామల్ "ఇఱైఞ్జి ఏత్తు మొழி"(ఆర్తిప్రబంధమ్-21)లైయుడైయ "తిరువాయ్మొழிప్పిళ్ళై శీరరుళుక్కు" "ఏఱ్ఱకల" (తిరుప్పావై-22) మాయుళ్ళవరై. "భవ్యశ్రీశైలనాథార్యపరిపూర్ణకృపాజుషే" (వరవరమునిమంగళమ్) ఎన్నక్కడవదిఱే. శ్రీశైలపూర్ణర్కృపైయాలుమ్, శ్రీశైలదేశికర్దయైయాలుమ్ "ఇరామాయణ మెన్ను మ్పత్తివెళ్ళమ్" (ఇరామానుశ-37), "తీర్త్తఙ్గళాయిరమాన" (తిరువాయ్-7-10-11) తిరువాయ్మొழிయుమ్, యతీన్ద్ర

---

## శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానానువాదం

(శ్రీశైలేశేత్యాది)- "నమః శ్రీశైలనాథాయ కుంతీనగరజన్మనే, ప్రసాదలబ్ధ పరమప్రాప్యకైంకర్యశాలినే" (కుంతీనగరంలో జన్మించినవారు, ఆழ్వార్ల అనుగ్రహంచేత పొందిన, పరమప్రాప్యం అయిన వారి కైంకర్యాన్ని కలవారు అయిన తిరువాయ్మొழிప్పిళ్ళైకు నమస్కారం) అని, "పరమప్రాప్యపరాంకుశచరణపంకజ విషయవివిధకైంకర్యకరణచాతుర్యధుర్య! శ్రీశైలవరదేశికాధీశ" (పరమప్రాప్యం అయిన నమ్మాழ్వార్ల శ్రీచరణపంకజాల విషయంలో పలు కైంకర్యాలను చేయడంలో చాతుర్యాన్ని కల, తిరువాయ్మొழிప్పిళ్ళై అనే ఆచార్యవర్యా!) అని, "అనన్దన్ తిరుమలైయాழ్వానెన వన్దు అవతరిత్తు" (అనంతుడు తిరువాయ్మొழிప్పిళ్ళైగా వచ్చి అవతరించి) అని కీర్తించే రీతిలో (అనంతుని) అవతార విశేషంగా చెప్పబడేవారై, చరమపర్వం అయిన ఆழ్వార్ల శ్రీపాదాలలో కైంకర్యాన్ని వారి అనుగ్రహంచేత పొంది ఉజ్జీవించేవారై, అంతకంటేకూడా వారి పాదస్థానీయులైన శ్రీరామానుజుల "శెమ్పొఱ్పాదమ్" (ఎఱ్ఱని, భోగ్యమైన శ్రీపాదాలను) రాత్రి పగలు మఱవకుండా కీర్తించే శోభను కల "తిరుమలై యాழ్వార్ తిరువాయ్మొழிప్పిళ్ళై శీరరుళ్" (తిరుమలై యాழ్వార్ అనబడే తిరువాయ్మొழிప్పిళ్ళై నిర్హేతుకకృపకు) "ఏఱ్ఱ కలమ్" (తగిన పాత్రం)గా ఉన్నవారిని- అని భావం. "భవ్యశ్రీశైలనాథార్యపరిపూర్ణకృపాజుషే, రమ్యజామాతృమునయే మహాభాగాయ మంగళమ్" (భవ్యమైన తిరువాయ్మొழிప్పిళ్ళై పరిపూర్ణకృపను పొందినవారు, మహానుభావులు అయిన రమ్యజామాతృమునులకు మంగళం) అని మణవాళమహామునులకు మంగళాశాసనం చేయబడుతున్నదికదా! శ్రీశైలపూర్ణుల (తిరుమలైనంబి) కృప చేత, శ్రీశైలదేశికుల (తిరువాయ్మొழிప్పిళ్ళై) కృపచేత "పడి కొణ్డ కీర్త్తి ఇరామాయణమెన్నుమ్ పత్తివెళ్ళమ్ కుడికొణ్డ కోయిల్ ఇరామానుశన్ కుణమ్ కూఱుమ్" (భూమండలం అంతా వ్యాపించి ఉండే మంచి పేరు కల శ్రీరామాయణం అనే భక్తిసముద్రం) అనే శ్రీరామాయణం, "తీర్త్తనుక్కఱ్ఱపిన్ మఱ్ఱోర్ శరణిల్లై ఎన్ఱెణ్ణి తీర్త్తనుక్కే తీర్త్త మనత్తనరాకి శెழுమ్ కురుకూర్ శడకోపన్ శొన్న తీర్త్తఙ్గళాయిరత్తుళ్" (తీర్థస్వరూపుడైన భగవానునకు శేషభూతుడైన తర్వాత వేఱొక ఉపాయం ఏదీ లేదని భావించి, ఆ పరమపావనునకే అధీనం

త(త్ప్రవణరిడజ్ఞళిలే కుడికొణ్డు తేజ్గి*న్ఱు*. ఇవరుమ్ "తన్పత్తియెన్నుమ్ వీట్టిన్గణ్ వైత్త" (ఇరామానుశ-29) పిన్పితే పెరుకి వెళ్ళమిట్టు విళైన్దతు. "శ్రీరామాయణదుగ్ధసిన్ధుః", "పాలోడముదన్న ఆయిరమ్"(తిరువాయ్-8-6-11). ఇరామానుశనితే యివరుమ్.

(ధీభక్త్యాదిగుణార్ణవమ్) "మతినలజ్గళ్"(తిరువాయ్ 1-1-1) ఇవరుక్కు ప్పిళ్ళైయరుళాలుణ్డాయి*న్ఱు*. "ప్రకృష్టవిజ్ఞానబలైకధామని" (స్తోత్రరత్నమ్) ఎన్డుమ్, "లక్ష్మణస్య చ ధీమతః" (రామా-సుందర-16-2), "న దేవలోకాక్రమణమ్" (రామా-అయో-31-5) ఎన్డు తుడజ్గి, "త్వయా వినా న కామయే" (రామా-అయో-31-5) ఎన్డుమితే ఏతత్పూర్వావతారజ్గళిలుమ్ జ్ఞానభక్త్యాదికళ్ పూర్ణమాయిరుప్పదు. "ఆరావన్బిళైయవ" (పెరుమాళ్ 8-5) నితే. "అచ్యుతపదాంబుజయుగ్మవ్యామోహా" (పాదుత్తనియన్) దికళుణ్డితే యిజ్గే. ఇవ్వవతారత్తిఱ్కుత్తైకళుమ్ తీర్క్క అవతరిత్త విడత్తిలుమ్, పెరియపెరుమాళ్

---

అయిన మనస్సును కలవారై, అందమైన ఆఌ్వార్ తిరునగరిలో ఉండే నమ్మాఌ్వార్ చెప్పిన తీర్థాలవంటి - దిగి స్నానం చేసే రేవులవంటి- వేయి పాశురాలలో) అనబడే తిరువాయ్‌మొఌి (వరుసగా) యతీంద్రులవద్ద, యతీంద్రప్రవణులవద్ద స్థిరపడి, తేటపడ్డాయి. వీరుకూడా (శ్రీవరవరమునులుకూడా) "తెన్ కురుకైప్పిరాన్ పాట్టెన్నుమ్ వేదప్పశుమ్‌తమిఌ్‌తన్నై తన్ పత్తియెన్నుమ్ వీట్టిన్‌కణ్ వైత్త" (అందమైన కురుకాపురికి అధికులైన నమ్మాఌ్వార్ల పాశురాలు అనే ప్రసిద్ధమై, వేదస్వరూపం అయిన, చక్కని పదాల పొందికను కల ద్రావిడభాషలోని తిరువాయ్‌మొఌి ప్రబంధాన్ని తమ భక్తికి విషయంగా చేసిన) తర్వాతకదా తిరువాయ్‌మొఌి వర్ధిల్లి, ప్రవాహమై వెలసింది. "శ్రీరామాయణదుగ్ధసింధుః" (శ్రీరామాయణం అనే క్షీరసముద్రం) అని శ్రీరామాయణం, "శోలై తిరుక్కడిత్తానత్తు ఉఱై తిరుమాలై మతిళ్‌కురుకూర్ చ్చడకోపన్‌శొల్ పాలోడముదన్న ఆయిరమ్" (తోటలచే చుట్టబడి ఉండే "తిరుక్కడిత్తానమ్" అనే దివ్యదేశంలో నిత్యవాసం చేస్తున్న శ్రియఃపతి విషయంగా ప్రాకారాలను కల కురుకాపురికి నాథులైన నమ్మాఌ్వార్ అనుగ్రహించిన, పాలతో కలిసిన అమృతంవలె భోగ్యాలైన వేయి పాశురాలు) అని తిరువాయ్‌మొఌి ఈ రెండూ పాలు, అమృతం వలె పరమభోగ్యాలుగా చెప్పబడ్డాయి. వీరు (వరవరమునులు) కూడా రామానుజులే (రామానుజుల అవతారవిశేషమే) కదా!

(ధీభక్త్యాదిగుణార్ణవమ్)- (భగవానుని విషయంలో) "మదినలమ్" (జ్ఞానభక్తులు) వీరికి తిరువాయ్‌మొఌిప్పిళ్ళై అనుగ్రహంవల్ల కలిగాయి. "అనంతభోగిని ప్రకృష్టవిజ్ఞానబలైకధామని" (గొప్ప జ్ఞానానికి, బలానికి అద్వితీయస్థానం అయిన అనంతుడనే సర్పంపై) అని ఆదిశేషావతారంలో, "రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః, నాత్యర్థం క్షుభ్యతే దేవీ గంగేవ జలదాగమే" (రామునియొక్క, గొప్ప బుద్ధిమంతుడైన లక్ష్మణునియొక్క ప్రయత్నాన్ని తెలిసినది అయిన సీతాదేవి, శరత్కాలంలోని గంగవలె ఎక్కువగా క్షోభిల్లడంలేదు) అని, "న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే, ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా" (నీవు లేకపోతే దేవలోకాన్ని ఆక్రమించడం అనే స్వర్గఫలప్రాప్తిని కాని, అమరత్వమనబడే కైవల్యాన్ని, ఇహలోకైశ్వర్యాన్ని కాని నేను కోరను) అని లక్ష్మణుడనే అవతారంలో, ఈ అవతారానికి (వరవరముని అనే అవతారానికి) ముందున్న అవతారాలలోకూడా జ్ఞానభక్తులు వీరికి పూర్ణంగా ఉన్నాయి కదా! లక్ష్మణుడు "పారాళుమ్ పడర్ శెల్వమ్ పరతనమ్బిక్కే అరుళి, ఆరా అన్బిళైయవనోడు అరుఙ్కాన మడైన్దవనే" (భూమిని అంతటినీ పాలించే గొప్ప సంపదను తమ్ముడు భరతునకు అప్పగించి, గొప్ప భక్తిని కల లక్ష్మణునితో అరుదైన కీకారణ్యాన్ని చేరినవాడా) అని కులశేఖరప్పెరుమాళ్ లక్ష్మణుని గొప్పభక్తిని కలవానినిగా కీర్తించారుకదా! భగవద్రామానుజులుగా అవతరించినపుడుకూడ "యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః తదితరాణి తృణాయ మేనే" (నిత్యం అచ్యుతుని పదపద్మాల జంట అనే బంగారంలోని ఆశవల్ల మిగిలినవాటిని అన్నిటినీ తృణప్రాయంగా ఎవరు భావించారో!) అని చెప్పబడ్డ రీతిలో భగవానుని విషయంలో గొప్ప భక్తిని వీరు కలిగి ఉన్నారుకదా! ఆ అవతారాలలోని కొఱతలు తీర్చడంకోసం అవతరించినచోటకూడా

విషయత్తుక్కనురూపమాక ప్పెరియజీయరుడైయ అన్ద ప్రేమాదికళిరట్టిత్తిటే యిరుప్పతు. "నిర్మలగుణమణిగణవరుణాలయ", "యథా రత్నా నిజలధేః" (మాత్స్యే), "గుణానా మాకరః" (వి.పు.1-15-156) ఎన్నక్కడవతిటే. 'సౌమిత్రి ర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ" (వరవరముని శతకమ్) ఎన్నుమ్, "యతివరపునరవతారః" ఎన్నుళ్ళొల్లక్కడవతిటే.

ఇని, నమ్బెరుమాళిడత్తిల్ ప్రావణ్యమ్ ఎల్లైయాన ఎమ్బెరుమానారళవుమ్ వర్ధిత్తపడి శొల్లుకిఱతు. సాధ్యవివృద్ధియాయ్క్కొణ్డు చరమపర్వమ్ వరక్కడవతా యిరుక్కుమ్.

(యతీన్ద్రప్రవణమ్) అన్ద ప్రావణ్యాన్దాన్, "యతీన్ద్రప్రవణాయాస్మద్గురవే గుణశాలినే" (వరవరముని మంగళమ్) ఎన్ఱు విశేషజ్ఞరాన వేదాన్తాచార్యరుమ్ వికృతరాయ్ ప్పేశి యనుభవిక్కుమ్బడియాయిరుక్కుమ్. ఇవర్ తామ్

---

(వరవరమునులనే ఈ అవతారంలోకూడా) పెరియపెరుమాళ్ అనబడే శ్రీరంగనాథుడనే విషయానికి తగినట్లుగా పెరియజీయర్ అనబడే వరవరమునులకు కల ఆ ప్రేమాదులు ద్విగుణీకృతాలైకదా ఉంటాయి. (వీరి భక్తికి విషయం అయిన శ్రీరంగనాథునకు పెరియపెరుమాళ్ అని, భక్తిని కల వరవరమునులకు పెరియజీయర్ అని పేరు ఉన్నందున, పెరియశబ్దానికి జ్ఞానభక్తులు ద్విగుణీకృతాలై ఉంటాయనే అర్థంలోని స్వారస్యాన్ని గమనించాలి). **"నిర్మలగుణమణిగణవరుణాలయ"** (ఏ దోషం లేని గుణాలనే మణుల గణాలకు సముద్రంవంటివాడా!) అని, **"యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక, తథా గుణాహ్యనంతస్య అసంఖ్యేయా మహాత్మనః"** (కుమారా! సముద్రంలోని రత్నాలు లెక్కలేనన్ని ఉండేటట్లే మహాత్ముడైన అనంతుని గుణాలుకూడా లెక్కపెట్ట వీలులేనివి) అని, **"జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః, ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్"** (జ్ఞానవిజ్ఞానసంపన్నుడు, తండ్రి ఆజ్ఞకు ఎల్లప్పుడూ లోబడి ఉండేవాడు, ధాతువులకు గొప్ప పర్వతంవలె, గుణాలకు గొప్ప ఆకరం అయినవాడు శ్రీరాముడు) అని అనబడుతున్నదికదా! (ఈ ప్రమాణాలు రెండూ భగవానుని విషయంలో చెప్పబడినవి అయినా, ప్రకృతంలో అర్థస్వారస్యాన్నిబట్టి వరవరమునుల విషయంలో ప్రయోగింపబడ్డాయని గ్రహించాలి. అయితే, **"యథా రత్నాని"** అనే ప్రమాణంలోని అనంతశబ్దం ఆదిశేషుని వాచకమై ఉండడంకూడా గమనార్హం. వరవరమునులు ఆదిశేషుని అవతారమేకదా!) **"సౌమిత్రి ర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ"** (భగవానులైన రమ్యజామాతృమునులు లక్ష్మణులేకదా) అని, **"యతివరపునరవతారః"** (భగవద్రామానుజుల వేఱొక అవతారం) అని చెప్పదగి ఉన్నది కదా! **"ధీభక్త్యాదిగుణార్ణవమ్"** అనే ఈ విశేషణంవల్ల వరవరమునులు శ్రీరంగనాథుని విషయంలో గొప్ప జ్ఞానభక్తులను కల్గి ఉన్నారని తెలుపబడింది.

ఇక, శ్రీరంగనాథుని విషయంలోని ఈ ప్రావణ్యం భగవద్రామానుజులవరకు వర్ధిల్లిన తీరు చెప్పబడుతున్నది. సాధ్యం అయిన భగవంతుని విషయంలోని జ్ఞానభక్తులు వృద్ధి చెంది, చరమపర్వం వరకు అనువర్తించాలికదా!

**(యతీంద్రప్రవణమ్)**- ఆ ప్రావణ్యం - **"యతీంద్రప్రవణాయాస్మద్గురవే గుణశాలినే, ప్రయుంజే మంగళం రమ్యజామాతృవరయోగినే"** (భగవద్రామానుజుల విషయంలో గొప్ప ప్రావణ్యాన్ని కలవారు, గుణాలతో శోభిల్లేవారు, అస్మదాచార్యులు అయిన రమ్యజామాతృమునులకు మంగళాన్ని పలుకుతాను) అని విశేషజ్ఞులైన, వేదాంతాచార్యులనబడే ప్రతివాదిభయంకరం అణ్ణన్‌కూడా వీరి జ్ఞానభక్తులను చూచి వికారాన్ని పొంది (మనస్సులో గొప్ప ఆనందం అనే వికారాన్ని పొంది)నవారై, మంగళాన్ని పల్కి, ఆనందించేటట్లుగా కదా ! ఉంటుంది. ఈ వరవరమునులు. **"నిజదేశికసందర్శిత సంయమిధురంధరనిహితసకలనిజభరవరవరమునివరులు"** (తమ ఆచార్యులైన తిరువాయ్‌మొழிప్పిళ్ళైచేత చూపబడ్డ యతిరాజులసన్నిధిలో ఉంచిన తమ సకలభారాన్ని కల వరవరమునులు) కదా! వారు (భగవద్రామానుజులు) **"శ్రీమాధవాంఘ్రిజలజద్వయ నిత్యసేవాప్రేమావిలాశయపరాంకుశపాదభక్తులు"** (శ్రియఃపతి పాదకమలయుగంలో నిత్యం సేవచేయాలనే ప్రేమచేత వ్యాకులాన్ని పొందిన నమ్మాழ்వార్ల పాదాలలో భక్తిని కలవారు). వీరు (వరవరమునులు) యతీంద్ర

"నిజదేశికసన్దర్శితసంయ మిథురన్ధరనిహితసకలనిజభరవరవరమునివర" రితే. అవర్ పరాఙ్కుశపాదభక్తర్; ఇవర్ యతీన్ద్రప్రవణర్. అన్ద ప్రావణ్యమితే యివరై అనైవరుమ్ కాల్ కట్టుకిఱతు.

(వన్దే రమ్యజామాతరం మునిమ్) "వన్దే ముకున్దప్రియాన్" ఎన్గిఱతెల్లా మివరుక్కు ఇవ్విషయత్తిలేయాయి*ఱ్ఱు*. "శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమః" (శెయ్యతామరైతాళిణైవ్యాఖ్య) ఎన్నుమాప్పోలే తిరునామత్తై యనుసన్ధిత్తు త్తిరువడికళిలే వి*ழு*కిఱార్. ఇవరుడైయ అనుసన్ధానవిషయమాన మన్త్రముమ్, స్తుతిప్రణామము మిరుక్కుమ్బడి యితు వాయి*ఱ్ఱు*. "వవన్దే నియతో మునిమ్" (రామా-యుద్ధ-127-1) ఎన్గిఱపడియే శేషశేషికళుడైయ సత్తాసమృద్ధికళివర్ సఙ్కల్పాధీనైకళా యిరుక్కుమ్బడియైప్ప*ఱ్ఱ* (ముని) యెన్గిఱతు.

ఇప్పడికళాలే*ఱ్ఱ*ఙ్గళై యుడైయ ఇవర్‌స్తుతిరూపమాన ఇవర్‌తనియన్దాన్, "యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః" (తైత్తి-నారా-17) ఎన్దు "వేతత్తు క్కో"(ఉపదేశ-19) మెన్నుమాప్పోలే, ద్రావిడవేద - తదఙ్గోపాఙ్గఙ్గళెన్న, ఏతద్వ్యాఖ్యానవిశేషఙ్గళెన్న, ఏతత్సారభూతమాన రహస్యఙ్గళెన్న, ఇవ*ఱ్ఱి*నుడైయ అద్యన్తఙ్గళిలే అఖిలదివ్యదేశవిలక్షణరాలుమ్ అనుసన్ధిక్కప్పడుమతా యిరుక్కుమ్. ఇవరుడైయ సకలదివ్యప్రబన్ధప్రవర్తకత్వమ్ పణ్డు పలవిడఙ్గళిలే కణ్డుకొళ్వతు.

---

ప్రవణులు (శ్రీరామానుజులపట్ల గొప్ప భక్తిని కలవారు. ఆ ప్రావణ్యమేకదా వీరిని అందఱినీ (ఆచార్యులను అందఱినీ) కాలుకట్టి పడవేస్తున్నది. (పాదాక్రాంతులు అయేటట్లు చేస్తున్నది)

**(వందే రమ్యజామాతరమ్ మునిమ్)- "వందే ముకుందప్రియాన్"** అని అంటూ అనుసంధించే ఆచార్యస్తుతి అంతా వీరికి (పెరియపెరుమాళ్‌కు) వరవరమునుల విషయంలోనే అయినది. **"శ్రీమతే రమ్యజామాతృమునయే విదధే నమః"** (కైంకర్యశ్రీని కల రమ్యజామాతృమునికి నమస్కారాన్ని చేస్తున్నాను) అనే రీతిలో వీరి తిరునామాన్ని అనుసంధించి, శ్రీపాదాలపై పడుతున్నారు. వీరి (అనుసంధాన విషయమైన మంత్రం, స్తుతి ప్రణామం ఉండే) తీరు ఇది. (వది-అభివాదనస్తుత్యోః" అనే ధాతువునుండి పుట్టిన "వందే" అనే క్రియకు అభివాదనం చేస్తున్నాను, స్తుతిస్తున్నాను- అని అర్థం కనుక, వాచికకైంకర్యాలైన ఈరెండింటిచేత మానసికంగా భావన చేయడంకూడా ఉపలక్షింపబడుతున్నది. **"వందే రమ్యజామాతరం మునిమ్"** అనే మంత్రాన్ని మానసికంగా అనుసంధిస్తూ, రమ్యజామాతృమునులను స్తుతిస్తూ, నమస్కరిస్తున్నాను- అని ప్రకృతంలో తాత్పర్యం.) **"పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః, భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిమ్"** (పదునాల్గవ ఏడు పూర్తికాగానే పంచమీతిథిలో లక్ష్మణాగ్రజుడైన శ్రీరాముడు భరద్వాజాశ్రమాన్ని చేరి, వినమ్రుడై ఆ మునికి నమస్కరించాడు) అని భగవానుడైన శ్రీరాముడు భరద్వాజమునిని నమస్కరించినట్లు, శ్రీరంగనాథుడు కాలక్షేపం పూర్తికాగానే వరవరమునులకు నమస్కరించాడు. ఈ రీతిలో శేషభూతుడైన జీవుని సత్తాసమృద్ధులు, శేషిభూతుడైన సర్వేశ్వరుని సత్తా సమృద్ధులు- వీరి (వరవరమునుల) సంకల్పంపైనే ఆధారపడి ఉన్నాయి. కనుక **"మునిమ్"** అని ప్రయోగింపబడింది. (**"మననశీలో మునిః"** కనుక భగవానుని సత్తాసమృద్ధులను, గూర్చి జీవుల సత్తాసమృద్ధులనుగూర్చి, ఎల్లప్పుడూ మననం చేసేవారని ఈ పదానికి ప్రకృతంలో అర్థం.)

ఇటువంటి అతిశయాలను కల ఈ వరవరమునుల స్తుతిరూపం అయిన ఈ తనియన్- **"యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"** (ఏస్వరం వేదం ఆదిలో అనుసంధింపబడుతున్నదో, వేదం చివరలోను స్థిరంగా ఉన్నదో, తనకు కారణభూతం అయిన అకారంలో లీనం అయిన ఆ ఓంకారానికి అర్థభూతుడై ఉండేవాడు సర్వేశ్వరుడు) అని, **"వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాయ్ తాన్ మఙ్గల మాదలాల్"** (వేదానికి అంతటికీ సంగ్రహంగా ఉండే **"ఓమ్"** అనబడే ప్రణవంవలె, ఉండే విషయానికి అంతటికీ సంగ్రహమై శుభకరమైనది కనుక) అనే రీతిలో ద్రావిడవేదాలు గాని, వాటి అంగాలు, ఉపాంగాలు గాని, వాటి వ్యాఖ్యానవిశేషాలు గాని, వీటి సారభూతాలైన

అతుక్కుమేలే, ఉభయప్రధాన ప్రణవమాన (ఆచార్యహృదయమ్) ఉఱైకోయిలిలేయితే ఇవరుతిత్తరుళి*గ్ఱు*. ఇవరుక్కివ్వైభవమ్ జన్మసిద్ధమ్. ఇతు, ప్రణవార్థమాకిఱతు- పితాపుత్ర-రక్ష్యరక్షక- శేషశేషిసమ్బన్ధత్రయము మివరిడత్తిలే దర్శిక్కైయాయిరుక్కైయాలే.

"అకార శ్చిత్స్వరూపస్య విష్ణో ర్వాచక ఇష్యతే, ఉకార శ్చిత్స్వరూపాయా శ్శ్రియో వాచీ తథా విదుః, మకార స్తు తయో ర్దాస ఇతి ప్రణవలక్షణమ్"(నిరుక్తి) ఎన్గైయాలే అకారమ్ భగవద్వాచకమాయుమ్, మకారమ్ చేతనవాచకమాయుమ్, ఉకార ముభయసమ్బన్ధప్రకాశకైయైయుమిఱ్జొల్లుమ్. "అవ్వానవర్కు మవ్వానవరెల్లా మువ్వానవరడివై యెన్ఱురైత్తార్"(ప్రమేయసారమ్-1) ఎన్నక్కడవతిఱే. "విళక్కుప్పొన్పోలే". "నడునిలత్తీవ" మిఱే. "మఙ్గళదీపరేఖామ్" (శ్రీగుణరత్నకోశం-1), "శ్రియో ఘటకభావతః" , "శ్రియా ఘటకయా" ఎన్ఱేతత్సాపేక్షమాయిఱే యిరుప్పతు. "జగతో

---

రహస్య గ్రంథాలుగాని- వీటి ప్రారంభంలో, చివర సమస్తదివ్యదేశాలలో ఉండే విలక్షణులైన పెద్దలచేత అనుసంధింపబడుతున్నది. ఈ వరవరమునుల సకలదివ్యప్రబంధ ప్రవర్తకత్వం పూర్వమే పలు సందర్భాలలో గమనించవచ్చు. అంతేకాక, ఉభయ ప్రధానమ్- అంటే, అకారంచేత భగవానుని, మకారంచేత జీవుని ప్రతిపాదించడంవల్ల ఈ ఇద్దఱినీ తెలిపే - "ప్రణవాకారమ్" అన్నట్లు ప్రణవంయొక్క ఆకారంవంటి ఆకారాన్ని కల్గిన ప్రణవాకార విమానాన్ని కల శ్రీరంగంలో కదా వీరు అవతరించి, అనుగ్రహించారు. వీరికి ఈ వైభవం జన్మసిద్ధం. ఈతని ప్రణవార్థాన్ని ఏ విధంగా అనుసంధిస్తున్నది? అని అంటే, పితా-పుత్ర, రక్ష్య-రక్షక, శేష-శేషిసంబంధాలు వీరిలో - మణవాళ మహామునిలో దర్శించేటట్లు ఉండడంచేత.

"అకారః చిత్స్వరూపస్య విష్ణో ర్వాచక ఇష్యతే, ఉకారః చిత్స్వరూపాయాః శ్రియో వాచీ తథా విదుః, మకార స్తు తయో ర్దాస ఇతి ప్రణవలక్షణమ్" (అకారం చిత్స్వరూపుడైన విష్ణువుయొక్క వాచకంగా అంగీకరింపబడుతున్నది. ఆ రీతిలోనే ఉకారం చిత్స్వరూపిణి అయిన లక్ష్మికి వాచకమని తెలిసికొంటున్నారు.ఇక, మకారం అయితే వారిద్దరికీ దాసుడైన జీవుని తెలుపుతుంది. ఇది ప్రణవలక్షణం)- అని నిరుక్తి చెప్పినట్లు అకారం భగవానుని వాచకంగాను, మకారం జీవవాచకంగాను, ఉకారం వీరిద్దరి సంబంధాన్ని ప్రకాశింపజేసే లక్ష్మీవాచకంగాను చెప్పబడుతున్నది. "అవ్వానవర్క్కు మవ్వానవరెల్లామ్ వ్వానవరడిమై యెన్ఱురైత్తార్" (అకారవాచ్యుడైన సర్వేశ్వరునకు మకారవాచ్యులైన జీవులు అందరూ దాసులు అని ఉకార వాచ్యసంబంధాన్ని కల ఆచార్యులు వచించారు) అని అనబడుతున్నదికదా. ఉకారవాచ్య అయిన లక్ష్మి. "విళక్కుప్పొన్" వలె ("విళక్కుప్పొన్" అంటే రెండు దీపాలను కలుపుతూ వాటి మధ్య పొదిగిన, మెత్తని, శుద్ధమైన బంగారం. ఈ ఉపమానం లోని స్వారస్యం సహృదయైకవేద్యం. జీవేశ్వరులిద్దరూ పరిశుద్ధజ్ఞానస్వరూపులు కనుక వారిద్దరినీ దీపాలుగాను, "హిరణ్యవర్ణామ్" అని కీర్తింపబడే లక్ష్మిని వారిని ఇద్దరినీ కలిపే శుద్ధమైన మేలిమి బంగారంగాను చెప్పడంలోని ఔచిత్యం గమనించతగినది. ఇటువంటి ప్రయోగాన్నే శ్రీపెరియవాచ్చాన్పిళ్లై పరన్దరహస్యం అనే రహస్యగ్రంథంలోని ద్వయప్రకరణంలో- "విళక్కుప్పొన్పోలే నడువే నిన్ఱు ఇరణ్డుతలైయైయుమ్ శేర్క్కక్కడవళాయిరుక్కిఱ పిరాట్టి" అని అంటూ చేయడాన్నికూడా స్మరించాలి) మధ్యలో ఉండే దీపం కదా! ఈమె "ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీనిర్వాహ కోరకితనేమకటాక్షలీలామ్, శ్రీరంగహర్మ్యతల మంగళదీపరేఖామ్ శ్రీరంగరాజమహిషీం శ్రియ మాశ్రయామః" (ఉదయంచేత చిగిర్చినది, పాలింపబడిన సప్తలోకనిర్వాహంచే మొగ్గ తొడిగినది అయిన అరమోడ్పు చూపుల విలాసాన్ని కల్గినది, శ్రీరంగమనే భవనానికి మంగళదీపరేఖవంటిది అయిన శ్రీరంగనాథుని పట్టమహిషి లక్ష్మీదేవిని ఆశ్రయిస్తున్నాను) అని మంగళదీపరేఖగా చెప్పబడింది. "శ్రియో ఘటకభావతః" (లక్ష్మియొక్క ఘటక స్వరూపంవల్ల), "శ్రియా ఘటకయా" (ఘటకరూపిణి అయిన - అనగా- జీవేశ్వరులను కలిపే స్వభావాన్ని కల్గిన లక్ష్మిచే) అని చెప్పిన రీతిలో జీవేశ్వరుల కలయిక ఈమె చేసే పురుషకారాన్ని అపేక్షించి ఉంటుందికదా! ఇదే రీతిలో "జగతో హితచింతాయై జాగ్రతః శేషశాయినః, అవతారేష్వన్యతమం విద్ధి సౌమ్యవరం మునిమ్" (లోకంయొక్క హితాన్ని చింతించడం కోసం శేషునిపై పరుండి ఉండే భగవానుని అవతారాలలో ఒకటిగా రమ్యజామాతృమునిని తెలిసికో)

హితచిన్తాయై జాగ్రత శ్శేషశాయినః, అవతారేష్వన్యతమం విద్ధి సౌమ్యవరం మునిమ్" (యతీంద్రప్రవణ ప్రభావమ్), "ఆత్మా శేషీ భవసి భగవన్నాన్తర శ్శాసితా త్వమ్" (వరవరమునిశతకమ్), "దేవీ లక్ష్మీ ర్భవసి దయయా వత్సలత్వేన చ త్వమ్", "సౌమిత్రి ర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ" (వరవరమునిశతకమ్) ఎన్నక్కడవతితే ఇప్పడి ముప్పురి యూట్టియితే యివరవతారవైభవ మిరుప్పతు.

ఇన్నము మిశ్లోకత్తిలే పదజ్గళ్ మివ్వర్థజ్గళాయితే యిరుప్పదు. ఎజ్గనే యెన్నిల్, "శ్రీశైలేశ" ఎన్నైయాలే- అకారవాచ్యనాన సర్వేశ్వరనై చ్చొల్లి, "దయాపాత్ర"మెన్నైయాలే, భగవదనన్యార్హశేషభూతనాన చేతనన్ అవన్ కృపైక్కు పాత్రమెన్నుమత్తై చ్చొల్లుకిఱతు. అడియిల్ పదత్తిల్ ఆచార్యనై అవన్నానాక చ్చొల్లుకిఱతు- విశేషాధిష్ఠానత్తాలే. "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశ"మ్బోలే (బ్రహ్మసూ-2-3-29). "అజ్ఞానధ్వాన్తరోధాత్" (న్యాసవింశతి-2) ఇత్యాది. "ఆచార్య స్స హరి స్సాక్షాత్". "ధీభక్త్యాదిగుణార్ణవ"మెన్గిఱ విప్పదత్తాలుమ్ "తామరైయాళ్ కేళ్వ నొరువనైయే నోక్కు మునర్వు" (ముదల్‌తిరు-67)

---

అని, "ఆత్మా శేషీ భవసి భగవన్నాంతర శ్శాసితా త్వమ్" (భగవన్! మీరు నాకు ఆత్మ. శేషిభూతులు. లోపల ఉండి నియమించే శాస్తగా ఉన్నారు) అని అకారవాచ్యులైన భగవత్స్వరూపులుగా, "దేవీ లక్ష్మీ ర్భవసి దయయా వత్సలత్వేన చ త్వమ్" (నీవు దయాగుణంచేత, వాత్సల్యగుణం చేత లక్ష్మీదేవివై ఉన్నావు) అని ఉకారవాచ్య అయిన లక్ష్మీస్వరూపులుగా (ఘటకకృత్యం ద్వారాకూడా వీరు ఉకారవాచ్యులని చెప్పవచ్చు). "సౌమిత్రి ర్మే స ఖలు భగవాన్ సౌమ్యజామాతృయోగీ" (భగవానుడైన ఆ సౌమ్యజామాతృముని నాకు లక్ష్మణస్వరూపులుగానే తోస్తున్నారు) అని లక్ష్మణునిగాను చెప్పబడుతున్నందున మకారవాచ్యులైన జీవస్వరూపులుగా కీర్తింపబడుతున్నారు. ఈవిధంగా అకార-ఉకార-మకార స్వరూపులుగా చెప్పబడే ఈ సౌమ్యజామాతృముని అవతారవైభవం త్రివిధాత్మకంగాకదా ఉంటుంది. (ఇందుచేత వీరి వైభవం ప్రణవార్థప్రకాశకం. కనుక- వేదారంభంలో, సమాపనంలో ప్రణవాన్ని అనుసంధించేటట్లే, ద్రావిడవేద- తదంగ-తదుపాంగాల, వాటి వ్యాఖ్యానాల, వాటి సారభూతాలైన రహస్యగ్రంథాల అనుసంధానప్రారంభంలో, చివరలో వీరి వైభవాన్ని తెలిపే ఈ తనియన్ శ్లోకం అనుసంధింపబడుతున్నది.)

అంతేకాక, ఈ తనియన్ శ్లోకంలోని పదాలలో అంతటా ఈ ప్రణవార్థాన్ని (అలంకార, ఉకార, మకారాల అర్థాన్ని) గమనించవచ్చు. ఏవిధంగా అంటే- "శ్రీశైలేశ" అనే పదంచేత అకారవాచ్యుడైన భగవానుడు చెప్పబడుతున్నాడు. "దయాపాత్రమ్" అని అనడంచేత భగవానునకు తప్ప వేటెవ్వరికీ శేషం కాని జీవుడు ఆ సర్వేశ్వరుని కృపకు పాత్రం -అనే విషయం చెప్పబడింది. శ్లోకప్రారంభంలోని "శ్రీశైలేశ" అనే ఈ పదంద్వారా ఆచార్యుని భగవత్స్వరూపునిగా చెప్పడం ఆ భగవానుని విశేషాధిష్ఠానాన్ని బట్టి. ఈవిధంగా పల్కడం "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః" (ఆనందాన్ని) సారభూతమై గుణంగా కల్గిన భగవానుడు "ఆనందో బ్రహ్మ", "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని ఆనందశబ్దంతో వ్యవహరింపబడుతున్నాడు) అనే వేదాంతన్యాయసిద్ధం. "అజ్ఞానధ్వాంతరోధాత్ అఘపరిహరణాత్ ఆత్మసామ్యా వహత్వాత్" (అజ్ఞానమనే చీకటిని పోగొట్టడంచేత, పాపాలను పోగొట్టడంచేత, తనతో సామ్యాన్ని కల్గించడంచేత) అని అజ్ఞానమనే చీకటిని లేకుండా చేసేటట్లు భగవానుడుకూడా వేద శాస్త్రప్రదానాదుల ద్వారా అజ్ఞాననివర్తకుడు. "ఆచార్య స్స హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః" (ఆచార్యుడు సాక్షాత్తు సంచరించే హరిరూపుడే, సందేహం లేదు) అని మొదలైన ప్రమాణాలను ఇక్కడ స్మరించాలి. "ధీభక్త్యాదిగుణార్ణవమ్" అనే పదంద్వారా- "పెయరుమ్ కరుమ్ కడలే నోక్కు మాఱు, ఒణ్ పూ వుయరుమ్ కదిరవనే నోక్కుమ్, ఉయిరుమ్ తరుమనైయే నోక్కుమ్, ఒణ్‌తామరైయాళ్‌కేళ్వన్ ఒరువనైయే నోక్కు మునర్వు" (ప్రవహించే నది సముద్రాన్ని లక్ష్యంగా చేసికొని ఉంటుంది. అందమైన తామరపూవు పైన సంచరించే సూర్యుణ్ణి లక్ష్యంగా చేసికొని ఉంటుంది. జీవవర్గం యముని లక్ష్యభూతునిగా కల్గి ఉంటుంది. ఆ విధంగానే జ్ఞానం పద్మనివాసిని భర్త అయిన సర్వేశ్వరుని ఒక్కనిమాత్రమే లక్ష్యంగా కల్గి ఉంటుంది) అనే జ్ఞానం, "శోరాద ఎప్పొరుట్కుమ్ ఆదియామ్ శోదిక్కే ఆరాద కాదల్" (ఏ కొఱత లేనట్లు

ఎన్నుమ్, "అతియాఞ్జోతిక్కే యారాత కాతల్" (తిరువాయ్-2-1-11), ఎన్నుమ్, 'ఉన్నిత్తు మ*ఱ్ఱొ*రు తెయ్వన్దొ*ழా*ళ్' (తిరువాయ్-4-6-10) ఎన్నుఞ్జొల్లుకిఱపడియే జ్ఞానభక్తివైరాగ్యఙ్గళై ప్రతిపాదిక్కైయాలే అకారోదితభగవచ్ఛేషత్వత్తై భక్తియాలే శొల్లుకిఱతు. స్వరూపముమ్ "ఉన్నిణైత్తామరైకట్కన్బురుకి నిఱ్కు"(తిరువాయ్-7-1-10) మతిఱే, అకిఞ్చిత్కరస్య శేషత్వానుపపత్తేః. జ్ఞాన మావతు- "తద్జ్ఞాన"(వి.పు-6-5-87)మిఱే. భగవదేకావలమ్బియాయిఱే జ్ఞాన మిరుప్పతు. వైరాగ్య మావతు- దేవతాన్తరత్యాగ ప్రధానమాయిఱే యిరుప్పతు.

(యతీన్ద్రప్రవణమ్) యతీన్ద్రరాకైయావతు- స్వస్వరూపత్తై యనుసన్ధిత్తు త్తురుమ్బునఱుక్కాతిరుక్కుమవర్కళై "తిరుత్తి త్తిరుమకళ్కేళ్వనుక్కాక్కి యడిమై" (ఇరామానుశ-78) శెయ్విక్కై. తమ్మళనిలుమ్- యతిశబ్ద మవిశిష్టమాకైయాలే, తదిన్ద్రరాకైయెప్ప*ఱ్ఱ* ప్రవణరాకిఱార్. భగవదనన్యార్హశేషత్వమ్ తదీయపర్యన్తమిఱే. అన్ఱిక్కే,

---

అన్ని వస్తులకు కారణభూతుడైన, పరంజ్యోతి స్వరూపుడైన భగవానుని విషయంలో అంతులేని (ప్రేమను -భక్తిని కల) అనే భక్తి, "ఉన్నిత్తు మ*ఱ్ఱొ*రు దెయ్వమ్ తొ*ழా*ళ్ అవనైయల్లాల్" (ఆ సర్వేశ్వరుని తప్ప వేఱొక దైవాన్ని ధ్యానించి, కొలువదు) అని ఇతరుల విషయంలోని విరక్తి- అనే వైరాగ్యం ప్రతిపాదింపబడడంచేత, ప్రకృతం తనియన్‌లో చెప్పబడ్డ భక్తి అకారంచేత చెప్పబడే భగవచ్ఛేషత్వమే. "ఎన్ పరఞ్జుడరే! యెన్ఱు ఉన్నై అల*ఱ్ఱి* ఉన్నిణైతామరైకట్కు అన్బురుకి నిఱ్కుమదు" (నా పరంజ్యోతి స్వరూపా! అని అంటూ నిన్ను పలవరించి, నీ అద్వితీయాలైన శ్రీపాదపద్మాల విషయంలో భక్తితో కఱగి ఉండతగిన ఆ భాగ్యం) అని చెప్పబడినట్లు భగవత్పాదారవిందాలలో చేసే శేషవృత్తేకదా! జీవుని స్వరూపంకూడా. ఏ కైంకర్యం చేయనివానికి శేషత్వ సిద్ధించదుకదా! ఇక, జ్ఞానం అంటే- "సంజ్ఞాయతే యేన తదస్తదోషం శుద్ధం పరం నిర్మల మేకరూపమ్, సందృశ్యతే వా ప్యధిగమ్యతే వా తత్ జ్ఞాన మజ్ఞాన మతోఽ న్య దుక్తమ్" (వికారరూపదోషం లేనిది, కర్మవశ్యత్వం మొదలైన దోషాలు లేనిది, మలసంబంధార్హత్వ దోషరహితమైనది, సమాభ్యధికరహితమైనది అయిన బ్రహ్మ ఎటువంటి సాక్షాత్కారరూపమైన జ్ఞానంతో దర్శింపబడుతున్నదో, లేక, పొందబడుతున్నదో, అదే జ్ఞానం. దానికంటే అన్యమైనది అజ్ఞానం.) కదా! భగవానుని లక్ష్యంగా కల్గినదై కదా జ్ఞానం ఉంటుంది. వైరాగ్యం దేవతాంతరాలను కొలువడాన్ని విడిచి వేయడం అన్నది ప్రధానంగా కల్గినదై ఉంటుంది కదా!

**(యతీంద్రప్రవణమ్)**- యతీంద్రులు కావడం అంటే- స్వస్వరూపాన్ని అనుసంధించి, గడ్డిపోచనుకూడా తుంచకుండా నిర్వ్యాపారులై ఉండేవారిని సంస్కరించి, **"కరుత్తిల్ పుకున్దుళ్ళిల్ కళ్ళమ్ క*ழఱ్ఱి*, క్కరుదరియ వరుత్తత్తినాల్ మిక వఞ్జిత్తు, నీ యిన్ద మణ్ణకత్తే తిరుత్తి త్తిరుమకళ్ కేళ్వనుక్కు ఆక్కి"** (నా మనస్సులో ప్రవేశించి, లోపల ఉండే నేను-నాది అనే దొంగతనాన్ని లేకుండా చేసి, అన్యులకు భావించడానికి సాధ్యం కాని ప్రయాసతో చాలా నీవు చేసే పనులను మఱుగుపఱచి, నన్ను సంస్కరించి, ఈ లోకంలో శ్రియఃపతికి నన్ను శేషభూతుణ్ణిగా చేసి) కైంకర్యాన్ని చేసేటట్లు చేయడం. (ఈ అర్థంలోని స్వారస్యం యతిశబ్దవ్యుత్పత్తినిబట్టి నిర్వహింపబడింది. **"యతతే ఇతి యతిః, యతీ- ప్రయత్నే"** అని యతిశబ్దవ్యుత్పత్తి. ప్రకృష్టమైన యత్నాన్ని చేసేవాడు అని భావం. లోకంలోని సామాన్యజనులు ఐహికభోగాలను కోరి, వాటికోసం ప్రయత్నిస్తే, నిజమైన యతి లౌకికభోగాలను కోరకుండా, పరమపురుషార్థం అయిన భగవత్కైంకర్యాన్ని చేయగోరి, దాని కోసం ప్రయత్నిస్తాడు. అతడే నిజమైన యతి. ఇక యతీంద్రుడంటే- యతులలో ఇంద్రుడు. ప్రభువు). యతిశబ్దం తమకుకూడా అన్వయిస్తుంది కనుక, యతులకు ఇంద్రుడు కావడంకోసం రామానుజుల విషయంలో వీరు ప్రవణులు అవుతున్నారు. **"ఇది- పరమైశ్వర్యే"** అనే ధాతువునుండి పుట్టిన ఇంద్రశబ్దం గొప్ప ఐశ్వర్యాన్ని- అంటే గొప్ప అధికారాన్ని, గొప్ప సంపదను కల్గినవానిని తెలుపుతుంది. నిజమైన సంపద అంటే భగవత్కైంకర్యమే కదా! ఇక, గొప్ప కైంకర్యం అంటే తదీయశేషత్వమే. భాగవతకైంకర్యమే. తదీయులైన శ్రీరామానుజులకు శేషభూతులై, వారి కైంకర్యంలో అత్యంతప్రావణ్యాన్ని కలవారుకదా వరవరమునులు. లేక,

(యతీన్ద్రప్రవణమ్) అసాధారణమాన రామానుజశబ్దపర్యాయవాచకమాయితే యిత్తిరునామ మిరుప్పతు. అతువుమ్ ప్రణవార్థమ్. రామశబ్దత్తాలే -అకారార్థముమ్, అనుజశబ్దత్తాలే- తచ్ఛన్దానువర్తియా యిరుక్కిఱ ఆత్మస్వరూపముమితే శొల్లుకిఱతు.“ రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా” (యతిరాజవింశతి-1) ఎన్గిఱే ! ప్రావణ్య మిరుప్పదు.

(వన్దే రమ్యజామాతరమ్ మునిమ్) ఇత్తాలుమ్ ఉకారార్థమే శొల్లుకిఱదు. రమ్యజామాతృశబ్దత్తాలే-అకారవాచ్యనై చ్చొల్లి, మునిశబ్దత్తాలే- తదనన్యార్హశేషత్వజ్ఞానత్తై యుడైయ పరమచేతననై చ్చొల్లుకిఱతు. “రమ్యజామాతు ర్మననం కరోతీతి రమ్యజామాతృమునిః”. ఆక, ఇవై ఎల్లావఱ్ఱాలుమ్ - ప్రణవార్థమాక అనుసన్దిక్క త్తట్టిల్లై.

“అయోధ్యా మధురా మాయా” ఎన్డుమ్, “వడతిశై మతురై అయోత్తి” (పెరియతిరు-4-7-9) ఎన్డు మవతారస్థలత్తై చ్చొల్లుకిఱపడియే, కోయిలుక్కు వడక్కాయిరుక్కిఱ తిరువేఙ్గడనాట్టిల్ “ఏరార్ పెరుమ్బూతూరిలే” (ఉపదేశరత్తినమాలై-33) ఎమ్బెరుమానార్ వడమొழிయైయుమ్, తెన్మொழிయైయుమ్ వెళియిడ అవతరిత్తరుళినార్. “నారణనై క్కాట్టియ వేతక్కళిప్పుఱ్ఱతు తెన్కురుకైవళ్ళల్ వాట్టమిలా వణ్డమిழ்మఱై వాழ்న్దతు” (ఇరామానుశ-54) ఎన్నక్కడవతిఱే. “అరఙ్గనకరుమ్ మేవు తిరునకరియుమ్ వాழவన్ద మణవాళమాముని” ఎన్గిఱపడియే, “తెన్నాట్టుత్తిలతమాన” (తిరువాయ్-

---

(యతీంద్రప్రవణమ్)- అసాధారణం అయిన రామానుజశబ్దపర్యాయంగాకదా ఈ యతీంద్రనామం ఉన్నది. ఆ “రామానుజ”నామంకూడా ప్రణవార్థమే. ఏ విధంగా అంటే- రామశబ్దం చేత అకారార్థం. అనుజశబ్దంచేత ఆ అకారవాచ్యుడైన భగవానుని అభిప్రాయానుసారం ప్రవర్తించే ఆత్మస్వరూపం కదా చెప్పబడుతున్నవి. “రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా” (యతీశ్వరులైన రామానుజులకు శిరసా నమస్కరిస్తున్నాను)- అని యతిరాజవింశతి ప్రారంభంలో స్తుతించేటట్లుగా కదా యతీంద్రుల విషయంలో వరవరమునులు ప్రావణ్యాన్ని కల్గి ఉన్నారు.

(వందే రమ్యజామాతరం మునిమ్) దీనిచేతకూడా ఉకారార్థమే చెప్పబడింది. రమ్యజామాతృశబ్దంచేత అకారవాచ్యుడైన శ్రీరంగనాథుడు చెప్పబడుతున్నాడు. అழகియమణవాళన్ అనే ద్రావిడనామానికి సంస్కృతీకరణమే ఈ రమ్యజామాతృనామం. “మననశీలో మునిః”. “మన-జ్ఞానే” అనే ధాతువునుండి పుట్టిన మునిశబ్దంచేత భగవానునకు తప్ప వేఱెవ్వరికీ ఆత్మశేషభూతం కాదగదనే భగవదనన్యార్హశేషత్వజ్ఞానాన్ని కల చేతనుని నిర్దేశిస్తుంది. “రమ్యజామాతుః మననం కరోతీతి రమ్యజామాతృమునిః” (రమ్యజామాతను మననం చేసేవాడు- నిత్యం శ్రీరంగనాథుని స్మరించేవాడు - కనుక, రమ్యజామాతృముని) ఈ విధంగా ఈ శ్లోకంలోని అన్ని పదాలు ప్రణవార్థప్రకాశకాలు- అని చెప్పడంలో అడ్డు లేదు.

ఇక, భగవద్రామానుజులకు, శ్రీమద్వరవరమునులకు మధ్య ఉండే ధర్మైక్యం, సంబంధం వివరింపబడుతున్నవి. “అయోధ్యా మధురా మాయా......... సప్తైతే మోక్షదాయకాః” (అయోధ్య, మధుర, మాయ............ అనే ఏడు మోక్షాన్ని కల్గించే క్షేత్రాలు) అని, “వడతిశై మదురై అయోత్తి” (ఉత్తర దిక్కులోని మధుర, అయోధ్య) అని అంటూ అవతారస్థలాలను చెప్పే రీతిలోనే, శ్రీరంగానికి ఉత్తరదిశలో ఉండే వేంకటాచలప్రాంతంలో “ఏరార్ పెరుమ్బూదూర్” (అందం నిండిన భూతపురి)లో భగవద్రామానుజులు సంస్కృతవేదాన్ని, ద్రావిడవేదాన్ని ప్రచారం చేయడంకోసం అవతరించారు. “నారణనై క్కాట్టియ వేతమ్ కళిప్పుఱ్ఱతు, తెన్‌కురుకై వళ్ళల్ వాట్టమిలా వణ్డమిழ்మఱై వాழ்న్దదు” (శ్రీమన్నారాయణుని ప్రతిపాదించే సంస్కృత వేదం గర్వాన్ని పొందింది. అందమైన తిరునగరిలోని పరమోదారులైన నమ్మాழ்వార్లు అనుగ్రహించిన ఏకొఱతలేని ద్రావిడవేదం వర్ధిల్లింది) అని ఉభయవేదార్థాలను ప్రకాశింపజేసినవారుగా భగవద్రామానుజులు కీర్తింపబడుతున్నారుకదా! “అరఙ్గనగరుమ్ మేవు తిరునకరియుమ్ వాழவన్ద మణవాళమాముని” (శ్రీరంగం, స్థిరమైన తిరునగరి ఉజ్జీవించేటట్లు

**10-6-7) తెన్గురుకూరిలే పెరియజీయర్ తెన్మొ*ళ్లి*యై వెళియిడవే అవతరిత్తరుళినార్. "విరవు తమి*ళ్*మఱైమొ*ళ్లి*యుమ్ వడమొ*ళ్లి*యుమ్ వెళియాయ్ చ్చెయ్యుమ్ విచిత్రవ్యాఖ్యానశేషన్" ఎన్నక్కడవతిఱే, "ఆర్యా చ్ఛ్రీశైలనాథాత్" (యతీన్ద్రప్రవణప్రభావమ్) ఇత్యాది. ఇవరుక్కు మిరణ్డినుడైయ ప్రవర్తకత్వముణ్డేయాకిలుమ్, ఊ*ఱ్ఱ*త్తైప్ప*ఱ్ఱ* ఒన్టిలే యోతుకిఱతు. ఉడైయవరుడైయ అవతారవిశేషమాకైయాలుమ్, మ*ఱ్ఱు*మ్ సర్వథా సామ్యత్తాలుమ్. "యతివర పునరవతార" మాకైయాలే, దీర్ఘశరణాగతియై "ఈన్ఱ ముద*ఱ్ఱా*యి" (తిరువాయ్మొ*ళ్లి*తనియన్) నుడైయ "మాతా పితా"(పొదుత్తనియన్) పోలే "యో నిత్యముమ్"(పొదుత్తనియన్), "శ్రీశైలేశ"ముమ్ నడన్దు శెల్లుకిఱదు. ఇవరుమ్ జన్మభూమియై విట్టు వన్దు "కావిరి నడువు పాట్టిలే" (తిరుమాలై-23) "కరుమణియై" (పెరుమాళ్తిరు-1-1)క్కణ్డు తన్మధ్యస్థరాయ్, వైష్ణవశ్రీయోడే వా*ళ్*న్దుకొణ్డిరున్దు, శ్రీరఙ్గశ్రీయైయుమ్, శ్రుతిసాగరత్తైయుమ్, ద్రావిడవేదసాగరత్తైయుమ్ పెరుకప్పణ్ణి ప్పెరుమాళై నోక్కిపోన్దార్. అవర్ "ఎల్లాపుయిర్కట్కుమ్ నాత నరఙ్గనెన్నుమ్ పొరుళ్ శురన్దార్" (ఇరామానుశ-91). ఇవర్ "పల్లుయిర్క్కుమ్ విణ్ణిన్తలైనిన్టు వీడళిప్పాన్" (ఇరామానుశ-95). అనైత్తులకుమ్ వా*ళ్* ప్పిఱన్ద ఎతిరాశమామునివ నెన్నుమర్థత్తై యరుళ్శురన్దార్.**

---

అవతరించినమణవాళ మహాముని) అనే రీతిలో **"తెన్నాట్టు త్తిలదమ్"** (దక్షిణదేశానికి తిలకం -అంటే- అలంకారం) అయిన తిరునగరిలో పెరియజీయర్ ద్రావిడవేదాన్ని ప్రవర్తింపజేయడంకోసం అవతరించారు. **"విరవు తమి*ళ్*మఱైమొ*ళ్లి*యుమ్ వడమొ*ళ్లి*యుమ్ వెళియాయ్ చ్చెయ్యుమ్ విచిత్రవ్యాఖ్యానశేషన్"** (అర్థయుక్తం అయిన ద్రావిడవేదాన్ని, సంస్కృతవేదాన్ని వ్యక్తం అయేటట్లు చేసే, ఆశ్చర్యకరమైన వ్యాఖ్యానాన్ని చేసే ఆదిశేషావతారులు) అని కీర్తింపబడుతున్నదికదా! **"ఆర్యా చ్ఛ్రీశైలనాథాత్"** (ఆర్యులైన తిరువాయ్మొ*ళ్లి*ప్పిళ్ళైవల్ల) ఇత్యాది శ్లోకంలో ఈ విషయం చెప్పబడింది. ఈ వరవరమునులకుకూడ ఉభయవేదాంతప్రవర్తకత్వం ఉన్నా, ప్రాధాన్యాన్నిబట్టి ద్రావిడవేదాంతప్రవర్తకత్వం ప్రధానంగా చెప్పబడుతున్నది. శ్రీరామానుజుల అవతారవిశేషం అయినందువల్ల, ఇంకా మిగిలిన అన్ని విధాలైన సామ్యాలవల్ల **"యతివరపునరవతారభూతులు"** కనుక, దీర్ఘశరణాగతి అనే తిరువాయ్మొ*ళ్లి*ని **"ఈన్ఱ ముతల్ తాయ్ శడకోపన్"** (కన్న మొదటి తల్లి శఠకోపుల) తనియన్ అయిన **"మాతా పితా యువతయః"** ఇత్యాదిశ్లోకంవలె భగవద్రామానుజుల తనియన్ అయిన **"యో నిత్యమ్"** ఇత్యాది శ్లోకం, వారి పునరవతారం అయిన శ్రీవరవరమునుల తనియన్ అయిన **"శ్రీశైలేశదయాపాత్రమ్"** ఇత్యాది శ్లోకం అనుసంధింపబడుతున్నవి. వీరు కూడా (వరవరమునులుకూడా) జన్మభూమి అయిన ఆ*ళ్వా*ర్తిరునగరిని విడిచివచ్చి **"కావిరినడువుపాట్టు"** (కావేరీనదీమధ్యదేశం) అయిన శ్రీరంగక్షేత్రంలో **"కరుమణియై"** (నీలమణిని) అని కీర్తింపబడే శ్రీరంగనాథుని దర్శించి, ఆ క్షేత్రంమధ్యలో ఉన్నవారై, శ్రీవైష్ణవశ్రీతో వర్ధిల్లుతూ శ్రీరంగశ్రీని, సంస్కృతశ్రుతి సాగరాన్ని, ద్రావిడవేదసాగరాన్ని వృద్ధి అయేటట్లు చేసి, శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేశారు. వారు (భగవద్రామానుజులు) **"ఉలకిరుళ్ నీఙ్గ తన్నీణ్డియశీర్ అరుళ్ శురన్దు ఎల్లా పుయర్కట్కు నాదన్ అరఙ్గ నెన్నుమ్ పొరుళ్ శురన్దార్"** (లోకంలోని అజ్ఞానం అనే చీకటి నశించేటట్లు తన గొప్ప విలక్షణం అయిన కరుణను ప్రవహింపజేసి, శ్రీరంగనాథుడే సకలాత్మలకు నిర్వాహకుడు అనే పరమార్థాన్ని అనుగ్రహించి ఉపకరించారు.) వీరు (వరవరమునులు) **"ఉణ్ణిన్టుయర్కళుక్కు ఉ*ఱ్ఱ*నవే శెయ్దు అవర్క్కుయవే పణ్ణుమ్ పరనుమ్ పరివిల నామ్బడి పల్లుయర్క్కుమ్ విణ్ణిన్ తలై నిన్టు వీడు అళిప్పాన్ ఎమ్మిరామానుశన్ మణ్ణిన్ తలత్తుదిత్తు మఱై నాలుమ్ వళర్త్తననే"** (జీవుని శరీరంలోపల సత్తను కలుగజేయడం కోసం ఉండి, ఈ ఆత్మలకు తగిన కార్యాలనే చేసి, వారి ఉజ్జీవనంకోసమే ప్రయత్నించే పరమాత్మ అయిన శ్రియఃపతి కూడా జీవుల విషయంలో రామానుజులవలె స్నేహం కలవాడు కాదు- అని అనిపించేటట్లు జేయడంకోసం మా నాథులైన శ్రీరామానుజులు పరమపదంనుండి ఈ భూమండలంలో అవతరించి, నాల్గు వేదాలను విశేషంగా వర్ధిల్లజేశారు). **"అనైత్తులకమ్ వా*ళ్*ప్పిఱన్ద ఎతిరాశమాముని"** (లోకం అంతా ఉజ్జీవించేటట్లు అవతరించిన రామానుజులు) అనే అర్థాన్ని అనుగ్రహించారు.

జీయరవతరిత్తు వెళియిడాతపోతు కణ్ణొన్దారకమాయిఱే యుడైయవర్ వైభవ మిరుప్పతు. ఇరామానుశముని **"శెయ్యకున్ఱిలేఱ్ఱియ తీప"** మిఱే యివర్. నరనారాయణావతారమ్బోలేయిఱే యివర్కళుడైయ అవతారముమ్. **"నారాయణం నమస్కృత్య నరఞ్చైవ నరోత్తమమ్" (భార-ఆది-1-1), "సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీ న్తనుమ్", "యోఽద్యాపి చాస్తే" (భాగవతమ్-11-4-6), "తస్యాం హి జాగర్తి".** ఇరణ్డుక్కు ముణ్డాన ధర్మైక్యము మప్పడియే, సమ్బన్ధము మప్పడియే. అవర్ నారాయణవైభవప్రకాశకర్; ఇవర్ రామానుజవైభవప్రకాశకర్. అవ్వవతారత్తిలు మివ్వవత్తారత్తుక్కేఱ్ఱ ముణ్డు. **"పిఱప్పొ యొళి వరు" (తిరువాయ్-1-4-2). "నారాయణ, రామానుజ"** ఎన్ఱిఱే చతురక్షరికళిన్ వాశి యిరుప్పతు. ఇవర్ చతురరిఱ్ఱలై యాకైయాలే చరమచతురక్షరియిలే నిలైనిన్ఱార్. **'ఏత్తి యిరుప్పారై వెల్లుమే మఱ్ఱవరైచ్చాత్తి యిరుప్పార్ తవమ్" (నాన్ముకన్‌తిరు-18), "తస్మా న్మద్భక్తభక్తా శ్చ పూజనీయా విశేషతః", "అడియేన్ శతిర్త్తేనిన్ఱే" (కణ్ణినుణ్), "నమ్బువార్ పతి వైకున్దజ్గాణ్మినే" (కణ్ణినుణ్).** అళ్వార్క్కు మధురకవికళిలుమ్ చరమమానతిరువడికళ్ రామానుజనాన్పోలే,

---

వరవరమునులు అవతరించి, వ్యక్తం చేయకుండా ఉంటే భగవద్రామానుజుల వైభవం నేత్రవ్యాధిని కలవానికి ఇల్లువలె అంధకారమయమై, ఎవరికీ దర్శించడానికి సాధ్యం కాకుండాకదా ఉండేది. (శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్‌వ్యాఖ్యలో ఈ సందర్భంలోని **"కణ్ణొన్దారకమ్"** అనే పదాన్ని **"కణ్ నొన్దార్ అకమ్"**అని విడదీసి, కంటి వ్యాధిని కలవారి ఇల్లు- అనే అర్థాన్ని చెప్పాలి. ఇటువంటి ప్రయోగమే **"తన్నుడైయ ఈశ్వరత్వమడైయ కణ్ణొన్దారకమ్ పోలే కాణుమ్ కిడన్దదు'** (ఈడు- 10-7-2) అని తిరువాయ్‌మొళ్ఱి ఈడులో ఉన్నది.) **"ఇరామానుశముని శెయ్య కున్ఱిలేఱ్ఱియ తీపమ్"** (శ్రీరామానుజులు అనే అందమైన పర్వతంలో వెలిగించిన దీపం) కదా వీరు. నరనారాయణుల అవతరాలవంటివికదా వీరిద్దరి అవతారాలు. **"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్, దేవీం సరస్వతీం వాచమ్"** (నారాయణుని, నరోత్తముడైన అర్జునుని, దైవీవాక్కు అయిన సరస్వతిని నమస్కరించి) అని, **"సాక్షా న్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా"** (సాక్షాత్తు భగవానుడైన నారాయణుడు మానవరూపాన్ని ధరించి, సంసారంలో మునిగిన లోకులను దయతో శాస్త్రం అనే శ్రీహస్తంతో (ఉద్ధరిస్తున్నాడు) అని, **"యోఽద్యాపి చాస్తే", "తస్యాం జాగర్తి"** ఇత్యాది ప్రమాణాల అర్థం ఇక్కడ స్మరణీయం. వీరిద్దరికి మధ్య ఉన్న ధర్మైక్యం అటువంటిదే. సంబంధమూ అటువంటిదే. భగవద్రామానుజులు నారాయణవైభవప్రకాశకులు. వీరు రామానుజవైభవప్రకాశకులు. అయితే, రామానుజావతారంకంటే వరవరముని అనే అవతారానికి ఒక వైలక్షణ్యం ఉన్నది. అది ఏమంటే- **"పిఱప్పొ యొళి వరు ముళ్ళునలమ్"** (అవతరించగా అవతరించగా కల్యాణగుణాలు పూర్ణంగా ఉజ్జ్వలంగా ప్రకాశిస్తాయి) అనే సూక్తి వీరి విషయంలోకూడా అన్వయిస్తుంది. **"నారాయణ"** అనే భగవానుని చతురక్షరికంటే **"రామానుజ"** అనే రామానుజుల చతురక్షరి విశిష్టమైనది. (**"నారాయణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ"**- నారాయణ అనే శబ్దం ఉన్నది, వాక్కువశంలోనే ఉన్నది- ఇత్యాది సూక్తుల్లో నారాయణచతురక్షరి, **"రామానుజేత్యేషా చతురా చతురక్షరీ"** - రామానుజ అనే చతురమైన చతురక్షరి- ఇత్యాది సూక్తులలో రామానుజచతురక్షరి ప్రస్తావింపబడడం గమనార్హం) వరవరమునులు చాతుర్యాన్ని కలవారు కనుక, ఈ రెండు చతురక్షరి మంత్రాల మధ్యలో గల వైలక్షణ్యాన్ని గమనించి, చరమచతుక్షరి (చరమపర్వానికి చెందిన చతురక్షరి) లో దృఢంగా నిలిచారు. **"మాఱాయ తానవనై వళ్ళుకిరాల్ మార్బిరణ్డు కూఱాక క్కీఱియ కోళరియై వేఱొక ఏత్తియిరుప్పారై వెల్లుమే మఱ్ఱవరై చ్చాత్తియిరుప్పార్ తవమ్"** (తనకు శత్రువైన దానవుడు హిరణ్యకశిపుని వక్షస్సును పదునైన గోళ్ళతో రెండు భాగాలుగా చీల్చిన బలిష్ఠుడైన నరసింహుని విలక్షణుని కీర్తించే భక్తులను, ఆ భక్తులను స్తుతించే వారి తపస్సు జయిస్తుంది) అని, **"తస్మాన్మద్భక్తభక్తా శ్చ పూజనీయా విశేషతః"** (అందువల్ల నా భక్తులకు భక్తులైనవారు విశేషంగా పూజింపతగినవారు) అని, **"తిరుక్కురుకూర్ నమ్బిక్కన్బనాయ్ అడియేన్ శదిర్త్తేనిన్ఱే"** (తిరుక్కురుకూర్‌లోని కల్యాణగుణపూర్ణులైన నమ్మాళ్వార్లకు శేషభూతుడనైనపుడే దాసుడనైన నేను సమర్థుడనయ్యాను) అని, **"మదుర కవిశొన్న శొల్ నమ్బువార్ పది వైకున్దమ్ కాణ్మినే"** (మధురకవుల సూక్తులను

అన్ద రామానుజనాన ఇవర్క్కుమ్ శ్రీవత్సాఙ్కాచార్యరిలుమ్ చరమమాన చరణఙ్గళ్ యతీన్ద్రప్రవణనిఱే. ఆకైయాల్, చరమపర్వమాన జీయర్ విషయమాన ఇత్తనియనుమ్ సకలవేదసారమాన ప్రపత్తిపోలే నిరన్తరానుసన్ధేయ మాకక్కడవతు.

శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్ తిరువడికళే శరణమ్



---

తమకు రక్షకంగా విశ్వసించేవారు ఉండే చోటు పరమపదమేసుమా!) అని ఇత్యాది సూక్తులలో భగవద్భక్తుల సేవకంటె వారి భక్తుల సేవ, వారిని సేవించడంకంటే వారి భక్తులను సేవించడమే గొప్ప- అనే పరమార్థం తెలుపబడింది. నమ్మాళ్వార్లకు మధురకవులకంటే చరమతిరువడి రామానుజులు అయినట్లే (నమ్మాళ్వార్ల శ్రీపాదుకలు రామానుజమనే పేరుతో వ్యవహరింపబడతాయి), ఆ రామానుజులకు శ్రీవత్సాంకులకంటేకూడా చరమ చరణస్థానీయులు యతీంద్రప్రవణులేకదా! అందువల్ల చరమపర్వం అయిన వరవరమునులవిషయంలోని ఈ తనియన్‌కూడా సకలవేదసారం అయిన ప్రపత్తివలె నిత్యం అనుసంధేయం కాదగినది.

శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తిరువడికళే శరణమ్



# కాంచీమహావిద్వాన్ అణ్ణాస్వామివారి వ్యాఖ్యానం

శ్రీరంగనాథుడు తాను శ్రీమణవాళమహామునులకు శిష్యుడై కృతార్థుడు కావలెనని ఆశించాడు. తిరువాయ్‌మొழி ఈడువ్యాఖ్యను ఆ ఆచార్యవర్యులద్వారా వినాలని, తద్ద్వారా తాను వారికి శిష్యుడు కావాలని తలచాడు. అర్చకముఖంగా తన అభీష్టాన్ని వారికి తెలిపాడు. శ్రీరంగనాథుని ఆజ్ఞను విన్నంతనే శ్రీమణవాళ మహామునులు **"నామార్? పెరియతిరుమణ్డప మార్? నమ్బెరుమాళ్ తామాక ఎమ్మై త్తనిత్తు అழைత్తు నీ మాఱన్ శెన్దమిழ్‌వేదత్తిన్ శెழுమ్బెరుళై నాళు మిజ్గే వన్దురై యెన్ఱేవువదే వాయ్‌న్దు!"** (నేనెక్కడ? పెరియతిరుమండపం ఎక్కడ? శ్రీరంగనాథుడు స్వయంగా నన్ను ఏకాంతంలో పిలిపించి "నీవు నమ్మాழ்వార్ల అందమైన ద్రావిడవేదంలో రహస్యార్థాలను ప్రతిదినం ఇక్కడకు వచ్చి, వివరించు" అని నన్ను ఆజ్ఞాపించడమా!) అని ఎంతో వినయంతో పల్కి, మఱునాటినుండి గరుడమండపంలో ఈడువ్యాఖ్యను ప్రవచించడం ప్రారంభించారు. శ్రీరంగనాథుడు ఒక సంవత్సరకాలంపాటు తనకు జరిగే ఉత్సవాలను అన్నిటినీ నిలిపించి, గరుడమండపంలో ఉభయదేవేరులతో వేంచేసి, వారి ప్రవచనాన్ని ఆదరంగా ఆలకించాడు. భగవద్విషయప్రవచనం ముగిసే దినాన శ్రీరంగనాథుడు నాలుగేండ్ల వయస్సును కల బాలుని రూపంలో సభలోకి వచ్చి, **"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్"** అనే తనియన్ శ్లోకాన్ని సాంజలిబంధంగా విన్నపించి, అదృశ్యుడయ్యాడు. ఇది సంగ్రహంగా శ్రీశైలేశదయాపాత్రతనియన్ వృత్తాంతం.

ఈ తనియన్ శ్లోకంలోని విశేషార్థాలను శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్ తమ వ్యాఖ్యానంలో వివరించారు. మహావిద్వాన్ శ్రీకాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు ఈశ్లోకంలోని రస్యరహస్యార్థాలను తమదైన శైలిలో వివరించారు. ఆ వివరణం ఇపుడు విన్నపింపబడుతున్నది.

ఈ తనియన్ శ్లోకం అతిశయోక్తిగా ఉండవచ్చునని కొందఱు తలచవచ్చు. శ్రీమణవాళమహామునులపట్ల అతిశయితప్రతిపత్తిని కల్గినవారికి ఇది ఒక దివ్య వాక్కు తప్ప మానవమాత్రుల వాక్కు కాదని తోస్తుంది. "ఈవిధంగా భావించడం ఎందువల్ల? ఇంతకంటే చక్కని శ్లోకం ఏపండితునిచేత రచింపబడడం సాధ్యం కాదా! ఇది దైవీవాక్కుగా ఉండవచ్చునని దేనినిబట్టి చెప్పవచ్చు?" అని ప్రశ్నిస్తే, దానికి తగిన సమాధానం తెలుపబడుతున్నది. వినండి.

ఈ శ్లోకాన్ని అనుగ్రహించిన శ్రీరంగనాథుడు పూర్వం త్రేతాయుగంలో శ్రీరాముడుగా, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా అవతరించిన భగవానుడే అనే విషయం స్పష్టం కదా! **"మామునివేళ్వియై కాత్తு అవపిరతమాట్టియ అడుతిఱలయోత్తి యెమ్మరశే అరజ్గత్తమ్మా!"** (విశ్వామిత్ర మహాముని యాగాన్ని సంరక్షించి, అవబృథాన్ని చేసిన గొప్ప పరాక్రమాన్నికల మాప్రభూ! శ్రీరంగనాథా) అని, **"కోవలనాయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్ అణ్డర్ కోన్ అణి యరజ్గన్"** (గోపాలుడై వెన్న తిన్న నోటిని కలవాడు, అండాధిపతి, అందమైన శ్రీరంగంలో నివసించే స్వామి) అని, **"మదురైమానగరన్దన్నుళ్ కవళమాల్ యానై కొన్ఱ కణ్ణనై యరజ్గమాలై"** (మధురానగరంలో కువలయాపీడాన్ని వధించిన కృష్ణుని, శ్రీరంగంలోని ఆశ్రితవ్యాముగ్ధుని) అని ఆழ்వార్లు శ్రీరంగనాథుని శ్రీరామ, శ్రీకృష్ణుల రూపంగానే భావించారు కదా!

ఆ రీతిలో శ్రీరాముడుగా అవతరించిన కాలంలోను, శ్రీకృష్ణుడుగా అవతరించిన కాలంలోను భగవానుడు కొందఱు వ్యక్తులను ఆశ్రయించినా తృప్తిని పొందలేకపోయాడు. తాను ఆశ్రయించినవారిలో అందఱిలో కొన్ని లోపాలను గమనించి అతృప్తిపడ్డాడు. ఆ కొఱతలు అన్నీ తీరే రీతిలో ఇపుడు శ్రీమణవాళమహామునులను ఆశ్రయించి, "సదాచార్యలక్షణపూర్తిని కల ఆచార్యశిఖామణులను ఆశ్రయించగలిగాను కదా" అని అమందానందాన్ని పొందిన

విషయం ఈ శ్లోకంలోని ఒక్కొక్క విశేషణంలోను వ్యక్తమవుతున్నది. ఈ విషయం సంగ్రహంగా నిరూపింపబడుతున్నది. ముందుగా ఈ శ్లోకంలోని మొదటి విశేషణాన్ని గమనించండి.

**"శ్రీశైలేశదయాపాత్రమ్"** అనేది మొదటి విశేషణం. శ్రీరామావతారంలో శైలేశదయాపాత్రమైన ఒకవ్యక్తిని ఆశ్రయించి చెడ్డాను. ఇపుడు శ్రీశైలేశదయాపాత్రమైన వ్యక్తివిశేషాన్ని ఆశ్రయించి తరించాను- అని ఇందులోని విశేషార్థం. రామావతారసమయంలో స్వామిచే ఆశ్రయింపబడిన శైలేశదయాపాత్రమైన వ్యక్తి ఎవరు? అంటే, అతడు సుగ్రీవుడే. ఇచట శైలమనగా ఋశ్యమూకపర్వతం. దానికి ఈశులు మతంగముని. అతని దయకు పాత్రమైనవాడు సుగ్రీవుడు. ఈ వృత్తాంతాన్ని శ్రీరామాయణం కిష్కింధాకాండంలోని 11 సర్గలో స్పష్టంగా గమనించవచ్చును. వేయి ఏనుగుల బలంతో సమానం అయిన బలాన్ని కల దుందుభి అనే రాక్షసుడు బలగర్వంతో దున్నపోతు రూపాన్ని ధరించి, కిష్కింధానగరానికి వచ్చి వాలిని యుద్ధానికి రమ్మని పిలిచాడు. వారిద్దరికి జరిగిన భీకరయుద్ధంలో దుందుభిని వాలి చంపి, అతని మృతశరీరాన్ని అదిమి, దానిని యోజనదూరంలో పడేటట్లు బలంగా విసరివేశాడు. అపుడు దుందుభిమృతశరీరం నోటినుండి వెలుబడిన నెత్తుటి బిందువులు కొన్ని మతంగముని ఆశ్రమంలో పడ్డాయి. దానిని చూచిన ఆ ముని కోపించి, జ్ఞానదృష్టితో జరిగిన సంగతిని తెలిసికొని, పవిత్రమైన ఆశ్రమప్రాంతాన్ని అపరిశుద్ధం చేసిన వాలి కాని, అతని అనుయాయులు కాని ఆ ఆశ్రమప్రాంతానికి వస్తే వారు వెంటనే మరణిస్తారని శపించి, ఆ శాపం ఫలించడానికి ఒక దినం గడువు పెట్టాడు. ఆ గడువు లోపల వాలి, అతని అనుచరులు మతంగముని ఆశ్రమాన్ని వదలి పాఱిపోయారు. ముని శాపభయంవల్ల వాలి ఆ తరువాత ఏనాడూ మతంగాశ్రమప్రాంతానికి రాలేకపోయాడు. వాలివల్ల ప్రాణభయాన్ని పొందిన సుగ్రీవుడు తనకు సురక్షితం అయిన చోటు ఆ ఆశ్రమమేనని భావించి, అక్కడ తన అనుచరులతో కలిసి నివసించసాగాడు. అందువల్ల సుగ్రీవుడు శైలేశదయాపాత్రమయ్యాడు. అటువంటి సుగ్రీవుని సహాయాన్ని **"సుగ్రీవం శరణం గతః"** అనే రీతిలో శ్రీరాముడు అర్థించాడుకదా! ఆ తరువాత సీతాన్వేషణాన్ని చేయడంలో ఆలస్యంచేసిన సుగ్రీవునితో శ్రీరామునకు మనస్తాపం ఏర్పడింది. ఈవృత్తాంతం కిష్కింధాకాండలోని ముప్పైయవ సర్గంలో ఉన్నది. తనకిచ్చిన మాటప్రకారం వానకాలం గడచినాగానీ, సుగ్రీవుడు తన సేనలను సీతను వెదకడంకోసం సన్నద్ధం చేసికొనిరానందువల్ల శ్రీరాముడు కుపితుడై లక్ష్మణుని చూచి- "లక్ష్మణా! సుగ్రీవుడు నన్ను పూర్తిగా మఱచిపోయాడుసుమా! చేసిన సహాయాన్ని మఱచిన కృతఘ్నుడుకదా సుగ్రీవుడు! నీవు వెంటనే అతని దగ్గరకు పోయి నామాటగా ఈ విధంగా చెప్పు. కృతఘ్నుడు అందఱికంటే అధముడు. అతడు మరణించిన తర్వాత అతని శరీరాన్ని నక్కలుకూడా తాకవు. లక్ష్మణా ! నా పరాక్రమాన్ని సాక్షాత్తుగా చూచినతర్వాత కూడా సుగ్రీవునకు ఏమాత్రం భయం లేనట్లున్నది. వాలి పోయిన దారి అతనికికూడా తెరువబడి ఉన్నదని తెలుపు. ఈ క్షణంలోనే అతనిని అతని బంధుమిత్రులతో పాటు యమపురికి పంపడం కోసం సిద్ధంగా ఉన్నానని చెప్పు'' అని పలికాడు. **"సుగ్రీవం నాథ మిచ్ఛతి"** అని, **"సుగ్రీవం శరణం గతః"** అని పల్కినా, ఆ సుగ్రీవునితోనే **"న వాలి పథ మన్వగాః"** అని పలికే మనస్తాపం సంభవించినందున, పూర్వం శైలేశదయాపాత్రమైనవానిని ఆశ్రయించిన కొఱత తీరే రీతిలో ఇపుడు శ్రీశైలేశదయాపాత్రమైన మహనీయులను ఆశ్రయించ గల్గి, ఉజ్జీవించాను- అని ఈ విశేషణంలోని సరసమైన, సాంప్రదాయకమైన అర్థం. తిరుమలై యాழ్వార్ అనబడే తిరువాయ్మొழிప్పిళ్ళై కృపకు పాత్రమైన శ్రీమణవాళమహామునులను కొలుస్తున్నాను - అని ఇచటి పరమార్థం.

ఇక, **"ధీభక్త్యాదిగుణార్ణవమ్"** అనే రెండవ విశేషణాన్ని గమనించినపుడు, ఈ క్రింది అర్థవిశేషం స్ఫురిస్తుంది. భగవానుడు శ్రీరాముడై అవతరించినపుడు సుగ్రీవుని శరణు వేడినట్లే, లవణార్ణవుడనబడే సముద్రుని శరణు పొందిన సందర్భం యుద్ధకాండ ప్రారంభంలో ప్రసిద్ధం. **"సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి"** అని పల్కిన

విభీషణుని మాటను అనుసరించి, లవణాబ్ధిని శరణు వేడినా, అతని విషయంలోకూడా స్వామికి మనస్తాపమే కల్గింది. మూడు దినాలపాటు సముద్రతీరంలో ప్రాయోపవేశం చేసినా సముద్రుడు తన ముఖాన్ని శ్రీరామునకు చూపించలేదు. ప్రత్యక్షం కాలేదు. అపుడు ఆగ్రహోదగ్రుడైన శ్రీరాముడు లక్ష్మణునితో- **"చాప మానయ సౌమిత్రే! శరాంశ్చాశీవిషోపమాన్, సాగరం శోషయిష్యామి"**- లక్ష్మణా నా వింటిని, సర్పాలవంటి బాణాలను తీసికొనిరా. సముద్రాన్ని ఇంకింపజేస్తాను- అని చాలా తీవ్రంగా పలికాడు. ఈ విధంగా సముద్రుని శరణాగతి అతని నిగ్రహంలోకే పర్యవసించిన కొఱత శ్రీరామావతార సందర్భంలో కల్గింది. లవణార్ణవాన్ని కొలిచిన ఆ కొఱత తీరేటట్లుగా ఇపుడు ధీభక్త్యాదిగుణార్ణవులైన మణవాళమహామునులను ఆశ్రయిస్తున్నాను- అని ఇందలి హృదయం.

**"యతీంద్రప్రవణమ్"** - అన్నది తనియన్ శ్లోకంలోని మూడవ విశేషణం. ఇపుడు శ్రీరంగనాథుడుగా సేవను అనుగ్రహించే భగవానుడే **"మన్దిపాయ్ వడవేఙ్గడమామలై వానవర్ కళ్ శన్ది శెయ్య నిన్ఱాన్ అరఙ్గత్తరవినణైయాన్"** (ఆడు కోతులు సంచరించే ఉత్తరదిక్కులోని వేంకటాచలంలో నిత్యసూరులు సంధ్యాకాలారాధన చేసేటట్లుగా నిలచి ఉన్నవాడు- శ్రీరంగంలో ఆదిశేషునిపై పవళించిన స్వామి) అనే రీతిలో భగవానుడు శ్రీవేంకటాచలపతియై, భగవద్రామానుజులకు శిష్యుడయ్యాడు. **"శ్రీవేంకటాచలాధీశశంఖ చక్రప్రదాయకః"** అని, **"అప్పనుక్కు చ్చఙ్గాழி అళిత్తరుళుమ్ పెరుమాళ్"** (అప్పన్ అనబడే వేంకటేశ్వరునకు శంఖచక్రాలను ప్రసాదించిన స్వామి) అని కీర్తింపబడే రీతిలో వేంకటేశ్వరుడు శ్రీరామానుజులవద్ద శంఖచక్రాలను పొందడం ద్వారా ఆ ఆచార్యులకు శిష్యుడైన వైనం శ్రీవేంకటాచలేతిహాసమాల, తిరుమలై ఒழுకు - ఇత్యాది గ్రంథాలలో, ఇతర సంప్రదాయచరిత్ర గ్రంథాలలో సుస్పష్టం. శ్రీరామానుజుల విషయంలో స్వామికి ఎటువంటి మనస్తాపం కలగలేదు. కాని, ఇరామానుశనూఱ్ఱన్దాదిలో **"తన్నైయుఱ్ఱాట్చెయ్యుమ్ తన్మైయినోర్"** అనే పాశురంలో చెప్పబడిన రీతిలో శ్రీయతీంద్రులను సేవించడంకంటే యతీంద్రప్రవణులకు శిష్యవృత్తిని చేయడం శ్లాఘ్యమని భగవానునకు తోచింది. ఈ పాశురంలో తమను ఆశ్రయించడంకంటే తమను ఆశ్రయించి బతికేవారి చరణాలను ఆశ్రయించి బతికేవారే గొప్పకదా- అనే భావాన్ని భగవద్రామానుజులు కలిగి ఉన్నారని తెలుపబడిందికదా! అందువల్ల యతీంద్రప్రవణులైన మణవాళమహామునులను ఆశ్రయిస్తున్నాను- అని దీని తాత్పర్యం. మణవాళమహామునులకు యతీంద్రప్రవణులనే తిరునామం ప్రసిద్ధంకదా!

ఇక, శ్లోకంలోని చివరిపాదం- **"వందే రమ్యజామాతరం మునిమ్"** రామకృష్ణావ తారాలు రెండిటిలో భగవానుడు ఇద్దఱు మునులను ఆశ్రయించాడు. శ్రీరామావతారంలో **"ఇమౌ స్మ మునిశార్దూల కింకరౌ"** అని విశ్వామిత్రమునిని, శ్రీకృష్ణావతారంలో సాందీపనిమునిని ఆశ్రయించినగానీ, వారిపట్ల వైరస్యమే కల్గింది. విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులతో పాటు జనకుని యాగశాలలో ప్రవేశించిన తరువాత గౌతమపుత్రుడు, జనకుని పురోహితుడు అయిన శతానందుడు విశ్వామిత్రుని పూర్వగాథను శ్రీరామునకు తెలియజేశాడు. ఈవృత్తాంతం బాలకాండలోని 51వ సర్గనుండి గమనించవచ్చు. శతానందునివల్ల విశ్వామిత్రుని గత వృత్తాంతాన్ని వినిన శ్రీరాముడు ఆముని రజోగుణతమోగుణాలకు వశుడై చేసిన కార్యాలను తెలిసి, ఇటువంటిమునిని ఆచార్యునిగా గ్రహించానే ! అని మనస్సులో కొఱతను పొందాడు. ఇక, శ్రీకృష్ణావతారంలో భగవానుడు అవంతికాపురంలో నివసించే సాందీపనివద్దకుపోయి అతనిదగ్గర అఱువైనాల్గు కళలను అభ్యసించాడు. విద్యాభ్యాసానంతరం **"ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య"** అనే వేదవిధిని అనుసరించి, శ్రీకృష్ణుడు గురుదక్షిణను సమర్పించదలచినపుడు సాందీపని **"సాందీపనే శ్చిర మృతం సుత మానయంశ్చ"** అని కూరేశులు అతిమానుషస్తవంలో నుడివిన రీతిలో ఏనాడో ఎపుడో ప్రభాసతీర్థంలో మరణించిన తన కుమారుని తీసికొని రావాలని కోరాడు. శ్రీకృష్ణుడుకూడా అతని కోరికప్రకారం అతని పుత్రుని తీసికొని వచ్చి

ఇచ్చాడు. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుని అవతారవిశేషం అని సాందీపని తెలియనివాడు కాడు. అయినా, శ్రీకృష్ణునివల్ల మోక్షపురుషార్థాన్ని కోరకుండా, మృతుడైన కుమారుని కోరడంద్వారా క్షుద్రఫలాన్ని ఆశించాడు. అటువంటి ఆ మునిపట్ల మనస్సులో శ్రీకృష్ణునకు కొఱత కల్గడం సహజమేకదా! ఆ కొఱత తీరేటట్లుగా ఆ ఇద్దరు మునులను విడచి, సమస్తకల్యాణగుణాలకు సముద్రునివంటివారైన శ్రీమణవాళమహామునులను ఆశ్రయించి, ఉజ్జీవిస్తున్నాను- అని ఇచటి సారం.

ఇటువంటి అద్భుతాలైన అర్థవిశేషాలను ఇముడ్చుకొన్న ఈతనియన్ శ్లోకాన్ని భగవానుడే చెప్పి ఉండాలి తప్ప, మానవమాత్రుడు చెప్పడం వీలు కాని పని. భగవానుని హృదయంలో ఉండే విషయాలుకదా ఇవన్నీ ! వీటిని ఊహించి చెప్పడం ఎవరికి సాధ్యం? అందువల్ల ఈ తనియన్ దైవవాక్కు అనే విషయం చక్కగా నిరూపితమైనది.



శ్రీమదుభయవేదాంతవిద్వాన్ కార్‌ప్పఙ్గాడు వేంకటాచార్యస్వామి చరణులు అనుగ్రహించిన "శెమ్బొరుళ్"

సాక్షాత్ సర్వేశ్వరుడైన శ్రీరంగనాథునిచేతనే అనుగ్రహింపబడ్డ ఈ మంత్రంకంటే ఉత్కృష్టమైన మంత్రం ఏదీ లేదు అనే మాట అతిశయోక్తి కాదు. "**శ్రీశైలేశదయాపాత్రమ్**" అని స్వాచార్యులైన తిరువాయ్‌మొ*ழి*ప్పిళ్ళైయొక్క పూర్ణకృపకు పాత్రమైనవారు మణవాళమామునులు. ఈ విధంగా చెప్పబడ్డ ఆచార్యాభిమానంయొక్క ఫలాన్ని భగవత్ప్రాప్తిగా చెప్పకుండా యతీంద్రప్రావణ్యం, ధీభక్త్యాదిగుణార్ణవత్వంగా ఈ తనియన్ తెలుపుతున్నది. ఇక్కడ, వరవరములు భగవద్రామానుజులపట్ల అధికమైన భక్తిని కలవారై, యతీంద్రప్రవణులై ఉండడం, జ్ఞానభక్తివైరాగ్యాలు అనే గుణాలకు సముద్రంగా శోభించడం ఎందువల్ల అని అంటే- "**ఎన్నై తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళై యిన్నరుళాల్**" అని మణవాళమహామునులే అన్నట్లు తండ్రివంటి తిరువాయ్‌మొ*ழி*ప్పిళ్ళై కృపవల్లనే. ధనాన్ని కలవాడు సుఖానుభవాన్ని పొందుతాడు. అతనికి సుఖానుభవం కేవలం ధనాన్ని కల్గి ఉండడంవల్ల కలిగేటట్లే, మణవాళమహామునులకు యతీంద్రప్రావణ్యం, ఆత్మగుణపూర్తి- అనే గొప్పతనాలు, స్వాచార్యుల కృపవల్ల, వీరు శ్రీశైలేశదయాపాత్రుల కావడంవల్ల ఏర్పడ్డాయి. ఉపకారకులైన స్వాచార్యుల కృపవల్ల ఉత్తారకులైన శ్రీరామానుజుల సంబంధం, అభిమానం వరవరమునులకు ఏర్పడ్డాయి. "**రామానుజార్య కరుణైవ తు మద్గతి స్తే**" అని యతిరాజవింశతిలోను, "**మాశిల్ తిరుమలైయా*ழ*్వార్ ఎన్నై నేశత్తాల్ నిన్‌పాల్ శేర్‌త్తార్**", "**ఉన్దనబిమానమే ఉత్తారక మెన్టు శిన్దై శెయ్‌దిరుక్కచ్చెయ్‌ద నీ అన్దో! యెతిరాశా! శతిరాక నిన్ తిరుత్తాళ్ తా**", "**అవర్‌క్కాయ్ ఎతిరాశర్ ఎమ్మై క్కడుక ప్పరమపదమ్‌తన్నిల్ ఏ*ற్ఱ*ువర్. ఎన్నబయమ్ నమక్కే! ఎతిరాశర్‌తమ్ అభిమాన మెన్నుమ్ పోదత్తై ఏఱి ప్పవమామ్ పుణరిదనై క్కడన్దు పాతక్కరై లయ క్కుఱుకువనే**" అని పలు రీతుల్లో ఆర్తి ప్రబంధంలోను భగవానునిపట్ల తమ మధురకవినిష్ఠను, ప్రావణ్యాన్ని వ్యక్తంచేశారు. మణవాళమహామునులు ఉపదేశరత్తినమాలైలోకూడా ఆ గ్రంథఫలంగా "**ఎన్నై ఎతిరాశన్ ఇన్నరుళుక్కిలక్కాకి శదిరాక వా*ழ*్న్దిడువర్**" అని అన్నారు. అందువల్ల నారాయణచతురక్షరికంటే రామానుజ, యతిరాజ చతురక్షరులు చాలా గొప్పవి అన్నది మామునులు చూపే పరమార్థం. ఇదే "**శెమ్బొరుళ్**" - సారతమమైన ఋజువైన, అందమైన అర్థం. ఈ తనియన్‌లో శ్రీరంగనాథుడు అనుగ్రహించిన పరమార్థం. నమ్బెరుమాళ్ తిరునామం అంతర్భవించి ఉండే "**రమ్యజామాతృ**" నామాన్ని అనుసంధించి, "**వందే రమ్యజామాతరమ్ మునిమ్**"అని స్వామి మణవాళమహామునిని శరణుపొందుదాం.



యతీంద్రప్రవణప్రభావం అనే గ్రంథం ఈ తనియన్ అతిశయాన్ని రెండు ఐతిహ్యాలను ప్రస్తావించడంద్వారా ఈ క్రిందివిధంగా వ్యక్తీకరించింది.

ద్రావిడదేశానికి దక్షిణదిశకు ఎల్ల అయిన తిరుమాలిరుమ్ శోలై (వనగిరి) లోని సుందరబాహుస్వామి, ఉత్తరదిక్కు ఎల్ల అయిన వేంకటాచలంలోని శ్రీనివాసుడు ఈ తనియన్‌కు ప్రవర్తకులు. పూర్వం ఒకానొక సమయంలో ముముక్షువై దేశాంతరాలలో సంచరించే ఒక శ్రీవైష్ణవునకు స్వప్నంలో భగవానుడు సాక్షాత్కరించి, ఈ శ్లోకాన్ని ఉపదేశించగా, ఆ భక్తుడు దానిని తనకు రక్షకంగా భావించాడు. తరువాత ఒకసారి ఈ శ్లోకాన్ని అనుసంధింపబడే క్షేత్రం అయిన తిరుమలకు బ్రహ్మోత్సవాలు జరిగే సమయంలో అతడు వచ్చినపుడు, వేంకటేశ్వరుడు అతనిని కటాక్షించి, అర్చకముఖంగా అతని చేతిని పట్టుకొని తీసికొనివచ్చి సభలో శ్రీవైష్ణవులమధ్య నిలిపి, "వీరి అనుసంధానాన్ని విను" అని అతనితో పల్కి, శ్రీవైష్ణవులతో "ఇతని సమాధానాన్ని వినండి" అని వారిని నియమించాడు. అంతకుముందునుండి సేనైముదలియార్ ఆజ్ఞానుసారం అక్కడ అనుసంధించే **"శ్రీశైలేశదయాపాత్రమ్"** అనే తనియన్‌ను అపుడు పెరియకేళ్విజీయర్ ప్రారంభించగా, దానిని విని ఆ శ్రీవైష్ణవుడు విని చాలా ఆశ్చర్యపడి, "నాకు స్వప్నలబ్ధమైనది, నేను రక్షకంగా భావించేది అయిన ఈ శ్లోకాన్ని మీరు అనుసంధించడం ఏమి ఆశ్చర్యం! ఇది ఏ విధంగా సాధ్యం?" అని విస్మయంగా పల్కగా "అయితే మీరు ఆ శ్లోకాన్ని చెప్పండి" అని జీయర్ అన్నారు. అపుడు శ్రీవైష్ణవుడు తాను స్వప్నంలో పొందిన శ్రీశైలేశేత్యాదిశ్లోకాన్ని అనుసంధించగా, దానిని విని అందఱు ఆశ్చర్యపడ్డారు. ఆనందించారుకూడా. ఆ తరువాత ఆ భక్తుడు శ్రీరంగాన్ని చేరి వరవరమునుల శ్రీపాదాలలో వేరు తెగిన చెట్టువలె సాష్టాంగపడ్డాడు.అపుడు వరవరమునులు అతనిని తమ శ్రీహస్తాలతో చల్లగా, ప్రేమతో స్పృశించి, "మీరెవరు? మీరు వచ్చిన పని ఏమి?" అని ప్రశ్నించారు. తాను ముముక్షువై దేశాంతరాలలో సంచరిస్తూ ఉంటానని పల్కి, తనకు వచ్చిన కలను తెలిపి "శ్రీవేంకటేశ్వరుడు నన్ను విశేషంగా కటాక్షించి, తమ తనియన్‌ను సభలో అనుగ్రహించి, మీశ్రీపాదాలను సేవించేటట్లు చేశాడు" అని విన్నవించాడు.అపుడు వరవరమునులు "మీరు ఈ విధంగా భగవత్కటాక్షాన్ని పొందారా!" అని చాలా సంతోషించి, "అయితే ఇక మీకు ఏం కావాలి?" అని అడిగినపుడు, అతడు "తమ శ్రీపాదాలను రక్షకంగా ఆశ్రయించిన నాకు ఇక వేఱొకటి ఆవశ్యకం అయినది ఉన్నదా!' అని హృష్టుడై పలికాడు. అపుడు ఆయనకు వరవరమునులు పంచసంస్కారాలను అనుగ్రహించి, **"తిరువేఙ్గడరామానుజ జీయర్"** అనే దాస్యనామాన్నికూడా పెట్టారు. ఇది తిరుమల వేంకటేశ్వరుడు శ్రీశైలేశేత్యాది తనియన్‌ను ప్రవర్తింపజేసిన వృత్తాంతం.

ఇక, తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామి (అழకర్) వృత్తాంతం. వనగిరి అనబడే తిరుమాలిరుమ్ శోలైలో సకలవిధకైంకర్యాలలో నిరతులై, వరవరమునుల సంబంధాన్ని కల ఆలయ జీయర్, తమ ఆచార్యులైన వరవరమునుల ఆత్మగుణాలను, దివ్యమంగళవిగ్రహగుణాలను అనుసంధిస్తూ - "తమకు నిత్యానుసంధేయమైన ఒక తనియన్ కావాలి" అని తలచి, పెరుమాళ్ సన్నిధిలో తమ అభిప్రాయాన్ని విన్నవించారు. అపుడు మణవాళమహామునుల శ్రీపాదసంబంధాన్ని కల సేనైముదలియార్ అనే ఆచార్యులు సుందరబాహుస్వామిని సేవించాలని వచ్చారు. సుందరబాహుస్వామి కోవెలలో ఆలయకైంకర్యాలను నిర్వహించే జీయర్ వారిని చూచి చాలా సంతోషించి, వారిని సుందరబాహుస్వామికి మంగళాశాసనం చేయడంకోసం పిలుచుకొని కోవెలలోనికి తీసికొనిపోయారు. సుందరబాహుస్వామి సేనైముదలియార్‌ను అర్చకముఖంగా చాలా ఆదరించి, తీర్థప్రసాదాలను ప్రసాదించి, శఠారిని వారి శిరస్సుపై దృఢంగా ఉంచి, **"జిహ్వాగ్రే తవ వక్ష్యామి స్థిత్వా పరమపావనమ్, పద్యం త్వదార్యవిషయం మునే రస్య మమాజ్ఞయా"** (నీ జిహ్వాగ్రంలో ఉండి నేను పల్కుతున్నాను. నా ఆజ్ఞతో మీకు పూజ్యులైన మణవాళమహామునుల

విషయంగా చాలా పవిత్రం అయిన శ్లోకాన్ని ఈ జీయర్‌కు చెప్పు) అని అర్చకముఖంగా నియమించగా, సేనై ముదలియార్ "ధన్యోఽస్మీతి సేనేశ దేశికో వదత స్వయమ్, వహన్ శిరసి దేవస్య పాదౌ పరమపావనౌ" (సేనై ముదలియార్ భగవానుని చాలా పావనం అయిన శ్రీపాదాలను శిరస్సులో ధరిస్తూ, స్వయంగా తాను ధన్యుణ్ణి అయ్యాను అని అన్నాడు) అనే రీతిలో శ్రీశఠారిని తలపై ఉంచుకొని, "శ్రీశైలేశదయాపాత్రమ్" ఇత్యాది తనియన్‌ను అనుగ్రహించారు. అర్చకులు ఈ తనియన్‌ను జీయర్‌కు చెప్పారు. తరువాత సేనైముదలియార్, అర్చకులు జీయర్ మఠానికి పోయి తనియన్ అవతరించిన రీతికి ఆశ్చర్యపడ్డారు. ఆ తనియన్‌ను తమకు రక్షకంగాకూడా తలచారు. సేనైముదలియార్ ఈ వృత్తాంతాన్ని శ్రీరంగంలోని పెద్దలకు తెలియజేయాలని వేగంగా పోయి, అక్కడ మణవాళమహామునులను సేవించి, జరిగిన వృత్తాంతాన్ని విన్నపించగా అందఱు చాలా ఆనందించారు. "ఈవిధంగా వేంకటేశ్వరుడు, సుందరబాహుస్వామి ఈ తనియన్‌ను ప్రకాశింపజేశారుకదా! ఈ తనియన్ వైభవం ఎంత గొప్పది!" అని వారంతా చాలా ఆశ్చర్యచకితులయ్యారు. ఈ రెండు వృత్తాంతాలు యతీంద్రప్రవణప్రభావంలో తెలుపబడ్డాయి.

కోయిల్ కన్దాడై అణ్ణన్ వరవరమునుల విషయంలో అనుగ్రహించిన "కణ్ణినుణ్ శిఱుత్తాම్బు" ప్రబంధంలోను, అప్పిళ్ళాన్ అనుగ్రహించిన "సంప్రదాయచంద్రికై" అనే ప్రబంధంలోను ఇంకొక ఆద్భుతవృత్తాంతం ఈ తనియన్ వైభవాన్ని ప్రకటిస్తున్నది. కణ్ణినుణ్‌శిఱుత్తాම్బులో కన్దాడై అణ్ణన్ -

> వాశి యటిన్ద వదరియిల్ నారణర్ మనజ్కోళ్
> తేశుడై యెన్దై మణవాళమాముని శీర్ తழைప్ప
> చ్చీశయిలేశదయాపాత్తిర మెనుమ్ శీర్‌మన్దిరమ్
> దేశికనాయ్ క్కణ్డురైత్తార్ ఇవ్వైయకత్తీరుఱవే

బదరికాశ్రమంలో వేంచేసి ఉండే శ్రీమన్నారాయణుని ఆ స్వామి భక్తులు ఇద్దరు ప్రణమిల్లి, "దాసులమైన మాకు రక్షకంగా ఉండే శ్లోకాన్ని దేనినైనా అనుగ్రహించండి'' అని వేడారు. అపుడు భగవానుడు వారిని కరుణించి తనియన్‌లోని "శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్" అనే పూర్వభాగాన్ని అనుగ్రహించి, మిగిలిన సగాన్ని తాను శ్రీరంగంలో అనుగ్రహిస్తానని పల్కి, వారిని శ్రీరంగానికి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. వారుకూడా అదేరీతిలో శ్రీరంగానికి వచ్చారు. అపుడు మణవాళమహామునులు తిరువాయ్‌మొழிప్రబంధానికి గల వ్యాఖ్యలను శ్రీరంగనాథుని సన్నిధిలో ప్రవచనం చేసి, ముగిస్తున్న సమయం. ఆసందర్భంలో బదరీనారాయణస్వామి శ్రీరంగనాథుని రూపంలో తనియన్‌లోని మిగిలిన భాగాన్ని "యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్" అని అనుగ్రహించారు- అనే వృత్తాంతం సత్సంప్రదాయ సుప్రసిద్ధం. ఈ విషయమే పైపాశురంలో ప్రస్తావింపబడింది. ఈవిషయమే సంప్రదాయచంద్రికై లోని ఈక్రింది నాల్గవ, అయిదవ పాశురాలలో కూడా స్పష్టంగా తెలుపబడింది.

> వదరియాచ్చిరామత్తిల్ ఇరు మెయ్ తొణ్డర్
> వకైయాక నారణనై వణఙ్గి
> క్కతియాక ఓర్ పొరుళై అళిక్కవేణ్డుమ్
> కణ్ణనే! అడియోఙ్గళ్ తేఱ వెన్న
> చ్చతిరాక చ్చీశైలమన్దిరత్తిన్
> శయమాన పాదియై అఙ్గరుళిచ్చెయ్‌దు

పదియాన కోయిలుక్కు చ్చెన్నిన్ నీవిర్
　　పాదిమైయుమ్ శొల్లుదుమ్ యామ్ తేఱ వెన్నార్
శెన్టవర్కళ్ ఇరువరుమే శేర వన్దు
　　తిరువరఙ్గన్ దినశరియై కేళా నిఱ్ప
చ్చన్నిదిమున్ కరుడాழ్వార్మణ్డపత్తిల్
　　తామీడు శాత్తుకిన్ట శమయన్దన్నిల్
పొన్నిదనిల్ నీరాడి పుకழ்న్దు వన్దు
　　పుకழரఙ్గర్ శన్నిదిమున్ వణఙ్గి నిఱ్ప
చన్నిదియిల్ నిన్టరఙ్గర్తామే యన్ద
　　త్తనియనురైశెయ్దు తలైక్కట్టినారే

అష్టాక్షరిని బదరిలో[ప్రసాదించిన స్వామే ఈ తనియన్‌లోని పూర్వార్థాన్ని ప్రసాదించినందువల్ల ఈతనియన్ అష్టాక్షరీమంత్రార్థ ప్రతిపాదకంగాను, ప్రణవాకార విమానంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుడు మిగిలిన సగాన్ని కూడా ప్రసాదించినందువల్ల ప్రణవార్థప్రకాశకంగాను ఈ తనియన్ ప్రకాశించడంలో ఆశ్చర్యం ఏమున్నది! ఈ విధంగా శ్రీశైలేశదయాపాత్రతనియన్ వైభవం వాచామగోచరం అన్నది సుస్పష్టం.

### అణ్ణన్ తిరుమాళిగైలోని వృత్తాంతం (యతీంద్రప్రవణప్రభావం)

మణవాళమహామునులు ఈడు వ్యాఖ్యం కాలక్షేపాన్ని ముగించే శుభసందర్భాన్ని సేవించాలని శ్రీరంగానికి పలువురు వచ్చిన సమయంలో- అణ్ణన్ తిరుమాళిగలో జ్ఞానాధికులైన స్త్రీలు, అణ్ణన్ పత్ని మొదలైనవారు శ్రీవరవరమునుల వైభవాన్ని అనుసంధించుకొంటూ ఉండగా- ఒక బ్రహ్మచారి వచ్చి ఒక చీటిని అణ్ణన్ ధర్మపత్నికి ఇచ్చి "దీనిని అణ్ణన్‌కు అందజేయండి" అని పలికాడు. ఆమె దానిని తీసికొని చదివించగా అది శ్లోకంవలె తోచింది. అపుడు ఆ చీటిని తనకు ఇచ్చిన బ్రహ్మచారికోసం ఆమె చూడగా అతడు కనబడలేదు. తరువాత అందరూ కలిసి అతనికోసం ఎంత వెదికినా కనబడకపోవడంతో ఆశ్చర్యపడ్డారు. తరువాత అణ్ణన్ ఆచీటిలో వ్రాయబడ్డ శ్లోకం శ్రీశైలేశదయాపాత్ర తనియన్ అని గ్రహించి, చాలా విద్ధులయ్యారు.

### బదరికాశ్రమవృత్తాతం (యతీంద్రప్రవణప్రభావం)

శ్రీవరవరమునుల ఆజ్ఞపై బదరికాశ్రమక్షేత్రానికి యాత్రగావెళ్ళిన ఇళైయాழ்వార్ పిళ్ళై అనే ఆచార్యులు ఆ క్షేత్రంలోని శ్రీనారాయణస్వామిని అర్చించే అయోధ్యారామానుజ అయ్యంగార్ అనే ఆచార్యుల నియమనంపై ద్రావిడ ప్రబంధానుసంధానాన్ని ప్రారంభిస్తూ ముందుగా తమ అలవాటుప్రకారం **"శ్రీశైలేశదయా పాత్రమ్"** అనే తనియన్ అనుసంధించారు. అపుడు రామానుజ అయ్యంగార్ **"జజ్ఞేఽ మునా స్వప్ననివేదితం హి యత్ కథం బదర్యాశ్రమనిత్యవాసినా, ప్రాకాశి మంత్రార్థ మిదం మురద్విషే త్యయోధ్యరామానుజ ఆవిసిష్మయే"** అని పూర్వం తనకు స్వప్నంలో బదరీనారాయణస్వామి అనుగ్రహించిన తనియన్ శ్లోకాన్ని ఇళైయాழ்వార్‌పిళ్ళై అనుసంధించడాన్ని గమనించి చాలా విస్మయాన్ని పొందారు. తరువాత అయోధ్య రామానుజఅయ్యంగార్ ఆ తనియన్ అవతరించిన సందర్భాన్ని, దాని వైభవాన్ని గూర్చి ప్రశ్నించినపుడు ఇళైయాழ்వార్ శ్రీరంగంలో శ్రీశైలేశదయాపాత్రతనియన్‌ను రంగనాథుడు బాలుని రూపంలో ప్రకాశింపజేసిన సందర్భాన్ని, తిరుమల వేంకటేశ్వరుడు, తిరుమాలిరుమ్ శోలైలోని సుందరబాహుస్వామి ఈ తనియన్‌ను ప్రవర్తింపజేసిన వృత్తాంతాలను వారికి వివరించారు.

శ్రీమద్వరవరమునయే నమః

శ్రీవాధూలవీర రాఘవాచార్యులవారిచే (అణ్ణావప్పఙ్గార్చే) అనుగ్రహింపబడిన

# వరవరమునిసుచరితచషకమ్

1. మూలర్క్షే శ్రీనగర్యా ముదయ మధిగతో జైత్రజిహ్వేశదాసాత్
తస్మా త్తాపాదిపూర్వం రుచిరవర ఇతి ప్రాప్తనామా గుణైః స్వైః ।
తిష్ఠన్ గ్రామే కడారే కతిచన శరదో మాతులావాసభూతే
సాంగోపాంగాగమజ్ఞో ద్రమిడనిగమవిత్ ప్రాప దారా నుదారాన్ ॥

శ్రీవరవరమునులు ఆళ్వార్ తిరునగరిలో **"తికళ్ క్కిడన్దాన్ తిరునావీఱుడైయ పిరాన్ తాతరణ్ణన్"** అనే మహనీయులకు కుమారులుగా అల్పిశిమాసం మూలనక్షత్రంలో అవతరించారు. తమ పితృపాదుల సన్నిధిలో పంచసంస్కారాలను పొంది, తమ రూపసౌందర్యం మొదలైన గుణాలతో **"అళకియ మణవాళన్"** అనే తిరునామంతో వ్యవహరింపబడ్డారు. తరువాత, కొన్ని సంవత్సరాలపాటు "శిక్కిల్ కడారమ్" అనే గ్రామంలో తమ మేనమామ గారి ఇంటిలో ఉంటూ సాంగోపాంగాలైన వేదాలను, ఆళ్వార్ల శ్రీసూక్తులను అభ్యసించి, గుణవతి అయిన భార్యను పొందారు.

2. భూయః శ్రీరంగనాథే నిజనిలయగతః శ్రీనగర్యాం కడారాత్
శ్రీశైలార్యం శ్రిత స్తత్కలితయతిపతౌ వింశతిం శంసతి స్మ।
తద్దత్తాం తత్సపర్యా మనుదిన మకరో ద్ద్రావిడామ్నాయభాష్యం
షట్త్రింశద్భి స్సహస్రైః గణితమమితధీః వాగ్విధేయం దధౌ సః ॥

శ్రీరంగనాథుడు (నమ్బెరుమాళ్) తన నివాసమైన శ్రీరంగానికి తిరిగి వచ్చిన తర్వాత, శ్రీవరవర మునులు కూడ **"శిక్కిల్ కడారమ్"** నుండి ఆళ్వార్ తిరునగరికి వచ్చి, తిరువాయ్మొళి ప్పిళ్ళై అనబడే గొప్ప ఆచార్యులను ఆశ్రయించారు. ఆ గ్రామంలో ఆచార్యవర్యులచేత ప్రతిష్ఠ చేయబడ్డ శ్రీరామానుజుల అర్చావిగ్రహ విషయంలో **"యతిరాజవింశతి"** అనే స్తుతిని అనుగ్రహించారు. తిరువాయ్ మొళిప్పిళ్ళైచేత తమకు అనుగ్రహింపబడ్డ యతిరాజకైంకర్యాన్ని ప్రతిదినం చేస్తూ వచ్చారు. తిరువాయ్మొళి ప్రబంధవ్యాఖ్య ఈడుముప్పత్తాఱాయిఱప్పడిని సూక్ష్మ బుద్ధిని కల సబ్రహ్మచారులతో కలసి విని, దానిని వాచోవిధేయంగా చేసికొన్నారు.

3. శ్రీశైలేశాయ కృత్వా సశపథ మఖిలద్రామిడామ్నాయభాష్య-
వ్యాఖ్యాదీక్షాం తతోఽస్మిన్ శ్రితవతి పరమం ధామ తత్కైంకర్యాఢ్యః ।
తత్సూక్త్యా రంగనాథప్రణమనకుతుకీ భట్టనాథేన గోదాం
నత్వోద్యానాద్రినాథం తదను వరవరో రంగనాథం దదర్శ ॥

ఆ వరవరమునులు, తిరువాయ్మొళిప్పిళ్ళైకు వారి అంతిమదశలో "ఆళ్వార్ల ద్రావిడవేదాలతో వాటి వ్యాఖ్యలతో కాలక్షేపం చేస్తూ ఉంటాను" అని శపథం చేసి, ఆ మహనీయులు పరమపదానికి చేరిన తరువాత

వారికి నిర్వర్తించవలసిన చరమకైంకర్యా లను నిర్వహించారు. వారి మాటను అనుసరించి, శ్రీరంగనాథుని సేవించాలనే ఆసక్తితో ఆళ్వార్ తిరునగరినుండి బయలుదేరి, దారిలో శ్రీవిల్లిపుత్తూర్‌లో పెరియాళ్వార్లకు, ఆణ్డాళ్‌కు మంగళాశాసనాన్ని చేసి, తిరుమాలిరుమ్‌శోలైలోని అళగర్‌ను (సుందరబాహు స్వామిని) సేవించి, శ్రీరంగాన్ని చేరి, శ్రీరంగనాథుని సేవించారు.

4. తేనాస్మిన్నిత్యవాసం ప్రతి నియమితహృల్లోకగుర్వాదిచర్యాం
తత్సూక్తిం తద్గృహాంశ్చ స్వమనసి కలయన్ రంగకైంకర్య మాప్తః ।
గత్వాఽసౌ వేంకటాద్రిం తదను కరిగిరిం భూతపుర్యాం యతీంద్రం
నత్వా గత్వాఽథ కాంచీం వరదగురువరా దత్రిజాత్ భాష్య మాప ॥

ఆ శ్రీరంగనాథుని దర్శనంవల్ల శ్రీరంగంలో నిత్యవాసాన్ని చేయాలి - అని నిశ్చయించుకొన్న మనస్సును కలవారయ్యారు. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు మొదలైన పూర్వాచార్యుల చరిత్రలను విని, వారి శ్రీసూక్తులను మనస్సులో అనుసంధించి, వారి తిరుమాళిగలను (గృహాలను) సేవించి, శ్రీరంగనాథుని కైంకర్యాన్ని పొందారు. తరువాత, దివ్యదేశాలను సేవించి, వానికి మంగళాశాసనాన్ని చేయాలనే అభిప్రాయాన్ని పొంది, శ్రీవేంకటాచలానికి, హస్తిగిరికి (కంచికి) చేరి, దానిని సేవించి, పిమ్మట శ్రీపెరుమ్బూదూర్‌లో భగవద్రామానుజుల శ్రీపాదాలను సేవించి, అనంతరం తిరువెంఃకా అనే దివ్యదేశాన్ని చేరి, కిడాంబి తిరుమలైనాయనార్ అనే ఆత్రేయ వరదాచార్యుల సన్నిధిలో శ్రీభాష్యాన్ని అధికరించారు.

5. శ్రీరంగం ప్రాప్య తస్మి న్నియతవసతికృన్మంగళాన్యస్య వాంఛన్
ఆశౌచార్త స్సుతేనోజ్ఝహ దథ గృహిణీం తుర్య మాపాఽశ్రమం సః ॥
తత్ర శ్రీశైలనాథాహ్వాయపరిమళితం మండపం కారయిత్వా
లోకాచార్యాదిసూక్తిం వ్యవృణుత నిపుణం రమ్యజామాతృయోగీ ॥

తిరిగి శ్రీరంగాన్ని చేరి, అక్కడ స్థిరంగా నివసించడం కోసం స్థానాన్ని ఏర్పాటు చేసికొని, భగవానునకు నిరంతరం మంగళాశాసనం చేయాలని కోరినవారై అక్కడే వేంచేసి ఉన్నారు. ఆ సమయంలో రంగనాథుని సేవకు అడ్డుగా ఉండే ఆశౌచాన్ని (బంధువుల జననమరణాలవల్ల ఏర్పడే మైలును)కొందరు తెలియజేయగా, భగవన్మంగళాశాసనానికి కల్గిన ఆ అంతరాయానికి చాలా బాధపడి, పత్నిని, కుమారులను త్యజించి, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారు. శ్రీరంగనాథుని వద్దనుండి అక్కడ స్వాచార్యులైన తిరువాయ్‌మొళిప్పిళ్ళై తిరునామంతో ఒక వ్యాఖ్యాన మండపాన్ని ఏర్పాటుచేసి, అక్కడనే ఉండి శ్రీపిళ్ళైలోకాచార్యులవారు మొదలైన పూర్వాచార్యుల శ్రీసూక్తులను చక్కగా వివరిస్తూ వేంచేసి ఉన్నారు.

6. తత్రార్చాం రంగరాజం తదుదితనియమాత్ ప్రాప్య భూయోభి రార్యైః
వాధూలాద్యైః శ్రితాంఘ్రిః కమపి తు కుదృశం దాశరథ్యార్యవర్యాత్ ।
జిత్వా తస్మిన్ వధూలే సహ వరదగురుః స్వార్చ్యరంగాధిరాజం
దత్వా వాధూలవంశే సమధికకరుణాం సర్వలోకే వివవ్రే ॥

తరువాత పెరియజీయర్ (వరవరముని)శ్రీరంగనాథుని నియమనంతో శ్రీరంగనాథుని తమ ఆరాధన మూర్తిగా పొందారు. తరువాత కోయిలణ్ణన్ మొదలైన పలువురు కందాడై వంశంలోని ఆచార్యులు వరవరమునుల శ్రీపాదాలను ఆశ్రయించారు. తరువాత, ఒకానొక సమయంలో ఒక ఏకదండి సన్న్యాసి పెరియజీయర్‌ను తనతో వాదించమని ఆహ్వానించగా, అతనిని వేడలప్పై శిష్యులైన దాశరథి ఆచ్చాన్‌ద్వారా ఓడించారు. అనంతరం కోయిలణ్ణన్ దాశరథి ఆచ్చాన్‌ను మఠానికి పిలుచుకొనిరాగా, వరవరమునులు ప్రీతితో తమ తిరువారాధనలో ఉండే శ్రీరంగనాథుని వారికి ప్రసాదించి, వాధూల వంశంపట్ల తమకుండే కరుణాధిక్యాన్ని అందరికి తెలిసేటట్లు ప్రకటించారు.

7. వాత్స్యే దేవాధిరాజే వరదగురువరై స్సాక మాగత్య దృష్ట్వా
స్మేరస్వాంతేఽపి భాగ్యవ్యతికరవిరహాత్ క్షేమ మప్రాప్య యాతే ।
స్వార్చ్యశ్రీజానకీశ ప్రబలనియమనేనాభిముఖ్యా దుపేతే
స్ఫీతైః స్వైః దృష్టిపాతైః ఘనతరకరుణాసారవర్షం వవర్ష ॥

శ్రీవత్సగోత్రంలో జనించిన దేవాధిరాజులు (ఎఱుమ్బిఅప్పా) అనే ఆచార్యులు శ్రీరంగానికి వేంచేసినపుడు తమకు ఆప్తబంధువైన కందాడై అణ్ణన్‌తోపాటుగా జీయర్ మఠానికి వచ్చి శ్రీవరవర మునులను సేవించి, తిరువాయ్‌మొழிలోని "ఒన్రుమ్ తేవుమ్" అనే దశకానికి వారు అనుగ్రహించే అర్థవిశేషాలను విని చాలా సంతోషపడినా, అదృష్టలోపంవల్ల జీయర్ మఠంలో ప్రసాదస్వీకారం చేయకుండా, జీయర్ శ్రీపాదాలను ఆశ్రయించకుండా తమ స్వగ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు. అపుడు వారి ఆరాధనలోని అర్చామూర్తి అయిన చక్రవర్తితిరుమకన్ (శ్రీరామచంద్రమూర్తి) వారికి కలలో కన్పించి, "మీరు ఆదిశేషావతారం అయిన శ్రీవరవరమునుల విషయంలో చాలా అపచారపడి వచ్చారు. వారి శ్రీపాదాలను ఆశ్రయించి అపరాధక్షమను ప్రార్థించి వస్తే తప్ప, మీచేతుల ద్వారా ఇక తిరువారాధనను మేము స్వీకరింపబోము. మీరు వెంటనే వారి దగ్గరకు వెళ్ళండి" అని ఎఱుమ్బియప్పాను నియమించాడు. వారుకూడా వెంటనే శ్రీరంగానికి బయలుదేరి, అక్కడకు చేరి చాలా ఆదరంతో, భక్తితో జీయర్‌ను సేవించి ప్రణమిల్లగా, జీయర్‌కూడా తమ చల్లని చూపులతో వారిపట్ల గొప్ప కరుణాసారవర్షాన్ని వర్షించారు.

8. బధ్వేమాం సప్తగోత్రీం ప్రతివదభయకృద్వర్యగోవిందవర్యౌ
వాత్స్యం శ్రీదేవరాజం యమిన మపి మహాశైలవానాధివాసమ్ ।
ఆర్యా నన్యాంశ్చ కృత్వా వసుదిగిభవరాన్ పంచరత్నం చ కృత్వా
పౌత్రౌ స్వౌ రమ్యజామాతర మధికగుణం భట్టనాథం రరక్ష ॥

డెబ్బైనాల్గు మంది సింహాసనాధిపతులలో పరిగణింపబడ్డ ముదలియాణ్డాన్, ముడుమ్బైనమ్బి, ముడుమ్బై యమ్మాళ్, ఆసూరిప్పెరుమాళ్, కిడామ్బిప్పెరుమాళ్, కుమాణ్డూర్ ఇళైయవిల్లి ఆచ్చాన్, వఙ్గిపురత్తునమ్బి- అనే ఏడు గోత్రాల వారిని తమలోనే తాము సంబంధాలను చేసికోవాలనే నియమాన్ని చేసి, సప్తగోత్ర వ్యవస్థను శ్రీవరవరమునులు ఏర్పాటుచేశారు. ప్రతివాది భయంకరమ్ అణ్ణన్, పూర్వాశ్రమంలో గోవిందదాసులనే తిరునామాన్ని కల్గినవారైన పరవస్తు పట్టర్‌పిరాన్ జీయర్, ఎఱుమ్బియప్పా, వానమామలై

జీయర్, కోయిల్కన్దాడై అణ్ణన్, తిరువేఙ్కట రామానుజజీయర్, అప్పిళ్ళార్, అప్పిళ్ళై - అనే ఎనిమిదిమందిని అష్టదిగ్గజాలుగా నియమించారు. సద్గుణాలు నిండిన తమ పౌత్రులైన అழகియమణవాళ నాయనార్ (జీయర్నాయనార్)ను, పెరియాழ்వార్ ఐయన్ను చక్కగా రక్షించారు.

**9.** దేవం భూయో దిదృక్షు శ్శఠమథన మసౌ శ్రీనగర్యాం గత స్తం
నత్వా స్తుత్వా ప్రహృష్టో విభునవనిలయాం వర్ధయిత్వాఽర్యచేతః ।
జిజ్ఞాసుః యాదవాద్రే రధిసరణిజనన్యార్యదర్శీ నివృత్తః
ప్రాప్తార్థ స్తుష్టచేతాశ్చ దనిజనిలయే వహ్నిదాన్ అన్వగృహ్ణాత్ ॥

తిరిగి శ్రీశఠకోపులను సేవించాలని తలచి ఆழ்వార్ తిరునగరిని చేరి, వారిని స్తుతించి, వారి శ్రీపాదాలను కొలిచి సంతోషించినవారై, నవతిరుపతులలోని భగవన్మూర్తులకు మంగళాశాసనాన్ని చేశారు. **"తిరునారాయణపురత్తు ఆయ్"** అనే జనన్యాచార్యులవద్దనుండి ఆచార్యహృదయమనే గ్రంథంయొక్క తాత్పర్యాన్ని తెలిసికోవాలనే ఆశతో తిరునారాయణపురానికి బయలుదేరారు. దారిలో కొంచెం దూరంలోనే ఆ జనన్యాచార్యులవారిని కలిసి, వారితో ఆழ்వార్ తిరునగరికి తిరిగి వచ్చి ఆచార్యహృదయరహస్యార్థాలను విని గ్రహించారు. తరువాత, పర్ణశాల అయిన తమ మఠానికి అగ్నిని ముట్టించినవారిని ఆ దేశప్రభువు శిక్షించాలని చూచినపుడు ఆ ప్రయత్నాన్ని అడ్డగించి, వారిని రక్షించారు.

**10.** కృత్వాఽసౌ శ్రీనగర్యాం శఠమథనముదే మండపం కాలమేఘం
వీథే స్సీమా శ్చ కృత్వా రుచిరవరమహామండపం కల్పయిత్వా ।
విప్రం శ్రీప్రహ్వకుట్యాం నిజచరణజుషం తత్ర కైంకర్యకార్యే
నిష్ప్రాప్యాసాద్య హృష్టః పున రపి కురుకా మాగమ ద్రంగధామ ॥

శ్రీవరవరమునులు, నమ్మాழ்వార్ల మనస్సు ఆనందించే రీతిలో ఆழ்వార్ తిరునగరిలో కాలమేఘన్ తిరుమండపాన్ని తిరువీథులను, వాటి ఎల్లలను ఏర్పాటుచేసి, అழகియమణవాళత్తిరుమండపాన్ని కూడా ఏర్పాటుచేశారు. తమ శ్రీపాదాలను ఆశ్రయించిన తిరువేఙ్గడముడైయాన్- అనే బ్రాహ్మణుని తిరుక్కుఋఙ్గుడి దివ్యదేశంలోని కైంకర్యంలో నియమించి, తిరిగి ఆழ்వార్ తిరునగరికి వేంచేసి, ఆழ்వార్లకు అంతా నివేదించి, తరువాత శ్రీరంగానికి తిరిగి విచ్చేశారు.

**11.** తత్ర శ్రీతాలవృంతవ్యజనపరికరేణోత్తమం సేవమానం
స్వప్నే శ్రీరంగభర్త్రా స్వయ మనుకథితస్వాహిరాజావతారః ।
మధ్యాహ్నే కాం చ వృద్ధాం ప్రతిరహసి పరం స్వాహిరాజత్వవేత్త్రీం
స్వం భావం నిహ్నువానః ఫణిపతిశయనం ప్రత్యహం సేవతే స్మ ॥

ఒకనాడు శ్రీరంగంలో తిరువాలవట్టకైంకర్యాన్ని చేసే ఉత్తమనంబి శ్రీవరవర మునుల పాలవంటి శుద్ధమైన తెల్లని దేహవర్ణాన్ని అన్యథా భావించి, "ఇక మీరిక్కడ ఎక్కువ సేపు ఉండవద్దు" అని పల్కి అపచారపడగా, జీయర్ తమ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. ఉత్తమనంబికి ఆ రాత్రి నిద్రలో శ్రీరంగనాథుడు

కలలో కన్పించి ఆదిశేషుని తాకి చూపుతూ "వీరే సుమా శ్రీవరవరమునులుగా అవతరించారు'' అని పలికారు. ఉత్తమనంబి నిద్రలేచి, అప్పటికప్పుడు మఠానికి వచ్చి, పెరియజీయర్ శ్రీపాదాలలో పడి అపరాధక్షామణాన్ని చేసికొన్నారు. తరువాత ఒకనాడు మధ్యాహ్నసమయంలో **"శఠకోపకాన్ఱ్రి"**అనే వృద్ధవనిత తిరుమలైయాళ్వార్ అనే పేరు గల వ్యాఖ్యాన మండపంలో ఏకాంతంగా వేంచేసి ఉండే జీయర్‌ను తలుపుసందులో నుండి ఆదిశేషుని రూపంలో దర్శించినపుడు, ఆ విషయాన్ని ఎవరికీ చెప్పకుండా ఉండమని ఆమెను నియమించారు. ఆదిశేషుడనే పడుకపై పరుండి ఉండే శ్రీరంగనాథుని ప్రతిదినం మంగళాశాసనం చేస్తూ శ్రీరంగంలో వేంచేసిఉన్నారు.

**12.** **ఏవం భూతం మునీంద్రం ధరణిజలధిజానాయకో రంగనాథః**
**స్వస్మై భాష్యం శ్రుతీనాం వకుళధరమునేః వక్తు మాజ్ఞాపయ త్తమ్ ।**
**సోఽయం సంవత్సరేణ ద్రమిడమయసుధాం రంగనాథాయ వర్షన్**
**శ్రీశైలేత్యాదిపద్యప్రవచనముఖత స్తేన సంపూజితోఽభూత్ ॥**

ఈ విధంగా ఉండే శ్రీవరవరమునులను ఒకనాడు భూదేవీ శ్రీదేవీ నాయకుడైన శ్రీరంగనాథుడు వకుళమాలాభరణుడైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదం అయిన తిరువాయ్‌మొళ్ళియొక్క వ్యాఖ్యానాలను వివరించి చెప్పవలసినదని వారిని ఆజ్ఞాపించాడు. వరవరమునులుకూడా ఒక సంవత్సరకాలం **"తొణ్డర్‌క్కు అముదమ్"** (దాసులకు అమృతం) అని కీర్తింపబడే తిరువాయ్‌మొళ్ళియొక్క ఈడుమొదలైన వ్యాఖ్యానాలను శ్రీరంగనాథుని సన్నిధిలో ప్రవచించారు. శాత్తుముఱైనాడు అయిదు ఏళ్ళ వయస్సు కల అర్చకకుమారునిగా శ్రీరంగనాథుడు వచ్చి, **"శ్రీశైలేశదయాపాత్రమ్"** అని ప్రారంభం అయే తనియన్‌ను అనుగ్రహించి, ఆచార్యులైన పెరియజీయర్‌ను తగిన రీతిలో సంమానించాడు.

**13.** **లోకాచార్యోక్తతత్త్వత్రితయ మనుయుగశ్లోకవాగ్భూషటీకా -**
**మాలా సంక్షేపగీతాహృదయవివరణే జ్ఞానసారాదిటీకే ।**
**అంతాదిం రత్నమాలాం శఠరిపురఫణితివ్యాక్రియామానజాలం**
**చక్రే కాంశ్చిద్విరా నకలయత నిహీనాత్మపుచ్ఛాపదేశాత్ ॥**

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన తత్త్వత్రయం, రహస్య త్రయార్థ ప్రతిపాదకం అయిన ముముక్షుప్పడి, శ్రీవచనభూషణం - అనే గ్రంథాలకు వ్యాఖ్యానా లను, భగవద్గీతకు సంక్షిప్తమైన వివరణాన్ని, జ్ఞానసారం, ప్రమేయసారం- అనే గ్రంథాలకు వ్యాఖ్యానాలను, తిరువాయ్‌మొళ్ళి నూఱ్ఱన్దాది, ఉపదేశరత్తినమాలై, ఈడు ముప్పత్తాఱాయిరప్పడికి ప్రమాణత్తిరట్టు- అనే గ్రంథాలను అనుగ్రహించారు. "మీరు కూడా శ్రీవచనభూషణాన్ని అధికరించారా! ఏమి! అహంకారంతో ఈవిధంగా కలహిస్తున్నారు!" అని వీథిలో కలహించుకొనే కుక్కలను ప్రశ్నించే వ్యాజంతో పరస్పరం తగవులాడు కొంటున్న శ్రీవైష్ణవులను గూర్చిపల్కి, వారిమధ్య ఉన్న వైరుధ్యాన్ని పోగొట్టారు.

**14.** **దత్వా క్షేత్రం మదీయం భృతకభుజిమిషాద్రంగభర్త్రే నిశీథే**
**వృద్ధాం కాంచిద్వివాస్య స్థవిరతరురుహన్యాయతోఽ లర్కహేతోః ।**

పత్నీం వృద్ధాం చ హిత్వా పున రపి కృపయా వైష్ణవాగో విముక్తాం
అంగీకుర్వన్నసాహ్యాగతవరదహరిం స్వీచకారాతిక్రుచ్చాత్ ॥

ఒకానొక సమయంలో తమ మఠానికి చెందిన కర్షకులద్వారా మఠానికి స్వంతమైన పొలం (క్షేత్రం) ఉన్నదని తెలిసి దానిని శ్రీరంగనాథునకు సమర్పించారు. ఒకనాడు వయసు మీఱిన వృద్ధవనిత ఒకతె రాత్రిసమయంలో మఠంలో నిద్రించాలని రాగా, **"కిழట్టణిలాకిలుమ్ మర మేఱవల్లదొన్ఱన్రో!"** (ముసలి ఉడత అయినా అది చెట్టును ఎక్కగల్గినదే కదా) **"ఉకవాదార్ అపవాదమ్ శొల్ల ఇదు పోదుమే"** (గిట్టనివారు అపవాదు పల్కడానికి ఇది చాలుకదా !) అని పల్కి, ఆమెను బయటకు పంపించివేశారు.

ప్రతిదినం తళిహకోసం (వంటకోసం) కూరలను తఱిగి ఇచ్చే వనితకు ఒక శ్రీవైష్ణవులు భక్తితో **"తూతులక్కీరై"** (ముళ్ళ ఉస్తెకూరె)ను ఇవ్వగా, ఆమె దానిని ఉపయోగించకుండా ఉదాసీనంగా వదలివేసింది. ఈ విషయాన్ని తెలిసిన పెరియజీయర్ ఆమెను కైంకర్యంనుండి తప్పించి, తరువాత భాగవతాపచారాన్ని చేసినందులకు పరిహారంగా ఆమెను క్షమాపణను ప్రార్థించిన ఆమెను కృపతో తిరిగి కైంకర్యం చేయడానికి సమ్మతించారు. తమను ఆశ్రయించాలని ఏకాంతంగా వచ్చిన **"వరన్తరుమ్ పెరుమాళ్ పిళ్ళై"** (వరదహరి)ను, భాగవతపురస్సరంగా రాకుండా ఈ విధంగా ఒంటరిగా వచ్చారుకదా ! అని గర్హించి, ఆఱునెలల కాలం బయట తిన్నెమీదనే ఉండేటట్లుచేసి, తరువాత వారిని అంగీకరించారు.

(అర్థానికి పొసగని ఈ శ్లోకంలోని మూడవపాదంలోని **"పత్నీం వృద్ధామ్"** అనే పాఠానికి బదులు ఇంకో పాఠం ఉంటే అది ఆదరణీయం. లేదా **"కాంతాం కాంచిత్"** అని మార్చుకోవచ్చు.)

**15.** సత్త్వస్థో దివ్యరూపం ప్రతివరమహితం ప్రాప్య సందేశకర్తా
భట్టార్యాయ స్వశిష్యాన్ వినయభరితయన్ దోషదృష్టిం విధూయ ।
పూర్వానుష్ఠాననిష్ఠః పునరపి వృషభాద్రీశముఖ్యాన్ దిదృక్షుః
సాకం శ్రీవాదిభీకృద్గురుముఖవినతై రాస్థయాఽసౌ ప్రతస్థే ॥

సత్త్వగుణనిష్ఠులై, వానమామలైజీయర్ మొదలైన యతులచే ఆశ్రయింపబడిన వారైన వరవరమునులు, తమవల్ల ఒక మంచి మాటను వినాలని ప్రార్థించిన ఉత్తరదేశంలోని వైష్ణవప్రభువునకు- **"భాగవతశేషత్వమే పరమార్థం"** అనే సద్వార్తను వ్రాసి పంపారు. ఆ కాలంలో శ్రీరంగంలోని భట్టర్ ఒకరు శ్రీవరవరమునుల వద్దకు వచ్చి, ''మీ శిష్యులు మమ్ములను నమస్కరించకుండా అవమానిస్తున్నారు'' అని అనగా, శ్రీవరవరమునులుకూడా ఆ విషయాన్ని గూర్చి విచారించారు. అపుడు తమ శిష్యులు ఆ భట్టర్‌లోని పలు దోషాలనుగూర్చి పల్కి, ''మాకు ఇటువంటి వీరిని అనువర్తించాలని అనిపించడం లేదు'' అని అన్నారు. శ్రీవరవరమునులు తమ శిష్యులను మందలించి, ''వారిని భగవానునితో సమానంగా భావించి, భక్తితో సేవించండి'' అని పల్కి, దోషం ఉన్న వ్యక్తి విషయంలో అయినా గుణప్రపత్తిలో ప్రవర్తించేటట్లు చేశారు. పూర్వుల అనుష్ఠానంలో స్థిరమైన ఊనికను కల్గినవారైన శ్రీవరవరమునులు తిరిగి వేంకటాచలం మొదలైన దివ్యదేశాలలోని భగవన్మూర్తులను సేవించాలని ఆశపడి, ప్రతివాది భయంకరం అణ్ణన్ మొదలైన శిష్యులతో బయలుదేరారు.

**16.** నాథం స్తంబేరమాద్రేః తదను సగరుతా మీశ్వరం సావతంసం
స్తుత్వా నత్వాఽథ తస్మిన్ కతిపయదివసాన్ దేవరాజాదియుక్తః ।
నత్వా గృధ్రప్రదేశం తదను చ ఘటికాద్రీశ్వరం దేవరాజ-
గ్రామం శ్రీరంగయిత్వా విమల మథ సర స్సహ్యజాం సహ్యకార్షీత్ ॥

హస్తిగిరినాథుడైన వరదరాజస్వామిని సేవించి, వైశాఖోత్సవంలో గరుడుని పైగల ఆభరణంవలె ప్రకాశించే ఆస్వామిని సేవించి స్తుతించి అక్కడే కొన్నాళ్ళు వేంచేసి ఉన్నారు. తరువాత ఉత్సవాలను సేవించాలని వచ్చిన ఎఱుమ్బియప్పాతో కలసి తిరుప్పుట్కుழிలోని "ఎమ్బారేఱ్ఱై" అనే మూర్తిని, ఘటికాచలంలోని "అక్కారక్కని"కి మంగళాశాసనం చేసి, "ఎఱుమ్బి" అనే గ్రామానికి పోయి, ఆ ఊరికి "వడ తిరువరఙ్గమ్" (ఉత్తరశ్రీరంగం) అనే పేరును పెట్టి, అక్కడ ఉండే కోనేరుకు "తిరు క్కావిరి" అనే పేరును పెట్టారు.

**17.** దృష్ట్వా శ్రీవేంకటాద్రిం తదను స నికటే తస్య గోవిందరాజం
యోగీంద్రస్థాపితం శ్రీశఠమథనముఖాన్ సంయమీంద్రాంశ్చ నత్వా ।
ఆరుహ్యాద్రిం తదీశం యతిపతిసహితం శ్రీనిధిం శంఖచక్రో-
దంచద్బాహుం శఠారిప్రముఖసువచనైః తుష్టువే హృష్టచేతాః ॥

తరువాత తిరుమలను దర్శించి, ఆకొండ పాదపరిసరాలలో భగవద్రామానుజుల చేత ప్రతిష్ఠింపబడ్డ గోవిందరాజస్వామిని, నమ్మాழ்వార్ మొదలైన ఆழ్వార్ల అర్చామూర్తు లను సేవించి, తిరుమలను అధిరోహించి, యతిరాజులైన భగవద్రామానుజులతోపాటు, శంఖచక్రాలను భుజాలలో ధరించిన పద్మావతీజానిని, శఠకోపులు, కులశేఖరులు, పరకాలసూరి - మొదలైన ఆழ్వార్లు శ్రీవేంకటేశ్వరుని విషయంగా పాడిన పాశురాలను అనుసంధించి, స్వామి శ్రీచరణాలను సేవించి, ఆనందించారు.

**18.** తత్ర శ్రీకార్యక్లృప్త్యై యతిపతియమినం కల్పయిత్వా నిదేశే
తస్మాత్ ప్రస్థాయ గత్వా రఘువరనిలయం కింగృహం నిస్తులేశమ్ ।
శ్రీమంతం భక్తిసారం దశరథతనయం పూర్ణవర్యంచ నత్వా
సూతం పార్థస్య నీరక్షితిధరతిలకం సంయమీంద్రం చ భేజే ॥

అక్కడ (తిరుమలలో) శ్రీకార్యనిర్వహణార్థం ఇళఙ్కోళ్వి ఎమ్బెరుమానార్ జీయర్‌ను నియమించి, అక్కడ నుండి బయలు దేరి తిరువెవ్వుళూర్ (తిరువళ్ళూర్) వీరరాఘవ స్వామిని, తిరునిన్ఱవూర్‌లోని "నిత్తిలత్తొత్తై" అనబడే అర్చామూర్తిని, తిరుమழிశై క్షేత్రంలోని భక్తిసారులను, పచ్చైవారణప్పెరుమాళ్ కోయిల్‌లోని దాశరథిని (ముదలి యాణ్డాన్‌ను) పూవిరున్దవల్లి (పుకున్దమల్లి) లోని కాంచీపూర్ణులనబడే తిరుక్కచ్చి నమ్బిని, తిరువల్లిక్కేణిలోని పార్థసారథిని, తిరునీర్‌మలై దివ్యదేశంలోని అర్చామూర్తిని, శ్రీపెరుమ్బూదూర్‌లోని భగవద్రామానుజులను సేవించి మంగళాశాసనం చేశారు.

**19.** భూయో నత్వా కరీశం తదను సమధురాం తద్ద్వయోత్పత్తిభూమిం
గత్వా స్తుత్వాఽభిరామం ఫణితిలకపురే దేవనాథం చ నత్వా ।

వందిత్వా సత్యవీంద్రం కలిమథనమునిం దివ్యదేశాన్ ప్రణమ్య
శ్రీరంగం ప్రాప్య యోగీ చిరవిరహరుజం స్ఫీతమోదో ముమోచ ॥

మఱల కాంచీనగరానికి వేంచేసి వరదరాజస్వామిని సేవించి, అక్కడనుండి ద్వయం అంకురించిన క్షేత్రం అయిన మధురాంతకానికి చేరి, చక్రవర్తి తిరుమకన్‌ను స్తుతించి, ఆతరువాత తిరువహీంద్రపురానికి వేంచేసి దైవనాయకస్వామికి మంగళా శాసనాన్ని చేసి, నాలుకవిప్పెరుమాళ్, కలికన్టిదాసర్- అని పొగడబడే తిరుమఙ్గై యాళ్వార్లను ఆళ్వార్ తిరునగరిలో సేవించి, తిరుక్కణ్ణపురం, రాజమన్నార్‌గుడి, తిరుక్కుడన్దై - మొదలైన తిరుపతులను నమస్కరించి, శ్రీరంగాన్ని చేరి శ్రీరంగనాథుని చిరకాలం విశ్లేషించినందువల్ల కల్గిన దుఃఖం తీరగా ఆనందించారు.

**20.** నత్వా శ్రీరంగనాథం వివిధమణిముఖైః వస్తుభిః తోషయిత్వా
నిత్యం తత్రైవ తిష్ఠన్ స్వదినచరితకృద్దేవరాజార్యజుష్టః ।
సార్వజ్ఞాత్ వృద్ధకేశం వరదహరి మసౌ పావనార్థం నిదేష్టా
దృష్టాదృష్టై ర్వధూలం వరదగురువరం సంతతం సంపుపోష ॥

శ్రీరంగనాథుని సేవించి, తాము తీసికొనివచ్చిన పలు విధాలైన ఆభరణాలు, శ్వేతచ్ఛత్రాలు, తెల్లని చామరాలు, ఆలపట్టాలు మొదలైనవానితో ఆస్వామిని సంతోషపెట్టి, నిత్యంగా అక్కడే శ్రీరంగంలో వరవర మునులు వేంచేసి ఉండగా, తమ దినచర్యాస్తుతిని రచించిన ఎఱుమ్బియప్పా వచ్చి వారిని సేవించారు.

శ్రీవరవరమునులు సర్వజ్ఞులు కనుక, కైంకర్యంకోసం వచ్చిన వరన్తరుమ్ పెరుమాళ్‌పిళ్ళై దీక్షలో ఉండడాన్ని చూచి "శుద్ధికోసం ఈనాడు మీరు కేశఖండనాన్ని చేయించుకోండి" అని నియమించారు. ఆనాడే "వరన్తరుమ్ పిళ్ళైకు పుత్రోదయం కల్గింది; పది దినాలు గడచింది"- అనే వార్త రాగా, అందఱూ పెరియజీయర్‌యొక్క సార్వజ్ఞత్వానికి ఆశ్చర్యపడ్డారు.

కన్దాడైయణ్ణన్ తిరుమాళిగలోని నృసింహరూపి అయిన అర్చామూర్తి ఆరాధనకు ఆవశ్యకం అయిన ఉపాదానద్రవ్యానికి కొఱత ఏర్పడిందని విని, తమకు సమర్పింపబడ్డ కానుకల రూపంలోని ద్రవ్యాన్ని ప్రతిదినం అణ్ణన్ తిరుమాళిగకు అందజేసేటట్లు నియమించి, తద్వారా దృష్టాదృష్టాలు రెండిటిలో అణ్ణన్‌ను అనవరతం ఆదరిస్తూ వచ్చారు.

**21.** అర్చారూపాం స్వమూర్తిం చరణసరసిజత్రాయిణీ ముత్తరీయం
స్వాదర్శం శ్వేతమృత్స్నాం స్వయ మథ వితరన్ ప్రాహిణో ద్దేవరాజమ్ ।
వానాద్రౌ యోగివర్యం విభుపరిచరణే స్థాపయిత్వా స్వశిష్యం
గోవిందార్యం చ గోదాప్రపదనముఖతో భట్టనాథం సమాఖ్యత్ ॥

తరువాత, జీయర్ తమ అర్చావిగ్రహాన్ని శ్రీపాదాలను కాపాడే పాదులకను, తిరుప్పరివట్టాన్ని, అద్దాన్ని, తిరుమణ్ కాప్పు శేషాన్ని ఇచ్చి, ఎఱుమ్బియప్పాను వారి ఊరికి పంపించారు. సుందరవరదులనే రామానుజజీయర్‌ను వానమామలై క్షేత్రంలో దైవనాయకస్వామి శ్రీకార్యనిర్వహనార్థం నియమించారు.

తిరువాడిప్పూరం నాడు గోదాదేవియొక్క తీర్థప్రసాదాలను ఆదరంతో తీసికొనివచ్చి తమకు సమర్పించిన గోవిందదాసరప్పర్‌కు భట్టర్ పిరాన్ దాసర్ అనే తిరునామాన్ని పెట్టారు.

**22.** ద్రష్టుం భూయ శ్శఠారిం సపది జిగమిషన్ మాధురం బాణరాజం
తాపాద్యైః పావయిత్వా తదుచితశిబికాధారణాద్యైర్చ్యమానః ।
తద్దత్తగ్రామవర్యం రుచిరవర ఇతి స్థాపయిత్వా మునీంద్రః
సేతోర్మార్గేణ గచ్ఛ న్నకురుత మనసా తింత్రిణీవృక్షమోక్షమ్ ॥

తరువాత మళ్ళీ నమ్మాళ్వార్లను సేవించాలని ఆశపడి, త్వరగా బయలుదేరి వరవరమునులు దారిలో మధురకు ప్రభువైన మహాబలి వాణరాయన్‌కు పంచసంస్కారాలను ప్రసాదించి, అతనిచే పల్లకిలో వేంచేపు చేయబడి ఊరేగించబడే గౌరవాన్ని పొందారు. అతనిచే సమర్పింపబడ్డ **“ముత్తరశనన్దల్”** అనే గ్రామానికి **“అళ్గియమణవాళనల్లూర్”** అనే పేరును పెట్టారు. సేతువు ద్వారా పయనించేటపుడు తమకు, తమ అనుయాయులైన ఆచార్యులకు ఆశ్రయాన్ని ఇచ్చిన పెద్ద చింతచెట్టుకు మోక్షం ఇవ్వాలని తలచారు. మఱుక్షణంలోనే ఆ వృక్షం నేలకూలి పరమపదాన్ని పొందింది.

**23.** దృష్ట్వా శ్రీమచ్ఛఠారిం పున రపి కుతుకీ పూర్వవద్రంగధామ్ని
శ్రీశం నత్వా వనాద్రౌ యతివరయమినం ప్రాహిణోత్ కింక్రియార్థే ।
శ్రీమద్రామానుజాంఘ్ర్యో రమృతగురువరై రర్పితాం సూక్తిమాలాం
వ్యాచక్షాణో మహార్ఘైః సరసఘృతముఖైః రంగనాథం పుపోష ॥

నమ్మాళ్వార్లకు మంగళాశాసనాన్ని చేసి, తిరిగి కుతూహలంతో శ్రీరంగానికి వేంచేసి, శ్రీరంగనాథుని సేవించారు, తిరుమలిరుమ్ శోలైమలై క్షేత్రంలో శ్రీకార్య నిర్వహణాధికారిగా ఉండి, కైంకర్యాన్ని చేయడంకోసం, యతిరాజజీయర్‌ను పంపించారు. శ్రీరామానుజుల శ్రీపాదాలలో తిరువరఙ్గత్తముదనార్ రచించి సమర్పించిన వాఙ్మాల అయిన ఇరామానుశనూర్ఱన్దాదికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. సువాసనను కల నేయి, పచ్చకర్పూరం మొదలైన పదార్థాలలో శ్రీరంగనాథుని సేవించి, ఆనందింపజేశారు.

**24.** శ్రీమాన్ కాంతోపయంతా శఠరిపుఫణితివ్యాక్రియాయాః సహస్రైః
షడ్భిః త్రిశంత్సహస్ర్యా ఉపచయకృదితి శ్రీశభట్టార్యగీతః ।
ఆఖ్యాతాం కృష్ణపాదైః కలికలుషబలాత్ కర్శితాం పూర్వటీకాం
దృష్ట్వా భట్టేశసూక్తేః లలితరసమయీం వ్యాక్రియాం సాధు చక్రే ॥

కైంకర్యశ్రీని నిండుగా కల శ్రీవరవరమునులు తిరువాయ్‌మొళ్రికి వ్యాఖ్యానం అయిన ఈడును వృద్ధిచేసినవారు -**“ఈడు ముప్పత్తాఱాయిరప్పడి పెరుక్కర్”** అని **“తిరుమాలైతన్దపెరుమాళ్”** అనే భట్టర్‌చేత కీర్తింపబడ్డారు. శ్రీకృష్ణపాదులనబడే పెరియవాచ్చాన్ పిళ్ళైచేత అనుగ్రహింపబడ్డ పెరియాళ్వార్ తిరుమొళ్రి వ్యాఖ్యానంలో పూర్వభాగం కలికాలదోషంవల్ల లోపించగా, ఆ లోపించిన భాగానికి లలితమైన రసమయం అయిన, ఒక అద్వితీయమైన వ్యాఖ్యను చక్కగా వరవరమునులు రచించారు.

**25.** బాలం వాధూలనాథం స్వకృతవివరణశ్లాఘినం వర్ధయిత్వా
బాణార్యే తత్సహాయే భువనగురునతం రంగనాథం దదౌ సః ।
ఆమ్నాయానాం విమర్శీ గురువరహృదయం స్థావిరే వ్యాచికీర్షన్
యుష్మద్వంశ్యార్థ మేతత్త్వితి వరదగురుం ప్రాహ తేనానుయుక్తః ॥

తమ వ్యాఖ్యానాన్ని పొగడిన బాలుడైన కన్దాడై నాయన్‌ను వరవరమునులు ఆశీర్వదించి, పెరియాళ్వార్ తిరుమొళికి వ్యాఖ్యాను వ్రాస్తున్నపుడు తోడుగా ఉండి సహకరించిన తిరుప్పాణాళ్వార్ తాతర్‌నాయనార్‌కు శ్రీపిళ్ళైలోకాచార్యులవారి తిరువారాధన ప్పెరుమాళ్ అయిన శ్రీరంగనాథుని అనుగ్రహించారు.

పెరియజీయర్ తమ వార్థక్యంలో కంఠంలో వేదన పడుతున్న సమయంలో, ఆచార్య హృదయానికి వ్యాఖ్యానాన్ని వ్రాస్తున్నపుడు "ఎందుకోసం ఇంత శ్రమపడాలి" అని తమను అడిగిన కోయిల్ కన్దాడై అణ్ణన్‌కు "మీ వంశంలోని వారికోసమే సుమా!" అని బదులిచ్చారు.

**26.** హృద్యం వాధూలధుర్యం వరదగురువరం వాదిభీకృద్గురుం చ
శ్రీభాష్యశ్రీశఠారిశ్రుతివివరణయోః కల్పయిత్వాఽభిషిక్తౌ ।
దేవస్యాదేశ మేవం జగతి సఫలయన్ స్వావతారేణ భూయః
ప్రాప్తుం స్వం ధామ దివ్యం రుచిరవరముని శ్చేతనాయాం చకాంక్ష ॥

పెరియజీయర్ తమ మనస్సుకు ఇష్టులైన కన్దాడై అణ్ణన్‌ను, ప్రతివాది భయంకరమ్ అణ్ణన్‌ను క్రమంగా భగవద్విషయ, శ్రీభాష్యసింహాసనాధిపతులుగా అభిషిక్తులను చేశారు. ఈ రీతిలో భగవానుని నియమనాన్ని తమ అవతారంతో నెఱవేర్చిన మణవాళ మహామునులు తిరిగి తమ దివ్యమైన స్థానాన్ని చేరుకోవాలని తలచారు.

**27.** ఆర్తిం స్వోక్త్యా వివృణ్వన్ రుచిరవరమునిః స్యందనస్థం రమేశం
శ్రీరంగేశం దిదృక్షుః స్వమఠధురి సమాగత్య తిష్ఠంత మేవ ।
దృష్ట్వా ధూతాఖిలార్తిః కతిపయదివసాన్ లోకభాగ్యేన జీవన్
భూయో రామానుజాంఘ్రిద్వయసముపగమే దుర్నివారత్వరోఽభూత్ ॥

భగవానుని వెంటనే చేరాలి అనే తమ మనస్సులోని ఆర్తిని **"ఆర్తిప్రబంధమ్"** మూలంగా వ్యక్తీకరించిన శ్రీవరవరమునులు, రథంలో వేంచేసిన శ్రియఃపతి అయిన శ్రీరంగనాథుని సేవించి తమ దుఃఖం అంతా తీరిన వారయ్యారు. లోకంలోని వారు చేసిన పుణ్యఫలంగా కొన్ని దినాలు వేంచేసి ఉండి, తిరిగి భగవద్రామానుజుల శ్రీచరణాలను చేరడంలో చాలా తొందరను కలవారయ్యారు.

**28.** తస్మిన్ కాలే క్షితీశం కమపి యదుగిరేః సుందరం భట్టనాథ-
ద్వారాఽరక్షత్ స్వపాత్రే నిజతనుకృతయే భాజనం స్వం దిదేశ ।
స్థిత్వా రామానుజాంఘ్ర్యాశ్రిత ఇహ శరదాం సప్తతిం త్ర్యబ్దపూర్వాం
సోఽయం రామానుజాంఘ్రిద్వయ మథ రుధిరోద్గారికుంభే ప్రపేదే ॥

ఆకాలంలో శ్రీరంగానికి వచ్చిన అణ్ణరాయచక్రవర్తికి, మేల్‌నాడు తోళ్ప్పర్‌కు, వారి అన్నగారైన అళకియమణవాళప్పెరుమాళ్ నాయనార్‌కు పరవస్తుపట్టర్‌పిరాన్ జీయర్ ద్వారా పంచసంస్కారాలను

ప్రసాదించారు. తరువాత, పూర్వాశ్రమంలో తమకు పౌత్రులైన జీయర్ నాయనార్‌కు తమ అర్చావిగ్రహాన్ని అనుగ్రహించడంకోసం తమ చేతి రాగిచెంబును ఇచ్చారు. భగవద్రామానుజుల శ్రీచరణాలలో స్థిరమైన భక్తిని కలవారై డెబ్బైమూడు సంవత్సరాలపాటు ఈలోకంలో కుంభమాసంలో భగవద్రామానుజుల శ్రీచరణాలను చేరారు.

**29.** **సాహస్రాణాం చతుష్కా దనుకలిశరదోఽర్వాక్ చతుర్భ్యః శతేభ్యః**
**సప్తత్యూర్ధ్వం ద్వితీయే స తులసితగరుద్యుక్తసాధారణాబ్దే ।**
**మూలే క్లిప్తావతారో ఘన ఇవ సజలః సర్వసంతాపహారీ**
**శ్రీమాన్ కాంతోపయంతా ముని రిహ జయతా దావిరించిప్రపంచమ్ ॥**

కలియుగం ప్రారంభమై నాల్గువేల నాల్గువందల డెబ్బైరెండవ సంవత్సరం అయిన సాధారణ నామవర్షంలోని తులామాసంలో శుక్లపక్షంలో మూలనక్షత్రంలో అవతరించి, నీరు నిండిన మేఘంలవలె అందఱి తాపాలను తీర్చినవారు, కైంకర్యలక్ష్మీపూర్ణులు అయిన శ్రీవరవరమునులు లోకం ఉన్నంతవరకు ఇక్కడే సర్వోత్కర్షతో వెలుగొందాలి.

**30.** **ప్రత్యాకృత్యాఽథ రంగప్రభుమణివచసా కించ వృద్ధా గిరా చ**
**స్వావాసే వహ్నిజుష్టే ఫణిపతివపుషా నాలతో నిర్గమేన ।**
**శ్రీమాన్ శేషావతారో వరవరముని రిత్యేవ సర్వోఽపి లోకో**
**యం మేనే తం గుణాఢ్యం రుచిరవరమునిం ప్రోచ్య ధన్యో మదాత్మా ॥**

క్షీరసంఘాతగౌరం అయిన తిరుమేనివర్ణంచేత, ఉత్తమనంబికి కలలో ప్రత్యక్షమైన శ్రీరంగనాథుడు “వీరేసుమా వరవరమునులుగా అవతరించారు” అని ఆదిశేషులను తాకి చూపి పల్కడంచేత, తిరువాయ్‌మొ*ళి*ప్పిళ్ళై కాలక్షేపగోష్ఠిలో శఠకోపకొ*ఱ్ఱి* అనే ముదుసలి వరవరమునులను ఆదిశేషుల రూపంలో దర్శించడం చేత, ఆ*ళ్వా*ర్ తిరునగరిలో పెరియజీయర్ వేంచేసి ఉన్న మఠానికి కొందఱు నిప్పు పెట్టినపుడు సర్పరూపంలో తూమునుండి బయటకు వచ్చినందువల్ల, కైంకర్యలక్ష్మిని నిండుగా ఉండే ఆదిశేషుల అవతారవిశేషమే మణవాళమహామునులు- అని అందఱూ భావించే సద్గుణసముద్రులైన శ్రీవరవరమునులనుగూర్చి పల్కిన నా ఆత్మ ధన్యమైనది.

**31.** **ఇత్థం భూసారవాసా న్నృహరిగురువరా ద్దాశరథ్యార్యవంశ్యాత్**
**జాత స్తద్దృష్టిపూతో వరదగురుకృపాలబ్ధబోధప్రబుద్ధః ।**
**సత్సేవీ రాఘవార్యో రుచిరవరమునేః సర్వలోకేడితాంఘ్రేః**
**వ్యాజహ్రే దివ్యచర్యారసచషక మిదం యః పఠేత్ సోఽతిధన్యః ॥**

ఈ విధంగా మహీసారక్షేత్రం అయిన తిరుమ*ళి*శైలో నివసించేవారు, ముదలి యాణ్డాన్ వంశానికి చెందినవారు అయిన నరసింహాచార్యులకు పుత్రులై పుట్టి, వారిచే అనుగ్రహింపబడ్డవారు, వరదాచార్యులవారి కృపచేత పొందిన జ్ఞానంవల్ల వృద్ధిచెందిన వారు, సత్పురుషులను సేవించేవారు అయిన వీరరాఘవాచార్యుల వారు లోకంలోని అందఱిచేత నమస్కరింపబడే శ్రీపాదాలను కల మణవాళ మహామునుల దివ్యచరిత్ర రసామృతాన్ని అనుగ్రహించారు. ఈ కృతిని పఠించేవారు చాలా ధన్యులు.

॥ శ్రీమతే రామానుజాయ నమః ॥

॥ శ్రీమద్వరవరమునయే నమః ॥

**శ్రీ సేనాపతి ముని అనుగ్రహించిన**

# శ్రీమణవాళ మామునికళ్ నూర్ర్రన్దాది

## వక్తవ్య మాచార్యవైభవమ్

**శ్రీశైలేశదయాపాత్రం దీభక్త్యాదిగుణార్ణవమ్ ।**
**యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥**

తెన్గలై శ్రీవైష్ణవపూర్వాచార్య పరంపరలో శ్రీమణవాళమహామునుల స్థానం అత్యున్నతమైనది. పెరియపెరుమాళ్ళుగా కీర్తింపబడే శ్రీరంగనాథునకు సైతం ఆచార్యులై, ఒక సంవత్సరకాలం ఈడుముప్పత్తాఱాయిరప్పడి అనే తిరువాయ్ మొழிవ్యాఖ్యను కాలక్షేపంగా అనుగ్రహించి, ఆ భగవానుని ద్వారా **"శ్రీశైలేశదయాపాత్రమ్"** ఇత్యాది తనియన్ శ్లోకాన్ని ఉపాయనంగా గ్రహించిన గొప్పతనం వీరి కొక్కరికే స్వంతం. ఈ మహనీయుల వైభవాన్ని కీర్తిస్తూ పలువురు సమకాలీనులైన ఆచార్యులు ఎఱుమ్బియప్పా, పరవాది కేసరి, ప్రతివాది భయంకరం అణ్ణన్, కోయిల్ కందాడై అణ్ణన్ మొదలైనవారు పలు కృతులను సంస్కృత ద్రావిడభాషలలో అనుగ్రహించారు. ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ సంస్కృతభాషలో వరవరమునిశతకాన్ని, ద్రావిడభాషలో **పాదాదికేశమాలై** ప్రబంధాన్ని అనుగ్రహించగా, ఎఱుమ్బియప్పా **వరవరమునిశతకం, శ్రీశైలాష్టకం,** వరవరముని చంపువు మొదలైన కృతులను సంస్కృతంలో రచించారు. కోయిల్ కన్దాడై అణ్ణన్ అమలనాది పిరాన్ అనే చరమపర్వనిష్ఠా ప్రతిపాదకమైన లఘుద్రావిడప్రబంధాన్ని రచించగా, పరవాది కేసరి **శ్రీశైలవైభవమనే** ద్రావిడలఘుకృతిని వెలయించారు. ఇవి కేవలం కొన్ని ఉదాహరణలు మాత్రమే. శ్రీమద్వరవరమునులకు అనంతరకాలలోని వారుకూడా వారి మహిమను కొని యాడారు.

తిరువరఙ్గత్తముదనార్ అనే ఆచార్యులు భగవద్రామానుజ వైభవాన్ని స్తుతిస్తూ ఇరామానుశనూర్ర్రన్దాది అనే ప్రబంధాన్ని రచించారు. ఈ రీతిని అనుసరిస్తూ సేనాపతిమునులు అనే మహనీయులు శ్రీవరవరమునులను స్తుతించే మణవాళ మామునికళ్ నూర్ర్రన్దాది అనే ప్రబంధాన్ని 100 పాశురాలలో రచించారు. ఈ కృతి ఇంతవరకు అముద్రితంగా మద్రాస్ గవర్నమెంట్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో నిద్రాణంగా ఉండిపోయింది. 2006వ సంవత్సరము అక్టోబరు నెలలో **డా॥ ఉ॥ వే॥ శ్రీమాన్ ఎమ్.ఏ.వేంకటకృష్ణన్ స్వామి** తమిళలిపిలో దీనిని తమ మాసపత్రిక ***గీతాచార్యన్***కు అనుబంధంగా తాత్పర్యంతో ముద్రించారు. ఆ ముద్రణను ఆధారంగా చేసికొని ప్రకృతం ఈకృతి తెలుగులిపిలో టీక, లఘువివరణలతో ప్రకాశింపజేయబడుతున్నది.

శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ప్రణీతమైన యతీంద్రప్రవణప్రభావమనే వరవరమునుల చరిత్రను తెలిపే గ్రంథంలో, శ్రీవరవరమునులకు సేనైముదలియార్ జీయర్ అనే శిష్యులున్నట్లు తెలుపబడింది వారే ఈ కృతిని రచించి ఉండవచ్చునని శ్రీమాన్ వేంకట కృష్ణన్ స్వామివారి అభిప్రాయం. శ్రీరామానుజుల సమకాలీనులైన తిరువరఙ్గత్త ముదనార్ శ్రీరామానుజ వైభవప్రఖ్యాపకం అయిన ఇరామానుశనూర్ర్రన్దాది అనే ప్రబంధాన్ని రచించినట్లే, శ్రీవరవరమునులకు సమకాలీనులైన సేనైముదలియార్ జీయర్ తమ ఆచార్యుల వైభవాన్నిగూర్చి మణవాళ మామునికళ్ నూర్ర్రన్దాది అనే ప్రబంధంద్వారా స్తుతించి ఉండవచ్చునని వారి అభిప్రాయం. శ్రీవరవరమునుల శిష్యులలో పలువురి వారిని కీర్తిస్తూ కృతులను వెలయించినట్లే, సేనైముదలియార్ జీయర్కూడా ఈ కృతిని రచించారని భావించడంలో అసామంజస్యం ఏదీ లేదుకదా! లేక, ఇంక వేఱెవరైనా రచించి ఉండే అవకాశం కూడా లేకపోలేదు.

ఈ ప్రబంధంలోని పాశురాలు అన్నీ అత్యంతం మధురాలు. శ్రీవరవరమునుల రూపాన్ని, చరిత్రను, పాండిత్యాన్ని, శ్రీరామానుజులపట్ల వీరికున్న ప్రావణ్యాన్ని తెలుపుతున్నాయి. నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళ్ళిలోని **"ఏఱాళుమ్ ఇఱైయోనుమ్"** (4-8) అనే దశకంలో, కులశేఖరాళ్వార్ల **"మన్ను పుకళ్"** అనే దశకంలో, తిరుమఙ్గైయాళ్వార్ల పెరియ తిరుమొళ్ళిలోని **"తూవిరియ"** (3-6), **"కఱైవుడుత్త కరిశఙ్గుమ్"** (8-3) మొదలైన దశకాలలో వలె ఈ ప్రబంధంలోని నూఱు పాశురాలు అందమైన ఛందస్సులో కూర్చబడింది. ఒక్కొక్క పాశురంలో మణవాళమహామునుల తిరునామం ఉట్టంకనం చేయబడడమేకాక, అన్ని పాశురాలలోను శ్రీరామానుజుల శ్రీచరణాలను సేవించేవారు శ్రీవరవరమునులనే భావం నియతంగా తెలుపబడడం విశేషం. ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధంలో తిరువరఙ్గత్తముదనార్ ఆళ్వార్ల పరంపరను, శ్రీమన్నాథమునులను, భగద్యామునులను శ్రీరామానుజుల సేవించే రీతినిగూర్చి ప్రస్తావించినట్లే ఇందులో కూడా ప్రబంధకర్త పదిమంది ఆళ్వార్లను, అణ్డాళ్‌ను (11-21) శ్రీవరవరమునులు సేవించే రీతిని తెలిపి, ఆ తరువాత **"లక్ష్మీనాథ సమారంభామ్"** అనే శ్లోక గురుంపరాక్రమంలో శ్రీరంగనాథుని నుండి ప్రారంభించి (22), లక్ష్మీదేవిని (23), సేనైముదలియార్‌ను (24), నమ్మాళ్వార్లను (25), మధురకవులను, నాథమునులను (26), ఉయ్యక్కొణ్డార్‌ను (27), మణక్కాల్‌నంబిని (28), ఆళవన్దార్‌ను (29), పెరియనంబిని (30), శ్రీరామానుజులు, కూరేశులు, దాశరథి అనే ఆచార్యులను (31), ఎమ్బార్‌ను (32), భట్టర్‌ను (33), నంజీయర్‌ను (34), నంబిళ్ళైను (35), వడక్కుత్తిరువీధి ప్పిళ్ళైను (36), శ్రీ పిళ్ళై లోకాచార్యులవారిని (37), తిరువాయ్‌మొళ్ళిప్పిళ్ళైను (38) - సేవించే తీరునుగూర్చి ప్రస్తావించారు. వీరేకాక, దివ్యప్రబంధాలకు వ్యాఖ్యానాలను అనుగ్రహించిన తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ (39), నంజీయర్ (40), పెరియవాచ్చాన్ పిళ్ళై (41), వాదికేసరి అళ్ళకియమణవాళ చ్చీయర్ (43) మొదలైనవారి తిరునామాల ప్రస్తావనకూడా కన్పిస్తుంది.

భగవద్రామానుజులకు సమకాలీనులై అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే ఆచార్యులు రచించిన జ్ఞానసార, ప్రమేయసారాలనుగూర్చి, (పరోక్షంగా) (44, 73) తదనంతర కాలీయులైన శ్రీపిళ్ళైలోకాచార్యుల వారి తత్త్వత్రయం (45), శ్రీవచనభూషణం (46, 72), మొదలైనవానినిగూర్చి, అళ్ళకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన ఆచార్యహృదయాన్నిగూర్చి (49), విళాఞ్జోలైప్పిళ్ళై రచించిన సప్తగాథైను గూర్చి ఈకృతిలో ప్రస్తావన కన్పిస్తుంది. అంతేకాక, ఆయ్ అనబడే జనన్యాచార్యుల వారివద్ద శ్రీవరవరమునులు ఆచార్యహృదయగ్రంథంలో తమకు కల్గిన సందేహాలను ప్రశ్నించి తెలిసికొన్న వైనం కూడా కన్పిస్తుంది (71).

శ్రీమణవాళమహామునులు రచించిన యతిరాజవింశతి (7), ఉపదేశరత్తినమాలై (35), తిరువాయ్‌మొళ్ళినూఱ్ఱన్దాది (33, 34), ఆర్తిప్రబంధం (9,89) మొదలైన గ్రంథాలను గూర్చిన ప్రస్తావన కన్పిస్తుంది. శ్రీమణవాళ మహామునుల ఆపాదచూదమైన దివ్యమంగళవిగ్రహవర్ణననుకూడా (58-70) గమనించవచ్చు. శ్రీవరవరమునులు ఆదిశేషుల అవతార విశేషమని (1), భగవద్రామానుజులు ఆరగించిన ప్రసాదశేషాన్ని మాత్రమే శ్రీవరవరమునులు భుజిస్తారని (61), శ్రీవరవరమునులు ఒక వృక్షానికి సైతం మోక్షం అనుగ్రహించారని (88), మణవాళమహామునుల శ్రీచరణపాదుకలకు **"పొన్నడియామ్ శెఙ్గమలమ్"**. అని పేరని (57) - ఈవిధంగా పలు సాంప్రదాయకాలైన అంశాలు ఇందులో చోటు చేసికొన్నాయి. తర్కబలంలో దేనినైనా స్థాపించగల్గిన సామర్థ్యాన్ని కలవారైనా, మన పూర్వాచార్యులు అనుసరించిన సన్మార్గాన్ని అనుసరించాలే తప్ప, నూతనంగా విశ్వామిత్ర సృష్టి చేసి సంప్రదాయభంగాన్ని కల్గించకూడదనే శ్రీవరవరమునుల సూక్తి ప్రకారం వర్తించాలని, ఇతరులు కల్పించిన మార్గం అనుసరణీయం కాదనే విషయాన్ని (54) కూడా గమనించవచ్చు.

**శ్రీవరవరమునిశతకం సేనాపతిమునివిరచిత మంతాది ।**
**రమ్యార్థభరిత మేతత్ సహృదయవిబుధాః కటాక్షయథ ॥**



## శ్రీమణవాళమామునికళ్ నూఱ్ఱన్దాది

### తనియన్

**మా వళరుమ్ కోయిల్ మణవాళమామునికళ్**
**పూ వళరుమ్ పొన్నడిమేల్ పామాలై - నావలవన్**
**శేనాపతి మునివన్ శీరుడై అన్దాది తన్దాన్**
**మేనాదరుమ్ కఱ్క ఏయ్న్దు.**

మా వళరుమ్ = కాంతి వృద్ధి చెందే, (నిత్యాభివృద్ధమైన కాంతిని కల), మణవాళ మా మునికళ్ = శ్రీవరవరమునులుయొక్క, పూ వళరుమ్ = అందం వృద్ధి చెందే, (తామర పూవువంటి) పొన్ అడి మేల్ = బంగారంవలె స్పృహణీయాలైన శ్రీచరణాలపై, పా మాలై = పాశురమాలికలను, నా వలవన్ = వాక్‌పటిమను కల, శేనాపతి మునివన్ = సేనాపతి మునులు, శీరుడై = కవిత్వగుణాలను నిండుగా కల, అన్దాది = అన్దాది ప్రబంధాన్ని, మేనాదరుమ్ = తరువాతి కాలంలోనివారుకూడా, ఏయ్న్దు కఱ్క = స్వరూపానురూపంగా అభ్యసించేటట్లుగా, తన్దాన్ = అనుగ్రహించారు.

వాక్పటిమను మెండుగా కల్గినవారైన సేనాపతిమునులు తమ తరువాత కాలంవారుకూడా అభ్యసించడంకోసం శ్రీరంగంలోని మణవాళమహామునుల, అందం నిండుగా ఉన్న తామరపూవువంటి శ్రీపాదాలను ఉద్దేశించి గొప్పతనం కల్గిన, అన్దాదిప్రక్రియలో కూర్చిన పాశురాల మాలికలను సమర్పించారు.



1. **కుణవాళన్ ఇన్దిరకోన్ కుణఙ్కూఱుమ్ మాఱన్‌తాళ్**
**తణవాద ఎతిరాశన్‌తాళ్ వణఙ్గుమ్ తన్మైయనాయ్**
**ప్పణ వాదిశేడనరుళ్ పర నేవ అవతరిత్త**
**మణవాళమామునివన్ మలరడియే అడై నెఞ్జే !**

కుణవాళన్ = స్వాభావికాలైన కల్యాణగుణాలను కలవాడైన, ఇన్దిరై కోన్ = ఇందిరానాథుని, కుణమ్ కూఱుమ్ = దయావాత్సల్యాది కల్యాణగుణాలను కీర్తించే, మాఱన్ తాళ్ = నమ్మాళ్వార్ల శ్రీచరణాలను, తణవాత = విడువని, ఎతిరాశన్ తాళ్ = యతిరాజుల శ్రీచరణాలను, వణఙ్గుమ్ = నమస్కరించే, తన్మైయనాయ్= స్వభావాన్ని కలవారై, పణ ఆదిశేషన్ = ఫణాలను కల, ఆదిశేషుడు, అరుళ్ పరన్ = కరుణాశీలి అయిన భగవానుడు, ఏవ = ఆజ్ఞాపించగా, అవతరిత్త = అవతరించిన, మణవాళ మా మునివన్ = మణవాళ మహామునుల, మలర్ అడియే = పూవువలె సుకుమారమైన, అందమైన శ్రీచరణాలనే, నెఞ్జే = ఓ మనసా!, అడై = ఆశ్రయించు.

సద్గుణాలను కల్గినవాడైన భగవానుని కల్యాణగుణాలను పలికే నమ్మాళ్వార్ల శ్రీపాదాలను విడువనివారైన భగవద్రామానుజుల శ్రీపాదాలను నమస్కరించే స్వభావాన్ని కలవారై, కరుణాశీలి అయిన భగవానునిచేత నియమింపబడి, వచ్చి భూమిపై అవతరించినవారై, ఫణాలను కల ఆదిశేషస్వరూపులైన మణవాళమహామునుల శ్రీపాదాలను ఓ మనసా! ఆశ్రయించు.

**2. నెఞ్జురుకి క్కణ్ పనిప్ప నెదుమాలై నమస్ట్రియ్యి నమ్**
**తఞ్జమరుళ్మారి పుకర్త్ తామ్పరవుమ్ ఎతికట్కొరు**
**వణ్ శరణే వణజ్గియ నమ్మణవాళమామునివన్**
**ఇన్ శరిత్తైయిన్ శీర్రై ఇయమ్బి యెర్తాయ్ ఎన్ వాయే !**

నెఞ్జు ఉరుకి = మనస్సు ద్రవించి, కణ్ పనిప్ప = కన్నులు ఆనంద బాష్పాలతో చెమ్మగిల్లగా, నెదు మాలై = సర్వాధికుడైన శ్రియఃపతిని, నమన్ను ఎర్తుమ్ = నమస్కరించి ఉజ్జీవించే, నమ్ తఞ్జమ్ = మనకు రక్షకుడు, అరుళ్ మారి = **"అరుళ్ మారి"** అనే పేరును కల తిరుమజ్గై ఆళ్వార్ల, పుకర్త్ = కల్యాణగుణాలను, తామ్ పరవుమ్ = తాము స్తుతించడంద్వారా విస్తరింపజేసే, ఎతికట్కు ఒరు వణ్ శరణ్ = యతులకు అద్వితీయులైన, గొప్ప నాథులైన శ్రీరామానుజుల (అందమైన శ్రీచరణాల)ను, వణజ్గియ = నమస్కరించిన, నమ్ మణవాళ మామునివన్ = మన వరవరమునుల, ఇన్ = తీయని, శరిత్తైయిన్ శీర్రై = దివ్యావతారచరిత్రలోని గొప్పతనాన్ని, ఇయమ్బి = కీర్తించి, ఎన్ వాయే = ఓ నా నాలుకా!, ఎర్తాయ్ = ఉజ్జీవించు.

మనస్సు ద్రవించి, కన్నులు చెమ్మగిల్లగా, శ్రియఃపతిని నమస్కరించే **"అరుళ్ మారి"** అయిన తిరుమజ్గైయాళ్వార్ల కీర్తిని విస్తరింపజేస్తున్న భగవద్రామానుజుల శ్రీపాదాలనే కొలిచే మన మణవాళమహామునుల చరిత్రల గొప్పతనాన్ని ఓ మనసా ! పలికి, ఉజ్జీవించు– అని భావం.

**3. వాయాలుమ్ మెయ్యాలుమ్ మనత్తాలుమ్ పెరుమ్బూదూర్**
**మేయానై అడి పరవుమ్ మెయ్యడియార్ తాళ్ నినైన్దు**
**మాయాద మణవాళమామునివన్ కుణజ్గళైయే**
**కూశామల్ వణజ్గి యెర్తాయ్ కుఱియుడైయ ఎన్ తలైయే !**

వాయాలుమ్ = వాక్కుతో, మెయ్యాలుమ్ = శరీరంలో, మనత్తాలుమ్ = మనస్సులో, పెరుమ్బూదూర్ మేయానై = శ్రీ పెరుమ్బూదూర్‌లో వేంచేసి ఉండే భగవద్రామానుజుల, అడి = శ్రీ చరణాలను, పరవుమ్ = సేవించే, మెయ్ అడియార్ = ఏ సంకోచం లేని శేషభూతులైన దాసుల, తాళ్ = శ్రీచరణాలను, నినైన్దు = తలచి, మాయాద = నిలువని, మణవాళ మామునివన్ = మణవాళ మహామునుల, కుణజ్గళైయే = కల్యాణగుణాలనే, కుఱి యుడైయ = గుఱిగా – లక్ష్యంగా కల్గిన, ఎన్ తలైయే = ఓ నా శిరస్సా! కూశామల్ = సందేహించకుండా, వణజ్గి ఎర్తాయ్ = నమస్కరించి ఉజ్జీవించు.

వాక్కు, శరీరం, మనస్సులతో శ్రీపెరుమ్బూదూర్ మామునులనే తలచి ద్రవించే మణవాళమహామునుల గుణాలనే మంచి లక్ష్యాన్ని కల ఓ నా శిరమా! సందేహించకుండా నమస్కరించి ఉజ్జీవించు.

**4. తలైయాన ఎతిరాశన్ తన్వడివై నినైక్క మనమ్**
**విలై యాదుమ్ ఇల్లవన్ శీర్ విర్తుజ్గియిడ వాయడిమై**
**నిలైయాన ముఱై శెయ్య నిచ్చలుమ్ కై వేణ్డుమ్ తిరు**
**మలైయాళ్వార్ అరుళ్ పెర్ర్ఱ మణవాళ మామునియే!**

తిరుమలై ఆళ్వార్ అరుళ్ పెర్ర్ఱ =తిరువాయ్మొళ్రిప్పిళ్ళై అనుగ్రహాన్ని పొందిన, మణవాళ మామునియే = ఓ మణవాళ మహామునీ! తలైయాన = మిక్కిలి గొప్పవారైన, ఎతిరాశన్తన్ వడివై = భగవద్రామానుజుల

రూపాన్ని, నినైక్క = భావించడంకోసం గల, మనమ్ = మనస్సు, విలై యాదుమ్ ఇల్ = ఏ వెల కట్టలేని, అవన్ శీర్ = వారి కళ్యాణగుణాలను, విళ్ళుజ్జి యిడ = గ్రహించడంకోసం (కీర్తించడం కోసం), వాయ్ = వాక్కు, (జిహ్వ), నిలైయాన అడిమై = స్థిరమైన కైంకర్యాన్ని, నిచ్చలుమ్ ముత్తై శెయ్య = ఎల్లప్పుడు శేషత్వ పారతంత్ర్యాలకు అనుగుణంగా చేయడంకోసం, కై వేణ్డుమ్ = చేతులు కావాలి.

మిక్కిలి ఉన్నతం అయిన భగవద్రామానుజుల తిరుమేని సౌందర్యాన్ని తలచే మనస్సు, విలువ కట్ట వీలు లేనివారి గుణాలను పలికే వాక్కు, ఎప్పుడూ శాశ్వతమైన కైంకర్యాన్ని చేసే హస్తాలు నాకు కావాలి. తిరువాయ్మొళ్ళిప్పిళ్ళై అనుగ్రహాన్ని పొందిన మణవాళమహామునీ! మీరు వాటిని నాకు అనుగ్రహించండి.

**5. మునియేఱామ్ ఎతిరాశన్ ముళ్ళు త్తకవాల్ ముప్పదత్తిన్**
**ఇనియ పొరుళ్ నిలై వేణ్డి ఇన్బముడన్ అవనడియిల్**
**కునియు మెవరుమ్ మది యడైయ క్కరుతు మణవాళముని**
**తనియరుళే నినైన్దడియేన్ తారణియిల్ మకిళ్ళ్వేనే**

ముని ఏఱామ్ = మునివృషభులైన, ఎతిరాశర్ = యతిరాజులయొక్క, ముళ్ళు = పూర్ణమైన, తకవాల్ = కరుణతో, ముప్పదత్తిన్ = అష్టాక్షరిలోని మూడు పదాలలోని (స్వరూప–ఉపాయ–పురుషార్థరూపమైన) ఇనియ పొరుళ్ = మధురమైన అర్థంలో, నిలై వేణ్డి = నిలకడగా ఉండాలని కోఱి, ఇన్బముడన్ = అనందంతో, అవన్ అడియిల్ = వారి శ్రీపాదాలలో, కునియుమ్ ఎవరుమ్ = వంగి నమస్కరించేవారంతా, మది అడైయ= మంచి జ్ఞానాన్ని కల్గి ఉండాలని, కరుతుమ్ = భావించే, మణవాళమాముని తని అరుళే = శ్రీవరవరమునుల అద్వితీయమైన కరుణనే, నినైన్దు= తలచి, అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, తారణియిల్ = భూమిలో, మకిళ్ళ్వేన్ = ఆనందిస్తాను.

మునివృషభులైన భగవద్రామానుజుల పూర్ణమైన కరుణతో అష్టాక్షరిలోని మూడు పదాలయొక్క మధురార్థం నిలకడగా ఉండాలని కోఱి, వారి శ్రీపాదాల్లో భక్తితో సేవించే అందరూ మంచి జ్ఞానాన్ని పొందాలని తలచే మణవాళ మహామునుల కరుణనే భావించి దాసుడనైన నేను ఈ లోకంలో ఆనందిస్తాను.

**6. మకిళ్ మాఱన్ అడి శూడుమ్ ఎతిరాశన్ మలరడియిన్**
**నికళ్ కాదఱ్కు ఇడైచ్చువరై నీక్కి అరుళ్ ఎన్ఱిరన్దు**
**మకిళ్ళు మన మణవాళమామునివన్ కుణజ్గళైయే**
**పుకళ్ళాద పులవర్కళ్ ఇప్పూమిక్కోర్ పెరుఞ్జుమైయే**

మకిళ్ మాఱన్ = వకుళమాలికను నిరూపకంగా కల నమ్మాళ్వార్ల, అడి శూడుమ్ = శ్రీచరణాలను (శిరస్సుకు ఆభరణంగా) అలంకరించుకొనే, ఎతిరాశన్ = యతిరాజుల, మలర్ అడియిన్ = పద్మాలవంటి శ్రీచరణాలలో, నికళ్ = కలిగిన, కాదఱ్కు = భక్తికి (ఏర్పడే), ఇడై చ్చువరై = ఆటంకాలను, నీక్కి = తొలగించి, అరుళ్= అనుగ్రహించండి, ఎన్ఱు ఇరన్దు = అని వేడి, మకిళ్ళుమ్ = ఆనందించే, మనమ్ = మనస్సును కల, మణవాళ మామునివన్ = మణవాళ మహామునుల, కుణజ్గళై = కల్యాణగుణాలను, పుకళ్ళాద = కీర్తించని, పులవర్కళ్ = పండితులు (కవులు) ఇప్పూమిక్కు = ఈ భూమికి, ఓర్ పెరుమ్ శుమైయే = గొప్ప భారమే.

వకుళమాలికను అలంకరించుకొన్న నమ్మాళ్వార్ల శ్రీపాదాలను ఆభరణంగా ధరించే శ్రీరామానుజుల శ్రీపాదాల్లో ఏర్పడే భక్తికి అవరోధాలను తొలగించి, అనుగ్రహించాలి – అని ఆ శ్రీరామానుజులవద్దనే ప్రార్థించి, ఆనందించే మణవాళ మహామునుల కల్యాణగుణాలను కీర్తించని కవులు ఈ భూమికి గొప్ప భారమే కాగలరు. పాపిష్ఠివారిని భూమి తనకు భారంగా భావిస్తుంది. కనుక, శ్రీవరవరమునుల కల్యాణగుణాలను కీర్తించని వారు పాపిష్ఠివారని తాత్పర్యం.

**7. మైన్దన్ ఎతిరాశనరుళ్ మన్న మిక నైచ్చియత్తై**
**ఐన్దాఱు కవికళినాల్ ఆర్త్త మణవాళముని**
**పైన్దామరై అడియై ప్పరవుమవర్ తాళిణైక్కే**
**నైన్దురుకుమ్ ఎన్ నెఞ్జమ్ నైయాదు పిఱరుక్కే**

మైన్దన్ = బలిమిని కల, ఎతిరాశన్ = యతిరాజులయొక్క, అరుళ్ = కరుణ, మన్న = స్థిరంగా నిలవడంకోసం, మిక నైచ్చియత్తై = అత్యంతనైచ్యాన్ని, ఐన్దు ఆఱు కవికళినాల్ = అయిదాఱు (పలు) శ్లోకాలలో, (ఆర్తి ప్రబంధంలో, యతిరాజవింశతిలో), ఆర్త్త = విస్తరించిన (మార్గమైన), మణవాళముని = మణవాళమామునులయొక్క, పైన్దామరై అడియై= అందమైన తామరలవంటి శ్రీచరణాలను, పరవుమవర్ = సేవించేవారి, తాళ్ ఇణైక్కే= పాదయుగ్మం విషయంలోనే, ఎన్ నెఞ్జమ్ = నా మనస్సు, నైన్దు ఉరుకుమ్ = భావించి శ్రమించి, ద్రవిస్తుంది. పిఱరుక్కు = ఇతరులకోసం, నైయాతు = శ్రమించదు.

బలిమిని కల్గిన శ్రీరామానుజుల దయను పొందడంకోసం తమ నైచ్యాన్ని పలు పాశురాలతో (యతిరాజవింశతి, ఆర్తిప్రబంధాలలో) అనుగ్రహించిన మణవాళ మహామునుల పాదపద్మాలను సేవించే దాసుల శ్రీపాదాలనే నా మనస్సు భావించి, శ్రమించి, ద్రవిస్తుంది. ఇతరుల విషయంలో ద్రవించదు.

**8. అరుక్కన్ కులదెయ్వ వణి అరఙ్గన్ వరఙ్కొణ్డు**
**శెరుక్కడిత్త ఎతిరాశన్ తిరువరుళే అరణాక**
**ఇరుక్కు మణవాళముని ఇణైయడియే ఇఱైఞ్జుమవర్**
**తిరుక్కమల త్తాళిణైయే తిత్తిక్కుమ్ అడియేఱ్కే**

అరుక్కన్ కుల దెయ్వ = సూర్యకులానికి దైవం అయిన, అణి అరఙ్గన్ = అందమైన శ్రీరంగనాథునివద్ద నుండి, వరమ్ కొణ్డు = వరాన్ని పొంది (దానివల్ల), శెరుక్కు + అడిత్త = (సాత్త్విక) గర్వాన్ని పొందిన, ఎతిరాశన్ = యతిరాజుల, తిరు అరుళే = భవ్యమైన కరుణే, అరణ్ ఆక = రక్షణగా, ఇరుక్కుమ్ = తలచి నిర్భయనిర్భరులై ఉండే, మణవాళముని = మణవాళమహామునుల, ఇణై = అందమైన, పరస్పరసదృశం అయిన పద్మాలవంటి పాదద్వయి, అడియేఱ్కు = దాసుణ్ణి అయిన నాకు, తిత్తిక్కుమ్ = మధురంగా ఉంటుంది. (**"లబ్ధ్వా కులధనం రాజా"** అని శ్రీరామాయణంలో శ్రీరంగ నాథుడు సూర్యకులదైవంగా చెప్పబడ్డాడు.)

సూర్యకులదైవం అయిన శ్రీరంగనాథునివద్ద వరాన్ని పొంది, దానివల్ల సాత్త్విక గర్వంతో ప్రకాశించే యతిరాజుల కరుణనే రక్షకంగా కల్గిన మణవాళమహామునుల శ్రీపాదాలను సేవించే దాసుల పాదపద్మాలే దాసుడనైన నాకు రుచిస్తాయి.

**9. ఏఱ్ఱుమ్ ఎతిరాశనుడై ఎఴ్హిల్పదత్తిన్ శేవైతనై**
**చ్చీర్ త్తిరువాయ్మొఴ్హిప్పిళ్ళై శెఴ్హుమ్దకవాల్ తన్దదనై**
**మేల్కిళర అరుళెన్ఱు మేవుమ్ మణవాళమాముని**
**ఆర్క్కరుళుమ్ అడియేనుక్కు అల్లదు నీర్ శొల్లీరే**

ఏఱ్ఱుమ్ = తగిన కీర్తిని కల, ఎతిరాశనుడై = యతిరాజుల, ఎఴ్హిల్ పదత్తిన్ = ప్రకాశించే శ్రీచరణాలలో, శేవైతనై = సేవను, శెఴ్హుమ్ తకవాల్ = తమ అందమైన కరుణతో, తన్దు = అనుగ్రహించి, అతనై = ఆ కైంకర్యాన్ని, మేల్ కిళర = ఇంకా ఇంకా పైకి వృద్ధి చెందేటట్లుగా, అరుళ్ = అనుగ్రహించండి, ఎన్ఱు = అని, శీర్ తిరువాయ్మొఴ్హి ప్పిళ్ళై = కల్యాణగుణాలను కల తిరువాయ్మొఴ్హిప్పిళ్ళైను, మేవుమ్ = ప్రార్థించే, మణవాళమాముని = వరవరమునులు, అడియేనుక్కు అల్లతు = దాసుడనైన నాకు తప్ప, ఆర్క్కు అరుళుమ్ = ఇంక ఎవరికి అనుగ్రహిస్తారు? నీర్ శొల్లీరే = మీరే చెప్పండి.

తిరువాయ్మొఴ్హిప్పిళ్ళై అనుగ్రహంవల్ల పొందిన, తగిన కీర్తిని కల యతిరాజుల అందమైన శ్రీపాదాలలోని కైంకర్యం మరింతగా వృద్ధిజెందాలని (ఆర్తి ప్రబంధంలో) ప్రార్థించే మణవాళమహామునులు దాసుడనైన నన్ను తప్ప వేఱెవరిని అనుగ్రహిస్తారో  మీరే చెప్పండి.

**10. ఈరేఴ్హు పువనత్తార్ ఇఱైఞ్జు పుకఴ్హ్ ఎతిరాశన్**
**శీరేగ్ఱ నన్దియలుమ్ శెమ్మైయినాల్ అరుళ్ శూడి**
**నీరేగ్ఱమ్ ఇల్లామల్ తికఴ్హుమ్ మణవాళమాముని**
**పారేత్తు పెరుమ్ పుకఴ్హై ప్పాడి మనమ్ కళిత్తేనే**

ఈర్ ఏఴ్హు పువనత్తార్ = పదు నాల్గు లోకాలలోనివారు, ఇఱైఞ్జుమ్ = ప్రార్థించే, పుకఴ్హ్ = కీర్తిని కల, ఎతిరాశన్ = యతిరాజుల, శీర్ ఏగ్ఱమ్ = కల్యాణగుణాల ఆధిక్యంయొక్క, నన్దియలుమ్ = చక్కని స్వభావం యొక్క, శెమ్మైయినాల్ = ఋజుత్వంవల్ల, అరుళ్ శూడి = కరుణను పొంది, నీర్ ఏగ్ఱమ్ ఇల్లామల్ = సాటిలేనివారు, మించినవారు లేకుండా, తికఴ్హుమ్ = ప్రకాశించే, మణవాళ మా ముని = శ్రీవరవరమునుల, పార్ ఏత్తు = భూమిలోని జనులంతా కీర్తించే, పెరుమ్ పుకఴ్హై = గొప్ప కీర్తిని, పాడి = పొగడి, మనమ్ = మనస్సులో, కళిత్తేనే = గర్వించాను (ఆనందించాను)

పదునాల్గు లోకాల్లో ఉన్నవారు అందఱు పొగడే కీర్తిని కల యతిరాజులయొక్క చక్కని స్వభావంతో ఉపకరించే కల్యాణగుణాలవల్ల అనుగ్రహాన్నిపొంది, నిస్సమాభ్యధికులై వర్ధిల్లే మణవాణమహామునుల, భూలోకంలోని వారంతా కీర్తించే, గొప్ప కీర్తిని పాడి నేను మనస్సులో ఎంతో సంతోషించాను.

**11. తేనమరు పూమ్బొఴ్హిల్ శూఴ్హ్ తిరుక్కచ్చినకర్ ప్పొయ్కై**
**ప్పూనడువిల్ ఉదిత్త ముని పుకఴ్హ్ పాడు ఎతిరాశన్**
**మానిలవిల్ వాయ్ మదుక్కుమ్ మణవాళమామునివన్**
**ఞాన వొళిక్కలై యల్లాల్ నామ్ ఎన్ఱుమ్ ఓదోమే**

తేన్ అమర్ = తేనె నిండుగా ఉండే, పూమ్ పొఴిల్ = పూల తోటలచేత, శూఴ్ = పరివేష్ఠితం అయిన, తిరు కచ్చి నకర్ = అందమైన, కాంచీనగరంలోని, పొయ్కై = సరస్సులో పూచిన, పూ నడువిల్ = తామర పూవు మధ్యభాగంలో, ఉదిత్త = అవతరించిన, ముని = సరోయోగియొక్క, పుకఴ్ పాడుమ్ = కీర్తిని పాడే, ఎతిరాశన్ = యతిరాజులు (అనే చంద్రుని), మా నిలవిల్ = గొప్ప వెన్నెలలో, వాయ్ మడుక్కుమ్ = జిహ్వను మడిచే (ఆస్వాదించే) (పొగడే), మణవాళ మామునివన్ = మణవాళమహా మునులయొక్క, ఞాన ఒళి = జ్ఞానప్రకాశాన్ని కల్గించే, కలై అల్లాల్ = శాస్త్రరూపాలైన సూక్తులను తప్ప, నామ్ = మేము, ఒన్ఱుమ్ = ఇక దేనినీ, ఓదోమ్ = అభ్యసించము.

మధువు నిండుగా ఉండే పూల దోటలచేత చుట్టబడిన కాంచీనగరంలోని ఒక సరస్సులో పూచిన ఒక తామరపూవులో అవతరించిన పొయ్కైయాఴ్వార్ కీర్తిని పాడే యతిరాజుల చంద్రుని వంటి తిరుముఖమండలాన్ని పొగడే మణవాళ మామునుల, జ్ఞానప్రకాశాన్ని కల్గించే శాస్త్రాలైన వాక్కులను తప్ప మేము వేఱు దేనినీ అభ్యసించము.

**12. ఓద క్కడల్మల్లై ఒళి శూఴ వన్దుదిత్త**
**పూదత్తార్ ఇయలోదుమ్ పూదూరిన్ మామునివన్**
**పాదత్తై ప్పలకాలుమ్ పరవు మణవాళముని**
**కోదఱ్ఱ తెన్ మొఴియై క్కొణ్డాడి క్కూఱుదుమే**

ఓదమ్ కడల్ = పైకి ఎగసిపడే కెరటాలను కల సముద్రతీరంలోని, కడల్ మల్లై = తిరుక్కడల్ మల్లై అనే దివ్యక్షేత్రంలో, ఒళి శూఴ = కాంతి వ్యాపించేటట్లుగా (ప్రసిద్ధం అయేటట్లుగా), వన్దుదిత్త = అవతరించిన, పూదత్తార్ = పూదత్తాఴ్వార్లు అనుగ్రహించిన ఇయల్ = ఇయల్ రూపంలోని ఇరణ్డామ్ తిరువన్దాదిని, ఓదుమ్ = అభ్యసించే, పూదూరిన్ = శ్రీపెరుమ్బూదూర్‌లోని, మా మునివన్ = గొప్ప ముని అయిన శ్రీరామానుజుల, పాదత్తై = శ్రీచరణాలను, పల కాలుమ్ = పలు మార్లు, పరవుమ్ = కీర్తించే, మణవాళ మాముని = శ్రీవరవరమునుల, కోదు అఱ్ఱ = నిర్దుష్టమైన, పూర్ణంగా సారవంతమైన, తెన్ = తీయని అందమైన, మొఴియై = సూక్తులను (గ్రంథాలను), కొణ్డాడి కూఱుదుమే = కీర్తిస్తూ పల్కుదాం.

అలలు ఎగసిపడే తిరుక్కడల్ మల్లై ప్రకాశించేటట్లుగా ఈ లోకానికి వచ్చి అవతరించిన పూదత్తాఴ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాన్ని అభ్యసించే శ్రీరామానుజుల పాదాన్ని పలుమార్లు సేవించేవారైన మణవాళమామునియొక్క, దోషరహితం అయిన ద్రావిడగ్రంథాలను పొగడుతూ పలుకుదాము.

**13. కూఱియ శీర్ మయిలైయార్‌కోన్ మణఙ్కొళ్ళుమ్ ఎతిరాశన్**
**మాఱిలడి వణఙ్గి మకిఴ్ మణవాళ మామునివన్**
**వీఱుడైయ మెయ్మ్మొఴియై విరుమ్బి యరుమ్ పొరుళ్నైత్తుమ్**
**తేఱుమవర్ ఎఙ్గాన్ఱుమ్ త్తేశికరాయ్ త్తికఴ్‌వారే**

కూఱియ = పురాణాదులలో కీర్తింపబడ్డ, శీర్ = గొప్పతనాన్ని కల, మయిలై యార్ = మయిలాపురిలో ఉండేవారికి నాథులైన పేయాఴ్వార్ల, కుణమ్ కొళ్ళుమ్ = కల్యాణగుణాలను గ్రహించే (కీర్తించే), ఎతిరాశర్ =

యతిరాజుల, మాఱు ఇల్ = సాటి లేని, అడి వణజ్గి = శ్రీచరణాలను నమస్కరించి, మకిళ్ = ఆనందించే, మణవాళ మా మునివన్ = మణవాళమహామునుల, వీఱుడైయ = వైలక్షణ్యాన్ని కల, మెయ్ మొళ్రియై = సత్యమైన సూక్తులను, విరుమ్బి = ఆశపడి ఆదరించి, అరుమ్ పొరుళ్ అనైత్తుమ్ = అరుదైన తత్త్వార్థాలను అన్నిటినీ, తేఱుమవర్ = స్ఫుటంగా తెలిసేవారు, ఎఞ్ఞాన్ఱుమ్ = ఏనాటికి అయినా, తేశికరాయ్ = సదాచార్యులై, తికళ్వారే = ప్రకాశిస్తారు.

కీర్తింపబడే మయిలాపురిలో అవతరించిన పేయాళ్వార్ల గొప్ప కల్యాణగుణాలను పొగడే యతిరాజుల సాటి లేని మేటి శ్రీపాదాలను నమస్కరించి, ఆనందించే మణవాళమామునుల తిరువాక్కులలో ఆసక్తిని పొంది, వాటి యాథార్థ్యాన్ని అంతటినీ తెలియగలవారు ఎప్పటికీ గొప్ప ఆచార్యులుగా ప్రకాశిస్తారు.

**14. వార్ పునల్ శూళ్ మామళ్రిశై వాళ్వెయ్ద వరుఞ్జోతి**
**శీర్ పుకళ్రుమ్ ఎతిరాశన్ శీల మెల్లామ్ కుడైన్దాడుమ్**
**ఓర్ పునిదన్ మణవాళయోగి శెయు ములకారియన్**
**ఓర్ పనువల్ వియాక్కియైయై ఎణ్ణు మవర్క్కు ఏదరిదే**

వార్ = ప్రవహించే, పునల్ = స్వచ్ఛజలంచేత, శూళ్ = చుట్టబడిఉండే, మా = గొప్పదైన, మళ్రిశై = తిరుమళ్రిశై అనే దివ్యక్షేత్రం, వాళ్వు ఎయ్ద = ఉజ్జీవించిన (ఆ క్షేత్రం ఉజ్జీవించేటట్లు అవతరించిన), అరుమ్ శోది = అప్రాకృతజ్యోతిస్స్వరూపులైన తిరుమళ్రిశై ఆళ్వార్ల, శీర్ పుకళ్రుమ్ = కల్యాణగుణాలను పొగడే, ఎతిరాశన్ = యతిరాజుల, శీలమ్ ఎల్లామ్ = స్వభావాన్ని (శీలగుణాన్ని) అంతటినీ, కుడైన్దు ఆడుమ్= అవగాహించే, ఓర్ పునితన్ = సాటి లేని పవిత్రమూర్తి అయిన, మణవాళ యోకి = మణవాళమామునులు, శెయుమ్ = అనుగ్రహించే, ఉలకారియన్ ఓర్ పనువల్ వియాక్కియైయై = శ్రీపిళ్ళైలోకాచార్యులవారి అద్వితీయాలైన రహస్యగ్రంథాల వ్యాఖ్యలను, ఎణ్ణుమవర్క్కు = మననం చేసే వారికి, ఏతు అరితు = ఏది అసాధ్యం?

ప్రవహించే స్వచ్ఛజలంచేత చుట్టబడి ఉండే తిరుమళ్రిశై అనే దివ్యస్థలం వర్ధిల్లేటట్లు అవతరించిన తిరుమళ్రిశై ఆళ్వార్ల గుణాలను పొగడే యతిరాజుల సౌలభ్యం మొదలైనగుణాలలో మునిగి, నర్తించే సాటి లేని పవిత్రులైన మణవాళ మహామునులు శ్రీపిళ్ళైలోకాచార్యులవారి అందమైన గ్రంథాలకు అనుగ్రహించిన వ్యాఖ్యానాలను భావించేవారికి ఏదీ అసాధ్యం కాదు.

**15. అరి దేవన్ అల్లాదార్ అవనురు వెన్ఱు ఉరై క్కురుకా-**
**పురి దేశికన్ పాదమ్ పుకళ్రుమ్ ఎతిశేకరన్ తన్**
**శరితై నినైన్దు ఉళ్ళురుకుమ్ శాల మణవాళముని**
**శౌరి తేఱల్ కలై నుకరుమ్ శోమ్బురుక్కు ప్పశి యేతే**

అరి = శ్రీహరి, దేవన్ = దేవుడు, (పరతత్త్వం), అల్లాతార్ = మిగిలినవారు, అవన్ ఉరువు = ఆ స్వామికి శరీరభూతులు, ఎన్ఱు = అని, ఉరై = పలికే, కురుకాపురి తేశికన్ = కురుకాపురికి అధిపతులైన నమ్మాళ్వార్ల, పాదమ్ = శ్రీచరణాలను, పుకళ్రుమ్= కీర్తించే, ఎతి శేకరన్ తన్ = యతిరాజుల, శరితై = చరిత్రను, నినైన్దు = భావించి, ఉళ్ ఉరుకుమ్ = మనస్సులో ద్రవించే, మణవాళమాముని = మణవాళ

మామునుల, శాల తేఅల్ శొరి = మిక్కిలిగా మధువును స్రవించే (పరమభోగ్యాలైన), కలై = గ్రంథాలనే, నుకరుమ్ = ఆస్వాదించే, శోమ్బరుక్కు = సోమరులకు, పశి ఏదు = ఆకలి ఏది? (ఏ కోరిక ఉండదు)

"శ్రీమన్నారాయణుడే పరమాత్మ, మిగిలిన దేవతలు అందరూ అతనికి శరీరభూతులు" అని అనుగ్రహించే కురుకాపురీశులైన నమ్మాళ్వార్ల శ్రీపాదాలను తలచి, చాలా ఎక్కువగా మనస్సులో ద్రవించేవారైన మణవాళమహామునుల మధుస్యందినులైన శ్రీసూక్తులను పానం చేసే వారికి ఆకలి అనేది ఉంటుందా?

**16. ఏదేనుమ్ ఆవేన్ నాన్ ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్**
**ఈదే నజ్కాద లెనుమ్ ఎఴ్హిల్ వఞ్జిక్కళత్తిఱైవన్**
**పా తేఱ్ఱుమ్ ఎతిరాశన్పదమ్ కరుతు మణవాళ**
**మాదేశికన్ కలైయే మఱ్ఱదు మోర్ అముదుణ్డే**

ఎమ్బెరుమాన్ పొన్ మలై మేల్ = శ్రీవేంకటేశ్వరుని బంగారుకొండపై, నాన్ ఏతేనుమ్ ఆవేన్ = నేను ఏ వస్తువుగా అయినా కాగలను, ఈదే = ఇదే, నమ్ కాతల్= నా ఆశ, ఎనుమ్ = అని పలికే, ఎఴ్హిల్ = ప్రకాశించే, వఞ్జిక్కళత్తు = తిరువఞ్జిక్కళమ్ అనే దివ్యదేశానికి, ఇఱైవన్ = నాయకులైన కులశేఖరాళ్వార్ల, పా = పాశురాలలో, తేఱ్ఱుమ్ = ఆసక్తులై ఉండే, ఎతిరాశన్ పదమ్ = యతిరాజుల పాదాలను, కరుతుమ్ = ధ్యానించే, మణవాళ మా తేశికన్ = మణవాళమహామునుల, కలైయే = గ్రంథాలే తప్ప, మఱ్ఱతుమ్ ఓర్ = మిగిలిన ఇంకొక, అముతు ఉణ్డే = అమృతం ఉన్నదా!

"శ్రీవేంకటేశ్వరుని కొండపై ఏదైనా కాగలను" అని, ఇదే తమ ఆశ అని పలికినవారు, తిరువఞ్జిక్కళమ్‌లో అవతరించినవారు అయిన కులశేఖరుల పాశురాలలో నిమగ్నులైన యతిరాజుల శ్రీపాదాలనే తలచే మణవాళ మహామునులనే మహాచార్యుల శ్రీసూక్తులు తప్ప వేఱొక అమృతం ఉన్నదా!

**17. తుణ్డిత్తు ప్పరమపదమ్ తూ నెఱియై త్తాపిత్తు**
**క్కొణ్డుయ్త్త విల్లిపుత్తూర్క్కోన్ కుణన్తేర్ ఎతియరశై**
**ప్పణ్డుఱ్ఱ మణవాళమామునివన్ పనువల్‌కళిన్**
**ఒణ్ తత్తువ ప్పొరుళై ఓర్న్దిడువార్ ఉఱఙ్గారే**

పరమ పదమ్ = పరమపదమనబడే పవిత్రమైన వైకుంఠాన్ని సైతం, తుణ్డిత్తు = కాదని, తూ నెఱియై = పవిత్రమైన, భగవన్మంగళాశాసనం చేయడమనే మార్గాన్ని, తాపిత్తు క్కొణ్డు = స్థాపించి, ఉయ్త్త = ఉజ్జీవించిన, విల్లి పుత్తూర్ కోన్ = శ్రీవిల్లిపుత్తూర్‌కు నిర్వాహకులైన పెరియాళ్వార్ల, కుణమ్ = కల్యాణగుణాలను, తేర్ = అనుభవించే, ఎతి అరశై = యతిపతులను, పణ్డు = పూర్వం, ఉఱ్ఱ = ఆశ్రయించిన, మణవాళ మామునివన్ పనువల్‌కళిన్ = శ్రీవరవరమునుల కృతులలోని, ఒణ్ తత్తువ పొరుళై = శ్లాఘ్యమైన తత్త్వార్థాలను, ఓర్న్దిడువార్ = తెలిసినవారు, ఉఱఙ్గారే = నిద్రించరు.

పరమపదాన్ని సైతం కాదని, మంగళాశాసనం అనే పవిత్రమైన మార్గాన్ని ప్రతిష్ఠించి, ఉజ్జీవించినవారు, శ్రీ విల్లిపుత్తూర్‌కు నాథులు అయిన పెరియాళ్వార్ల కల్యాణగుణాలను పొగడే యతిరాజులను పూర్వం

ఆశ్రయించిన మణవాళమహామునులు అనుగ్రహించిన గ్రంథాల అందమైన తత్త్వార్థాలను తెలిసినవారు నిద్ర పోనేపోరు.

**18. కారేఱు కరు ముకిల్పోల్ కణ్ వళరుమ్ అరఙ్గేశన్**
**పారేఱు పుకర్ఝ్ పాడి త్తిరుప్పళ్ళి యుణర్త్తు మొరు**
**పోరేఱ్ఱు త్తిరుమణ్డఙ్కుడియిలుఱుమ్ ఎతిరాశన్**
**శీరేఱు మణవాళ చ్చీయరురై ఓదుమినే**

కారేఱు పోల్ = కారెద్దువలె, కరు ముకిల్ పోల్ = నల్లని మేఘంవలె (ఉండే), కణ్ వళరుమ్ = నిద్రించే, అరఙ్గేశన్ = శ్రీరంగనాథునియొక్క, పార్+ఏఱు = భూమిలో వృద్ధి చెందే, పుకర్ఝ్ = కళ్యాణగుణాలను, పాడి = కీర్తించి, పళ్ళి ఉణర్త్తుమ్ = సుప్రభాతాన్ని పాడే, పోర్ ఏఱ్ఱు = పోటెద్దువంటి తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల, తిరుమణ్డఙ్కుడియిల్ = తిరుమణ్డఙ్గుడి అనే దివ్యదేశాన్ని, ఉఱుమ్ = పొందే (ఆశ్రయించే) ఎతిరాశన్ = యతిరాజుల, శీర్ = కల్యాణగుణాలను, ఏఱుమ్ = వృద్ధి చెందే (కీర్తించే), మణవాళ చ్చీయర్ = మణవాళ మహామునుల, ఉరై = వ్యాఖ్యానాలను, ఓదుమినే = అభ్యసిస్తాము.

నల్లని మేఘంవలె నిద్రించే శ్రీరంగనాథుని కీర్తిని పాడి, సుప్రభాతాన్ని పాడిన తొణ్డరడిప్పొడి ఆళ్వార్లను తిరుమణ్డఙ్గుడిలో ఆశ్రయించిన యతిరాజుల కల్యాణగుణాలను కీర్తించే గొప్ప కీర్తిని కల మణవాళ మామునుల వ్యాఖ్యలను అభ్యసిస్తాము.

**19. ఓదు మొరు మామునియై ఓర్న్దు పుకున్దు అరఙ్గనడి**
**ప్పోదు ముదల్ ముడియళవామ్ పోఱ్ఱియనుమ్ ఉఱైయూరాన్**
**మీదు ముయల్ ఎతిరాశన్ మణవాళ మామునియాయ్**
**త్తీదు ముకన్దు అఱియాద తెన్మఱైయై వళర్త్తానే**

ఓదుమ్ = వేదాన్ని అభ్యసించే, ఒరు మా మునియై = ఒక గొప్ప ముని అయిన లోకసారంగమునిని, ఓర్న్దు పుకున్దు = అనుసంధించి (సేవించి), అరఙ్గన్ = శ్రీరంగనాథుని, అడి పోదు ముతల్ = శ్రీచరణపద్మాల నుండి, ముడి అళవుమ్ = కిరీటపర్యంతం, పోఱ్ఱియనుమ్ = కీర్తించినవారు, ఉఱైయూరాన్ మీదు = ఉఱైయూర్ అనే దివ్యదేశంలో అవతరించినవారు అయిన తిరుప్పాణ్ ఆళ్వార్లపై, ముయల్ = ఉత్సాహాన్ని చూపే (భక్తిని చూపే), ఎతిరాశన్ = యతిరాజులే, మణవాళ మాముని యాయ్ = మణవాళ మహామునులుగా, తీదు ముకన్దు అఱియాత = దోషం వాసన చూడని (ఏ దోషంలేని), తెన్ మఱైయై = ద్రావిడప్రబంధాలను, వళర్త్తానే = వర్ధిల్లజేశారు.

వేదాన్ని అభ్యసించిన గొప్పముని అయిన లోకసారంగమునిని సేవించి, శ్రీరంగనాథుని పాదాలనుండి కిరీటంవరకు కీర్తించినవారు, ఉఱైయూర్లో అవతరించిన వారు అయిన తిరుప్పాణ్ ఆళ్వార్పైన భక్తిని కల యతిరాజులు మణవాళమహామునులుగా అవతరించి, ఏ దోషం లేని ద్రావిడవేదాలైన దివ్యప్రబంధాలను వర్ధిల్ల జేశారు.

**20. తానే తన్ వఴిప్పట్ట దామోదరన్ పణియై**
**క్కానేతి ప్పఱిత్తు మను కఱ్ఱుయ్న్ద నమ్ కుఱైయ**
**ర్కోనేత్తుమ్ ఎతిరాశన్ కోమల వాన్ కుణమ్ పాడి**
**వానేఱ్ఱుమ్ మణవాళ మామునివన్ మన్నురైయే**

తానే తన్ వఴిప్పట్ట = చేతన సంరక్షణార్థం తానే స్వయంగా ముందుగా వచ్చిన, తామోతరన్ = దామోదరుని, పణియై = ఆభరణాలను, కానేతి = అరణ్యమార్గంలో, పఱిత్తు = అపహరించి, మను = అష్టాక్షరీమంత్రాన్ని, కఱ్ఱు = అభ్యసించి, ఉయ్న్ద = ఉజ్జీవించిన, నమ్ కుఱైయర్ కోన్ = కుఱైయలూర్ ప్రభువు అయిన, మన తిరుమఙ్గై యాళ్వార్లను, ఏత్తుమ్ = కీర్తించే, ఎతిరాశన్ = యతిరాజుల, కోమళ వాన్ కుణమ్ = సుకుమారమైన గొప్ప గుణాలను, పాడి = కీర్తించి, వాన్ = పరమపదానికి, ఏఱ్ఱుమ్= చేర్చేవి, మణవాళమాముని, మన్ను ఉరైయే = మణవాళ మహామునుల స్థిరమైన యథార్థమైన శ్రీసూక్తులే.

తనముందే, తానుగానే వచ్చిన భగవానుని దివ్యాభరణాలను అన్నిటినీ అపహరించి, తిరుమంత్రాన్ని ఉపదేశంగా పొంది, ఉజ్జీవించిన కుఱైయలూర్ ప్రభువు తిరుమఙ్గైయాళ్వార్లను కీర్తించే యతిరాజుల గొప్ప గుణాలను పాడి, మనకు పరమపదాన్ని పొందించేవి మణవాళమామునుల శ్రీసూక్తులే.

**21. మన్ను తిరువాయ్ప్పాడి మఙ్గైకళిల్ తానొన్ఱాయ్**
**తన్ ఉరుక్కుమణిక్కణవన్ తకవడైన్ద పుదువై మయిల్**
**ఎన్నణ్ణన్ ఎన ఉవన్ద ఎతిరాశన్ తాళిణైయై**
**మున్ నణ్ణుమ్ మణవాళముని మొఴియై మురలుమినో**

మన్ను = స్థిరంగా నిలచి ఉండే, తిరువాయ్ ప్పాడి మఙ్గైకళిల్ = రేపల్లెలోని గోపికలలో, తాన్ ఒన్ఱాయ్ = తాను ఒకతెయై, ఉరుక్కు మణి క్కణవన్ = రుక్మిణీనాథుడైన శ్రీకృష్ణుని, తకవు = కృపను, అడైన్ద = పొందిన, పుతువై మయిల్ = శ్రీవిల్లిపుత్తూర్‌లోని నెమలి అయిన గోదాదేవి, **"ఎన్ అణ్ణన్"** = నా అన్న, ఎన = అని, ఉవన్ద = సంతోషించి, ఎతిరాశన్ = యతిరాజుల, తాళ్ ఇణైయై = శ్రీచరణద్వయిని, మున్ నణ్ణుమ్ = ముందుగా సేవించే, మణవాళ మాముని మొఴియై = మణవాళమామునుల శ్రీసూక్తిని, మురలుమిన్ = అనుసంధించండి. (పాడండి)

రేపల్లెలోని గోపీకన్యకలలో ఒకతెగా తనను భావించి, రుక్మిణికి నాథుడైన శ్రీకృష్ణుని అనుగ్రహాన్ని పొందిన విల్లిపుత్తూర్‌లోని మయూరి అయిన గోదాదేవి **"నా అన్నా!"** అని సంతోషించి పిలిచిన భగవద్రామానుజుల శ్రీపాదాలను ఆశ్రయించే మణవాళ మహామునుల శ్రీసూక్తులను చెప్పండి.

**22. మురలు మివర్ పదినొరువర్ మొఴికళుక్కోర్ ఇలక్కాకుమ్**
**పరన్ పెరియ పెరుమాళై ప్పణియుమ్ ఎతిరాశన్ తాళ్**
**విరల్ తొడఙ్గి ముడి యళవుమ్ విరుమ్బుమ్ మణవాళముని**
**తర మఱియుమ్ పెరియోర్తమ్ తాళిణై యెన్ తలైక్కణియే**

మురలుమ్ = (దివ్యప్రబంధాలను) పాడే, ఇవర్ పదినొరువర్ = ఈ పదకొండుమంది ఆళ్వార్ల, మొళ్రికళుక్కు = (వేదసమానమైన) శ్రీసూక్తులకు, ఓర్ ఇలక్కు ఆకుమ్ = ఏకైకలక్ష్యభూతుడైన, పరన్ = పరమాత్మ, పెరియ పెరుమాళై = శ్రీరంగనాథుని, పణియుమ్ = సేవించే, ఎతిరాశర్ = యతిరాజుల, తాళ్= శ్రీచరణాల, విరల్ తొడఙ్గి = వేళ్ళనుండి, ముడి అళవుమ్ = కిరీటపర్యంతం, విరుమ్బుమ్ = భక్తితో సేవించే, మణవాళ ముని = శ్రీవరవరమునుల, తరమ్ = గొప్పతనాన్ని, అఱియుమ్ = తెలిసే, పెరియోర్తమ్ తాళ్గళై = మహాత్ముల శ్రీచరణద్వయి, ఎన్ తలైక్కు అణి = నా శిరస్సుకు ఆభరణం (చివరిలోని ఏకారం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని సూచిస్తుంది.)

ఆళ్వార్లు పదకొండుమంది పాశురాలకు లక్ష్యభూతుడైన పెరియపెరుమాళ్ అనబడే శ్రీరంగనాథుని సేవించే యతిరాజుల శ్రీపాదాలయొక్క వేళ్ళనుండి కిరీటం వరకుగల తిరుమేని సౌందర్యాన్ని అనుభవించే మణవాళమహామునుల గొప్పతనాన్ని తెలిసిన మహాత్ముల శ్రీపాదాలు నా శిరస్సుకు ఆభరణం.

**23. అణి యరఙ్గన్ అడి వణఙ్గుమ్ అరుట్పెరియ పిరాట్టితనై**
**ప్పణియుమ్ ఎతిరాశనడి పరవు మణవాళముని**
**పిణి యకల అరుళ్ శెయ్ద పిరపన్దఙ్గళ్ పెరుమ్ పొరుళై**
**త్తుణియుమవర్క్కు ఒరు కాలుమ్ తుయరుదిక్కకిల్లావే**

అణి = ఉభయవిభూతులకు అలంకారభూతుడైన, అరఙ్గన్ అడి = శ్రీరంగనాథుని శ్రీపాదాలను, వణఙ్గుమ్ = సేవించే, అరుళ్ = కరుణే నిరూపకంగా కల, పిరాట్టితనై = లక్ష్మీదేవిని, పణియుమ్=సేవించే, ఎతిరాశన్ అడి = శ్రీరామానుజుల శ్రీచరణాలను, పరవుమ్ = కీర్తించే, మణవాళ మాముని = మణవాళ మహామునులు, పిణి = అర్తి, అకల = తీరేటట్లుగా, అరుళ్ శెయ్ద = అనుగ్రహించిన, పిరపన్దఙ్గళ్= ఆర్తిప్రబంధం, యతిరాజవింశతివంటి ప్రబంధాల, పెరుమ్ పొరుళై = మహనీయమైన తత్త్వార్థాలను, తుణియుమ్ = తెలిసి అవి యథార్థమని నిశ్చయించుకొన్నవారికి, ఒరు కాలుమ్ = ఏనాటికీ, తుయర్ = దుః ఖాలు, (క్లేశాలు) ఉదిక్కకిల్లావే = కలుగవుకదా!

శ్రీరంగనాథుని శ్రీపాదాలను నమస్కరిస్తున్న లక్ష్మీదేవిని స్తుతించే యతిరాజుల శ్రీపాదాలను సేవించే మణవాళమహామునులలో తమ ఆర్తి తీరాలనే భావనతో అనుగ్రహించిన ఆర్తిప్రబంధంయొక్క అర్థాన్ని తెలిసినవారికి ఏనాడూ దుఃఖం ఏర్పడదు.

**24. ఇల్లాద కుణఙ్కాట్టి ఇన్నుయిరై ఇఱై శేర్క్కుమ్**
**వల్లాళై అరుట్పెరియ పిరాట్టితనై వణఙ్గామల్**
**శెల్లాద శేనైయర్కోన్ శెయల్ పాడుమ్ ఎతిరాశన్**
**శొల్లాప్పు మణవాళముని శొల్లాళ్ నన్నూలే**

ఇల్లాత = లేని, కుణమ్ కాట్టి = గుణాలు ఉన్నవి అని చూపి, ఇన్ ఉయిరై = (భగవానునకు, తనకు) తీయని (అభిమతమైన), ఉయిరై = జీవవర్గాన్ని, ఇఱై శేర్క్కుమ్ = పరమాత్మవద్దకు చేర్చే, వల్లాళై = సామర్థ్యాన్ని కల్గినది, అరుళ్ = కరుణాగుణాన్ని నిరూపకంగా కల, పిరాట్టితనై = లక్ష్మీదేవిని, వణఙ్గామల్ = నమస్కరించ

కుండా, శెల్లాత = ఉండలేని, శేనైయర్ కోన్ = సైన్యాధిపతి అయిన విష్వక్సేనుని, శెయల్ పాడుమ్ = లీలలను పాడే, ఎతిరాశన్ = యతిరాజుల, శొల్ = శ్రీసూక్తులలో, ఆళ్లుమ్ = అవగాహించే, మణవాళ మాముని శొల్కళ్ = మణవాళమహామునుల శ్రీసూక్తులు, నల్ నూల్ = గొప్ప శాస్త్రాలు.

చేతనుల విషయంలో లేని గుణాలను ఉన్నట్లుగా చూపి, వారిని భగవానుని వద్దకు చేర్చే సమర్థురాలైన లక్ష్మీదేవిని నమస్కరించకుండా ఉండని సేనైముదలియార్ లీలలను కీర్తించే యతిరాజుల శ్రీసూక్తులను అవగాహించే మణవాళమహామునుల శ్రీసూక్తులు గొప్ప శాస్త్రాలు.

**25. కణ్ణనై మావుడన్ మరువ క్కట్పిత్త వన్ కిరిశై**
**తిణ్ణనవే శుమక్కుమ్ శేనైయర్కోన్తాళ్ వణఙ్గుమ్**
**అణ్ణల్ అరుళ్ మాఱన్ తాళడైయుమ్ ఎతిరాశనైయే**
**నణ్ణు మణవాళముని నఱ్కழలే నమ్ తుణైయే**

కణ్ణనై = సర్వనిర్వాహకుడైన పరమాత్మ, మా ఉడన్ = లక్ష్మీదేవితో కలిసి, మరువ = ఆనందించడంకోసం కట్పిత్త = కల్పించిన, వన్ కిరిశై = లోకసంరక్షణాది గొప్ప కార్యాలను, తిణ్ణనవే = సమర్థవంతంగా, శుమక్కుమ్ = నిర్వహించే, శేనైయర్ కోన్ = విష్వక్సేనుల, తాళ్ = శ్రీచరణాలను, వణఙ్గుమ్ = నమస్కరించే, అణ్ణల్ = స్వామి, అరుళ్ మాఱన్ = కృపను నిరూపకంగా కల నమ్మాళ్వార్ల, తాళ్ అడైయుమ్ = శ్రీపాదాలను ఆశ్రయించే, ఎతిరాశనైయే = యతిరాజులను, నణ్ణుమ్ = సేవించే (ఆశ్రయించే) మణవాళమహామునుల, నల్ కழలే = గొప్ప శ్రీచరణాలే, నమ్ తుణై = మనకు రక్షకం.

భగవానుడు లక్ష్మీదేవితోకూడి ఆనందించడంకోసం లోకసంరక్షణ బాధ్యతను అంతటినీ తాను వహించే విష్వక్సేనుల శ్రీపాదాలను సేవించే నాథులు, **"అరుళ్ మాఱన్"** (శఠకోపుల) శ్రీపాదాలను సేవించేవారైన యతిరాజులనే ఆశ్రయించే మణవాళ మామునుల శ్రీపాదాలే మనకు సహాయం – అని భావం.

**26. నన్దాద మదురకవి నఱ్కలైయై త్తాన్ శవిత్తు**
**శిన్దామల్ శడకోపన్ శీరరుళ్ శేర్ నాదముని**
**మున్ తాళుమ్ ఎతిరాశమూర్త్తి మణవాళముని**
**అన్దాది నూత్తైయుమ్ నామ్ అనుశన్దిత్తు ఇరుప్పోమే**

నన్దాద = నిరవధికమైన గొప్పతనాన్ని కల (శాశ్వతమైన), మతుర కవి = మధుర కవి ఆళ్వార్లు అనుగ్రహించిన, నల్ కలైయై = గొప్ప శాస్త్రమైన (చరమపర్వనిష్ఠా ప్రతిపాదకమైన) కణ్ణినుణ్ శిఱుత్తాम्బు ప్రబంధాన్ని, తాన్ శిన్దామల్ శవిత్తు = తాను ఏకాగ్రత చెదఱకుండా పన్నెండు వేలసార్లు జపించి, శడకోపన్ = నమ్మాళ్వార్ల, శీర్ అరుళ్ శేర్ = గొప్ప కరుణను పొందిన, నాతముని మున్ = నాథమునుల ముందు (సన్నిధిలో), తాళుమ్ = నమ్రంగా తలవంచి నమస్కరించే, ఎతిరాశమూర్త్తి = యతిరాజులమూర్తి (అపరావ తారం) అయిన, మణవాళముని = మణవాళమహామునులు అనుగ్రహించిన, అన్దాది నూత్తైయుమ్ = తిరువాయ్మొழి నూఱ్ఱన్దాది. పాశురాలను నూఱింటిని, అనుశన్దిత్తు ఇరుప్పోమ్ = అనుసంధించి సత్తను కలవారంగా కాగలము.

మధురకవులు అనుగ్రహించిన కణ్ణినుణ్శిఱుత్తామ్బును పన్నెండు వేలమార్లు జపించి, నమ్మాళ్వార్ల అనుగ్రహాన్ని పొందినవారైన నాథమునుల సమక్షంలో తలవంచి నమస్కరించే యతిరాజుల అపరావతారం అయిన మణవాళమహామునుల (తిరువాయ్ మొళ్ళి) అన్దాది నూఱు పాశురాలను మనము అనుసంధిస్తాము.

**27. తిరుప్పొలి అరుళ్నాదన్ శేవడి శేర్ ఉయక్కొణ్డార్**
**పరుప్పొడు పొరుమ్ తాళ్కళ్ పణియుమ్ ఎతిరాశనిదై**
**విరుప్పోఙ్గు మణవాళముని విరిత్త కలై యోది**
**ఇరుప్పోముక్కు ఇని యొరుత్తర్ ఇయల్ కేట్క వళ్ళి యెన్నే**

తిరు = లక్ష్మీదేవియొక్క, పొలి అరుళ్ = వృద్ధి చెందే కరుణను పొందిన నాతన్= నాథమునుల, శే అడి శేర్ = అందమైన శ్రీచరణాలను ఆశ్రయించే, ఉయక్కొణ్డార్= ఉయ్యక్కొణ్డార్‌యొక్క, పరుప్పొడు పొరుమ్ = గొప్పతనంతో పరస్పరం స్పర్ధించే (సాటివచ్చే), తాళ్కళ్ = శ్రీచరణాలను, పణియుమ్ = సేవించే, ఎతిరాశన్ ఇదై = యతిరాజులపట్ల, విరుప్పు ఓఙ్గుమ్ = ఆదరం (భక్తి) వృద్ధి చెందే, మణవాళ ముని = మణవాళ మహామునుల, విరిత్త = విస్తరించిన, కలై ఓది = శాస్త్రాలను (సూక్తులను) అభ్యసించి, ఇరుప్పోముక్కు=ఉండే మనకు, ఇని = ఇక, ఒరుత్తర్ = ఇంకొకరి, ఇయల్= మాటలను (పాశురాలను), కేట్క వళ్ళి ఎన్నే=వినవలసిన దారి (గతి) ఉన్నదా? (లేదు).

లక్ష్మియొక్క అనుగ్రహాన్ని పొందిన నాథమునుల శ్రీపాదాలను ఆశ్రయించే ఉయ్యక్కొణ్డార్ చరణాలను సేవిస్తున్న యతిరాజులపట్ల భక్తిని కలవారైన మణవాళ మహామునుల శ్రీసూక్తులను అభ్యసించే మనకు వేఱొకరి మాటలను వినవలసిన అవసరం లేదు.

**28. వళ్ళక్కెన్న ఉయ్యకొణ్డార్ వన్ శరణామ్బుదుమత్తిన్**
**నిళ్ళఱ్కొణ్డు నికళ్ మణక్కాల్ నమ్బియై నణ్ ఎతిరాశన్**
**కళ్ళఱ్కణ్డ మళవాళముని కలైయై విరుమ్బాదార్**
**విళ్ళక్కణ్డ నామవర్గ్రైవిరుమ్బాద నాళుణ్డే**

వళ్ళక్కు ఎన్న = సత్సంప్రదాయమనదగిన, ఉయ కొణ్డార్ = ఉయ్యక్కొణ్డార్ యొక్క, వన్ = బలిష్ఠమైన, శరణామ్బుదుమత్తిన్ = చరణాలనే పద్మాలయొక్క, నిళ్ళల్ కొణ్డు = ఛాయను ఆశ్రయించి, నికళ్ = ప్రకాశించే, మణక్కాల్ నమ్బియై = మణక్కాల్ నమ్బిని, నణ్ = ఆశ్రయించే, ఎతిరాశన్ = యతిరాజుల, కళ్ళల్ కణ్డ = శ్రీపాదాలను దర్శించిన, మణవాళముని = మణవాళమహామునులయొక్క, కలైయై = గ్రంథాలను (శ్రీసూక్తులను), విళ్ళ కణ్డ = సంసారంలో పడడాన్ని చూచిన, నామ్ = మనం, అవర్గ్రై = ఆ శ్రీసూక్తులను, విరుమ్బాద = ఆదరించని (కోరని), నాళ్ ఉణ్డే = దినం ఉంటుందా?

ఉయ్యక్కొణ్డార్ల శ్రీపాదపద్మాల నీడలో నివసించే మణక్కాల్‌నమ్బిని ఆశ్రయిస్తున్న యతిరాజుల శ్రీపాదాలను సేవించే మణవాళమహామునుల శ్రీసూక్తులను ఆశ పడనివారు సంసారంలో నశించిపోవడాన్ని చూచిన మనం, మామునుల శ్రీసూక్తులను కోరని దినం ఉంటుందా?

**29. నాళ వరితాళ్ తొడరుమవర్ నల్పదత్తై అడైన్దుయ్న్ద**
**ఆళవన్దార్ తిరువడియిల్ అన్బుఱుమ్ ఎమ్బెరుమానార్**
**తాళువన్ద మణవాళముని తరు నూర్ఱన్దాదిక్కు**
**ఆళవన్తాళ్ పరవామల్ ఆరాక క్కదవారే**

నాళ వరితాళ్ = ప్రతిదినం నిత్యనూతనంగా భాసించే భగవానుని శ్రీచరణాలను, తొడరుమవర్ = ఆశ్రయించే మణక్కాల్ నమ్బి, నల్ పదత్తై = గొప్ప శ్రీచరణాలను, అడైన్దు ఉయ్న్ద = ఆశ్రయించి, ఉజ్జీవించిన, ఆళవన్దార్ = భగవద్యామునుల, తిరువడియిల్ = శ్రీచరణాలలో, అన్బు+ఉఱుమ్ = భక్తిని పొందే, ఎమ్బెరు మానార్ = శ్రీరామానుజుల, తాళ్ = శ్రీచరణాలను, ఉవన్ద=ఆశపడే, మణవాళముని = మణవాళమహామునులు, తరు = అనుగ్రహించే, నూర్ఱన్దాదిక్కు = తిరువాయ్మొళ్ళి నూర్ఱన్దాదికి, ఆళవన్తాళ్= దాసులైనవాని శ్రీచరణాలను, పరవామల్ = మంగళాశాసనం చేయకుండా, ఆర్ ఆకక్కదవార్ = ఎవరు ఉండగలరు?

ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా తోచే శ్రియఃపతి శ్రీపాదాలను ఆశ్రయించి ఉజ్జీవించినవారైన మణక్కాల్ నమ్బి శ్రీచరణాలను సేవించే ఆళవన్దార్ శ్రీపాదాలలో భక్తిని కల భగవద్రామానుజుల శ్రీపాదాలను ఆశపడే మణవాళ మహామునులు అనుగ్రహించిన తిరువాయ్మొళ్ళి నూర్ఱన్దాదికి దాసులై, వారి శ్రీపాదాలను మంగళాశాసనం చేయకుండా ఎవరు ఉండగలరు? **"యత్పదాంభోరుహధ్యా నధ్వస్తాశేషకల్మషః, వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్"** అని యామునులను శ్రీరామానుజులు స్తుతించడం స్మరణీయం. యామునుల ఏకలవ్య శిష్యునిగా తమను శ్రీరామానుజులు చెప్పుకొనేవారనే విషయం ప్రసిద్ధం కదా!

**30. కడమాక ఆళవన్దార్ కళ్ళల్ పణిన్ద పెరియనమ్బి**
**ఉడన్ వర అడి పరవుమ్ ఎతిరాశన్ ఉరై తేఱుమ్**
**మడనెఞ్జ మణవాళ మామునివన్ మత్తై యోదుమ్**
**తిడనెఞ్జార్ అడియేనై త్తిరుత్తి యరుళ్ శెయ్దారే**

కడమ్ ఆక = కర్తవ్యంగా, ఆళవన్దార్ కళ్ళల్ = ఆళవన్దారుల శ్రీపాదాలను, పణిన్ద = సేవించిన, పెరియనమ్బి = పెరియ నమ్బి, ఉడన్ వర = తమతో రాగా, అడి పరవుమ్ = వారి శ్రీచరణాలను కీర్తించే, ఎతిరాశన్ = యతిరాజుల, ఉరై = శ్రీసూక్తులలో, తేఱుమ్ = స్పష్టమైన అవగాహనను కల, మడ నెఞ్జమ్ = భవ్యమైన మనస్సును కల, మణవాళ మామునివన్ = శ్రీమణవాళమహామునులు, మత్తై = వేదసమానాలు అయిన సూక్తులను, ఓదుమ్ = అధ్యయనం చేసే, తిడ నెఞ్జార్ = దృఢమైన మనస్సును కలవారు, అడియేనై= దాసుణ్ణి అయిన నన్ను, తిరుత్తి = సంస్కరించి, అరుళ్ శెయ్దార్ = అనుగ్రహించారు.

ఆళవన్దారుల శ్రీపాదాలను సేవించిన పెరియనంబి తమతో రాగా, వారి శ్రీపాదాలను సేవించిన శ్రీరామానుజుల సూక్తులను ఆశపడే మణవాళమామునుల శ్రీసూక్తులను అభ్యసించే దృఢమైన మనస్సును కలవారు దాసుని సంస్కరించి, దాసునిగా చేసికొని అనుగ్రహించారు.

**31. ఆరే శీర్ అముదనుఱై అన్దాదిద్దేవతై శేర్**
**కూరేశన్ కురుకేశన్ కురు ముదలియాణ్డాన్‌పోల్**
**కారే శీర్ ప్పెరున్దిరళై క్కరుదుమ్ మణవాళముని**
**శీరే శిన్దనై శెయ్‌వార్ శేవడి శేర్న్దకలోమే**

శీర్ ఆర్ = ప్రబంధగుణాలతో నిండిన, అముదన్ ఉఱై అన్దాది తేవతై = తిరువరఙ్గత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూఱ్ఱన్దాదికి అధిదేవత అయిన శ్రీరామానుజులను, శేర్ = ఆశ్రయించే, కూరేశన్ = కూరత్తాఴ్వాన్, కురుకేశన్ = తిరు క్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, కురు ముదలియాణ్డాన్ పోల్ = గురువైన ముదలియాణ్డాన్ వంటి, కారే శీర్ పెరుమ్ తిరళై = మేఘంవలె ఔదార్యగుణాన్ని కల మహానుభావుల సమూహాన్ని, కరుతుమ్ = భావించే, మణవాళమహామునుల, శీరే = కల్యాణగుణాలను, శిన్దనై శెయ్ వార్ = చింతన చేసేవారి, శే అడి = స్పృహణీయమైన శ్రీచరణాలను, శేర్న్దు = చేరి, అకలోమే = విశ్లేషించలేము.

తిరువరఙ్గత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూఱ్ఱన్దాదికి అధిదైవమైన భగవద్రామానుజుల పాదదాసులగు కూరత్తాఴ్వాన్, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, ముదలియాణ్డాన్‌వంటివారిని సేవించేవారైన మణవాళమహామునుల గుణాలను చింతన చేసేవారి శ్రీపాదాలను చేరి, ఇకపై వారిని విశ్లేషించలేము.

**32. తకవుడైయ ఎతిరాశన్ తాళడైయుమ్ ఎమ్బార్‌తాళ్**
**మిక వడైయుమ్ మణవాళమామునివన్ మిఴఱ్ఱియ శొల్కు**
**అక ముడైయుమ్ అదికారి యారేనుమ్ ఒరువరే తాన్**
**శెక ముడైయ పరమార్త్తమ్ శిన్దిక్క త్తిరువుడైత్తే.**

తకవు+ఉడైయ = కరుణను కల, ఎతిరాశన్ = యతిరాజుల, తాళ్ అడైయుమ్ = శ్రీచరణాలను ఆశ్రయించే, ఎమ్బార్ తాళ్ = గోవిందభట్టర్ అనబడే ఎమ్బార్ శ్రీచరణాలను, మిక = మిక్కిలి (భక్తితో), అడైయుమ్ = ఆశ్రయించే, మణవాళ మహామునివన్ = మణవాళ మహామునులు, మిఴఱ్ఱియ = మధురంగా పల్కిన, శొల్కు = సూక్తులకు, అకమ్ ఉడైయుమ్ = మనస్సును కల (అభిమానించే), అదికారి= అధికారి, ఆర్ ఏనుమ్ = ఎవరైనా ఉంటే, ఒరువరే తాన్ = వారు ఒక్కరే, శెకమ్ అడైయ = లోకంలో అంతటికి, పరమార్త్తమ్ = పరమార్థాన్ని, శిన్దిక్క = చింతించడానికి తగిన, తిరు ఉడైత్తే = సంపదను కలవారు.

కరుణను కల భగవద్రామానుజులు శ్రీపాదాలను ఆశ్రయించిన ఎమ్బార్‌యొక్క పాదాలను శరణు పొందే మణవాళమహామునులు అనుగ్రహించిన శ్రీసూక్తులపట్ల మనస్సు శిథిలమై, ద్రవించేవారు ఎవరైనా ఉంటే, వారే లోకం అంతటికి గొప్ప అర్థాన్ని చింతించే సంపదను కలవారు.

**33. ఉడైయవరామ్ ఎతిరాశర్ ఉయర్ తకవాల్ ఎమ్బార్ తాళ్**
**అడైయుమ్ పరాశరపట్టర్‌క్కు అన్ఱ్ఱ మణవాళముని**
**తడై యఱవే తమిఴ్మఱైక్కు త్తకవు శెయ్ నూఱ్ఱన్దాది**
**త్తొడైయదనై పుల్వర్‌కళ్‌తామ్ తుతిత్తు నలమ్ పరుకువరే**

ఉడైయవర్ ఆమ్ = సొత్తు దారులైన (స్వామి అయిన), ఎతిరాశర్ = శ్రీరామానుజుల, ఉయర్ తకవాల్ = ఉన్నతమైన కృపతో, ఎమ్బార్ తాళ్ అడైయుమ్ = ఎమ్బార్ శ్రీచరణాలను ఆశ్రయించే, పరాశర పట్టర్క్కు = పరాశరభట్టర్కు, అన్ఱ = విధేయులైన, మణవాళముని = మణవాళమహామునులు, తడై అఱవే = ఆటంకాలు నశించేటట్లుగా, తమిఴ్ మఱైక్కు = ద్రావిడవేదానికి (తిరువాయ్మొళ్రికి), తకవు శెయ్ = తగినట్లు అనుగ్రహించే, నూఱ్ఱన్దాది త్తొడై అదనై = తిరువాయ్మొళ్రి నూఱ్ఱన్దాది పాశుర మాలికను, పులవర్కళ్తామ్ = పండితులు, తుతిత్తు = స్తుతించి, నలమ్ పరుకువరే = ఆనందాన్ని గ్రోలుతారు.

**"ఉడైయవర్"** (స్వామి) అయిన భగవద్రామానుజుల దయతో ఎమ్బార్ శ్రీ పాదాలను చేరిన పరాశర భట్టర్కు దాసులైన మణవాళ మహామునులు ఏ ఆటంకం లేకుండా ద్రావిడవేదం అయిన తిరువాయ్మొళ్రికి అనుగ్రహించిన తిరువాయ్మొళ్రి నూఱ్ఱన్దాది అనే వాఙ్మాలను పండితులు స్తుతించి, దాని గొప్పతనాన్ని అనుభవిస్తారు.

**34. పెరుమ్బూదూర్ మునివన్ అడి పేణియ నఞ్జీయరైయే**
**విరుమ్బుమ్ మణవాళముని విరి నూఱ్ఱన్దాదితనై**
**క్కరుమ్బాఱు శాఱముదాయ్ క్కరుదామల్ తిరివార్కళ్**
**అరుమ్పావికళ్ కణ్డీర్ అవరుఱవై అకఱ్ఱుమినే**

పెరుమ్బూదూర్ మునివన్ = శ్రీపెరుమ్బూదూర్లోని శ్రీరామానుజుల, అడి = శ్రీచరణాలను, పేణియ= ఆశ్రయించిన, నఞ్జీయరైయే = నంజీయర్ను, విరుమ్బుమ్= కోరే (ఆదరించే), మణవాళమాముని = మణవాళ మామునియొక్క, విరి నూఱ్ఱన్దాది తనై = అర్థవిస్తృతిని కల తిరువాయ్మొళ్రినూఱ్ఱన్దాదిని, కరుమ్బు ఊఱు శారు అముదాయ్ = చెఱకునుండి ఊరే మధురరసంవలె, అమృతంవలె, కరుతామల్ = భావించకుండా, తిరివార్కళ్ = వ్యర్థంగా పరిభ్రమించేవారు, అరుమ్ పావికళ్ కణ్డీర్ = అరుదైన (మహా) పాపాలను చేసినవారు సుమా! అవర్ ఉఱవై = వారితో సంబంధాన్ని, అకఱ్ఱుమినే = తెంచుకొనండి.

శ్రీపెరుమ్బూదూర్మాముని అయిన శ్రీరామానుజుల శ్రీపాదాలను ఆశ్రయించే వారైన నఞ్జీయర్ను అభిమానించే మణవాళమహామునులు అనుగ్రహించిన తిరువాయ్మొళ్రి నూఱ్ఱన్దాదిని చెఱకులో ఊరే తీయని రసంవలె, అమృతంవలె భావించకుండా తిరిగే (భ్రమించే) వారు పరమపాపిష్ఠివారు కాబట్టి వారితో ఉన్న సంబంధాన్ని పోగొట్టుకోండి.

**35. అకత్తిల్ ఎతిరాశన్తాళ్ అకలాద నమ్బిళ్ళై**
**వకుత్త మలరడి వణఙ్గు మణవాళమామునివన్**
**శెకత్తుక్కా ఉపదేశమ్ శెయ్ద మణిమాలైదనై**
**అకత్తుక్కోర్ అణియాక అణివార్ ఎన్ముడిక్కణియే**

ఆకత్తిల్ = తమ మనస్సులో, ఎతిరాశన్ తాళ్ = యతివరుల శ్రీపాదాలను, అకలాద = విడువని (నిరంతరం ధ్యానించే), నమ్బిళ్ళై = నమ్బిళ్ళైయొక్క, వకుత్త = తగిన, స్వరూపానురూపమైన, మలర్ అడి = పద్మాలవంటి శ్రీచరణాలను, వణఙ్గుమ్= నమస్కరించే, మణవాళ మామునివన్ = మణవాళమహామునులు,

శెకత్తుక్కు ఆక = లోకం అంతటికీ, ఉపదేశమ్ శెయ్ద = ఉపదేశించిన, మణి మాలైతనై = ఉపదేశరత్న మాలను, అకత్తుక్కు = తమ హృదయానికి, ఓర్ = అద్వితీయమైన, అణి ఆక = అలంకారంగా, అణివార్ = అలంకరించుకొన్నవారు, ఎన్ ముడిక్కు అణియే = నా శిరస్సుకు ఆభరణంవంటివారు.

తమ మనస్సులో శ్రీరామానుజుల శ్రీపాదాలను నిరంతరం ధ్యానించే నమ్బిళ్ళై యొక్క అందమైన శ్రీపాదాలను నమస్కరించే మణవాళమహామునులు లోకానికి ఉపదేశించడంకోసం అనుగ్రహించిన ఉపదేశరత్తినమాలైను తమ మనస్సుకు అలంకారంగా గ్రహించేవారు నా తలకు ఆభరణం కాగలరు.

**36. ముడిక్కురియ ఎతిరాశన్ ముఴు నలనుమ్ ముకన్దురుకుమ్**
**పడి వడక్కుత్తిరువీదిప్పిళ్ళైయై చ్చేర్ మణవాళన్**
**అడిక్కమలత్తు అన్బుఉవార్ అవన్ మొఴియై ఆరాయ్న్దు**
**పడిప్పల్లాల్ పఱ్పల్ కాల్ పాఴ్ పొఴుదు పోక్కువరే**

ముడిక్కు ఉరియ = (శ్రీవైష్ణవసంప్రదాయసామ్రాజ్యానికి చక్రవర్తి అనే సంగతిని సూచించే) కిరీటానికి యోగ్యులైన, ఎతిరాశన్ = యతిరాజుల, ముఴు నలనుమ్ = సమస్తమైన కల్యాణగుణాలను, ముకన్దుమ్ = అనుభవించే, ఉరుకుమ్ పడి = ద్రవించే రీతిలో వడక్కు త్తిరువీది ప్పిళ్ళై = వడక్కుత్తిరువీథిప్పిళ్ళైను, శేర్ = ఆశ్రయించే, మణవాళన్= మణవాళమహామునుల, అడి క్కమలత్తు = పద్మాలవంటి శ్రీచరణాలలో, అన్బు ఉఱువార్= భక్తిని కలవారు, అవన్ మొఴియై = ఆ మణవాళమహామునుల శ్రీసూక్తులను, ఆరాయ్న్దు= పరిశీలించి, పల్ పల్ కాల్ పడిప్పు అల్లాల్ = పలుమార్లు అధ్యయనం చేయడం కాకుండా, పొఴుదు పాఴ్ పోక్కువరే = వ్యర్థంగా కాలక్షేపం చేస్తారా? (చేయరు)

శ్రీవైష్ణవసంప్రదాయానికే పట్టాభిషిక్తులైన యతిరాజుల అన్ని కల్యాణగుణాలను అనుభవించి, ద్రవించేవారైన వడక్కుత్తిరువీథిప్పిళ్ళైను ఆశ్రయించిన మణవాళ మహామునుల శ్రీపాదాలను సేవించేవారు వారు అనుగ్రహించిన గ్రంథాలను పరిశీలించి పలు మార్లు అభినివేశాన్ని పొందడం కాకుండా, వేఱే కృత్యాలలో వ్యర్థంగా కాలాన్ని గడుపుతారా? (గడపరు)

**37. ఉవరోడు తమరేత్తుమ్ ఉత్తమర్ ఎమ్బెరుమానార్**
**అవరే తమ్ శరణాక అడైయుమ్ ఉలకారియనై**
**ఇవరే నమ్ కులదెయ్వమ్ ఎన త్తుణిన్ద మణవాళర్క్కు**
**ఎవరేనుమ్ ఆళానార్ ఎఴు పిఱప్పుమ్ ఎమక్కరశే**

ఉవరోడు తమర్ ఏత్తుమ్ = శత్రుమిత్రభేదం లేకుండా అందఱు దాసులు స్తుతించే, ఉత్తమర్ = ఉత్తములైన, ఎమ్బెరుమానార్ అవరే = భగవద్రామానుజులనే, శరణ్ ఆక = శరణంగా, అడైయుమ్ = ఆశ్రయించే, ఉలకారియనై = శ్రీపిళ్ళైలోకాచార్యుల వారిని, ఇవరే = వీరే, నమ్ కుల దెయ్వమ్ = మన కులదైవం, ఎన = అని, తుణిన్ద= నిశ్చయించుకొన్న, మణవాళర్క్కు = మణవాళమహామునులకు, అళానార్ ఎవరేనుమ్= దాసులైనవారు ఎవరైనా, ఎఴు పిఱప్పుమ్ = ఏడేడు జన్మలలో, ఎమక్కు అరశే = మమ్ములను పాలించే ప్రభువులు.

దాసులు ఆనందంతో స్తుతించే భగవద్రామానుజులనే తమ శరణంగా ఆశ్రయించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారే మన కులానికి దైవం అని చూపిన మణవాళ మహామునులకు ఎవరు దాసులయ్యారో వారు ఏడేడు జన్మలలోను మాకు ప్రభువులు.

**38. కరై శేర్క్కుమ్ ఎతిరాశన్కణ్ తిరువాయ్మొళిప్పిళ్ళై**
**ఉరై శెయ్ద పళ్ళైవళియే ఓదుమ్ మణవాళముని**
**విరై యేఱ్ఱు మలరడియై విరుమ్బుమవర్ ఎమ్ కురుక్కళ్**
**నిరై శేర్న్దు నిచ్చలుమే నినైన్దెన్ఱుమ్ ఇకళ్లారే**

కరై శేర్క్కుమ్ = (సంసారసముద్ర) తీరాన్ని చేర్చే, ఎతిరాశన్ కణ్ = శ్రీరామానుజుల విషయంలో తిరువాయ్మొళిప్పిళ్ళై = తిరువాయ్మొళి ప్పిళ్ళై, ఉరై శెయ్త = అనుగ్రహించిన, పళ్లై వళియే = సనాతనమైన మార్గాన్నే, ఓదుమ్ = అభ్యసించే, మణవాళమాముని = మణవాళమహామునుల, విరై ఏఱ్ఱుమ్ = సువాసనను వెదజల్లే, మలర్ అడియే = పద్మాలవంటి పాదాలనే, విరుమ్బుమవర్ = ఆశపడేవారు (సేవించే వారు), ఎమ్ కురుక్కళ్ = మా ఆచార్యుల, నిరై శేర్న్దు = పరంపరను చేరి, నిచ్చలుమే = నిత్యంగా, నినైన్దు = భావించి, ఎన్ఱుమ్ ఇకళ్లారే = ఏనాటికీ నిందింపబడరు.

ఈ లోకయాత్ర అనే సంసార సముద్రంనుండి భగవద్రామానుజుల దరిచేర్చే తిరువాయ్మొళి ప్పిళ్ళై అనుగ్రహించిన శ్రీసూక్తులను క్రమం తప్పకుండా అభ్యసించే మణవాళమహామునుల శ్రీపాదాలను అభిమానించేవారు మన ఆచార్యగోష్ఠిని ఆశ్రయించి, ఏనాడు నిందింపబడకుండా ప్రకాశించే స్థితిని పొందుతారు.

**39. కళ్ళలాద ముక్కోలాన్ కరుణైనిది ఎతిరాశన్**
**కళ్ళలాడి త్తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ వియాక్కియైయిన్**
**నిళ్ళలాదుమ్ ఇకళ్లాదే నిఱ్కుమ్ మణవాళముని**
**శుళ్ళలాద తొల్ వళియై చ్చూరికళుక్కు అరుళ్వానే**

కళ్ళలాత = ఏనాటికీ చేతినుండి జారిపోని, ముక్కోలాన్ = త్రిదండాన్ని కల్గినవారు, కరుణై నితి = కరుణకు నిధి అయిన, ఎతిరాశన్ = యతిరాజులయొక్క, కళ్ళల్ ఆడి = శ్రీచరణాలలో అవగాహించే (శ్రీచరణాలను ఆశ్రయించే), తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ = తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనుగ్రహించిన, వియాక్కియైయిన్= ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంయొక్క, నిళ్ళల్ ఆతుమ్ = ఛాయను దేనినీ, ఇకళ్లాతే నిఱ్కుమ్ = వదలకుండా నిలచి ఉండే, మణవాళ ముని = మణవాళ మహామునులు, శూరికళుక్కు=సూరులకు (శిష్యులకు), శుళ్ళలాత=సంసారంలో పరిభ్రమించని, తొల్ వళియై = ప్రాచీనమైన మార్గాన్ని, అరుళ్వానే = అనుగ్రహిస్తారు.

ఏ సమయంలోను చేయి విడువని త్రిదండాన్ని కల, కరుణకు నిధి అయిన యతిరాజుల శ్రీపాదాలను సేవించే, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అనుగ్రహించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని ఛాయవలె అనుసరించి ఉండే మణవాళమామునులు తమ దాసులకు భగవానుని విడిచి ఉండకుండా ఉండే దారిని అనుగ్రహిస్తారు.

**40. అరుళాழ்ఙి ఎతిరాశన్ అడి తాழ்ఖుమ్ నఞ్జీయర్**
**మరుళామల్ శెయ్ద తమిழ் వియాక్కియైయై వాయ్న్దరుళుమ్**
**పొరుళాదుమ్ శోరామల్ పుకలుమ్ మణవాళముని**
**తెరుళాழ்ఙి త్తీక్కతియై త్తేయ్న్దழிయ త్తీర్త్తానే**

అరుళ్ ఆழ்ఙి = కరుణాసముద్రులు అయిన, ఎతిరాశన్ = యతిరాజుల, అడి = శ్రీచరణాలలోను, తాழ்ఖుమ్ = నమ్రం అయే (ఆశ్రయించే), నఞ్జీయర్ = నఞ్జీయర్ అనే ఆచార్యులు, మరుళామల్ = ఏమాత్రం అజ్ఞానాది దోషాలు లేకుండా, శెయ్ద = రచించిన, తమిழ் వియాక్కియైయై = ఒన్బదినాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని, వాయ్న్దు అరుళుమ్ = చక్కగా అనుగ్రహించేవారు, పొరుళ్ ఆదుమ్ = అర్థాలను వేటినీ, శోరామల్ = తప్పిపోకుండా, పుకలుమ్ = గ్రహించేవారు (విశదీకరించేవారు), తెరుళ్ ఆழ்ఙి = జ్ఞానసముద్రులు అయిన మణవాళముని = మణవాళమహామునులు, తీ కతియై = (అజ్ఞానం అనే) దుర్గతిని, తేయ్న్దు అழிయ తీర్త్తానే = నశించేటట్లుచేసి, అజ్ఞానాన్ని తీర్చారు.

(దయాసముద్రులైన) దయను మెండుగా కల శ్రీరామానుజుల శ్రీపాదాలను సేవించే నంజీయర్ అనుగ్రహించిన ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్యానంలో చెప్పబడ్డ అర్థాలను ఒక్కటికూడా తప్పకుండా అనుగ్రహించే మణవాళ మామునులు అజ్ఞానం అనే దుర్గతిని నశింపజేశారు.

**41. తీర్త్తన్ ఎతిరాశనడిశేర్ ఆచ్చాన్పిళ్ళై మున్నాళ్**
**శీర్త్త తమిழ் వియాక్కియైయై చ్చెయ్యుమ్ మణవాళముని**
**వార్త్తైకళిల్ ఓరొన్ఱే వానేఱ్ఱి ఉయ్త్తిడుమాల్**
**పార్త్తవనై చ్చేవిత్తార్ పాక్కియత్తై ప్పణిత్తామో**

తీర్త్తన్ = పరమపావనులు అయిన, ఎతిరాశన్ = శ్రీరామానుజులు, అడి శేర్ = శ్రీపాదాలను ఆశ్రయించే, ఆచ్చాన్ పిళ్ళై = పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన, మున్ నాళ్ = పూర్వం, శీర్త్త = తగినట్లు గొప్పగా అనుగ్రహించిన, తమిழ் వియాక్కియైయై= గొప్ప దివ్యమైన ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానాన్ని, శెయ్యుమ్= కృప జేసే (వివరించే), మణవాళముని = మణవాళమహామునుల, వార్త్తైకళిల్ = శ్రీసూక్తులలో, ఓర్ ఒన్ఱే= ఏ ఒక్కటి అయినా, వాన్ ఏఱ్ఱి = పరమపదానికి చేర్చి, ఉయ్త్తిడుమ్ = ఉద్ధరిస్తుంది, ఆల్ = ఆశ్చర్యం! అవనై = ఆ మణవాళ మహామునులను, పార్త్తు సేవిత్తార్ = సాక్షాత్తుగా దర్శించి సేవించినవారి, పాక్కియత్తై = అదృష్టాన్ని, పణిత్తు ఆమో? = వర్ణించి అవుతుందా? (వర్ణించ సాధ్యం కాదు)

పరమపావనులైన యతిరాజుల శ్రీపాదాలను ఆశ్రయించిన పెరియవాచ్చాన్ పిళ్ళై పూర్వం అనుగ్రహించిన ఇరుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యానాన్ని కృపజేసే మణవాళ మహామునుల సూక్తులు (వార్తలు) ఒక్కొక్కటే మనకు పరమపదాన్ని ఇచ్చి ఉజ్జీవనాన్ని ఇచ్చేవి కాబట్టి, వారిని నేరుగా సేవించినవారు పొందిన భాగ్యాన్ని మనకు చెప్పడానికి సాధ్యమా!

**42. తామ్ మున్ ఇరుమ్ పూదూర్క్కోన్ తాన్ వణఙ్గుమ్ పరమపదమ్**
**తీ మునిన్దు శౌరి వడక్కు త్తిరువీదిప్పిళ్ళై శౌల్లాల్**

**తూమననాయ్ త్తమిళ్ల్ మఱైయై త్తొకుత్తురైక్కు మణవాళ**
**మామునివన్ మలరడియై మరువాదార్ వాళ్లారే**

తామ్ మున్ = తాము పూర్వం, ఇరుమ్ = ఉండే, పుతూర్కోన్ తాన్ = పెరుమ్బూదూర్లోని స్వామి అయిన శ్రీరామానుజులు, వణఙ్గుమ్ = నమస్కరించి, పరమపదమ్ = పరమపదాన్ని, తీ మునిన్దు = లౌకికజీవనం అనే చెడ్డపై కోపించి, శౌరి = విస్తృతంగా పలికే, వడక్కు త్తిరువీదిప్పిళ్ళై శొల్లాల్ = వడక్కుత్తిరువీది ప్పిళ్ళై సూక్తులతో (ఈడు వ్యాఖ్యతో), తూ మననాయ్ = పవిత్రమైన మనస్సును కలవారై, తమిళ్ల్ మఱైయై = ద్రావిడవేదాన్ని (సహస్రగీతిని), తొకుత్తు ఉరైక్కుమ్ = కూర్చి అనుగ్రహించే, మణవాళ మా మునివన్= మణవాళ మహామునుల, మలర్ అడియై = పూవువంటి శ్రీచరణాలను, మరువాతార్= ఆశ్రయించనివారు, వాళ్లారే = ఉజ్జీవించరు.

తాము పూర్వం నివసించే శ్రీపెరుమ్బూదూర్కు స్వామి అయిన ఎమ్బెరుమానార్ నమస్కరించే పరమపదాన్ని, ఈ లౌకికజీవనం అనే చెడ్డపై కోపించి, వడక్కుత్తిరువీదిప్పిళ్ళై విరివిగా అనుగ్రహించిన తిరువాక్కులచేత (ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యచేత) పరిశుద్ధం అయిన మనస్సును కలవారై, ద్రావిడవేదం అనే తిరువాయ్మొళ్లియొక్క అర్థాన్ని కూర్చి అనుగ్రహించే మణవాళమహామునుల శ్రీపాదాలను ఆశ్రయించనివారు ఉజ్జీవనాన్ని పొందలేరు.

**43. ఆళ్వార్కళ్ అరు మఱైయై ఆర్త్త ఎతిరాశనైయే**
**శూళ్ల్ వాదికేశరి శొల్ శూరికళుక్కు అరుళ్ శెయ్యుమ్**
**తాళ్ల్వాదుమ్ ఇల్లాద తకవన్ మణవాళముని**
**వాళ్ల్వాక మణ్ణవర్క్కు మన్దిరత్తై విరిత్తానే**

ఆళ్వార్కళ్ అరు మఱైయై = దివ్యసూరులు అనుగ్రహించిన అరుదైన ద్రావిడ వేదాన్ని, ఆర్త్త = కీర్తించిన, ఎతిరాశనైయే = భగవద్రామానుజులనే, శూళ్ల్ = ఆశ్రయించే, వాది కేశరి శొల్ = వాదికేసరి అళ్లకియ మణవాళచ్చీయర్ శ్రీసూక్తులను (పన్నీరాయిరప్పడిని), శూరికళుక్కు = పండితులకు, అరుళ్ శెయ్యుమ్ = అనుగ్రహించే వారు, తాళ్ల్వు ఆతుమ్ ఇల్లాత = ఏ నైచ్యం (దోషం) లేని, తకవన్ = కరుణను కలవారు అయిన, మణవాళముని = మణవాళమహామునులు, వాళ్ల్వు ఆక = ఉజ్జీవనం కలిగేటట్టుగా మణ్ణవర్క్కు = భూలోకవాసులకు, మన్దిరత్తై = మంత్రార్థాన్ని, విరిత్తానే = వివరించారు. (**"తకవు"** ను కలవాడు **"తకవన్".**)

ఆళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదాలను కీర్తించే యతిరాజులనే ఆశ్రయించే వాదికేసరి అళ్లకియ మణవాళచ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యను దాసులకు అనుగ్రహించేవారు, ఏ దోషం లేనివారు, కరుణను కలవారు అయిన మణవాళ మామునులు భూలోకంలో నివసించేవారికి ఉన్నతగతిని కల్గించే మంత్రాన్ని వివరించి, కృపజేశారు.

**44. విరి పుకళ్ల్ ఎమ్బెరుమానార్ విశయత్తాల్ అవర్క్కాళాయ్**
**ప్పెరియ పుకళ్ల్ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్**

**ఉరియ మొழிకళై అరుళాల్ ఉరైక్కు మణవాళముని**
**తెరివరియ తిరుప్పుకழை త్తేరుమవర్ దేవర్కళే**

విరి పుకழ் = విస్తరించిన కీర్తిని కల, ఎమ్బెరుమానార్ = భగవద్రామానుజుల, విశయత్తాల్ = విజయం వల్ల, అవర్క్కు ఆళాయ్ = వారికి దాసులై, పెరియ పుకழ் = గొప్ప కీర్తిని కల, అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరు మానార్ = అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే ఆచార్యుల, ఉరియ మొழிకళై = స్వరూపానురూపం అయిన శ్రీసూక్తులను, అరుళాల్ = దయతో, ఉరైక్కుమ్ = వ్యాఖ్యానించే, మణవాళముని = మణవాళ మహామునులయొక్క, తెరివరియ = తెలియడానికి సాధ్యం కాని, తిరు ప్పుకழை = గొప్ప యశస్సును, తేరు మవర్ = తెలిసినవారు, దేవర్కళే = నిత్యసూరులే.

గొప్ప కీర్తిని కల భగవద్రామానుజుల గొప్పతనంవల్ల వారికి దాసులైన గొప్ప యశస్సును కల అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానారుల శ్రీసూక్తులను తమ కరుణతో వివరించే మణవాళమహామునుల మిక్కిలి గొప్ప యశస్సులను తెలిసినవారు దేవతలతో సమానులు కాగలరు.

**45. ఏఱు పుకழ் ఉలకారియన్ ఇయల్ తత్తువత్తిరియత్తిన్**
**ఆఱు విరిత్తు ఎతిరాశర్క్కు ఆట్చెయ్ మణవాళముని**
**కూఱు కలై అతికరిక్కుమ్ కూర్ మదియోర్ అల్లామల్**
**వేఱు శిలర్ వేదాన్త విழுప్పొరుళై క్కాణారే**

ఏఱు = వృద్ధిచెందే, పుకழ் = కీర్తిని కల, ఉలకారియన్ = శ్రీపిళ్ళైలోకా చార్యులవారి, తత్తువత్తిరియత్తిన్ ఇయల్ = చిదచిదీశ్వరతత్త్వాల స్వభావాన్ని, వివరించే తత్త్వత్రయమనే రహస్యగ్రంథంయొక్క, ఆఱు = తీరును, విరిత్తు = వివరించి, ఎతిరాశర్క్కు = యతిరాజులకు, ఆళ్ శెయ్‌ద = శ్రీరామానుజులకు కైంకర్యం చేసే, మణవాళముని = మణవాళ మహామునులు, కూఱు కలై = అనుగ్రహించే శాస్త్రాలను (గ్రంథాలను), అతికరిక్కుమ్ = అధికరించే, కూర్ మదియోర్ అల్లామల్ = నిశితమైన మనస్సును కలవారు తప్ప, వేఱు శిలర్ = అన్యులు కొందఱు, వేదాన్త విழு ప్పొరుళై = వేదాంతంలోని యథార్థాన్ని, కాణారే = దర్శించలేరు.

గొప్ప పేరును కల శ్రీలోకాచార్యులవారి గ్రంథం అయిన తత్త్వత్రయంయొక్క అర్థాన్ని విశదీకరించి, వ్యాఖ్యానించి, శ్రీరామానుజులకు కైంకర్యం చేసేవారైన మణవాళ మహాముల గ్రంథాలను అభ్యసించే నిశితమైన జ్ఞానం కల్గినవారు తప్ప వేఱు ఎవరూ వేదాంతంయొక్క నిజమై అర్థాన్ని తెలియలేరు.

**46. కాణాదర్ కపిలర్ కురు కపాలి కుతర్క్కమతఙ్గళ్**
**కాణాద పడి యழிయ క్కలై శెయ్ ఉలకారియన్ శొల్**
**పూణాక ఎతిపతియై ప్పోఱ్ఱు మణవాళన్‌తాళ్**
**పేణాద చేతనరై ప్పేయెన్బర్ పెరియోరే**

కాణాదర్ = కాణాదులు, కపిలర్ = కపిలురు, కురు కపాలి = కాపాలికులు, మొదలైనవారి, తర్క్క మతఙ్గళై = కుతర్కాలతో కూడిన మతాలను, కాణాత పడి = అవి కన్పించని రీతిలో, అழிయ = నశించేటట్టుగా, కలై శెయ్ = గ్రంథాలను రచించే, ఉలకారియన్ శొల్ = శ్రీపిళ్ళైలోకాచార్యులవారి వాక్కులను, పూణ్ ఆక =

ఆభరణంగా కల, ఎతిపతియై = యతిరాజులను, పోఱ్ఱుమ్ = కీర్తించే, మణవాళన్ తాళ్ = మణవాళ మహామునుల శ్రీచరణాలను, పేణాత = అభిమానించని, చేతనరై = జీవులను, పెరియోర్=పెద్దలు, పేయ్ ఎన్బర్ = దెయ్యాలని అంటారు.

కాణాదులు, కపిలురు, కాపాలికులవంటివారి మతాలు కుతర్కాలతో నిండి ఉంటాయి. అవి నశించేటట్లు గ్రంథాలను అనుగ్రహించిన పిళ్ళైలోకాచార్యుల శ్రీసూక్తులను ఆభరణంగా కల్గిన యతిరాజులను కీర్తించే మణవాళమహామునుల శ్రీపాదాలను అభిమానించని మానవులను దెయ్యాలని పెద్దలు అంటారు.

**47. ఎన్ పరమకారుణికన్ ఎతిరాశన్ ఎన్ఱిఱైఞ్జి**
**అన్బరుయ ఉలకారియన్ అరుళ్ వశనపూడణత్తై**
**మున్బరుళి నమక్కురైత్త మూర్త్తి మణవాళముని**
**పొన్బఱ్ఱాన్తిరువడియై ప్పోఱ్ఱుమవర్ పుకలెమక్కే**

**"ఎన్ పరమకారుణికన్ ఎతిరాశన్"** = మా పరమకారుణికులు యతిరాజులు, ఎన్ఱు ఇఱైఞ్జి = అని ప్రార్థించి, అన్బర్ ఉయ = భక్తులు ఉజ్జీవించేటట్లుగా, ఉలకారియన్ అరుళ్ = పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించే, వశన పూడణత్తై = శ్రీవచనభూషణాన్ని, మున్బు = పూర్వం, అరుళి = అనుగ్రహించి, నమక్కు ఉరైత్త = మనకోసం వ్యాఖ్యానించిన, మూర్త్తి = దివ్యమంగళవిగ్రహాన్ని కల, మణవాళ ముని = మణవాళ మహామునుల, పొన్ పఱ్ఱు ఆమ్ తిరువడియై = బంగారు తామరలవంటి శ్రీచరణాలను, పోఱ్ఱుమవర్ = మంగళాశాసనం చేసేవారు, ఎమక్కు పుకల్ = మాకు శరణం.

"మా పరమకారుణికులైన భగవద్రామానుజులు" అని ప్రార్థించి, భక్తులు ఉజ్జీవించడంకోసం లోకాచార్యులు అనుగ్రహించిన శ్రీవచనభూషణం అనే గ్రంథాన్ని మనకు వివరించి అనుగ్రహించిన మణవాళమహామునుల బంగారు తామరలవంటి పాదాలను కీర్తించేవారు మాకు శరణం కాగలరు.

**48. మక్కళ్ ఇఱై పిఱవి కురు మాతా పితా మాదర్ తనమ్**
**తక్క కతి శరణెల్లామ్ తమక్కు ఎతిరాశనెన్ఱు**
**మిక్కడైన్ద వైయకురు మెయ్ క్కలైయై వివరిక్కుమ్**
**ముక్కియ శీర్ మణవాళ ముని మొళ్రియిల్ మూళ్రకినమే**

మక్కళ్ = సంతానం, ఇఱై = దైవం, పిఱవి = ఉన్నతమైన జన్మ, కురు = గురువు, మాతా పితా = తల్లి తండ్రి, మాతర్ = స్త్రీలు (భార్యలు) తనమ్ = ధనం, తక్క కతి = తగిన గతి, శరణ్ = శరణం, ఎల్లామ్ = అన్నీ, తమక్కు = తమకు, ఎతిరాశన్ ఎన్ఱు = యతిరాజులే అని, మిక్కు అడైన్ద = గొప్పగా ఆశ్రయించిన, వైయ కురు = పిళ్ళైలోకాచార్యులవారి, మెయ్ కలైయై = సత్యమైన విషయాలను ప్రతిపాదించే గ్రంథాలను, వివరిక్కుమ్ = వివరించే, ముక్కియ శీర్ = గొప్ప కళ్యాణగుణాలను కల, మణవాళ ముని = మణవాళ మహామునుల మొళ్రియిల్ = శ్రీసూక్తులలో, మూళ్రకినమే= అవగాహించాము కదా! ఆహా!

సంతానం, దైవం, ఆచార్యుడు, తల్లి, తండ్రి, భార్య, సంపద, తగిన మార్గం, శరణం – అన్ని తమకు భగవద్రామానుజులే అని భావించి, వారిని ఆశ్రయించిన లోకాచార్యులు అనుగ్రహించిన గ్రంథాలను వివరించే గొప్ప గుణాన్ని కల మణవాళ మహామునుల శ్రీసూక్తులలో మనం మగ్నులమయ్యాము.

**49. ఇన మేదుమ్ ఇల్లామల్ ఇలకుమ్ ఇరామానుశనై**
**తిన మేత్తి వైయకురు తిరుత్తమ్బి శెయ్ కలైయై**
**మన మేత్తి విరిత్తరుళుమ్ మణవాళ మామునియై**
**త్తిన మేవుమ్ అడియార్క్కు త్తర మఱిన్దు మేవుమినే**

ఇనమ్ ఏతుమ్ = సాటి ఏదీ, ఇల్లామల్ = లేకుండా, ఇలకుమ్ = వెలిగే, ఇరామానుశనై = శ్రీరామానుజులను, తినమ్ ఏత్తి = ప్రతిదినం స్తుతించే, వైయ కురు = శ్రీపిళ్ళైలోకాచార్యులవారి, తిరుత్తమ్బి = తమ్ములు, అழ்కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్, శెయ్ కలైయై = అనుగ్రహించిన గ్రంథాలను, మనమ్ ఏత్తి = మనస్సులో కీర్తించి, విరిత్తు అరుళుమ్ = వివరించే, మణవాళ మహామునియై = మణవాళ మహామునులను, తినమ్ మేవుమ్ = నిత్యం సేవించే, అడియార్క్కు = దాసులకు, తరమ్ అఱిన్దు = వారి వైలక్షణ్యాన్ని తెలిసి, మేవుమినే = ఆదరించండి.

తక్కువదనం ఏమీ లేకుండా ఉండే శ్రీరామానుజులను ప్రతిదినం స్తుతించే లోకాచార్యుల అనుజులైన అழ்కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన సూక్తులను మనస్సులో ధరించి, వ్యాఖ్యానించే మణవాళమహామునులను సేవించే దాసుల గొప్పతనాన్ని తెలిసి, వారిని ఆశ్రయించండి.

**50. మేవి ఎతిరాశనైయే మెయ్ ప్పొరుళై చ్చురుక్కాక**
**త్తావిత్త విళాఞ్జోలైప్పిళ్ళై తరత్తనిమొழிయై**
**ప్పావిత్త మణవాళ మామునివన్ పదఙ్గళైయే**
**శేవిత్త తిరువాళర్ శెకత్తు క్కోర్ శెழுమ్ పూణే**

ఎతిరాశనైయే మేవి = భగవద్రామానుజులనే ఆశ్రయించి, మెయ్ పొరుళై = యథార్థతత్త్వాన్ని, శురుక్కాక = సంగ్రహంగా, తావిత్త = స్థాపించిన, విళాఞ్జోలైప్పిళై = విళాఞ్జోలైప్పిళ్ళై అనుగ్రహించిన, తర త్తని మొழிయై = వైలక్షణ్యాన్ని కల, అద్వితీయమైన సూక్తి అయిన సప్తగాథను, పావిత్త = భావించిన మణవాళ మాముని = మణవాళ మహామునుల, వన్ పదఙ్గళైయే =గొప్ప శ్రీచరణాలనే, శేవిత్త = సేవించిన, తిరువాళర్ = సంపదను కలవారు, శెకత్తుక్కు = లోకానికి, ఓర్ = నిబిడమైన (అద్వితీయమైన) శెழுమ్ పూణే = గొప్ప ఆభరణమే.

భగవద్రామానుజుల శ్రీపాదాలనే ఆశ్రయించి, యథార్థతత్త్వాన్ని చాలా సంగ్రహంగా విళాఞ్జోలైప్పిళ్ళై సప్తగాథ అనే గ్రంథంలో అనుగ్రహించిన అర్థాలను వ్యాఖ్యానించే మణవాళ మహామునుల శ్రీపాదాలను సేవించేవారు లోకానికే గొప్ప అలంకారాలవలె ప్రకాశిస్తారు.

**51. పూణూలుమ్ ముక్కోలుమ్ పునై శికైయుమ్ తువరుడైయుమ్**
**శేణూర్త్తువ పుణ్డరముమ్ శేర్న్ద ఎతిశేకరన్ మున్**
**నాళ్ నూఱ్ఱ్రుదినిరుపదాణ్డు నాన్మఱైయై నోక్కి ప్పిన్**
**కాణూలతి వరవరనాయ్ క్కాత్తళిత్తాన్ తమిழ்కలైయే**

పూణూలుమ్ = యజ్ఞోపవీతాన్ని, ముక్కోలుమ్ = త్రిదండాన్ని, పునై శికైయుమ్= ముడివేయబడ్డ శిఖను, తువరుడైయమ్ = కాషాయాంబరాన్ని, శేణ్ ఊర్త్తువ పుణ్డరముమ్ = దీర్ఘమైన (ఉన్నతమైన)

ఊర్ధ్వపుండ్రాన్ని, శేర్న్ద = కల్గిన, ఎతిశేకరన్ = యతిరాజులు, మున్ = పూర్వం, నూఱ్ఱదిన్ ఇరుపదు ఆణ్డు నాళ్ = నూట ఇరవై సంవత్సరాల కాలం, నాల్ మఱైయై నోక్కి = చతుర్వేదాలను కాపాడి, ప్పిన్ కాణ్ = తరువాత కదా, నూలతి = శాస్త్రగ్రంథాలను తెలిసిన, వరవరనాయ్ = మణవాళ మహామునులై, తమిళ్ కలైయే= ద్రావిడప్రబంధాలను, కాత్తు అళిత్తాన్ = రక్షించారు.

యజ్ఞోపవీతం, త్రిదండం, అందమైన శిఖ, కాషాయాంబరం, ఊర్ధ్వపుండ్రం కల యతిరాజులు పూర్వం నూటఇరవై సంవత్సరాలకాలం వేంచేసి ఉండి, సంస్కృత వేదాలను రక్షించి, తరువాత, శాస్త్రాలను అభ్యసించి, తెలిసిన మణవాళ– మహామునులై అవతరించి ద్రావిడవేదాలైన దివ్యసూరుల దివ్యప్రబంధాలను కాపాడారు.

**52. కళైకళెఱ్ఱాక్కరుణైయినాల్ కాత్తరుళుమ్ ఎతిపతియే**
**కళైకణ్ ఎమక్కెన క్కరుతి క్కళిత్త మణవాళముని**
**విళై కఴని అరుట్పయిర్క్కు విరుమ్బుమవర్క్కు అరుమ్పిఱప్పామ్**
**తళై కఴల అరుళల్లాల్ తళర్న్దవర్క్కు ఆర్ తావళమే**

కళైకళ్ ఎఱ్ఱా = కలుపు మొలవని (దోషం లేని), కరుణైయినాల్ = కరుణతో, కాత్తరుళుమ్ = రక్షించే, ఎతిపతియే = యతిపతియే, ఎమక్కు = మాకు, కళై కణ్ = రక్షకుడు, ఎన కరుతి = అని భావించి, కళిత్త = సాత్త్వికాహంకారాన్ని పొందిన, మణవాళ ముని = మణవాళ మహామునులు, విళై = అంకురింపజేసిన, కఴని = సస్యక్షేత్రంలోని, అరుళ్ పయిర్క్కు = కృపాసస్యాన్ని, విరుమ్బుమవర్క్కు = ఆశించేవారికి, అరుమ్ = అరుదైన, పిఱప్పామ్ తళై = జన్మ అనే సంకెళ్ళు, కఴల = తొలగాలంటే, అరుళ్ అల్లాల్= వారి కరుణతప్ప, తళర్న్దవర్క్కు = సంసారంలో తాపాన్ని పొందేవారికి, తావళమ్ ఆర్ = శరణు ఎవరు? (ఉపఘ్నం – పట్టుకొమ్మ ఎవరు?)

దోషం లేని కరుణతో మనలను రక్షించే యతిరాజులే మనకు శరణం–అని ఆనందించిన మణవాళ మహామునులు అంకురింపజేసే కృపాసస్యాన్ని కోరేవారికి జన్మ అనే సంకెళ్ళు తొలగడంకోసం వారి కృప తప్ప ఆర్తి చెందినవారికి వేఱు శరణం ఏమి ఉన్నది?

**53. వళ మిక్క ఎతిరాశన్ వణ్మైయినాల్ ఉయ్న్దమైయాల్**
**ఉళ మకిఴుమ్ మణవాళయోకి ఉపదేశత్తాల్**
**ఇళ మదిపోల్ మతి కిళైక్కుమ్ ఇలకు అట్ట తిక్కయజ్గళ్**
**ఉళర్ అవన్దన్ తిరువడియై ఉలకర్ అడైన్దు ఉయ్వదఱ్కే**

వళమ్ మిక్క = మిక్కిలిగా సారాన్ని కల, ఎతిరాశన్ = యతిరాజుల, వణ్మైయినాల్ = ఔదార్యంవల్ల, ఉయ్న్దమైయాల్ = ఉజ్జీవించినందువల్ల, ఉళ మకిఴుమ్= మనస్సులో సంతోషించే, మణవాళ యోకి = మణవాళ మహామునుల, ఉపదేశత్తాల్ = ఉపదేశంవల్ల, ఇళ మతిపోల్ = బాలచంద్రునివలె, మతి కిళైక్కుమ్ = బుద్ధి శాఖోప శాఖలుగా వృద్ధి చెందుతుంది. ఇలకు = ప్రకాశించే, అట్ట తిక్కయజ్గళ్ = అష్టదిగ్గజాలనే విద్వాంసులు, అవన్తన్ తిరువడియై = ఆ మణవాళమహామునుల శ్రీచరణాలను, ఉలకర్ = లోకులు, అడైన్దు = ఆశ్రయించి, ఉయ్వదఱ్కు = ఉజ్జీవించడంకోసం ఉళర్ = ఉన్నారు.

మిక్కిలి సారాన్ని కల యతిరాజుల ఔదార్యగుణంవల్ల ఔన్నత్యాన్ని పొంది, మనస్సులో సంతోషించే మణవాళమహామునుల ఉపదేశంచేత చంద్రుడు శుక్లపక్షంలో వర్ధిల్లేటట్లుగా జ్ఞానం వృద్ధి అవుతుంది. లోకులు వారి శ్రీపాదాలను అశ్రయించి, ఉజ్జీవించడంకోసం వారిచేత నియమింపబడ్డ అష్టదిగ్గజాలనబడే శిష్యులు ఉన్నారు.

**54. తర్క్కత్తాల్ వేణ్డిన్ఱై త్తాపిక్క చ్చెరుక్కిరుక్క**
**ముఱ్ఱురుక్కళ్ ఉపదేశమ్ ముక్కియ మెన త్తెళిన్దు**
**కఱ్ఱు మణవాళముని కాణ్మిన్ ఎతిరాశనవన్**
**నిఱ్ఱ మఱ్ఱోర్ కఱ్పిత్త నిలై నమక్కు వేణ్డామే**

తర్క్కత్తాల్ = తర్కబలంతో, వేణ్డిన్ఱై = తాము కోరినదానిని, తాపిక్క = స్థాపించడానికి తగిన, శెరుక్కు ఇరుక్క = బలం ఉన్నా, మున్ కురుక్కళ్ = పూర్వాచార్యులు, ఉపదేశమ్ = ఉపదేశాలు, ముక్కియమ్ ఎన తెళిన్దు = ముఖ్యం అని తెలిసికొని, కఱ్ఱుమ్ = అభ్యసించే, మణవాళముని = మణవాళమహామునులు, ఎతిరాశన్ కాణ్మిన్ = యతిరాజులే సుమా!, అవన్ నిఱ్ఱ = ఆ మణవాళమహామునులు ఉండగా, మఱ్ఱోర్ కఱ్పిత్త = ఇతరులు కల్పించిన, నిలై = స్థితి, నమక్కు వేణ్డామ్ = మనకు వద్దు.

తర్కంతో మనకు అభిలషితాలైన అర్థాలను స్థాపించడానికి తగిన శక్తి ఉన్నా, పూర్వులైన మన ఆచార్యులు ఉపదేశించినవే మనకు ముఖ్యం అని తెలిసి, అభ్యసించినవారు మణవాళమామునులు. యతిరాజుల అపరావతారం అయిన వారు మనకు ఉపదేశించిన మార్గం తప్ప వేరు దారులు ఏవీ వద్దు.

**55. వేణ్డామల్ వెఱుమ్ పులవర్ వీఝ్ పొరుళై మేలైయర్ శొల్**
**తాణ్డాత ఎతిరాశన్‌తాళ్ వణఙ్గుమ్ వరయోకి**
**శేణ్ తామరైత్తాళ్‌కళ్ శెన్నిక్కోర్ మణిముడియాయ్**
**పూణ్డార్క్కు ప్పూముడియుమ్ పొన్ ముడియుమ్ పరమామో**

వెఱుమ్ పులవర్ = వ్యర్థమైన పాండిత్యాన్ని కలవారు కోరే (యథార్థ తత్త్వాన్ని తెలియని పండితులు), వీఝ్ = పతనం చెందే (వ్యర్థమైన), పొరుళై = నశ్వరాలైన సుఖాలను, వేణ్డామల్ = కోరకుండా, మేలైయర్ శొల్ = పూర్వుల సూక్తిని, తాణ్డాత = అతిక్రమించని (దాటని), ఎతిరాశన్ = యతిరాజుల, తాళ్ = శ్రీచరణాలను, వణఙ్గుమ్= నమస్కరించే, వరయోకి= మణవాళమహామునుల, శేణ్ తామరై త్తాళ్‌కళ్ = ఉన్నతాలైన (గొప్ప) తామరలవంటి పాదాలను, శెన్నిక్కు = శిరస్సుకు, ఓర్ మణి ముడియాయ్ = అద్వితీయమైన రత్నకిరీటంగా, పూణ్డార్క్కు = ధరించినవారికి, పూ ముడియుమ్ = పూలతో కూర్చిన కిరీటం, పొన్ ముడియుమ్ = బంగారు కిరీటం, పరమ్ ఆమో = గొప్ప అవుతుందా?

జిగీషువులైన పండితులు కోరే నశ్వరాలైన విషయాలను కోరకుండా, పూర్వాచార్యులు పల్కిన పల్కులను అతిక్రమించనివారైన యతిరాజుల శ్రీపాదాలను నమస్కరించే మణవాళమహామునుల పాదపద్మాలను తమ శిరస్సుకు మణికిరీటంగా గ్రహించినవారికి బంగారంతో చేసిన కిరీటం, పూలతో కూర్చిన కిరీటం ఒక విషయం అవుతాయా?

**56. "మా మేకమ్" ఎన వణ్మై ఇళైయాళ్వారై త్తుదిత్తే**
**తామ్ ఏకశిన్దైయనాయ్ త్తరిత్త వరవరమునియై**
**నామేతు నణ్ణువ తెన్ఱు అకలాదే నఱ్పడియే**
**యామేవి వణఙ్గుదుమ్ వా నఱ్ఱినత్తాల్ నన్నెఞ్జే!**

నల్ నెఞ్జే = ఓ మంచి మనసా! మామ్ ఏకమ్ = నన్ను ఒకడినే శరణు వేడు, ఎన వణ్మై = అనే ఔదార్యాన్ని కల, ఇళైయాళ్వారై = శ్రీరామానుజులను, తుతిత్తే = స్తుతించే, తామ్ ఏకశిన్దైయనాయ్ = తాము తదేకచింతను కలవారై, తరిత్త = మనస్సులో ధరించిన, వరవరమునియై = వరవరమునులను, నామ్ నణ్ణువతు ఏతు = మనం దరిచేరడం ఏమి?, ఎన్ఱు = అని, అకలాతే = దూరం కాకుండా (తొలగి పోకుండా), నల్ పడియే = చక్కని రీతిలో, యామ్ మేవి = మనం ఆశపడి, నల్ దినత్తాల్ = మంచి దినంలో, వణఙ్గుదుమ్ = నమస్కరిద్దాం, వా = రా.

ఇందులో తమ మనస్సును ఉద్బోధించడంద్వారా కవి లోకులను ఉపదేశిస్తున్నారు.

**"నేనే శరణం"** అన్న ఔదార్యాన్ని కల్గిన శ్రీరామానుజులను (శ్రీకృష్ణుని) స్తుతించి, తదేకచింతలో ధరిస్తున్న మణవాళమహామునులను చేరడానికి మనకు ఏమి యోగ్యత ఉన్నది? అని తలచి విడువకుండా చక్కని రీతిలో ఆశ్రయించి నమస్కరిద్దాం – ఓ నా మనసా! రా !

**57. నన్నకరామ్ పుతూర్క్కోన్ నల ముఱైక్కుమ్ మణవాళన్**
**పొన్నడియామ్ శఙ్గమల ప్పోదుకళై క్కనవిలుమ్ నామ్**
**శెన్నియిల్ శూట్ట వరుమ్ శేమ మెల్లామ్ ఆకిలుమ్ నామ్**
**మన్నియిడ వరై శుమన్దు మఱుమైయిలుమ్ మాయోమే**

నన్నకరామ్ = గొప్ప నగరం అయిన, పుతూర్ = శ్రీపెరుమ్బూదూర్‌కు, కోన్ = నాయకులైన శ్రీరామానుజుల, నలమ్ = కళ్యాణగుణాలనుగూర్చి, ఉరైక్కుమ్ = వివరించే, మణవాళన్ = మణవాళ మహామునుల, పొన్నడియామ్ శఙ్గమల ప్పోదుకళై = బంగారు పాదపద్మాలను, కనవిలుమ్ = కలలో కూడా, నామ్ = మనం, శెన్నియిల్ శూట్ట = శిరస్సులో అలంకరించుకొంటే, శేమమ్ ఎల్లామ్ వరుమ్ = మనకు క్షేమం అంతా కల్గుతుంది, ఆకిలుమ్ = అయినా, నామ్ = మనం, మన్ని యిడ = మన్నికగా, స్థిరంగా ఉండేటట్లుగా, వరై = (పాపాలనే) కొండలను,శుమైన్దు = మోసి, మఱుమైయిలుమ్ = (ఇహలోకంలోనే కాక) పరలోకంలో కూడా, మాయోమే = నశించిపోతున్నామే, అయ్యో!).

గొప్ప నగరం అయిన శ్రీపెరుమ్బూదూర్‌లో అవతరించిన యతిరాజుల గుణాలనే పలికే మణవాళ మహామునుల **"పొన్నడియామ్ శెఙ్గమలమ్"** అని వ్యవహరింపబడే శ్రీపాదాలను కలలో అయినా మన తలకు అలంకరించుకొంటే, మనకు అన్ని విధాలైన క్షేమాలు కలుగుతాయి. అయినా, మనం కొండలు కొండలుగా పాపాలను చేస్తూ భరిస్తూ, ఈ జన్మలోనే కాకుండా, మఱుజన్మలో కూడా ఉజ్జీవనం పొందకుండా పోతున్నామే (అయ్యో)

**58. మెయ్యన్ ఎతిరాశనైయే మేవు మణవాళముని**
**శెయ్య తిరువడిప్పోదై చ్చెన్నియినాల్ తరిత్తదనిన్**
**మొయ్య శెళ్ళున్దుకళాడి మోన్దిదయత్తళ్ళుత్తిట్టాల్**
**ఉయ్య వకై తేడి నమక్కు ఉళమ్ తుళజ్గవేణ్డావే**

మెయ్యన్ = యథార్థవాది అయిన, ఎతిరాశనైయే = యతిరాజులనే, మేవుమ్ = ఆశపడే, మణవాళముని = మణవాళమహామునుల, శెయ్య = అందమైన, ఎఱ్ఱని, తిరు అడి ప్పోదై = శ్రీచరణసుమాన్ని, శెన్నియినాల్ = శిరస్సుతో, తరిత్తు = ధరించి, అతనిన్ = ఆ పద్మంయొక్క, మొయ్య = అందమైన, శెళ్ళుమ్ = దట్టమైన, తుకళ్ ఆడి = రజస్సులో అవగాహించి, మోన్దు = ఆఘ్రాణించి, ఇదయత్తు = హృదయంలో, అళ్ళుత్తిట్టాల్ = పూసికొంటే, నమక్కు = మనకోసం, ఉయ్య వకై = ఉజ్జీవించే రీతిని, తేడి = వెదకి, ఉళమ్ తుళజ్గ వేణ్డావే = మనస్సులో బాధపడనక్కరలేదుకదా!

సత్యస్వరూపులైన యతిరాజులను ఆశ్రయించే మణవాళ మహామునుల ఎఱ్ఱని శ్రీపాదపద్మాలను శిరస్సుతో ధరించి, దాని రజస్సును ఆఘ్రాణించి, హృదయంలో ధరిస్తే, మనం ఉజ్జీవించడానికి వేఱే దారి వెదకి మనస్సులో బాధపడనక్కఱలేదుకదా!

**59. తుళజ్గామల్ ఎతిపతియై తుదిక్కుమ్ మణవాళముని**
**ఉళజ్గాలుమ్ శెజ్గమల ఉళ్ళితళ్ళోల్ తిరువిరలుమ్**
**విళజ్గవై మేల్ వెణ్ ముళైపోల్ ఇలకు తిరుమ్ పుఱన్తళిర్పోల్**
**వళజ్గాట్టుమ్ పుఱజ్గాలుమ్ వన్దడియేన్ మనత్తుళవే**

తుళజ్గామల్ = విడువకుండా, ఎతిపతియై = యతిరాజులను, తుతిక్కుమ్ = స్తుతించే, మణవాళముని = మణవాళమహామునులయొక్క, ఉళజ్గాలుమ్ = అరికాళ్ళు(అనే), శెమ్ కమల ఉళ్ ఇతళ్ పోల్ = ఎఱ్ఱ తామరలోని రేకులవలె ఉండే, తిరు విరలుమ్ = కాలి వేళ్ళు, విళజ్గ = వెలుగగా, అవై మేల్ = వాటిపై, వెణ్ ముళై పోల్ = తెల్లని అంకురాలవలె (మొగ్గలవలె), ఇలకు ఉకిరుమ్ = ప్రకాశించే నఖాలు, పుఱమ్ తళిర్ పోల్ = బయట ఉండే చిగుళ్ళవలె, వళమ్ కాట్టుమ్ = అందాన్ని చూపే, పుఱమ్ కాలుమ్ = బయటి పాదాలు, వన్దు = వచ్చి, అడియేన్ మనత్తు ఉళవే = దాసుని మనస్సులో ఉన్నాయి.

చక్కగా యతిరాజులను స్తుతించే మణవాళమహామునుల అరికాళ్ళు ఎఱ్ఱ తామరలవలె, లోపల గల రేకులవలె వేళ్ళు ప్రకాశించగా, వానిపై తెల్లగా ఉండే మొగ్గలవలె నఖాలు వెలుగగా, బయటి చిగుళ్ళవలె బయటి పాదాలు ప్రకాశిస్తూ దాసుని మనస్సులో ప్రవేశించాయి.

**60. తుళవముడన్ మణివడముమ్ తోన్రు తిరుప్పవిత్తిరముమ్**
**వళ పురునూలుడన్ తరిత్తు వాళ్ ఎతిరాశనై వణజ్గు**
**కళప మెన త్తికళ్ళుమ్ వరయోగి తిరుక్కణైక్కాలిన్**
**వళమదణి పుఱవడిపోల్ వాళ్ణ్దిదు మెన్ మళ్లై మదియే**

తుళవ ముడన్ మణి వడముమ్ = తులసీమాలతోపాటు, తామరపూసలమాల, తోన్ఱు = ప్రకాశించే, తిరు ప్పవిత్తిరముమ్ = పవిత్రాన్ని, వళ పురి నూలుడన్ = దీర్ఘమైన యజ్ఞోపవీతంతో పాటు, తరిత్తు = ధరించి, వాళ్ఱ్ = విజయంతో వర్ధిల్లే, ఎతిరాశనై = యతిరాజులను, వణఙ్గు= నమస్కరించే, కళపమ్ ఎన = కలభంవలె, (గున్న ఏనుగు వలె), తికళ్ళుమ్ = ప్రకాశించే, వరయోగి = శ్రీమణవాళ మహామునుల, పుఱ అడి = బయటి పాదాలవలె, తిరు క్కణైక్కాలిన్ = ముంగాళ్ళయొక్క, వళమ్ అదు అణి = గుండ్రని అద్వితీయమైన ఆభరణంవంటి, ఎన్ మఱ్ఱై మతియే = నా చల్లని ఆర్ద్రమైన మనస్సు, వాళ్ఱ్న్దిడుమ్ = ఉజ్జీవించాలి.

తులసీమాలను, తామరపూసల మాలను, పవిత్రాలను, వెలిగే తెల్లని యజ్ఞోపవీతాన్ని ధరించి ప్రకాశించే యతిరాజులను నమస్కరించే గజంవంటి మణవాళ మహామునుల పిక్కలకు గుండ్రని ఆభరణంవలె ప్రకాశించే నా మనస్సు ఉజ్జీవించాలి.

**61. మళ్ళుఙ్గాత ఎతిరాశన్ వాయ్ మడుత్త శేడమల్లాల్**
**విళ్ళుఙ్గాద మణవాళమామునియిన్ విళ్ళుప్పుముడై**
**ముళ్ళఙ్గాలై శిన్దిత్తు ముప్పొళ్ళుదుమ్ వినై ప్పిఱవిక్కు**
**ఇళ్ళుఙ్గాదు మిల్లామల్ ఎళ్ల క్కిళ్ళి ప్పొకట్టేనే**

మళ్ళుఙ్గాద = మొక్కపోని జ్ఞానాన్ని కల, ఎతిరాశన్ = శ్రీరామానుజులు, వాయ్ మడుత్త = ఆరగించిన, శేడమ్ అల్లాల్ = ప్రసాదశేషం తప్ప, దేనినీ, విళ్ళుఙ్గాద = భుజించని, మణవాళ మామునియిన్ = మణవాళ మహామునులయొక్క, విళ్ళుప్పుముడై = అతిశయాన్ని కల, ముళ్ళఙ్గాలై = ముంగాళ్ళను, ముప్పొళ్ళుతుమ్ = మూడు వేళల, శిన్దిత్తు = చింతించి, వినై ప్పిఱవిక్కు = కర్మవల్ల కల్గిన జన్మను, ఎళ్ల ఇళ్ళుఙ్గు ఆతుమ్ ఇల్లామల్ = పునరావృత్తి లేకుండా, వృద్ధి చెందే అవకాశం ఏమీ లేకుండా, కిళ్ళి ప్పొకట్టేన్ = గిల్లి పారవేశాను.

కొఱతలేని జ్ఞానాన్ని కల యతిరాజులు ఆరగించి విడచిన ప్రసాదశేషం తప్ప వేఱు దేనినీ భుజించని మణవాళమహామునుల ముంగాళ్ళను మూడు పొద్దులలో మనస్సులో ధరించి, నా కర్మ జన్మకు ఇక చోటు ఏమీ లేనివిధంగా గిల్లి పారవేశాను.

**62. కట్టేదు ఎమక్కు ఇనిమేల్ కామఱుశీర్ ఎతిరాశన్**
**మట్టేదు మిల్ శీరిన్ మన్ను వరయోగి తువర్ పా**
**పట్టే శూళ్ఱ్ తిరుత్తుడైయై ప్పలకాలుమ్ నినైన్దల్లాల్**
**విట్టేశుమ్ పిఱర్ శిరిప్ప వాయ్ వెరువ ప్పెఱ్ఱననే**

కామఱు శీర్ ఎతిరాశన్ = అందమైన, అభిలషించదగిన కల్యాణగుణాలను కల యతిరాజుల, మట్టు ఏదుమ్ ఇల్ = అవధి లేని, శీరిన్ = గుణాలలో, మన్ను = స్థిరంగా ఉండే (అభినివేశాన్ని కల్గి ఉండే), వరయోగి తువర్ పా పట్టే = మణవాళ మహామునుల పట్టు కాషాయాంబరం, శూళ్ఱ్ = చుట్టి ఉండే, తిరు త్తుడైయై = ఊరువులను, పల కాలుమ్ నినైన్దు అల్లాల్ = పలుమార్లు భావించడం తప్ప, విట్టు ఏశుమ్ = నిందించే, పిఱర్ = ఇతరులు, శిరిప్ప = నవ్వేటట్లు, వాయ్ వెరువ పెఱ్ఱననే = నోటితో వదరేటట్లు చేస్తానా! ఇని మేల్ = ఇక, ఎమక్కు = మనకు, కట్టు ఏతు = అవధి ఏమున్నది?

కోరదగిన గుణాలను కల యతిరాజుల అంతు లేని కల్యాణగుణాలలో అభినివేశాన్ని పొందే మణవాళమహామునుల కాషాయవస్త్రం అలంకరించుకొన్న ఊరువులను పలుమార్లు భావించడం తప్ప, ఇతరులు నన్ను పరిహసించి, దూషించి, నోటికి వచ్చినట్లు పలుకనిస్తానా?

**63. పెఱ్ఱ్రిమైయోన్ ఎతిపతియై ప్పేణుమ్ మణవాళమామునిక్కు**
**అఱ్ఱు ఇమైయాదిరున్దు అడియేన్ అవన్ ఉదరబన్దనత్తై**
**ప్పఱ్ఱియల్ మిక నోక్కమ్ పఱ్ఱి తలై క్కొణ్డ పిన్నాల్**
**మఱ్ఱిమైయోర్ ఆట్చితనిన్ మనమ్ మన్ని మాన్దేనే**

పెఱ్ఱ్రిమైయోన్ = గొప్పతనాన్ని కల, ఎతిపతియై = యతిరాజులను పేణుమ్= ఆదరించే, మణవాళ మామునిక్కు = మణవాళమహామునులకు, అఱ్ఱు ఇమైయాదిరున్దు= శేషభూతుడనై, సదా స్మరిస్తూ, అడియేన్= దాసుడనైన నేను, అవన్ ఉదరబన్దనత్తై పఱ్ఱి = ఆ యతిరాజుల ఉదరబంధాన్నిగూర్చి, ఇయల్ మిక నోక్కమ్ పఱ్ఱి = పొందికగా నిలచి ఉండే ఆశతో కూడిన దృష్టిని, తలైక్కొణ్డ పిన్నాల్ = కల్గి ఉన్న తరువాత, మఱ్ఱు = ఇక, ఇమైయోర్ ఆట్చితనిన్ = దేవతల సార్వభౌమత్వంలో, మనమ్ మన్ని మాన్దేనే = మనస్సును స్థిరంగా ఉన్నవాడనై నశించను, బాధపడను.

ఉన్నతులైన యతిరాజులనే కోరే మణవాళమహామునులకే దాసుడనై, నేను వారి ఉదరబంధం అనే తిరువాభరణాన్ని నిలకడగా నిలచి ఉండే, ఆసక్తితో కూడిన చూపుతో దర్శించిన తరువాత, ఇక దేవతలకు ప్రభువై ఉండడాన్ని కూడా నా మనస్సులో తలవను.

**64. మాన్దర్ ఇరామానుశర్క్కే మన మురుకి మఱ్ఱఱియా**
**కాన్ద మణవాళముని కమల మణిత్తుళవవడమ్**
**శేర్న్ద తిరుప్పవిత్తరముమ్ శెపమయమే పురినూలుమ్**
**శేర్న్ద తిరుమార్బుమ్ ఎఙ్గనమ్ నాన్ మఱప్పదువే**

మాన్దర్ = మానవరూపులైన, ఇరామానుశర్క్కే = శ్రీరామానుజులకే, మనమ్ ఉరుకి = మనస్సు కఱగి, మఱ్ఱు అఱియా = వేఱెవ్వరినీ తెలియని, కాన్ద మణవాళ మహాముని = సుందరరమ్యజా మాతృమునియొక్క, కమల మణి త్తుళవ వడమ్ = తామరపూసల మాలను, తులసిపూసల మాల, శేర్న్ద = చేరికను (పొందికను) కల, తిరు ప్పవిత్తరముమ్ = అందమైన పవిత్రం, శెప మయమే పురి నూలుమ్ = యజ్ఞోపవీతం అనే ఇవి, శేర్న్దు అకన్ఱ = చేరి ఉండే, విశాలమైన, తిరు మార్బుమ్ = వక్షఃస్థలాన్ని, ఎఙ్గనమ్ తాన్ మఱప్పతువే = ఏవిధంగా మఱువగలను?

శ్రీరామానుజులనే తలచి, మనస్సు ద్రవించి వేఱు దేనినీ తెలియనివారైన మణవాళమహాముల తామరపూసల మాల, తులసీమాలతో చేరిన పవిత్రం, జపమాల తెల్లని యజ్ఞోపవీతం – ఇవన్నీ చేరి, విశాలంగా ప్రకాశించే వక్షఃస్థలాన్ని నేను ఏవిధంగా విస్మరించగలను?

**65. మఱ మఱియా ఎతిపతియై మఱవాద వరయోకి**
**అఱ ముక్షైయుమ్ ముక్కోలుమ్ అఞ్జలియుమ్ తికళ్ తిరుక్కై**

**త్తిఱ మతిన్దు దినన్దినముమ్ శిన్దిత్తు త్తేఱిన పిన్**
**అఱ ముఱుకుమ్ ఇప్పువియిల్ అడిక్కొదిప్పై అడైన్దోమే**

మఱమ్ అఱియా = కాఠిన్యాన్ని, కోపాన్ని తెలియని, ఎతిపతియై = యతి పతులను, మఱవాత = మఱచి పోని, వరయోకి = వరవరమునులయొక్క, అఱమ్ ఉఱైయుమ్ = ధర్మం నిలచి ఉండే, ముక్కోలుమ్= త్రిదండం, అఙ్జలియుమ్ = అంజలి, తికళ్గ్ = ప్రకాశించే, తిరు క్కై = శ్రీహస్తాల, తిఱమ్ = తీరును (అందాన్ని), అఱిన్దు = తెలిసి, దినమ్ దినముమ్ = ప్రతిదినం, శిన్దిత్తు = భావించి, తేఱిన పిన్ = స్ఫుటంగా మనస్సులో తేటపడిన తరువాత, అఱమ్ ఉఱుకుమ్ = ధర్మం క్షీణించే ఇప్పువియిల్ = ఈ భూమిలో ఉండడంవల్ల, అడి కొదిప్పై = కాలు కాలిన స్థితిని, అడైన్దోమే = పొందామే!

అధర్మాన్ని తెలియనివారైన యతిరాజులను మఱువని మణవాళమహామునుల ధర్మమే మూర్తీభవించిన త్రిదండం, అంజలిముద్ర– వీటితో ప్రకాశించే శ్రీహస్తాల అందాన్ని ప్రతిదినం భావించి తెలిసిన తర్వాత, ధర్మం క్షీణించే ఈ భూమిలో ఉండడం కాలు కాలినట్లుగా అసహ్యంగా ఉన్నది.

**66. అడైయాళమాయ్ అముదమ్ అక్కిణగ్గ్రీల్ శుమన్దాళ్గుమ్**
**పడైయానై ఎతిపతియై ఉళ్ళు మణవాళముని**
**కిడైయాద వలమ్బురిపోల్ కిళరొళి శేర్ తిరుక్కళ్గుత్తై**
**నడైయాక నినైన్దురుకి నల్లవర్క్కాట్పట్టోమే.**

అడైయాళమాయ్ = తాము వింధ్యారణ్యంనుండి కంచికి చేరడంలో సూచక మైనది అయిన, అక్కిణగ్గ్రీల్ = ఆ శాలక్కిణఱునుండి, అముదమ్ = తిరువారాధన తీర్థాన్ని, శుమన్దు = మోసికొని, ఆళ్గుమ్ = (భగవానుని కల్యాణగుణాలలో) అవగాహించే, పడై యానై = పట్టపుటేనుగువంటివారైన, ఎతిపతియై = యతిరాజులను, ఉళ్ళు = మనస్సులో ఆరాధించే, మణవాళ ముని = మణవాళమహామునులయొక్క, కిడైయాత= అలభ్యమైన (అపూర్వమైన), వలమ్బురిపోల్ = దక్షిణావర్తశంఖంవంటిది, కిళర్ ఒళి శేర్ = వృద్ధిచెందే కాంతిని కల్గినది అయిన, కళ్గుత్తై = కంఠాన్ని, నడైయాక నినైన్దు = నడక (జీవనయాత్ర)గా తలచి, ఉరుకి = మనస్సులో ద్రవించి, నల్లవర్క్కు = ఆ సత్పురుషులకు, ఆళ్పట్టోమే = దాసుణ్ణి అయ్యాను.

తాను కంచికి చేరడానికి సూచకం అయిన **"శాలక్కిణఱు"** నుండి నీటిని మోసికొని పోయి, వరదరాజస్వామికి సేవచేసే యతిరాజులను ఎల్లప్పుడూ సేవించే మణవాళమునుల, పొందదానికి అరుదైన దక్షిణావర్తశంఖంవలె ప్రకాశించే కంఠాన్ని తలచి నీరై, వారికి నేను దాసుడనయ్యాను.

**67. ఆట్పట్ట ఇలక్కుమణర్క్కు అగ్గ్ర మణవాళముని**
**తోట్పడై ఎళ్గుచ్చికళుమ్ తూయ మణక్కుమ్ తిరువాయుమ్**
**శేట్పట్ట తిరుమూక్కుమ్ తిరుక్కాదుమ్ నినైన్దడియేన్**
**కోట్పట్ట శిన్దైయనాయ్ కొదున్దఢైయై త్తూర్త్తేనే**

ఆళ్ పట్ట = (శ్రీరామునకు) దాసుడైన, ఇలక్కుమణర్క్కు = లక్ష్మణునకు, అగ్గ్ర = విధేయుడైన, మణవాళముని = మణవాళ మహామునులయొక్క, తోళ్ = బాహువులలోని, పడై ఎళ్గుచ్చికళుమ్ =

ఆయుధచిహ్నాలైన శంఖచక్రాలను, తూయ = పవిత్రమైన, మణక్కుమ్ = పరిమళించే, తిరు వాయుమ్ = నోటిని, (పెదవిని), శేట్పట్ట = దీర్ఘమైన, ఉన్నతమైన, మూక్కుమ్ = నాసికను, తిరు క్కాదుమ్ = చెవులను, నినైన్దు = భావించి, అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, కోట్పట్ట శిన్దైయనాయ్ = వాటిచే అపహరింపబడ్డ మనస్సును కలవాడనై, కొడుమ్ దశైయై = క్రూరమైన సంసారదశను, తూర్త్తేనే = లేకుండా చేసికొన్నాను.

శ్రీరామునకు దాసుడైన లక్ష్మణుని అవతారం అయిన భగవద్రామానుజులకు దాసులైన మణవాళమహామునుల బాహువులను, ద్వయమంత్రం పరిమళించే వారి ఆస్యాన్ని, దీర్ఘమైన నాసికను, కన్నులను స్మరించి దుఃఖాన్ని కల్గించే క్రూరమైన సంసారస్థితిని లేకుండా చేసికొన్నాను.

**68. తూరాత కాదలుడన్ తువరుడైయ ఎతిరాశన్**
**శీరాదుమ్ శోరామే శిన్దిక్కుమ్ వరయోగి**
**ఆరాద త్తడఙ్కణ్ణ అழగుక్కే తోఱ్ఱు అవన్‌తన్**
**ఆరాదనైక్కు ఇశైన్దడియేన్ ఎన్నినిమేల్ పరన్దిరుక్కే**

తూరాత కాదలుడన్ = ఏనాడూ నశించని భక్తితో, తువరుడైయ = కాషాయాన్ని ధరించిన, ఎతిరాశన్ = శ్రీరామానుజుల, శీర్ ఆతుమ్ శోరామే = కల్యాణగుణాలలో ఏ ఒక్కటిని కూడా విడువకుండా, శిన్దిక్కుమ్ = భావించే, వరయోకి = మణవాళ మహామునుల యొక్క, ఆరాత = (విస్మృతిలో) తృప్తి పొందని, తడమ్ కణ్ణ అழగుక్కే = విశాలమైన తిరునేత్రాల అందానికే, తోఱ్ఱు = ఓడి, అవన్‌తన్ ఆరాతనైక్కు = ఆ మణవాళ మహామునుల ఆరాధనకు, ఇశైన్దు = అంగీకరించి, అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, ఇని మేల్ = ఇకపై, పరన్దిరుక్క ఎన్ = అన్యవిషయాలలో వ్యాపించి ఉండడం ఎందుకు? (అన్యవిషయాసక్తిని కల్గి ఉండడం ఎందుకు?)

అంతు లేని భక్తితో, కాషాయాన్ని ధరించిన యతిరాజుల కల్యాణగుణాలను ఒక్కటికూడా విడువకుండా భావిస్తున్న మణవాళమహామునుల ప్రేమను' ప్రవహించే తిరునేత్రాలకు జితుడనై, వారిని ఆరాధించడానికి అంగీకరించే దాసునకు ఇక వేఱేమి కావాలి?

**69. ఇనియత్తిల్ వేఱుణ్డో ఇళైయాழ்వార్ తిరుప్పుకழாమ్**
**కనియదనిల్ శువడఱిన్దు కవర్న్దుయ్‌న్ద మణవాళ**
**మునియదిపన్ తిరుప్పురువ ముழు క్కరుప్పుచ్చిలై నినైన్దు**
**తనియదొరు పేరిన్బమ్ తழైత్తడియేన్ తழైత్తేనే**

ఇళైయాழ்వార్ = శ్రీరామానుజుల, తిరుప్పుకழாమ్ కనియదనిల్ = కల్యాణ గుణాలు అనే మధుర ఫలంలోని, శువడు అఱిన్దు = రసాన్ని తెలిసికొని, కవర్న్దు = దానిని ఆస్వాదించి, ఉయ్‌న్ద = ఉజ్జీవించిన, మణవాళముని అదిపన్ = మణవాళ మహామునులయొక్క తిరు ప్పురువ ముழு క్కరుప్పు చ్చిలై = పూర్ణమైన చెఱకువింటివంటి కనుబొమలను, నినైన్దు = భావించి, తనియతు = అద్వితీయమైన, ఒరు పేర్ ఇన్బమ్= ఒక గొప్ప ఆనందాన్ని, తழైత్తు = విస్తారంగా అనుభవించి, అడియేన్ = దాసుణ్ణి అయిన నేను, తழైத్తేనే = ఉబ్బి తబ్బిబ్బు అయ్యాను. ఇనియత్తిల్ = మాధుర్యంలో, వేఱు ఉణ్డో=వేఱయినది ఇంకొకటి ఉన్నదా? (లేదు).

లక్ష్మణులైన యతిరాజుల కీర్తి అనే ఫలంయొక్క రుచిని తెలిసి, దానిని గ్రహించిన మణవాళ మహామునులయొక్క చెఱకు విల్లువంటి కనుబొమ్మలను భావించి, అద్వితీయమైన ఆనందాన్ని పొంది దాసుడనైన నేను ఉబ్బితబ్బిబ్బు అయ్యాను. దానికంటె మధురమైనది వేఱొకటి ఉన్నదా?

**70. తఱైత్త పెరుమ్ పొౝ్ఱిల్ పుతూర్ తనినాతన్ తిరువరుళాల్**
**పిఱైత్త మణవాళముని పిఱై యొళియ త్తిరునుదలుమ్**
**కుఱైత్తణిన్ద తిరుమణు మెన్‌కూర్ మదియిల్ తరిత్త పిన్నర్**
**అఱైత్తడియేన్‌తనై యవనే యడిమై తిరుత్తిణ్ణనవే**

తఱైత్త = విస్తరించిన, పెరుమ్ పొౝ్ఱిల్ = పెద్ద పెద్ద పొదలను కల, పుతూర్ = శ్రీపెరుంబూదూరుకు, తని నాతన్ = అద్వితీయనిర్వాహకులు అయిన శ్రీరామానుజుల, తిరు అరుళాల్ = కరుణతో, పిఱైత్త = ఉజ్జీవించిన, మణవాళముని = మణవాళ మహామునుల, పిఱై = అష్టమీచంద్రఖండంవలె, ఒళియ = ప్రకాశించే, తిరు నుదలుమ్= ఫాలభాగాన్ని, కుఱైత్తు అణిన్ద తిరు మణుమ్ = చూర్ణంచేసి అలంకరించుకొన్న ఊర్ధ్వపుండ్రాలను, ఎన్ కూర్ మదియిల్ = నా నిశితమైన బుద్ధిలో, తరిత్త పిన్నర్ = ధరించిన తర్వాత, అవనే = ఆ మణవాళమహామునులే, అడియేన్‌తనై = దాసుణ్ణి అయిన నన్ను, అఱైత్తు = పిలచి, అడిమై తిరుత్తిణ్ణనవే = తమకు నేను దాస్యం చేయడంలో స్థిరంగా నిశ్చయించారు.

తోటలు దట్టంగా కల్గిన శ్రీపెరుమ్బూదూర్‌కు నాథులైన యతిరాజుల కరుణతో ఉజ్జీవనాన్ని పొందిన మణవాళమహామునుల చంద్రకళవంటి నుదురు, అందులో అలంకరింపబడిన తిరుమణ్ కాప్పును నా నిశితమైన బుద్ధిలో ధరించిన తరువాత, వారే దాసుని పిలచి తనకు దాస్యం చేయడంలో నిశ్చయించారు.

**71. తిణ్ణనవే ఎతిరాశన్ శేవడి శేర్ ఆయియిడమ్**
**నణ్ణి నమన్హాశారియ విదయవురై తాన్ కేట్కుమ్**
**అణ్ణల్ మణవాళమునిక్కు అనుదినముమ్ అన్బుడనే**
**వణ్ణమలర్ శాత్తుమవర్ వానవరాయ్ త్తికఝ్వారే**

తిణ్ణనవే = దృఢంగా, ఎతిరాశన్ శే అడి శేర్ = యతిరాజుల ఎఱ్ఱని శ్రీపాదాలను చేరే, ఆయి ఇడమ్ = **"ఆయ్"** అనే పేరును కల జనన్యాచార్యుల వారి సన్నిధిలో, నణ్ణి = ఆశ్రయించి, నమన్హు = నమస్కరించి, ఆశారియవిదయ ఉరైతాన = ఆచార్యహృదయ వ్యాఖ్యానాన్ని, కేట్కుమ్ = వినే, అణ్ణల్ = స్వామి, మణవాళమునిక్కు = మణవాళ మహామునులకు, అనుదినముమ్ = ప్రతిదినం, అన్బుడనే = భక్తితో, వణ్ణ మలర్ శాత్తుమవర్ = రంగు రంగుల పూలు సమర్పించేవారు, వానవరాయ్ తికఝ్వారే= నిత్యసూరులై ప్రకాశిస్తారు.

దృఢంగా యతిరాజుల శ్రీపాదాలను ఆశ్రయించే జనన్యాచార్యులను (ఆయ్) ఆశ్రయించి, వారివద్ద ఆచార్యహృదయంలోని అర్థాన్ని విన్న మహానుభావులైన మణవాళమహామునులకు ప్రతిదినం రంగురంగుల పూలను సమర్పించేవారు పరమపదవాసులుగా ప్రకాశిస్తారు.

**72. వార్ పునల్ శూழ్ పుదూర్మన్ వళ మురైక్కుమ్ ఉలక కురు**
**శీర్వశనపూడణత్తిన్ శెழుమ్ పొరుళై చ్చెక మతియ**
**నీర్మైయుడన్ వియాక్కియైయై నిరుమిత్త వరయోగి**
**కార్ముకిలై ద్దినన్తోఱుమ్ కழల్ పణివార్క్కు ఈడిలైయే**

వార్ పునల్ శూழ్ = ప్రవహించే కొండవాగులచే పరివేష్ఠితం అయిన, పుతూర్ మన్ = శ్రీపెరుంబూదూరుకు ప్రభువు అయిన శ్రీరామానుజుల, వళమ్ ఉరైక్కుమ్ = వృద్ధిని (కీర్తిని) కీర్తించే, ఉలక కురు = శ్రీపిళ్ళై లోకాచార్యులవారి, శీర్ వశన బూడణత్తిన్ = శ్రీవచనభూషణంయొక్క, శెழుమ్ పొరుళై = గంభీరమైన అర్థాలను, శెకమ్ అఱియ = జగత్తు తెలిసేటట్లుగా, నీర్మైయుడన్ = ఋజుత్వంతో, (సౌలభ్యగుణంతో) వియాక్కియైయై= వ్యాఖ్యానాన్ని, నిరుమిత్త = నిర్మించిన, వరయోకి = శ్రీమణవాళమహామునులు అనే, కార్ ముకిలై = కృష్ణమేఘంయొక్క, కழల్ = శ్రీచరణాలను, దినన్తోఱుమ్ = ప్రతిదినం, పణివార్క్కు = సేవించేవారికి, ఈడు ఇలైయే = సాటి ఎవరూ లేరు.

వాగులచే పరివేష్ఠితం అయిన శ్రీ పెరుమ్బూదూర్కు నాథులైన యతిరాజుల కీర్తిని వివరించే శ్రీపిళ్ళై లోకాచార్యులు అనుగ్రహించిన శ్రీవచనభూషణంయొక్క అర్థమహిమను కరుణతో వ్యాఖ్యానించే మణవాళమామునులనే మేఘంయొక్క శ్రీపాదాలను ప్రతిదినం సేవించేవారికి ఈడు లేదు.

**73. ఇలై ఎతిరాశఱ్కు నికర్ ఇవ్వులకిల్ కురవరెన్ఱు**
**నిలై నిఱుత్తుమ్ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్**
**కలై యఱిన్దు కరుత్తురైక్కుమ్ కరుణై మణవాళముని**
**మలరడిక్కు ఆళ్ అల్లాదార్ వైయకత్తు వழ்వార్రే**

ఇవ్వులకిల్ = ఈలోకంలో, ఎతిరాశఱ్కు = శ్రీరామానుజులకు, నికర్ = సాటి అయిన, కురవర్ = ఆచార్యులు, ఇలై = లేరు. ఎన్ఱు = అని, నిలై నిఱుత్తుమ్ = సుస్థాపించే, అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ = అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరు మానార్ అనే ఆచార్యుల, కలై = గ్రంథాలు అయిన జ్ఞానసారం, ప్రమేయసారాలను, అఱిన్దు = తెలిసికొని, కరుత్తు ఉరైక్కుమ్ = అందులోని అర్థాన్ని వివరించే, కరుణై = దయను కల, మణవాళముని = మణవాళమహామునుల, మలర్ అడిక్కు = పద్మాలవంటి శ్రీచరణాలకు, ఆళ్ అల్లాతార్ = దాసులు కానివారు, వైయకత్తు = ఈలోకంలో కూడా, వழ்గ్గారే = ఉజ్జీవించరు.

యతిరాజులకు సాటి అయిన ఆచార్యులు ఈలోకంలో లేరు అనే అర్థాన్ని ప్రతిష్ఠించిన అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన గ్రంథాలలోని అర్థాలను వివరించే, కరుణ మెండుగా కల మణవాళ మహామునుల శ్రీపాదాలను దాసులు కానివారు ఈ లోకంలో ఉజ్జీవనాన్ని పొందరు.

**74. కారేయుమ్ కరుణై ఇరామానుశనై క్కాశినియిల్**
**నేరే కణ్డు అడి పణియ నియమిత్త శడకోపన్**
**శీరేయుమ్ తమిழ் మఱైక్కు శిఱన్ద కురు ఇవరెన్ఱు**
**పేరేయుమ్ మణవాళముని కழలై ప్పిరియోమే**

కార్ ఏయుమ్ = మేఘంతో సమానమైన, కరుణై ఇరామానుశనై = దయను నిరూపకంగా కల శ్రీరామానుజులను, కాశినియిల్ = భూమిలో, నేరే కణ్డు = సాక్షాత్తుగా దర్శించి, అడి పణియ = వారి శ్రీచరణాలను సేవించమని, నియమిత్త = నియమించిన, శడకోపన్ = నమ్మాళ్వార్ల, శీర్ ఏయుమ్ = సమస్త కవిత గుణాలను కల, తమిழ్ మఱైక్కు = ద్రావిడవేదం అయిన తిరువాయ్‌మొழిని ప్రవచించే, శిఱన్ద కురు = గొప్ప ఆచార్యులు, ఇవర్ ఎన్ఱు = వీరే అని, పేర్ ఏయుమ్ = పేరును పొందిన, మణవాళముని= మణవాళమహామునుల, కழలై = శ్రీచరణాలను, పిరియోమే = విశ్లేషించము.

మేఘంవంటి కరుణను కల రామానుజులను ఈ లోకంలో దర్శించి, సేవించేటట్లు నియమించినవారు, నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేదం అయిన తిరువాయ్ మొழిని వివరించడంలో "వీరే గొప్పవారు"– అని పేరును పొందినవారైన మణవాళ మహామునుల శ్రీపాదాలను విడువము.

**75. మేదినియిల్ శిత్తిరైయిల్ ఆదిరైనాళ్ విళఙ్గ వెన్ఱు**
**పుదూరిల్ వన్దుదిత్త పునిదన్ ఎతిరాశన్‌తన్**
**పాదమలర్‌క్కు ఆళాన పాకవతర్ తిలక మెన**
**పోదముళోర్ పుకழుమ్ మణవాళముని పువిక్కరశే**

మేదినియిల్ = భూమిలో, శిత్తిరైయిల్ = చైత్రమాసంలోని, ఆదిరై నాళ్ = ఆర్ద్రానక్షత్రం, విళఙ్గ = ప్రకాశంచుగాక!, ఎన్ఱు = అని, పుతూరిల్ = శ్రీపెరుమ్బూదూర్‌కు, వన్దు ఉదిత్త = వచ్చి అవతరించిన, పునితన్ = పుణ్యాత్ములు అయిన, ఎతిరాశన్‌తన్ = శ్రీరామానుజుల, పాద మలర్‌క్కు = పద్మాలవంటి శ్రీపాదాలకు, ఆళాన = దాసులు అయిన, పాకవతర్ = భాగవతులలో, తిలక మెన = ముఖ్యులు అని, పోదమ్ ఉళోర్ జ్ఞానాన్ని కలవారు, పుకழుమ్ = ఆశ్రయించే, మణవాళముని = మణవాళమహామునులు, పువిక్కు అరశే = ఈ భూమికి ప్రభువు.

ఈలోకంలో చిత్తిరమాసం (మేషమాసం) ఆర్ద్రా నక్షత్రం ప్రకాశించే రీతిలో శ్రీపెరుమ్బూదూర్‌లో వచ్చి అవతరించిన పవిత్రులైన యతిరాజుల శ్రీపాదాలలో సేవించిన దాసులలో ముఖ్యులుగా ప్రకాశించేవారు– అని గొప్ప మహాజ్ఞానులచేత చెప్పబడే మణవాళమహామునులు ఈ భూమికి ప్రభువులు.

**76. అరశాకుమ్ ఎతికళుక్కు ఎన్ఱు అకిల వులకుమ్ పణియుమ్**
**పరమన్ ఇరామానుశర్‌క్కు ప్పాఙ్గాన పత్తనెన్నుమ్**
**వరవరమామునివన్ ఇన్ద వైయకత్తిల్ వన్దిలనేల్**
**ఉఱై పెఱు నఱ్ఱమిழ్ వేదమ్ ఉలకఱివార్ ఎవరుణ్డే**

ఎతికళుక్కు = యతులకు, అరశు ఆమ్ = ప్రభువు కాగలరు, ఎన్ఱు = అని, అకిల ఉలకుమ్ = సమస్తలోకం, పణియుమ్ = సేవించే, పరమన్ = గొప్పతనాన్ని కల, ఇరామానుశర్‌క్కు = శ్రీరామానుజులకు, పాఙ్గాన = తగిన, పత్తన్ ఎన్నుమ్ = భక్తుడు అనే, వరవర మామునివన్ = శ్రీవరవరమునులు, ఇన్ద వైయకత్తిల్ = ఈ భూలోకంలో, వన్దిలనేల్ = అవతరించి ఉండకపోతే, ఉఱై పెఱు నల్ తమిழ్ వేదమ్ =

వ్యాఖ్యానాన్ని కల గొప్ప ద్రావిడవేదాన్ని (తిరువాయ్‌మొళ్ళిని), ఉలకు = లోకంలో, అఱివార్ = తెలిసేవారు, ఎవర్ ఉణ్డే = ఎవరు ఉండగలరు?

యతులకు అందఱికీ ప్రభువు అని లోకమంతా సేవించి, నమస్కరించే గొప్పతనాన్ని కల యతిరాజులకు తగిన దాసులైన మణవాళమహాములు ఈ భూలోకంలోని వచ్చి అవతరించి ఉండకపోతే, ద్రావిడవేదాలు అయిన దివ్యప్రబంధాల వ్యాఖ్యలు లోకంలో ఎవరిచేత తెలిసికోవడానికి వీలవుతుంది?

**77. ఉణ్డో ఓ ఎతిరాశర్క్కొరువర్ నికర్ ఎన్ఱురైక్కుమ్**
**వణ్డారున్తొడై మౌళి మణవాళమామునివన్**
**విణ్డలర్న్ద మలర్ ప్పదత్తై విరుమ్బి యనుదినమ్ వణఙ్గుమ్**
**తొణ్డర్ తమక్కొరుకాలుమ్ తుయరుదిక్కకిల్లావే**

ఎతిరాశర్క్కు = యతిరాజులకు, నికర్ = సాటి వచ్చేవారు, ఒరువర్ = ఒకరు ఉణ్డో = ఉన్నారా! ఓ = ఆహా! ఆశ్చర్యం, ఎన్ఱు ఉరైక్కుమ్ = అని పలికే, వణ్డు ఆరుమ్ తొడై మౌళి = తుమ్మెదలు మధురంగా ధ్వనించే పూమాలికను అలంకరించిన కిరీటాన్ని కల్గిన, మణవాళ మామునివన్ = మణవాళమహాముసుల, విణ్డు అలర్న్ద మలర్ పదత్తై = రేకులు విచ్చి పూచే పద్మాలవంటి శ్రీపాదాలను, విరుమ్బి = ఆశపడి, అనుదినమ్ = ప్రతిదినం, వణఙ్గుమ్ = నమస్కరించే, తొణ్డర్ తమక్కు = దాసులకు, ఒరు కాలుమ్ = ఏ సమయంలోను, తుయర్ = దుఃఖాలు, ఉదిక్కకిల్లావే = కలుగవుసుమా!

యతిరాజులకు సాటి అయినవారు ఎవరైన కలరా? అని పలికేవారు, తుమ్మెదలు చేరిన మాలను అలంకరించుకొన్న కిరీటాన్ని కలవారు అయిన మణవాళ మహాముసుల వికసించిన శ్రీపాదపద్మాలకు ప్రతిదినం నమస్కరించే దాసులకు ఎపుడూ దుఃఖం కలుగదు.

**78. వేదాన్త విళ్ళుప్పొరుళిన్ మేలిరుక్కుమ్ అరఙ్గేశర్**
**నాదన్ నమక్కెన్ఱురైక్కుమ్ నఱ్కుణనామ్ ఎతిరాశన్**
**మాతకవాల్ ఎవ్వుయిర్క్కుమ్ వాళ్ర్వళిక్కుమ్ వరయోకి**
**పాద మదై పత్తర్ పదమ్ పణిన్దేత్తి ప్పఱ్ఱుమినే**

వేదాన్త విళ్ళు ప్పొరుళిన్ మేల్ = ఉపనిషత్తులలోని సారార్థంలో (ఓంకారంలో) ఇరుక్కుమ్ = ఉండే, అరఙ్గేశర్ = శ్రీరంగనాథుడు, నమక్కు = మనకు, నాతన్ = ప్రభువు, ఎన్ఱు ఉరైక్కుమ్ = అని పలికే, నల్ కుణనామ్ = సద్గుణశీలి అయిన, ఎతిరాశన్= యతిరాజుల, మా తకవాల్ = గొప్ప కరుణతో, ఎవ్వుయిర్క్కుమ్= ఆత్మలకన్నిటికి, వాళ్ర్వు అళిక్కుమ్ = ఉజ్జీవనాన్ని కల్గించే, వరయోకి = వరవరమునుల, పాదమ్ అదై= శ్రీచరణాలను పొందే, పత్తర్ పదమ్ = భక్తుల శ్రీపాదాలను, పణిన్దు = సేవించి, ఏత్తి = కీర్తించి, పఱ్ఱుమినే= ఆశ్రయించండి.

వేదాంతార్థాలచేత ప్రతిపాద్యుడు– **"వేదాన్తవిళ్ళుప్పొరుళిన్ మేలిరున్ద విళక్కు"**గా వెలిగే శ్రీరంగనాథుడే మననాథుడు అని పలికే సద్గుణాలను కల యతిరాజుల గొప్ప కరుణతో జీవులందరికీ ఉజ్జీవనం కల్గించే మణవాళమహామునుల శ్రీపాదాలను పొందే దాసుల శ్రీపాదాలను భక్తితో స్తుతించి, ఆశ్రయించండి.

**79. మిన్ను పుకళ్ఱ్ ఎతిరాశన్ వీఱురైక్కుమ్ వరయోకి**
**తున్ను పుకళ్ఱ్ నాడోఱుమ్ తుదిక్కుమ్ అడియారవర్కళ్**
**పన్ను మొళ్ఱియే శురుతి పార్వై శెడిక్కు త్తీయే**
**ఎన్ను మదు మున్నొరుకాల్ ఇయమ్బువర్ ఎమ్ పెరియోరే**

మిన్ను = వెలిగే, పుకళ్ఱ్ = కీర్తిని కల, ఎతిరాశన్ = శ్రీరామానుజుల, వీఱు = మహత్వాన్ని, ఉరైక్కుమ్= తెలిపే, వర యోకి = వరవరమునుల, తున్ను పుకళ్ఱ్ = గొప్ప కీర్తిని, నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, తుదిక్కుమ్= కీర్తించే, అడియార్ అవర్కళ్ = దాసులు, పన్ను మొళ్ఱియే = పలికే మాటే, శురుతి = వేదం, పార్వై = వారి చూపు, శెడిక్కు = పాపాలనే వృక్షాలకు, తీయే = అగ్నియే, ఎన్నుమతు = అనే విషయాన్ని, మున్ ఒరు కాల్ = పూర్వం ఒకానొక సమయంలో, ఎమ్ పెరియోర్ = మన పెద్దలు (ఆచార్యులు), ఇయమ్బువర్ = అంటారు.

ప్రకాశించే కీర్తిని కల యతిరాజుల గొప్పతనాలను వివరించేవారైన మణవాళ మహామునుల స్థిరమైన కీర్తిని స్తుతించే దాసులు పలికే వార్తలన్నీ వేదం అని, వారిచూపు లోకజీవనం అనే వృక్షాన్ని దహించే అగ్ని అని మన పెద్దలంటారు.

**80. పెరియోరుమ్ శిఱియోరుమ్ పిత్తరుమ్ నల్పత్తరుమే**
**పిరియాదు వన్దిఱైఞ్జుమ్ పిఱఙ్గు పుకళ్ఱ్ ఎతిరాశన్**
**మరువారుమ్ మలరడిక్కీళ్ఱ్ వణఙ్గుమ్ ఎళ్ఱిల్ వరయోకి**
**అరుళే నమ్ అనైవర్క్కుమ్ అతిశయత్తై త్తరవల్లదే**

పెరియోరుమ్ = పెద్దవారు, శిఱియోరుమ్ = చిన్నవారు, పిత్తరుమ్ = ఉన్మత్తులు, నల్ పత్తరుమే = బద్ధులు (గొప్పభక్తులు) అనే తేడా ఏమీ లేకుండా, పిరియాతు= విశ్లేషించకుండా, వన్దు ఇఱైఞ్జుమ్ = వచ్చి, ఆశ్రయించే, పిఱఙ్గు పుకళ్ఱ్ = ప్రకాశించే కీర్తిని కల, ఎతిరాశన్ = యతిరాజుల, మరువు ఆరుమ్ = సువాసన నిండిన, మలర్ అడిక్కీళ్ఱ్ = పద్మాలవంటి పాదాల కింద, వణఙ్గుమ్ = నమస్కరించేవారైన, ఎళ్ఱిల్ = ప్రకాశించే, (అందమైన) వరయోకి = వరవరమునుల, అరుళే = కరుణే, నమ్ అనైవర్క్కుమ్ = మనకు అందఱికి, అతిశయత్తై = గొప్పతనాన్ని, తరవల్లదే = కల్గించగల్గినది. (ఏకారం నిశ్చయార్థకం)

చిన్నవారు, పెద్దవారు, పిచ్చివారు, బద్ధులు (భక్తులు) అనే భేదంలేకుండా అందఱు వచ్చి సేవించేటట్లున్న కీర్తిని కల యతిరాజుల శ్రీపాదపద్మాలను నమస్కరించేవారైన మణవాళమహామునుల గొప్ప కృపే మనకు అందఱికీ గొప్పతనాన్ని కల్గించగల్గినది.

**81. వఱ్ఱాద పునల్పుదూర్ మన్నడియై చ్చేర్న్దు నఙ్గళ్**
**వఱ్ఱాద పవక్కడలై వఱ్ఱ నినైవుఱ్ఱ పరన్**
**శెఱ్ఱారై చ్చెఱ్ఱ వరయోగి తిరుత్తాళినైయామ్**
**పొఱ్ఱామరై పోఱ్దై పూణాక త్తరిప్పోమే**

వర్ఱాత = ఏనాడూ ఎండిపోని, పునల్ = నీటిప్రవాహాన్ని కల, పుతూర్= శ్రీపెరుంబూదూర్‌కు, మన్ = నాథులైన శ్రీరామానుజుల, అడియై శేర్న్దు = శ్రీచరణాలను చేరి, నజ్గళ్ = మన, వర్ఱాత = ఎండిపోని, పవ క్కడలై = సంసారాబ్ధిని, వర్ఱ = ఎండించాలనే, నినైవు ఉఱ్ఱ = భావనను కల్గిన, పరన్ = మహనీయులు, శెర్ఱారై = (వైదికమతానికి) విరోధులైనవారిని, శెర్ఱ = నశింపజేసిన, వరయోకి = వరవరమునుల, తిరు త్తాళ్ ఇణైయామ్ = శ్రీచరణద్వంద్వం అనే, పొన్ తామరై ప్పోదై = బంగారు తామర పూలను, పూణ్ ఆక = శిరస్సుకు ఆభరణంగా, తరిప్పోమే = ధరిస్తాము.

ఎండని ప్రవాహాలను కల శ్రీపెరుమ్బూదూర్‌లోని యతిరాజులను ఆశ్రయించి, ఎండని భవాబ్ధిని ఎండిపోయేటట్లు చేయాలని భావించేవారు, వైదికమతానికి విరోధులై ఉన్నవారిని నశింపజేసేవారు. అయిన మణవాళమహామునుల బంగారు తామరలవంటి పాదపద్మాలను మన శిరస్సుకు ఆభరణంగా ధరిస్తాము.

**82. తరిప్పోమే తారణియిల్ శకల కలై కఱ్ఱుణర్న్దు**
**కరిప్పోమే శముశారక్కడలై మికవుమ్ కలైకళ్**
**విరిప్పోమే యతిపతితాళ్ మేవు వరవరముని యరుళ్ కొణ్డు**
**ఇరుప్పోమే ఏఱ్ఱరుమ్ శీర్ ఇమైయవర్కళ్ ఇనమ్ శెన్టే**

యతిపతి తాళ్ = యతిరాజుల శ్రీచరణాలను, మేవు = ఆశ్రయించే, వరవర ముని = వరవరమునుల, అరుళ్ కొణ్డు = కృపను గొని, తారణియిల్ = ధరణిలో, శకల కలై = అన్ని కళలను, కఱ్ఱు = అభ్యసించి, ఉణర్న్దు = తెలిసికొని, తరిప్పోమే = ధరించగలం, శముశార క్కడలై = సంసారసముద్రాన్ని, తరిప్పోమే = దాటగలం, మికవుమ్ = మిక్కిలి, కలైకళ్ = శాస్త్రాలను, విరిప్పోమే = వివరించగలం, ఏఱ్ఱరుమ్ = ఇతరులకు పొందడానికి వీలుకాని, శీర్ = గొప్పతనాన్ని కల, ఇమైయవర్కళ్ ఇనమ్ శెన్టు = నిత్యసూరుల సమూహాన్ని చేరి, ఇరుప్పోమే = ఉండగలం.

యతిరాజుల శ్రీపాదాలను నమస్కరించే మణవాళమాములను కృపను గొని, మనం ఈలోకంలో అన్ని కళను అభ్యసించి, ధరించి ఉండగలం. జన్మమహాబ్ధిని దాటగలం. శాస్త్రాలను వ్యాఖ్యానించగలం. గొప్పతనాన్ని కల నిత్యసూరుల సమూహాన్ని చేరి వారితో కలసి ఉండగలం.

**83. శెన్టు కలియిరుళ్తన్నై చ్చెఴ్గు మఱైయిన్ ఒళియదనాల్**
**కన్టుమ్ ఎతిరాశన్ ఎఴ్గిల్కణ్ణనడి కాట్టిలనేల్**
**ఇన్టుయిర్కళ్ అతిన్దుయ్య ఎళితో తాన్ ఎన్టురైక్కుమ్**
**తున్టు పుకఴ్ వరమునివన్ తూయ తమిఴ్ మఱైక్కరశే**

శెన్టు = చేరి, కలి ఇరుళ్తన్నై = కలివల్ల కల్గిన అజ్ఞానమనే చీకటిని, శెఴ్గు = దట్టమైన, మఱైయిన్ ఒళి అదనాల్ = వేదాల ప్రకాశంతో, కన్టుమ్ = కోపించే (నిరసించే), ఎతిరాశన్ = యతిరాజులు, ఎఴ్గిల్ = ప్రకాశించే, కణ్ణన్ అడి = శ్రీకృష్ణభగవానుని శ్రీచరణాలను (మనకు శరణంగా), కాట్టిలనేల్ = చూపించి ఉండకపోతే, ఇన్టు = ఇపుడు,ఉయిర్కళ్= జీవులు, అతిన్దు = తెలిసికొని, ఉయ్య = ఉజ్జీవించడం, ఎళితోతాన్ =

సులభమా!, ఎన్ఱు ఉరైక్కుమ్ = అని పలికే, తున్ఱు పుకళ్ = ప్రకాశించే (నిబిడమైన) కీర్తిని కల, వరమునివన్= మణవాళమహాములు, తూయ = పరిశుద్ధమైన, తమిళ్ మఱైక్కు = ద్రావిడవేదానికి, అరశే = ప్రభువు.

కలియొక్క అంధకారాన్ని (అజ్ఞానాన్ని) వేదాల ప్రకాశంతో (జ్ఞానంతో) పోగొట్టిన యతిరాజులు, మనకు కృష్ణుని శ్రీపాదాలను తమ సూక్తులద్వారా చూపి ఉండకపోతే, ఇపుడు లోకులు సులభంగా తెలిసికొనడం వీలు అయ్యేదా! అని అనుగ్రహించే పవిత్రమైన కీర్తిని కల మణవాళమహామునులు పావనం అయిన ద్రావిడవేదం అనే దివ్యప్రబంధాలకు ప్రభువులు.

**84. శేమఙ్కురుకైయర్కోన్ తిరువడి ఎన్ఱెన్ఱు పణిన్దు**
**తామ మడియార్క్కరుళుమ్ తకవన్ ఎతిరాశనడి**
**త్తామమ్ ముడి క్కణియు మణవాళముని పూన్తిరుత్తాళ్**
**పూమదు వుణ్ వణ్డినమామ్ పూశురర్కళ్ ఎన్ తుణైయే**

కురుకైయర్ కోన్ = నమ్మాళ్వార్ల, తిరువడి = శ్రీచరణాలు, శేమమ్ = మనకు క్షేమం (రక్షకం), ఎన్ఱు ఎన్ఱు = అని, పణిన్దు = పల్కి, తామమ్ = పరమపదాన్ని, అడియార్క్కు = దాసులకు, అరుళుమ్ = అనుగ్రహించే, తకవన్ = కరుణాశీలి, ఎతిరాశన్ = యతిరాజుల, అడి = శ్రీచరణాలలో అలంకరించిన, తామమ్ = పూమాలను, ముడిక్కు అణియుమ్ = (తమ) శిరస్సుకు అలంకరించుకొనే, మణవాళ ముని = మణవాళమహామునులు, పూమ్ తిరు త్తాళ్ = వికసించే పద్మాలవంటి శ్రీచరణాల లోని, పూ మతు = తేనెను, ఉణ్ = భుజించే, వణ్డు ఇనమామ్ = తుమ్మెదల సమూహం వంటి, పూ శురర్కళ్ = భూసురులు, ఎన్ తుణైయే = నాకు సహాయకులు. (రక్షకులు)

నమ్మాళ్వార్ల శ్రీపాదాలే మనకు రక్షకం అని వారి శ్రీపాదాలను ఆశ్రయించి, ఉన్నతస్థానం అయిన పరమపదాన్ని మనకు అనుగ్రహించే కరుణను కల యతిరాజుల శ్రీపాదాలలో అలంకరించిన మాలను తమ శిరస్సులో అభరణంగా ధరించే మణవాళమామునుల పూవువంటి శ్రీపాదాలో గల తేనెను తాగే తుమ్మెదలవంటి దాసులే నాకు రక్షకులు.

**85. తుణర్ పొళిల్ శూళ్ అరఙ్గేశన్ తొల్ శీరిన్ మన్నుమ్ ఎతి**
**కణమదుక్కు త్తలైవన్ ఇరామానుశ నఙ్కళలిఙ్కమల**
**మణ మిక వణ్ మణవాళమామునివన్ కలై యరుళ్కళ్**
**కుణముడనే అడియవర్క్కు క్కూఱుకిన్ఱదు అతిశయమే**

తుణర్ = గుత్తులు గుత్తులుగా పూలు వికసించే, పొళిల్ = తోటలచేత, శూళ్ = పరివేష్ఠింపబడ్డ, అరఙ్గేశన్ = శ్రీరంగానికి ప్రభువైన శ్రీరంగనాథునియొక్క, తొల్ శీరిల్ = సహజకల్యాణగుణాలలో, మన్నుమ్= అభినివిష్టులైనవారు, ఎతి కణమ్ అతుక్కు = యతుల సమూహానికి, తలైవన్ = ప్రభువు అయిన, ఇరామానుశన్= శ్రీరామానుజుల, కళల్ కమల = శ్రీచరణకమలాల, మణమ్ మిక = పరిమళం అతిశయించేటట్లుగా, వణ్ మణవాళ మామునివన్ = ఉదారులైన మణవాళమహామునులు అనుగ్రహించిన, కలై పొరుళ్కళ్ = శాస్త్రాలలోని

అర్థాలు, అడియవర్క్కు = దాసులకు, కుణముడనే = గుణంతో పాటు, అతిశయమే = అతిశయాన్నికూడా, కూఱుకిన్దతు = కల్గిస్తాయి.

చక్కని తోటలచే చుట్టబడిన శ్రీరంగానికి నాథుడైన రంగనాథుని గుణాలలో అభినివిష్టులైన యతుల సమూహానికి నాథులు యతిరాజుల శ్రీపాదపద్మాలలోని పరిమళం అతిశయించేటట్లు మణవాళమహామునులు అనుగ్రహించే శ్రీసూక్తులు దాసులకు అతిశయాన్ని కల్గిస్తాయి.

**86. శయ మేవుమ్ ఎతిరాశన్ అడిక్కడియన్ నానెన్రు**
**తుయముడనే శకల మఱైత్తుయ్య పొరుళ్ ఉరైత్తెమక్కు**
**ప్పయనళిక్కుమ్ వరయోకి పారులకిల్ వన్దిలనేల్**
**నయ మఱివార్ ఇలై యెన్రు నావలర్కళ్ ఓదువరే**

శయ మేవుమ్ – ఎతిరాశన్ = జయాన్ని పొందే, ఎతిరాశన్ = యతిరాజుల, అడి = శ్రీచరణాలకు, నాన్ = నేను, అడియన్ = దాసుణ్ణి, ఎన్రు = అని పల్కి, తుయముడనే = ద్వయమంత్రంతోపాటు, శకల మఱై = అన్ని శాస్త్రాల, తుయ్య పొరుళ్= పవిత్రాలైన అర్థాలను, ఉరైత్తు = వివరించి, ఎమక్కు = మనకు, పయన్ అళిక్కుమ్ = ప్రాప్యాన్ని, అనుగ్రహించే, వరయోకి = వరవరమునులు, పార్ ఉలకిల్ = భూలోకంలో, వన్దిలనేల్ = అవతరించి ఉండకపోతే, నయమ్ అఱివార్ = నీతిని తెలిసేవారు, ఇలై ఎన్రు = లేరు అని, నావలర్కళ్ = పండితులు, ఓదువరే = అంటారు.

"జయశీలురైన యతిరాజుల శ్రీపాదాలకు నేను దాసుడను" అని పలికి, ద్వయమంత్రంతో పాటు అన్ని శాస్త్రాల పవిత్రాలైన అర్థాలను వివరించి, మనకు ప్రాప్యాన్ని అనుగ్రహించేవారైన మణవాళ మహామునులు ఈ లోకంలో వచ్చి అవతరించి ఉండకపోతే, ఆళ్వార్ల పాశురాలయొక్క వాటి వ్యాఖ్యానాలయొక్క గొప్పతనాన్ని తెలియగలవారు ఎవరూ లేరు– అని వాగ్వైభవాన్ని కలవారు పలుకుతారు.

**87. ఓదు మఱైయోర్క్కు ఇనితాయ్ ఉరైత్తరుళుమ్ ఒళ్ళియ నూల్**
**తీదిల్ శీర్ పాచ్చియత్తోన్ శీర్ మన్ను వరయోకి**
**మేదినియిల్ ఉదిత్త పిన్నర్ విళఙ్గియ శెన్దమిళ్ మఱైకళ్**
**పేద మఱ కఱ్ఱుణర్న్దు పెరుమై పెఱుమిన్కళిన్రే**

ఓదు మఱైయోర్క్కు = వేదాభ్యాసాన్ని చేసేవారికి, ఇనితాయ్ = మధురంగా, ఉరైత్తు అరుళుమ్= వివరించే, ఒళ్ళియ నూల్ = మిక్కిలి గొప్ప సుందరమైన గ్రంథం అయిన, తీదు ఇల్ శీర్ పాచ్చియత్తోన్ = ఏ దోషం లేని శ్రీభాష్యంలోని, శీర్ = గొప్ప అర్థాలలో, మన్ను = అభినివిష్టులై ఉండే, వరయోకి = శ్రీవరవర మునులు, మేదినియిల్ = ఈ లోకంలో, ఉదిత్త పిన్నర్ = అవతరించిన తరువాత, విళఙ్గియ = ప్రకాశించిన, శెమ్ తమిళ్ మఱైకళ్ = అందమైన (ఋజువైన) ద్రావిడవేదాలు అయిన దివ్యప్రబంధాలను, పేదమ్ అఱ = తేడా లేకుండా, కఱ్ఱు ఉణర్న్దు = అభ్యసించి తెలిసికొని, ఇన్రే = ఈనాడే, పెరుమై = గొప్పతనాన్ని, పెఱుమిన్కళ్ = పొందండి.

వేదాన్ని అభ్యసించేవారికి మధురంగా అర్థాన్ని వివరించే మిక్కిలి గొప్ప గ్రంథం అయిన శ్రీభాష్యాన్ని అనుగ్రహించినవారైన యతిరాజులగుణాలలో అభినివేశాన్ని పొందే మణవాళమహామునులు ఈ లోకంలో అవతరించిన తర్వాత వివరింపబడ్డ అందమైన ద్రావిడవేదాలనబడే దివ్యప్రబంధాలను చక్కగా తేడా లేకుండా అభ్యసించి తెలిసికొని, గొప్పతనాన్ని పొందండి.

**88. ఇన్ తమిళ్ళిన్ పొరుళెల్లామ్ ఇవ్వులకిల్ అఱిన్దురైక్కుమ్**
**తున్దు పుకళ్ ఆరియర్కళ్ తుదిక్కుమ్ ఎతిరాశర్ పుకళ్**
**నిన్దురై శెయ్ వరయోగి నీణిలత్తిల్ ఒరు మరత్తై**
**శెన్దడైయ ప్పరమపదఞ్జెయ్దరుళుమ్ నీర్మై యెన్నే**

ఇన్ తమిళ్ళిన్ = తీయని ద్రావిడవేదాల, పొరుళ్ ఎల్లామ్ = అర్థాలను అన్నిటినీ, అఱిన్దు = తెలిసికొని, ఇవ్వులకిల్ = ఈలోకంలో, ఉరైక్కుమ్ = వివరించే, తున్దు పుకళ్= ప్రకాశించే కీర్తిని కల, ఆరియర్కళ్ = ఆచార్యులు, తుదిక్కుమ్ = స్తుతించే, ఎతిరాశర్ పుకళ్ = శ్రీరామానుజుల కల్యాణగుణాలను, నిన్దు = నిలచి (మననం చేసి), ఉరై శెయ్ = పలికే, వరయోగి = శ్రీవరవరమునులు, నీళ్ నిలత్తిల్ = విశాలమైన భూమిలో, ఒరు మరత్తై = ఒక వృక్షాన్నికూడా, పరమపదమ్ = పరమపదాన్ని, శెన్దడైయ = చేరేటట్లుగా, శెయ్తు అరుళుమ్ = చేసి అనుగ్రహించే, నీర్మై = సౌలభ్యం, ఎన్నే = ఏమి! ఆశ్చర్యం!

తీయని ద్రావిడపాశురాల అర్థాలను అన్నిటినీ తెలిసికొని వివరించే ప్రశస్తిని కల ఆచార్యులచే స్తుతింపబడేవారైన యతిరాజుల కీర్తిని వివరించే మణవాళ మహా మునులు, ఈ లోకంలో ఒక వృక్షాన్ని కూడా పరమపదం చేరేటట్లుగా చేసిన కరుణ ఎంత ఆశ్చర్యకరం!

**89. ఎన్పోలుమ్ పిళ్ళై శెయ్వార్ ఇవ్వులకిల్ ఇల్లై యెన్నుమ్**
**ఉన్ పోలుమ్ పొఱుత్తరుళ్వార్ ఒరువరిలైయే యెన్నుమ్**
**అన్పోడన్దు ఎతిరాశర్క్కు అతిశయఞ్జొల్ వరమునివన్**
**పొన్పోలుమ్ అడిముదలా పోఱ్ఱుమిన్ నీర్ ముడియళవే**

ఎన్ పోలుమ్ = నావలె, పిళ్ళై శెయ్వార్ = తప్పులను చేసేవారు, ఇవ్వులకిల్ = ఈలోకంలో, ఇల్లై ఎన్నుమ్ = లేరు అని, ఉన్ పోలుమ్ = నీవలె, పొఱుత్తు అరుళ్వార్ = సహించి, కరుణించేవారు, ఒరువర్ ఇలైయే ఎన్నుమ్ = ఎవరూ ఇంకొకరు లేరని, అన్పోడు అన్దు = అపుడు భక్తితో (ఆర్తి ప్రబంధంలో) ఎతిరాశర్క్కు= యతిరాజులకు, అతిశయమ్ = గొప్పతనాన్ని, శొల్ = పలికే, వరవరమునివన్ = వరవరమునుల, పొన్ పోలుమ్ = బంగారంవంటి, అడి ముదలా = శ్రీచరణాలనుండి, ముడి యళవే = కిరీటం వరకు, నీర్ పోఱ్ఱుమిన్ = మీరు కీర్తించండి.

“నావలె పాపం చేసేవారు ఈ లోకంలో లేరు” అని, “నీవలె పాపాలను సహించేవారు ఎవరూ లేరు”. అని యతిరాజుల వద్ద (ఆర్తి ప్రబంధంలో) భక్తితో అనుగ్రహించిన మణవాళమహామునులను బంగారంవంటి పాదాలనుండి కిరీటం వరకు కీర్తించండి.

**90. ముడి యழ்ழకుమ్ విழி యழ்ழకుమ్ ముకత్తழகుమ్ తిరుమేని**
**పడి యழ்ழకుమ్ తూయ్ ముఋవల్ పవళ నికర్ వాయழ்ழకుమ్**
**కడి యழ்ழకుమ్ కరత్తழகుమ్ కణ్డు మకిழ்న్దు ఎతిరాశర్**
**అడి పరవుమ్ వరమునివన్ అడియழ்ழకుమ్ విడవర్గ్రే**

ముడి అழகుమ్ = (శ్రీరామానుజుల) కిరీటసౌందర్యం, విழி అழகుమ్ = కటాక్ష (నేత్రసౌందర్యం, ముకత్తు అழகుమ్ = తిరుముఖంలోని అందం, తిరుమేని పడి అழகుమ్= దివ్యరూపసౌందర్యం, తూయ్ ముఋవల్ = పవిత్రమైన చిఋనవ్వులోని, పవళ నికర్ = పగడాలతో సాటివచ్చే (పగడపు కాంతిని కల), వాయ్ అழகుమ్ = పెదవిలోని అందం, కడి అழகుమ్ = నడుములోని అందం, కరత్తు అழகుమ్ = శ్రీహస్తసౌందర్యం, కణ్డు మకిழ்న్దు= దర్శించి ఆనందించి, ఎతిరాశర్ అడి పరవుమ్ = శ్రీరామానుజుల శ్రీచరణాలను సేవించే, వరవరమునివన్ = శ్రీవరవరమునుల, అడి అழகుమ్ = శ్రీచరణసౌందర్యం, విడవర్గ్రే = (సేవించకుండా) విడువడానికి వీలు అవుతుందా!

యతిరాజుల కిరీటసౌందర్యం, నేత్రసౌందర్యం, ముఖసౌందర్యం, తిరుమేని అందం, చిఋనవ్వుతో వెలిగే పగడంవంటి పెదవి అందం, నడుము అందం, శ్రీహస్తాల సౌందర్యం అనే వీటిని దర్శించి ఆనందించి వారి శ్రీపాదాలను సేవించే మణవాళ మహామునుల శ్రీపాదాల అందాన్ని విడువడానికి వీలవుతుందా!

**91. వర్గ్రాద పవక్కడలై వర్గ్రువిత్తు అన్దామత్తిల్**
**నర్గ్రాదై పద మళిక్కు నమ్మెతిరాశన్ పదత్తై**
**పర్గ్రాక ప్పర్గ్రు మణవాళముని ఇవ్వులకిన్**
**ముర్గ్రాదు ఎమ్ తీవినైయై ముడిత్త వకై అరియోమే**

వర్గ్రాత = ఏనాడు ఇంకిపోని, పవ క్కడలై = సంసారసముద్రాన్ని, వర్గ్రు విత్తు = ఎండగట్టి, అన్దామత్తిల్ = అందమైన పరమపదంలో, నల్ తాదై పదమ్ = నిరుపాధిక తండ్రి అయిన భగవానుని, శ్రీచరణాలను,అళిక్కుమ్ = అనుగ్రహించే, నమ్ ఎతిరాశన్ పదత్తై = మన శ్రీరామానుజుల శ్రీచరణాలను, పర్గ్రు ఆక = శరణంగా, పర్గ్రుమ్ = ఆశ్రయించే, మణవాళముని = మణవాళమహామునులు, ఇవ్వులకిన్= ఈలోకంలో, ఎమ్ తీ వినై = మన దుష్కర్మలను, ముర్గ్రాతు = పరిణతిని చెందకుండా (ఫలపర్యవ సాయి కాకుండా), ముడిత్త వకై = నశింపజేసే తీరును, అఱియోమే = తెలియలేము.

ఎండని భవాబ్ధిని ఎండేటట్లుగా చేసి, పరమపదంలో మన తండ్రి అయిన భగవానుని శ్రీపాదాలను మనకు అనుగ్రహించే యతిరాజుల శ్రీపాదాలను శరణంగా ఆశ్రయించే మణవాళమహామునులు ఈ లోకంలో నా దుష్కర్మలను ఫలించకుండా నశింపజేసిన రీతిని తెలియలేము.

**92. మేవాద శమయికళుమ్ మేవి యడి పణికిన్ఱ**
**మూవాద కతికళ్ తరు మొయ్మ్బు ఎతిరాశత్కినియ**
**పావారు న్తమిழ் మఱైక్కు ప్పాజ్గాన కురు వెన్ఱు**
**దేవాదిదేవనుమే శెప్పు మణవాళనైయే**

మేవాత శమయికళుమ్ = ఇంతకుముందు ఆశ్రయించని ఇతరమతాలవారు సైతం, మేవి = ఆశ్రయించి, అడి పణికిన్ఱ = శ్రీచరణాలను సేవించే, మూవాత = పునరావృత్తి లేని, కతికళ్ = (అర్చిరాది) గతులను, తరుమ్ = అనుగ్రహించే, మొయ్మ్బు= సమర్థులైన, ఎతిరాశఱ్కు = శ్రీరామానుజులకు, ఇనియ = తీయని, పా ఆరుమ్ తమిழ் మఱైక్కు = పాశురాలతో నిండిన ద్రావిడ వేదానికి, పాఙ్గాన = తగిన, కురువు = ఆచార్యులు, మణవాళనైయే ఎన్ఱు = శ్రీవరవరములే అని, తేవాతి తేవనుమే = దేవాధిదేవుడైన శ్రీరంగనాథుడే, శెప్పుమ్ = పలికాడు.

ఇతరమతాలవారు సైతం ఆశ్రయించేవారు, నశించని గతి అయిన పరమపదాన్ని అనుగ్రహించే సామర్థ్యాన్ని కలవారైన యతిరాజులకు మిక్కిలి తీయగా ఉండే పాశురాలను కల ద్రావిడవేదాలైన దివ్యప్రబంధాలకు తగిన గురువు మణవాళమహాములే అని దేవాధిదేవుడైన శ్రీరంగనాథుడుకూడ పలికాడు. ఒక సంవత్సరకాలం పాటు ఈడు వ్యాఖ్యను వరవరమునులవల్ల శ్రీరంగనాథుడు విన్నాడు కదా!

**93. మణవాళమామునివన్ వణ్మై తికழ் ఎతిరాశన్**
**కుణ మేవు నఱ్పరమన్ కూర్ మదియోర్ కురుక్కళెల్లామ్**
**తుణైయాక తొழுదు దినన్తుదిక్కుమ్ అరవరశాకుమ్**
**ఇణైయారుమ్ ఇల్లాదిఙ్గు ఎழிలరఙ్గమ్ ఇలఙ్గువనే**

మణవాళ మామునివన్ = మణవాళమహామునులు, వణ్మై తికழ் = ఔదార్యం ప్రకాశించే, ఎతిరాశన్ = యతిరాజుల, కుణమ్ మేవుమ్ = కల్యాణగుణాలను ఆదరించే, నల్ పరమన్ = మహాత్ములు, కూర్ మతియోర్ = నిశితమైన బుద్ధిని కల, కురుక్కళ్ ఎల్లామ్ = గురువులు అందఱు, తుణైయాక = సహాయంగా (భావించి) తొழுతు = నమస్కరించి, దినమ్ = ప్రతిదినం, తుదిక్కుమ్ = స్తుతించే, అర అరశు ఆకుమ్ = సర్పాలకు అధిపతియే (ఆదిశేషులే). ఆ ఆచార్యులు, ఇణై ఆరుమ్ ఇల్లాతు = సాటి ఎవరూ లేని రీతిలో, ఇఙ్గు = ఈలోకంలో, ఎழிల్ అరఙ్గమ్ = ప్రకాశించే శ్రీరంగంలో, ఇలఙ్గువనే = వెలుగుతున్నారు.

మిక్కిలి ఔదార్యాన్ని కల యతిరాజుల గుణాలలో అభినివేశాన్ని పొందేవారు, నిస్సమాభ్యధికులై శ్రీరంగంలో వేంచేసి ఉన్నవారు అయిన మణవాళమామునులు నిశితమైన జ్ఞానాన్ని కల ఆచార్యులచేత ప్రతిదినం తమకు సహాయంగా నమస్కరించి, స్తుతింపబడే సర్పరాజు అయిన ఆదిశేషులే.

**94. ఇలఙ్గు తికిరియి నొళియాల్ ఎழிల్ అత్తికిరిమాలుమ్**
**కలఙ్గి ఎతిపతి యళిత్త కారణముమ్ మామునివన్**
**తులఙ్గియ నఱ్కుణఙ్గళైయుమ్ తొల్లులకోర్క్కు అళిత్తరుళుమ్**
**వలఙ్గొళ్ మణవాళముని మన్నియ శీర్ వాழ்త్తుమినే**

ఇలఙ్గు = ప్రకాశించే, తికిరిన్ ఒళియాల్ = శ్రీసుదర్శనంయొక్క కాంతితో, ఎழிల్ = వెలిగే, అత్తికిరి మాలుమ్ = హస్తిగిరిలోని భక్తవత్సలుడుకూడా, కలఙ్గి = మనస్సులో బాధపడి, ఎతిపతి అళిత్త = శ్రీరామానుజులను శ్రీరంగనాథునకు అనుగ్రహించిన, కారణముమ్ = కారణాన్ని, మా మునివన్ = గొప్పముని

అయిన శ్రీరామానుజుల, తులఙ్గియ = ప్రకాశించిన, నల్ కుణఙ్గళైయుమ్ = కల్యాణగుణాలను, తొల్ = పూర్వం, ఉలకోర్క్కు అరుళుమ్ = లోకాలకు తెలియజేసిన, వళఙ్గొళ్ = గొప్ప జయాన్ని కల, మణవాళ ముని = మణవాళ మహామునుల, మన్నియ శీర్ = స్థిరమైన కీర్తిని, వాళ్త్తుమినే = మంగళాశాసనం చేయండి.

ప్రకాశించే చక్రాయుధంతో అందంగా ఉండే హస్తిగిరినాథుడైన వరదరాజస్వామి శ్రీరంగనాథునకు అనుగ్రహించిన కారణాన్ని, గొప్పముని అయిన యతిరాజుల కల్యాణగుణాలను లోకంలోనివారికి వివరించే మణవాళమహామునుల కల్యాణగుణాలను కీర్తించండి.

**95. వాళ్త్తుమిన్కళ్ నాడోఱుమ్ మాఱనడి పణి మునితాళ్**
**తాళ్త్తు ముడి మణవాళమామునివన్ తన్నరుళాల్**
**శూళ్త్త వినైత్తూఱ్ఱై ముఱ్ఱురత్తి ప్పిన్ నల్వనమ్ తఴైక్కుమ్**
**మూళ్త్త పెరునీరులకీర్ ముత్తి తరుమ్ ముఱై ముఱైయే**

నాళ్ తోఱుమ్ = ప్రతిదినం, మాఱన్ అడి పణి = నమ్మాళ్వార్ల శ్రీచరణాలను సేవించే, ముని తాళ్ = శ్రీరామానుజుల శ్రీపాదాలలో, ముడి తాళ్త్తు = శిరస్సును తాకించే, మణవాళ మా మునివన్ తన్ అరుళాల్= మణవాళమహామునులు తమ కృపచేత, శూళ్త్త = (మనలను జన్మ జన్మలుగా) చుట్టుకొన్న, వినై తూఱ్ఱై = కర్మలనే ముళ్ళ పొదలను, ముఱ్ఱు = పూర్తిగా, తురత్తి = ఛేదించి, పిన్ = తరువాత, నల్ వనమ్ తఴైక్కుమ్= మంచి వనాన్ని విస్తరింపజేస్తారు. ముఱై ముఱైయే= క్రమక్రమంగా, మూళ్త్త పెరు నీర్ ఉలకీర్ = ఉప్పొంగి చుట్టి ఉండే గొప్ప నీటిని కల భూమిలోని జనులారా!, ముత్తి తరుమ్ = ముక్తిని అనుగ్రహిస్తారు.

ప్రతిదినం నమ్మాళ్వార్ల శ్రీపాదాలను సేవించే యతిరాజుల శ్రీపాదాలలో తలను వంచే మణవాళ మహామునులు తమ కృపతో మనలను చుట్టి ఉన్న కర్మబంధాన్ని తొలగించి, తరువాత చక్కని ముక్తిని క్రమక్రమంగా అనుగ్రహిస్తారు.

**96. ముఱై యుణర త్తమిళ్ మఱైయై మూదులకోర్క్కు అళిత్తరుళుమ్**
**నఱై వకుళమాఱనడి నణ్ణుమ్ ఎతిరాశర్ పుకళ్**
**తిఱలుఱు నశ్చిన్దై మణవాళముని శెయ్ కలైయుమ్**
**నఱై పుకళుమ్ నెఞ్జిల్ వైత్తు నీడులకిల్ నిల్లుమినే**

ముఱై ఉణర = క్రమం తెలిసేటట్లుగా, తమిళ్ మఱైయై = ద్రావిడ వేదాన్ని, మూదు+ఉలకోర్క్కు = ప్రాచీనమైన ఈలోకంలో ఉన్నవారికి, అళిత్తు అరుళుమ్ = అనుగ్రహించే, నఱై = తేనెను కల (సువాసనను కల), వకుళ = వకుళమాలికను, ముడి = కిరీటంలో కల, మాఱన్ అడి = నమ్మాళ్వార్ల శ్రీచరణాలను, నణ్ణుమ్ = సేవించే, ఎతిరాశర్ పుకళ్ = యతిరాజుల కీర్తిని, తిఱల్ = విజయాన్ని, ఉఱు = అనుభవించే, నల్ శిన్దై = మంచి మనస్సును కల, మణవాళముని = మణవాళ మహామునులు, శెయ్ = రచించిన, కలైయుమ్ = గ్రంథాలను, నఱై పుకళుమ్ = పరిమళించే కల్యాణగుణాలను (కీర్తిని), నెఞ్జిల్ వైత్తు = మనస్సులో పెట్టుకొని, నీడు ఉలకిల్ = విశాలమైన లోకంలో, నిల్లుమినే = నిలవండి.

ద్రావిడవేదం అయిన దివ్యప్రబంధాలను ఈలోకంలోనివారికి అనుగ్రహించిన వారైన నమ్మాళ్వార్ల శ్రీపాదాలను ఆశ్రయించే యతిరాజుల కీర్తిని తలచే మణవాళమహామునుల శ్రీసూక్తులను, వారి కీర్తిని ఎల్లప్పుడూ మనస్సులో నిలుపుకొనండి.

**97. నిఱ్కిన్ఱ తిరుమలైయుమ్ నీళ్ విశుమ్బుమ్ పాఱ్కడలుమ్**
**ఒక్క వళర్ ఎతిరాశర్ ఓఙ్గు పుకళ్ ఇవ్వులకిల్**
**మిక్క వరుళ్ మణవాళన్ మెయ్క్కలైయిల్ మనమకిళ్లుమ్**
**తక్క మఱైయోర్ ఎనక్కు త్తారణియిల్ వాన్ తుణైయే**

నిఱ్కిన్ఱ = శాశ్వతంగా నిలచి ఉండే, తిరుమలైయుమ్ = వేంకటాద్రి, నీళ్ విశుమ్బుమ్ = విశాలమైన పరమాకాశం, పాఱ్కడలుమ్ = క్షీరాబ్ధి – అనే వీటిలో, ఒక్క= సమంగా, వళర్ = వృద్ధిచెందే, ఎతిరాశర్ = యతిరాజుల, ఓఙ్గు పుకళ్ = వర్ధిల్లే కీర్తిని గూర్చి, ఇవ్వులకిల్ = ఈ లోకంలో, మిక్క అరుళ్ = మిక్కిలిగా అనుగ్రహించే (కీర్తించే), మణవాళన్ = మణవాళమహామునుల, మెయ్ = యథార్థాన్ని ప్రతిపాదించే, కలైయిల్ = గ్రంథాలలో లగ్నమై, మనమ్ మకిళ్లుమ్ = మనస్సు ఆనందించే, తక్క మఱైయోర్ = తగిన వేదవిదులు, ఎనక్కు = నాకు, తారణియిల్ = ఈలోకంలో, వాన్ తుణైయే = గొప్ప రక్షకులు.

దీర్ఘంగా, ఉన్నతంగా నిలచి ఉండే తిరుమల, పాలసముద్రం, పరమపదం మొదలైనవానితో సమంగా ఉన్నతంగా పెరుగుతున్న యతిరాజుల కీర్తిని ఈ లోకంలో వృద్ధి పొందించే మణవాళమహామునుల గ్రంథాలలో మనస్సు లగ్నం చేసి ఆనందించే శాస్త్రజ్ఞులు (వైదికులు) నాకు ఈ లోకంలో గొప్ప రక్షకులు కాగలరు.

**98. తుణైయాళన్ వయలరఙ్గన్ తొల్ శీరై ఏత్తుమవర్క్కు**
**ఇణై యిల్లై ఎన్ఱురైక్కుమ్ ఎతిరాశన్ ఎఙ్కతి యెన్ఱుణర్**
**మణవాళముని యోదు కలైకళై ఉళ్ నినైన్దార్కళ్**
**ఇణైమలర్త్తాళ్ ఇఱైఞ్జుమవర్ ఎఱ్ఱిల్ విశుమ్బుక్కిఱైయవరే**

తుణైయాళన్ = మాకు శరణ్యుడైనవాడు, వయల్ = పొలాలచే చుట్టబడిఉండే, అరఙ్గన్ = శ్రీరంగంలోని శ్రీరంగనాథుని, తొల్ శీరై = సహజాలైన కల్యాణగుణాలను, ఏత్తుమవర్క్కు = కీర్తించేవారికి, ఇణై ఇల్లై = సాటి లేదు, ఎన్ఱు ఉరైక్కుమ్ = అని పలికే, ఎతిరాశన్ = యతిరాజులు, ఎమ్ కతి = మాకు గతి, ఎన్ఱు = అని, ఉణర్ = తెలిసే, మణవాళముని = మణవాళమహామునులు, ఓదు కలైకళై = అనుగ్రహించిన కృతులను, ఉళ్ నినైన్దార్కళ్ = మనస్సులో భావించేవారి, ఇణై మలర్ త్తాళ్ = పద్మాలవంటి పాదాల జంటను, ఇఱైఞ్జుమవర్ = ఆశ్రయించేవారు, ఎఱ్ఱిల్ విశుమ్బుక్కు = ప్రకాశించే పరమపదానికి, ఇఱైయవరే = స్వాములు

మాకు శరణం అయిన శ్రీరంగనాథుని కల్యాణగుణాలను స్తుతించేవారికి సాటి లేదు– అని అనుగ్రహించే యతిరాజులే మనకు గతి, అని తలచే మణవాళ మహామునులు అనుగ్రహించే శ్రీసూక్తులను మనస్సులోపల భావించేవారి శ్రీపాదాలను సేవించేవారు అందమైన పరమపదానికి స్వాములై ప్రకాశిస్తారు.

**99. ఇఱైయు మఱి విల్లాద ఈనరైయుమ్ తన్నరుళాల్**
**నిఱై మదియర్ ఆక్కి యరుళ్ నిన్మలనామ్ ఎతిరాశన్**
**నఱై మలర్తాళ్ ముడిక్కణియాయ్ నఱ్ఱరిక్కుమ్ మణవాళన్**
**విఱల్ మరువు తొన్నూలిన్ వియాక్కియైకళ్ విరుమ్బీరే**

ఇఱైయుమ్ = కొంచెంకూడా, అఱివు ఇల్లాత = జ్ఞానం లేని, ఈనరైయుమ్ = హీనులను కూడా, తన్నరుళాల్ = తమ కృపతో, నిఱై మదియర్ = పూర్ణమైన జ్ఞానాన్ని కలవారుగా, ఆక్కి అరుళ్ = చేసి అనుగ్రహించే, నిన్మలనామ్ ఎతిరాశన్ = నిర్మలులైన యతిరాజుల, నఱై మలర్ తాళ్ = పరిమళించే పద్మాలవంటి శ్రీచరణాలను, ముడిక్కు అణియాయ్ = కిరీటానికి ఆభరణంగా, నల్ తరిక్కుమ్ = చక్కగా ధరించి, మణవాళన్ = మణవాళమహాములు, విఱల్ మరువు = గొప్పతనం నిలచిఉండే, తొల్ నూలిన్ = ద్రావిడవేదాల, వియాక్కియైకళ్ = వ్యాఖ్యానాలను, విరుమ్బీరే = ఆదరించండి.

కొంచెంకూడా జ్ఞానం లేనివారిని సైతం తన కృపతో జ్ఞానాన్ని కలవారిగా చేసి అనుగ్రహించే, ఏ దోషం లేని యతిరాజుల శ్రీపాదపద్మాలను తమ కిరీటానికి ఆభరణంగా ధరించే మణవాళమహామునుల గొప్ప దివ్యప్రబంధవ్యాఖ్యానాలను ఆదరించండి.

**100. విరుప్పుముడన్ తిరుమాలై మేవి యుళ్ళే నైన్దురుకి**
**ఇరుక్కు మకిழ் మాఱనడి ఏత్తి యరుళ్మారి యడిక్కు**
**ఉరుక్క ముఱుమ్ ఎతిరాశర్ మణమకిழுమ్ తమిழ்మఱైయై**
**పొరుక్క ముఱ ఓదు మణవాళనడి పేణు నెఞ్జే !**

విరుప్పుముడన్ = ఆదరంతో, తిరుమాలై = శ్రియఃపతిని, మేవి = ఆశ్రయించి, ఉళ్ళే = మనస్సులో, నైన్దు = శైథిల్యాన్ని పొంది, ఉరుకి = నీరై, ఇరుక్కుమ్ = ఉండే, మకిழ் మాఱన్ అడి = వకుళమాలికను ఆభరణంగా – నిరూపకంగా కల నమ్మాழ்వార్ల శ్రీచరణాలను, ఏత్తి = కీర్తించే, అరుళ్ మారి అడిక్కు = **"అరుళ్ మారి"** అని కీర్తింపబడే తిరుమఙ్గై ఆழ்వార్ల శ్రీచరణాలలో, ఉరుక్కమ్ = ప్రేమను (భక్తిని), ఉఱుమ్= పొందే, ఎతిరాశర్ కుణమ్ = యతిరాజుల కల్యాణగుణాలను, మకిழுమ్ = అనుభవించి ఆనందించేవారు, తమిழ் మఱైయై = ద్రావిడవేదాలను, పొరుక్కమ్ ఉఱ ఓదుమ్ = మిక్కిలి విస్తృతంగా అధ్యయనం చేసే, మణవాళన్ అడి = మణవాళమహామునుల శ్రీచరణాలను, నెఞ్జే = ఓ మనసా!, పేణు = ఆశపడు.

మిక్కిలి భక్తితో శ్రియఃపతిని ఆశ్రయించి, మనస్సులో ఆర్తిని పొంది, ద్రవించే నమ్మాழ்వార్ల శ్రీపాదాలను స్తుతించే తిరుమఙ్గైయాழ்వార్ల శ్రీపాదాలకు మనస్సు ద్రవించే యతిరాజుల కల్యాణగుణాలను భావించి ఆనందించి, ద్రావిడవేదాలను మిక్కిలి విస్తృతంగా అభ్యసించే మణవాళమహామునుల శ్రీపాదాలను ఓ మనసా! అభిలషించు.

**101. నెఞ్జే! తిరుమాలై నిత్తియముమ్ అడి పణియుమ్**
**మఞ్జేఱు కురువై మకిழ் మాఱనడి పణిన్దుయ్న్దిఙ్గు**

**అఞ్జేలెన్ఱు ఎమక్కరుళుమ్ ఎతిరాశన్ అడి మరువు**
**నఞ్జేమ వరమునివన్ నణ్ణుది నీ నఱ్కుణమే**

నెఞ్జే = ఓ మనసా!, తిరుమాలై = శ్రియఃపతిని, నిత్తియముమ్ = నిత్యం, అడి పణియుమ్ = పాదసేవ చేసేవారు, మఞ్జు ఏఱుమ్ = మేఘాలు అధిరోహించే (మేఘమండలపర్యంతంగా ఉన్నతాలైన పద్మాలతో కూడిన), కురుకై = కురుకాపురిలోని, మకిళ్ మాఱన్ అడి = సేవించి, ఉయ్న్దు = ఉజ్జీవించి, ఇఙ్గు = ఈ లోకంలో, అఞ్జేల్ = భయపడకండి,ఎన్ఱు = అని, ఎమక్కు అరుళుమ్ = మనకు అనుగ్రహించే, ఎతిరాశన్ అడి = యతిరాజుల శ్రీచరణాలను, మరువు = సేవించే, నమ్ శేమమ్ = మనకు క్షేమంకరులుగా ఉండేవారు అయిన, వరమునివన్ = వరవరమునుల, నల్ కుణమే = కల్యాణగుణాలను, నీ = నీవు, నణ్ణుది = సహించు.

ఓ మనసా! శ్రియఃపతిని ప్రతిదినం సేవించేవారు, కురుకాపురిలో అవతరించిన వారు అయిన నమ్మాళ్వార్ల శ్రీపాదాలను సేవించి, ఉన్నతగతిని పొంది, “భయపడవద్దు” అని మనకు అభయాన్ని అనుగ్రహించే యతిరాజుల శ్రీపాదాలను ఆశ్రయించేవారు, మనకు రక్షకంగా ఉండేవారు అయిన మణవాళమామునుల కల్యాణగుణాలను నీవు అంగీకరించి సహిస్తావు గాక !

**శ్రీమణవాళమామునికళ్ నూఱ్ఱన్దాది వివరణం**
**సంపూర్ణమ్.**



శ్రీ న.చ. రఘునాథాచార్య ప్రణీతమైన

# శ్రీమద్వరవరముని పఞ్చాశత్

( తాత్పర్య - విశేషాలతో )

1. శ్రీశైలేశదయాశ్రయస్య శుభధీభక్త్యాదివారాన్నిధేః
శ్రీరామానుజయోగిరాట్పదయుగ ప్రావణ్యజుష్టాత్మనః ।
భోగీశాపరరూపిణో వరమునేః శ్రీపాదపద్మద్వయీ
ప్రోత్ఫుల్లాబ్జనిభా మదీయహృదయే నిత్యప్రతిష్ఠా మియాత్ ॥

శ్రీశైలేశులనే తిరువాయ్‌మొழிప్పిళ్ళై అనుగ్రహానికి పాత్రమైనవారు, మంగళకరమైన జ్ఞానభక్తి వైరాగ్యాదులకు సముద్రంవంటివారు (నిత్యం పూర్ణంగా ఉండేవారు), శ్రీరామానుజుల పాదయుగంలో ప్రావణ్యాన్ని కల్గిన స్వభావాన్ని కలవారు, ఆదిశేషులకు వేఱొక రూపమైన శ్రీవరవరమునుల చక్కగా వికసించిన తామరలవంటి శ్రీచరణపద్మయుగం నా హృదయంలో నిత్య ప్రతిష్ఠను (స్థిరనివాసాన్ని) పొందుగాక.

ఈ శ్లోకం "శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్, యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్" అనే శ్రీవరవరమునుల తనియన్ శ్లోకానికి సహృదయహృదయావర్జకమైన సంవాదం.

2. సన్నహ్యే వరయోగినం విశదవాక్చూడామణిం సాంప్రతం
స్తోతుం వాణి! భవత్ప్రసాదభరితా కాలుష్యలేశోజ్ఝితా ।
తా మల్పామపి భక్తిభూమజనితాం యోగీశ్వరో మానయన్
కంఠే ధాస్యతి మేచకార్ద్రతులసీమాలాం సుగన్ధిం యథా ॥

ఓ సరస్వతీ! విశదవాక్ శిఖామణి అయిన శ్రీవరవరమునులను ఇపుడు కీర్తించాలని ప్రయత్నిస్తున్నాను. నీ అనుగ్రహంతో నిండినది, అందువల్ల ఏదోషలేశం కూడా లేనిది అయిన ఆ స్తుతి అల్పమైనదే అయినా, గొప్ప భక్తివల్ల పుట్టినది కనుక దానిని యోగీశ్వరులైన శ్రీవరవరమునులు ఆదరించేవార్వై, సుగంధాన్ని కల పచ్చని, చల్లని తులసీమాలనువలె, తమ కంఠంలో ధరిస్తారు.

3. నిర్మాతుం న సువర్ణసౌధనికరం కాంక్షా న వా తత్ర తైః
వామాక్షీపరిరంభజృంభణసుఖైః పూర్ణం చికీర్షామి మామ్ ।
శ్రీమన్! సౌమ్యమునీన్ద్ర! తే పదయుగోపాన్తే నిషీద్యానిశం
స్తుత్వా త్వన్మహిమానమేవ రసనాం ధన్యాం విధాస్యే మమ ॥

బంగారు మేడలను కట్టాలని నేను ఆశపడడంలేదు. లేక, ఆ మేడలలో అందమైన కన్నులను కల స్త్రీల ఆలింగనాలవల్ల కలిగే గొప్ప సుఖాలతో నన్ను పూర్ణునిగా (ఆనందించినవానినిగా) చేసికోవాలని కోరడం లేదు. ఓ వరవరమునీ! దేవరవారి శ్రీచరణసన్నిధిలో నిత్యం ఉండి, దేవరవారి మహిమనే స్తుతించి, నా జిహ్వను ధన్యం చేసికొంటాను.

4. కరాభ్యాం పాదాభ్యాం నయనయుగళేనాపి వికస -
త్సరోజా రారాజద్ధవళతనుకాన్త్యా చ సజలా ।
మమ స్వాన్తశ్రాన్తిం హరతు వరయోగీన్ద్రసరసీ
మరౌ సంసారాఖ్యే విగళితవిరామం విచరతః ॥

ఈ శ్లోకం నుండి కొన్ని శ్లోకాలలో శ్రీవరవరమునుల దివ్యరూపమాధుర్యం స్తుతింపబడుతున్నది.

శ్రీవరవరమునులు ఒక దివ్యసరస్సువంటివారు. ఆ సరస్సులో, వారి రెండు చేతులు, రెండు పాదాలు, రెండు కళ్ళు- పద్మాలు. మిక్కిలి మెఱిసే తెల్లని దేహకాంతియే జలం. ఈ వరవరముని అనే సరస్సు సంసారమనే ఎడారిలో సంచరించే నా మనస్సుకు కల్గిన శ్రమను హరించుగాక!

**"కరచరణసరోజే"** ఇత్యాది ముకుందమాలాస్తోత్రంలోని శ్లోకం, స్మరణీయం. అది ప్రథమ పర్వాత్మకం, ఇది చరమపర్వాత్మకం. **"హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం భవమరుపరిఖిన్నః ఖేదమద్యత్యజామి"** అనే ముకుందమాలా శ్లోకభావం ఇందులో వరవరమునిపరంగా అనుసంధింపబడింది.

5. శరచ్చన్ద్రతులస్వరూపో ద్విజాగ్ర్యః
స్వభావేన విష్ణోః పదే పక్షపాతీ ।
సుఖశ్రావ్యసూక్తిర్వరో రాజహంసో
విహారం విధత్తాం సదా మానసే నః ॥

ఈ శ్లోకం శ్లేషాలంకారబంధురం. హంసకు, శ్రీవరవరమునులకు సరిపోయే రీతిలో శ్లిష్టప్రయోగాలు చేయబడ్డాయి. ద్విజమంటే పక్షి. గొప్ప పక్షి అయిన హంస శరత్కాలచంద్రునివలె తెల్లనిది, చల్లని స్వభావాన్ని కల్గినది. సహజంగా హంస విష్ణుపదమనబడే ఆకాశంలో రెక్కలతో సంచరిస్తుంది. చక్కని శ్రావ్యమైన ధ్వనులను చేస్తుంది. అటువంటి రాజహంస మానస సరోవరంలో విహరిస్తుంది.

ద్విజులలో, (బ్రాహ్మణులలో), గొప్పవారైన శ్రీవరవరమునులు శరత్కాలచంద్రునివలె తెల్లని రూపాన్ని, చల్లని దయాస్వభావాన్ని కలవారు, సహజంగానే విష్ణుపదమనబడే పరమపదంలో పక్షపాతాన్ని ఆసక్తిని- కలవారు. మధురవాక్శిఖామణి అయిన శ్రీవరవరమునుల శ్రీసూక్తి వినసొంపుగా, మధురంగా ఉంటుంది. ఈ రీతిలో రాజహంసవంటి శ్రీవరవరమునులు మా మనస్సులో సదా విహరించాలి.

6. ఆజౌ విక్రమ్య వైరిప్రకరవిశసనం చక్రరాజేన తన్వన్
ఉగ్రాకారో న చేతో మమ హరతి హరి ర్నిత్యసంభావ్యరోషః ।
సత్త్వస్యైకాన్తభూమిం శమదమజలధిం దానవర్గే దయాళుం
హిత్వా సౌమ్యం మునీన్ద్రం నిరుపమవిభవం కః కిలాన్యో మదీడ్యః॥

యుద్ధరంగంలో విక్రమించి శత్రుసమూహాన్ని సుదర్శనచక్రంతో చేస్తూ ఉండే ఉగ్రమైన ఆకారాన్ని కల హరి నిత్యం శత్రువులపట్ల రోషం కల్గి ఉన్నందున, నా మనస్సును ఆకర్షించడం లేదు. ఈ రీతిలో రోషప్రధానులు కాకుండా, సదా సత్త్వగుణానికి అద్వితీయమైన ఆశ్రయమై, శమదమాదులకు సముద్రమై,

యాచకులపట్ల దయాస్వభావులై, సౌమ్యులై, సాటి లేని వైభవాన్ని కల్గినవారై ఉండే శ్రీవరవరమునులు తప్ప ఇంకొకరు ఎవరు నాచే స్తుతింపబడదగినవారు? కనుక వారినే స్తుతిస్తాను.

శ్లోకం చతుర్థపాదంలోని **"సౌమ్యమ్"** అనే పదాన్ని రెండు మార్లు ఆవృత్తి చేసికొని సౌమ్యస్వభావులైన వరవరమునులనే అర్థం గ్రహించడం సరసం.

7. **రారాజద్ధవళోర్ధ్వపుణ్డ్రమధురం తద్వక్త్రపంకేరుహమ్**
**సా దాసేషు భృశం కృపాభిధసుధానిష్యన్దినేత్రద్వయీ ।**
**దుగ్ధామ్భోనిధిసోదరం చ విమలం తద్రూప మావిర్భవేత్**
**ధారావాహికమామకస్మృతిపథే సౌమ్యోపయన్తుర్మునేః ॥**

మిక్కిలిగా ప్రకాశించే తెల్లని ఊర్ధ్వపుండ్రాలతో మధురమైన ఆ శ్రీవరవరమునుల వదనారవిందం, దాసుల పట్ల మిక్కిలిగా కృప అనే అమృతాన్ని స్రవించే వారి రెండు నేత్రాలు, అమృతసముద్రంతో సమానమైన, ఏ దోషం లేని వారి రూపం ఇవి అన్నీ ధారావాహికమైన నా భావనాపరంపరకు విషయం కావాలి. (వరవరమునుల దివ్యమంగళరూపం నా మనస్సుకు ధ్యేయంగా సదా ప్రకాశించాలి).

**"సుధానిష్యందినేత్రద్వయీ"** అని అన్నందున నేత్రాల సింధుసామ్యం ధ్వనిస్తుంది. సోదరశబ్దం ఉపమావాచకం. ఈ శ్లోకం - ప్రతివాది భయంకరం అణ్ణన్ రచించిన శ్రీవరవరముని శతకంలోని **"రాజచ్ఛీతమయూఖమండల శరజ్జ్యోత్స్నాసమానద్యుతిః.... దీవ్యంత్యాత్మగుణైః సదా వరవరాకారాస్తు మే భావనా"** అనే శ్లోకానికి అందమైన సంవాదం.

8. **తంత్రం కారుణ్యభాజా యతికులపతినా దృష్ట మస్పృష్టదోషం**
**త్రాతుం లబ్ధావతారా ఇహ భువి బహవ స్సంవసన్త్వార్యవర్యాః ।**
**శ్రీరంగాధీశ్వరేణ ప్రకటితవిభవః తస్య చాచార్యభావం**
**సంప్రాప్తః క కిలాన్యః కథయ! వరమునేః శాన్తిదాన్త్యాదిధామ్నః॥**

దయాస్వభావులైన శ్రీరామానుజులచే దర్శింపబడిన, దోషగంధరహితమై విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని రక్షించడానికి ఎంతోమంది ఆచార్యులు ఈ లోకంలో అవతరించారు. కాని, ఓ మనసా! శాంతి దాంతి మొదలైన ఆత్మగుణాలకు నిలయమైన శ్రీవరవరమునులు తప్ప వేఱొకరి ఎవరి వైభవం శ్రీరంగనాథునిచే ప్రకటింపబడింది? ఇంకొకరు ఎవరు శ్రీరంగనాథునకు ఆచార్యులయ్యారు.

ఈ శ్లోకంనుండి కొన్ని శ్లోకాలలో శ్రీవరవరమునుల కల్యాణగుణవర్ణన చేయబడుతున్నది.

9. **స్వైరం సంసారసిన్ధౌ దురితసముదయే బద్ధాదరాణాం**
**నృణాం కర్మానురూపం సపది మధురిపౌ దండనాయ ప్రవృత్తే ।**
**సన్త్రాతుం సోఽయ మేకః ప్రభవతి మహిత స్సౌమ్యజామాతృయోగీ**
**నానాశాస్త్రార్థసారప్రకటననిపుణై ర్గాఢబన్ధై ర్వచోభిః ॥**

సంసారసముద్రంలో యథేచ్ఛంగా చరించి పాపాల సమూహాలను ఆర్జించడంలోనే ఆసక్తిని కల మానవులను వారి కర్మానుగుణంగా దండించడంకోసం శ్రీమన్నారాయణుడు ప్రయత్నించినపుడు, పలు శాస్త్రాలలోని అర్థసారాలను వ్యక్తం చేసేవి, గాఢమైన పదబంధాన్ని కల్గినవి అయిన వాక్కులతో వారిని రక్షించడానికి మహానుభావులైన ఈ శ్రీవరవరమునులొకరే సమర్థులు.

**"సోఽయమ్"** అనే ప్రత్యక్షనిర్దేశం కవి మనస్సులోని ప్రత్యక్షసమానాకార వరవరముని రూప మానసిక దర్శనాన్ని సూచిస్తున్నది. "అర్థసారప్రకటన నిపుణైః", "గాఢబంధైః" అనే రెండు ప్రయోగాలు చక్కని వాక్కులకు ఉండదగిన లక్షణాలను తెల్పుతున్నవి. ఇందులో మొదటిది అర్థానికి సంబంధించినది కాగా, రెండవది శబ్దాల కూర్పును గూర్చి తెల్పునది.

**10.** **శ్రీభాష్యం యత్ప్రణీతం యతికులపతినా ప్రౌఢగమ్భీరభావం**
**మాదృక్షాణాం తదేతత్ భృశదురవగమం శేముషీమాన్ద్యభాజామ్ ।**
**లోకాచార్యోక్త "తత్త్వత్రయ" మిహ మధురై ర్వాగ్విలాసైర్వివృణ్వన్**
**వేదాన్తార్థం సమస్తం విశదయతి హి న స్సౌమ్యయోగీ దయాళుః ॥**

యతిరాజులైన శ్రీరామానుజులచే రచింపబడిన శ్రీభాష్యం ప్రౌఢమైన, గంభీరమైన అర్థాలను కల్గినది. మందబుద్ధులను కల మావంటికి అర్థం చేసికోవడానికి చాలా కష్టమైనది. అందువల్ల, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన తత్త్వత్రయమనే గ్రంథాన్ని దయాళులైన శ్రీవరవరమునులు మధురమైన వాక్కులతో వ్యాఖ్యానించి, వేదాంతార్థాన్ని అంతటిని విశదం చేస్తున్నారు కదా!

ఇందులో శ్రీవరవరమునుల విశదవాక్శిఖామణిత్వం ప్రస్తావింపబడింది. **"అవిస్తృతా స్సుగంభీరాః రామానుజమునేర్గిరః"** అనే శ్రుతప్రకాశికాచార్యుల వారి సూక్తి ప్రథమపాదానుగుణంగా స్మరణీయం. శ్రీవరవరమునుల తత్త్వత్రయవ్యాఖ్య సంప్రదాయంలో కుట్టి భాష్యమనే పేరుతో ప్రసిద్ధంగా వ్యవహరింపబడడం ఇక్కడ స్మరణీయం.

**11.** **ఆచార్యత్వం యదీయం హృది బహుమనుతే హన్త! రంగాధిరాజః**
**హిత్వా యత్పాదసేవాం పరమ మిహ పదం నేతి శంసన్తి సన్తః ।**
**సోఽయం సౌమ్యోపయన్తా విశదవిమలవాగ్గుంభచూడామణి ర్మాం**
**స్వీయశ్రీసూక్తిసేవాసురభితజనుషం సంవిధత్తాం కృపాళుః ॥**

ఎవరి ఆచార్యత్వాన్ని శ్రీరంగనాథుడు తన మనస్సులో గొప్పగా సంభావిస్తున్నాడో, ఎవరి శ్రీచరణసేవ కంటే గొప్పదైన ప్రాప్యం ఇంకొకటి లేదని మహాత్ములు తలుస్తున్నారో, అటువంటి విశదవాక్శిఖామణి, దయాళువు అయిన శ్రీవరవరమునులు తమ సూక్తిని నేను సేవించి, అందువల్ల సంస్కరింపబడిన సార్థకమైన జన్మను కలవాడను అయే రీతిలో నన్ను అనుగ్రహించాలి (చేయాలి).

**12.** **నిత్యం భక్తైకభోగ్యం యతిపతివిషయే వింశతి స్తోత్ర మేకం**
**నిర్మాయ శ్లాఘ్యబన్ధం వరవరమునిరాడవ్యగృహ్ణోద్భృశం నః ।**

యస్మిన్నుచ్చై రధీతే సతి సపది యతీశస్య చిత్తం ద్రుతం సత్
దాసేష్వస్మాదృశేషు ప్రసరతి కరుణౌదార్యవాత్సల్యవేషైః ॥

భక్తులకు నిత్యం అద్వితీయభోగ్యమైన, గొప్ప పదబంధాన్ని కల్గినది, శ్రీరామానుజులను ఉద్దేశించినది అయిన యతిరాజవింశతి అనే స్తోత్రాన్ని శ్రీవరవరమునులు మనకు అనుగ్రహించారు. దీనిని ఉచ్చైః స్వరంతో హార్దంగా అనుసంధిస్తే శ్రీరామానుజుల మనస్సు కరిగి, నా వంటి దాసులపట్ల కూడా కరుణ, ఔదార్య వాత్సల్యాలను కల్గినదై ప్రసరిస్తుంది.

"అస్మాదృశేషు"- అనే సర్వనామశబ్దం ద్వారా కవిహృదయగతమైన అపరాధబాహుళ్య, సద్గుణరాహిత్యాదులు స్ఫురిస్తాయి. **"యతీశస్యచిత్తం ద్రుతమ్"** అనే దానికి అనుగుణంగా **"యః స్తుతిం యతిపతిప్రసాదనీం వ్యాజహార యతిరాజవింశతిమ్"** అనే యతిరాజవింశతి తనియన్శ్లోకం ప్రకృతంలో భావ్యం. **"భక్తైకభోగ్యమ్"**- అనే ప్రయోగానికి అనుగుణంగా **"ఇతి యతికులధర్య మేధమానైః శ్రుతిమధురై రుదితైః... మతిరియమేతి నిరత్యయం ప్రసాదమ్"** అనే సూక్తి భావ్యం. **"యదుదితాయతిభూపతి వింశతిః సమవధీరితశీధుసుధారసా, విశదయత్యఖిలం భవినాం హితమ్"** అనే ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ రచించిన శ్రీవరవరముని శతకంలోని శ్లోకం కూడా ప్రకృతంలో స్మరణీయం.

**13.** వచనభూషణశాస్త్రసుధారసం విశదయన్ జగతే హితకాంక్షయా ।
మహితసత్త్వగుణాశ్రయమూర్తిమాన్ వరముని ర్భువి కై రుపమీయతామ్? ॥

శ్రీవచనభూషణశాస్త్రంలోని అమృతరసాన్ని లోకహితంకోసం విశదీకరించేవారైన, గొప్ప సత్త్వగుణానికి ఆశ్రయమైన రూపాన్ని కలవారైన శ్రీవరవరమునికి ఎవరు సాటి ?

**14.** ప్రతిపద మపి భఙ్గజుషా, క్వచిత్కదాచిదపి భఙ్గవిధుర మిమమ్ ।
వరయోగివాగ్విలాసం కథం ను గంగాఝరేణ తులయామః ॥

అర్థంలో ఏమాత్రం భంగాన్ని లేనిది అయిన శ్రీవరవరమునుల వాగ్విలాసాన్ని ప్రతిపదంలో భంగాన్ని గంగానదీ ప్రవాహంతో ఏవిధంగా పోల్చగలము?

అణ్ణన్ రచించిన వరవరముని శతకంలోని **"హృద్యా యస్య సరస్వతీ... భంగం నైతి కదాపి కుత్రచిదపి"** అనే సూక్తి స్మరణీయం. **"భంగజుషా కదాచిదపి భంగవిధురమ్"** అని అన్నందున విరోధాభాసం స్ఫురించగా, భంగశబ్దానికి కెఱటమని, త్రొట్రుపాటు ఆ అర్థ భాగశబ్దానికి గంగానదీ ప్రవాహం పక్షంలో కెరటమని, శ్రీవరవరముని వాగ్విలాస విషయంలో అర్థంలో భంగమని అర్థం

**15.** సంసారజలనిధా విహ వరమునిసత్సూక్తి రేవ నౌ రేకా ।
అనయైవ ఖలు తరన్తః గురవః ప్రభవన్తి తారయితు మస్మాన్ ॥

సంసారసముద్రాన్ని దాటడానికి శ్రీవరవరమునుల సూక్తి అనే నావ ఒక్కటే సాధనం. దానితో పూర్వాచార్యులు తాము సంసారాన్ని దాటుతూ, మనలను కూడా తరింపజేస్తున్నారు.

"నా వేవయాంత ముభయే హవంతే" అనే శ్రుతి భగవానుని నావగా పల్కింది. ఇక్కడ వరవరముని సూక్తి నౌకగా రూపింపబడింది.

16. కృతిం యుష్మత్పాదస్తవనపరిపూతాం సుమధురాం
శతశ్లోకీరూపాం కవివరదరాజార్యరచితామ్ ।
సుధాపాయం పీత్వా వరవరమునే ! హర్షవివశం
జగత్యస్మిన్నాన్యత్క్విమపి మమ చిత్తం కలయతి ॥

ఓ శ్రీవరవరమునీ! దేవరవారి శ్రీచరణాలను స్తుతించడం చేత పవిత్రమైనది, మిక్కిలి మధురమైనది, నూఱు శ్లోకాల రూపమైనది, వరదరాజకవి అనబడే ఎఱుమ్బియప్పాచేత రచింపబడినది అయిన శ్రీవరవరముని శతకమనే సుకృతిని అమృతం వలె పానం చేసి, అందువల్ల కల్గిన ఆనందంతో వివశమైన నా మనస్సు ఈలోకంలో వేఱొక విషయాన్ని దేనినీ కోడంలేదు.

భగవద్విషయంలో "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి స భూమా" అనే ఉపనిషదర్థం వరవరముని వైభవవిషయంగా అన్వయించి పలుకబడింది.

17. దౌర్భాగ్యం మామకీనం బత! బత! కిమహం వచ్మి సంప్రాప్తజన్మా
నైవాసం తేషు కీటప్రభృతిషు వరయోగీశ! ధన్యాత్మకేషు ।
శ్రీరఙ్గే దేవసేవాం భవతి కలయితుం ప్రస్థితే వీథికాయాం
యే హి త్వత్పాదసంగాత్ సఫలితజనుషః వీక్షణాచ్చ త్వదీయాత్॥

అయ్యో! అయ్యో! నా దౌర్భాగ్యాన్ని గూర్చి ఏమి చెప్పను? ఓ శ్రీవరవరమునీ! శ్రీరంగంలో శ్రీరంగ నాథుని సేవించడం కోసం దేవరవారు వీథిలో శ్రీరంగాలయానికి వేంచేసేటపుడు దేవరవారి పాదసంబంధం వల్ల, దేవరవారి కటాక్షంవల్ల జన్మసాఫల్యాన్ని పొందిన ధన్యమైన ఆ కీటకాదులో అయినా ఏదయినా ఒక కీటకంగా పుట్టే అదృష్టానికి నోచుకోలేకపోయానే! అయ్యో!

శ్రీరంగనాథస్తోత్రంలోని "రంగేశ్వర! త్వత్పదమాశ్రితానాం రథ్యాశునా మన్యతమో భవేయమ్" అనే శ్లోకాన్ని, అతిమానుషస్తవంలో కూరేశులు పల్కిన "హా! జన్మతాసు సికతాసు మయా న లబ్ధం రాసే త్వయా విరహితాః ఖలు గోపకన్యాః, యా స్తావకీనపదపంక్తిజుషో జుషంతః నిక్షిప్య తత్ర నిజమంగ మనంగతప్తమ్" అనే శ్లోకాన్ని ఇక్కడ అనుసంధించాలి.

18. ఉత్థాయ ప్రాఙ్గణాదా వుషసి విరచయన్ మార్జనీకర్మ సమ్యక్
శుద్ధన్ వస్త్రాణి, కూపా దుదక ముపహరన్ భుక్తశిష్టాని జక్షత్ ।
పాదౌ సంవాహయన్ సన్నహ మిహ సతతం సౌమ్యజామాతృయోగిన్!
దీవ్యత్త్వత్పాదసేవాసఫలితజనుషాం కింకర స్స్యాం గృహేషు ॥

ఓ సౌమ్యజామాతృమునీ! ప్రాతఃకాలంలో మొదట నిద్ర లేచి, చక్కగా దేవరవారి ఆలయాన్ని ఊడ్చి శుద్ధిచేసి, దేవరవారు ధరించి విడచిన వస్త్రాలను శోధించి, ఆరాధనకు కావలసిన బావినుండి

తీర్థాన్ని తీసికొనివచ్చి, దేవరవారు ఆరగించగా మిగిలిన ప్రసాదాన్ని భుజించి, దేవరవారి శ్రీచరణాలను సంవాహనం చేస్తూ, గొప్పదైన దేవరవారి శ్రీచరణాల సేవవల్ల సఫలమైన మహాత్ముల గృహాలలో కైంకర్యాన్ని చేస్తాను.

శ్రీవరవరమునుల సన్నిధిలో, వారి భక్తుల తిరుమాళిగలలో కైంకర్యాన్ని ఇందులో ప్రార్థిస్తున్నారు. చరమపర్వంలో చరమపర్వం ఇది. "నిన్ కోయిల్ శీఙ్ఱు పుల్‌పడికాల్ కుడికుడి వழி వన్దు ఆట్చెయ్యుమ్" ఇత్యాది తిరువాయ్‌మొழி (10-2-1) సూక్తి స్మరణీయం. అది ప్రథమపర్వం - ఇది చరమపర్వం. ఆచార్యోచ్ఛిష్టం "తదుచ్ఛిష్టం సుపావనమ్" అనే రీతిలో పరమపవిత్రంగా శాస్త్రం పేర్కొన్నది. "పోనకమ్ శెయ్‌ద శేడమ్ తరువరేల్ పునిదమన్ఱే" అనే తిరుమాలై ప్రబంధసూక్తి స్మరణీయం.

19. పాపైరేవ పురా కృతై రుపనతామ్ అద్యాపి పాపాత్మికాం
పాపోదర్కజుషం చ మానవజనిం సోఢుం న శక్నోమ్యముమ్ ।
ఈదృగ్దుఃఖవినాకృతాం వరమునే! దద్యా స్త్వదీయాలయే
త్వద్భక్తాంఘ్రియుగోపమర్దితశిలాసోపానరూపాం జనిమ్ ॥

పూర్వం చేసిన పాపాలవల్ల కల్గినది, వర్తమానంలో కూడా పాపమయమైనది, భవిష్యత్తులోసైతం పాపాలనే కారణమైనది అయిన మానవజన్మను నేను సహించలేను. ఓ శ్రీవరవరమునీ! ఇటువంటి దుఃఖం లేనిది, దేవరవారి దివ్యాలయంలో దేవరవారి భక్తులు తమ రెండు పాదాలు పెట్టడంద్వారా తొక్కబడేది- మర్దింపబడేది- అయిన రాతిమెట్టు రూపంలోని జన్మను నాకు మీరు అనుగ్రహించండి.

కులశేఖరులు "పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే" అనే పాశురభావం శ్రీవరవరముని శ్రీవిషయంగా అనుసంధింపబడింది. లోకంలో రాయిగా పడి ఉండడం అనేది పాపఫలం, అది ఎవరూ కోరుకోనిదే అయినా, అది భగవద్భాగవతాచార్యకైంకర్యానికి పనికివస్తే అంతకంటే ప్రాప్యవిషయం ఇంకొకటి ఉండదుకదా! "మహితమనుజతిర్యక్ స్థావరత్వాశ్రయంతే" అనే రీతిలో అది పరమోపాదేయం కదా!

20. దోషాస్థానం నిగమవిహితాచారశీలాదిశూన్యం
మాముద్ధర్తుం క ఇహ భగవన్! అర్హతి త్వాం వినాఽన్యః ।
భక్త్యుత్కర్షా త్తవ పదయుగే సౌమ్యజామాతృయోగిన్!
ఉన్మాదాద్వా నను ఘటిత ఇత్యంజలిం మే గృహాణ ॥

భగవన్! వేదవిహితమైన ఆచారాలను వేనినీ అనుష్ఠించనివాడను, దోషాలకు అన్నిటికిని ఆశ్రయమైన వాడనైన నన్ను ఉద్ధరించాలంటే దేవరవారు తప్ప ఇంకొకరు ఎవరు సమర్థులు? ఓ శ్రీవరవరమునీ! దేవరవారి శ్రీచరణాల విషయంలో నాకు గల గొప్ప భక్తివల్లగాని, లేక, పిచ్చివల్లకాని ఈ అంజలి చేయబడినది - అని భావిస్తూ, నేను చేసే ఈ అంజలిని నీవు స్వీకరించు.

"నీశనేన్ నిఱై ఒన్ఱుమిలేన్" అనే దివ్యసూరిసూక్తి ఇక్కడ స్మరణీయం. "భగవన్!" అనే సంబోధన సాభిప్రాయం. తమను తమను ఉద్ధరించడానికి ముఖ్యంగా కావలసిన "జ్ఞానశక్తికరుణ"లు అనే గుణాలను

పుష్కలంగా శ్రీవరవరమునులు కల్గి ఉన్నారనే విషయాన్ని ఇది సూచిస్తుంది. ఈ రీతిలో కవి తమ దోషపూర్తిని, శ్రీవరవరమునుల గుణపూర్తిని తెలుపడం ద్వారా తమకు రక్షణ తప్పక కల్గుతుందనే మనోనిశ్చయాన్ని వ్యక్తం చేశారు. "అతివొన్ఱు మిల్లాద-కుఱైవొన్ఱు మిల్లాద" అని కదా గోదాసూక్తి.

**21.** **స్వాతన్త్ర్య మప్రతిమ మత్యధికం దధానాత్**
**దుర్వారశక్తిభరితాత్ కమలాధినాథాత్ ।**
**నైవాస్తి దణ్డనభయం మమ పాపినోఽపి**
**సౌమ్యోపయన్తృపదసేవనభాగ్యభాజః ॥**

సాటి లేని, మిక్కిలి అధికమైన నిరంకుశస్వాతంత్ర్యాన్ని కల్గినవాడు, అడ్డు లేని శక్తిని నిండుగా కలవాడైన శ్రియఃతివల్ల, పాపిని అయినా, నాకు దండన భయం లేనేలేదు. ఎందుకంటే, నేను శ్రీవరవరమునుల శ్రీచరణసేవా భాగ్యాన్ని పొందాను. (కనుక)

**"పరాఽస్య శక్త ర్వివిధైవ శ్రూయతే"** అని శ్రుతి భగవానుని శక్తి అంతు లేనిది, పలు విధాలైనది. **"న తస్యేశే కశ్చన"** అని అతనిని నియమించేవారు ఎవరూ లేరు అగ్నికి సహజంగా కల దాహకశక్తి మణిమంత్రౌషధాది సన్నిధిలో పనిచేయనట్లే, నిరంకుశస్వతంత్రుడు, సర్వశక్తి అయిన భగవానుని దండనస్వభావం కూడా వరవరమునుల సాన్నిధ్యంలో నిర్వీర్యమవుతుందని భావం.

**22.** **అణ్ణరాయచక్రవర్తిమూర్ధ్ని భూషణాయితమ్**
**తాతయార్యమానసే మరాళశాబకాయితమ్ ।**
**శాన్తిదాన్తిశేవధేః వరోపయన్తృయోగినః**
**పాదపఙ్కజం కదా నిరీక్షిషీయ చక్షుషా ?॥**

అణ్ణరాయచక్రవర్తి తలపై శిరోభూషణం వంటిది, తాతయార్యుల (కవిపితృపాదులు) మనస్సులో రాజహంసవంటిది, శాంతి, దాంతి - ఇత్యాది ఆత్మగుణాలకు నిధి అయిన శ్రీవరవరమునుల పాదపద్మాలను నేనెపుడు దర్శించగలను?

కులశేఖరులు పెరుమాళ్ తిరుమొழிలో **"ఎన్ఱుకొలో !"** అని, భట్టర్ శ్రీరంగనాథస్తోత్రంలో **"కదాహం... సేవేయమ్"** అని అనుసంధించిన రీతిని కవి శ్రీవరవరమునుల విషయంలో అనుసంధించారు. ప్రాప్యత్వరవల్ల కలిగే మానసిక భావనావిశేషం ఇది. అష్టాక్షరిలోని తృతీయపదార్థమైన ప్రాప్యత్వర ఇక్కడ చరమపర్వంగా అనుసంధింపబడింది.

**23.** **అనుగ్రహం దేవ! తథా కురుష్వ**
**వాచా హృదా వా వపుషా యథా మే ।**
**కదాఽపి న స్యాదపరాధలేశః**
**త్వయి త్వదీయేషు చ సౌమ్యయోగిన్! ॥**

దేవా! ఓ శ్రీవరవరమునీ! దేవరవారి విషయంలో, దేవరవారి భక్తుల విషయంలో ఏనాడూ వాఙ్మనః క్రియలద్వారా అపరాధాన్ని కొంచెంకూడా చేయని రీతిలో నన్ను అనుగ్రహించాలి.

